# ఆంధ్రసాహిత్య
# పరిషత్పత్త్రిక.

సంపుటము ౧౩. | రక్తాక్షినామసంవత్సరము. చైత్రవైశాఖమాసములు. | సంచిక ౧.

## విజ్ఞాపనము.

మహాశయులారా!

ఎట్టెట్టో పండ్రెండేండ్లు గడచినవి. పదుమూఁడవయేఁడు ప్రారంభమైనది. పాఠకమహాశయుల యభిమానము మూఁడు నాలుగు సంవత్సరములనుండి కొఱఁతగాఁ గాన్పించుచున్నది. లోకమున్ని విధముల నభివృద్ధిమార్గముల వెదకుచున్నను ఐక్యసంస్థలు విశాలాశయములతో దినదినాభివృద్ధిం గాంచి విలసిల్లుచున్నను బరిషత్పత్త్రికాపాఠకుల యభిమానము మాత్రము పత్త్రికావిషయమున నభివృద్ధినొందుచున్నట్లు గాన్పింపదు. కారణము నవప్రియత్వమో భాషయం దనాదరభావమో యూహ్యము. నవప్రియత్వమునఁ బ్రాగ్బద్ధార్థము లుజ్జగించుట ప్రజ్ఞానిధులలక్షణము కాదు. ఏలోకమునందును వర్ణస్వాత్మ్యయమును బాటింపకుండ సర్వసామాన్యముగా సారస్వతాభివృద్ధికై పాటుపడుచున్న యిక్కాలమున భాషానాదరము గలుగునా! ఎట్లయిన నేమి పరిషత్పత్త్రికాపాఠకులు కొంచెము విముఖులై యున్నారనక తప్పదు. ఏపనికైనను భాష ముఖ్యము. భాషయం దనాదరము చూపి యితరకార్యాదరముం గనఁబఱుచువా రుండరు. కార్యాంతరనిమగ్నత యెక్కుడుగా మాపత్త్రికాపాఠకులం దగపడుచున్నది. ఉత్తరమునకుఁ బ్రత్యుత్తరము వ్రాయుటకుఁ దీరిక కొందఱకు లేదు. ఒకతావునుండి వేఱొకతావునకు మాఱిన సంగతి తెలుపరు. ఎవ్వరును బత్త్రికయందలేదనియే—ఒకతావునుండి వేఱొకతావునకు మాఱిన కొందఱు ప్రసిద్ధోద్యోగులు రెండుమూఁడుసంవత్సరములనుండి మాకుఁ బత్త్రిక వచ్చుటలేదని వ్రాసినారు. వారు తావునకు మాఱినట్లు మాకుఁ దెల్పలేదు. మేము మొదటితావునకే పంపుచుంటిమి. ఇక్కడనుండి యెక్కడకు మూఁడుసంవత్సర

ముల పత్రికలు పోస్టువారలు పంపలేదు మాకుఁ దెలియలేదు. ఇట్టి యిన్నియిా
సాగు లెంపటో-మేము పలుమారు వ్రాసినపిమ్మట మాకుఁ బత్రిక యందుట
లేదనుచున్నారు. పోస్టువారు కొంచెము శ్రద్ధతీసికొనవలయునని వారిని గోరు
చున్నారము. ఒక్కొక్కరు రెండుమూఁడు సంవత్సరములు చందాలు చాల
మంది యీయవలసియున్నది. సంవత్సరమున కొక్కసారి వారివారి చందా
లను దయచేసి పంపుటకై మిగులఁ గోరుచున్నాము. జ్ఞాపిక వ్రాసిన యప్పు
డైనను సాధ్యమైనంత శీఘ్రకాలములోఁ జందాలను బంపఁ వేఁడుచున్నారము.
పాఠకబృంద మీ సంచిక యందికొనిన వెంటనె యొక్కొక్క సంవత్సరము
చందా పంపెదరని నమ్ముచున్నారము. పత్రిక యికమీఁద నక్కఱలేనివారు
స్పష్టముగా నక్కఱలేదని వ్రాసి యప్పటి కీయవలసిన సొమ్ము పంపివేయ వేఁడె
దము. వ్యక్తిగౌరవమున మేము సొమ్ము తఱుచుగా నడుగక పత్రిక పంపుచు
న్నాము. అట్టిచో వారంతట వారే మాపైఁగల గౌరవాతిశయము వెల్లడిం
చుట ధర్మము. భాషాభిమానులు ప్రస్తుతకాలాభిరుచికిఁ దగినట్లు క్రొత్తక్రొత్త
విషయములు నిర్దుష్టశైలిని వ్రాసి తాము దమ మిత్రులును బంపుచుండిన
శిరసావహించి పత్రికయందుఁ బ్రచురించుచుందుము. కావునఁ బద్యగద్యరూ
పముల ఖండకావ్యములు మాపత్రికకై విజ్ఞులు రచియింప మఱియొక్క ప్రార్థ
నము. ఈ పదుమూఁడవ సంపుటమునకు వేత్త లేమి విశేషముం జూపెదరో
చూడవలయును.

పండ్రెండు సంవత్సరములవి వెనుకటి పరిషత్పత్రికలు గలవు కాని, కొన్ని
సంవత్సరములలోఁ గొన్ని సంచికలు తఱిఁగినవి. 2-7-8-9-10-11-12
సంపుటములు పూర్ణముగా స్వల్పప్రతులే యున్నవి. విద్యాలయములకు వానిని
దొందరగాఁ దెప్పించుకొనకున్న ముందు దొరకవు. సంపుటము 1-కి రూ. 3 లు.
పై 7 సంపుటములు నొక్కసారి కోరువారికి రూ. 2-8-0 వంతున బంపఁ
గలము. ప. అ.

ఓం హరిః.

శ్రీగురుభ్యోనమః.

# ప్రస్తుతజ్యోతిష్కులు తెలిసికోఁదగినవిషయము.



ఈకాలమున నెచ్చటఁ జూచినను, బ్రాచీనభారతీయనాగరకతను గుఱించిన ప్రసంగములె వినవచ్చుచుండుటవలనఁ గొందఱకు విసువు పుట్టుచున్నను, దద్గాఢాలాపముల కింకను గదలనైనఁ గదలని నిద్రావివశులను మేలుకొలిపియుఁ, బ్రతికూలవాదుల కంఠఘోషముల ముంచివైచియు సర్వత్ర నుద్బోధము గలిగించుదనుక నూతనవిజ్ఞానప్రచారకులు స్తిమితపడఁజాలరు. ఈప్రచారమును జూచి భూతవిశేషముల స్మరించుటవలన భావిలాభ మెటు లని ప్రశ్నించువారలకు సమాధానము, పూర్వమునుబట్టి యాధునిక మనియు. నాధునికముంబట్టి యనాగత మనియు, నాధునికానాగతముల గతముతో సూత్రించుటయే ప్రాచీనవైభవచింతనమునకుఁ బ్రయోజన మనియుఁ జెప్పవలయును. ప్రస్తుతము మనదేశమందు వ్యాపించియున్న పాశ్చాత్యవిజ్ఞానము ప్రాచీనసంస్కారముతో సమన్వయ పఱుప కుండుటవలననే, పసికూనలకు మ్రింగఁబెట్టు పిండిపదార్థములు వారికి జీర్ణములుకాక శరీరపుష్టిఁ గలిగింపక, భేద్యాదిరోగముల రేచి శుష్కింపఁ జేయునటులు, మనసంఘప్రాణిని కృశింపఁజేయుచున్నది. ప్రాచీనార్వాచీన సమన్వయదీక్షయందు దేశపండితులు ప్రవేశింపవలయును.

ఈనాఁడు వారువా రచంచలులై ప్రవర్తించు నీసమన్వయసంసిద్ధికి ముందుగ మనవిజ్ఞాన మెంతవఱకు వచ్చి యాఁగినదో తెలిసికొని దానికిఁ బ్రకృత లభ్యమానజ్ఞానమును మునుపటిదానితోఁ బెట్టి కనఁబడకుండున ట్లతుకవలయును. ఇట్టిప్రయత్నముఁ గావించినవారిలోఁ బ్రఫుల్లచంద్రరేగా రగ్రగణ్యులు. వారు రచించిన హైందవరసవిద్యాచరిత్రము పూర్వము మనదేశమందెంతరసాయనవిద్యాధికారము విద్వాంసులం దుండెడిదో స్పష్టముగఁ బ్రదర్శించుచున్నది. వారు తమగ్రంథాంతమునం దిటులు వ్రాయుచున్నారు:—

“కళలు హీనజాతుల కొప్పగించు టయ్యెను; వృత్తులు వంశపరంపరాప్రాప్తము లగుటవలనఁ, గొంతసౌకుమార్యమును మార్దవమును, బనినేర్పును నిస్సందేహముగఁ గలిగినవి కాని వానికొఱ కపారనష్టమున కోడఁబడుట

యయ్యెను. జాతియందు బుద్ధిశాలు రగువారు కళల నడలుటచేఁ బ్రకృతిపరిణామముల పూర్వోత్తరవిచారణమును, గార్యకారణసమన్వయమును మృగ్యములయ్యెను. ఊహాపరులు నతీంద్రియవిద్యాసక్తులు నగుమనవారియందుఁ గాలక్రమమునఁ బరిశీలనావ్యాసంగము నశించెను. దానితోఁ బ్రత్యక్షశాస్త్రములకు భరతఖండము స్వస్తివాచనము చెప్పికొనియెను. వర్ణధర్మపరతంత్రులై వేదములని పురాణము లని స్మృతు లని, నియమములకుఁ గట్టుపడి యందుచే బుద్ధియుఁగొరి స్తబ్దముగాఁగా, నీభారతీయులయం దే "బోయి" ల్పండితుఁడును జనింపఁడయ్యెను. ఈభారతభూమి బోయిల్, డేకార్టిస్ న్యూటనులవంటి మహనీయులఁగనుటకు నీరస మైన దయ్యెను గాన విజ్ఞానప్రపంచమునకుఁ గొంచెమించుమించుగా వెలియయ్యె ననవచ్చును."

రేగారివంటి ధీమంతులు చెప్పినయీమాటలఁ బ్రమాణములుగాఁ గొని విదేశీయులును వారిమానసభ్రాత లగు కొందఱు హిందువులును భారతీయుల ప్రజ్ఞావైశాల్యమును గొంచెపఱిచి పలుకుచుందురు. ఈవిషయమునందు మాత్రము రేగారివాక్యములు మన మాదరింపలేము. ఈవాక్యములయందలి వేద పురాణస్మృతుల గుఱించినపలుకుల విమర్శించుచు Sacred Books of the Hindus Vol. 16 లోఁ దత్ప్రకాశకు లిట్లు వ్రాయుచున్నారు.

"డాక్టరు రేగారు తమశోధనలచేఁ జూపినట్లు 17-వ శతాబ్దమధ్యము వఱకు ననఁగా 2,000 సంవత్సరములు, వర్ణనియమములును, మతాభిప్రాయములును హైందవపండితులు శాస్త్రములఁ గల్పించుటకుఁ గాని, ప్రపంచమందలి జాతులలోఁ బ్రాముఖ్యత వహించుటకుఁ గాని యుపరోధములు గానప్పుడు వానివలన నీదేశస్థులకు బుద్ధిజాడ్యము సంభవించె ననుటలో వాదసౌష్ఠవము నంగీకరించుట కష్టము. దీని నిదమిత్థ మని నిశ్చయించుటకు ముందుగా మఱికొన్ని సంగతులు బయల్పడవలయును. ప్రపంచచరిత్రకారణము లగునానాశక్తుల నింక నెక్కుడు శాస్త్రదృష్టితో సమన్వయింపవలయును."

హైందవబుద్ధిమాంద్యమునకు వర్ణధర్మములు కారణములు గాకున్న మఱే వనిన నాగ్రంథమునందె యిటు లున్నది.

"విజ్ఞానప్రపంచమునకుఁ బాశ్చాత్యపండితులు వాస్తవముగఁ జేర్చిన వానిని గొంచెముగఁ బల్కుట మాయభిప్రాయమునకు దూర మగుంగాక. అయినను, హిందూబుద్ధి సంస్తంభనపరిక్షీణములు గలిగిన దని చెప్పుచున్న కాలమునందు మహమ్మదీయవిక్రాంతి సంరంభములనుండి తమజాతిరూపము

నిల్పికొనుటయుఁ దమనాగరకతను, దగినమార్పాటులతో రక్షించికొనుటయును హిందువులకుఁ బ్రధానధర్మ మయ్యె నని మఱవ కుండవలయును. ఇతరజాతు లన్నియుఁ గొరాను, కత్తిదాస్యము ననువానిలో నేదో మహాధూమవేలనము (Steam Roller) క్రిందఁ బడి మట్టమై యుండ, హిందువులు మాత్రమె వాని నరికట్టుటయె కాక, తమస్వీయవ్యక్తిత్వమును, బ్రాచీనభావనయుఁ గాపాడి కొని నూతనశక్తుల స్వాధీనములు గావించికొని తమయభివృద్ధికిఁ, బురోవృద్ధికి వానిని వినియోగించికొని రనినచో వా రెంతమహాకార్యము నిర్వహించిరో వారిప్రతిభ యెంతటిదో తెల్ల మగును."

ప్రఫుల్లచంద్రరే గారి యభిప్రాయములకన్న నివి భారతీయుల నిజస్థితి నెక్కుడు నిష్పక్షముగ వివరించుచున్నవి యని నిదానించినవారికిఁ దెలియక పోదు. దేశమునందు నిత్యయుద్ధములు రాజ్యవిప్లవములు సంభవించుచున్న కాలమునందు శాస్త్రము లె ట్లభివృద్ధి చెందును? మఱియుఁ బిమ్మట నాంగ్లరా జ్యము సుస్థిరమై యున్నెడ మంచికో చెడ్డకో దేశభాషల వదలి హూణవిద్యావి ధాన మంగీకరించిరి. దానితో భారతీయవిద్వాంసులసామర్థ్యమునకుఁ దగిన వినియోగము లేక, వ్యాయామ మెఱుంగనివారి బాహువులు దుర్బలము లగు తెఱంగున దుర్బల మయ్యెను. మనశాస్త్రము లన్నియు మహమ్మదీయవిజయా రంభముతో నంతములు గల వయ్యెను. మనవిజ్ఞానము నేటికి సుమారు మూఁడువందలసంవత్సరములు వెనుకఁబడి యున్నది. ప్రజ లన్ననో హూణ విద్యాపరిచయు లనియుఁ, గానివా రనియు రెండు తెగలుగ విడిపోయి యొకరి కొకరు సమన్వయము కుదురక యొకరి నొకరు నిరసించుకొనుటతోఁ గాలక్షే పము సేయుచున్నారు.

ఎప్పటికైన నీరెండుపక్షములుఁ జేరినఁ గాని దేశాభివృద్ధికి మార్గము కానిపింపదు. పండితులు నవీనశోధనల నంగీకరించి వానిని దమవిజ్ఞానమునం దిమిడ్చికోఁ బ్రయత్నింపవలయును. ఇది సామాన్య మైనపని కాదు. ముఖ్య ముగా దేశపండితులందు హిందూవిజ్ఞానము సర్వోత్కృష్ట మనుభావము ప్రబలి దేశాంతరములందు వెలసిన నూతనాంశముల గ్రహించునవసరమున లాఘవము గనఁబడుట లేదు. అన్నిశాస్త్రములందువలెనె జ్యోతిశ్శాస్త్రమునందుఁ గూడ మనపండితులు స్వల్పమైనను గరఁగకున్నారు. వీరికాఠిన్యము చాలభాగము బాహ్యప్రపంచముతో సంపర్కము లేక పోవుటచేఁ గలిగిన సంకుచితదృష్టియె కారణముగాఁ గలది కావునఁ దచ్ఛాస్త్రమునందుఁ గలిగినమార్పాటుల స్వరూ

షము స్పష్టముగాఁ జెప్పిన ధీశాలురు గాన వారైనను నిరాకరింప రాదు నమ్మకముతో హైందవజ్యోతిశ్శాస్త్రమునకుఁ బాశ్చాత్యజ్యోతిశ్శాస్త్రమునకు మొదట నెట్టి సాదృశ్యము గలదో, మొదటి దెచ్చట నిలిచిపోయెనో, యటులు నిలిచిన నాఁటినుండి నేఁటివరకు రెండవదానియం దెట్టెట్టు లెంతెంత ప్రాతిపదిక ననుసరించి యభివృద్ధి యైనదో దిఙ్మాత్ర మిం దుదాహరింపఁ బూనితిని.

పదియాఱవ శతాబ్దమునాఁటికి యూరపుఖండమునందు టోలమీసిద్ధాంతము సంపూర్ణముగ వ్యాపించి యుండెను. దానిని సంరక్షించుటయందు మతాచార్యులు పట్టుదల వహించెడివారు. వారిని బ్రతిఘటించినవారిని నానా బాధలఁ బెట్టుచుండువారు. ఆపద్ధతి బైబిలు ననుసరించి యున్న దనియు, దేవప్రచోదిత మనియుఁ, బూర్వసంప్రదాయ మనియు దానికి విరోధముగఁ జెప్పుటెల్ల నాస్తికరీతి యనియుఁ బ్రజాహృదయములందు గట్టినమ్మక ముండెను. ఆ సిద్ధాంతమును బట్టి, సృష్టికి మకుటము మానవుఁ డనియుఁ, దక్కినవెల్ల వాని సౌకర్యమునకు నిర్మింపఁబడిన వనియుఁ గావున లోకములందెల్ల భూమి ప్రధానమైన దనియు, నందుచే, సూర్యాదిగ్రహమండలములు భూమికిఁ బ్రదక్షిణములు గావించుచు, నారోగ్యము సౌందర్యము నిచ్చుచున్న వనియుఁ, బ్రతిపాదింపఁ బడియెను. గ్రహకక్ష్య లన్నియు సమగ్రవృత్తములు. నానాగ్రహములను దేవతలు వానివానికక్ష్యలయందుఁ బ్రవర్తింపఁ జేయుచున్నారు. శీఘ్ర మంద వక్రాది గతులు గ్రహకేంద్రములు తిన్నగఁ గక్ష్యావృత్తములం దుండమి గలుగుచున్నవి. అటులు లేకపోవుటవలన నీచోచ్చవృత్తములు పుట్టుచున్నవి. ఈవిషయము నీక్రిందివాక్యములఁ బరిశీలించిన సువ్యక్త మగును.

"A curve described in space by a point of a circle or sphere which itsel fis carried along at the same time, is some kind of cycloid; if the centre of the tracing circle travels along a straight line, we get the ordinary cycloid, the curve traced in air by a nail on a coach wheel; but if the centre of the tracing circle be carried round another circle the curve described is called an epicycloid. By such curves the planetary stations and retrogressions could be explained. A large sphere would have to revolve once for a year of the particular planet carrying with it a subsidiary sphere in which the planet was fixed; this latter sphere revolving once for a year of the earth." *Sir Oliver Lodge.*

ఈయాంగ్లవాక్యములందలి యభిప్రాయమునుఁ గొంచె మించుమించుగ నిట్లు చెప్పవచ్చును.

"ప్రాప్తగమన మగుగోళమునఁ గాని చక్రమునఁ గాని యేదే నొకస్థాన మవకాశమున జనింపంజేయు రేఖ "భ్రమక"గణములోని దగును. అందు మొదటిచక్రము ఋజుమార్గమునఁ బోఁగా సామాన్య"భ్రమక"మగును. దీని కుదాహరణము బండిచక్రమున కంటిన మేకునఁ గలుగు రేఖ. ఆచక్రము వృత్త మార్గమునఁ బోవు నేని నానియతస్థాన మవకాశమున నుపభ్రమకమును గలిగించును. ఇట్టి యుపభ్రమకములచే గ్రహస్థితులును, వక్రగతులును వివరింప వచ్చును. అందుఁ బ్రధానచక్రము గ్రహసంవత్సరమున సంపూర్ణముగా నుపభ్రమకము భూసంవత్సరమునఁ బూర్తి యగునటు లూహింపవలయును." ఇది టోలమీసిద్ధాంతరీతి.

దీనికిని మన దేశమునఁ బ్రస్తుతము వ్యవహరింపఁబడుచున్న గణితమునకును భేదము లేదని యిఁకఁ జూపించెదను. మన పండితులును భూచలన మంగీకరింపరు. గ్రహములే భూమిని జుట్టుచున్న వందురు. గ్రహకక్ష్యలు వృత్తము లందురు. ఈవృత్తములందు గ్రహములు ప్రత్యేకదేవతలవలనఁ బరిభ్రమించుచున్న వని సూర్యసిద్ధాంతమునందు ద్వితీయాధ్యాయమున నిటు లున్నది.

అదృశ్యరూపాః కాలస్య మూర్తయో భగణాశ్రితాః
శీఘ్రమందోచ్చపాతాఖ్యాః గ్రహాణాం గతిహేతవః ॥
తద్వాతరశ్మిభి ర్బద్ధాస్తైః సవ్యేతరపాణిభిః
ప్రాక్పశ్చా దపకృష్యంతే యథాసన్నం స్వదిఙ్ముఖమ్. ॥

ఈశ్లోకములకు వ్యాఖ్యానమున రంగనాథపండితులువా రిట్లు వ్రాయుచున్నారు. "అయమభిప్రాయః భచక్రగోళస్థక్రాంతివృత్తానుసృతగ్రహాకాశగోళాంతర్గతక్రాంతివృత్తే కక్ష్యారూపే స్వస్వప్రదేశే గ్రహోచ్చపాతా తిష్ఠంతి। తత్ర బింబవ్యాసో నకక్ష్యాకారసూత్రం ప్రవహవాయ్వతిరిక్తవాయురూపం స్వతో గతి స్వస్థానే కంపమానం గ్రహబింబవ్యాసే పూర్వాపరే ప్రోతముచ్చజీవహస్తద్వయాంతర్గత మస్తి। అథ గ్రహబింబ ముచ్చస్థానా త్పూర్వ స్మిన్ స్వశక్త్యా గచ్ఛదపి వామహస్తస్థిత సూత్రే ణోచ్చస్థానాత్పూర్వరూపేణ గ్రహస్థానా త్పశ్చిమరూపేణ బృహత్సూత్రావయవాత్మకేన స్వస్థానాత్ పశ్చాత్ స్వాభిముఖ మపకృష్యతే నిరంతర ముచ్చదేవతైః స్వశక్త్యా యావత్ షడ్భాంతరం తయోః అనంతరం తన్మార్గే ణాకర్షణసంభవాత్ పూర్వస్మిన్ గచ్ఛద్గ్రహబింబంసవ్యహస్తస్థితసూత్రే ణోచ్చస్థానాత్ పశ్చిమరూపేణ గ్రహస్థానాత్ పూర్వరూపేణ

బృహత్సూత్రాన్తయవాత్మకేన స్వస్థానా త్పూర్వ స్మిగ్ స్వాభిముఖ మాకృష్య తే
స్వశక్త్యా నిరంతరం యావదంతరా భావ స్తయో రితి ॥

గ్రహవక్రాదిగతుల సమర్థించుటకు భారతీయసిద్ధాంతములందును పైని వర్ణించిన నీచోచ్చవృత్తస్వరూప మగునుపభ్రమకపద్ధతి ననుసరించి "వక్రభంగి" చెప్పఁబడినది. ఇప్పుడు ప్రాచ్యపాశ్చాత్యగణితవిధానైక్యము స్పష్టమైనది గదా. టోలమీపద్ధతి గాని సూర్యసిద్ధాంతపద్ధతి గాని గ్రహగణితము సమానముగ నున్నప్పటికిని హిందూగణితజ్ఞుల పరిశ్రమలవలన గ్రహఫలములు 16-వ శతాబ్ద పాశ్చాత్యులకన్న సూక్ష్మములుగ నుండె నని స్వామికణ్ణుపిళ్లెగారి "Indian Chronology" వలనఁ దెలిసికొనవచ్చును. ఇటులు సూక్ష్మఫల మాసిద్ధాంతముల వలన లభించుచుండుటవలననే చాలనట్టునకుఁ దమపద్ధతి వదలుకొనఁ బండితు లిష్టపడకున్నారు. పాశ్చాత్యులందు నిట్టియసమ్మతియె చాలకాల ముండినది. ఈసందర్భమున G. W. Parker, M.A. గా రిట్లు వ్రాయుచున్నారు.

"The different celestial phenomena mentioned above the diurnal revolution of all heavenly bodies, the yearly path of the sun, the monthly motion of the moon, and the apparently irregular courses taken by the planets were accounted for by Ptolemy, who lived in the second century after Christ, on apparently so satisfactory a basis that it was not until the sixteenth century that the true explanation was accepted." *Elements of Astronomy: by G. W. Parker, M.A. of Trinity College, Dublin.*

దీని నిటులు పరివర్తింపవచ్చును.

"పైని వివరించిన ఖగోళవిషయములు—అనఁగా, నక్షత్రముల దిన గతియు, సంవత్సరమితమగు సూర్యభ్రమణమును, ప్రతిమాసచంద్రగతియు, దృష్టికి విషమమార్గగామము లగునటులు స్ఫురించు కుజాదిపంచగ్రహసంచార ములును, క్రీస్తువెనుక రెండవశతాబ్దమునందలి వాఁడగు టోలమీ యొకతీరున బహుసుష్ఠుగ సమర్థించినందున దానినే పట్టుకొని యాపరిణామముల నిజస్వ రూపము చెప్పినను నూతనసిద్ధాంతము పదాఱవశతాబ్దపర్యంతము పండితు లొప్పుకొనరైరి".

జ్యోతిశ్శాస్త్రము పంచాంగముల గుణించుటకు మాత్రమే వినియోగ పడుచుండుటవలన సూర్య, చంద్రాదిగ్రహములయు, నక్షత్రములయు స్థితు లను గుణించుట కెంత యవసరమో యంతే సిద్ధాంతము రచింపఁబడినంతనే

మనపండితులకు సంతుష్టి కలుగుచున్నది. జ్యోతిశ్శాస్త్రప్రయోజన మంతయే నైనయెడల నటులే సమాధానపడవచ్చును.

కాని జ్యోతిశ్శాస్త్రమునుబట్టి మనము గ్రహింపవలయు జ్ఞాన మపార ముగ నున్నది. ఒకానొక విధమున నాలోచించిన నది యాధ్యాత్మిక జ్ఞాన మునకుఁ బ్రధానాంగ మని పొడకట్టును. దానివలన భూమినిగూర్చియు మండల ములఁ గూర్చియు వానివానియందుఁ గలుగుపరిణామములను, నానాలోకముల కుఁ గలపరస్పరసంబంధమును వానిసమన్వయమును, సృష్టిస్వరూపమును బదా ర్థోత్పత్తి స్థితిలయములు నీసర్వమును జ్యోతిషశాస్త్రవ్యాసంగమున నువ్యక్తము లగుచున్నవి.

ఈవృత్తితో జ్యోతిశ్శాస్త్రము నభ్యసింపవలయు ననిన గ్రహభగణ ములు లెక్కపెట్టుటతో సంతుష్టి చెందక నానాగ్రహములు నేనియమములం బట్టి భ్రమించునో యట్టిభ్రమణమునకుఁ గారణ మెద్దియో యామూలకార ణము బ్రహ్మాండమునం దెల్ల నెటులు వర్తించుచున్నదో యెంత క్లేశమునకైన నోర్చి తెలిసికొనవలయును. పూర్వగణితజ్ఞులు సైత మిట్టియభిప్రాయము నె కొం చెము గ్రహించిరి కావుననే గ్రహగమనమునకుఁ గారణము దేవతల శ్రద్ధ యనిరి. అప్పటిలో వారికిఁ దెలిసినదంతే కాని దానికన్న సౌష్ఠవముగ బ్రహ్మాండ వాస్తులక్షణము సుబోధము గావించు రీతి కథమ మీదేశవాసు లభ్యంతరపెట్టు టకు మత మెంతమాత్రము హేతువు గానేరదు. సూర్యసిద్ధాంతమునందు:—

“యోజనాని శతా న్యష్టౌ భూకర్ణో ద్విగుణానితు” అనుపంక్తికి వ్యా ఖ్యానము గావించుచు, రంగనాథపండితులు, కథావ్యాసార్థస్య వ్యవహారపద స్యాపి భూకర్ణవ్యవహారః। తుకారాత్ పురాణవిరుద్ధోపి ప్రత్యక్షసహాకృత, ఆగమ ప్రమాణసిద్ధః। అని ప్రత్యక్షశాస్త్రప్రమాణముముందఱఁ బురాణములప్రతి భఁ గట్టిపెట్టు మనిరి.

కాని యూరపునందుమాత్ర మిట్టిసహనము లేదు. భూమి తిరుగుచున్న దని వాదించువారిగ్రంథముల మతాచార్యులు బహిష్కరించియు, వారిని వెలివైచియుఁ జివరకుఁ జంపించియు టోలమీసిద్ధాంతముల (ననఁగా మన సూర్యసిద్ధాంతపద్ధతిని) నిలఁబెట్టఁ జూచిరి. కావున ముందు ముందీవ్యాసమున వర్ణించెడి నూతనసిద్ధాంతము లన్నియు బలిపుచ్చుకొని మఱియు వృద్ధిపొందిన వని యొకమాటే చెప్పి వదలుచున్నాను.

ములు నక్షత్రకక్ష్యయందె యున్నవనియు, సూర్యుఁడు గ్రహములకెల్ల నాభి యనియు, భూమ్యాదిసర్వగ్రహములుఁ గేంద్రగ్రహ మగుసూర్యునిచుట్టుఁ బ్రదక్షిణములు గావించుచున్న వనియు, భూమి సూర్యునిచుట్టుఁ దిరుగునప్పుడు దాని యక్షము సూచీపార్శ్వము రచించుటవలన నయనచలనము సంభవించుచున్న దనియుఁ జెప్పెను. ఈతని పరిశ్రమఫల మిట్టులు చెప్పఁబడియున్నది.

"By means of his simpler theory and more exact planetary tables, he reduced to some sort of order the confused chaos of the Ptolemaic system, whose accumulation of complexity and of outstanding errors threatened to render astronomy impossible by the mere burden of its detail." *Sir Oliver Lodge.*

"సూక్ష్మతరము లగుగ్రహపదకములవలనను సరళతర మగుసిద్ధాంతము మూలమునను జీకాకుగా నున్నటోలమీపద్ధతిని గొంతవ్యవస్థకుఁ దెచ్చెను. లేనిచో దానిసంకీర్ణతయు నానాఁటఁ బెరుఁగుచున్న బీజములును వాని బాహుళ్యము వలననే జ్యోతిశ్శాస్త్రము దుర్గమమై యుండెడిది."

కోపర్నికుని నెదిరించినవా రనేకులు కలరు. వారి కాతఁ డీక్రిందిసమాధానము చెప్పెను.

"If there be some babblers who, though ignorant of all mathematics, take upon them to judge of these things, and dare to blame and cavil at my work, because of some passage of scripture which they have wrested to their own purpose, I regard them not, and will not scruple to hold their judgment in contempt."

"గణితజ్ఞాన మేమాత్రము లేకున్నను బైబిలులోని వాక్యమును దేనినో పెల్లగించుకొని వచ్చి యది తమ కనుగుణముగ నన్వయించుకొని యీవిషయముల విమర్శించుభారముఁ బూని నాగ్రంథమును దూషించి ధిక్కరింప సాహసించు ప్రేలరులు కొందఱున్నను వారి నేను లెక్కచేయను. వారివిమర్శనముల నిర్లక్ష్యము గావించుటయం దెంతమాత్రము శంకింపను" అని దానియభిప్రాయము.

తరువాత నీనూతనమతమునం దభినివేశముతోఁ బనిచేసినవాఁడు టైకోబ్రాహి. ఈతఁడు బహుపరిశ్రమ చేసి గ్రహముల వేధించి నూతనసిద్ధాంత నిర్మాణావశ్యక మగుసామగ్రిని సేకరించెను. దానిఁ జేకొని "కెప్లరు" బహువర్షములు గణితవ్యాసంగమునందును, చింతనమందునుం గొట్టుకొని కొట్టుకొని,

గ్రహగతులకు వృత్తకక్షలు సరిపడనందునఁ దుదకు, దీర్ఘవృత్తముతో గణితము చేసి కృతార్థతఁ జెంది—

1. గ్రహము లన్నియు సూర్యుఁ డొక కేంద్రముగ నున్న దీర్ఘవృత్తముల సంచరించు ననియు,

2. వానివాని వర్షప్రమాణవర్గము సూర్యునుండి వాని దూరఘనమున కనులోమించు ననియు,

3. సమానకాలములలో సమానక్షేత్రములు గ్రహము క్రమించు చుండు ననియుఁ జూపించెను.

ఈనూతనసిద్ధాంతములు వచ్చినతోడనే పండితులు తత్ప్రతిపాదకుల ననేకప్రశ్నలు వైచిరి. వానిలోఁ గొన్నిటిని జూపెదను. అప్పుడు మనవారిలో నీ సిద్ధాంతముల గుఱించి యెట్టిచర్చ జరిగినదో యెంత కడిగి వడపోసిన తర్వాత వానిని సర్వజను లంగీకరించిరో తెలిసికొని తమహట్టుదలల వదలుదురుగాక.

1. ఈభూచలనము కానిపించదే; భావించుటకును సువ్యక్తము గాకున్నది.

2. నక్షత్రములు రాసులు సర్వకాలములందు నొకవిధముగనే కన్పించు చున్నవి. నిజముగా భూమి పెద్ద దీర్ఘవృత్తమున నడచుచో వానియందు భేదము గనఁబడవలదా?

3. భూమి సూర్యునిచుట్టుఁ దిరిగినచోఁ జంద్రునివలె బుధశుక్రులకుఁ గళ లుండవలయును.

4. భూమి కదలినచో పై నెత్తునుండి యేవస్తువు నైనఁ బడవైచిన నది చాల వెనుకఁబడి యుండవలయును. (ప్రస్తుతజ్ఞానముంబట్టి కొంచెము వెనుకకుఁ గాదు ముందునకే పడును.)

ఇందు మొదటిప్రశ్న—భూచలనము మనకుఁ గానరాకుండుటకుఁ గారణము మనము దాని నాశ్రయించి యుండుటయు, నది సర్వకాలములయందు సమానముగ నుండుటయు నది మనకుఁ దెలియుటలేదు. తక్కినప్రశ్నలయం దెటువంటి ఫలితములు కలుగవలయు నని పృచ్ఛకులు చెప్పిరో యట్టిఫలములే ప్రత్యక్ష్యము లయ్యెను. అటులఁ బ్రత్యక్షము లగుటకు సాధనము దూరదర్శిని యంత్రము. కెప్లరు తర్వాత వచ్చిన ప్రతిభాశాలి «గెలీలియో» ఇతఁడు దూరదర్శినీయంత్రము నిర్మించెను. కర్మశాస్త్రమునకుఁ బితామహుఁ డయ్యెను. దూరదర్శినీయంత్రసాహాయ్యమున నీతఁడు చంద్రబింబమునందలి మిట్టపల్లములును, సూర్యమండలమున మచ్చలును, బృహస్పతి కుపగ్రహములును, శనిమండల

కంకణమును ప్రకాశములు గావించి సూర్యకేంద్రిక సిద్ధాంతమునకుఁ బుష్టి యొనర్చెను. ఈతనిసిద్ధాంతములకు భయపడి ప్రాచీనసమ్ప్రదాయసంరక్షణార్థము క్రైస్తవమతాచార్యమౌళి యైన "పోపు" తత్ప్రచితగ్రంథములఁ బహిష్కరించి యాతని బంధించెను. దూరదర్శినియంత్రము జ్యోతిషసాధనముగా నంగీకరించుటయందుఁ గడచిన గోదావరీపుష్కరనిర్ణయసభాసమయమున మన యాధునిక జ్యోతిర్విదు లెంతెంత యభ్యంతరములఁ జెప్పిరో యట్టివే గెలీలియోనాఁటి పాశ్చాత్యపండితులును జెప్పిరి. వారిచర్యల నిపుడు కొంచెము వినిపించినఁ గాని మన యాధునికాంధ్రజ్యోతిష్కులకుఁ దత్త్వము బోధపడ దని గెలీలియో జీవితమునుండి స్థాలీపులాకన్యాయమున రంగముల నుద్ధరించెదను.

" Some there were who having been shown them refused to believe their eyes, and asserted that although the telescope acted well enough for terrestial objects, it was altogether false and illusory when applied to the heavens. Others took the safer ground of refusing to look through the glass."

"పైన వివరించినవాని నన్నింటిఁ జూపించినపుడు తమకన్నులను దాము నమ్మఁజాలక, భూమియందలి వానిని జూచుటకు దూరదర్శిని పనికివచ్చినను, ఖగోళవేధయందు మాత్రము దానివలన మోసమును భ్రాంతియుఁ గలుగునని కొందఱు వాదించిరి. కొందఱు దూరదర్శినిలోఁ జూచుటే యుచితము కాదని తప్పించుకొనిరి"

ఈకాలమున గెలీలియో కెప్లరున కిటు లుత్తరములో వ్రాసెను.

" Oh! My dear Kepler, how I wish that we could have one hearty laugh together! Here, at Padua, is the principal professor of philosophy, whom I have repeatedly and urgently requested to look at the moon and planets through my glass, which he pertinaciously refuses to do. Why are you not here? what shouts of laughter we should have at this glorious folly! and to hear the professor of philosophy at Pisa labouring before the grand duke with logical arguments, as if with magical incantations, to charm the new planets out of the sky."

"ఓప్రియమిత్రమా కెప్లరూ! నీవు నేను గడుపార నొక్కపర్యాయము నవ్వుకొందుముకదా! ఇక్కడ పాదువాలోఁ బ్రధానతత్త్వవిద్యాధ్యాపకుఁ డున్నాఁడు; ఆయనను చంద్రుని, గ్రహములను జూడవయ్యా యని యద్దము చేతికిచ్చి బుజ్జగించి వేమాఱడిగితిని, కాని, చూడ" నని యుదేహట్టు. నీవిచ్చట

నేల లేకపోయితివోయి! ఈమహాచిత్రచర్యఁజూచి యెంతి గట్టిగ నవ్వికొని యుందుమోయి! చూడు, పైజాలో తత్త్వవిద్యాధ్యాపకుఁ డున్నాఁడు. ఆతఁడు దివాణము నెదుటఁ దర్కముతోఁ బాటుపడుచున్నాఁడు, మంత్రములతో ఖగోళ మండలి యీనూతనగ్రహములు మాసిపోవును గాఁబోలు!"

అప్పటికాలపుపండితు లటులు గావించిన నది సహజము. అంతకన్న నూతనకల్పనల ననుదినముఁ జూచుచున్న మనయందలి పండితు లీనాఁడు దూరదర్శిని గుఱించి సంశయించుచుండుట కడు శోచనీయము. దీనికిఁ గల కారణము, భారతీయజీవసంస్తంభనమె కాక మఱొకటి కానేరదు. తత్పున రుజ్జీవనమునకు శాస్త్రవాసన దేశభాషలయందు వ్యాపింపఁజేయుటయె సిద్ధౌషధము. ఈసందర్భమున Sir Oliver Lodge (సర్ ఆలివర్ లాడ్జి)గా రిటులు వ్రాయుచున్నారు.

"We need scarcely blame these men; at least we need not blame them over-much. To say that they acted as they did is to say that they were human, were narrow minded, and were apostles of a lost cause. But they could not know this; they had no experience of the past to guide them; the conditions under which they found themselves were novel, and had to be met for the first time. Conduct which was excusable then would be unpardonable now; in the light of all this experience to guide us. Are there any now who practically repeat their error, and resist new truth? who cling to any anchorage of dogma, and refuse to rise with the tide of advancing knowledge? There may be some even now."

"ఆకాలపువారిని దూషింపఁ బనిలేదు. పోనీ! విశేషము నిందింప నక్కఱలేదు. వా రటులు గావించిన, మానవమాత్రు లనియు, సంకుచిత దృష్టు లనియుఁ, బూర్వకాలపుదానినే పట్టుకొనువా రనియు స్పష్టమగు, నంతె. కాని, వారి కది తెలియదు—వారియనుభవమున నిట్టి వెన్నఁడు నెఱుఁగరు, వానింబట్టి పోల్చుకొనుటకు—నూతనపరిస్థితులలోఁ బడిరి, యదే ప్రారంభము. అప్పటికాలపువారియం దీప్రవర్తన తప్పు కాకున్నను, బ్రస్తుతము మన కింత పూర్వానుభవ ముండి యట్టిపను లిప్పు డొనర్చితిమేని మనము కరుణార్హులము గాము. ఆకాలపువారివలెనే పొరపడి ప్రత్యక్షముగా నేఁడును నూతనవిజ్ఞానము నడ్డుపెట్టువా రుందురే? ఏపురాణవచనాలానమునో పట్టుకొని దినదిన ప్రవర్ధమాననూతనవిజ్ఞానవీచికాగ్రమున రా మనువారు నుందురే? ఇప్పటి

కాలమునందును గొంత యుండవచ్చును" అని పైరెండువాక్యములు కద్దు. అయిన మనపండితులు శారీరకముగ నీకాలపువారైనను, మానసికముగఁ బూర్వ నాఱవశతాబ్దమువారే కావున వీరిని మనము నిందింప నక్కఱలేదు కాని నూతనసిద్ధాంతములను వీరికి హృదయంగమములుగఁ గావింపవలయును. గెలిలియో చివరకు రోమునందు పోపుగారి ఖైదులో మరణించెను. అంత్యసంస్కారములైన నతనికి గౌరవముగఁ గానీయలేదు. ఆర్యులారా! ఇన్నికష్టములఁ గోర్చి యేల నూతనసిద్ధాంతముల స్థాపింపవలయును? ఆబలము గెలిలియోది కాదు. గెలిలియో కారణమాత్రుఁడు. ఏనుఁగులాతిని బ్రద్దలు సేసికొని పెల్లగిలి వచ్చుచున్న మఱ్ఱిమొక్కవలె సత్యమా ప్రతికూల శిలాపరంపరములనుండి బ్రద్దలుచేసి కొని వచ్చినది.

ఇంతవఱకును ననఁగా గెలిలియో జీవితాంతకాలమువఱకు సూర్యకేంద్రికసిద్ధాంతమునకు సంబంధించిన స్పష్టవిషయములు తెలిసెనేకాని సర్వగోళగతికీలక మింకను దెలియలేదు. ఆజ్ఞానము కర్షశాస్త్రప్రవృద్ధియే యాధారముగాఁ గలది. కర్షశాస్త్రము పవిద్యగా యూరపునందును భరతదేశమునందును గూడ నభ్యసించుచుండిరి. అందు హిందూదేశమునందె యది వృద్ధిలో నుండెను. నైయాయికులు, వైశేషికులు దానిగుఱించి విస్తరించి వ్రాసిరి. కొంచెములోఁ దప్పిపోయినది కాని కర్షశాస్త్రసంపూర్తి భరతఖండమునకుఁ దక్క యుండవలసినది. న్యూటన్నును మించినపండితుఁడు మనదేశమందె పుట్టియుండును గాని మననాగరకత సంతతతురుష్కవిజృంభణముచే సంస్తంభనము సెంది యుండుటవలన విద్యాదేవి కొంతకాలము నూతనోత్సాహపూరితు లగు నైరోపియనులకు సాక్షాత్కార మొసఁగినది. ఐన నేమి వారు మాత్రము మన చిన్నతమ్ములు కారా? మన మిచ్చటఁ బ్రాణమునకై పెనఁగులాడుచుండ వారచ్చట విజ్ఞానము సంపాదించి మనగందరగోళము లన్నియుఁ జల్లారినపిమ్మట మనదగ్గఱకు వచ్చి వారిసంపాదనమునంతయుఁ జూపించుచున్నారు గదా. వారొసంగు నారోగ్యకరపదార్థము లన్నిటిని గ్రహించెదముగాక. దేశకాలపురుషభేదముల వలన వారియం దున్న విషమాభ్యాసముల దూరమున నుంచికొనెదముగాక.

న్యూటను గావించినమహాత్కార్యము, పూర్వ మీదేశమునను, యూరపునందును ప్రచారములో నున్న గురుత్వాకర్షణవచనముల భూమికిని భూసమీపవస్తువులకే కాక బ్రహ్మాండ మంతకును వర్తించునటులు గనుఁగొనెను. దానితో గ్రహములు దీర్ఘవృత్తముల నేల సంచరించుచున్నవో తటాలునఁ బోడకట్టెను.

న్యూటను గ్రహగతులయందుఁ బ్రతివచనమునకు నుపపత్తిఁ జెప్పెను. అయనము సంపూర్ణభ్రమణము గావించు నని తేల్చెను. గ్రహముల దూరములు, భూమితోఁ బోల్చిన, వానిభారములు, మొదలగు విషయము లెన్నియో యతఁడు సాధించెను. 12 శతాబ్దమున హిందూదేశమునందు భాస్కరాచార్యుఁడు వచించిన (Differential Calculus) ప్రస్తారగణితము నతఁడును, లీబ్నిజ్జను స్వతంత్ర స్వతంత్రముగాఁ బునస్సృష్టి గావించిరి. దీనితో టాలమీపద్ధతి యనఁగాఁ బూర్వభరతఖండపద్ధతి యంతరించి యూరపునందు సూర్యకేంద్రికవిధానము సుస్థిర మయ్యెను. కావునఁ గోపర్నికుఁడు, టైకోబ్రాహి, కెప్లరు, గెలీలియోలు గావించిన గ్రహవేధలు సిద్ధాంతములు నన్నిటినిఁ గ్రోడీకరించి న్యూటను వాని కన్నిటికి నుపపత్తులు గల్పించి గ్రహగణిత మపారము గావించి సూర్యకేంద్రిక సిద్ధాంతము సంపూర్ణము గావించెను. ఈతఁడు గావించిన గణితముచే,

1. కెప్లరు ప్రతిగ్రహము సమానకాలమాత్రలలో సమానక్షేత్ర మాక్రమించుచున్న దనుట ప్రతిగ్రహము సూర్యునిచే నాకర్షింపఁబడుచున్న దనుట యనియు, 2. నవి దీర్ఘవృత్తముల సంచరించుననుట యాసూర్యాకర్షణము దూరవర్గమునకు విలోమించుచుండు ననుట యనియుఁ, 3. గాలవర్గము దూరఘనమున కనులోమించు ననుట నన్నియు నొక్కజాతిశక్తులకే లోనైన వనియు, నాశక్తి సూర్యునుస్థానము నాశ్రయించి యున్నదనుట యనియుఁ జూపించెను.

పైదానింబట్టి, గ్రహవర్ష ప్రమాణమును సూర్యునినుండి దానిదూరమును దెలిసెనేని భూమికన్న సూర్యుఁ డెన్నిరెట్లు బరువున్నదియు గుణింపవచ్చును. ఆవిధముగనే గ్రహములనుబట్టి యుపగ్రహముల యున్నానము తెలియును. ప్రతిగ్రహమును సూర్యునివలననే గాక తక్కినగ్రహములచే నాకర్షింపఁబడుచున్నది కాన దానికక్ష్యయందు గణితసాధ్యము లగువైషమ్యములు పుట్టుచున్నవి. ధూమకేతువులను సూర్యకేంద్రికమండలములలోని వని యితఁడు సాధించెను. కేంద్రాకర్షణలక్షణమునుబట్టి భూగోళమధ్యవ్యాసముకన్న నక్షము 28 మైళ్లు తక్కువ యుండు నని చూపెను. అటులే వ్యాసద్వయము తెలిసినచో గ్రహాక్షభ్రమణకాలము నిర్ణయింపవచ్చు నని నిరూపించెను. భూనిరక్షదేశప్రాంతములు సూర్యచంద్రుల యాకర్షణమునకు లోనగుటచే భూమ్యక్షము చలించుటవలన నయనచలనము సంభవించు నని సమర్థించెను. ఆవిధముననే సముద్రమందుఁ బోటును బాటును బుట్టుచున్న వనెను. ఈపోటుం బాటులం బట్టి చంద్రోన్నాన

మాతఁడు నిశ్చయించెను. న్యూటను తనకుఁ బూర్వము కంటితోఁ జూచిన ఖగోళాంశము లన్నిటికి గణితరూపమున నుపపత్తులఁ గల్పించెఁ గాని దూరదర్శనియంత్రములం దొకక్రొత్తదూరదర్శని సృష్టించినప్పటికి, నూతన వేధ లేమియుఁ గావింపలేదు. కాకున్న నాతఁ డెన్నియో నవ్యచిత్రముల గుర్తించి యుండెడివాఁడు. ఈపని నాతనితర్వాతివారు నిర్వర్తించిరి. వారిశోధనల నన్నిటిని బ్రత్యేకప్రత్యేకముగఁ బరుసక్రమమున వర్ణించుట జ్యోతిశ్శాస్త్ర చరిత్ర వ్రాయుటయే యగును గావునను, నీవ్యాసమునం దిదివఱకె తప్పనిసరి యగుటంబట్టి ముఖ్యపురుషులఁ బేర్కొనుటచేతను నీకఁబరుసనామములు శ్రోతలకు విసువుఁ బుట్టించు ననుభయమున నానాశోధనల ఫలితార్థముల మాత్రము చెప్పి నేఁటికి జ్యోతిశ్శాస్త్ర మేస్థితియం దున్నదో ప్రదర్శించెదను.

దూరదర్శినితోఁ జూచినప్పుడు బృహస్పతి మండలమునకు నాలు గుపగ్రహము లున్నట్లు తెలిసెను గదా. అందు మొదటిది ప్రధానగ్రహము చుట్టుఁ దిరుగునపుడు గ్రహణము పట్టుచుండును. ఆగ్రహణమునకు గ్రహణమునకుఁ గలయంతరమే యుపగ్రహపరిభ్రమణకాల మగును. కాని యీపరిభ్రమణకాలము వేసవికాలమునం దొకవిధముగాను శీతకాలమునం దొకవిధముగాను గానిపించెను. భూమి సూర్యునిచుట్టుఁ దిరుగునపు డొకకాలమున బృహస్పతికిఁ జేరువగను మఱియొకప్పుడు 30,00,000 మైళ్లదూర మెక్కుడగ నుండును గాన యీపరిభ్రమణవ్యత్యాసము ప్రకాశ మీ 30,00,000 మైళ్లు వ్యాపించుటకుఁ బట్టుకాలాంతర మగు నని నిశ్చయించిరి.

ఆకాలాంతరము 15 వికల లగుటచే వెలుతురు 15 వికలలో 30,00,000 మైళ్లు వ్యాపించు ననఁగా వికలకు 2,00,000 మైళ్ల ప్రయాణ మగుచున్నది. వెలుతురు వ్యాపించుటకు సావకాశము కావలయును గనుక వెలుతురు ప్రయాణదిశయు, భూప్రయాణదిశయుఁ జేరి నక్షత్రములు మొదలగువాని స్పష్టదిశలు వాస్తవదిశలు కాఁగూడదు. ఇదియు నిజమె. క్రాంతివృత్తమునందలివియుఁ, దక్షేత్రమునం దుండునవియు నగుతారాగణము లన్నియు నొకసంవత్సరములోఁ గొంచెము ముందునకు వెనుకకు 20॥ 9 వికల లీవలావల మధ్యస్థితి నూఁగుచున్న వనియుఁ, గ్రాంతివృత్తమునకు 90 యంశ లంతరమున నున్నవి 20॥ 9 వికలలు వ్యాసార్థముగా వృత్తగతిని గన్పించుననియు నీరెండింటికి మధ్య గలవి 20॥ 9 దీర్ఘాక్షముగ దీర్ఘవృత్తములఁ దిరుగునట్లు స్ఫురించుచున్న దనియు దూరదర్శినిచే శ్రద్ధగాఁ బరిశీలింపఁగ స్పష్టమయ్యెను.

అంతేకాక యీయాస్పష్టగతి గణితముచే సాధింపఁగా సిద్ధించుదానికన్నఁ గొంచె మెక్కువగఁ జూపట్టుచు, సంవత్సరమితములో మార్పు లన్నియుఁ బూర్తి కాక, పందొమ్మిదివత్సరములలో నగుచుండునట్లు తెలిసెను. ఈ వైషమ్యము నకుఁ గారణము, ముందున కుబ్బియున్న భూనిరక్షదేశములఁ జంద్రుఁ డాకర్షించుట యని గణితమూలమున విశదమయ్యెను. అటులు గలుగుచున్న చంద్రాకర్షణమున భూమ్యక్షము కంపించుచున్నది. ఈకంపనము 19 సంవత్సరముల కొక డోలనముఁ గావించుచున్నది. ఈశోధనలవలన నాకర్షణసిద్ధాంతము స్థిర పడెను. భూమియందలి స్థూలపదార్థము లీయాకర్షణమున నెట్టికర్మశాస్త్రనియమ ములకు బద్ధము లగుచున్నవో గ్రహములు నానియమములకు నట్లే బద్ధము లగుచున్న వని నిశ్చయముగఁ దేలెను.

వ్యావహారికకర్మశాస్త్రము గ్రహములయం దుపయోగించుటవలనను గ్రహ ములన్నియుఁ గఠినపిండము లని యుద్దేశించుట వలనను గణితముచే బ్రహ్మాండ మునకు విచ్ఛిత్తి లేదనియు, గ్రహములయందుఁ గలుగుచున్న పరమక్రాంతిచల నము మొదలుగాఁగల పరిణామము లన్నియుఁ బునరావృత్తిగ నడచుచుండు ననియు 18,000 సంవత్సరములకుఁ బూర్వము భూకక్ష సమగ్రవృత్త మనియు, నప్పటినుండి 86000 సంవత్సరములకు ననఁగా నిప్పటినుండి 68000 సంవత్సర ములకు మఱల నది సమగ్రవృత్త మగు ననియు, నటులే పరమక్రాంతియు 27 అంశలుమొదలుగ 20 వఱకుఁ దగ్గుచుఁ, బెరుఁగుచు మాఱుచుండు ననియు నిరూపించిరి. కాని యీగణితమునందు గ్రహములు కఠినపిండము లనుకొనుట వాస్తవమునకుఁ గొంచెము భిన్నముగ నుండుటవలనఁ దచ్ఛవితార్థము సైతము స్థూలనిర్ణయముగ గ్రహింపవలయును.

గ్రహగోళము లన్నియు, బాహ్యమున జలవిభాగమును, నంతరమున ద్రవరూపలోహాదిద్రవ్యములు గలిగియుండి సంపూర్ణకఠినములు గావు కాన నొక దాని నొకటి యాకర్షించుకొనునపుడు వానియం దుత్తుంగతరంగములు లేచి వాని వేగమును గొంతవఱకుఁ జంపుచున్నవి. అటు లగుటవలననే, చంద్రునివడి తగ్గి యెల్లపు డొకబింబభాగమే మనకుఁ గన్పించుచున్నది. అటులే భూదిన ప్రమాణమును గ్రమక్రమముగా వృద్ధియైనది. పూర్వకాలమునందు ననఁగా నేడెనిమిదివేలసంవత్సరములకు వెనుకఁ బట్టినగ్రహణము లేగంటకుఁ గన్పించిన వో లిఖించియుంచిన ప్రమాణములఁ గైకొని ప్రస్తుతభూచలనముంబట్టి యాగ్ర హణకాలముల గుణించి గణితాగతకాలము నాకాలముతోఁ బోల్పఁగ భూదిన

ప్రమాణవృద్ధియుఁ జంద్రగమననిరోధమును సువ్యక్తము లైనవి. మఱియు నొకానొక కాలమునఁ జంద్రభూములు సమీపమున నుండి భూమియందు మహాతరంగములు లేచుటవలన నుపరితల మంతయు జలప్లావిత మగుచుండె ననియు నందువలననే భూమి నెంతత్రవ్వినను నానాఖనిజములు పొరలు పొరలుగా నేర్పడి యుండినట్లె కనఁబడు ననియు భూగర్భశాస్త్రజ్ఞులు చెప్పుచున్నారు. ఇంకను బూర్వమునకుఁ బోయినచో, భూమి ద్రవావస్థ నుండె ననియు, నప్పుడది మూఁడుగంటలకాలములోఁ దిరుగుచుండె ననియు నపు డాభూమినుండి యెనుబదవభాగ మొకపూసవలె విడిపోయి చంద్రమండల మయ్యె ననియుఁ దెలిసెను.

పైనఁ జెప్పినటులు భూమండలమున దినము పెఱిగి పెఱిగి, ప్రస్తుతమాసమంత ప్రమాణము గల దగును. అప్పుడు చంద్రుఁడు భూమియు నొకకఱ్ఱ కతికిన రెండుగుండులవలెఁ దిరుగుచుండును. అందు భూమియందు సూర్యాకర్షణము వలన భూవేగ మింకను దగ్గి క్రమక్రమముగాఁ జంద్రమండలము భూమిని సమీపించి పూర్వ మెచ్చట నుండి వచ్చినదో యాభూమినె మఱల వ్రాలును. ఇట్లగుట కెన్నిమహాయుగములు పట్టునో చెప్ప నలవికాదు కాని యీమహావిప్లవము దైవగతి నేయభ్యంతరము గలుగకున్నచో వచ్చితీరును.

ఇట్టిప్రళయ మొకటి మన కన్నులయెదుటనే గూడుకొనుచున్నది. అంగారకగ్రహచంద్రులలోఁ బ్రధానచంద్రుఁడు దానికి నాలుగువేలమైళ్లదూరమున నుండి 7½ గంటలలో భగణముఁ బూర్తి చేయుచున్నాఁడు. అంగారకుఁడో 24½ గంటలలో నక్షప్రదక్షిణము గావించుచున్నాఁడు. అట్లగుటచే నంగారకుఁడు తనచంద్రుని దగ్గఱకు లాగుకొనుచున్నాఁడు. ఎప్పుడో యొకప్పు డాయుపగ్రహము మహావేగముతో వచ్చి నంగారకప్రపంచము జల్లుమనునట్లు కొట్టుకొనును.

ఇదివఱకుఁ దెలిసిన గ్రహములయందలి విశేషములమాత్రము గ్రహించుటకే కాక దూరదర్శినిసహాయమున నూతనగ్రహములఁ గనుఁగొనుటయు సంభవించుచున్నది. 13-వ మార్చి 1781-వ సంవత్సరమున మిథునరాశియందలి నక్షత్రముల వేధించుచుండఁగా నొక తేజఃపిండము గనఁబడెను. దానిని మొదట ధూమకేతు వని భ్రమసిరి కాని జ్యోతిర్విదులు దానిస్థితిపరంపరల నిదానించి యది కొంచె మించుమించుగా వృత్తకక్ష్యయందు నడచు ననియు, సూర్యునినుండి, శని యెంతదూరమున నుండునో శనినుండి యది యంతదూరమున నున్న దనియు

భూమికన్న నూఱురెట్లు పెద్ద దనియు దానికి నాలు గుపగ్రహము లున్నవనియు గన్గొనిరి. దీనికి వరుణమండల మని పేరిడిరి.

ఈవరుణగ్రహమును వేధింప వేధింప దానికక్ష్యామార్గమునఁ గొంచెము గతివైషమ్యము లున్నవని తెలిసెను. దాని కీవల నున్నగ్రహగోళముల యాకర్షణ మంతయుఁ జూచిన నట్టివైషమ్యమును గలిగింప నేర వని గణితజ్ఞులు వెంటనే నిశ్చయించిరి. కావున నీగతివైషమ్యములకుఁ గారణ మావల నింకొక గ్రహ ముండవలయునని కొందఱు చెప్పిరి కాని గణితజ్ఞులు మొదట దాని నొప్పరైరి. చేయవలసినది యొకానొక గ్రహగతియందుఁ గలుగుగతివైషమ్యములు తెలియఁగా నిట్టిగతివైషమ్యములు గలిగించు గ్రహ మెచ్చట నున్నది? దాని పరిమాణ మెంత? దానివత్సరప్రమాణ మెంత? యను ప్రశ్నలకు సమాధానము. ఈ ప్రశ్నల కన్నిటికి సమాధానము నాకర్షణసిద్ధాంతము నాధారము గావించికొని గణితజ్ఞులు చెప్పితీరిరి. వరుణగ్రహమందుఁ గలుగుచున్న గతివైషమ్యమును బట్టి యావల నున్ననూతనగ్రహ మెచ్చటఁ జూచినఁ గనఁబడునో యే తేదిని చూడవలయునో ముందుగా నిశ్చయించిరి. ఆనాఁడు దూరదర్శినియంత్ర మాదెసకుఁ ద్రిప్పుటయు నచ్చట నూతనగ్రహము కనఁబడెను. దానికిఁ గక్ష్యాకృతి, దూరము, వత్సరప్రమాణము నన్నియు వెంటనే నిర్ణయింపఁబడెను. దీనినిబట్టి యాకర్షణసిద్ధాంతమును, దూరదర్శినిప్రయోజనము నేక కాలమున స్థాపింపఁబడినవి. ఇది 23-వ సెప్టెంబరు 1846 నాఁటివృత్తాంతము. ఈ గ్రహమునకు నభస్థాణుఁ డనిపేరు. ఇటులు గొందఱిమతమున ఛాయాగ్రహములు గ్రహములు గావన్నను నవగ్రహసంఖ్యాసంపూర్తి యగుచున్నది.

గ్రహసంచారముల గుఱించియు వానియందలి విశేషముల గుఱించియు బ్రధానాంశములఁ గొంతవఱకుఁ బ్రదర్శించిరి. ఆకర్షణసూత్రములు భూమియందును, గ్రహగోళములందుమాత్రమే కాక నక్షత్రములందు సైతము వర్తించుచున్న వని దిగ్మాత్రముగఁ జెప్పి వదలెదను. ఎంత సూక్ష్మ దూరదర్శినిం బ్రయోగించి చూచినను నక్షత్రములు మాత్రము చిన్నచిన్న చుక్కలవలెఁ గంటితోఁ జూచినట్లె కానిపించును. మఱియు వానిని భూమినుండి చూచినను నభస్థాణునుండి చూచినను నొకవిధముగానే యుండును; అనఁగా, సూర్యకేంద్రికప్రపంచ మంతయుఁ దారాగణముతోఁ బోల్చిన త్రసరేణుతుల్య మని యర్థము, అయినను భూమి నిజకక్ష్యామార్గమున వేసవికాలమునం దున్నస్థానమునకు శీతకాలమునాఁటికి 1840 లక్షలమైళ్లెడముగ నుండును గాన నింత

దూరభేదముచే నక్షత్రపరస్పరాపస్థితియందింముక భేదము గానిపించును. ఈ భేదమునుండి భూకంపనాది సంస్కారములు గావింప నింకను శేషము మిగిలెనేని యది నక్షత్రమునందు స్వతశ్చలనముచేఁ గావలయును గానఁ బండితు లీపట్టున శోధనలఁ గావించి నక్షత్రములయందే మైనఁ జలన మున్నదా యని శోధించిరి. అటులు చేయుటచే నక్షత్రములందును జలన మున్నదనియే నిశ్చయ మయ్యెను. రాజహంసగణములోని దొకటి వికలకు 200 మైళ్లచొప్పునఁ బోవుచున్నట్లు తెలిసెను. మృగవ్యాధనక్షత్ర మన్ననో మఱియొక నక్షత్రముచుట్టు 50 సంవత్సరముల కొకమాఱు దిరుగుచున్న దని నిశ్చయించిరి, కాని, యా రెండవనక్షత్రము ప్రకాశహీన మగుటఁ గానిపించుట లే దనియు, శ్రద్ధతోఁ జూచిన నది కనఁబడి తీరు ననియు బెస్సెల్ చెప్పెను. ఆవిధముగనే, 1862 సంవత్సరములో నొకదూరదర్శనీకారుఁడు తాను సిద్ధముచేసిన యంత్ర మెటు లుండునో యని మృగవ్యాధమునకుఁ ద్రిప్పగ బెస్సెల్ చెప్పినచోట నా రెండవనక్షత్రము ప్రత్యక్ష మయ్యెను. ఇటులే కాంతిహీనములై భూమ్యాదిమృత్పిండములవలెఁ జల్లారిన మండలము లీనక్షత్రముల కున్నవనియు నింకమీఁద జ్యోతిర్విదులు ప్రయత్నించి తారాజ్యోతిషము వ్యాసంగము చేయవలయు ననియు గణితజ్ఞ ప్రముఖుల యభిప్రాయము.

నక్షత్రములే కాక మందాకిన్యాది నైహారిక మండలము లెన్నియో కల వనియు గోళము లన్నియు నట్టినైహారికమండలములనుండియే యేర్పడిన వనియు నిశ్చయించిరి. ఈసిద్ధాంత మింకను బ్రారంభావస్థయందే యున్నది. ఈనీహార మండలములనుండి ప్రపంచోత్పత్తి యెటు లగుచున్నదో గణితముచే సాధించి నిరూపింపవలయు భారము గణితజ్ఞులపై నున్నది.

సూర్యుఁడు తక్కినక్షత్రములవంటి నక్షత్రము గావునను నక్షత్రములు తీవ్రవేగమునఁ జరించుచున్నవి కావునను, సూర్యమండలము సైతము తదవబద్ధ నవగ్రహ నవగ్రహావబద్ధ బహూపగ్రహసమేతమై సంసార మంతటితోఁ బ్రయాణము గావించుతీర్థయాత్రికునివలె నెచ్చటికైనఁ బోవుచున్నదా యని విమర్శించిన వారు లేకపోలేదు. తిన్నని బాట కీవలావల బహుసాంద్రవృక్షము లున్నపుడు మునుముందున కేగుకొలఁదిఁ జెట్లిడమగునట్లు తోఁచుటయు వెనుక నున్నవి మూసికొనిపోవుచున్నటు లుండుటయు ననుభవమేగదా? అటులే నరవత్సరసంవత్సరమును హెర్క్యులీసుమండలమార్గమున కీవలావల నక్షత్రపంక్తులు విప్పారుటయుఁ దద్దక్షిణాగ్రమునం దున్నవి మూసికొనుచున్నట్లుండుటయు గానిపించు

చున్నందున సూర్యప్రపంచము హెర్క్యులీసుదగ్గఱ కేగుచున్న దని యూహించుచున్నారు. ఇంకను వేధింపఁగా నీసూర్యకేంద్రికవర్గ మేనక్షత్రముచుట్టుఁ దిరుగుచున్నదో తెలిసికొనవచ్చును.

గణితశాస్త్రమునం దింతటివఱకుఁ బుట్టినవింతల గుఱించి కొంచె మస్మద్బాంధవు లగునీసదస్యులకు విన్నవించితిని. ప్రస్తుత మీాకెస్టిక్ పండితుఁడు గురుత్వాకర్షణాది సిద్ధాంతము నే వేఱొకమార్గమునఁ బ్రదర్శించుచున్నాఁడు. వెలుతుటికి స్థూలత్వము నున్న దని చెప్పుచున్నాఁడు. ఈ సిద్ధాంతము గడచిన సంపూర్ణసూర్యగ్రహణావసరమున ధ్రువమైనది. దానిని బట్టి, వెలుతు రవకాశములోనికిఁ బ్రవహమార్గమునఁ బోవునప్పు డెచ్చటనో నూతనపదార్థమును గల్పించు నని చెప్పుచున్నారు. దీనినిబట్టి లోకము లన్నియుఁ దేజస్సుననుండి పుట్టినవా యనుశంక బయలుదేఱినది. దానితో సృష్టిస్వరూపము సుగమమగునో యని పరతత్త్వాన్వేషణపరులు వేచికొనియున్నారు.

ప్రపంచ మిటులు శాస్త్రజ్ఞానమున దినదినాభివృద్ధిఁ జెందుచుండ మనవారు తవ్వగొట్టముతో గ్రహవేధ చేయవలయునా, లేక దూరదర్శిని నుపయోగింపవచ్చునా యుపయోగించినఁ బ్రాచీనవచనముల కేమైన వ్యాఘాతము రాదు కదా, యటులైనఁ బ్రాచీనులంద ఱొక్కమా రథఃపతనముఁ జెందరుగదా యని త్రొక్కుడు లాడుచుందురు కాఁబోలు! ఇప్పటికైనను 16-వ శతాబ్దాదిగ నావరించియున్న గాఢనిద్ర వదలి బాహువుల జాడించికొని సంపూర్ణజాగ్రదవస్థను మనవారు కార్యోన్ముఖు లయ్యెదరో లేక యొకమాఱు మూల్గి కాలుసేతులు ముడిచికొని మఱింత గట్టిగ నిదురించెదరో యెవరు చెప్పఁగలరు?

ధేరం వేంకటాచలపతి.

ప్రవాహమును బరీక్షించియుందురు. అట్టివారు తచ్ఛకలప్రవాహాద్యూహములకుఁ బెక్కుమడంగు లెక్కుడు కాంతులు గలసోమునితొలుకారుమెఱుఁగులతోఁట యెట్లుండునో యూహింపఁగలరు. అట్టితోఁటలో నాడెడు 'రాయంచ' యఁట! కన్నుల మిఱుమిట్లుగొలుపుచుఁ జూడ శక్యముగాక, మనస్సుచేతనే యెఱుఁగఁదగిన యామెఱుఁగులతోఁటలోఁ దనయాట సైతము దోఁచునట్లు ప్రకాశించు 'రాయంచ' యెట్లుండునో యూహించుట కెట్టిమనోనిశ్చలత యుండవలయునో కదా? ఆరాయంచయో! 'శౌరము' యఁట!

తప మొనర్చుచున్నవాఁడు శ్రీకృష్ణదేవుఁడు. ఆతఁ డనిమిషులచేతను, యోగదృష్టిగల సంయమీంద్రులచేతను గొలువఁబడుచున్నాఁడు. అట్టివానికి వరమీయ నేగుదెంచుపరమేశ్వరుఁడు, తన నిండు తేజముతో,

'నీలతోయదమధ్యస్థ' ము లగు 'విద్యుల్లేఖా' పరంపరల కాంతిపుంజము లందలఁపించుచు, "సీ. పా. ఎవ్వనికాంతియం దీసూర్యచంద్రులు, మెఱుఁగు డుఁబురువుల క్రొమెఱుఁగఁబడుదురు" ఇత్యాది వాఙ్మనసాతీతము లగుమహిమల వర్ణించుపద్యములను జ్ఞప్తికిఁ దెచ్చుచుఁ బ్రత్యక్షుఁ డయ్యె నని వర్ణించుట యెంతయుఁ బ్రకరణోచితమై యున్నది.

శంకరుని జటాజూటమున నున్నగంగను, ఒకకవి 'ఔఁదలచదలేఱుగాను, రెండవవాఁడు తొలుకారుమెఱుఁగులతోఁటగాను గ్రహించిరి. ఇట్లే తక్కినవియు నెఱుఁగవచ్చును.

ఆశ్వా. xvii. "సీ.పవనవేగవిశీర్ణపాదపాగ్రంబులజడియకుండఁగఁబట్టుసామజములఁ బూజార్థనియమితపుష్పమాలికలపై మధుకరంబులఁ జోపుమర్కటములు నవభృథస్నానపర్యంతనిర్మలతకై కాసారములఁ గాచుకాసరములు నిజనిజోటజభాగనీవారసీమలఁ జొరక కావలియుండుసూకరములుఁ గలిగి కంసవైరికన్నులపండువై, చెలువుమిగిలెఁ బూర్ణకలశవిగళ దాలవాలవారిహారితస్నునిదారి, కాశ్రమంబు బదరికాశ్రమంబు."

యెందఱుకవులు ఋష్యాశ్రమముల వర్ణించినను నొకశే యచ్చు? అందలి మహర్షు లెంతముక్కుమీఁదఁ గోపము గలయుగ్రస్వరూపు లైనను, వారియాశ్రమమునఁ గలజంతువులు మాత్రము తమనైసర్గికస్వభావమును విడిచి శాంతస్వరూపములై యుండును. అని శర్మగారు సోమునినే కాక సంసారబంధములఁ దెగఁగోసికొని యడవులం దపమాచరించు మునీంద్రులను సయితము దిట్టినారు.

ప్రత్యు. సోమనాథుఁ డెందఱాంధ్రకవులపద్యములనుండి యీయచ్చును దీసెనో! నన్నయ కణ్వాశ్రమమును గాళిదాసువర్ణనలం దలంచికొని వర్ణించి నాఁడు. సోముఁడు భట్టారకునిపద్యమునకు మెఱుఁగుపెట్టినాఁడు. ఇది ప్రకరణోచిత మగునో కాదో విచారింతము.

శ్లో. పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే.

అని భారతమునఁ జెప్పఁబడినట్లు, సాధుజనరక్షణార్థము ద్వాపరయుగమునఁ బుడమిపై నవతరించిన శ్రీకృష్ణుఁడు, పూర్వము పలుసారులు బదరికావనవాసులకు నరకాదిదుష్టరాక్షసులవలనఁ గలిగినబాధలను మాన్పి వారిని సుఖస్థితిం బ్రవేశపెట్టియున్నాఁడు. మఱియుఁ జిరకాలమునకు నయ్యాశ్రమమును జూడ మఱల నేఁగుదెంచుచున్నాఁడు. అట్టి శ్రీకృష్ణునకు నిప్పు డయ్యాశ్రమ మెట్లు గోచరింపవలయును?

దుష్టమృగములు సయితము తమవికారచేష్టలు మాని యామునీంద్రులకు విధేయములై పూజాద్రవ్యముల కేనియు నెగ్గువాటిల్లకుండ సేవ యొనర్చుచున్నట్లును, మునికుమారికలు దుష్టదానవులవలని బాధలు మఱచి స్వేచ్ఛగ మెలంగుచు నాశ్రమవృక్షములపాదులకు నీరుపోయుచు నుండినట్లును జూపట్టవలదా? అయ్యాశ్రమస్థితిం జూచి దూరమునుండియే శ్రీకృష్ణుఁడు జపహోమాది క్రియలకు విఘ్నములు లేకుండ మునీంద్రులు సుఖమున్నారు గదా యని తెలిసికొని యానందింపఁగలఁడు. కవి దీనిని రచించునప్పుడు——

శ్లో. "రమ్యా స్తపోధనానాం, ప్రతిహతవిఘ్నాః క్రియా స్సమవలోక్య
జ్ఞాస్యసి కియద్భుజో మే, రక్షతి మౌర్వీకిణాంక ఇతి."

అను నభిజ్ఞానశాకుంతలములోని శ్లోకమును మనమునఁ దలంచికొనె నని తోఁచెడి.

ఇట్టి సాహిత్యరసపోషణసంవిధానమును నిందించి, "ఈకవిసమయమును దాఁటిన పాపమునఁ బోయిన యొకరిద్దఱిలో నెఱ్ఱనయు నొక్కఁడు" అని శ్రీశర్మగారు వ్రాసియున్నారు. ఆతఁ డట్టిపాపమునఁ బోయెనో లేదో చూతము. మఱియు,

"స్వాభావికవర్ణనములను జేయుటలోఁ గవిత్రయమువారు పెట్టినదే భిక్షము. ఆశక్తి సోమునివంటివా రెందఱు తపము చేసినను రాదు" అని వారు వ్రాసిరి.

కవిత్రయమువారి గ్రంథములయందు మాత్ర మతిశయోక్తివర్ణనలు లేవా? స్వాభావికవర్ణనములు సోముని గ్రంథమునమాత్రము లేవా? మహాకవులు చదువరుల మనముల రంజించుపొంటె ననేకవిధములగు వర్ణనము లొనర్చి భిన్నరుచులను జూపుచుందురు. వానినెల్ల వివరించుట పిష్టపేషణ మని యెంచి, నన్నయ యెఱ్ఱనలు రచించిన (సోముని యుస్వాభావికవర్ణనమువంటి) వానిలో నొక్కొక దానిని వ్రాయుచున్నాను. (నన్నెచోడుని కుమారసంభవమునను నిట్టివి గలవు)

నన్న. సీ. "శ్రవణసుఖంబుగా సామగానంబులు సదివెడుశుకములచదువు దగిలి
కదలక వినుచుండుకరులయుఁ గరికరశీతలచ్ఛాయఁ దచ్ఛీకరాంబు
కణములచల్లనిగా డ్పానపడి వానిఁ జెందిసుఖంబున్న సింహములయు
భూసురప్రవరులు భూతబలుల్ దెచ్చి పెట్టునీవారాన్నపిండతతులు
గడఁగి భక్షింపనొక్కటఁ గలసియాడు, చున్న యెలుకలపిల్లుల నొండుసహజ
వైరివర్గంబులయు సహవాస మపుడు, సూచిమునిశక్తి కెంతయుఁ జోద్యమంది.

(ఇందు మునులప్రభావము సెప్పంబడినది. అందు శ్రీకృష్ణదేవుని పరిపాలనమహిమ సూచింపఁబడినది.) నృసింహపురాణములో—

ఎఱ్ఱన. సీ. "హరిభూతభావిదివ్యావతారంబులఁ గీర్తనం బొనరించుఁ గీరసమితి
సప్తసామములు సస్వరముగ మునికోటిఁ జదివించుఁ గోకిలసముదయంబు
శ్రీకాంతుకమనీయశృంగారలావణ్యకథలు పేర్కొను శారికాగణంబు
ప్రణవమంత్రోన్నాదపరిపాక మింపార నభ్యాస మొనరించు నళికులంబు...."

సోముని కాలమునాఁటి కాతని పద్యమే యాంధ్రభాషయందుఁ గ్రొత్తరకమైన యచ్చు. పిమ్మటి కవులు వ్రాసినవానిం గాంచి యాతని నాక్షేపింపరాదు.

విమర్శకునకుఁ బక్షపాతరాహిత్య ముండవలయును. పక్షపాతము మనంబున నుండెనేని యన్నియు దోషములే! ఆక్షేపించుతలంపే పొడమునెడ నెఱ్ఱన స్వాభావికభిక్షు మనునదిమాత్రము నిలుచునా?

సీ. "తరువిటపాసక్తధౌతవల్కలపంక్తి కమనీయతోరణకల్పనముగ
హూయమానంబులై యొండొండ వెలిఁగెడు త్రేతాగ్ను లభినవదీపములుగ
దుగ్ధపానంబునఁ ద్రుళ్లు పెయ్యలనోరి నురువులు సితపుష్పవిరచనలుగఁ
గోరి నీడంబులు సేరెడిఖగముల వాసితంబులు జయధ్వానములుగఁ
దనసమాగమోత్సవమునఁ దగినసుఖము, లప్రయత్నసిద్ధములుగ నతిశయిల్లు
మునిజనాశ్రమరేఖ నవ్వనజనాభుఁ, డర్థిఁ దఱిసి యం దొకరమ్య మైనచోట."

ఇది మిక్కిలి రమణీయమైన పద్యము. పురోభాగిత్వమే వహించుచో నిందుమాత్రము శంకలు దోఁపవా? "కట్టి విడిచి యుదికి యారవేసిన గుడ్డలు తోరణాలు! పర్ణశాలలోని మంటలు దీపాలు! పెయ్యలనోటియెంగిలి నురువులు పుష్పములు! -- ఆహా! ఏమి! శ్రీకృష్ణుని దారిద్ర్యభోగము! సోముఁ డిట్టిదానికై తపము చేయకుండుఁగాక!" అనుట యెట్టిదో పైవ్రాఁతయు నట్టిద యగు.

పిమ్మట శర్మగారు శైలింగూర్చి కొంత వ్రాసియున్నారు. దీనింగూర్చి యతివిస్తర మేల? శైలిని మెచ్చుకొనుట పాఠకునిహృదయంబును బట్టి యుండు నని పలువురు పండితు లింతకుమున్నే వ్రాసియున్నారు. కొందఱకు నన్నయ వ్రాఁత ప్రియము; కొందఱకుఁ దిక్కనది; కొందఱకు సోమనది: కొందఱకుఁ బోతనది; కొందఱకు శ్రీనాథునిది; కొందఱకు సూరనది; కొందఱకు రామకృష్ణునిది; కొందఱకు రాయలది; కొందఱకు రామరాజభూషణునిది; ----- ఇట్లే, ----- "లోకో భిన్నరుచిః" అని యున్నదికదా! సోమనాథునిశైలి నిరుపమానమును, నిరవద్యమును, నిర్దుష్టమును, మనోహరము నని చెప్పుట కంటె దానిం గూర్చి వేఱుగ వ్రాయ నక్కఱలేదు. శైలియందుఁ దిక్కనయు నాతని మీఱలేఁడు. తక్కిన యెల్లవిషయములఁ దిక్కనతరువాతికవి యితఁడే.

"వేయేల? సర్వవిధముల నిరవద్యము లగు కవితాలక్షణములకెల్ల నాలవాలభూతులు కవిత్రయమువారే. అట్లు లేకున్న నాంధ్రప్రపంచ మంతయు వారినే పరమప్రమాణభూతులనుగా నమ్మియుండుటకుఁ గారణము లేదు." అని శ్రీశర్మగారు వ్రాసిరి.

కవిత్వ(ముయొక్క) నిర్దుష్టతకే వారు పరమప్రమాణభూతు లని యాంధ్రప్రపంచము వారిని నమ్మినదిగాని వారిశైలికిఁ గాదు. శైలిని నమ్ముట యెట్లు? ఎవరి శైలి వారిది. నిర్దుష్టతయందు నాచనసోమనాథుఁ డేవిషయమునను వారికిఁ దీసిపోవువాఁడు గాఁడు. "విశేషించి శైలి మొదలగు వానియందు వారి నాతఁడు మించుచున్నాఁడు." అని పలువు రింతకు మున్న వ్రాసియేయున్నారు.

xviii. ఆక్షే. "నలాహాకంబుం బోలెఁ గరకాస్పదంబై, కుంజరంబుం బోలెఁ గుంభాభిరామంబై, రంగస్థలంబుం బోలె శైలూషశతరమ్యంబై ---" ఇత్యాది కేవలకల్పనాధారము లగు వాక్యములు పైకెంతమనోహరంబుగఁ గాన్పించినను, లోనఁ జూచితిమేని నిస్సారములుగ నుండును." అని శర్మగారు వ్రాసిరి.

ఆధునికాభిప్రాయమును బట్టి వీరు చేసినయీయాక్షేపమిప్పుడు నిందనీయము గాదు. కాని, యీయనసారపువ్రాఁత, కవిత్రయమువారికి, సందును మిక్కిలిగ నెట్టినను, ససారముగనే తోఁచియుండెను. చూడుఁడు. ఎఱ్ఱాప్రెగ్గడ—

వ. - - - - "వేదంబునుంబోలె ననేకశాఖావలంబి ద్విజగణసేవ్యంబును, జలధ రంబుసుంబోలె గగనాచ్ఛాదనాభోగంబును శైలంబునుంబోలె బహువాన పరివేష్టితంబును - - - (ఇం దింకను గలవు.") హ. పూ. ప.

వ. - - - - "శైలంబులుంబోలె సమున్నతశృంగంబులును, [illegible] బంధురస్కంధంబులును, చంద్రకిరణంబులుంబోలె బహువిసర్పితంబులును - - - - - - (ఇం దింకను గలవు) హరి. పూ. ప.

నన్నయ వ. - - - - "ఉద్యానవనంబునుంబోలె బహువిద్రుమాలంకృతం బైనదాని, నాటకప్రయోగంబునుంబోలె ఘనరసపాత్రశోభితరంగంబై నదాని - - - - - -" ఆదిప. ద్వి. 28 వ.

తిక్కన—వ. - - - - వివేకరహితహృదయంబునుంబోలెఁ దమోదూషితంబును విదగ్ధవనితాప్రేమంబునుంబోలె దుర్నిరూపంబును, "విరాటప. ద్వి. 325 వ. "

ఇట్టివి సంస్కృతవాఙ్మయంబునందును గొదలేక యున్నవి. వానివివరణ మప్రస్తుతము.

ఇఁక శ్రీశర్మగారివ్యాసముసందలి యొకపద్యమును (ఎఱ్ఱనదానిని) గూర్చిన వ్రాఁతను జూపి విమర్శభాగమును ముగించెదను.

"ఉషగన్నట్లు లనిరుద్ధుఁడును మొదలే కలగన్నాఁడు. తనకునాసు నా కన్యయందుఁ దవిలినది. గంభీరభావుఁడు గావున తనభావము నొరులు కెఱుఁగ పడనీక మెలఁగుచుండెను. ఆతనిం గొనిపోవచ్చిన చిత్రరేఖ యుషానియవస్థను వర్ణించుపద్యముం జూడుఁడు! (ఎఱ్ఱనహరివంశము)

సీ. బలిమికోలున నవ్వుదళుకొత్తినను మొగం బెల్లఁ దానైయున్న నెల్లనసము
ధీరతదెచ్చికోల్ పొందినఁ బలుకులయందు నద్దదిక వాయంగలేదు
గరువంపుఁజూపులఁ బరికొనియున్నను రాగ మేతెరువున రాదు చేనఁ
జేతులు వేడుకచేఁతలకై చక్కఁ బచరించినను నచ్చుపడదు చేష్ట
యితనిచిత్తమెవ్వతయేని చతురయొకతె, గొన్నయది దైత్యనాథునికూఁతు రితనిఁ
బొందినట్టులయితనికిఁబొందుగలుగఁ, బోలుదైవికమయ్యునవ్వోలఁతియందు."

ఈపద్యము నుదాహరించి శర్మగారు, "ఇట్టిపద్యమును దిక్కనతప్ప నితర కవులెవ్వరును వ్రాయతే రని చెప్పసాహసించెద" మనిరి. ఈపద్యము బాగుగ

లేనని నేను జెప్పఁజాలను గాని యంతపొగడిక యతిశయోక్తిలోఁ జేసెనేమో యని చెప్ప వెఱచుచున్నాను.

సైపద్యములోని రెండవపాదమునుగూర్చి వీరు "ఇందుయతిభంగము మాత్రము కాక స్పష్టముగ నర్థమును గావుటలేదు." అని పుట యధోభాగమున సూచికను వ్రాసినారు. దీనింబట్టి మొదటిపాదము వీరికర్థమైనట్లే కదా! మొదటి పాదమును జిత్తగింపుఁడు! వీరికెట్లన్వయ మైనదో! మొదటిపాదమునకంటె రెండవపాదమే సులభముగ నర్థమగుచున్నది. చూడుఁడు!

ధీరత=ధైర్యము, తెచ్చుకోల్=తెచ్చికొనుటను, పొందినన్=పొందినప్పటికిని—అని యర్థము ధైర్యముఁ దెచ్చికొనినను బలుకులయందు గాద్గద్యము తొలంగలే దని భావము. ఇఁక మొదటిపాదముం గనుఁడు! (అర్థము తరువాతఁ జూచి కొందము!)

బలిమికోలు! ఇదియేమిశబ్దము? దీనికి లక్షణమేమి? 'బలిమి' అనువిశేష్య శబ్దమునకు 'కోలు' అనుప్రత్యయ మనుప్రయుక్త మగుటకు మార్గమేది? ఎఱ్ఱన 'బలిమికోలు' అనియే వ్రాసియుండునా?

ఏలేఖకుఁడో తాను బ్రతి వ్రాయునప్పుడు మాతృకయందున్న మొదటి పాదములోనియక్షరములను సరిగా గ్రహింపఁ జాలకయో, ప్రమాదముననో 'బలిమికోలు' అని 'బలిమి' శబ్దమునకు 'కోలు' అనుదానిని జేర్పఁగా, దానిని మాతృకగా గ్రహించిన మఱియొకవ్రాయసకాఁడు, రెండవపాదమున 'తెచ్చి' యనుక్రియాపదమున కదియేల చేర్పఁబడరా దని 'తెచ్చికోల్' అని వ్రాసి యుండును. తుదకది 'తెచ్చికోల్ పొందినధీరత' యనియో, 'ధీరత పొందిన తెచ్చికోల్' అనియో మాఱఁగా, "ఈతలతిక్క యన్వయ మేల? యతివప్పినఁ దప్పఁగాక" యని యెవ్వరో స్పష్టముగా నర్థముకావుటకై 'ధీరత తెచ్చికోల్ పొందిన' యని మార్చియుందురు. ఇట్లున్నను స్పష్టముగ నర్థముకాలే దని వీరన్నారు.

ఈక్రిందిరెండుపాదములును జదివినచో నెఱ్ఱనమహాకవివ్రాఁత నిర్దుష మని విశదమగును.

సీ. 'బలిమికోల్పవ్వన నవ్వుదళుక్కొత్తినను మొగం బెల్లఁదానైనది వెల్లఁదనము
　　ధీరతఁ దెచ్చి పొందించినఁ బలుకులయందు గద్గదిక వాయంగలేదు."

పిమ్మట వీరు సోమునికవిత్వమును గొంత పొగడినారు. ఆపొగడిక యందైన నాతనియెడ దోషారోపణమును జేయక యుండలేదు. అందలి యొకవిష యము మాత్రము చూపెదను.

సోమనాథుఁడు వ్రాసినఘంటాకర్ణోపాఖ్యానములోని కొన్నిపద్యములను మీరు మెచ్చుచు, ఘంటాకర్ణుఁడు శ్రీకృష్ణునితోఁ బలుకు,

శా. ఘంటాకర్ణుఁడ నేను నాయనుజుఁ డీకాలాంతకుం డేము ము
క్కంటిం గొల్తుము కిన్నరేశుపనికై కైలాసశైలంబునన్
జంట న్వచ్చెడు సారమేయములు నీసైన్యంబులుల్ మాయవే యే
వెంటం బోయితి మేమి కాఁడవిలో వేటాడరే యెవ్వరున్?" ఉ. హ.

అనుపద్యము నుదాహరించి "ముక్కంటిం గొల్తు మనుట ప్రాసమునకై వచ్చినది - - - - ఘంటాకర్ణుఁడు పరమవైష్ణవుఁడు." అని వ్రాసిరి. ఇది పొగడు లోఁ దెగడు!

సోమనాథునివంటి మహాకవి ప్రాసమునకై పరమవైష్ణవుని శుద్ధశైవునిఁ జేయునా? ఇప్పటివా రెవరైన నొకహిందువును బ్రాసముకొఱకు సాయెబును జేయుదురా?

ఒకవేళ సోముఁ డట్లు ప్రాసమునకే వ్రాసినాఁ డనుకొన్నను 'కిన్నరేశు పనికై' అనుదానికి గతి లేదు! అది దేనితో నన్వయించును? ఇచ్చట నన్వయించుకొనుటయందు మీరు తొందరపడినారు.

"కిన్నరేశుపనికై కైలాసశైలంబున ముక్కంటిం గొల్తు" మని యన్వయము.

(పరమవైష్ణవులు మాత్రము శైవులకడ నధికారులై యుండఁగూడదా? ఉండలేదా? వారు మహమ్మదీయులఁ గొలిచినారు గారా? ఇప్పుడు మన ప్రభువులఁ గొలుచుచుండలేదా? అట్లు కొలుచుట గ్రాసమునకుఁ గాని ప్రాసమునకుఁ గాదు.)

మఱియు మూలమును జూచిన ఘంటాకర్ణుఁ డెట్టివైష్ణవుఁడో తెలియును. ఆతఁడు మొదట విష్ణునామము విననొల్లక చెవులకు గంటలు కట్టికొనిన శుద్ధశైవుఁడైయుండి పిమ్మట బోధితుఁడై పరమవైష్ణవుఁ డయ్యెను!

పైపద్యమునందలి యొకశబ్దముం గూర్చినచర్చ, యప్రస్తుత మయ్యు భాషాసంబంధముగలది యగుట, నిచ్చట సంగ్రహముగ వ్రాయఁబడుచున్నది.

శబ్దరత్నాకరమున 'వెంట' అనుశబ్దమునకు 'వేఁట' యనునర్థము వ్రాయఁబడి, పై "ఘంటాకర్ణుఁడ - - - - మాయవే, వెంటంబోయితి మేమి - - - -" అనుపద్యమే యుదాహరింపఁబడియున్నది. దీనింగూర్చి నన్నెచోడమహాకవి కుమారసంభవము పీఠికయందు,

"ఇతని(నన్నెచోడుని)కాలములో దీర్ఘముమీఁది యర్ధబిందువు, పూర్ణబిందువు గానే వాడుచున్నట్లును, కృష్ణదేవరాయలకాలమునకే యది యర్ధబిందు వయ్యెననియు నీకృతివలనఁ దేలుచున్నది. దీర్ఘముమీఁది నెఱసున్నలు సోముఁడు కూడఁ బ్రయోగించి యున్నాఁడు. చూడుఁడు.

(a) ఉ. "ఎంచినప్రేమ నీపసక మిమ్మని యిమ్మని మున్ను వేఁడుడుం
బూంచిన పూఁపుదక్కఁ బలుపోకలఁ బోవుచునుండు దేవ్రుఁడన్
డాంచిన సొమ్ముచేరె నకటా మదిఁ గోరవిసత్యభామకున్
నోంచిన వారిసొమ్ములవి నోమనివారికి వచ్చునేయిలన్. ఉ. హ. ప్ర. 167

(b) శా. ఘంటాకర్ణుఁడు నేను - - - - ము,క్కంటిం - - - - జంటన్ - - - -
వేంటం - - - - (ద్వి. 140) "ఏచుశబ్దమున నరసున్న యీయర్థమున లేదు; వేఁట, యనుటకు 'వెంట'యని రూపాంతరము స్థలాంతరమున నెచట లేదు - - -" అని శ్రీమానవల్లి రామకృష్ణకవి. ఎం. ఏ., గారు వ్రాసియున్నారు. ఆచార్యుల వారియర్థమును, కవిగారియభిప్రాయమును (రెండును) బొసఁగనివిగాఁ గన్పట్టు చున్నవి. ఏలయన,

సామాన్యముగా, పూర్వులు పూర్ణబిందుపూర్వకము లగునక్షరములను ద్విత్వసహితములుగను, అర్ధబిందుపూర్వకములగు వానిని పూర్ణబిందువుతో ద్విత్వరహితములుగను వ్రాయుచు వచ్చిరి. ఎట్లన, 'పండు' అను దానిని 'పండ్డు' అనియు, 'వాఁడు' అనుదానిని 'వాండు' అనియు వ్రాయుచుండెడి వారు ఈహేతువును బట్టి పైరెండుపద్యములలోఁ బ్రాసాక్షరములు గలశబ్దముల నీ క్రిందివిధమున మనము గ్రహింపవచ్చును.

(a) "ఎంచ్చిన, పూంచిన, డాంచిన, నోంచిన" అని పూర్వుల వ్రాఁత.
"ఎంచిన, పూఁచిన, డాఁచిన, నోఁచిన" అని యిప్పటివారి వ్రాఁత.

(b) "ఘంట్టాకర్ణుఁడు, ముక్కంట్టిన్, జంట్టన్, వేంటన్" అని పూర్వపు వ్రాఁత.
"ఘంటా - - - ముక్కంటిన్, జంటన్, వేఁటన్" అని యిప్పటి వ్రాఁత.

సావధానముగఁ బరికించుచోఁ బైరీతి నుండునక్షరములకుఁ బరస్పరము ప్రాసమైత్రి యెట్లును సరిపడ దని విశద మగును. ప్రామాణికాగ్రగణ్యుఁ డగుసోమనాథుఁ డిట్టిప్రాససాంకర్యము నొనర్చినాఁ డనుట న్యాయేతర మని విన్నవించుచున్నాను.

(a) శ్రీ రామకృష్ణకవిగారు "ఏచుశబ్దమున నరసున్న యీయర్థమున లేదు." అని వ్రాసియున్నారు. "ఈయర్థ" మనఁగా నేయర్థ మని వారియభి

ప్రాయమో విస్పష్టము గాలేదు. ఏచు = అతిశయించు, పెరుఁగు, విజృంభించు మొదలగునవి. (శబ్దరత్నాకరము)

'ఈయర్థ' మనఁగా—అతిశయించు మొదలగువానిలో నొకయర్థ మని వారి యాశయ మైనట్లు తోఁచెడిని. అప్పట్టున 'ఏచినప్రేమ' అనుచోఁ బైపద్యములలో మొదటిదానియందు సబిందుకనిర్బిందుకప్రాససాంకర్య మేర్పడును. కావున "ఎంచినప్రేమ' యనియే సోముఁడు వ్రాసియుండు నని వారి మత మైనట్లు తేలుచున్నది. సోమనాథుఁ డట్లే వ్రాసియుండు ననుకొన్నను, "ఎంచు" నకుఁ గల యర్థములలో నొక్కటియు నిచ్చటఁ బొసఁగదు. చూడుఁడు. ఎంచు=గణించు, తలఁచు, ఆక్షేపించు(?), ప్రశంసించు మొ॥ (శబ్దరత్నాకరము.)

పూర్వులవ్రాఁతను బట్టి 'ఎంచిన' అనుదానిని 'ఏఁచిన' అనియే మనము గ్రహింపవలసియుండును. 'ఏ, ఓ' లు వైపొల్లులు లేకుండ 'ఎ, ఒ' అని పూర్వము వ్రాయఁబడుచువచ్చెడి దనుట (నేఁడు సగము పెద్దలగువారును, మఱి కొందఱును నట్లేవానిని వ్రాయుదురనుట) యెల్లరకు విశదమే. కావునఁ దాళపత్త్రగ్రంథలేఖన సంప్రదాయమును బట్టి 'ఎంచిన' అనుదానిని 'ఏంచిన' అనియు, పిమ్మట 'ఏఁచిన' అనియు మనము గ్రహింపవలసియుండును.

సోమనాథమహాకవి (సార్థబిందుకము గు) 'ఏఁచు' ధాతువునే యిచ్చటఁ బ్రయోగించియుండును గాని 'ఏచు' అనుశబ్దముతో సబిందుకనిర్బిందుక ప్రాససాంకర్యము గాని, 'ఎంచు' శబ్దముతో పూర్ణాపూర్ణబిందుపూర్వకము లగునక్షరములకుఁ బ్రాసమైత్త్రి గాని యొనర్చియుండఁడు. (సార్థబిందుకమగు) 'ఏఁచు' నకు 'బాధించు' అనియర్థము. (చూ. శబ్దరత్నాకరము—ఏఁచు,) ఏఁచినప్రేమన్ = బాధించుచున్న ప్రీతిచేత నని యర్థము. (ఈ 'బాధించు' నది పదకమునందలి ప్రేమ) పదకమునందలి యాసక్తి తన్ను బాధింపఁగా నని భావము.

ముద్రితగ్రంథములయందలి "ఏఁచునుబ్రేమ" (వీరేశలిం-ప్రతి) "ఏఁచు నుపేంద్రునిన్" (హావిళ్లవారిప్రతి) అనుపాఠములు, సోమనాథుని శబ్దాలంకారనియమమునకు (ఏఁచిన, పూఁచిన, డాఁచిన, నోఁచిన అనుక్రమమునకు) భంగకరములు గావున నసంగతములు.

(b) 'వెంట'కు 'వేఁట' యనునర్థము స్థలాంతరమున నెచ్చటను లే దని రామకృష్ణకవిగారు వ్రాసియున్నారు. సత్యమే. శబ్దరత్నాకరమున నీయర్థము ప్రమాదయుక్తముగఁ గన్పట్టెడిని. పూర్వవ్రాఁతను బట్టి "ఘంటాకర్ణుఁడు - -"

అనుపద్యమునందు "వెంట్ట" అని యున్న "వెంట"కు "త్రోవ" యనియే యర్థము గాని 'వేట' యను నర్థముగాదు.

ఏ వెంటంబోయితిమి=ఏత్రోవను బోయితిమి? అనియర్థము. 'ఏతప్పుత్రోవను బోయితిమి? అని భావము.

ఉదాహ:—ఏమిచేసితి నని నన్నుఁ దిట్టితివి? ఏమితప్పుపని చేసితినని - - - -

పైపాదమున వేఱొక 'వేట' శబ్దమున్నది గావున నీ 'వెంట' కుఁ త్రోవ యనునర్థమును గ్రహించుటయే యుక్తము. ఏ(తప్పు)త్రోవను బోయితిమి? కాఱడవిలో వేటాడరాదేమి? యని యన్వయము. సీతారామాచార్యులవారి ప్రతిలో 'వెంట్ట' అనుటకు 'వెంట' యని యుండుటచే నిట్టిభ్రాంతికిఁ గారణమయ్యె నని తోఁచెడిని.

ఇంతవఱకు నాచనసోమనాథునిపై నారోపింపఁబడిన దోషములు, దుర్గుణములు భ్రమప్రమాదపరికల్పితము లని నిరూపించితిని. ఆతనికవిత్వతత్త్వమును గూర్చి యించుక విన్నవించెదను.

నాచనసోమనాథమహాకవి 'ఆంధ్రవ్యాసమహర్షి, యగు తిక్కనసోమయాజికి శిష్యుఁ డనియు 'ఆంధ్రకాళిదాసుఁ' డనియుఁ జెప్పఁదగినవాఁడు. సకలవిద్యాపారంగతుఁడు. ఆతనిగ్రంథములోని గద్యమునందును, బుక్కరాయలచే నాతని కియ్యఁబడినదానశాసనమునందును ననేకబిరుదము లాతనికిఁ గలవు. అవి యన్నియు సార్థకములు. ఇతనిగ్రంథమునందు భారతమునందలి కొన్నిభాగములను మించునవీనగుణము లనేకములు గలవు. "ఈతఁడు తిక్కనసోమయాజియం దపారగౌరవము నుంచి యాతనివలె, గవిత్వముఁ జెప్పనెంచి తత్ప్రయత్నమును బరిపూర్ణముగ నెఱవేర్చుకొనెను." అని విమర్శకాగ్రేసరులగు మ. రా. రా. శ్రీ మానవల్లి రామకృష్ణకవి, ఎం. ఏ. గారు వ్రాసినది యథార్థము. తిక్కనసోమనలపద్యములయందు నొండొంటిని బోల్పఁదగిన పద్యములు నూఱులకొలఁదిఁ గలవు. మఱియుఁ గొన్నివిషయముల నాతని కీతఁడు తీసిపోవుచున్నను, గొన్నివిషయముల 'గురువును మించినశిష్యుఁ' డగుచున్నాఁడు. అవి మృదుమధురపదప్రయోగములతోఁ గూడిన శైలి లోనగునవి. ఈతనిపద్యములు భాషాదేవి విపంచీనినాదముంబోలె శ్రోతలకు మహత్తరానందముం గూర్చును. ఏయేస్థానముల నేయేపదముల, నేయేలోకోక్తులఁ బ్రయోగించినఁ జదువరులహృదయములయం దాయాకథాభాగములోని విషయము లచ్చొత్తింపఁబడిన ట్లుండి హాయిం గూర్చునో యాప్రయోగవిధాన

మును దిక్కన తరువాతఁ జక్కఁగ నెఱిఁగినవాఁ డితఁ డొక్కఁడే. వేసవి తెరువరికి చెలమ యేఱుం బోలెఁ బాఠకసరస్యనకు నీతనికవిత యెనలేని సౌఖ్యము నొడఁగూర్చును. కవిత్రయములో నొకఁడగు శంభుదాసుఁడును, కవిసార్వభౌముఁడగు శ్రీనాథుఁడును ననేకస్థలంబుల సోముని కల్పనలను, పదపద్యంబులను, భావములను ననుకరించియుండి రన నీతని యాత్మకృష్టత్వముం గూర్చి వేఱ చెప్పనేల? అందు 'సీసమునకు శ్రీనాథుఁడు' అను శ్రీనాథుని ప్రఖ్యాతిలతకు సోమనాథుని సీసపద్యకవితాధోరణియే యాలవాలము. శ్రీనాథుని సీసపద్యముల పోకడ లన్నిటికి సోముని సీసములే యాధారములు. మఱియు శ్రీనాథుని కవిత్వములో ననేకస్థలంబుల నాచనసోముని చిఱునవ్వు గానవచ్చుచుండును. వేయేల? కవిసార్వభౌముఁడు సోముని శిష్యులలో నగ్రగణ్యుఁ డని చెప్పుట యతిశయోక్తి కానేరదు. ఎఱ్ఱన శ్రీనాథుల యనుకరణములం గనుఁడు. [సోడ

సోమన—సీ. మకరందమానిమైమఱచిన గొనయంబు వెడ మ్రోయు గఱివోసివింటి
జలజకేసరరాజిజల్లెడెముఁకగా దాఁటునతారిరథ్యములతోడఁ
గర్ణికారపుమొగ్గకనకంపుగుబ్బగాఁ గోయిలనోరూరుగొడుగుతోడ
రతికన్నుఁగవమచ్చరము సేయుటెక్కెంబు వడఁక వీతెంచు సేవకులతోడ
వలపుఁదూపులు గరసాన వాఁడిసేసి, మందునెలతోడఁ దనమేనమామ గ్రైసన
నిండునెలతోడవలరాజు నిర్జరేంద్రు, సభకునేతెంచెభుజబలోత్సాహమెసఁగ."

(సంస్కృతహరివంశమున నీవర్ణనము లేకున్నను సోముని నెఱ్ఱన యీరీతి ననుకరించె.)

ఎఱ్ఱన—సీ. "ముందట నెలమావిమొక్కలనలరించు కర్తదానగు చెలికాఁడు నడువ
నిరువంకలందును విరుల తేనియఁ గ్రోలు దొరలు మోదంబునఁ ద్రుళ్లియాడ
నునుఁగుత్తుకలతీపుఁ గనఁగూయుపులుఁగుల చారునాదములు కైవారములుగఁ
జందనగిరినుండి చనుదెంచి చల్లనిబం ట్లెల్లవనులకుఁ బరువువెట్టఁ
జిలుకమావులుగట్టిన చిగురుతేరి, పసిఁడిబలుమీనుపడగ యెద్దసల మెఱవఁ
జెఱకువిల్లు పూవమ్ము లేడ్తెఱ ధరించి, గట్టిబిగిసి యేతెంచె నక్కడిమిమగఁడు."
శ్రీనాథుఁడు. హరవిలా. తృ. 38 ప.

సీ. "కాంతాజనంబులకఱివంకబొమలతోఁ బ్రతివచ్చు పుష్పచాపంబుతోడఁ
గోకిలవ్రాతంబుఁ గుక్కిళ్లుమ్రింగించు క్రొమ్మావిచిగురాకుగొడుగుతోడ
రతిదేవినిడుసోగ గ్రాలుకన్నులుడాలు దలఁపించుమీనకేతనముతోడ
భుజగలీలావతీభుక్తశేషము లైనగంధవాహకిశోరకములతోడఁ

జందుమనిశో వసంతమాసంబుతోడ, రాజకీరరథం బెక్కి ప్రాభవమున
వచ్చెనలరాజు చిత్తానువర్తనముఁగ, సంభ్రమముతో మహేంద్రునాస్థానమునకు.

(పై మూఁడుపద్యములను బరీక్షించినపాఠకవర్యులు తత్తత్కవులసామర్థ్యములనరయుదురుగాక!) మఱియు, సోమనాథునిగ్రంథమును జదువఁ దటస్థించిన యాంధ్రకవులంబఱును నాతనిపద్యములవంటి వానిని విడువక వ్రాసియే యుండిరి. ఒండురెం డుదాహరణములు.

[వన్నె దఱుగ
సోమన—సీ. పా. "మాఁగుపాఱిన చంద్రమండలంబునుబోలె వదనారవిందంబు
చరిధర్మన.సీ. పా. సైంహికేయచ్ఛన్నచంద్రబింబమురీతివదనంబుమిక్కిలివాడికంద
సో—సీ. పా. బర్హిర్ముఖార్థమై పర్వతేశునితండు దాల్చినాఁ డీతండు వ్రాల్చినాఁడు,
,, ఫణిపరంపరతోడి పన్నగేంద్రు నితండు మెట్టినాఁ డీతండు చుట్టినాఁడు
కవిలోకబ్రహ్మ సీ. శేషపన్నగరాజు సెజ్జగా నాతండు వ్రాల్చినాఁ డీతండు దాల్చినాఁడు
సోమన—సీ. పా. దైతేయసతీధమ్మిల్లములతోడ విరులనెత్తావికి వీడుకోలు
నిశ్శంకునికొమ్మన—సీ. దైతేయకాంతలతళ్కుఁగమ్మోవులవీటికాశ్రీలకువీడుకోలు
(వీరమాహేశ్వ.)

చూపఁ బూనిన నిట్టి వెన్నియేని గలవు. గ్రంథవిస్తరభీతిని విరమించెద.

శ్రీమూఁ వసప్పాకము, అనంతాచార్యులవారి వైజయంతీపత్త్రికయందు నాచనసోమనాథునిఁ గూర్చియు, నాతనిగ్రంథముం గూర్చియు వ్రాయఁబడిన ప్రశంస యాతని యౌత్కృష్ట్యమును దెలుపుచున్నది గావున నిచ్చట వ్రాయుచున్నాను.

- - - - "ఇట్టియుద్గ్రంథమును దేహధనవ్యయములు చేసి యతిప్రయాసమున దీనిని సంపాదించి ముద్రించి లోకవ్యాపకము (చేసిన) వీరేశలింగముపంతులుగారిదివఱకు శతాధికగ్రంథములు వ్రాసిపొందిన గౌరవములకంటె దీని ముద్రించుటచే సంపాదింపఁగలకీర్తియ వేయిమడుంగు లెక్కువ యని మాయభిప్రాయము - - - - - - - - ఈకవి సర్వజ్ఞుఁ డైనను ఇతనికి వేదాంతమునందుఁ గలప్రజ్ఞ యపార మనియుఁ దోఁచుచున్నది. ఇతఁడు కేవలపుస్తకవిద్యలయందకాక వాత్స్యాయనోక్తంబు లగు చతుష్షష్టికళలయందును గుశలుఁ డని యితనిగ్రంథము వేయివిధంబులఁ జాటుచున్నది. ఇతఁడు పుట్టుకవి. లోకస్వభావము చక్కఁగా నెఱింగినవాఁడు. అపారమైన భావనాశక్తి గలవాఁడు. ఆంధ్రభాషయందెల్ల నితఁ డొక్కఁడే పదవాక్యప్రమాణజ్ఞుఁడు. ఏకవియు నూహింపని యనేకవిషయముల నితఁడు పాటించియున్నాఁడు. - - - - - - - "

ఈరీతిగ సోమనాథునికవిత్వము పలువురచేఁ గొనియాడఁబడియున్నది. నవీనగుణసనాథుఁ డగు సోమనాథుని గ్రంథమునఁ గొన్నివిశేషము లగపడుచున్నవి. అందొక పద్యమును బట్టి గ్రహింపఁదగిన కొన్నివిశేషములను మాత్ర మిచ్చట నిచ్చుచున్నాను.

మ. ధనదాంతఃపురతారహారములు, యాదఃపాలబాలాఘన
స్తనకాశ్మీరము, ధర్మరాట్కులవధూసంవ్యానకౌశేయముం
దనుజేంద్రారివరావరోధదయితాధమ్మిల్లమాల్యంబులుం
గినుకం దెచ్చి ఘటింపఁ జూచు జయలక్ష్మీనిత్యనైపథ్యముల్.

ఉ. హ. ప్ర. 16 ప.

నరకాసురుఁడు దిక్పాలపత్నుల యలంకారములం దెచ్చి, వానితోఁ దన జయలక్ష్మిని గైసేయఁజూచుచున్నాఁడు. అప్పుడు వానిదృష్టి 'బుద్ధిఃకర్మానుసారిణీ' యను న్యాయమున దిగధీశ్వరసతులకడకు, (ఉత్తరమునుండి తూర్పునకు) అప్రదక్షిణముగాఁ బోవుచున్నది. ఏమన, లబ్ధవరుఁడైన వాని కప్పుడు గలుగఁబోవు దిగ్విజయసంపద స్థిరముగ నుండునదిగాదు. ఈపద్యము మొదలుకొని యాగభాగములకై మునీంద్రులను నరకుఁడు బాధించుపద్యమువఱకును నీయౌచిత్యము చక్కఁగాఁ బాటింపఁబడి నవీనగుణసనాథుని రచనాసామర్థ్య మనన్యసాధ్యమని వేనోళ్లఁ జాటుచున్నది. చూడుఁడు.

నరకునితోఁ దేవేంద్రుఁడు మొదట సమర మొనర్చుచుండ నాతనికిఁ దోడుగా వచ్చినలోకపాలుర రాక నప్రదక్షిణముగాఁ గవి చెప్పియున్నాఁడు:—

తే. గీ. "వచ్చె యక్షగుహ్యకులతో వైశ్రవణుఁడు;
దోఁచె వారుణభుజగయాదోబలముల
తోడ వరుణుండు; కాలమృత్యువులతోడ,
నడచె దండధరుండు దానవులమీఁద." ప్ర. 24.

దీనివలన రాఁబోవు దేవతల యపజయము సూచింపఁబడినది.

మఱియు నరకునినోటనుండి వచ్చుమాటలు గలయీక్రిందిపద్యముల నరయుఁడు.

ఉ. "ఆలలితాంగిఁ జూచి నరకాసురుఁ డిట్లనుఁ బాకశాసనుం
డాలములోఁ ననుం గదిసి యంతక, పాశి, కుబేర యుక్తుఁడై
తోలుపులం బడెఁ ............... ప. గ. 61 ప.

ఇందు దిగధీశులరాజ్యములు స్థిర మైన వగుచున్నవి గావునఁ బ్రదక్షిణ ముగఁ జెప్పఁబడియె.

(అప్రదక్షిణము.) మ. అవె సుత్రామరథంబు, లల్లవె కుబేరానేకపశ్రేణు ల
ల్లవె పాశ్చాత్యతురంగమంబు, లవె ప్రేతాధీశవీరావళుల్

నరకునికి లభించిన పైరథాదులు వానికి నిల్చునవిగావు. కావున నప్ర దక్షిణము.

(ప్రదక్షిణము.) చ. 'అవు నిదివో లు వాసవుఁడు నంతకుఁడు న్వరుణుండుఁ బార్వతీ
ధవసఖుఁడుం బ్రతాపమునఁ దత్పదమేలుదురు - -" ప్ర.80ప.

(అప్రద) శా. "పాశిం బాఱఁగఁదోలి, యంతకు దిశాపట్టంబు గావించి, పూ
ర్వాశాధీశ్వరు వెన్నడిం జని, ధనాధ్యక్షు న్విభాళించి కే
లీశస్త్రాస్త్రవిహారుఁడైన నచటన్ లేకుండ నిర్మించితిన్
మీాశాస్త్రంబుల నింక నెవ్వరికగున్ మేలైన యజ్ఞాంశముల్. ప్ర.91.

మఱియుఁ బైవానిలో నీతండు పాటించిన వృత్తములను గూడఁ బరీక్షింపఁ గోరెదను. పై "ధనదాంతఃపుర - - - - అనుపద్యమును బట్టియు, నింకను గ్రంథమునఁ గానవచ్చు కొన్నిచోటులం గలపద్యములను బట్టియు వివరింపవలసిన విశేషము లనేకములు గలవు, వానిని మఱియొక గ్రంథమున వ్రాయఁ దలంచి ప్రస్తుతము, ప్రబంధరాజములోని యీక్రిందిపద్యరాజమున నిక్కవి చక్రవర్తిని స్తుతించుచు ముగించుచున్నాను.

శా. "ఔరా! హారివచోరసస్థితి! యహాహా! శబ్దదాంపత్య! మ
య్యారే! పాకబుజుక్రమంబు! భళి! శయ్యారీతు! లోహో! చమ
త్కారం! బద్దిర! జాతివార్తలు! పురే! ధారాసమారూఢి! మ
మ్మారా! రాజదలంకృతుల్! కవులలో మాన్యుండ వీవన్నిటన్!"

నడకుదుటి వీరరాజు.

DR. S. KRISHNASWAMI AIYANGAR, M.A., PH.D.,
*(Honorary Secretary.)*

NADU STREET,
MYLAPORE, MADRAS.

*8th September, 1924.*

# THE THIRD ALL-INDIA ORIENTAL CONFERENCE, MADRAS, 1924.

The Third Session of the All-India Oriental Conference will be held in Madras during the Christmas holidays. His Excellency the Governor of Madras will open the Conference. Mahamahopadhyaya Dr. Ganganath Jha, M. A., D. Litt., Vice-Chancellor of the Allahabad University has accepted the Presidentship of the Conference.

The Conference will last for three days. Papers offered for presentation to the Conference must reach the Secretary by the 1st of November next. A brief summary of the papers indicating the salient issues should be sent along with the papers. These summaries will be published if the paper should be accepted for presentation to the members of the Conference for facility of discussion. The time allowed for each paper would be only 15 minutes. Scholars interested in the work of the Conference are invited to take part and submit their papers to the undersigned before the said date.

S. KRISHNASWAMI AIYANGAR,
*(Hony-Secretary.)*

## పైదానికిఁ దెనుఁగు.

మూఁడవ ఆల్-ఇండియా ఓరియంటల్ కాన్ఫరెన్సు, చెన్నపురము, 1924.

ఈకాన్ఫరెన్సు రాఁబోవు డిసెంబరు నెల క్రిస్టమసు సెలవులలోఁ జెన్న పట్టనమున జరుగును. ఘనతవహించిన శ్రీ చెన్నపురి గవర్నరుగారు, ఆసభను దెఱచెదరు. అలహాబాదు విశ్వవిద్యాలయపు వైస్‌ఛాన్సలరు గారగు మహామహోపాధ్యాయ, డాక్టరు గంగానాథఝూ, ఎం.ఏ., డా.లి., గారగ్రాసనాధిపతిగా దయచేయుదురు.

సభ మూఁడుదినములు జరగును. ఎవ్వరైన వ్యాసములు పంపఁదలఁచిన వారు తమతమవ్యాసములను రాఁబోవు నవంబరు నెల మొదటి తేది లోపుగఁ గార్యదర్శిగారియొద్దికిఁ బంపవలయును. ఆవ్యాసమునందలి ప్రధానాంశముల సంగ్రహమునుగూడ వ్యాసముతోఁ బంపవలయును. ఈ సంగ్రహములను, వ్యాసము లంగీకరింపఁబడినయెడల సభ్యులకు చర్చనిమిత్తమై పంపుటకొఱకుఁ బ్రకటింపఁబడును. ఒక్కొక్క వ్యాసమునకు 15 నిమిషములు మాత్రమె వ్యవధి యీఁబడును. ఈసభావిషయమున నభిమానముగల విద్యాధికులు తమతమ వ్యాసములను పైని దెల్పిన కాలములోపునఁ బంపి తోడ్పడవలయు నని యాహ్వానము చేయుచున్నాము.

యస్. కృష్ణస్వామి అయ్యంగార్,
గౌరవకార్యదర్శి.

## ౩. దేవసహాయము.

(రాజును మంత్రియుఁ బ్రవేశించుచున్నారు.)

మంత్రి—మహారాజ! నన్ను క్షమింప వేఁడెదను. ఈమూఁడవసారి కూడఁ జూచి తర్వాత మీచిత్తము—నేను మాట లాడను.

రాజు—నీ కేమి వెఱ్ఱి యెత్తినదో,

చ. తెలివి యొకింత గల్గ నొక తేపకుఁగా దొక తేప కైన నా
పలుకుఁ దలంపఁడే పడెడు పాటు సమస్తము వానిఁగూర్చి కా
దె లవము నన్ను నెన్నఁ డతి ధీయుతుఁ డందువు యోగమందు వేఁ
డెలియను వాని సద్గుణతతి న్నతి పోయినసొమ్ము వచ్చునే.

మంత్రి—మహారాజ! అట్లు కాదు. బుద్ధిశాలి. దయార్ద్రహృదయుఁ డగుట

ఉ. దీనుల యార్తి కోర్వఁ డొక దేశము కొల్లగఁ బోయి దుర్గతుల్
జ్ఞానవిహీనులన్ బుధుల సాదుల బీదలఁ బాపలన్ దయా
హీనత వృద్ధులన్ సతుల నెందఱనేఁ జెఱగొంచుఁ బోవ లో
లోన నెవం డుపేక్ష వదలుం గరుణింపక యట్టి పట్టునన్.

రాజు— నా కీపని సమ్మతము గా లేదు. నాతలంపున కిది దుశ్శకునము.

మంత్రి—మహారాజ! నామూర్ఖతకు మన్నింపవలయును. ఆసమయములో నేలినవా రైనను నట్లు చేయువారే.

రాజు— స్వతంత్రుఁడనై నేను జేయుటలో—ఒకపనికిఁ బోయి యొకపని బాలుఁడు చేయుటలో—నీ కేమి భేదము తెలియుట లేదా.

మంత్రి—అది లోపము కాదు గాని తనతో వచ్చిద నన్నకన్యను గొని తెచ్చుట లోకాపవాదమునకు హేతువు.

రాజు—ఉ. యువరాజై భువనావనక్రియల నార్యు లెచ్చ వర్తింపఁ ద
క్కువయే భార్యలు సత్కులీనలు బహుక్షోణీపతు లీవని పు
ట్టువుగోలెం దఱివేచి యుండి రిది యెట్టు ల్వచ్చె నేవంశమో
యెవ రేవంకను దీనికై వలచిరో యె ట్లేమి కానున్నదో.

మంత్రి—మే మతిదూరమునం దున్న కళింగభూమిం జేర లేము నీవే శరణము—అని బతిమాలికొనిన నెట్లయిన వారిని స్వదేశమున విడుచునుద్దేశములోనే

సమ్మతించినాఁడు గాని భోగైకబుద్ధితోఁ దెచ్చినవాఁడు కాఁడు. కూడ నున్న దాది నడిగిన వాస్తవము తెలియఁగలదు.

రాజు—అట్లయిన నింక మూఁడవసారి బేహారము వలదు. భద్రముగా వారి నిద్దఱ వారియింట విడిచి యపకీర్తిం బొందకుండ రమ్మని చెప్పుము.

శా. వాణిజ్యం బొనరింప విత్తమిడి సద్వ్యాపారివై దీవుల
న్నాణెంబుల్ నగలుం బసుల్ వసనధాన్యంబు ల్విదేశంపువి
న్నాణంబు ల్మెఱయించు చిత్రములు సన్నాహించి తేఁ బంప ను
ప్పాణు ల్వెట్టి మునింగికాయఁ గొనునిర్భాగ్యుండు వీఁ డౌనొకో!

మంత్రి—మహారాజ! సత్కార్య మెన్నఁటికిని వృథకాదు.

రాజు—ప్రపంచజ్ఞానము గడించు నని ధనమిచ్చి దేశదేశములకుఁ బోయి రమ్మనిన నొకసారి పన్నులిచ్చుకొనలేక శిక్షలం బొందఁబోవు వారి నుద్ధరింపను రెండవసారి కొల్లలోఁ జెఱపోవువారి నుద్ధరింపను వమ్ముచేసిన సొమ్ము సత్కార్యముక్రిందనే లెక్కకువచ్చిన మంచిదే. ఇఁక నేను ధన మీయను.

మంత్రి—వలదు వలదు. రాకపోకలధనము కళింగాధీశునిచే నిప్పించుకొని వచ్చును. చిత్తగింపుఁడు.

రాజు—నీవు నాపుత్త్రునికి మంత్రిగా నుండఁదగినవాఁడవు. అది యేదో చూచువఱకు నాపుత్త్రునిమొగము నేను జూడను. (అని లేచి వెళ్లును)

మంత్రి—(వెడలి పోవును)

రాజకుమారుఁడు—(ప్రవేశించి) తండ్రిగారిక్రోధము నాకు మేలే యొనరింపఁగలదు. నాశ్రేయోభివృద్ధికే వారి యీపరాఙ్ముఖత. నే నెఱుఁగక కాదు. మనసుకరఁగి రెండుసారు లొనర్చితిని.

చ. ప్రతికులవృత్తిలో మనకుఁ బ్రాకటమై కనుపట్టు వంచనం
బితరు లెఱింగియుం దెఱుఁగ కేనియు మోసముఁ జెందుచుందు ర
ప్రతిమములైన వానిఁ దొలిపారిగ మాదిరి చూపి యిచ్చుచో
మెతకవి చెడ్డవస్తువులు మిశ్రపదార్థము లమ్ముచుండరే.

అట్లుకాక మంచివస్తువులనే సంపాదించి మంచివెలకే విక్రయించి నిలువ యున్న చెడ్డవస్తువులను జెడ్డ వని చెప్పి యల్పక్రయమునకే యమ్మరాదా. లోకము పలుదెఱఁగులు. కోమటి కిట్లు బుద్ధిచెప్పి రత్నవ్యాపారి గాజురాయి యోగ్యరత్నమని యమ్మును. రత్నవర్తకుఁడు పట్టని జిల్లెడునారబట్ట లమ్మినఁ గొనును. ఇత్తడికి మెఱుఁగువెట్టి స్వర్ణకారుఁడు బంగారని యిచ్చును. ఈతఁడు

పైపెచ్చుచేతకూలికూడఁ గోనును. ఏవర్తకములో మోసము లేదు. ప్రపంచమే మోసము. అన్నియు నెఱింగిన నేను మోసపోదునా. దీనులం గని యోర్వ లేక యిట్లయితిని. ఇపుడు చూడుఁడు. ఈకళింగరాజునకు రత్నవ్యాపారి నని తెల్పి నేను వీనిని నాయింటికి రప్పించెదను. సంజీవక! సంజీవక!

సంజీ—(ప్రవేశించును)

రాజకు—ఈనగర మెట్లో చేరితిమి గదా! రాజు కొలువుదీర్చియున్నపుడు నీవేఁ కృష్ణాతీరస్థుఁడగు రత్న వర్తకుఁడు వచ్చియుండెను. ఏలినవా రొక్కసారి దర్శనం బీయవలయు నని కోరుము.

సంజీ—వర్తకునే యందు రమ్మనిన?

రాజకు—ఇతరవ్యాపారములవలె నింటింటికిఁ దిరుగుపని కాదు. రత్నముల గౌరవముం గాపాడుటకై రాజుల కందు వచ్చుటయే కర్తవ్యమునుము.

సంజీ—అట్లే చెప్పెదను.

రాజకు—అనినమాటలే యన నక్కఱలేదు. సమయానుగుణముగఁ బ్రసంగింపుము.

సంజీ—ఇదె పోయి వచ్చెదను.

రాజకు—శుభమస్తు.

సంజీ—(పోవుచున్నాఁడు.)

### కళింగాధీశునికొలువు.

సంజీ—(ప్రవేశించి) ఈయున్నతపీఠాధివాసియే రాజు కావచ్చును. గంభీర విగ్రహము! (సమీపించి) మహారాజ! కృష్ణాతీరరత్నవర్తకుని యనుచరుని మ్రొక్కు స్వీకరింపుము.

రాజు—ఎన్నిదినములై యీపురమునకు వచ్చితిరి.

సంజీ—నాల్గుదినము లైనది.

రాజు—ఎక్కడను జనులు చెప్పుకొనుట లేదే.

సంజీ—కూరగాయ లైన జనులు చెప్పుకొందురు. రాజయోగ్యరత్నములు. అక్కఱగలవారికిఁ దెలియుటకై పేరుబల్ల గట్టియుంటిమి. ఇతరుల కేపమిని.

రాజు—(తనలో) ఆహా! ధనాగారములోని ధనము పోయి-దేశములోని జనులు పోయి-మనస్సులోని యుత్సాహముపోయి-యుభయకులదీపమైన పుత్రిక చెఱవోయి యున్నయిపుడు నాకా రత్నవ్యాపారిం జూచుట—రాజునని ప్రస్తు

తము తద్యోగ్యమైన బొంత గప్పుకొన్న నేను మర్యాదకైనఁ బోయి చూచి రాకున్న వర్తకులు నవ్వుదురు. (ప్రకాశ) ఎంత దూరమున్నది.

సంజీ—సింహద్వారమున కించుక దాపుననే. కాలినడన వేంచేయవచ్చును.

రాజు—మంత్రీ! మన మిరువురమే పోయి వత్తము. (అందఱును లేచుచున్నారు)

రాజకు—(సందడివిని) రాజుగారు వచ్చుచున్నారు గాఁబోలు.

సంజీ—(ముందుగఁబోయి) ఇదె వచ్చుచున్నారు.

రాజు—(మంత్రితోఁ బ్రవేశించును.)

రాజకు—(ఇరువురకు నమస్కరించును)

రాజు—వ్యాపారిరత్నమా! ఏయే దేశరత్నములు మీయొద్దఁ గలవు.

రాజకు—నాయలవాటుచొప్పున నీదేశమున కీదేశరత్నములనే దెచ్చితిని.

రాజు—గళింగదేశములో రత్నము లుద్భవించునా.

మంత్రి—రత్నశాస్త్రములో లేదు.

రాజకు—శాస్త్రము భూమి రత్నగర్భ యని చెప్పెను గాని కళింగభూమి రత్నగర్భ కాదని చెప్పలేదు. స్థలనిర్దేశము లేదు.

రాజు—ఏవీ మేము చూడవచ్చునేనిం జూపుము. రెండురత్నములు.

రాజకు—నేనుదెచ్చినవియే రెండు. (అని పెట్టెమూఁత యెత్తి) మఱియు మీకొఱకే తెచ్చితిని. (రెండు పటములను జూపును.)

రాజు—(పుచ్చుకొనుచున్నాఁడు)

మంత్రి—ఇదియేదో మోసమే.

రాజకు--మహారాజ! ఇది నిష్కళంకకన్యారత్నము. ఇదివిశ్వాసపాత్రమైన ధాత్రీరత్నము. ఈరెండురత్నములును గళింగభూమిం బుట్టినవియే. (చూపిచెప్పును.)

మంత్రి—(తన) వీని కెట్లు లభించినవో.

రాజు—ఈమచ్చుముక్క లేనా నిజరత్నము లన్నవా.

రాజకు—చ. చెఱగొనిపోవుక్రూరుల కశేషధనం బిడి యోడనిల్పి యెం
దఱుగల రందు వారి నుచితంబుగ నొక్కొకరేవుసేర్చి యం
దఱ సుఖవృత్తి నిండులకుఁ దార్చి ముదంబున నీసుకన్య త
త్తఱపడ బుజ్జగించి వసుధావర నీకడ కిట్లు దెచ్చితిన్.

రాజు—నిరాశులకు నీ వూరట గల్గించుచున్నాఁడవు.

మంత్రి—(తన) ఈకన్య పోయిన దని యెంచుకొనియే నాకుమారునకు వేఱుచోటఁ బెండ్లిచేసితిని. ఇది యొకమోసము.

రాజకు—రాజయోగ్యము లగురత్నములపై దుర్బుద్ధుల కాసపుట్టును.

ఉ. ఎవ్వరో పాఱవైచికొని రిక్కడ నబ్బెను భూషణంబు రం
డెవ్వరిదో యటన్న నగు నిచ్చోట నాయది వోయె నందు రా
నవ్విధ రత్నయం బెడలి నామము రూపముఁ జెప్పలేని వా
రవ్విధమైనఁ జూపను నిజార్థము సైఁపుము నాప్రలాపముల్.

రాజు—మంత్రీ-ఇది నాకూఁతు రనుటకు సందేహ మేమి?

మంత్రి—పోయినకన్యలు దొరకుట దుర్లభము. వంచన కెన్ని యో మార్గములు-
యోజింపవలసిన దే.

రాజు—ఇం దేమి మోస ముండును. ఇది నా బిడ్డరూప మే.

మంత్రి—బొమ్మ యిదియే. తెమ్మనిన ధనము కావలయు నని నెలలోఁ దెత్తు
నక్కడ నున్నది యిక్కడ నున్న దందురు.

రాజు—సర్వాధికారములు గలనన్ను నట్లు మోసగింతురా.

మంత్రి—రాజుల నే ముందు.

రాజు—అట్టివారి నొక్కరిని జెప్పుము.

మంత్రి—రాజవర్య! మోసగాండ్రు—

గీ. వేఱుపనస యనఁగఁ బృథివిలో నిలివెఁడు, లోఁతునందుఁ గాచు లోనినుండి
భూమి బ్రద్దలగును భుగభుగ పరిమళ, మావరించుఁ బండినప్పు డనరె.
దాని విత్తుకావలయు ననిన నూఱులు వేలు హరించినవారు మనకుఁ
గన్నుల కప్పటికి నిప్పటికిఁ గనఁబడిరా.

రాజు—వారిం బోనిమ్ము గాని వేఱుపనస యున్నది.

మంత్రి—ఇట్టివట్టే లోకమున సందఱకును గలదు.

రాజు—వట్టి భ్రమయే యందువా.

మంత్రి—కాకేమి. ఎవ్వఁడో బుద్ధిశాలి యొకటిరెండు చమత్కారము లిచ్చు
దాఁక వా రట్లే యున్న దనుచుందురు.

గీ. స్వర్గమందునుండి స్వర్వేశ్యలను గూడ, ధనము పెట్టి దింపఁదగిన నీకుఁ
బనసవిత్తు నిచ్చి వలసినంతధనంబు, గొనఁగరాదా వారు మినుక నేల.

ఇంకొక్క మాట వినుము, మూఢులను బోనిమ్ము, పండితులు-ఎక్కాప్రె
గడరామాయణ మున్న దని పాండురంగవిజయ మున్న దని యథర్వణభారత
మున్న దని సజ్జనులను మోసముచేయుచున్నారు.

రాజు—అప్పకవ్యాదులకుఁ గొన్నిపద్యములే దొరకినవా.

మంత్రి—అదియును విచారింపవలసినదే.

రాజు—ఈపటములే గాని నిజరూపములు గలనాబిడ్డయు దాసియు నీవర్తకుని యొద్ద నుండ రందువా.

మంత్రి—మనుష్యులంబోలిన మనుష్యు లుండవచ్చును.

రాజు—పనిగట్టి నన్నితఁడు మోసముచేయ రాఁబనేమి.

మంత్రి—నిజము నిలుకడమీఁదఁ దెలియును.

రాజు—అడిగి చూచెదను. వణిగ్వర! నాతనూజ ధాత్రీసమేతముగా నుద్యానములో నుండఁగా హరింపఁబడిన మాట సత్యము. నాదికానిది నాది యని కోరువాఁడను గాను. నాపై నీకు విశ్వాసము లేదా.

రాజకు—పెద్దవారు, ప్రభువులు, మీపై నాకు విశ్వాసము గలదు.

మంత్రి—(తనలో) చూపు సేమో. (బెదరుచున్నాఁడు.)

రాజకు—సంజీవక! లోనికిఁ బోయి వారిం దెమ్ము.

సంజీ—(అట్లుచేయుచున్నాఁడు.)

రాజకుమారి—(తండ్రిం గాంచి) హా! తండ్రీ. (అని కౌఁగిలించుకొనును.)

దాది—మహారాజ! ఆయుశ్శేషమున మరల మీపాదములు గంటిని.

(అని మ్రొక్కును)

రాజు—(కూఁతును బుజ్జగించి) వణిగ్వర్య! యింకను సందేహమా.?

రాజకు—గుసగుసలు వోవు నీమంత్రి నడుగుము. ఆయన మొగ మింకను దేఱలేదు.

రాజు—మంత్రి! నాకూఁతురేనా. నాకూఁతురును మోసపోయినదా, నన్నుఁ దండ్రియని—

మంత్రి—ఇరువురయెడ మోసము లేదు.

రాజు—(కూఁతుతో) ఈరత్నవ్యాపారి మీవృత్తాంతముం దెల్పెను.

దాది—మహారాజ! ఎక్కడివ్యాపారి! ఆంధ్రనృపాలుని పుత్త్రుఁడు.

రాజు—(ఆశ్చర్యపడుచున్నాఁడు.)

మంత్రి—(తెల్లపోయి చూచును.)

రాజపుత్రి—తండ్రీ! లుబ్ధవ్యాపారులా సర్వస్వము నిచ్చి చెఱవిడిపించువారు.

రాజు—అమ్మా! నిజము. వీనియెత్తుగడ మొదటినుండియుఁ గ్రొత్తగా నగపడుచున్నది. ఇక్కడ నుండనేల—రత్నవర్తకుఁడా. మాయింటికిరమ్ము రత్నములకుఁ దగినవెల యిచ్చెదను. (అందఱును బోయెదరు.)

సంజి —(వచ్చి) తండ్రిగారికోపము మంచిపని చేసినది. విత్తనములు కూలిపసులు గూడ మళ్లినవి. రెండుసారులు పోఁగొట్టుకొన్న ధనమంతయు నిచ్చెనఁట! నీవు సంపాదించికొన్న రత్నమును నీవేపుచ్చుకొమ్మని తనబిడ్డను మా రాకొమరునకు నిచ్చి, పెండ్లికిఁ బిలిచికొని రమ్మని మా రాజునొద్దికి నన్నుఁ బంపుచున్నాఁడు. ఈయానంద మంతయు నాది. నేనింతలో నాంధ్రదేశమునకుఁ బోయి వచ్చెదను. (అనిపోవును.)

రాజు—(ప్రవేశించి) ఊరకున్నఁ గ్రొత్తవారి కిచటఁ దోఁపదు. వినోదముల కేమియాలోచనము

రాజకు—(ప్రవేశించుచున్నాఁడు.)

రాజు— ఈదేశము నీవెప్పుడును వచ్చియుండవు.

రాజకు—ఇదియే ప్రథమము. ఈసమీపమున విశేషములేమి.

రాజు—జగన్నాథక్షేత్రము దర్శనీయము. ఇష్టమున్న మనయోడమీఁదనే పోయి రావచ్చును.

రాజకు—స్థలచరిత్ర మెఱిఁగినవా రొకరు దారి చూపవలయును.

రాజు—మామంత్రికుమారుఁ డందు నిపుణుఁడును—

రాజకు—అట్లయిన మంచిదియే.

రాజు—రమ్ము. ఆయేర్పాటు చేయవచ్చును.

(నిష్క్రమణము.)

## ⟵ మహాసముద్రములోనొకతిప్ప. ⟶

రాజకు—(ప్రవేశించి) ఏమి యుద్దేశించి యీమంత్రికుమారుఁడు నన్నిట్లు చేసియుండును! పరాకుగాఁ గూర్చున్నపు డోడమీఁదినుండి క్రిందికిఁ ద్రోసినాఁడు. ఆయుర్దాయశేషమున నీతిప్పఁ జేరితిని. దైవమా! నాగతి యింతేనా! ఇంకఁ గొన్నినాళ్లలో మృతినొందెదను. నేనేమి పాపముచేసితినో త్రాగుటకైనఁ బనికిరాని యుప్పునీటఁ బాలుచేసితివి. ఇక్కడ నెవ్వరుందురు! ఈకడలిలో నీద్వీపము నాకొఱకే నిర్మింపఁబడినదా. ఒక్కమృగము లేదు, చెట్టులేదు పిట్టలేదు. ఈదీవిం జుట్టి వచ్చెదను. ఎక్కడనైనఁ దరణోపాయము దొరకునేమో (చూచి) అదిగో నెవ్వఁడో చేఁపలు పట్టుచున్నాఁడు. వాఁ డేమైన నాకు సాయపడఁడా. (నడచును.)

చేఁపలవాఁడు—(రాజకుమారుం జూచి దూరముగాఁ బోవును.)

రాజకు—ఎవరయ్యా నీవు. నాపాలిటికి-

చేప—మాటలాడకు, చేపలుపడవు, ఎవరయ్యా నీవు నా పాలిటికి.

రాజకు—దినమున కెన్ని చేపలు దొరకును.

చేప—దొరకినన్ని దొరకును, నీమూలమున నేఁ డొక్కటియు లేదు.

రాజకు—నన్నొడ్డుఁ జేర్చితివా నీకు నేఁటిచేఁపల వెలకంటె నెక్కుడిచ్చెదను.

చేప—నీ వెంతయిచ్చెదవు. నీయొద్ద నేమియు లేదే.

రాజకు—నీ కెంతకావలయునో ముందే చెప్పుము.

చేప—నీ కేమియుద్యోగము. జీత మెంత?

రాజకు—నిర్భాగ్యుఁడను నా కేమియుఁ బనిలేదు.

చేప—ఎప్పుడైన భాగ్యమబ్బినపుడు దానిలో సగ మిచ్చెదవా.

రాజకు—అబ్బినయెడల నట్లే యిచ్చెదను.

చేప—అట్లని వ్రాసి యిమ్ము.

రాజకు—ఇక్కడఁ గలమా కాగితమా. ఒడ్డుచేరి వ్రాసియిచ్చెదను.

చే—రేవుదాఁటిపన దేపతగులఁబెట్టెదవు. నేను దెచ్చెదను-ఇదిగో-ఎండుపట్టె సావడిచేప తాటియాకువలె నున్నది. ఈమునివాలుగుముల్లుతో వ్రాయుము

రాజకు—(అట్లు వ్రాయుచున్నాఁడు.)

(అంతలో నొక తెప్ప వచ్చును. ఇరువురు నెక్కి నడుపుదురు.)

రాజకు—ఒడ్డుచేర్చి పడవ మరలించి యొక్క తెరచాటునఁ బడి మరలఁ గనఁబడకుండఁ జేఁపలవాఁడు పోయినాఁడు. ఇది యేదేశమో. కళింగనగర మిక్కడి కెంతదూరమో. ఆహా! మంత్రికుమార! నీయుద్దేశమేమి? నోటిలో నాలుక యున్నఁ గళింగదేశము చేరలేనా. ఉసులు లున్నఁ దిండిదొరకదా! (చూచి) ఆవచ్చువా రెవ్వరో వారి నడిగెదను.

కొందఱు—(వచ్చుచున్నారు.)

రాజకు—అయ్యలార మీ దేయూరు.

కొందఱు—నీదేయూరు నీవెక్కడికిఁ బోయెదవు.

రాజకు—నేను గళింగ దేశము పోవలయును.

కొందఱు—మేము నక్కడకే పోయెదము.

రాజకు—నన్నుఁగూడ మీతో రానిండు.

కొంద—మాపనిమీఁద మేము పోయెదము.

రాజకు—ఏపనిమీఁదఁ బోయెదరు.

కొండ—రాజుగారి యల్లుఁ డెందో పోయినాఁడు. ఓటిగుఱ్ఱము తిరిగి వచ్చినది. వానిని వెదకుచున్నాము.

రాజకు—నేనాయన యున్నతా వెఱుఁగుదును. నన్నురాజు నెదుటఁ బెట్టితిరా చెప్పెదను.

కొండ—నీకెట్లు తెలియును.

రాజకు—మేమిద్దఱము నొక్కింతదూరము ప్రయాణము చేసినాము. నే నెఱుఁగుదును. మీకు లాభమగును, నన్ను రాజునకుఁ జూపుఁడు.

కొండ—ఆతఁ డెట్లుండును.

రాజకు—రాజుకొడుకులాగున నుండును. అంతేయు నేనెఱుఁగుదును.

కొండ—అట్లయిన మాతో రావయ్యా బాబు మాకేమైన దొరకఁగలదు.

(అని తీసికొనిపోదురు.)

(ఒక ముసలివాఁడు ప్రవేశించుచున్నాఁడు.)

ఓనాయనలార! రాజుగారికూఁతు పెండ్లి యైనదఁట. అల్లునకు రాజ్య మిచ్చినాఁడఁట. నే నారాజకుమారుని చిన్నతనములోఁ జూచినాను. వానియొద్దికిఁ గొనిపోరా. నాకేమైన దొరకఁగలదు. (నడచును) ఇది రాజభవనద్వారము వలె నున్నది. (విని) ఏమి! రాజుగారు సభ చేసి యున్నారా! నన్నక్కడికిఁ గొని పోఁగలరా! (విని) అది మీకెందుకు నాకు ముసలివానికి వేషమెందుకు. నేను వారిని జూడఁగోరెదను. వారు నన్నుఁ జూచి కొంత తెలిసికొనవలసియున్నది. సరే! మెల్లఁగాఁ బోయెదను.

(రాజసభ-మంత్రిమొదలగువారితోఁగొలువు.)

ముసలి—(ప్రవేశించి) తెప్పలెత్తి అయ్యలార! పెండ్లికొడు కెక్కడ! క్రొత్తరా జెవ్వరు.

రాజకు—ఏమి తాతా! నేనే యిటురా.

ముసలి—(తెప్ప లెత్తిచూచి) మీనసకట్టు వచ్చినది, పడుచు దొరకినది, రాజ్యము లభించినది. నన్ను మఱచిపోయినావు.

రాజకు—క్షమింపవలయును నిజముగా మఱచితిని.

ముసలి—తెలిపించెదను. అని వ్రాఁతమూలము పొడుగుచేఁపను దీసిచూపును.

రాజకు—(చదివి) తాతా! నిల్చినావు. ఈపీఁటపైఁ గూర్చుండుము.

ముసలి—నాకలవాటు లేదు. నిలువఁబడియెదను. నామాట యేమి.

రాజు—తాతా! ఇదిగో నాభాగ్యములో మొదటిది రాజకన్య.

ముసలి—(నవ్వుచు) ఇదీ దీనిని నీవు స్వీకరింపుము.
రాజు—ధనము దొరికినది.
ముసలి—"చెఱిసఖాయిన్వాహా."
రాజకు—రాజ్యము దొరికినది.
ముసలి—నేనువృద్ధుఁడను. రాజ్యమేలలేను. ఏటేఁట సగము పన్ను నాకిమ్ము.
రాజకు—నాతండ్రిరాజ్యమును నాకేలభించినది.
ముసలి—క్రొత్తగా దొరకినదానిలోనే నాకు "వాటా"
సభ—(అందఱును దెల్లపోవుచున్నారు.)
రాజకు—నీవు నాతో భాగస్వామి వైతివిగదా.
ముసలి—అయితిని. మీమామగారికి నన్నుఁ జూపి చెప్పవా.
రాజకు—అల్లవారె, సింహాసనముమీఁద.
ముసలి—(చూచి) అయ్యో. నే నేమి చెప్పుదును. మీకేమియుఁ దెలియదు.

ఉ. మంత్రికుమారుఁ డీతనికి మార్తుఁడు మీఁదరయంగ లేదు దు
స్తంత్రము చేసి సంభ్రమున జాఱగఁద్రోఁచెను దీన నబ్బునే
జంత్రపుబొమ్మ నీతనయ జాల్మున కాతని బుద్ధిగాలె నా
మంత్రము సుమ్ము సర్వము నుమారమణుం బొగడుండు నెమ్మదిన్.

రాజు—మహాత్మా! ఇంతకంటెను గలదా.
ముసలి—నీయల్లునివలననె నీకు సకలము నింకఁ దెలియఁగలదు. నాకు సెలవిమ్ము.
రాజు—అయ్యో! ఈవృద్ధదశలో నెక్కడికి మాయింటనే యుండుఁడు.
ముసలి—ఎప్పటికిని మీవాఁడనే, నా కుండఁ దీరదు.
రాజకు—(భార్యతోవచ్చి మ్రొక్కును.)
ముసలి—(చేయెత్తి) కళ్యాణమస్తు! (అని చంద్రశేఖరుఁడై నిలుచును.)
రాజకు—(భార్యతోఁగూడ.)

క. శ్రీమదుమారమణా ప్రజ్ఞామేదుర మన్మనోంబుజనివాసా భి
తౌముఖవిషాంతభక్షణ, సామర్థ్యస్ఫుటతరాత్తసర్వజ్ఞత్వా.

(తెఱలో)—మంత్రికుమారుఁ డెందో రాత్రియే బెదరి పాఱిపోయినాఁడు.
ఈశ్వరుఁడు—సరి తీరినది. నిష్కంటకముగా రాజ్యమేలుచు సుఖులై యుండుఁడు.
(అనినిష్క్రమించును.) (అందఱును నిష్క్రమింతురు.)

ఇది దేవసహాయ మను తృతీయరంగము.

---

# ౪. కావ్యకౌబేరము.

సూత్రధారుఁడు—(ప్రవేశించి) కాల మిప్పటికి నిప్పటికిఁ గఱవుగొట్టుగనే యున్నది. ఉన్నవారు పిడికిలి విప్పరు. లేనివారు "చావరు మంచమీఁయ" రన్నట్టులు ప్రపంచమునఁ దాము లేకున్న నెక్కడ వెలితి యగునో యని ముష్టి యెత్తియో, బిచ్చ మడిగియో శరీరమును గాపాడుకొనుచున్నారు. పాపము! వారి నేమిచేయు మందుము. పాటు పడుచునేయున్నారు. లక్ష్మీకటాక్షము వారిపైఁ బ్రసరించుటలేదు. అదియు నొకమేలే. ప్రసరించినవారి కితర దృష్టి లోపించుచున్నది. ధనమునకుఁ బ్రయోజన మేమి? దీనపోషణము, సత్కార్యసహాయము. పారసివారు తమలో నొక్కఁడు బీదవాఁడున్నఁ బలువురు చేరి వానికి ధనమిచ్చి వర్తకము చేసికొని జీవింపు మందు రఁట. మనలో నట్టియూహ కలవారు లేరు కాని యితరులను వర్ణించునపుడు పారసీవారి నుపమానముగాఁ జెల్పుచుందురు.

చ. పలువురువిత్తవంతు లొకపాటిగ సాయముచేసి లేని రి
క్తులు పురికొందు రెవ్వరికిఁ దోఁపదు కష్టము వారు తేలి శ
క్తులగుచునుంద్రు వేఱొకనికుందు గుదింపఁగ వీరి రీతినే
యిల నటుగానిచో నడువ నెవ్వరి మార్గము వారిదే యగుౘ్.

దాతృత్వము మన దేశములో యథేచ్ఛముగా జరగుచున్నది కాని పల్లపు నీరును మెఱకనీరుఁ బల్లమునకే పోవుచున్నది. ధనము లేనివారిదుర్దశ—పదు దైన్యము—ధనముగల యప్పటి దుర్బుద్ధి—యీసమయమున వెల్లడియగును. నే నిందేల వివరింప. కొన్ని నేనును వివరింపక తీరనివి గలవు. కాని కాలము వ్యర్థ మగును. కుబేరశుక్రాచార్యుల సంభాషణము వినుండు.

(నిష్క్రమించుచున్నాఁడు.)

కుబేరుఁడు—(ప్రవేశించి) బ్రాహ్మణులు బ్రాహ్మణులే. మన మెన్నివంక లెన్నినను వారు వారే. తెలివితేటలు బ్రాహ్మణులవే. కాఁబట్టి ప్రభువులు ధనికులు వారిని గురుభక్తిం గాంచుచు నడుగకయే ధన మిచ్చుచు గౌరవించుచున్నారు.

చ. ధనికులయొద్ద బ్రాహ్మణులు దాఁపఁగఁ బెట్టిరె యందు రజ్ఞ లి
చ్చినది యొసంగు లేఘనము! శ్రేయము నాఁబడు విత్త మెంతయో

ధనికులు దాఁచిపెట్టుకొని దానికి వృద్ధి తనర్పఁగోరి వా
రిని బతిమాలుమార్గము ధరిత్రిని విప్రుల కర్థమిచ్చుటల్.
శ్రేయఃకామి యేమిచేయును—

క. తనగృహమున విప్రులు నిల్చినఁ జాలును బ్రేమతో నచించినఁ జాలుం
దనతోడను దీర్ఘాయుష్మనిగా దీవింపఁజాలు శుభ మని తలఁచున్.

బ్రాహ్మణు లెల్లరుఁ బూజ్యులే యందును ఋషులు నాచార్యులు విద్వాంసులు సేవింప దొరకిరా వారిదే భాగ్యము! ఏల మనవంటివారియింటి కట్టివారు వత్తురు.

గీ. కుక్కమాంసము దినియెను గుశిక సుతుఁడు
కాని యర్థింపఁజాలఁ డొక్కఁడు శిలోంఛ
వృత్తులం గొంద్రు వనముల వేఁడఁ జాల
వెఱతురు తపోవ్యయమునకు వెఱచినట్లు.

పేరేగాని రాజాశ్రయము గలపండితులకుఁ బదిమందిలోఁ బెద్దవాఁడ ననిమెలంగుసజ్జునకుఁ దృప్తిగా ధన మెక్కడ దొరకుచున్నదో చెప్పఁగల వారుకలరా—పేరు చెప్పఁగూడదు. పాప మెంతమందియో. నలుగురైదుగు రెన్నఁడు నాతలంపులోఁ బాయరు.

క. పదిమందిపండితుల్ తన, సదనంబున కరుగుదెంచి సత్కృతులై యే
గెదరేని దినదినంబును, వదలక యదిగాక వైభవం బనఁగలదే.

(యక్షుఁ డొకఁడు ప్రవేశించి) దేవ! అసురాచార్యులగుశుక్రపండితులు వేంచేసియున్నవారు.

కుబే—(అదరిపడి) ప్రవేశపెట్టుము (తనలో) ఈతనిరాక కేటికారణము.

(యక్షుఁడు పోవును శుక్రుఁడు ప్రవేశించును.)

కుబే—(లేచి నమస్కరించి పీఠము చూపును.)

శుక్ర—కళ్యాణమస్తు సంతోషమె కద.

కుబే—(తనలో) లాభ మస్తు. అని దీవింపవలసినది. (ప్రకా) ఆచార్యులకు నాపైఁ జాలనాళ్లకు దయ వచ్చినది.

శుక్ర—చ. ఒకపని పెట్టుకొన్నతని కొక్కనిమేషము తీర దంతలో
నొకటియు రాదు పోదు వలయుం దినమెల్లను దానికై యొక
ళ్లకడవసింప నాపని యలంఘ్యము నీ వెఱుఁగంగరానిదే
వెకలులు రక్కసుల్ ప్రభులు విత్తపతీ చలచిత్తు లెంతయున్.

సీ. కరతలామలకసంకాశంబు లయ్యె నీ కఖిలవిద్యారహస్యంబు లెల్ల
భావసంభవుఁడును నీవు నేమవ్వురో కాని లావణ్యఘనసూనతరము
గోష్పదాకృతి యయ్యెఁ గులిశాయుధునివిభవంబు నీమహైశ్వర్యవారిధికిని
ముక్తాతపత్రమై మూఁడులోకములకు నీకీర్తిచంద్రిక నీడ యొసఁగెఁ
జతురకవికల్పశాఖి నీవితరణంబు, నీమహత్త్వంబు వర్ణింప నేరఁ డజుఁడు
నకట నీకేల పగవారి నాశ్రయించి, రాజ్య మొనరింప దీన గౌరవము గలదె.

సీ. ముదివేల్పుఁ గదిసి నెమ్మొగములు వగులంగఁ జెంపవెట్టఁగలేమె సింహశౌర్య
కంసారి నిద్రించుకడలి [1]పండలిపండు చేసి చల్లఁగలేమె వాసవారి
పిడికిళ్ల నస్త్రాంశుఁ బొడిపొడి గావించి మేఁ జల్లుకొనఁగ లేమే బలాఢ్య
యనలజిహ్వలు పల్లవావలిక్రియఁ దున్ని [2]తూఁటాడలేమె బంధురవిహార
నీయుపేక్షన యేమెల్ల నిపుడు మీఁదఁ, గవిసియుండిననిష్ఫలగతి విహీన
బాహుసౌభాగ్యులమై యుండి ప్రతిఘటించి, పలికితిమి దేవ వినవె నీపాదమాన.

సీ. బలిమిదప్పక మూలబలములఁ బోషించి జలగిరిస్థలదుర్గచయము నమర్చి
వనదుర్గములు గొన్ని వశములు గావించి చతురంగబలముల సంతరించి
చారచక్షువులచే శత్రుభూపాలవైభవమంత్రతంత్రసంపదలు దెలిసి
సామదానాదికసమయంబు లరయుచు గుప్తకార్యజ్ఞానకుశలుఁ డగుచు
మించి సర్వాంగరక్ష గావించి నిశిత, నీతిదర్శనమున ధరిత్రీవిభుండు
పరభుజాశౌర్యపాథోధిబాడబాగ్ని, వోలె నింకింపవలవదె భువనవంద్య. ౨౩

ఉ. శాతకరాసిచే విమతసంహరణం బొనరింపఁజాలు నే
జాతిమనుష్యుఁ డైన బలసంభృతశౌర్యవివేకయుక్తుఁ డౌ
నాతఁడె సర్వలోకవిభుఁ డాతఁడె పర్వతపక్ష[3]శాసనుం
డాతఁడె చంద్రఖండధరుఁ డాతఁడె పంకజనాభుఁ డెంచఁగన్. ౨౪

సీ. ఆదినుండియును నీయఖిలంబు జంగమస్థావరరూప మై తనరుచుండు
నందు జంగమములై యండజస్వేదోద్భవజరాయుజంబులవరుస లెసఁగు
స్థావరంబులు మహీధరపాదపాదు లేతద్ద్వయాన్యము లేదు తర్కశయ్య
నారెంటిలోన ముఖ్యములు జంగమములు వానిలో మనుజులు మానధన్య
లానరులకన్న దేవత లధికతరులు, వేలుపులకన్న నసురులు వెగ్గలంబు
తత్కులంబునఁబుట్టియుఁ దగు నెయిట్లు, దానవాధీశతనయ యీయాతడమఁదనము.

[1] బండలిపండు.  [2] తూఁటాడలేమె.  [3] శాతనుండు.

క. తనుసత్త్వంబునను విప్రుఁ, డనఘులు భేదింపవలదు సమ్యోగంబుల్
గొనవలదు బంధుపోషణ, మొనరింపఁగవలయు జయము నొందఁగవలయున్.

క. సంతుష్టిలేని విప్రుఁడు, సంతుష్టుం డైనవిభుఁడుఁ జదియుదు రెందున్
సంతుష్టిలేక యునికియు, శాంతినిధీ రాజునకును సంపద నొసఁగున్. ౨౭

క. అడఁగినవారల శాత్త్రవు, లడఁతురు ఫల మగ్గలింప నడఁగక పటులం
గడకంటఁ జూచుధీరుల, [1]కడఁగొలుపవు శత్త్రునికరగర్వస్ఫూర్తుల్. ౨౮

క. అనుకులయమరత్వము నీ, దనుసంబున నెన్నవలదు ధూర్జటినఖవి
క్రమ వారినెల్లఁ బదహతిఁ, జనుసదుమే యమరతాప్రశస్తి యనంగన్. ౨౯

క. ఘనకీర్తికారణంబులు, మునుసునగు ధర్మార్థకాములు కాశ్రయముల్
దనుజేంద్ర దానవాధిప, తనువులకు న్నాటి గావు తక్కినతనువుల్. ౩౦

క. పంచత్వము నొందకమును, సంచితములు సేయవలయు సకలార్థంబుల్
పంచత్వము నొందినతుద, నించుక నొఱ యగునె నిర్జరేశ్వరుఁ డైనన్. ౩౧

వ. అనిపలికి వామనుం డాసుహోత్రునితోడం దనతోడినసుజనులఁ జూపి యి
ట్లనియె. ౩౨

సీ. పొదివి ముష్టాముష్టిఁ బోర నింద్రుని నైన గెలువఁజాలిన కాలకేయుఁ డితఁ
డానవబిందుమర్యాద నంబుధు లేకఁ ద్రావనోపిన కాలదంష్ట్రుఁ డితఁడు
తాళంపుఁజిప్పలీలఁ జంద్రార్కులఁ గదియింపఁ గల శూర్పకర్ణుఁ డితఁడు
కులనగంబుల నైన గులగులగాఁ గేలిబిరుసు వాటించు శంబరుఁ డితండు
దక్షుఁడాహవమునకుధూమ్రాక్షుఁడితఁడు,కాంచనాహార్యధైర్యుఁడీకంకటుండు
భూమిచక్రంబు నొక్కటఁ బూని పట్టి, షేపణము సేయనోపు నీదూషణుండు.

క. ఖరుఁ డనుదానవుఁ డితఁ డతి, ఖరకరతేజుండు మున్ను గగనచరుల ని
ష్ఠురుల నుకేతుకుమారుల, నరికట్టం దూపువాన నంటఁగఁ బట్టెన్. ౩౪

ఉ. అక్షయసత్త్వశాలి కపిలాక్షుఁ డితం డొకనాఁడు పుండరీ
కాక్షునివాహనం బగు ఖగాధిపుఁ డంబరవీథి నేగఁగాఁ
బక్షములూఁచి ముక్కుఁ గఁబట్టి ప్రయాసము సేయఁగాంచి యీ
రాక్షసు లెల్ల మాన్చిరి భరంబుగ నీతనివిక్రమోద్ధతిన్. ౩౫

గీ. కల్పకేతుఁ డితఁడు కల్పాగ్నిసమమూర్తి, దీర్ఘజంఘుఁ డితఁ డుదీర్ణబలుఁడు
వక్రదంతుఁ డితఁడు శక్రాదులకు నైన, గెలువరాదు సమరతలమునందు. ౩౬

---

[1] కడఁగొలుపడు.

ఉ. దానవనాథుఁ డంతఁ బ్రన సువగ్రగదాహస్తంబు నెత్తియంబరా
మానినివించిబాహుఁ డట నవప్రసంగంబుల నాక్రమించి నా
మానికులక్ బలారిభవమాధవధాతలు మున్నుగాఁగ నె
చ్చో నిలువోవనీక వెసఁ జోఁపిరి తేనియ ఋగ్గెలంబులన్. ౪౭

క. బొక్కలు చొరఁ బాఱిరి తము, నిక్కునలకుఁ బాపి దానవేశ్వరబాహుల్
కక్కసపెట్టిన గాలిఁ దు, [2]బొక్కుచు శేషాదు లైనభుజగాధిపుల్. ౪౮

క. ఉర్వీవలయం బంతయు, నిర్వీరంబయ్యెఁ బ్రజలు నెవ్వరు [illegible]
పర్వతములఁ బాఁతోఁపుల, [3]చేర్వలవసియించి రధికచింతాసక్తిన్. ౪౯

ఉ. లోకములెల్ల నిట్టు లతిలోకపరాక్రమవిభ్రమ[4]క్రమో
త్సేకధురీణుఁడై యసుర చేకొని యేలుచునుండ నాఘశో
కాకులచిత్తులై యసురు లందఱు దుర్గసమాధియుక్తిర
త్నాకటకంబునందుఁ గడు సందడిగా గమిగూడి వారు మున్. ౫౦

సీ. నిశ్వాసధారలు నిగుడించువారలు శిథిలమానసములఁ జిక్కువారు | నాస
దలయూఁచి తలయూఁచి తగ్గిన గ్గడువారు ముఖకాంతులెల్లఁ ముచ్చముఁగు
నంతఃపురక్లేశ మరసి ఘూర్ణిలువారు శిశుదైన్యమునకునై చిమచిమవారు
మాటలాడఁగఁ బోయి మాట తోఁపనివారు మతిలేక చేష్టలు మఱచువారు
బాపురే దైవమా యని పలువువారు, నిది మహోత్పాతమని హింస నెన్నువారు
నగుచు దైవతముని సిద్ధయక్షసాధ్య,నరులు బెగడంగఁ జూచి శ్రీనరుఁడు పలికె.

శా. ఓహో మీ రొక యింతసేపు నిలుఁ డేనూహించి లోకత్రయ
గ్రాహిన్ దేవవిరోధిఁ ద్రుంచు నయముం గావించెదన్ మీకు నే
లా హైన్యంబు సహింప యోగవిభవోల్లాసంబుచే వానికి
మాహాత్మ్యం బొనగూడెఁ గాక యితఁడు ల్లాఘ్యుండె మద్గ్రాసికిన్. ౫౧

క. మాయాబలమున రాక్షస, నాయకుని జయించి శంభుసతినానసము
న్నాయకముఖ్యులు మెచ్చఁగఁ, జేయుదు భద్రంబు సిరులు చేకుఱు మనకున్.

వ. ఆరాక్షసుండు త్రిలోకాధ్యక్షుండై యునికి మానవమానంబున లక్షహాయ
నంబు లయ్యెఁ దదీయం బగు పుణ్యఫలం బగు నింతియ యకర్కశనయ
తర్కనిపుణుండనై సర్వంబును శుభోదర్కంబు చేసెద మీరు మీనవలసపట్టు
లకుం జనుం డని పచ్చపట్టుబట్టగట్టు దేవర వియచ్చరుల నుపలాలించి విప

---

1 బలాగ్నులు. 2 బుక్కుచు. 3 ...ర్వలవసియించి. 4 క్రమోచ్ఛేక.

ధరవిధనిబుధరపణులం బిలిచికొని సురగురుసమేతంబుగా సంతర్ధానంబున
నవధరించి యొక్కయొక్కన నధిష్ఠించి ౫౪

క. భావించి కల్పతరువుల, రావించి ట్లనియె హంసరక్షోహంసం
బావసుధాస్థలి నున్నాఁ, డీవేళ జగంబులెల్ల నేలి యాలసుఁడై. ౫౫

గీ. ప్రతిదినాభ్యాసనైశిత్యపటిమ నెసఁగు, యోగవిద్యయు విపనాటి భోగపరత
నున్నదై తేయుమాయచే నొప్పునికి,నిదియె యభిసంధివింటిరె నృషపతులు.

వ. మీరు మీయేనుదెఱంగులవారునుం గూడి కుతలంబున కరిగి యదృశ్యా
కారంబున దానవవీరునంతరంగంబు నధిష్ఠించి యతనికి నశ్రాంతవిశ్రాణన
పరాయణత్వంబు నుద్బోధింపఁజేయుండు పొండనిన నా[1]విదురువెల్లిపాదలు
గదాధరుపనుపు ననుసంధించుటకునై వసుంధరకు నవతరించి దివిజారిహృ
దయప్రవేశంబు సేయుటయు. ౫౭

గీ. సివము పట్టినకైవడి దివిజవిమత, పరివృఢునిబుద్ధి పాటిల్లెఁ బ్రౌఢగాఢ
వితరణస్ఫూర్తి కామినీవిభ్రమములఁ, గాముకునిబుద్ధి రాగంబు గ్రమ్ములీల.

సీ. బలిమి విద్వజ్జనంబుల సమారాధించి గుప్తదానములుగాఁ గొన్ని సేయు
నాచార్యగురుమిత్రయాచకావళికెల్లఁ దుద లేక తోరహత్తుగ నొసంగుఁ
బేదలసాదలఁ బిలిపించి వారికోర్కికి నలుమణుఁగుగాఁ గేలికిచ్చు
యోగసిద్ధులమంచు నొకకొన్ని బూటకంబులు పన్నువారి కేప్రొద్దురాల్చు
వందిమాగధకవినటావళులనెల్లఁ, గనకవృష్టులఁ దడిపించుఁ గామినులకు
నభిమతార్థప్రదానంబు లాచరించు, వాసవారాతి వితరణోల్లాసి యగుచు.

గీ. అడుగువారు లేని యట్టి దినంబున, సురవిరోధినోరు చొరదు కూడు
వ్యసనవంతుఁడైనవానికిఁ గలుగునే, ధీరతయును నయవిచారతయును. ౬౦

క. అనుదినముఁ గరవటమునం, జన మించుక తివియఁ దివియు సంకీర్ణంబై
చనుగతి దానవుసిరి పలు, చన యయ్యె నసంఖ్యదానసంభావనలన్. ౬౧

సీ. వైకుంఠపురలబ్ధవైదూర్యరాసులు వైధాత్రపట్టణవజ్రమణులు
నీలకంఠావాసనీలమాణిక్యంబు లమరేంద్రుపీటిముత్యాలసరులు
గరుడకిన్నరయక్షగంధర్వనగరాబ్జరాగదళంబులు నాగనగర
మరకతంబులు మహీవరజయసంప్రాప్తగోమేధికంబులుఁ గుందనంపు
గట్టునందలి పుష్యరాగములు జలధి, విద్రుమద్రుమఖండము ల్వెచ్చపెట్టి
పచ్చపైకంబు లేకుండఁ బాకవిమత, విముతుఁ డాలోచనము లేని వెడఁగునీగి.

---

[1] (వివ) విదురువెల్లిపాద-(విదురు=(రాల్చు,) ఇచ్చు, వెల్లి=తెల్లని, పాద-కల్పకము.)

గీ. గరుడగంధర్వకిన్నరసురకుమార, వర్గములు [1]మేళగాఱు లై పడి నిజాను
కూలవృత్తిఁ జరింపఁ జకోరనయన, లసురకులనాథుపట్టపుఁబువుఁ బొచ్చి
వ. విహరించు సమయంబున. ౭౪

సీ. ఉన్నయట్లన యుండి యూరక మధుమాస వల్లభలాభిరాసు లై యనతరించె
వలయయానములతో మలయానిలంబులు త్రొక్కనిచోటులు ద్రొక్కఁదొడఁగె
వలరాజు నెలరాజుఁ జెలికాఁడుతనమున సిబ్బిలమోహనలీల నెళవ్రకొనిరి
మరలఁ బ్రాయము నచ్చెఁ దరులతావితతికి మగువలకోపంపుమరులు మానె
గోఁకెహరిణనిహారిణంబుకొమ్ము చిమ్మి, చంచువునుజంచువును గూర్చెఁ జకోరము
తాపసులబ్రహ్మచర్యంబు తావ్రులరె, నద్భుతోదయమగుమాధవాగమమున.

వ. అంత నొక్కకందువం బురందరప్రేషిత లగుయోష లశేషసంరంభసము
జ్జృంభిత లై మురజంబులపై వైచిన బిరుదచామరంబులును బూదండలును బట్టిన
దండియలును బుగోపీథిమొరయుమురుహారులుం గలిగి వెలిహజారంబుననిండు
కొలు వై యుండిన దానవమండలేశ్వరుం గని యతనికనుసన్న నుచితస్థానం
బుల నాశీను లై దేవా యీవచ్చినవార మెల్ల మును నల్లనేరేడుమ్రాని
క్రింద నీడలం గ్రీడించువారలము గంధర్వులకును మాకును సంబంధగం
ధంబు గల దలఘుతరప్రచారం బగునీకీర్తిసౌరంభంబు నాఘ్రాణించి శీఘ్ర
వేగంబున ద్విరేఫంబులం బోలెనే తెంచితిమి మమ్ముం గరుణించి మాయాట
పాటలు పాటింపు మని వీణియలు తాటించి. ౭౬

క. [2]అపాతమధురగీతక, లాపంబున శ్రుతులు దనిపి లాస్యవిలాస
శ్రీపరిపాకమునఁ ద్రిలో, కీపతిడెందంబుఁ గరఁచి కేళీపర లై. ౭౭

క. నగవులఁ జూపుల మాటలఁ, దగవులఁ గందర్పశాస్త్రదర్శనముల నా
జగదేకత్యాగికి వా, రగణితపరమానురాగ మమరించుట యుఙ్. ౭౮

గీ. నగరులోన నొక్కనాఁ డెంబు లేకుంట, యెఱిఁగి హంసదైత్యుఁ డిచ్చువారి
కన్న దనియ హారకటకకేయూరకి, రీటపదకవలయకోటు లెల్ల. ౭౯

ఉ. ఇచ్చిన మెచ్చి పల్కి రసురేశ్వర యేటికి మాకు నీగి మా
వచ్చుట నిన్నుఁ గొల్చుటకు వచ్చుట యిచ్చక మింత లేదు మా
ముచ్చట దీరఁ గొన్నిదినముల్ భవదంఘ్రులు సేవచేసి నీ
నచ్చిన నాగవాసములనంటున నుండెద మన్న నాతఁడుఙ్. ౮౦

---

[1] మేళగారు. [2] ఆపాదమధుర.

క. ఆమేశముతో నిట్లను, భామామణులార యీగిపని యెంశ పనుమిం
గామించి కొలువ వచ్చితి, రే మంచిది యయ్యె నిలువుఁ డిచ్చో ననుచున్:

వ. వారలకుఁ బూర్వాంశిష్టంబు లైన యస్తాపదవిశేషంబులు పరామర్శించి
పేరుపేరిరను మేలువెచ్చంబునకు నిచ్చి వియచ్చనగరోపహంబు లగు
విపుదు లొసంగిన నాకపటనటీనటఘట లాపుటభేదనంబున నిలిచి యప్పట
ప్పటికి నప్పిశితాశికి నుల్లాసంబు దెచ్చు పొరపొచ్చెపుటెచ్చుకంబుల మెచ్చు
నడయుచుఁ వాడిను విడిచిన యుర్వారుఫలంబునుంబోలె సర్వసేవకసమూ
హంబునందును నిర్వాంఛితుం గావించి సేవించి రయ్యవసరంబున. ౮౨

క. మదనుని యాఱవబాణము, మదిరాకన్యకను మేలుమానిని యై యా
మొదలిటివేలుపుదొర సద, మదనుగుఁ దుద లేనిరతుల మాపు ప్రేపున్. ౮౩

క. రాగాంధుఁ డ్యక్తబాంధవు, భోగాంబుధిమగ్ను నస్రపుని విడిచి నిజో
ద్యోగంబు లుడిగి వెలవెల, నైగడిసీమలకుఁ జనిరి యాప్తులు హితులున్.

వ. పరివారంబునుం బరిహృతజీవితం బగుటఁ బలుదెఱంగుల నంతరంగంబులం
బొక్కుచు దిక్కటకంబు లధిష్ఠించె నిట్లు. ౮౪

సీ. చిచికి రూపఱి పోయె నవరత్నమయశతాంగములు వానల నెంప గాలిఁ దూలి
గజహయంబులుగడ్డిఖాణంబు లెఱుఁగక నాఁడు నాఁటికిఁ దొంటిపోఁడిమి డిగె
బంగారుప్రతిమల ప్రతివచ్చు ననవచ్చు నుడిగంపుఁగొమ్మలు బడుగు లైరి
దండనాయకులు మిత్రములు నీతిజ్ఞులు గురువులు దిటవప్పి కొంచెపడిరి
మధుమదాయత్తుఁ డై మేను మఱచి మదిర, నంటు వాయఁ గనీక ఘుష్పా స్రువిశిఖ
శిఖల జంతికతోలు లైనచిత్తమగల, హంసుఁ డెరగొని యుండునయ్యవసరమున.

క. తనరాజ్య మెల్ల నీక్రియ, నను వేదుట యూడిగములయందలిజనము
ల్వినిపింప విని నిశాటుఁడు, తనమదిలోఁ దలఁచె వజ్రధరుఁ దలఁచుటయున్.

సీ. ఆకుపచ్చనిచాయ నవఘళింపెడు వేయుహయములఁ బూనిన యరద మెక్కి
ధూమాన్వ్రతానలద్యోత మై స్ఫీత మై ఝంపతో నశనిధ్వజంబు గ్రాల
హరిచందనాలిప్త మగు ప్రకోష్ఠము గల పిడికిటఁ బట్టినభిదుర మమర
హారకిరీటకేయూరతులాకోటికంకణాదులకాంతి కడలు ద్రొక్క
వలఁచి వైచిన హరిచందనంపువలపు, ప్రబలి నలుదిక్కులందును గుబులుకొనఁగ
దివ్యమాల్యాంబరాద్యుతిభవ్యమూర్తి, మహితలంబున కేతెంచె మఘవుఁడపుడు.

క. ఏతెంచి తగినవిధమున, దైతేయాధీశుఁ గాంచి తత్పదములపై
భూతలము మ్రోవ మ్రొక్కెన, నాతం డత్యాదరమున హా వలదనుచున్.

# మన్నారుదాసవిలాస నాటకము.

## యక్షగానము.

---

సీ. హేమాబ్జనాయికాహృత్పద్మసదనాంబుజాభృంగ ఘనాహ్వాంతకవిరగర్వభంగ
దీనజనావనదీవ్యత్పదాబ్జాత నారదనుతగీతనామజాత
శ్రీరమణీమణీసేవితఘనపద యనురక్తభక్తార్తిహరణపద
గాండివకోదండపాండవవాహనదక్ష సజ్జనావననదయపక్ష
కంసనృపవైరి కాళీయగర్వహారి, ముష్టికవిరోధి విదళితమురవిరోధి
కనకవనవాస కమనీయకనకవాస, చాల వినుతింతు రాజగోపాల నిన్ను.

కైవారము:—శ్రీమదరుణారవిందసుందరాహ్లాదయారవిందకందళన్మకరందసంతతా
స్వాదనమిళింద బృందారకసందోహవంద్యపూర్ణ సౌందర్యగాంభీర్యాదిగుణ
బృంద నిష్ఠురముష్టివిఘాతనిర్ధూతదుష్టతరముష్టికచాణూర నృశంసకంసాసుర
దురాసదశరాసననిరాసదకరాసిభార మోఘీకృతమేఘవాహనవిగ్రహ
అమోఘీకృతవిజయరాఘవానుగ్రహ రంజితగుణాలవాల రాజగోపాల
పరాకున్నావు.

వా. అని మఱియు నేమని కొనియాడుచున్నారు.

ద్వి. శ్రీరాజమన్నారు సేనకాధారు, నారీమనోహారు నవనీతచోరు
వేదోద్ధరణమున వెలసినవాని, మేదినీధర మెత్తి మెఱసినవాని
అల హిరణ్యాక్షు నుక్కణంచినవానిఁ, జెలఁగి ప్రహ్లాదు రక్షించినవానిఁ
గుతల మొక్కడుగునఁ గొలిచినవాని, క్షితిపతిసంతతిఁ జెండాడువానిఁ
గడలిపై సేతువు గట్టినవాని, వడిఁ బ్రలంబాదుల భంజించువానిఁ
బుడమిఁ బ్రబుద్ధుఁడై పొలుపొందువానిఁ, గడిమిమ్లేచ్ఛబలంబు ఖండించువాని
రహి ననంతావతారము లొందువాని, మహితనయునిఁ బట్టి మర్దించువానిఁ
బదియాఱువేవురపడఁతులఁ దెచ్చి, ముదమున వరియించి మురువొందువాని
వైదర్భి మొదలైనవనితలలోన, నాదరంబమరఁ జెంగము నేలువాని
విజయసారథి యనువిఖ్యాతివాని, విజయరాఘవుపేట వెలసినవానిఁ
దాత్పర్యమున మదిఁ దలఁచి ప్రార్థించి, తత్పట్టమహిషియై తనరినదేవి
సుజనకల్పకవల్లి సుదతీమతల్లి, నజుఁ గన్నతల్లి హేమాంబుజవల్లి
సన్నుతిచేసి విష్వక్సేనుఁ గొల్చి, పన్నిద్ద ఱాళ్వార్లఁ బ్రస్తుతిచేసి

ప్రాచేతసపరాశరవ్యాసముఖ్యు, లౌ చిరంతనకవీంద్రాదులఁ బొగడి
పరమతంబు లడంచి పరఁగు కుమార, తిరుమలతాతార్య దేశికుఁ దలఁచి
రామానుజాచార్యు రహి సన్నుతించి, ధీమంతు వేదాంతదేశికు నెంచి
మఘవసమానుఁడై మహిఁ గీర్తిఁగాంచు, రఘునాథమేదినీరమణు సేవించి
ధరణివర్ధిల్లు శతక్రతుయాజి, పరమ చతుర్వేది పరతత్త్వవేది
నిరుపమానైకపత్నీవ్రతగరిమ, హరువొందు శ్రీనివాసార్యు సేవించి
యాధునికకవుల నాదరింపుచును, సాధునికరములు సన్నుతిసేయ
నతులితభావరసాలంకృతులను, గృతిఁ బూనుదును జమత్కృతి మీఱఁ జగతి.

వా. అని తనవిశిష్టాభీష్టదేవతలను సేవించి పరతత్త్వనిరతులైనపరమభాగవతుల సంభావించి సత్కవుల నభినందించి దుష్కవుల వినిందించి యుషాపరిణయ మన్నారుదాసవిలాసప్రముఖప్రబంధనిబంధనచాతుర్యధుర్యయై హెచ్చుగా నచ్యుతవిజయరాఘవ సార్వభౌమధర్మపత్ని యై రంగుమీఱు రంగాజమ్మ శృంగారకరుణహాస్యశాంతాదిరసంబులు పొదల మృదులమధురోచిత వచన రచనల నందంబుగా సందర్భింప నన్నెమీఱు మన్నారుదాసనామక నాటక రాజంబునకుఁ గథాసంవిధానం బెటువలెను.

ద్వి. శ్రీరమ్యసహ్యజాసింధుతీరమున, నారికేళరసాలనారంగసాల
తాలతమాలహింతాలతక్కోల, బాలరసాలచంపకవకుళాది
తరుపరంపరల నెంతయుఁ గనుపట్టి, సురుచిరం బైనట్టి చోళదేశమున
నమరావతీపురి నతిశయింపుచును, నమరుతంజానగరాధిరాజ్యంబు
అవనికిఁ జక్రవాలాద్రియనంగ, నవ్వు రౌర విలసిల్లు నావీటికోట
ఆయద్రిశిఖరంబులౌనివియనఁగ, నేయెడఁ గొమ్మలు హెచ్చుగ వెలయుఁ
గులశైలములమించు కొత్తళంబులును, నలరు నుత్తుంగము లౌనలంగములు
హరిచక్రరూపంబు లౌపిరంగులును, సురగిరి మించు భాసురగోపురములుఁ
గన్నులపండువు గావించు నచట, నున్నతోన్నతములై యొప్పుసౌధములు
సతతంబుఁ జరియించు సరసిజాప్తునకుఁ, బ్రతిలేని చలువచప్పరము లై మించు
మహీధరంబుల మించుమత్తేభములును, నహివైరిగతి మించుహయపరంపరలు
నడయాడు కొండలనఁదగు రథములు, వడిసింగముల నైన వారించుభటులుఁ
బరమేష్ఠి కెనయైన బ్రాహ్మణోత్తములుఁ, బరశురాముని గెల్చుపార్థివాగ్రణులు
ధనదుని మించఁగఁ దగువర్తకులును, ఘనవిప్రశుశ్రూష గనుపాదజులును
వలరాజు నేలయంచు వారకాంతలును, గలిగి యానగరము గనుపట్టు నెపుడు.

వా. అన్నగరంబునకుఁ దెఱగంటిదొర తెఱంగున నిరుపమానసంపదల సొం పొంది విజయవిక్రమవితరణాదిగణనీయగుణసాంద్రుం డగు విజయరాఘవ చంద్రుండు చంద్రవదనలు గొలువ నోకానోకచంద్రశాలాంతరాళంబునఁ జెలువుమీఱఁ గొలువుకు వచ్చెనఁట యెటువలెను.

దరువు-సౌరాష్ట్రరాగము-ఆదితాళము.

వలరాజురీతిఁ గల్వలరాజు భాతి,నలజయంతుచందమున నలునిచందమున[చ్చె వెలఁదులుఁగొలువంగావిజయరాఘవేంద్రుండు,కొలువుసింగారమైకొలువుకువ

వా. ఇవ్విధంబున విజయించిన విజయరాఘవభోజుండు రాజసంబున రాజరాజ సభాతులిత విలాసంబగు రాజగోపాలవిలాసంబు సేరి యందు యత్నంబునం బఱచిన నూత్నరత్నకంబళంబులపైఁ దద్దయు నొద్దిక యగు రతనంపుగద్దియ యందుఁ దీరుగాఁ బేరోలగం బయి కూర్చుండెనఁట యెటువలెను*

వా. ఇవ్విధంబునఁ బేరోలగంబయి తనచెంగటం జెలంగు మెఱుంగుఁబోణులఁ గనుంగొని డెందంబున నరుణారవిందేందిరాహ్లాదయానంద సంధాతయగు నందనందను చరణారవిందసందర్శనవందనాభిలాషంబు గందళించఁ గించిద్వి వశుడై సముఖంబున నున్నవారిజాక్షుల వీక్షించుచున్న సమయంబున విన్నవించ నన్నగరి యన్నగార్లు వచ్చిరఁట యెటువలెను.

దరువు-సామంతరాగము-ఆదితాళము.

నిడుదకుళ్లాయలునిండుచోగలుఁబూని,నడిసన్న యన్నగార్లుసముఖానకువచ్చిరి.

వా. ఈరీతిం జేరవచ్చిన యన్నగారు లన్నరనాథునకు మ్రొక్కి యేమని విన్న వించుచున్నారు.

అన్నగళమాట:-శామి పరాక్కు. కెళక్క మన్నారుకోవిల్లె యిరుందుం పంగునిత్తిరుణాళుక్కు తెంగాయవాంగ, శెంగోలు పారుపత్యగారనుం, అంజి వహె నిర్వాహత్తునంబిమారుం, తలత్తారుం, జియ్యాళుం, యేకాంగియళుం వైరావియళుం, కొత్తియళుం, శ్రీపాదం తాంగియళుం, తిరువాభరణక్కణక్క ప్పిళ్లెయళుం,రాగభోగత్తారుం గూడి,ఆనెమేలె, శ్రీముఖ † వెళింవళప్పణ్ణిక్కొండు వందు శముగత్తిలె అరిక్కెపణ్ణచ్చొల్లి ఆశారవాశిల్లె కాత్తిరుక్కరార్గళ్ శామి శిత్తం.

వా. అనిన విని యవనివల్లభుం డుల్లంబు పల్లవింపఁ జేరుకొనియున్న సూరిపు టంపు తలగడ దిం డొకదండకుఁ జేర్చి యభిముఖాసీనుండై పులకాంకురస్మేర

* ఇక్కడఁ గొంతలేదు. † వెళిందరుళప్పణ్ణిక్కొండు—అనియుండును.

ముఖారవిందుం డై [illegible] ంబున నయ్యా
దయు నేసేగా [illegible]

నాయునివారిమాట:—రారోయి [illegible] పిల్పించరోయి.

వా. అనిన విని చామరంభకు లటు పేరి [illegible] పిలిచే క్రమ మెట్టులనెను.

కటికివార్లమాట—వోహోయి సంబిహారియం [illegible] త్రాణం [illegible] కీర్తియశుం కణాక్షప్లిక్షయశుం భాగభోగత్రాణం యోగ్యాణం సముగత్తుక్కువారుంగో.

వా. అని పిలువంగా నంబులు వచ్చే క్రమ మెట్టులనెను.

ద. మణిముకురంబులు మెఱుంగుకుండలములు మేలుకుల్లాయిలు బురునాకబాయలు, సరిగదుప్పటులు, ధరియించి నంబులు స్థలముపాటను దామ ధరణీశుకొలువుకు వరుసగా వచ్చిరి.

వా. ఇవ్విధంబున వచ్చిన యర్చకులు, అచ్యుతవిజయరాఘవసార్వభౌముని నాశీర్వచనగోచరుం జేసిరట యెట్టులనెను.

నంబులు ఆశీర్వాదం చేసేది:—మంగళాని భవంతు మన్నారుదాస హేమాబ్జనాయికారాజగోపాలస్వామి వరప్రసాదకృపాభివృద్ధి రస్తు. తథాస్తు.

వా. అనిన విని యవనీంద్రచంద్రుండు శ్రీముఖంబున కభిముఖముగా నెదురుకొని సంతుష్టహృదయుం డై సాష్టాంగదండప్రణామంబు లాచరించి భక్తిచే నుత్తమాంగంబున శ్రీముఖంబు ధరించి నంబులొసంగు నిఖిలపురుషార్థసాధనంబులగు తీర్థప్రసాదంబులు స్వీకరించి యాస్వామి శ్రీముఖంబు చేరుననున్న రాయసముతో యజముఖి చేతికియ్యంగా వారు చదివి రట యెట్టులనెను.

శ్రీముఖము. ఏతత్సురాసురాధీశమౌళి రత్నప్రభారుణం. శ్రీమద్ద్వారవతీనాథ శాసనం శాశ్వతం పదం శ్రీమదనంతకోటి బ్రహ్మాండ నిగ్రహానుగ్రహంబులకుం బరిగ్రహించిన మణిదండంబుతో వేదండవరదుని నగరిదళవాయి యగు విష్వక్సేనులు సకలకల్యాణగుణసంపన్నుం డై మాయావాది మదవిభేదకళాధురీణుం డై షోడశమహాదానదీక్షావిచక్షణుం డై మన్నారుదాసనామాంకిత విశాలవక్షుం డై శ్రీరాజగోపాలస్వామి ప్రియపుత్త్రుండై హెచ్చు. అచ్యుత విజయరాఘవభూపాలునకు వ్రాయించి పంచిన మంగళాశాసనంబు. శుభకృత్సంవత్సర ఫాల్గునబహుళపంచమీగురువాసరంబున స్వాతీనక్షత్రంబున బ్రహ్మతిరునాళ్లకు ధ్వజారోహణం బై యుండుకు పదునెనిమిదిదినంబున

రోహిణినక్షత్రంబున రథోత్సవంబు నడవంగా నున్నది గనక యీమంగళా శాసనంబు విన్నతక్షణంబ రథగజతురగపదాతులతో సపరివారంబుగా దక్షిణ ద్వారకానగరంబునకు సాగి వచ్చి హరిద్రానదిద్రాజత్తీర కల్పితానల్పకల్పక కాంతారదంతురగృహాంతరంబుల హావణించిన కాంచనపంచానపీఠంబున విజయించి యుండేది మంగళాశాసనం.

వా. ఆసమయంబున, కోవెలకరణికులు లెక్కలు వినిపించిరంట యెటువలెను.

మూణెముక్కాలె మూణుమాముక్కాణి, మూణెముక్కాలె మూణు మాముక్కాణి, అరెరెండుమాక్కాణి అరెరెండుమాక్కాణి, శామి పరాకు, లక్షత్తంబెదునాయరం బొన్నుక్కు, తిరువిళయాట్టు గ్రామంగళానడక్కురధు అధిళెగ్రామంగళాయెంబ్భ్రంధు, ఉళ్కడయల్, యెళువత్తునాలు, మడప్పరం పనిరెండు, కచ్చనత్తిలె మూణుమహాణం నడక్కుధు, యిదుక్కుమన్నంగాలులె, మూణులక్షక్కలనెల్లుం, ముప్పదునాయరంపొన్నెన్నుం, గుత్తిహిపట్టె యెళధి క్కొండార్ ॥ ౧ ॥

మరొకకరణం చెప్పేది:—స్వామి పరాక్కు, అందప్పడిక్కి నెల్లుం అళ వామల్ పొన్నుం శెలిత్తామల్ మణియగారర్ కోవిలప్పత్తరం నడప్పివియ్యా మల్ అల్లాం బాత్తుక్కొళ్లురోమెన్ను నెల్లల్లాం పరంబాశాచ్చార్, కోవిళుక్కు శిరిప్పుకట్టళయు, అరమనె యిలె దినమొన్నుకు అంబెదుపొన్నుక్కుడుక్కురా పోపెలెయాచ్చిధు ॥ ౨ ॥

శామి పరాక్కు, యిదుతవిర, పుష్పవనత్తెలె లక్షత్తునంబెదునాయిరం యిలెప్పెమరం, అంబెదునాయిరక్కలక్కొట్టెకాణుం, అధల్లాం కరతోరయిలె శెందు పొరధు, క్రయక్కారం గయిలె కడర్ గట్టా తిరునెళక్కు యెణ్ణికొళ్ల పోపెలె యాచ్చి, ఉత్తరపారుపత్యగారర్, అంగుం యింగుం వోడిక్కొండు తిరి యిరిధివొళియ వొణ్ణుం పరామరిశిక్కురు ధిల్లె ॥ ౩ ॥

మరొకండు:—శామి అడియెణ్ణ్యేణ్ణప్పం కేట్టరుళ, నంబిమారు యెల్లాం కొళంబుప్పాలుం, తిరువిశాం సాపద్రధివొళియ, వొరువరాహీలుం, వొణ్ణుం, అరిక్కె యిడ్రవాళిల్లె, యిదుత్తవిర, అరమనెయిల్ కరక్కట్టు క్కాల్కట్టుక్కు, మువ్వాయిరం పొన్నుం, మొదల్కడణ్ మువ్వాయిరముం కుడుత్తిరుక్కురదు, అదువుం అరువుప్పణ్ణి అందప్పణముం తండయిల్లె, స్వామిశిత్తం ॥ ౪ ॥

అతికారిమాట—స్వామి వీరు యిప్పుడు విన్నపంచేశినందులో వొంటిరూక నామీాంద మోపాదిఅయితె వొకరూకకు పదిరూక లిచ్చెను.

మణియగాండు చెప్పేమాట—సామి అసునేయా రెట్ట కొండెక్కెల్లాం, అడియే నిరుక్కిరేనే, కణక్కు నెళంగియెష్టే లే కోమంద్ర ఫెల్లాం కుడిక్కిరేన్.

నాయండు చెప్పేమాట—అవురా మీరెగలెల్లా యెరంగమా, మేము భాగ్లునోత్సవానకు వస్తినామె అంతాపరామర్శించుకు నేము.

వా. తదనంతరంబ ముదం బంకురింప నఘల్గుభాగ్లునోత్సవారంభ లగునంబులఁ దాంబూలజాంబూనదంబులం బహూకరించి పంచెనంట యెటువలెను.

వా ఆసమయంబున వాసుదేవపుర మహోత్సవయాత్రా ముహూర్తవిధానతజ్ఞులు ప్రశ్నఫలగణితభాగవిభాగాభిజ్ఞులు దైవజ్ఞులాసార్వజ్ఞనిధి సమ్ముఖమ్మునకు వచ్చిరంట యెటువలెను.

ద పట్టెవర్ధనములు పెట్టి పంచాంగములు పట్టి, పట్టభద్రుని జేర వచ్చిరి దైవజ్ఞులు.

వా ఈవిధానఁ జేరవచ్చిన సిద్ధాంతవేదులం జూచి యద్ధారుణీపరిణి యేమనుచున్నాఁడు.

నాయండు అనేమాట-రారయ్యా మాహూర్తికులార, పెదమాళ్లకు బ్రహ్మోత్సవ నాళ్లగద, సేవించి రావలెను, ముహూర్తం నిర్ణయించరయ్యా.

వా. అని భూనాయకుం డానతిచ్చిన గణితజ్ఞులకు లగ్ననిర్ణయంబునకుగా విచ్చనగా బహుచర్చలు నడచెనంట యెటువలెను.

భైరవజోస్యులు-- మంచనభట్లుగారు పంచాంగం విప్పుడా ॥ ౧ ॥

మంచనభట్టు — భైరవజోస్యులు నేరని మాటలె ఆడుదువు. చక్కంగా అశ్విని భరణి కృత్తికలు గురుతెరుంగవు నీకు పంచాంగం విప్పేదినా నీ భవిష్యకి ॥ ౨ ॥

భైరవజోస్యులు—మంచనభట్లుగారికి మూలానక్షత్రమో మాటాడకమునుపె మూలం రేగుచున్నది ॥ ౩ ॥

మంచన—వోరి భైరవజోశ్శిగా తిథివారనక్షత్రయోగకరణాలలో వొకటి గురు తెరుంగవె పంచాంగ మనంగా యేందిరా ॥ ౪ ॥

భైరవజోస్యులు—మంచనకు ముక్కుమీదనె వుండును కోపం, సూర్యసిద్ధాంతం యెరింగినవాని కొడకవు, మొన్నటి అమావాస్యానాడు ముప్పాతికాపరక గ్రహణమునిన్ని ఆగ్నేయస్పర్శ అనిన్ని దబ్బరలే వ్రాస్తివే. మేము ఆర్యభట వాక్యపరహితాల గ్రహస్ఫుటం చేశి గ్రహణము లేదంటిమే ॥ ౫ ॥

మంచన—నీవు పోచనసోమయాదులవారింట మొగవాండు బుట్టునని ప్రశ్న జెప్పి యేకాక్షరప్రయోగం చేయించుక వస్తివె ॥ ౬ ॥

భైరవ—నీవు బుచ్చానాధానికొడుకు బచ్చిగాండు పదహారోయేంట పల్లకి యెక్క
నని జాతకం వ్రాస్తివె, యిదిగో బిచ్చ మెత్తుక తిరుగుచున్నాండె. ౬.
మంచన—నే ఫలభాగం వ్రాశిన దిక్కున పదివేలమంది పల్లకి పడస్తులైనవారు
నీకేమి తెలుసు పోరా.
మధ్యస్థి—వోయి చాలించరోయి మీజగడాలు. నగరివారు ముహూర్తం నిశ్చ
యించుమనుంటె యేపాగాధాలాడుచున్నారు.
వా. అనిన విని వారు సంవాదము చాలించి లగ్ననిర్ణయము చేసిరంట యెటు
వలెను:—మేషం, వృషభం, మిధునం, కటకం, సింహం, కన్య, కన్యకు స్వామి
వీక్షణ శుభవీక్షణాలు కలిగినప్పటికిన్ని తులాలగ్నము చరలగ్నము గనక,
యాత్రకు మహాప్రశస్తము, లగ్నాధిపతి శుక్రుండు సప్తమునుండ్డు కేంద్రించ్చి
లగ్నము పూర్ణముగా చూస్తున్నాండు. స్వనాస్వామివీక్షణశుభవీక్షణాలు కలిగి
యున్నది గనక భాగ్యస్థానాననుండ్డి బృహస్పతి చూస్తున్నాండు గనక,
"యోయో భావస్స్వామిదృష్టో యుతోవా, సౌమ్యైర్వాస్యాత్తస్యతస్యాభి
వృద్ధిః, కళ్యాణసిద్ధిః పునరాగమశ్చ" అన్నాండు గనక తులాలగ్నము
విజయయాత్రకు మహాప్రశస్తము, స్వామిచిత్తము.
వా. అన విని యంతరంగంబున సంతోషంబంది మెచ్చుగా నచ్యుతవిజయరాఘవ
క్షితితలాధ్యక్షుం డక్షణంబ దక్షిణద్వారకానగరంబునకు వచ్చెనంట యెటు
వలెను.

దరువు - కేదారగౌళరాగము - ఆదితాళము.

మన్నారుదాసుండు మగువలు గొలువంగా, మన్నారుకోవిలకు మక్కువతో వచ్చె.
వా. ఇవ్విధంబున వచ్చిన యచ్యుతవిజయరాఘవుం డచ్చెరువందినెచ్చెలులుం
దాను ముచ్చట దీర నచ్చట దిక్ప్రాకారగోపురాకార సారకాసారనవ్యతరది
వ్యారామ సీమంబు లవలోకించి వచ్చిరంట యెటువలెను.
సీ. విజయరాఘవమహీవిభుండు దాంగట్టించు గోపురంబులు మించు గోపురములు
చక్రవాళాద్రితో సరిసేయం దగుకోట యారసాతలమంటు నగడితలును
దిరుమాళిగలచెంతం దీర్ఘైనవీథులు మేరుమందరముల మీఱు తేర్లు
కృష్ణతీర్థంబు హారిద్రానదియు క్షీరసాగరముఖములౌ సకలతీర్థ [లు
ములును జంపకవనశతంబులునుమఱియు, మన్ననారులు వేంచేయుమంటపము
కరితురంగమరథయోధవరగణంబు, పరంగం గన్గొనెం గన్నులపండువుగను.
వా. ఇవ్విధంబున నవ్విజయరాఘవేంద్రుండు నగరవైభవంబులు విలోకింపుచుం

గాంతలుఁ దాను నంతఃపురప్రవేశంబు నటించిన యనంతరకథాసంవిధానం
బెటువలెను.

దర్వు-బాబిరాగము-రూపకతాళము.

అవసరంబులవారు నరుణాబ్జదేవిశు । నవసరంబులు దెల్ప నతివేగమున వచ్చిరి.

వా. వచ్చి యాసుమసాయకజనకసమయసూచకులు మన్నారుదాసధీరునితో నే
మని విన్నవింపుచున్నారు.

అవసరాలవారు—స్వామిపరాకు । పెరుమాళ్లు నరుణాంబుజవాసినియు గరుడ
వాహనాధిరూఢులై తిరువీథులు వేంచేయుచున్నారు. స్వామిచిత్తం.

వా. అనిన విని యాయవనీవినేత యంతరంగంబున నుప్పొంగి రంగుమీఱ
గొలువుసింగారం బయ్యెనంట యెటువలెను,

సీ. నెలఁత యొక్కతె చేరి సిలువుటద్దము పట్టెఁ జెలువ యొక్కతె యోరసిగ యొనర్చెఁ
జంద్రాస్య యొక్కతె జాజిసరుల్ సుట్టెఁ జాన యొక్కతె తిరుమాల్ జాఱఁగట్టెఁ
గలికి యొక్కతె దిద్దెఁ గస్తూరి తిలకంబుఁ గనకాంగి యొకతె చౌకట్లు వెట్టె
జాణ యొక్కతె బురుసాహిజారును బూన్చె సకియ యొక్కతె యఱచట్టదొడిగెఁ
దరుణి యొక్కతె హారవుగా దట్టిగట్టె, వనిత యొకతె దుప్పటివలె వాటునైచెఁ
బడఁతి యొక్కతె చెవులజవ్వాది యుంచెఁ, గొమ్మ యొక్కతె కుంకుమ నెమ్మినలఁదె.

వా. ఇవ్విధంబున నవ్వనితలు గైసేయ మఱియు నమ్మన్నారుదాసుఁడు వన్నెగా
సింగారించుకొనె నంట యెటువలెను.

సీ. వైరులతలమెట్టు వామపాదంబున డంబుగా బిరుదుపెండెంబు వెట్టె
సాధుబృందముఁ బ్రోవఁ జాలు హస్తంబుల నమరఁ గెంపులకడియములు పూనె
మన్నారుదివ్యనామము నిల్పునురమున మేలైన గోపాలతాళి వైచె
హరినామకీర్తనం బాలించువీనుల మురువైనవజ్రాల మురువు లూనెఁ
జెలువమన్నారుశ్రీపాదములఁ జెలంగు, నట్టి శ్రీతులసీదళంబమరఁ దాల్చె
శిరసునను జాలకాంతులు చెలువుమీఱ, రతుల హెచ్చిన సచ్చపురాయి దాల్చె.

వా. ఇవ్విధంబున నవ్విశ్వవిశ్వంభరారమణుండు రమణీజనంబులుం దాను
విహంగపుంగవవాహనోత్సవాలోకనసముత్సుకతతత్సమయోచితశృంగారంబు
రంగుమీఱ రంగత్తురంగమమతంగజశతాంగకులసమాకులం బైన రాజ
వీథిని దేజంబు మీఱ విజయుని రీతి విజయంచుసమయంబునఁ గనకాబ్జ
నాయికాకనకపటీనాయకులు మురువుమీఱ గరుడవాహనాధిరూఢులై వేం
చేసి రంట యెటువలెను.

# పరిషత్పుస్తకభాండాగారము.

(ద్వితీయభాగము.)

## 1. మహాభారతము-ఆదిపర్వము-గ్రం. సం. ౧-౧౧.

ఆంధ్రమహాభారతమునందలి యాదిపర్వప్రతులు. ఈ రెండును దక్షిణదేశమునుండి వచ్చినవి. భిన్నస్థప్రతులు. వ్రాతలో మిగులఁ దప్పులున్నవి. ౧ సంఖ్యగలదానికంటె ౧౧ సంఖ్యదానిలో నన్నితప్పులు లేవు. ప్రారంభమున శ్రీఛాయాసమేత సూర్యనారాయణాయనమః శ్రీఅశ్వత్థనారాయణాయనమః క. హరిదాసును వనవాసును పరచితపరమోపవాసు (౨) ప్రాంశుపయోదనీలతనుభాసితు (౩) అంబనవాంబుజోజ్వల అనువానితర్వాత శ్రీ వాణీగిరిజాశ్చిరాయ అని కలదు. ౧౧ సంఖ్య గలదానిలో శ్రీగణాధిపతయేనమః వాగీశాద్యాస్సుమనసా యనుశ్లోకముమాత్రము వ్రాసి పిమ్మట శ్రీవాణీగిరిజా యని మొదలిడెను. మాటలలోఁ జాలభేదములు గలవుగాన రెండు భిన్నమాతృకలనుండి వ్రాయఁబడినవని విదితము.

౧ లో—అని సకలభువన రక్షణ ప్రముఖులై - - వాణీపతుల స్తుతియించి

౧౧ లో—అని సకలభువనరక్షణప్రభువులైన - - వాణీపతుల స్తుతియించి

౧ లో—బలిమి నెయ్యమున భూవలయుపతుల ౧౧ లో—బలిమి నియ్యని భూమివలయపతుల

౧ లో—నాకు ననవరతంబు శ్రీమహాభారతంబునందలి యభిప్రాయంబు పెద్దయునై యుండు

౧౧ లో—నాకు ననవరతంబును మహాభారతంబునందుల యభిలాష పెద్దయునై యున్నయెడా

౧ లో—పాయక పాకశాసనికి భారతభారరణంబునాటినా
రాయణునట్లు మానసధరామరవంశవిభూషణుండు

౧౧ లో—పాయకపాకశాసనికి భారతభారరణంబునందు నా
రాయణునట్లు దాను వసుధామరవంశవిభూషణుండు.

ఇట్టివెన్నియో భేదము లుండెనిండు. "అనవరతార్థదాన యజనాభిరతుక భరతాన్వయాభివర్ధను" అను పద్యమునకుఁ దర్వాత ౧౧ దానిలో దథప్రాసములకై మనము కొట్లాడు "కాపనకట్టెపాటియపకారము" అనుపద్యము విడిచిపెట్టఁ

బడినది. మూడవయును ౮౭౧౨ సంఖ్యగలదానిలోఁగూడ నీపద్యమిటనియుంచఁబడి నది. ౧ దానిలో-ప్రథమాశ్వాసములో "సంబోధన చేసి చేసె నృపసుందర"యని ద్వితీయాశ్వాసము కడపట - సంబోధనచేసిచేసె నృపసుందర-యనియుం గలదు. ౧౧ లో ప్రథమాశ్వాసములో లేదు గాని ద్వితీయాశ్వాసములోఁ గలదు. "సంబోధనచేసిచేసెనృపసూదన"యనియున్నది. ౧ దానిలో ౧౧ లోఁగూడ "పదక్షోహిణు లెన్నఁ బాండవబలం బేకాదశాక్షోహిణుల్ సూడిం గౌరవసైన్య" మనియే యున్నది. ఆంధ్రగ్రంథములలో నగ్రగణ్యముగానఁ బ్రథమమున నుంగశార్థమీపుస్తకము నెత్తి చూపినారము. ౧ న దానిలో సప్తమాశ్వాసము పూర్తిగా లేదు. ౧౯—౭ పత్రములు. ౧౧ వది ఆదిపర్వము పూర్తిగ నున్నది. ౨౬౫ పత్రములు. కడపట—

క. వ్రాలా తప్పులుశత్రులు, చాలంగల వేను నట్టిశబ్దసంగతు లెరుగం
 గేలిం బెట్టక తిట్టక, పోలంగా దిద్దరయ్య బుధజనులారా.

గీ. వ్రాఁతతప్పువలన వాచకు లలుగక, తప్పు గలిగెనేని తగినయెడల
 వలయు నక్షరములు వెలయంగ నిలుపుఁడీ, సుకవులయినవారు సుస్థిరముగ.

సౌమ్యనామసంవత్సర కార్తిక బ-౧౨ ఆరంభం చేసి పుష్య శు ౧-లు సరికి ఆదిపర్వం యెనిమిది ఆశ్వాసాలు కొత్తకోటకరణం తిమ్మప్ప వ్రాసినది సర్వం శ్రీకృష్ణార్పణమస్తు అనియున్నది. (కొత్తకోట - పుదుకోట.)

2. ముహూర్తమార్తాండమ్. గ్రం. సం. ౭.

ముహూర్తభాగము—౧౬౦ శ్లోకముల గ్రంథము. మొదటి ౮౮ శ్లోకములు లేవు. కాని గ్రంథము ప్రారంభమున ౧-౨ పుటలవఱకునే శ్రీరామాయనమః శ్రీగణేశాయనమః అథాగ్న్యాధానప్రకరణం స్మృత్యుక్తేనాహ అని ప్రారంభించినాఁడు. మొదటి ౮౮ శ్లోకములు మొదటిభాగముక్రింద గణింపఁబడుచున్నదో యేమొ. శ్లోకమును దానికి వ్యాఖ్యానమునుగా ౮౮ పత్రముల గ్రంథము.

గద్యము—ఇతి శ్రీమదనంతాఖ్య చాతుర్మాస్యయాజిపుత్ర, నారాయణ విరచితాయాం ముహూర్తమార్తాండటీకాయాం మార్తండవల్లభాయాంముహూర్త మార్తండ స్సమాప్తః.

కవియే దీనికి వ్యాఖ్యానము వ్రాసెను. కవివంశాదికము.

ఆసీత్సీమమణౌరునామనగరే శ్రీకౌశికస్యాన్వయే
యోనంతో వాజసనేయపూజ్యచరణో మాధ్యందినేయాగ్రణీః

కృష్ణ స్తత్తనయ శ్శ్రుతి స్మృతివిదా మగ్రేసరే జ్యోహరి
స్తత్పుత్రః శ్రుతివి త్తదాత్మజవరో నంతాగ్నిహోత్రిగురుః
తత్పుత్ర స్తదనుగ్రహాప్తధిషణో నారాయణాఖ్యాపుర
గ్రామే శిష్యగణేచ్ఛయా నిజకృతగ్రంథస్య టీకాం స్ఫుటాం
చక్రే తాం కృపయా పరోపకృతయే శోధ్యం మదుక్తం బుధై
ర్మాదృశ్యస్య విలోక్య ధార్ష్ట్యమపి తే కుప్యంతి నో సజ్జనాః
సుఖనిధపురుషార్థఖ్యౌసమాభిస్సమాభిః
పరిమితశకకాలే ముహూర్తామార్తాండటీకాం
లిఖతి పఠతి విప్ర స్సోస్త్రభూయాద్ధరిత్ర్యాం
సుఖనిధపురుషార్థఖ్యౌసమావాన్ క్షమావాన్.

## 3. చంద్రాంగదచరిత్రము—గ్రం. నం ౧౨.

పైడిముఱ్ఱి వేంకటపతికవిరచితము. ౧-౨-౩-౪-ఆశ్వాసములు పూర్ణముగను ౬-వది యసంపూర్ణముగను గలదు. ప్రారంభమున—

ఉ. శ్రీగౌరీపతికార్ముకంబు నిజదోర్వీర్యంబునం గాకుదం
బై గాధేయమునీశ్వరప్రియతముం బై భార్గవామేయబా
హాగర్వాతిశయంబు దా నగణమీయన్ జానకీకాంతతో
రాగంబొప్ప గృహప్రవేశ మగు శ్రీరాము న్మదిం గొల్చెదన్.

కవి తనవంశ మీ ట్లొకపద్యమునం జెప్పుకొనియెను.

సీ. సకలసత్కవిపూజ్యసుకవిత్వసామ్రాజ్యనిర్వాహకుఁడు పెదపర్వతన్న
వివిధభావాహార్యవిరచనాచాతుర్య సర్వంకషుఁడు పొట్టిపర్వతన్న
వరపద్యదాకారవాచాచమత్కారనిరుపమమతిశాలి తిరుమలన్న
యపధావకృతిగర్భకవితాచ్ఛసందర్భకీర్తితప్రజ్ఞుండు కేశవన్న
యమనుఁ దనకు నన్నలుగ నుర్విఁ నొప్పుకృష్ణ,రాయభూషణకులరామరాజతనయ
కేశవాత్మజపర్వతాధీశు వేంకటాద్రి నీకావ్య మేనిత్తు నంకితముగ.

గద్యము—ఇది శ్రీమద్రామచంద్రచరణారవిందభృంగాయమాన మానస సకలశాస్త్రార్థవ్రీరంస పైడిముఱ్ఱిపద్మనాభాధ్వరివతంస కృపాభూషణ కృష్ణరాయభూషణ పర్వతరాజతనయ వేంకటపతివిరచితం బైన - - - - -

ఇందలికథ నిషధపురాధీశుఁడైన యింద్రసేనుఁడు సంతానముంగోరి విష్ణు నారాధించి చంద్రాంగదుఁ డనుపుత్త్రుం బడయుట—చంద్రాంగదుని బాల్యము, యౌవనము, వేఁట—ఒక్కశారికను నటిమిఁ గొనిపోయిన నది యొకస్త్రీయై పలుకుట మొదలైనవి.

ఇం దా అనయాశ్వాసములోఁ గొంతభాగము లేదు. సీ. మనినాఁడ బహుకాల మనవద్యగతి జనుల్ గొనియాడ భూమిపాలన మొనర్చి, వినినాఁడ నయపరుల్ వినుపింప నయశాస్త్ర - - - అంతతో ముగిసినది. చాలకాలముక్రిందట నెల్లూరిలో నీగ్రంథ మచ్చుపడినది. అప్పుడు వారికిని షష్ఠాశ్వాసము పూర్తిగా దొరకలేదు. కొన్నిపద్యములు:—

చ. అని తలయూఁచు నూఁచి వగ పోయను పోయని నవ్వ నవ్వి న
చ్చినతను దూఱు దూఱి విధిసేయను సేయని కుందుఁ గుంది ప
ర్విన వెతఁ దూలుఁ దూలి మదివేసరు వేసరి రోఁజు రోఁజి చె
క్కునఁ జెయిఁ జేర్చుఁ జేర్చి హరికోసము మోసమువచ్చెనాకనున్. ౨ ఆ.

ఉ. ఆయెడఁ బంచబాణసముదగ్రసముగ్రజయోగ్రదోస్సమా
ఖ్యాయత చిత్రసేనతనయా తనుసంభృతపాండిమాహృతి
చ్ఛాయత వోలె నెంతయును జక్కవ లొక్కట జోడుగూడ వే
వేయురియాడఁ దోడ రహివీడె వినిర్మలసాంద్రచంద్రికల్. ౫ ఆ.

ఇందుఁ బత్త్రసంఖ్య 126 గలదు, చతుర్థాశ్వాసములేదు కావున 55-97 నడుమఁ గొన్నిపత్త్రములు విడువఁబడినవి.

## 4. కన్నశతకము. గ్రం. సం. ౩౮.

ఈశతకములో 135 కందపద్యములు గలవు. వేదాంతరహస్యార్థప్రతిపాదకము లైనచక్కనిపద్యములు. 18 పత్త్రముల చిన్నపుస్తకము 129 పద్యములు మొదట వ్రాయఁబడినవి. తక్కినపద్యములు తర్వాత వ్రాయఁబడినట్లు వ్రాఁత క్రొత్తప్రాఁతలు, అక్షరముల భేదమును దెల్పుచున్నవి. ప్రతిపద్యమునకును కన్నా యని మకుటముగలదు. కొన్నిపద్యములలో యెరగుడికన్నా, యినకులకన్నా, రవికులకన్నా యనియుఁ గ్రొత్తగా వ్రాయఁబడిన వానిలోఁ గన్నా యనియుఁ గలవు. మొదటిపద్యములు.

అబ్బురపు బాలపదముల, జొబ్బిల్లెడి రసముఁగ్రోలి జోకనహింపన్
నిబ్బరపుఁగవిత లబ్బుట, యబ్బురమా యెఱుకగన్న యరగుడికన్నా. ౧
ఎబ్బెట్టుమతము రోయుచు, నిబ్బరముగ బాలపాదనీరజరసమున్
ఉబ్బుచుఁ గ్రోలిన యంతట, నిబ్బంగిని గవితలన్న యెరగుడికన్నా. ౨
అంజనిపుత్త్రుని కృపచే, రంజిల్లుచు శారదాంబ రసికత మెఱయన్
మంజులవాక్యము లిచ్చెను, రంజితబాలాప్రసన్న రవికులకన్నా. ౩

ముందర విజయుని కృపఁగని, యందుపయిక్ యోగివరుని యనువునయిం
పొందఁగ బుచ్చనగురుదయ, నిందిర నీకబ్బెరన్న యెరగుడికన్నా.
పిల్లలమఱ్ఱి బుచ్చనగురు, చల్లని వాగమృతిఘటన సమరసమెప్పుక్
గిల్లప్రపంచము రోసియు, నెల్లప్పుడు నెఱుకగన్న యెరగుడికన్నా. ౫౭
సుబ్బయగురుకృప నల్లను, నబ్బెను బాలాంబకరుణ యానందముతో
గొబ్బునఁ గైకొని మనుమీ, యుబ్బంగిని నెఱుకగన్న యెరగుడికన్నా. ౧౦

ఈపద్యములంబట్టి పిల్లలమఱ్ఱి బుచ్చన్నగురునికి శిష్యుఁడై బోధముం గాంచెననియును సుబ్బనగురునిచే బాలాంబప్రసాదముంగొని కవియయ్యె ననియు, ఆంజనేయోపాసకుఁడుగానుండె ననియు, గవివిషయము తెలియవచ్చును గాని కవిపేరెవ్వరో-ఒకవేళ యెఱగుడికన్నయ్య యే మో-యనియూహించుటకును నవకాశమున్నది. ఈకర్ణయ్య, కన్నయ్య యని వ్యవహరింపఁబడు నాతఁడినకుల వంశజుఁడు క్షత్రియుఁ డనికొనవచ్చును:—

నాసికము మొదలఁ జిత్తము, భాసిల్లఁగ నుంచి చాలభానము గురుపై
నాసక్తితోడ నిల్పుట, యాసుఖమే నీవటన్న యరగుడికన్నా. ౧౬
గంగకు యమునకు సందున, సంగతిగా ద్రోవగనిన సమరసమాగా
రంగైన బ్రహ్మపదమున, కింగితమా యెఱుకగన్న యినకులకన్నా. ౫౧
అంతయుఁ దానని యుండుము, అంతకు మదినిల్వదేని యంతకు నెల్లియె
సంతోషమంది నిల్చిన, యం తేరా యెఱుకగన్న యెరగుడికన్నా. ౧౦౩

పద్యములలో వ్రాఁతకాండ్ర వ్రాఁతతప్పులు దొలఁగించిన బద్యములు శుద్ధముగా మృదువులుగా నున్నవి. గ్రామనామాదులలోఁ గొంతస్వేచ్ఛను విడిచిరిగావున యరగుడి, యెరగుడి, యని యతులలో రెండుదెఱఁగులవాడి యున్నాఁడు. ఎల్లన, యెల్లన, యల్లన యని యిట్లితరగ్రంథములలోఁగూడఁ గానవగును. ఇదిదక్షిణదేశప్రతి.

5 సభాపతి లక్షణము—వచనము—గ్రం. సం. ౨.

ఈపుస్తకమును దక్షిణదేశమునుండి వచ్చినదియే వేంకటకృష్ణప్పనాయకుని యహల్యాసంక్రందనములోఁ (దీనిని బరిషత్పాఠకు లిదివఱకే యెఱుఁగుదురు) జివర వ్రాయఁబడి యున్నది. 7 పత్రములు గలవు. పూర్వభాగము పూర్ణముగా నున్నది. ఉత్తరభాగము కొంతలేదు. కవియెవ్వరో తెలియదు. సభాపతులే కాదు సకలజనులు నెఱుంగవలసిన యనేకవిషయము లిందుఁ గలవు. ప్రారంభము.

క. శ్రీరమ్యుఁడు సంతతశ్రృం, గారుఁడు రాజాన్వయప్రకారుండును
దాహాఘుఁడు సకలకలా, పారంగతుఁ డనఁగఁ దా సభాపతి వెలయున్

క. తిరుణుండై నవరత్నా, భరణుండై గంధపుష్ప పరిమళయుతుఁడై
పరనారీ సోదరుఁడై, పరఁగినవాఁ డెన్నఁబడు సభాపతియనఁగన్.

క. నరపతియై ధనియైను, స్థిరమతియై సకలవిబుధకవితావిద్యా
పరిణతుఁడై చతురుండై, పరఁగినవాఁ డెన్నమతి సభాపతియనఁగన్.

క. తనయుల మిత్రుల - - - నునిచిన సమీపమునఁ దనిన యోగులవిద్వ
జ్జనులను మాన్యులన - - - దగు నార్యులు మట్టును గూర్చుండఁ దగున్.

క. భావజ్ఞు లరసి కులసం, భావనగలవారి రాయబారులఁ గవులన్
తివిరి యథాసనంబుల, భావింపఁగ నుంపఁదగు సభాపతియనఁగన్.

క. వీరాహవమున విజయుఁడు, ధీరోదాత్తుండు సద్గుణనిధియై
యారయ సింహాసనమున, నారూఢత నొందుచుండు నాసభనగున్.

అని యిట్లు సభాపతిలక్షణము లెట్లనిన:—సోమసూర్యవంశోద్భవుం డైనస్వామి యమాత్య రాష్ట్ర భృత్య కోశ దుర్గబలంబులను రాజసప్తాంగంబులు గలిగి, ఆందోళికాభరణాంబర వాహనచ్ఛత్ర రాజ్యాధిపతి కస్తూరికర్పూరతాంబూలంబులను నుచితసప్తాంగంబులుం గలిగి, సామభేదదానదండ మాయోపేక్షేంద్రజాలంబులను సప్తోపాయంబులుం గలిగి స్త్రీద్యూతపానమృగయా వాగ్దోషదండదోషనిరర్థకవ్యయంబులను సప్తవ్యసనంబులు విసర్జించి పౌరాణిక సుత నిధి దేవగేహ వన బ్రహ్మస్థాపిత తటాక సత్కృతులను సప్తసంతానంబులు వెలసి విద్వాంస పౌరాణి కైతిహాసిక భట్ట పరిహాసక గాయక వందికులను సభాసప్తాంగంబులు గలిగి లవణేక్షుసురాసర్పిదధిక్షీరశుద్ధోదకంబు లను సప్తసాగరంబులు గడచి - - - - - - దానధర్మపరోపకారంబులను ధర్మత్రయంబు నెఱింగి ప్రభుమంత్రోత్సాహంబులను శక్తిత్రయంబు గలిగి శత్రుమిత్రోదాసీనంబులను త్రివిధంబుల, సుక్షేత్రిస్థితిలయస్వహస్త్రి గుణంబుల నెఱింగ, ప్రభాతమధ్యాహ్నసాయంకాలసంధ్యాత్రయ నియమవంతుండై - - - - అర్థకామమోక్షంబులను చతుర్విధపురుషార్థుఁడై వేదశాస్త్రపురాణేతిహాసంబులు.... క్షౌరాభ్యంజన దంతధావనధౌతవస్త్రంబు లను చతుర్విధముల గరగరిక లెఱింగి వస్త్రాభరణగంధపుష్పంబు లను చతుర్విధశృంగారవంతుండై, ఉన్మదన మోహన వశీకరణ సంతాపంబు లను చతుర్విధ మదనమార్గంబులం దెలిసి - - - - - ధనధాన్యకుమారవస్త్రవాహనభూషణబంధుదాసదాసీజను లను నష్టైశ్వర్యంబులు గలిగి భోజన

వస్త్రగంధపుష్పతాంబూలప్రియకామినీసంగతగోష్ఠి పూవుపాన్పు లను నష్టభోగంబు లనుభవించి - - - -

ఈరీతిగా రెండుభాగములందును, సంఖ్యలతో నిరుపదితొమ్మిదిగణములు, యిరువదిప్రాసంబులు, నేఁబదియతులు, దోషములు నలంకారములు సంగీతరాగములు, నష్టాదశపురాణోపపురాణంబులు, ముప్పదిరెండాయుధములు ఛప్పన్నదేశంబులు - - - - జెప్పఁబడియున్నవి. సమయస్ఫూర్తి కిట్టివిషయములు గుప్తు తెలిసికొనియుండుట మంచిది పూర్ణప్రతి సంపాదించి పరిషత్పత్రికలో మున్ముందు పూర్తిగా ముద్రింపఁబడును. విషునామసంవత్సరము నవరాత్రులలో వ్రాయఁబడినది. రాయబ్బద్దిసుబ్బాశాస్త్రులవారి పుస్తకము. సుబ్బాశాస్త్రులవారే వ్రాసినట్లు కనఁబడుచున్నది.

6. ఆంధ్రకౌముది. గ్రం. సంఖ్య. ౧౬

ఇది, గణపవరపు వేంకటకవి సర్వలక్షణశిరోమణిలోని యాంధ్రవ్యాకరణభాగము. ఇది 31 పత్రములలో వ్రాయఁబడిన పెద్దసీసమాలిక—ఇందుఁ దత్సమపదములు, తద్భవములు, దేశ్యములు, గ్రామ్యోక్తులు, సంస్కృతసంజ్ఞాప్రకరణము, అజంతములు, విభక్తులు, సంధులు, ఆదేశయకారసంధి, పరరూపములు, హలంతసంధులు, లుప్తవర్ణపదసంధులు, ద్విత్వవిధానము, జస్త్వవిధానము, హలంతప్రథమ, ఏకవచనబహువచనరూపములు, దేశీమూల తెనుఁగు ప్రథమైకవచనములు, సతిసప్తములు, అప్రాణివాచకాదంతాల సప్తమిత్రుతీయలు - - - అన్వయములు, అప్రత్యయములు, ఆఱువిధములకారకములు, సమాసములు, కృదంతములు, క్విప్రత్యయములు, వర్గచతుర్థకాంధకార - - - - నకారణకాంములు వట్రుసుడులు మొదలగునవి వివరింపఁబడినవి. ప్రారంభము—

క. శ్రీభామాసర్వోక్తిక, భాభవనిజసుందహాస భాగధగశ్రీ
శోభితశుభతత్కుచకుం, భాభోగకేలాస వేంకటాచలవాసా.

అవధరింపుము.

సీ.మా. శ్రీకరమ్ముగను సంస్కృతమునకును బ్రాకృతమునకుఁగలలక్షణములు చెప్పి
తెనుఁగున నావిధమ్మున లక్షణము చేయరాకున్కి యదియు నేరంబు గాదు
తొల్లిటి సుకవుల కెల్లను నను ధన్యుఁగావించు తల పింతె కాని యనుచుఁ
గుకవిజనాజ్ఞానఘోరాంధతమసము పోఁగొట్టఁ గల్గు కౌముదివిధాన
నిల మున్నుఁ దెనుఁగున నెవ్వా రెఱుంగని యాంధ్రకౌముది యనునట్టికృతిని

సీసమాలికగాఁగఁ జేసితి నిపుడున్న కవులకు రానున్న కవులకెల్ల
నుపకారముగఁ నిదియెపుడు నాచంద్రతారార్కమై కౌముదియనుపేర నెలయుఁ
గననిందు సంజ్ఞాప్రకరణమ్ము మొదలుగఁ దత్తత్ప్రకరణము ల్దనరు వరుసఁ
సత్రిలింగపదంబు తద్భవం బగుటచేఁ దెలుఁగనఁ దగినట్టి తెలుఁగు ప్రాకృ
తాభిధానముగాన నాలక్షణమ్ములు తొలుతఁ గవులకెల్లఁ దెలియవలయు - - -
తత్సమ దేశ్యతద్భవములఁ గలయని తేటమాటగు నచ్చతెనుఁగనందగు
నదియెట్టులన నింకనలరు పేరు కొలంకు నూనెనా నామునం బొసవాలు
బండి పసర మొద్దు పండు పప్పుప్పును దూకలాకులు నాకు బొకు మేను
గుజ్జు మేనిక యెండ కోట వెన్నెల కొల్లగడి పులి నెల వలి నుసుగిన సిఁక
గ్రామాలు జాలు పురాణాలు దోసాలు శాస్త్రాలు వేదాలు సంబుగాలు
గంతులు పొక్కులు గ్రద్దలు బొందలు గాసాలు మొదలుగాఁ గలపదములు
వాసేవు పైన్లు రాగేసేవు నీవూను కూసుకుంటూ గోంతిగుస్సరాకు
పాడేవు కాలెత్తి యాడేవు వస్తానె సూసేవు దానికంతాసమీరె
ననుక్రియల్ మొదలైనయవి గ్రామ్యములు - - - - - - -
అఖిలప్రబంధమ్ములందలి లక్ష్యముల్ వేశ్వేర నొకకొన్ని విస్తరింతు
నెమ్మెచ్చినాఁగను దమ్మంట్లు నాఁగను దివ్వెంతయనఁగ మదించెననఁగ
వానిదవంధ్య జీవనమనంగ ననలజ్యోతుండ నన నిచ్చచుండు ననఁగ
నంతంతనఁగఁ బరమాత్మందురనఁ దామరసనేత్రలింగ్లన బ్రహ్మాశఁజన
శౌరిచ్చభక్తి వేసారక నెంతధికంబన గురునాజ్ఞ గనుఁగొననన
మీరప్పు డంద. ఆోమ్మికను బొల్తిదియన నేయుమియు మననేయోయనంగ
- - - - - - - - - - - - - - - నింకస్థావరాప్రాణి నాచకములగునుఁ
దగునుకారాంతశబ్దము లకారాంతములను బంచమీ తృతీయలను సప్త
మినల బహుళ నేకతను రెండును జెలంగు గట్టునవచ్చెను గట్టవచ్చె
ననఁ జెలి ప్రేలఁ జూపెను ప్రేళ్లఁ జూపెనా నొకయూర నిల్చువాండూళ్లనిల్చె.

ఇట్లే వ్యాకరణమంతయు వ్రాయఁబడియున్నది. ఈ 16-వ పుస్తకములో శబ్దమంజరి (సం.) ఆంధ్రనామసంగ్రహము, అకారాది దేశీయ తెనుఁగులు, వేంకటేశాంధ్రము, ఆంధ్రకౌముది, ఆంధ్రశబ్దచింతామణి యనునవి గలవు. సిద్ధార్థినామసంవత్సరము ఆవణి నెల ౧౫-న తేది రాచవేల్పు కృష్ణమరాజు స్వహస్త లిఖితమైన సర్వలక్షణశిరోమణియందలి యాంధ్రకౌముది తృతీయోల్లాసము సంపూర్ణము--- అని కలదు.

# విషయసూచిక.

విషయములు. పుటలు.

# ఆంధ్రసాహిత్య పరిషత్పత్త్రిక

సంపుటము ౧౩. | రక్తాక్షి నామసంవత్సరము. జ్యేష్ఠాషాఢ మాసములు. | సంచిక ౨.

## బంగారము.

---

గీ. తల్లిలాంగలాగ్రమున నంతంబు నొందె,నంత మొందె సుతుండు విషాన్నభుక్తిఁ
గొడుకునకుఁ దల్లికిం బగల్గూర్చునట్టి, కనకమా నీకు నొకనమస్కార మమ్మ.

సీ. అబ్బించెదవుగదా వ్యభిచారభావంబు పతిదైవ మనుపతివ్రతలకైన
ననిపించెదవుగదా యనృతవాక్కులు నోట సత్యంవదేత్తను జనులనైనఁ
ద్రోయించుదువుగదా దొంగతనాలలోఁ జోరత్వ మెఱుఁగని సురలనైనఁ
గూర్చుచుందువుగదా కోర్కుల సర్వసంగత్యాగులైనట్టి ఘనులనైన
నిట్లు వర్ణింపనేల నిన్నెంత యెంత, వారిచేనైన నేలాటి పనులనైన
నట్లు చేయించి తీరుదు వంతలోనఁ, దల్లి బంగారమా నీవు తలఁచికొనిన.౨

ఉ. ఆఁకటిఁదీర్తువా? రసన యారినపట్టున దప్పిఁ దీర్తువా?
మూకతనంబు మాన్పుదువ మోక్షము నిచ్చెద వొక్కొ; సద్గుణా
నీకము లేవి నీకడ జనించిన వున్నవొ చెప్పు చూతమో
నీ కనకమ్మ, కోరుదురు నీ నిను నల్పులు వారు కారొకో. 3

శా. చోరత్వం బొనరిం త్రినీ యనృతవా క్యారత్వముం గాంత్రహో
జారత్వంబునకుఁ భయంపడరు త్వత్సంపాదనోద్వర్తనుల్
నీరాక ల్బహుదుఃఖజాలములఁ గల్గించు న్సుఖం బొర్చు బం
గారమ్మా యిది యేమిపాపమొకొ నిన్గాంక్షింతు రేవారలుఁ. ౪

గీ. కొట్టుకొనిచత్తురమ్మనీకొఱకుఁ దల్లి, యేమిసుఖముబంగారమా యిడుదువొక్కొ
వెఱ్ఱివారలు భూమిలో వెలసినపుడు, కానివారలకే గల్గు గౌరవమ్ము. ౫

సీ. చూడనీయవుగదా సూక్ష్మయత్నాలభ్య పరమాత్మతత్త్వసంపత్ఫలంబుఁ
బొందనీయవుగదా పూర్వకాలాగతప్రాణబంధుత్వసంబంధగరిమ

గాఁచనీయవుగదా గౌరవకీర్తిముఖ్యార్థాగనిత్యసత్యప్రసక్తిఁ
గలుగనీయవుగదా కాలోచితపదార్థనిద్రానుభవలభ్యనిరతసుఖముఁ
బట్టివర్ణింప లేకపోఁబట్టి గాని, యొక్కసుగుణం బయినను లే దున్న నన్ని
దుర్గుణంబులె నీకడ దొరలుచుండు, సత్యమున స్వర్ణమా యేమి జంకు నాకు.

గీ. ఐన దూరదృష్టి నెఱుఁగ కజ్ఞులెల్లఁ, బ్రాఁకులాడుచు నుండ్రు నీప్రక్కఁ జేరఁ
జిత్ర మేమొ బంగారమా చెప్పవలెనె, నూర్గురందుఁ గనలేక నూకఁబడరె.

సీ. సత్యంబునకు హరిశ్చంద్రుండు నిన్నొకా కిచ్చె రాజ్యము కాశికేగునాఁడు
ఆలాగె శ్రీరాముఁ డాచరించెను దండ్రిమాటపై నడవుల మసలునాఁడు
సీతామహాదేవి చేసేత విడనాడె భూషలు లంకకుఁ బోవునాఁడు
సావిత్రి త్యజియించె స్వర్ణభూషణముల భర్తృసేవ యొనర్ప నచ్చునాఁడు
ఆచరింత్రుగాక నిను నొకప్పు డెట్లొ, తగు నవసరంబు వచ్చిన తరుణమందు
నెంద ఱెందఱు పూరుషు లింతు లట్లు, నిన్నుసరిరి బంగారమా నిజము వల్క.

గ. జ్ఞాన వైరాగ్యసంపద ల్గల్గువార, లెవ్వరు పసిఁడి నిం జేరనిచ్చినారు
అమృతసారంబుగోరెడునమరనరులు, భక్తిఁద్రాగుదురొకో చింతపండుపులుసు

సీ. తలనొప్పి పోవునే తలకు నాగరమున్నఁ బోవునే చెవి పోటు ప్రోగు లున్న
ముక్కుముందరఁ బెద్దముంగరఁ జేర్పంగ శింఘాణభారంబు సేరకున్నె
కాసులు కంటెలు కంఠంబునం దున్నఁ గంఠార్తి పోయి సౌఖ్యంబు లగునె
కాళ్ల కండెలు గల్గఁ గాల్కడుపోవునే కరపీడ వోవునే కంకణములఁ
మోఁతదండుగ మిము మోయ మూర్ఖవనిత, లీరహస్యము గనలేక యిట్టు లట్లు
దుఃఖపడుదురు మిముఁగోరి దోషమనక, బంగరునగలార యెదో మీ భాగ్య

శా. అమ్మా! భారతఖండమా యిఁక సువర్ణాలంకృతుల్చి యన [మెఱుఁగ.
ర్ఘమ్ము ల్చిరలఁ గోరకమ్మ యొడలిం గప్పంగనాసట్టి వ
స్త్రమ్ముల్ తూత్తును దీర్పఁగాఁ దగిన యన్నంబుం గొనంగోగులా
భమ్ము ల్పెక్కులు దేశమందగు సదభ్యాసం బటు ల్గల్గినన్

గీ. పరిమళము లేదు రుచి లేదు పరువు లేదు, మార్దవము లేదు నీకడ మహిమ లేదు
కనకమా నిన్ను నేలకో గౌరవింత్రు, ప్రజలు వెఱ్ఱివారలుగారొ వాగ తలఁప

గీ. కనకమా యెంతకాలంబు గర్వపడుదు, వింక సాగవు నీయాట లిదిగొ వినుము
బయలు దేఱుచునున్నారు వనిత లిపుడు, సద్గుణవతులు విద్యావిశాలమతులు
నీమొగము సేని గనని నిర్ణిద్ర లధిక, లార్యలు పరోపకారసదాభరణలు
నిన్ను నవలకుఁ ద్రోసెడు నేర్పరులును, దేశభక్తులు దేశవృద్ధిహృదయులును

ప్రాణమేవ పరిత్యజ్య మానమేవ, రక్ష రక్ష రక్ష యనెడు రమ్య గుణాలు
స్వర్ణభూషణంబులు మాకు వలదువలదు, వలదటన్న సన్నుతులును భర్తలో ఱకుఁ
గలిపి గెలుపొంది మెప్పులఁగాంచు సతులు, సత్యచిత్తలు సాధ్వులు శాంతయుతలు
మంచి చెడ్డలఁగను పట్టి సుహితమతులు, క్రిందు మీఁద గు మీఁదను క్రిందన గును
గన్న దెఱవకుందురె కలకాల మెల్ల, కాల మొకరీతిఁ గడవదు మేలుకొనుము
తెలివితక్కువవారలు గలిగినపుడె, గౌరవము నీకుఁ గల్గును గాని నాఁడు
గలుగునా గౌరవము కనకమ్మ నీకు, నాశ యుంచిన నీపయి దేశమెట్టు
లుద్ధరింపంగఁ జాలుదు రుచితగతులఁ, సంచరింప నెట్లెట్లు మోక్షంబు గనుట.

గీ. ఆయరుంధతి కెవి నగ లంతమాత్ర, గౌరవార్హ కాదే పెండ్లిఁ గన్యలెల్లఁ
గనకభూషితగాత్రలఁ గనక యామెఁ, గాంచినం గాని ధన్యలు గారు గాదె.

గీ. భూషణాంబరాలంకృతల్పుష్పఁ బోండ్లు, శతములున్నఁ ద్యజించి దుష్యంత నృపతి
నగలు లేని శకుంతల న్గని వరించె, నగల, సుగుణంబులా ప్రధానంబు లిచట.

గీ. అమ్మలారా నమస్కృతు లాచరించి, చెప్పుచున్నాఁడ నొకమాటఁ జెవియొసంగి
శ్రద్ధతో విని వినినట్లె సలుపుఁ డమ్మ, మరల ముమ్మాఱు మిమ్ము నమస్కరింతు
పసిఁడి నగలంచు బులుపాటపడెద రంతె, కాని యవి యెట్లు వచ్చునో కాన లేరు
హానికోఱకు మీనాథులు పడెడు పాట్లు, కూపకూర్మము లట్లు మీకొంపలందె
మీరు పడియుంట నెఱుఁగరు మేలుఁ గోరి, మీకు వివరింతు నీక నైన మేలుకొనుఁడు
భంగపఱుచు నసత్యము లపలుకుచుంద్రు, జారచోరత్వపద్ధతి సంచరింత్రు
స్వామిమిత్రాహితంబులఁ జల్పుచుంద్రు, పరులకొంపలు గూల్చుచు ప్రాణహాని
మానహానినొనర్పఁ గామసలుచుంద్రు, మోసపుచ్చుచు మాటల మోయుచుంద్రు
గపటసాక్ష్యంబు లిచ్చుచు గడ్డితింద్రు, భ్రూణశిశుహత్యలను జల్పఁ బూనుకొంద్రు
దోఁపఁ బుట్టులసొమ్ములు దోఁచుకొంద్రు, దేశభక్తుల నిందించి తిట్లు తింద్రు
తప్పుతూనికలందూఁచి ధనముఁ గొంద్రు, వెఱవకవితంతువులఁ జేం వెదకుచుంద్రు
అన్నదమ్ముల భాగాల నాక్రమించి, దుఃఖపెట్టుచు దాగులు దోఁచుకొంద్రు
లంచములు గొంద్రు స్త్రీకరులై ప్రలకుఁ, గపటసాక్ష్యంబు బోధింత్రు కల్లలంద్రు
గ్రుడ్డిగవ్వైన మానక వడ్డిఁగొంద్రు, తప్పుపద్దుల వ్రాయుదు రప్పునిడక
దొంగనోట్లు వ్రాయింతురు దురితమనక, సకలపాపకృత్యంబుల సంచరింత్రు
పుణ్యకార్యంబులను జేయఁ బూనుకొనరు, అన్నవస్త్రంబులకె యిట్టులాచరింప
వలయుననుకొనఁబోకుఁడు వానికొఱకు, న్యాయవృత్తులసంప్రాప్తమైన ధనమె
చాలుఁ జాలుకే కాదు విస్తారమగును, ధర్మసూత్రంబు గనుపట్టు ధన్యుఁ డెవఁడు

భూషణంబులకే యెన్నో దోషవృత్తు, లాచరింపవలసివచ్చె నరసి చూడ
నూరకే వచ్చునా నగ లున్నతంబు, లైన మేడలు మిద్దెలు హర్మ్యములును
పట్టుచీరలు ముకుములుబట్టలున్నె, శాలువలు మహోమృదుల దుకూలములును
గుఱ్ఱపుంబండ్లు మోటార్లు కిఱ్ఱుఁజోళ్లు, మునిఁగి మీమోహవారాశి బుద్ధిలేక
చూచినంతనె మోహాబ్ధి నైచునట్టి, యిట్టితుచ్ఛవస్తువులకే యెల్ల దోష
వృత్తులొనరించుచున్నారు వీనివలన, హేయనరకంబు లబ్బక యెట్లు మాను
గావున వివేకవతులయి కష్టమనక, యిట్టితుచ్ఛవస్తువులను హేయములగు
నగలు వలదంచు మీరు మీనాయకులకు, సదుపదేశంబులం జేసి సాధువృత్తి
గలుగఁజేయుఁడు పుణ్యంబు గట్టుకొనుఁడు, దీనిచేఁ బ్రజాక్షేమంబు దేశవృద్ధి
యాయురారోగ్యభాగ్యంబులాత్మశుద్ధి, యైహికాముష్మికసుఖంబులగును వినుఁడు
దుష్టు లడుగంటుదురు పోవు దోషభరము, సజ్జనాళి ప్రబలనగు సంఘశక్తి
నెలకుమూఁడువర్షంబులు నిండఁగురియుఁ, బంటలుసమృద్ధిగాఁబండుభవ్యమగును
దేశదారిద్ర్యదోషంబు తీఱిపోవు, భుక్తిముక్తులు సేకూరు బుద్ధిగలిగి
తల్లులార! యీలాభముల్దలఁచితలఁచి, పైనిజెప్పిన ట్లొనరింపఁ బూకొనుఁడు
నడుముగట్టుఁడు త్రొక్కుఁడు న్యాయపథము, కాంతలనుకొన్న కార్యముల్గాకపోవు
స్త్రీ తలంచినకార్యంబుఁ జేసితీరు, వందనంబులు మీకివే యందుకొనుఁడు.

గీ. కల్లుగంజాయి చుట్టలు నల్లమందు, పొడుము ప్రత్యక్షనష్టము ల్పొందఁ జేయు
ననుచెఱింగియు మాన లేరవని మర్త్యు, లెంతబోధించినను బండితేంద్రులకట.

గీ. అంతరానర్థమును జేయు చెంతయేని, పైకి మేల్సేయునట్లున్న పసిఁడినిన్ను
విడువ రెంతబోధించిన విడుచునేమొ, కోటికొకఁడైన ననియిట్లు గూర్చినాఁడ.

వేదుల సూర్యనారాయణశాస్త్రి.

# విజ్ఞాపనము.

పాఠకమహాశయులార!

వెనుకటి సంచికలోఁ గోరియున్నను బాకవర్యు లెవ్వరో నలుగురైదు గురు తప్పఁ దక్కినవారు, రెండుమూఁడేండ్లకుఁ బంపవలసియున్నను బంపలేదు. కారణమూహ్యము. ముందు, వారువారు బాకియున్న మొత్తము తెలియఁబఱిచి కొంత గడువుపెట్టి, ఆగడువులోపల నీయనివారిపేరులు తొలఁగింపవలసినదని తీర్మానము చేసికొన్నారము. విద్యావిషయకమైన పొమ్ము. మీపేరు తీసివేసిన దాఁక నుపేక్షించుట ధర్మము కాదు. వ్రాసినఁ బ్రత్యుత్తరము వ్రాయకుండుట వ్యవహారధర్మమును గాదు. కాఁబట్టి దయచేసి వృథావ్యయములకుఁ బొల్పఱుపక కొంతకొంతయైనఁ బంపించుచుందురని సహృదయులగు పాఠకవరుల వేఁడుచున్నారము.

పరిషత్పత్రికకుఁ జరిత్రాత్మకములు, భాషావిషయములునగు వ్యాసములు పద్యములు సలక్షణశైలిలో వ్రాసిపంపినయెడలఁ బత్రికలో ముద్రింతుము. అతి విస్తరముగాకుండ 10-16 పుటలలో నుండునట్లు పంపిన మంచిది.

కార్యదర్శి.

# గ్రంథస్వీకారము.

1 లచ్చారాయజీవితచరిత్రము — కీర్తిశేషులగు శ్రీ చెలికాని లచ్చారావుగారి జీవితచరిత్రమును వారివంశమును పిఠాపురము డివిజన్, చిత్రాడలో రామవిలాసముద్రాక్షరశాలలో దొరకును.

| | రూ. | అ. | పై. |
|---|---|---|---|
| 2. లక్ష్మీనారాయణపరిణయము—శివపల్లె సర్వోత్తమకవి, అముద్రితాంధ్రగ్రంథసర్వస్వము, చిత్రాడ, ప్రచురించినది - | 0 | 12 | 0 |
| 3. రసపుత్రజీవనసంధ్య—(నవల) భాగవతుల లక్ష్మీనరసింహశర్మగారు, అముద్రితాంధ్రగ్రంథసర్వస్వప్రచురణంబు, చిత్రాడ. | 0 | 14 | 0 |
| 4. భక్తియోగోపన్యాసములు—శ్రీ కూచి నరసింహముగారు బి. ఏ., అముద్రితాంధ్రగ్రంథసర్వస్వము వారు, చిత్రాడ - | 0 | 14 | 0 |
| 5. గౌతమబుద్ధచరిత్రము—శ్రీ సీరిపి ఆంజనేయులుగారు, ధర్మవరము - - - - - - - - - - - | 0 | 6 | 0 |
| 6. శ్రీకృష్ణభూపాలీయము (ఆంధ్రలక్షణగ్రంథము) చంద్రకవి, మైసూరు సర్కారువారు ప్రచురించినది - - - - - | 0 | 12 | 0 |
| 7. South Indian Inscriptions (Texts) రావు బహద్దరు హో॥ కృష్ణశాస్త్రిగారు బి. ఏ., చెన్నపురము గవర్నమెంటుప్రెస్ | 12 | 8 | 0 |
| 8. హితోపదేశములు(మిత్రలాభము) బ్ర॥ వెంపట కుటుంబయ్యశాస్త్రిగారు, చెన్నపురి ఆంధ్రపత్రికాలయములో - - | 0 | 4 | 0 |
| 9. ఆంధ్రకూటముద్గరము—ఆయుర్వేదశాస్త్రి కందుకూరి వేంకట సుబ్బరావుగారు. ఏలూరు - - - - - - | 0 | 4 | 0 |
| 10. భీష్మప్రతిజ్ఞ—(నాటకము) బ్ర॥ మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు, రాజమహేంద్రవరము - - - - - - | 1 | 0 | 0 |
| 11. నవనిబంధనలు—(బైబిలు పద్యకావ్యము) శ్రీ రాజామంత్రిప్రెగడ భుజంగరావు బహద్దరుగారు. ఏలూరు - - | 1 | 4 | 0 |

ద. సౌరాష్ట్ర॥ ఆది॥ పులుగురా తేజిని బొలుపుమీఱఁగ నెక్కి, చెలువమన్నారును జెంగమయు వచ్చెను.

వా. ఆసమయంబున మీసరంబుగా నంబుజాక్షుని వెంటవచ్చు వారిజాక్షులు ముదముమీఱ పదకేళిక వినిపించిరఁట యెటువలెను.

పదము. తాళఁజాలరా తమిమించెరా

బాళితో నన్నేలుకోరా బంగారుమన్న మ్రొక్కేరా॥ ౧

మరుఁడు నామీఁద దండెత్తె మమత మిగుల హెచ్చెరా

గరుడవాహన కౌఁగిటఁ జేర్పరా॥ ౨

వా. ఇవ్విధంబున నచ్చెలువ మన్నారును జెంగమయు వేంచేయు సమయంబున నాదివ్యప్రభావంబుగల యాదివరాహస్వామియు నుల్లసత్తేజోవిరాజమానులైన తిల్లగోవిందరాజులును రమ్యవైభవంబున రాణించు శార్ఙ్గపాణియు నవక్రపరాక్రమంబు గల చక్రపాణియు వైరిమదాపహారి యైనశౌరిరాజస్వామియును నీలాంబుజశుభాకారంబు గల నీలమేఘస్వామియు శృంగారవైఖరిం జెలంగు సింగపెరుమాళ్లును దళితసుజనాంహుం డగుతంజపురి నరసింహుండును రఘునాథనరనాథప్రతిష్ఠాపరుం డగురఘునాయకులును రఘునాథపురాగ్రహారాగ్రమణిరై రమణీయుం డైనరఘునాయకులును, ఆ రఘునాథమనుజనాథుండును రంగద్విహారు లగు తిరుమంగయాళ్వారులును మొదలుగా సురపతులచేతఁ బూజలు గొన్నతిరుపతులనుండి వేంచేయు స్ఫూర్తిగల నిజలీలామూర్తుల నందఱి నవసరంబులవారు బడిబడి విన్నవింపఁ బొడగనిపించుకొని ముందుగా భేరీశతంబులు బోరుకలంగ ననుందచతురంగబలంబులు సందడిగ నడవఁ బొడుగు లగు గొడుగులును జోక్యంబు లగు టెక్కెంబులును నరుదు లగు బిరుదులును మనుజనయనోత్సవకారణంబు లగు మకరతోరణంబులును జాలరాణించు చాలుదివటీలును నెడనెడలఁ దీరు గలదీపంబుల తేరులును ప్రావీణ్యంబు మీఱఁగావించు రావణ కుంభకర్ణ వాలి సుగ్రీవ హనుమదాది భానంబుల మించు దీపప్రతిమలును నాగువు లైనమేరువు దివటీలును నెంచఁదగి మించు కంచు, వెండి, బంగారు కైదివటీలును రాణగల బాణవిద్యలును దండిగా నిండియుండ గోవర్ధనోద్ధరణ గోపికావస్త్రాపహరణభావ ప్రతిమలును నింతుల వసంతకేళికవిధంబును నుల్లసిల్లు మల్లయుద్ధప్రకారంబును మొదలుగాఁ బలువగలఁ బన్ని తెచ్చు జంత్రంపుప్రతిమలును విజయరాఘవ భూచక్ర

విభుండు సమర్పించు భూచక్రగొడుగులును సౌవర్ణరాజచ్ఛత్రచామరధ్వజ వ్యజనాదులును, రంగారు బంగారు పనిమానవులు గలహారిగెలును నిరుగడలఁ జాలుగా నడవఁ బొగలేని పగలువత్తులు మిన్నగా వెన్నెలలు గాయ, యెగ్గాళెలు బూదగాళెలు దిగ్గగనాంతరంబుల నగ్గలంబుగా మ్రోయ హృద్యంబు లగుచక్రవాద్యంబులును, రంగారు సంగీతమేళంబులును బాలికలు వినుపించు కేళికలును సన్నిధిం జెన్నుమీఱ వెనుకనిక్కునఁ గనక ప్రతిమాచిత్రితంబై యుప్పరం బంటు గొప్పపూచప్పరంబు దనర నరగజంబులును గజంబులమీఁది డమామీలును దిక్కులఁ బిక్కటిల్ల నొక్కటిగఁ మ్రోయ నల్లచెంగమలవల్లికాంబయు శ్రీరాజగోపాలస్వామియు రాజవీథిని దేజంబు మీఱ వేంచేయు నవసరంబున నవ్విజయరాఘవేంద్రుఁడు జన్వనులును దాను గోరికమీఱఁ జేరికఁ జేరి సేవించి మదిని భావించి ప్రదక్షిణంబు గావించి తత్ప్రసాదంబు స్వీకరించి యామున్ననాయుల సన్నుతి చేసెనఁట యెటువలెను.

సీ. కరుణారసము చిల్కు కడకంటిచూపుల గరిమతో భక్తులఁ గాచువానిఁ
జందమామనుమించునందంబుగనుపించు మొలకనవ్వులముద్దుమోమువానిఁ
బద్మంబుపై వ్రాలు భ్రమరం బనస్తించు మేటికస్తురిబొట్టు నీటువాని
విజయసారథియాట విజయంబు చేకూర్పు కనకవేత్రము కేలఁ గలుగువాని
నౌదలను వైరముడిదాల్చు నందగాని, గొప్ప చౌకట్లు వీనులనొప్పువాని
రాజితం బైనకనకాంబరంబు వాని, గంటి మన్నారుఁ గన్నులకఱవుదీఱ.

వా. అని సన్నుతించి విజయరాఘవచంద్రుండు చంద్రవదనలుం దాను నయ్యదుకులచంద్రు నగ్రభాగంబున సంచారి రాజగోపాలుండోయని ప్రపంచమూహించ నచ్చటికి మచ్చెకంటులు ముచ్చట దీర నచ్యుతవిజయరాఘవేంద్రుని విలోకించ వచ్చిరఁట యెటువలెను.

శుద్ధసావేరి॥ ఆది॥ ద॥ అంగజునిచెలువును నలరు మన్నరుదాసుఁ, బొంగుచుఁ గనుఁగొని పూనివేడుకను॥ బంగారుమేడలను బాగుమీఱంగఁ బౌర, శృంగారవతు లెల్లఁ జేరవచ్చి రపుడు.

వా. ఇవ్విధంబున నచ్చెలువలు (వచ్చి) విచ్చనవిడిగా నచ్చట నేమని ముచ్చటలాడుచున్నారు.

ద్వి. చెలువమన్నరుదాసు చెలువంబుఁ జూచె, నలిరుఁబోణి యొకర్తు తలయూఁచి మె
చ్చెఁ, జామయొక్కతె వానిచక్కఁదనంబు, వేమాఱుఁ గనుఁగొని విస్మయంబందె

నువిదయొక్కతె వాని యొయ్యారమునకు, నవ్వురౌర యనిమెచ్చి సూచాయనిలిచె
నుదతి యొక్కతె వానిసొగసుఁ గన్గొనుచు, మదిరాక్షి వీఁడెపో మన్మథుండనియె
వెలరాచసివ మెత్తి వనితయొకర్తు, చెలువుని జేసాఁచి చెలరేఁగి పిలిచెఁ
గులుకుమిటారంపు గుబ్బ లబ్బఁగను, బలుకరించె నొకర్తు బాన రమ్మనుచు
వలపు రెట్టించెరా వలరాయ లోనఁ, జెలువరాయలు నన్నుఁ జేకోర యనియె
నే వింతదాననా నీ వింత సేయ, రావోరి రసికుండ రాపుసేయక నె
నింతిరో పినికి నెంతగర్వంబు, నంతెఁ డీతనివాటి గాఁడోటు జగతి
నీసతు లిందఱు నేమిపుణ్యంబు, చేసిరో యితనితోఁ జెలిమి సేయుంగఁ
గొమ్మ మాటాడఁడే కోపమో తనదు, సొమ్మేమి పోదు ముచ్చునగలు వాని
వీని మెప్పింతునే వెలఁదిరో నేను, మానాస్త్రమొనలను జూడునా నేర్పు
అనిముచ్చటలు హెచ్చనంగనామణులు, ఘనమనోరథములఁ గలఁగి రావేళ.

వా. ఈలాగున లీలావిలాసకలాకలాపకమనీయ త్రైనమానవతులు మానశరావళి హోవళి సైరింపలేక సొంపుసడలి వెడవిల్తుదూఱి కడలేని మోహంపుకడలి మునిఁగి బహుభంగుల నేమనుచున్నారు.

ద - లలితపంచమము - ఏకతాళి.

వలచినవారు లేరో వలపించువారు లేరో, చలము సేసేది మేరా సరసకుఁ జేరరారా!

ఖాబి - రూపకము. [నాకారా

చక్కనివారు లేరో సొక్కించువారు లేరో, మొక్కళింపుగుణము మానరా మోహ

వా. మఱియు నిద్దఱు నన్నెలాండ్రు మన్నారుదాసుం జూచి యేమనుచున్నారు.

దేసవు - తోడి - ఆది.

మరుండు పచ్చిబోయగా, మక్కువఁ గౌఁగిలీయరా
మరులు హెచ్చెరా మన్నారుదాస ధీరమల్లారు ॥ ౧
నన్ను రతుల నేఁచరా నగుఁబాటు సేయనేలరా
మన్నారుదాస లాలింపరా మనవులాలింపరా. ౨

వా. మఱియు నిద్దఱు గజయానలు విజయరాఘవుం జూచి యేమనుచున్నారు.

ద. మోహము నిలుపలేరా, ముద్దువిజయరాఘవధీర
మోహనాకార యేరా మ్రొక్కేను కౌఁగిలీరా. ౧
నీవు సేసేది మాయరా, నీటుకాఁడ మఱేమాయెరా
భావమే లేసతమాయెరా, పగలు రేలు మరుసామాయెరా. ౨

కళ్యాణిరాగము - ఆదితాళము.

కొమ్మ రమ్మని చీరరా కులుకు గుబ్బలు చీరరా
కమ్మవిల్తుండు పగదాయరా కనికని కేల లేదా యెరా.

వా. మఱియుసిద్ధులు కంజాక్షులు తంజాపురాధ్యక్షునిం జూచి యేమనుచున్నారు.

భైరవి - రూపకము - ద.

ఆశయాా నేనున్నేలాశయాా నేక్, వాశియాా యె న్నెక్కూడ వళవుక్కొరుక్కాల్ నాడా.

నాగగాంధారి - ఆదితాళము.

శొల్లైవాడా వారురగస్యం శొల్లైవాడా, యెల్లారుం గేళ్క చొన్నాలెదా యన్ను యిరుక్కప్పొరా.

వా. మఱియు నొకవిలాసిని కళావతినుతునిం జూచి యేమనుచున్నది.

ద॥ సాళగసౌరాష్ట్ర - ఆదితాళము.

బేగబారో సామిా బేగబారో త్యాగభోగరాయదయధనళునాను.

వా. ఈరీతిఁ బౌరనారీతిలకంబు లంగంబులఁ బులకలు తులకరింప మెచ్చుఁగా నచ్యుతవిజయరాఘవునిం గనుంగొని యనంగునిబారి సైరింపలేక చొక్కి తక్కి యలసి సొలసి తదేకాయత్తచిత్తలై యున్న యనంతర కథాసంవిధానం బెటువలెను.

ద్వి. ఆవేళ నొకయింతి యంగజుదంతి, చేవంతిపూబంతి చెలుల మేల్బంతి
చెఱకువిల్తుకటారి చికిలిమిటారి, మురువుమిాఱినకొమ్మ ముద్దులగుమ్మ
యంబుజమృదుపాణి యలినీలవేణి, కంబుసోదరకంఠి కలకంఠకంఠి
యెలజవ్వనపుచాన యిభరాజయాన, నలరాజు పూముల్కి నలువులకల్కి
రాజచంద్రునిపుత్రి రమణీయగాత్రి, రాజనిభానన రాజీవనయన
చెంగావివలిపంపు చేలధరించి, రంగుముత్యముజంటరవికయుఁ దొడిగి
పడఁతుల తలమిన్న బాగైనయట్టి, జడనిండ సంపంగి సరములు చుట్టి
తీరుగాఁ గస్తూరితిలకంబు దీర్చి, హారంబు లురమున హారువుగాఁ జేర్చి
పంజులకమ్మలు బాగుగాఁ బెట్టి, రంజిల్లు కంటసరంబులు గట్టి
హారువైన బవిరెలు నమరంగనుంచి, ముగువుగా ముత్తెపుముగువు ధరించి
ముంగఱసరిపెణల్ ముద్దుకంటెయును, ముంగామురంబులు మొదలుగాఁగలుగు
సొమ్ములెల్లధరించి సొగసుమిాఱంగఁ, గొమ్మలు గొలువఁగ గోపాలుఁజూడఁ
గంతునిచేయమ్ము గతి సౌధమునకుఁ, గాంతిమతీసతి కడువేడ్క వచ్చె.

ద - బిలాహరి - ఆది.

రతినాలయమందెల రవళి రాణింపఁగా, సతులతోఁ గాంతిమతి సౌధంబుఁ జేరె.

వా. ఇవ్విధంబున వచ్చిన యామచ్చెకంటి పచ్చవిల్తునిం గన్నయ్యను నెయ్యంబున సేవించి మదిని భావించి తనముచ్చట విచ్చనవిడిగా నేమని విన్నవించు చున్నది.

ద - ఘంటారవము - ఆది.

చక్కెరవిల్తునిం గన్న చక్కనివాని, దిక్కులకీర్తిచే నెక్కుడైనవాని. ౧

భుజబలంబునఁ జాలఁ బొగడొందువాని, విజయునిరీతిని వెలసినవాని. ౨

కలవానితో సాటిగలవాని నాదు, చెలువునిగాఁ జేయు చెలునమన్నారు. ౩

వా. అని యారాజకుమారిక తనకోరిక మన్నారుకు విన్నవించి కందర్పకోటిసౌందర్యధుర్యుని, ఆశ్చర్యచర్య నాన్నపాలవర్యుఁ జూచి యీసూనసాయకజనకుండు నానాయకుని జేరికచేసె నని మదినిముదమంది తనవద్దనున్న ముద్దియల విలోకించి కించిదవనతవదన యై నలుదిక్కులు చూచు చెలువునఁ బునఃపునరవలోకంబులు చేయుచు నచ్చెలువ మన్నారుకు నచ్యుతవిజయరాఘవునకు నేదారిని భేదంబుగానక యేమనుచున్నది.

పద్యం కాంతిమతి చదివేది.

సీ. వక్షఃస్థలంబున వన్నెకెక్కిన మచ్చ లాలితం బగువనమాలికయును
సరిలేనికరముల శంఖచక్రంబులు నవరత్నమయ మైన నవ్యనేత్ర
మనుపమం బైమించు కనకాంబరంబును రమణమైమీఱు వజ్రములవంకి
ముంజేతులనుమించు ముత్తెలకడియముల్ చరణపద్మమునందు బిరుదుపెండె
మమరె నిద్దఱి యందును నందముగనె, యెంత భేదించినను భేద మెఱుఁగరాదు
కావునను రాజగోపాలదేవుఁ డిపుడు, దనర యీపద్వయంబును దాల్చె నేమొ.

వా. అని శుభోదర్కంబుగా వితర్కింపుచు నాబాలార్క తేజుని లక్షణోజ్జ్వలంబగు వక్షఃస్థలంబున భద్రప్రదం బగు మన్నారుదాసముద్ర గనుంగొని యితండె రతివల్లభనిభుం డైన మన్నారుదాసవిభుం డని నిర్ణయించి యాపూర్ణేందువదన తలయూఁచి యాయంద మాచంద మారువారంబు లావన్నెలామిన్న లాయొయారంబు లాముద్దు లాసుద్దు లా మేటితనము లావలపు లాసొలపు లాచక్కఁదనము నారూపు నాచూపు నాజవ్వనంబు నాహావమాభావ మాయనుభావంబు లాదిగా రంగుమీఱు శృంగార విలాసకలాకలాపంబుఁ గనుంగొని యనంగునితాపం బాఁప లేక చాపలంబున నేపుమాని

యూపల్లవాధరలు కైసండగొని వేదండయాన చంపకగదీప్తి యగు ఖంజపర
శుకికోభూషణంబు భీషణంబుగాఁ దోఁచి చెన్నుమీఱఁ గన్యాంతఃపురంబుఁ
బ్రవేశించెనంట యెటువలెను.

వా ఆసమయంబున సగుణాబ్జగమూమనోహరుండును లీలగా నాచోళధరణీరమణీ
పరిణేతయును దనుతను నేవులు సేరి నెలయుచుండువేళ సకలజనస్తోత్ర
పాత్రం బగు వసంతికకథాసూత్రం బెటువలెను.

ద్వి. అంతట రాజచంద్రాత్మజ వేడ్క, నంతఃపురముఁ జేరి యతివలుఁ దాను
బువ్వింపుబంతిగా బోంసేసి మేన, జవ్వాదెలంది పూసరిములు సుట్టి
కపురంపువిడెంబు కడువేడ్కఁ జేసి, నృపతికందర్పుని నెమ్మది నుంచి
యుఁ రాను తూఁగుటుయ్యలఁ బవ్వళించి, నెలఁతసుఖంబుగా నిదురించు వేళ
ముసు దాను జూచిన మోహనాంగుండు, తననుద్దఁగూర్చుండి దయఁబ్రకటించి
కురులు నున్నఁగ దువ్వి కొప్పమరించి, విరవాదిసరములు వేసలింజుట్టి
మోము మోమునఁ జేర్చి ముద్దిడి నిండు, ప్రేమతోఁ గౌఁగిటబిగియించి పెనఁగి
మొలకచన్నులు చీరి మోవియుఁ గ్రోలి, నెలవంకమడుపులు నెసగుస పొసఁగి
యొర్పైన తొడలపై నుంచి లాలించి, తరుణి నేమన్నారుదానుంచ ననుచు
- - - - - - - - - - - నేరుపు మెఱసి, - - - - - - - - - - - యట్లు
కలగని మేల్కని కలకంఠకంఠి, వెలవెలంబాఱుచు విస్మయంబందె.

వా. ఈలాగున మేలుకాంచి బాలికామణి క్రమ్మఱఁ గనుదమ్ములు ముకుళీభవిం
పంజేసి పూర్వానుభవంబు గానలేక విరహాంబానలేక తనలోఁ దా సే మను
చున్నది: కాంతి మతి చదివే పద్యం.

గీ. రాజగోపాలుఁ డేటికి రాజవీథి, వచ్చె సేవింప నేనేల వచ్చె తపుడు
విజయరాఘవవిభుఁ డేల వేడ్క వచ్చె, వచ్చెఁగా కేమి కల నేల వచ్చె నతఁడు.

వా. అని యౌవనజగంధి తన చెలువుండు కలలోన బాళిచే లాలించిన లీలా
విలాసంబులు తనలోనె తాను దలంచి కలంగుచు నచ్చటికి వచ్చిన నెచ్చె
లులంజూచి యేమనుచున్నది.

పదం - కాంభోజి - అట తాళము.

చెలువుగా నేఁడు నాకలలోన వచ్చిన, చెలువుఁ డేఁడే చెలియ చెలువుఁ డేఁడే. ౧
ముద్దుఁ బెట్టఁగ వాఁడు వద్దు పొమ్మంటినో, సుద్దులఁ దేలించి సొక్కించనైతినో. ౨
మొలకచన్నులమీఁద నెలవంక లుంచితే, వలదుపొమ్మంటినో లేక వాదు సేసితినో.
నీవి యంటఁగఁ దాళు నిలువరాయంటినో, యావగ దలఁచఁగ నౌను గాదంటినో.

వా. ఇవ్విధంబున జవ్వని యవ్విభుని గలవరించి కలవరించిన నంచెనున్న మించుంబోణు లొకరికొకరు మోములు చూచికొని చిఱునవ్వు నవ్వి తమలోఁ దామే యనుచున్నారు.

ద - ఘంటారవము - ఆదితాళము.

తిరునాళ్లయేవూరు తెలియలేవూరు, తరుణి యిది సజ్జకుఁ దానేల వచ్చె ౧
రాతిరిపొద్దున రమణి రావద్దంటు, చేతులాడించీని జాతులాడీని ౨

సావేరిరాగము - ఆదితాళము.

ఆఁటది చూచెనా యాపట్టభద్రుని,మాట లేటికి వాని మాయకులో నౌను।
కనుఁగొన్నయంతనె కలలోన వచ్చె, ననఁబోణి చెంతఁ జేరిన నెంత యౌనో॥

నటనారాయణి - ఆదితాళము.

ముద్దువలె నుండునా ముదితయుమాటలు, పెద్దలు వినిరేని పేరడిగాదా
బుద్ధిగాదిది నీకుఁ బొలఁతి యేమనేవు, గద్దఱితనములు కాదు చాలింపు.

ఘంటారవము - జంపెతాళము.

పూఁపచన్నులపడుచు యేపుణ్యమెఱుఁగదు,పాపజాతి మరుఁడేల రాపు సేసీనే।
నిన్నుండి కాదఁటె నెలఁత యీవగలు,క్రొన్ననఁబోణినీవు కొంచెగత్తెవా కాని॥

భైరవిరాగము - ఆదితాళము.

ఏలాగునైనాను యీయింతివలపు, బాలరో యిడుముకొని బైలుసేయరాదె.

వా. అని యివ్విధంబున జవ్వనులు బహుభంగులఁ దనమనోరథభంగంబు సేయఁ దలంచిన తలంపునఁ గలంగి వారిపైతూరి యారాజకుమారి యేమని దూఱుచున్నది.

ఘంటారవము - అట - పల్లవి. [గలరా. ౧

చెల్లఁబో యిందఱు చెలులు గలిగిన ఫలము, ఉల్లసంబు లాడనెకాని యొద్దిక సేయఁ
కలలోన నేఁడు నాచెలువుని రమ్మంటినా, నలినాక్షు లిందఱు నన్నె దూఱెదరు.
వచ్చితినేమాయె వలపు పుట్టించవలె, ఇచ్చగప్పిరుగా మగువలందఱుఁ గూడి. ౩
వలపించి కలయని వానిందేనేంక, చులుకసేసెదరుగా సుదతు లందఱు నన్ను. ౪

వా. అని యుల్లసంబు లాడినపల్లవాధరం జూచి యల్ల కల్లరిచెలులే మనుచున్నారు.

కేదారగౌళరాగము - ఆదితాళము.

వలపసంగనేమిచెలువుఁ డసంగనేమి,నలినాక్షి యెన్ని నేర్చినా వెచిన్నదానవు.

ఘంటారవము - రూపకము.

కలలోన వచ్చిన కాంతుండు నేఁడు, నెలఁత యీమాటలు నేర్పెనా నీకు.

కన్నడరాగము - ఆదితాళము.

కులకాంత లేయూరు వలపు లేయూరు, నిలుపవే యింతట నీసంకుగుణము.

ఘంటారవము - అటతాళము.

భళి రాజచంద్రుని పట్టివైపుట్టి, కలఁగుదువా నీవు కలగని నుగుణ.

వా. అని యాతరుణులు నీతిగాఁ దెలుప వలపు నిలుపలేక బాళిచే బాలిక యే మనుచున్నది.

ద. సావేరిరాగము - రూపకతాళము.

తరుణులార యీనీతి తనకుఁ గొంత తెలియునే, మరుని మాయల చేత మనసు కలఁగీని

మధ్యమావతి - అటతాళము.

కులసతి కిటువంటి కోర్కె గాదంటి రే, భళి కళావతి పట్టి పట్టభద్రుండని తెలియరా.

గౌడిపంతు - అట - దరువు.

బాల నీకుఁ జెలువుండని వల పని యేమనేరే, స్త్రీ లని పురుషు లని చెల్లఁబో లేరా.

పూరిబి - ఆదితాళము.

నెరజాణమాటలు నేర్పెనా యంటి రే, నెరయ నీమాటలు నేర్పంగవలెనా.

వా. అని యివ్విధంబున నవ్వనజగంధి తనదండనుండు వేదండగమనలఁ గసరుకొని యసురుసురనుచు దెసలుసూచుచు వెసఁ గుసుమాయుధుం డంపఱలపరంపరల వెంపరలాడ సొంపు సడలి యానీటుకానిపై గాటంపుఁ బ్రేమ మాట లేక మాటలేక కన్నీరు గ్రమ్మ విన్ననై యూరకున్న నన్నెలాఁడి యెన్నరాని విరహసాగరావగాహనం బూహించి యాహారిణాక్షు లెంతయు సంతసొంది చెంతఁ జేరి తత్తన్యమానసంతాపచింతాపరిశ్రాంతస్వాంత లై తమలోఁ దామే మనుచున్నారు. చెలికత్తెలు చదివే పద్యం.

సీ. పలికిన మనతోడఁ బ్రతిమాట నల్కదు పలుమఱు తనలోనె పల్కుఁగాని
చేయి వీణెయమీఁదఁ జేర్పంగ నొల్లదు చింతచేఁ జెక్కిటఁ జేర్చుఁగాని
సొలపుమై రాయంచఁ జూడఁగా నొల్లదు స్రుక్కుచు నలుగడఁ జూచుఁగాని
రహిమించు చిత్రము వ్రాయఁగా నెంచదు వసుమతిఁ గొనగోట వ్రాయుఁగాని
వేయుఁ జెప్పంగ నేల నీ వెలఁది కిపుడు, మదనతాపంబు నెమ్మదిఁ గుదుకొనియె
నువిదఁ గన్గొని మన మెటు లోర్వవచ్చు, నెలఁత కీచింత యేరీతి నిలుపవచ్చు.

వా. అని యీలాగున బాలిక లాలోచన సేసి యానారీతిలకంబు నొకరీతి నూఱడించ నెంచుసమయంబున నాకాంతల కాకాంతిమతికివి బరస్పరోచితవచనరచనాచమత్కారంబు నడచెనంట యెటువలెను.

ఫూరిబి - ఆదితాళము.

నీయంచసొగసెల్ల నెరయింపు మను మించు, రాయంచనడలేల రమణిచూడవీవేళ.
ఓ రాజముఖులార యారాజహంసునో, య్యారంపునడలుచూచు దారిగోరుదును.

మారువధన్యాసి - ఆదితాళము.

ఇందునదసలు నీకు విందు సేసే రిపుడు, విందారగించ నీ విందేల రావు. ౩
తావిమించిన బావమోవి తేనెలుగాని, మీావిందు నేనొల్ల మీానల్లనేమి. ర
కమ్మవిల్తునికాఁక నెమ్మదినుంచక, కొమ్మబొమ్మల పెండ్లి నెమ్మిఁ జేయరాదా. ౪
చెలువమన్నరుదాసుఁజెలిమిఁ బెండ్లాడుటేచెలువబొమ్మల పెండ్లిచెలువునన మురునె.
వా. అని మఱియు నావారిజాక్షులు నేమని దూఱుచున్నది.

పదం కన్నడ - ఆదితాళము.

హితమైన నెచ్చెలు లెవ్వరున్నారు, రతిరాజుగెల్చు విజయరాఘవుఁ గూర్చుటకు.
కనుఱెప్ప వేసితె కలికిరో యిప్పుడు, యెనయంగ వాఁడు నాయెదుట నిల్చిని.
ఎవరు మాటాడినా యేమి నాచెవులకు, నువిద వానిపలుకువలె నున్నదివె. ౩
వేమఱు నెవ్వరి పేరునా బిలిచినఁ, బ్రేమ మన్నారుదాసా యనేపేరు వచ్చినె.
వా. అని మనోరథసాగరాభంగురతరంగడోలికాకేలికను డేలుబాలికను జూచి యాచకోరవిలోచన లీచెలువ తలంపు నలువచేనైన నిలుపనలవి గాదని తలంపునఁ దలంచి యేవెఱవుగానక యీాతెఱవమరులు మఱపింపవలె నని యొకదారిఁ బూని యారామఁ దోడ్కొని యారామదేశప్రవేశంబు నటించిరంట యెటువలెను.

కవివచనము పద్యము.

సీ. రంగుమీాఱినయట్టి రతనంపుఁబావలు పదములఁ గీలించెఁ బడఁతి యొకతె
జాఱుపైఁటచెఱంగు చక్కఁగా సవరించి కైదండ యొసఁగెను గాంత యొకతె
బంగరు పనిహార్వ బాగుగాఁ గనుపట్టి హారిగ వేడుకఁ బట్టె నతివ యొకతె
జతన పరాకు హెచ్చరిక యటంచును సారెకుఁ బల్కెను సకియ యొకతె[ డు
అడపమునుగిండి కాళాంజి యులరుసురటి, పొంకముగఁ గొందఱతివలుపూనిరవు
లలితగతి మీాఱెడు వసంతలక్ష్మియనఁగ, వనజలోచన యుద్యానమునకు వచ్చె.

ద - మోహనరాగము - రూపకతాళము.

శృంగారవతులెల్లఁ జెలియనుదోడ్కొని, శృంగారవని లీలఁ జేరరావేళ.

వా. ఇవ్విధంబున జవ్వని నవ్వనికిఁ దోడ్కొనివచ్చి యవ్వనజాతు లవ్వనవైభ వంబు లేమని వర్ణింపుచున్నారు. చెలికత్తెచదివే పద్యం.

సీ. కొమ్మరో చూచితె గుంపులై యున్నవి చంపకంబులును రసాలములును
గన్నెరో చూచితె గాటమై యున్నవి నాగకేశములుఁ బున్నాగములును
జెలువరో చూచితె చెలువమైయున్నవి నారంగములును జంబీరములును
దరుణిరో చూచితె దట్టమై యున్నవి ఖర్జూరములుఁ గర్ణికారములును
మగువ చూచితె మొల్లలు మల్లియలును, బండిగురివెందపొదలును బొండుమల్లె
లల్లిబిల్లిగ నెల్లెడ నల్లుకొనుచు, నలరుగుత్తుల మిక్కిలి నలరె నిచట.

వా. అని పలుకుచు నలసపవమానోపవన విహారంబు సలుపుచు నవ్వని వనీపక శిశు క శారికానికర కేకికులకోకకలహంసకోకిలాకలకలాహంకారహుంకారంబు వారింపనేరక కోర్కెలను లయ్యదన మదనదేవతారాధనసాధనంబులు సంపాదించిరఁట యెటువలెను.

దరువు - కళ్యాణిరాగము - ఆదితాళము.

విరులు చిదిమి తెచ్చె విరిఁబోణి యొక్కతె, మరునిఁబూజసేయ మలయుచునపుడు.
పల్లవంబులు దెచ్చెఁబల్లవాధరయొకతె, యుల్లంబులోఁబుట్టుహాయలు వేలుపునకు
పత్త్రంబు లొక్కశతపత్త్రలోచన రతి, మిత్త్రునిం బూజింప మైత్త్రితోఁ దెచ్చె. ౩
తోయంబుఁ దెచ్చెనొకతోయజనేత్ర, కాయసంభవునకర్ఘ్యంబు లొసంగుటకు
చందనగంధొకతెచందనంబును దెచ్చెఁ, జందుమేనల్లున కందంబుగాఁగ. ౫
కప్పురగంధొకతె కప్పురంబును దెచ్చె, నప్పంచబాణుని కారతులీయ. ౬

వా. ఇవ్విధంబునఁ బువ్వఁబోణులు క్రొవ్విరులు దెచ్చి యవ్విరిఁబోణిచేత రతిరాజ పూజాసంవిధానంబు నడిపించిరఁట యెటువలెను.

పద్యము, కవివచనము.

సీ. సంతసంబున నింకఁ గంతుని బూజించి యింతిమైకాఁక నారింతమనుచు
నంగనామణులెల్లఁ జెంగల్వడిగ్గియ చెంగట నెంతయు రంగుమీఱు
సురపొన్నక్రిందట హరువులుగనిపించఁ బలుపైన విరులచప్పర మొనర్చి
పన్నీటఁ బదనిచ్చి మిన్నగాఁ గనుపట్టఁ దిన్నఁగా గందంపుఁదిన్నెవైచి
చాతురిచెలంగఁ గస్తురిచేతనలికి, నిగ్గుదేఱంగఁ గపురంపు ముగ్గువెట్టి
తమ్మివిరిరేకుపటమునఁ గమ్మవలపు; గోనజవ్వాదిచే నిజభావములర.

మ. రతిదేవి న్మకరాంకుని న్సుమధనుర్బాణంబుల న్నందమా
రుతను న్శీతకరు న్వసంతు శుకము న్రోలంబకాదంబసం
తతులం గోకిలశారికాప్రతతులం దత్తద్విలాసంబులన్
జతగూర్చన్ లిఖియించి నిల్పె గుచటం జాతుర్య మొప్పారఁగన్.

వా. ఇవ్విధంబున సంవిధానంబు గావించి బింబాధర లాకంబుకంఠిచే శంబరా
రాతి దేవతారాధనంబు సేయించిరంట యెటువలెను.

కాయసంభవం ధ్యాయామి, భావజ మావాహయామి, సూనశరాసనా
యనమః. సింహాసనం సమర్పయామి, అనర్ఘశీలాయనమః అర్ఘ్యం సమర్పయామి,
వాత్స్యాయనసూత్రప్రతిపాద్యాయనమః, పాద్యం సమర్పయామి, త్రిలోకలో
చనాసేచనకాయనమః, ఆచమనీయం సమర్పయామి, మానినీమానాపహారిణే
నమః స్నానోపచారం సమర్పయామి, కనకాంబురుహనాయికాకుమారాయనమః
కనకాంబరం సమర్పయామి, చందనాచలగంధవహస్యందనాయనమః చందనం
సమర్పయామి, అక్షతలక్ష్యాయనమః అక్షతాన్సమర్పయామి, కుసుమాయుధాయ
నమః నానావిధకుసుమాని సమర్పయామి, అనుపమానరూపాయనమః ధూపం
సమర్పయామి, విరహిజనప్రతీపాయనమః దీపం సమర్పయామి, హృదయైక
వేద్యాయనమః నైవేద్యం సమర్పయామి, స్తంభితశంబరాయనమః తాంబూ
లం సమర్పయామి, రతిరాజాయనమః నీరాజనం సమర్పయామి, సకలజనరంజనా
యనమః పుష్పాంజలిం సమర్పయామి.

వా. ఆసమయంబున భాసురంబుగా వారిజాక్షు లారతిరాజున కారతు లెత్తిరంట
యెటువలెను.

దరువు. ఆరతికెనవచ్చు నీరజేక్షణలు, ఆరతులిచ్చిరి యారతిరాజునకు.

వా. ఈవిధంబున నావనితచేతఁ బ్రౌఢలైనప్రీడావతులు షోడశోపచారంబు
లాచరింపఁజేయింప శంపాలతాంగి సొంపుమీఱ స్వాభిమతార్థవిధాన సమ
ర్థుం డైనమదనదేవత నేమని విన్నవింపుచున్నది.

దరువు. వలరాజ నే నీకుఁ బలుమాఱు మ్రొక్కేను, జెలువమన్నారుదాసుఁ
జేకూర్పవయ్యా.

వా. అని మఱియు నేమని ప్రార్థింపుచున్నది.

శ్లో. రతీశ త్వత్ప్రసాదేన రఘునాథనృపాత్మజః
మమ నాథో భవే దేష రాజా విజయరాఘవః.

వా. అని ప్రార్థించిన తత్క్షణంబ దక్షిణాగాలిద్రైన యయ్యంగనకొంగు ముడి ఘటించె నత్తెఱంగున కనంగుండు తెనంగు మానక కృతఘ్నకృతోపకార న్యాయంబున నాయంబు దప్పి యాయాంబుజాక్షి కాయంబున గాయంబులు సేయ హాయి లేక హా యని యార్చె నో యంబుజముఖి లజ్జ యుజ్జగించి సజ్జనున్న యజ్జలజముఖులం దెలియఁజాలక ముజ్జగంబులు తన్మయంబుగాఁ దోఁప నే మనుచున్నది.

పల్లవి - ఖాబి - ఆదితాళము.

అంతఃపురంబున కళు కింతయును లేక యింతిరో వీఁ డేరీతి వచ్చెనే ॥ పదం ॥
ముద్దుఁబెట్టి ముందుగా మోవి గంటిచేసి, సుద్దులం దేలించిన జాజగాఁడే వీఁడు.
మచ్చికసేసి నాతో విచ్చనవిడిగాను, ముచ్చటలాడిన మునిముచ్చు గాఁడఁడే వీఁడు
నిన్న రాతిరిప్రొద్దు నీటుకాఁడై వచ్చి, కన్నె నామానధనము గొన్నకన్నగాఁడే వీఁడు.
వా అని మఱియు నే మనుచున్నది.

యదుకులకాంభోజి - అటతాళము - పల్లవి.

తామసము సేయనేలరా, తమితోడఁ గౌఁగిలీయరా, కాముండు పచ్చి బోయరా, కాఁకకుఁ దాళఁ జాలరా. ౧
చెలువుండ గుబ్బల నెలవంకలుంచితే, కులుకుసిబ్బెపుగబ్బి గుబ్బలగుమ్మెరా
వలపు రెట్టింప వాతెఱ తేనె యానితే, పలుచని కెమ్మోవి పలుగంటి సేసెరా
నెరజాణ జవ్వాది నెమ్మేన నలఁదితే, గరిమమీఱ నేను గౌఁగిలించెరా. ౨
సంపంగి సరములు సరసుండ చుట్టితే, యింపున జడకొద్ది యేను గొట్టేరా. ౩
- - - - నీవునన్నుసరగునఁగూడితే, మమతను - - మెప్పించెరామన్నారుదాస.
వా. అని మఱియు నే మనుచున్నది.

కేదారరాగము - అటతాళము - దరువు. [రా

చలముసేయ నేలరా సామినీకు మ్రొక్కేరా, తలిరువిలుకాని కేళినిదనివిడీరనన్నేల
ముద్దుఁబెట్టరాయనిముదమున నే వేఁడితే, నొద్దికఁ జేరఁదీయక యోరమోము సేసేవు
వా. అని మఱియు నే మనుచున్నది.

కళ్యాణి - అటతాళము - పల్లవి.

వింతదాననా నే నీకు విజయరాఘవధీర, యింత దాఁపనేల యెలమి నానతీయరా.
సిగను విరులుచుట్టి జిగిమించు బురుసారుమాలు గట్టి, బిగువు గౌఁగిటఁ జేర్చి ప్రేమ రెట్టింప. చిగురాకుగెమ్మోవి చెలఁగి నే పలుగంటి సేయ, నగినకారణమేమి నామీఁదానె దెలుపరా.

వా అని మఱియు నే మనుచున్నది.

ముఖారిరాగము - అటతాళము.

భూనాథుండవైతే పొగడించుకోవలెఁ గాక, మానవతులతో దొరవైతే
    మన్నారుదాస చెల్లునా. ౧

నారెకు నీచెక్కిలి నొక్కి సరసాన గోరఁజీరి, గారవంబున ముద్దువెట్టి కౌఁగటఁ జేర్చి
చేరి నాపుక్కిటవిడెము చెలిమితో నొసఁగంగా, ఓరిరారాయనివిలిచి తేనోవవేవు.
వా.అని మఱియు నే మనుచున్నది.

రేవగుప్తి - అటతాళము - దరువు

నద్దురా నే నీకు ముద్దురా మన మిద్దఱుఁగూడిన
    గద్దఱి మదనుని ఎద్దులన్నియు మఱి బద్దులుగాదా. ౧
ఏఁతురా నను వింత సేతురా, యీతీరు నాతోను
    జాతు లాడేది నీతులుగాదురా రాతిరి వేళ. ౨
మ్రొక్కితి నేను నీకుఁ జొక్కితి దక్కితిని మాయఁ
    జిక్కితి నన్నింక మక్కువనేలరా చక్కనిసామీ. ౩

సావేరిరాగము - అటతాళము.

ఏలరా నేఁడాళఁజాలరా, చాల నీపై నేను బాళితో నున్నాను
    బాలా రమ్మని నన్ను లాలింపవేరా. ౧
ఈడరా నను దయఁ జూడరా, కోడెకాఁడ మరుండు
    దాడివచ్చినిపుడు మోడిసేయక జోడుగూడి చేకోరా. ౨
వింటిరా నీ వగలెల్లఁ గంటిరా, తుంటవింటి నెర
    దంటబంటు నాపై కంటుసేసీని మాయింటికిరారా. ౩

ఖామాచిరాగము - అటతాళము.

మానరా మరుని పాద మానరా చాన రమ్మని మోవి
    తేనె లీరా మేలుదానరా నే నీకు దానరాధేయ. ౧
మెచ్చురా నీమనసు వచ్చురా గచ్చులుసేయక ముచ్చట దీరంగ
    హెచ్చు ప్రేమ మీఱగుచ్చి కౌఁగిలీరా. ౨
పలుకరా నాపై వలపు చిలుకరా యళులకునళుకుదు
    చిలుకకు నులుకుదు మొలక వెన్నెలలకు వెలవెల నౌదు. ౩
కన్నెను వయసునఁ జిన్నను వెన్నెలబైటను నిన్నరాతిరిగూడి
    నన్నింతయేఁతురా మన్నారుదాస. ౪

వా. అని మఱియు నే మనుచున్నది.

పల్లవి. రారా (మ్రొ)క్కేరా విజయరాఘవధీర కలకలనగవులు గులికెడు చిలుకల
పలుకులు చెవులకు ములుకులయ్యారా. ౧

మరువిరిశరములు కరకరియురమున మెరయంగఁ గమ్మవలిదురమున దూఱెసె.

తుమ్మెద లొమ్ముగ దొమ్మిగఁ గ్రమ్మఁగ, ద్రిమ్మరి నెమ్ములు ముమ్మరించెరా ॥

వా. ఈ పాడిన మదన వేదనోన్మాదజనితవికారంబులు బహుప్రకారంబులై తోఁచ నా చిగురుఁబోఁడి యొక మెఱుంగుఁబోణి యంకంబున నంకంబుగాఁ జొక్కి సొలసి పరవశయై యుండు వేళ పాళిచే నీలాలక లత్యాదరంబున శైత్యోపచారంబు లాచరించిరఁట యెటువలెను.

ఘంటారవము - ఆదితాళము.

మదవతీమణియొకతె మైనుంచెఁ బన్నీరు సుదతి యొక్కతె పూల సురటిచే విసరె.
జలజాక్షి వేఱొకతె చలువగంధమునలఁదెఁ గలికి యొక్కతె చుట్టెఁ గలువలసరులు.
చెలువ యొక్కతె నించెఁ జెందమ్మిపుప్పొడి కలకంఠి యుఫ్ఫు డొకతె కపురంబు గుప్పె.
బాలఁతి యొక్కతె గప్పె యలరుల దుప్పటి వేలఁది యొక్కతె యిచ్చె పిసుల చెబంతి.
కామరతూఁడులు తఱచుగ నెమ్మేన భామ యొక్కతె సిల్పెఁ బైపైని జెలికి.

వా. ఇత్తెఱంగున మత్తకాశినులు శైత్యోపచారంబులు సేయ నత్తఱి నాబిత్తరి చిత్తరుప్రతిమకుఁ జైతన్యంబు గలిగిన చెలువునఁ దెలివిఁ జెంది కొంతవంతదీఱి తనయంతరంగంపుటింతి రాక కెదురుచూచుచున్న యాసమయంబున విలాసవతి యను నెచ్చెలి యచ్చటికి వచ్చె నఁట యెటువలెను.

ద - సాళగసౌరాష్ట్రము - ఆదితాళము.

మురువుగాఁ గాంతిమతి ముచ్చట వెలయింప, విరుల చెండుఁ బూని విలాసవతి వచ్చె

వా. వచ్చి యా నెచ్చెకంటి యచ్చట నున్న నెచ్చెలులఁ జూచి యేమనుచున్నది.

ఆహిరి - జంపెతాళము.

చెలియున్నవిత మేమి చెల్లఁబో యీవింత, కలికి నే నేరీతిఁ గన్నులఁ జూతు. ౧
ఏనంత రాఁగానె యింతి యెదురుగవచ్చు, నేను జేసిన నేర మేమొకో నేఁడు.
ముందుగా మాటాడు ముచ్చటల్ దెలుపు, నెందుకో నాతో ను నేమాటలాడదు.
మీరందఱుండఁగా మేలఁతకు వెతకుఁ, గారణం బేఁగానఁ గలిగినఁ దెలుపరే.

వా. అని పలికి యా బాలికను జేరి యేలాగున లాలింపుచున్నది.

విలాసవతి చదివే పద్యం.

సీ. చెదరిన ముంగురుల్ చెలువంబు మీఱఁగాఁ గొనగోళ్లఁ దువ్వుచుఁ గొప్పమర్చి
చిటులుగందపుఁబూఁత బటువుగుబ్బల నఱజాఱు పయ్యెదకొంగుఁ జక్కఁ జేర్చి
డెప్పరంబుగ నంటుపుప్పొడుల్ రాలంగ మెఱసినచెల్లి నెమ్మేను నిమిరి
చెక్కుటద్దంబుల చెమట పయ్యెదనొత్తి యక్కునఁ జేర్చి నెయ్యంబుతోడ
సకులలోన నన్నుఁ జాల లాలింపుచుఁ, బ్రాణపదముగాఁగఁ బన్నయున
చిన్ననాఁట నుండి చేసిన చెలిమిచేఁ, బిగువ దాఁచ నెపుడు మానుఁ దనకు.

వా. అనిన విని వనజగంధి యాకనకాంగితో నేమనుచున్నది.

కాంతిమతి చదివే ద్విపద.

మన వీథిలో నిన్న మన్నారుస్వామి, యనుపొంద గరుడవాహన మెక్కి రాఁగ
మనమందఱముఁ గూడి మణిసౌధమునను, గనుఁగొంటి మిగద వేడ్క చెలంగ మనము
అతఁడొయీతఁడో యనహరువొందువాఁడు, వితరణగుణశాలి విజయరాఘవుఁడు
కులసతులుం దాను గోపాలదేవుఁ, గొలిచిరా నపుడు గన్గొంటిమి గనుక
యలరేయి నిదురింప నరుణోదయమునఁ, గలలోన విజయరాఘవశౌరి వచ్చి
తిలకంబుఁ దీరుగా దిద్దెద ననుచుఁ, జెలఁగి చెక్కిలి గోరఁ జీరె నోయమ్మ
మోము మోమునఁ జేర్చి ముద్దిడు నెపము, చేమోవి పలుగంటి సేసెనోయమ్మ
అలరు కుంకుమ గంద మలఁదెద ననుచు, వలుదగుబ్బలు కేలఁ బట్టెనోయమ్మ
కనకాంగి కౌఁగిటఁ గదియింతుననుచు, నొనర - - - - - - - -
కలకంఠి విజయరాఘవుఁడ నే ననుచుఁ, బలికి విరులశయ్యపై ననుఁ జేర్చి
కంతుకేళిని గూడెఁగాఁ జేరఁదీయు, నంతలో మేల్కొంటినమ్మ వాల్గంటి.

వా. అని మఱియు నేమనుచున్నది.

కేదారగౌళ - అట - పల్లవి.

ఏమని తెల్పుదు నేమిసేయుదును, కాముండు నామీఁదఁ గడుమచ్చరించినాఁడు.
మన్నారుదాసుండు మురుతి రెట్టింపఁగాఁ, గన్నెరమ్మని పిల్చి కౌఁగిటఁ జేర్చి
తిన్నని మోవాని తీరుగాఁ గొప్పున, సన్నజాజులు చుట్టి చాల లాలించినది. ౧
కలలోన విజయరాఘవశౌరి ననుఁ జేరి, కలకంఠి రమ్మని గారవింపుచును
కలపంబు నెమ్మేనఁ గలయఁగా నలఁది, మొలక చన్నుల మీఁద నెలవంకలుంచినది.
రంతుకాఁడైనట్టి రఘునాథనందనుఁడు, చెంతకురమ్మని చెక్కిలి నొక్కి
పంతుమీఱంగ - - - - - - - - - - నెంచినది. ౨

వా. అని పలికినకలికిపలుకులు విని యాయువతితో విలాసవతి యేమనుచున్నది.

ఘంటారవము - ఆది - పల్లవి. [గాఁ డంటవే.౧

హెచ్చుకోరిక గోరితివి యెలనాఁగ నీవుఅచ్యుత విజయరాఘవుఁ డౌరకొంచె
ఆటపాటలచేత నందచందముల, మాటలఁ దేలించు మగువ లుండఁగను.
సాటిలేనట్టి యీసార్వభౌముని గోర, బోటిరో యిది నీకు బుద్ధిగాదమ్మ. ౨
తల్లి మరుంగుదానవు తండ్రి మూర్ధన్యుండు, చెల్లఁబో తోఁబుట్టు చేకత్తెకాఁడు
ఎల్లబంధువులకు నెన్నికైయుండదు, చెల్లె యీమాటలాడఁ జెల్లునా నీకు. ౩
కులముగలదానవుకోరివిజయరాఘవుండె,యెలమిఁ బెండ్లాడితే నెన్నికౌఁగాని
బలిమిముందుగానున మెపలుకరించితే,జలజాక్షి యదిమిగులఁజులుకఁగాదఁటవే

వా. అనిన విని యాయింతితోఁ గాంతిమతి యేమనుచున్నది.

ద. హెచ్చుగా నామీఁద మచ్చిక గలిగిన నెచ్చెలులల్ వివరింప నీకన్న నెవరె.౧
పరులచిత్తంబులు బాగుగాఁ దెలియుచు నెరజాణమాటాడ నేర్తువే నీవు. ౨
ఎంతకార్యంబైన నింతిరో నీవు చింతసేయక నీవు చేకూర్తు గదవె. ౩
నెనరుతో నెప్పుడు నిను నమ్మువారల యెనలేనిపంతంబు లీడేర్తుగదవె. ౪
నీవంటి చెలిగల్గ నీరజలోచన యీవేళ నాకోర్కె లీడేఱుటరుద. ౫

వా. అనిన విని యాకుటిలకుంతల యఘటనఘటనాచాతుర్యధుర్యగనుక యాకన
కాంగి మనోరథానుసారిగా నేమనుచున్నది.

కన్నడరాగము - అటతాళము.

నానంటిచెలియుండ నోవాలుగంటి, యేనంత లేలనేయే వంతదాననా. ౧
తలంచినతలంపు తెలివిడాయెఁగనుక, వలరాజునైన నీబంటుఁ జేసేను. ౨

సారంగరాగము - ఆదితాళము.

వాలుగంటి బయలుపందిలిఁ బెట్టుదు, గాలిమూటగట్టుదుఁ గలంక నీకేల.
ఎటువంటిదొరనైన నేవలెనంటే, చిటుకుమనకుండాను జేకూర్పనేర్తు ॥

వా. అని మందలించిన నుందయాననుం జూచి యాయిందుముఖి డెందంబున
ముదంబు గందళింప నే మనుచున్నది.

కేదారరాగము - అటతాళము.

నీవంతదాననని యేనంతె దెలియుదు, నో వెలంది నామనవి నొద్దికసేయవే.౧
నానాయకునితో నునన్నుఁ గూర్చితివేని, నూనాయుధుని యాన సుదతి నేనీదాన.
ఈసొమ్ము లీతనువు లీసంపదలును, నీసొమ్ముగా నెంచు నెలఁత ముందరను. ౩

వా. అనిపంచిన నాచంచలాక్షి యగ్గలికమీఱ నిర్గమంబు - - - బునటించిన
యనంతరకథాసంనిధానం బెటువలెను.

గడియ కొక్కతలంపు గడియ కొక్కయాలోచన.

గీ. మంత్రమునఁ దేల్చునది యొక్క మాద్రి నన్నుఁ, జెప్పుచున్నది వేఱు నేఁ జెప్పినట్టి
దానిఖండనమదియొండు ధనద! జరుగఁబోవునదియొక్కఁ డగువారి తావునందు
ఇంటిపనులు చూచుకొనుటకు వేళయే లేదు.

కుబే—అట్లయిన నాకేదో లాభము గలుగు బేరమే తెచ్చియుందురు. ఇంత వఱకు నాకు దానవద్రవ్య మొక్క కాసును దొరకలేదు

శుక్ర—(తనలో) ఓహో! నేనేదో దేవదానవయుద్ధమునకు రాక్షసుల కప్పు మాటలాడవచ్చిన ట్లితఁడు తలంచుచున్నాఁడు. నాగొడవ యీతనియొద్ద నెట్లు తేవలయునో (ప్రకా) రాక్షసులతో నాకుఁ గష్టముగానే యున్నది.

కుబే—ఏమికష్టము? ఇట్టిపనులలో మీకుఁ గొంచెమో గొప్పయో లాభమే

శుక్ర—లాభములు మీవి.

కుబే—మాకు లాభమైన మీ కూరక పోవునా.

శుక్ర—అలంకారవిద్యార్థులము. మాకు పట్టియాయాసమే.

కుబే—ఏదైనఁ బెద్దబేరము తెండు. మీకు లాభము కనఁబఱిచెదను.

శుక్ర—(తన) నే నొకయూహపై వచ్చితిని. ఈతఁడు వడ్డికాసులబేరము లాడుచున్నాఁడు. (ప్రకా) రాక్షసుల కిపుడు జగడములే లేవు.

కుబే—(తనలో) ఇంతేనా. (ప్రకా) మఱి మీ కంత తొందరపను లేమి?

శుక్ర—దుక్కిపెద్ద దేశాంతరము. నాకెప్పుడును దొందరలే.

కుబే—ఏల తమ రిందు విచ్చేసితిరి.

శుక్ర—ధనవంతులతోఁ జెలిమిచేయుట మేలుగదా.

కుబే—ఏదైన బేరము తెండు. నన్ను మీవానినిగాఁ దలంపుఁడు.

శుక్ర—నేను మీవాఁడనుగానా. కొంచెము నన్ను మీరు స్నేహభావమునఁ జూడవలయును.

కుబే—మీ కేమి ప్రభువులయొద్ద మంత్రులు.

శుక్ర—సారస్వతపరిషన్మంత్రి కెంతగౌరవమో లాభమో రాక్షసపరిషన్మంత్రి కంత. అడుగ నక్కఱలేదు.

కుబే—మీకు జీతమా దినవెచ్చమా.

శుక్ర—సమయోచితమె గాని నిర్ణయము లేదు.

కుబే—ఏఁడాది కొక్కసారి వచ్చిపడును.

శుక్ర—నిన్నుఁబట్టి మమ్ము లెక్కించుచున్నాఁడవు.

కుబే — ఆచార్య! మీ కేమి కావలయును.

శుక్ర — దేవయానికి వివాహము వచ్చినది.

కుబే — సంబంధ మెక్కడ?

శుక్ర — అసమానసంబంధము. యయాతిమహారాజున కిచ్చెదను.

కుబే — (తనలో) రాజున కిచ్చునపుడు వృషపర్వునకే యిచ్చిన నూరిలో నుండును. రెండువైపుల లాభముగదా. (ప్రకా) అట్లయిన మీ రాజు మీకుఁ బెద్దబహుమాన మీయఁగలఁడు.

శుక్ర — అదిచాలదు. కొంత యెక్కువధనము కావలయును.

గీ. ఒసఁగునదిచాలదింకను నొసఁగుమనుట, యూర కేవచ్చుచోఁదప్పు; వారివారి
నడిగి చేటప్పులైనఁ జేయంగ వచ్చు, నగలఁ దెగనమ్మువచ్చు ధనంబు కొఱకు.

కుబే — ఇతరులు మిమ్ము మోసముచేయుదురు; నగ లమ్మునపుడు నాయొద్దికేఁ దెండు. చేటప్పులైనను నాయొద్దనే తీసికొనుండు. వడ్డి మీచిత్తము.

శుక్ర — (తన) వీని నడిగినలాభము కనఁబడదు. (ప్రకా) నే నింకొకసారి వచ్చెదను, సెలవిమ్ము.

కుబే — వచ్చిన పని చెప్పలేదు. కావలసినయెడల రాకసు లిచ్చుదానికంటెఁ దక్కువవడ్డికే కొనిపొండు.

శుక్ర — వడ్డి యిచ్చి కొనుటకైన నింతదూరము రావలయునా.

కుబే — స్వామీ! పూర్వపుదినములు కావు వ్యవహారములు నిద్రపోవుచున్నవి.

శుక్ర — కావుననే మఱియొకసారి వచ్చెదను.

కుబే — మీకుఁ గావలసినఁ దీసికొనిపొండు. తర్వాత చూతము.

శుక్ర — (తనలో) చాలును. (ప్రకా) పెండ్లిచేసి చూడు—మని కన్యకుఁ బెండ్లి చేయుట కష్టము. అప్పుదీసి చేయుట మిక్కిలి కష్టము. సద్దులు పాయలు నెన్నఁడును వ్రాయలేదు. వ్రాఁత యనినఁ గిట్టదు.

గీ. రహితమున దిద్దెదు దాని సహితమనుచు, విషము నిమ్మని వ్రాసిన విషయ నిష్ఠ
టంచుమార్తురుమరణమన్నదిలిఖింత్రు,ధగణమునిసేగ్గునీఅఁబత్రములలోన.

ఆత్మస్తనము చేసికొనఁగూడదు, గాని, తప్పు లేదు విద్యావంతుఁడను, అప్రతిగ్రహీతను, బ్రాహ్మణుఁడను. పెండ్లి, అందును నసమానసంబంధము నీవేమైన బహుమాన మిచ్చెద వనుకొంటిని.

కుబే — అగు నది యట్టిదియే. మీవంటివారికిఁ జేసినయుపకారమునకు మితి లేని ఫలము గలదు.

గీ. కొలఁదికాలంబులోన నేఁగూడఁ బెట్టు, వ్రతము విడిచెదఁ బదపడి ప్రాజ్ఞులైన
పండితులకును సత్కార్యకుండలకు, దానధర్మంబులొనరింపఁ దాల్తువ్రతము.

తామప్పుడు దర్శనమిండు.

శుక్ర—ఇదియు నొకవ్రతమా! బావిలోని నీరు తోడుచున్న కొలఁది నూరును. తోడకున్న నూటకట్టునదును నీరు చెడిపోవును.

కుబే—నానసనిధులనుండి నేనెట్లు వేఁదివైచెదనో యపుడు మీరే చూచెదరు లెండు. తర్వాత రండు.

శుక్ర—పశ్చాచ్ఛద్ధో నాస్తిపర్యాయః

కుబే—నాకుఁ బనియున్నది (లోనికిఁబోవును.)

శుక్ర—ధనముచెడ్డది, దానికై జను లేమిశ్రమపడుచున్నారు.

గీ. కడుపునిండఁ దినక మడుఁగు ధరింపక, నిద్రపోక పవలు నిశయు ధనముఁ
బెట్టెమీఁదఁ బండి పిల్లికిబిచ్చము, పెట్టకుండఁ గూర్తు రట్టిధనము

క. విడి ముడి యుండనిమానవు, విడిముడి యేమిటికి నిల్చు వెడఁగులుగాకీ
పుడమి సిర శాశ్వతమ్మే, పుడుకరుఁ గుడువరును లోభమునఁ గద జగతిన్.

నాకే ధనముండిన—రెండుచేతులతో దానముచేసెదను. అపుడు నాకు మోఁచేతిదాఁక నెముక లేని కరము లుండును. దానికేమి గాని నాయొద్ద నున్న లక్ష్మీవిలాసమంత్రముచేఁ గుబేరునియింటిసిరి యంతయు నాయింటికి రప్పించుకొని వీని నేడ్పించెదను. (అని పరిక్రమించుచున్నాఁడు.)

(ఈశ్వరకుబేరులు ప్రవేశించుచున్నారు.)

ఈశ్వరుఁడు—ఓశుక్రాచార్య! నాస్నేహితునియెడల-నీవుచేసినది-ఎవ్వరియెడల నైనను నీచకార్యము-కావున నిన్ను మ్రింగివైచితిని-నీవు పండితుఁడవని చంపఁ దలఁచుకొనలేదు. కుబేరునిధనము నిచ్చివేయుము మెల్లగాఁ జెప్పుచున్నాఁడను.

కుబే—స్వామీ! గడ్డితిని, పస్తుపడి గడించితిని. ఇపుడు కాదు మఱియొకప్పుడు రమ్మంటిని గాని నీకీయ నని చెప్పలేదు.

శుక్ర—(కడుపులోనుండియే) సగము చచ్చి నేనడిగితిని, నిండుగాఁజచ్చి నీవు నన్ను వంచించినాఁడవు. నడుమంత్రపుసిరిని నేను విడువఁగలనా.

కుబే—అగర్భశ్రీమంతుఁడను నేను విడువఁగలనా.

శుక్ర—ఇపు డెట్లు విడిచితివిరా యని యోదేవా యడుగ వేమి?

కుబే—ఈప్రభువు నిన్నుదరములోనుండి విడిచిన నేను ధనము విడుతును

శుక్ర—లేకున్న నీ ప్రాణములనే విడిచెదవా.

ఈశ్వ—కుబేర, మంగలములోఁ బెట్టి వేయించినట్లు మాడ్చుచున్నను లక్ష్యము చేయఁడు. కవిగారూ! వీనిధనము వీని కిచ్చివేసితిరా మిమ్ము విడిచి పెట్టెదను.

శుక్ర—నేను నాబిడ్డ పెండ్లియైనను మానుకొనుదునుగాని ధనము నీయను, ఇంతకంటె దేహీ యని యడుగవలయునా. పెండ్లియని చెప్పిన నింకను దేహీ యనవలయునా. ఇతరుల కెన్నియో నీతులు చెప్పెదరు. స్వవిషయమున మానమా

కుబే—మేమితరులకు నోటితో నీతులు చెప్పెదము నీవు శాస్త్రమే వ్రాసితివే. నీవేమి చేయుచున్నాఁడవు?

ఈశ్వ—భార్గవ.

క. ఇచ్చిన నిచ్చును లేదా, వచ్చిన మార్గమునఁ బోక వాదించుటయుఁ
గచ్చులుచేయుట తగునే, యిచ్చెడువాఁ డేమి నీకు ఋణపడెనొక్కో.

శుక్ర—(నవ్వి) ఇచ్చెడుకుబేరుఁడు నాకిచ్చెడువాఁడేమి? నేనెంత వినయముగాఁ జేరితిని.

ఈశ్వ—అన్యాయముగ బ్రాహ్మణుఁ డొరులసొత్తు నపహరింపరాదు.

శుక్ర—కోమటి యపహరింపవచ్చునా. అన్యాయ మెవ్వరును జేయరాదు. నేను లక్ష్మిని వేఁడుకొంటిని, నాయింటికి వచ్చినది.

గీ. లక్ష్మి చంచల దానవులను త్యజించి, దేవతలఁ జేరు విడుచును దేవవిభుని
నాశ్రయించును నరులనాయమ్మ యిష్ట,మీశుఁడే త్రాఁడుగట్టెనో యేమొబళిర

కుబే—నేను బొత్తిగా నీయనంటినా. దానపరుఁడ నైనపుడు రమ్మంటిని.

శుక్ర—సముద్రము తరంగము లుడిగినపిమ్మట స్నానముచేసి రమ్మంటివి.

ఈశ్వ—నీకొమార్తె పెండ్లికిఁ గావలసినది యుంచుకొని తక్కిన దిచ్చివేయుము.

కుబే—దేవా! నడుమ మీరేమి యట్లొత్తి చెప్పుచున్నారు.

ఈశ్వ—రానివానిమీఁదజాయి వచ్చినంత రానిమ్ము.

కుబే—అయ్యో నాగతి యిట్లయినదా. నాకువలదు, సర్వము నీతనినే పుచ్చుకొననిమ్ము.

శుక్ర—నాకిచ్చుటకు నీయకుండుటకు నీవెవ్వరు! వచ్చినది రానేవచ్చినది.

ఈశ్వ—యక్షరాజ! నాయుదరాగ్నిలోఁ బేలపుగింజవలెఁ బ్రేలుచున్నను లెక్కసేయఁడే.

శుక్ర—జగదీశ! నేను గూఁతు పెండ్లికి సెల వైనదిగాక మిగిలినది వీని కేలయిచ్చె దను. నాకుఁ దానిచ్చినాఁడా.

ఈశ్వ—వానియింటి సొమ్ముగదా నీకుఁ జేరినది.

కుబే—(నెమ్మదిగ) జగత్పతీ! ఒకవేళ దానికి సమ్మతించునేమో నాకిష్టము లేదు.

ఈశ్వ—నీపుత్రికల్యాణమునకు నీకు వేఱొకరాజుచే నిప్పించెదను.

శుక్ర—నేను బుత్రికకళ్యాణము మానివైచెదను. యయాతియే రెండువైపుల వ్యయములు భరించి పెండ్లిచేసికొనును.

ఈశ్వ—సగము నీవు పుచ్చుకొనుము. సగ మిచ్చివేయుము.

కుబే—అయ్యో నేను జచ్చిపోదును. నాకు సగముపలదు.

శుక్ర—చచ్చిన భూమికి వెలితియా! నేనే యుత్తరదిక్కునకుఁ బతి నయ్యెదను.

కుబే—దేవా! చిత్తగింపుఁడు నాయుద్యోగమునకుఁ గూడ నెసరువెట్టుచు న్నాఁడు చూడుము.

ఈశ్వ—ఈతఁడు బైటికి నచ్చినపుడుగదా.

కుబే—సగమున కొడఁబడవలదు. రెండుమూఁడువరాలు పుచ్చుకొమ్మని కుదు ర్చుము దేవా!

శుక్ర—ముండభరణ మిచ్చెదవా.

ఈశ్వ—ఈతని కీయవలదు. ఒకకవి పుస్తకము వ్రాసినాఁడు దానియచ్చునకైన దిచ్చి మిగిలినది నీవు పుచ్చుకొమ్ము.

శుక్ర—అచ్చువేయుటకని క్రొత్తయాచకులు కొంపలు లేచినారా.

కుబే—దేవా! నాగతి యేమి నాధన మితరులకుఁ బాల్పడునా.

శుక్ర—వీనిదుర్ధనము నితరులు తిని యఱఁగించుకొనలేరు. నీకుక్షిలోనున్న జావని మొండివాఁడను నేనే జీర్ణముచేసికొందును.

కుబే—నే నొకసభకుఁ జందా రెండేండ్లది యీవలసియున్నది. దాని నీయఁ దలఁచుకొనలేదు. ఉత్తరములకు బదులు వ్రాయ మానితిని ఆ సొమ్మిచ్చి వేయుట కొడంబడియెదను.

శుక్ర—వలదువలదు. అవిధర్మకార్యములోఁ బద్ధుపడును నీవింకను దానధర్మ ములకుఁ బ్రతిజ్ఞచేయలేదు. ఇంకను ధనార్జనవ్రతము విడువలేదు గదా.

ఈశ్వ—ఒకబ్రాహ్మణుఁ డొకక్రొత్తపేటలో గుడిసెకట్టుకొనును దానికేమైన నిచ్చెదవా.

శుక్ర—దేవా! నీవు న్యాయము చెప్పుటలేదు. నాసొమ్ము నాయిష్టమువచ్చిన ట్లూబిలో నూరఁద్రొక్కుకొందును.

కుబే—నాయింటిసొమ్ము నీదెట్లు లైనది.

శుక్ర—నీయింటికిఁ గన్నము వెట్టితినా నిన్నుఁబట్టి గొంతుపిసికి లాగుకొంటినా నీయింటి కెవ్వరియింటినుండి వచ్చినది.

ఈశ్వ—ఒక్కవిద్యార్థి కీనెలబడిజీతము లేదఁట. దానిం గట్టినవా.

కుబే—దేవా! అప్పుడే యెన్నియో పనుల కిమ్మంటివి.

శుక్ర—చెప్పినంతనె యిచ్చుటకు నేను నడుముకట్టినాఁడనా. దేవా! నా ధన మీయను, గాని, యొకవేళ నిచ్చినఁ దా నీధర్మకార్యముల కిచ్చునేమో యడుగుము

కుబే—నాయిష్టము నీవెవ్వరు నాయుద్దేశము తెలిసికొనుటకు.

శుక్ర—ఇపుడు నీవెవ్వరు దేవునితో మొఱ్ఱపెట్టుకొనుటకు.

కుబే—నిన్ను హతముచేయుటకుఁ బుట్టిన మిత్తిని.

శుక్ర—కాదు నీవిత్తమునకు నీవు మిత్తివైతివి.

ఈశ్వ—ఒక్కపాతికపాలు కుబేరున కిమ్ము.

శుక్ర—నీకుక్షిలోని యగ్నిజ్వాలలను మించిన కుబేరునిమాటలకుఁ జిరాకుగా నున్నది. ఈతని మాటలు వినఁజాలను దూరముగాఁ బొమ్మనుము.

ఈశ్వ—ఇంకను బాధించెను.

శుక్ర—నీవు చంపనంటివి, కాఁబట్టి యెంతటి బాధకైన నోర్చెదను. నీవుచంప దలఁచితివా నీకంటె ముందె ప్రాయోపవేశము చేసెదను.

కుబే—తేరగా గడించుకొన్నసొమ్ము గతి యేమగునో.

శుక్ర—అదిగో! కుబేర! నీవు మాటలాడకుము! నావారను లనుభవింతురు. ఇఁక నీగతి యేమి.

ఈశ్వ—కుబేర! నోటితో లేదనుటకంటెఁ జేతితో లేదంటివా యింతపుట్టదు గదా! ఈతఁ డిచ్చునట్లు లేదు, నీవు పొమ్ము. సమయము చూచి వీనికి నచ్చఁ జెప్పెదను. నీవు చాల దని కుయ్యొమొఱ్ఱో యనకుము.

కుబే—శివశివ! కాలగతియెంత వారికి ననుభవింపక తప్పదు. డబ్బున్నంత వఱకు ధర్మకార్యములకు మన సొప్పదు. ఈశుక్రుని జూడరాదా. ఒక్కబడి పిల్లవాని జీత మిచ్చుట కిష్టపడలేదు. నా కీధనమే యుండిన శివునంతవాఁ

డడిగినవు డొక్కబడిపిల్లవానికి జీవ మీయలేకపోదునా. ఈకఠినుని చేతి నుండి నాసొమ్ము నాకుగాదు. (అనిపోవును.)

ఈశ్వ—శుక్రాచార్య! కుబేరుఁడు పోయినాఁడు, నాతో నీయభిప్రాయ మేమో చెప్పుము.

శుక్ర—అభిప్రాయమున కేమున్నది. నేనొక్కకా సొక్కని కీయను.

ఈశ్వ—కూఁతుపెండ్లి యెట్లుచేసెదవు.

శుక—యెవ్వరికిఁ దోఁచినన్యాయము వారు చేయుదురు. ఇది ధర్మకార్యము. దీని కింతసొమ్మిమ్మనినఁ బదిమందిలో నిచ్చెద మని చేవ్రాలు చేసి పిదపఁ ద్రిప్పిత్రిప్పి, యిపుడు నాయభిప్రాయము మార్చికొన్నాఁడ నని, మీధర్మము నకు నేను నాయముచేయ నని చెప్పువారు లేరా.

ఈశ్వ—గడ్డితిని, చెనుటయూర్చి గడించినవాఁడు పాపము

శుక్ర—నీవు పెట్టుబాధకుఁ దాళఁజాలను పైకిఁ దీయుము చెప్పెదను.

ఈశ్వ—వచ్చినతర్వాత నేమియు నీయనందువా.

శుక్ర—ఇచ్చెదనని చేవ్రాలుచేసి యీయనివారి నేమిచేసినారు.

ఈశ్వ—కలికాలచేష్టలు చేయకుము.

శుక్ర—ఏకాలముననను ధనికులచేష్ట లిట్లేయుండును.

ఈశ్వ—కుబేరుఁడు నాకు మిక్కిలిస్నేహితుఁడు.

శుక్ర—నేను నీకత్యంతప్రియభక్తుఁడను, నీవు భక్తవత్సలుఁడవు.

చ. జయజగదీశ! నీదయఁ బ్రశంసకు నెక్కితి నిన్వినా జగ
చ్ఛయమున దిక్కులేదు, గిరిజావర! యోర్వను దుష్టవహ్నిలో
వ్యయ మగునాశరీరము భవా యిఁక నీకును నన్నువంటిని
శ్చయమతి సేవకుం డరుదు చాలును బాధలువెట్టనేఁటికిన్.

చ. భవభయహారి! లోభియగు వాఁడు ననుం గరుణావిహీనుఁడై
యవమతిసేసె నీవు నిటు లాఱడివెట్టెదు సజ్జనుల్ ధరన్
వ్యవహృతిసేయనేర్తు రెటు లక్కట స్నేహితు మీఁదిప్రేమ లే
దె విదితసేవకుండయిన దీనునిపైఁ గరుణాపయోనిధీ.

మ ధనమేలా ననుబోఁటికి న్వలయునే తారాదొ ధ్యానించినన్
జనులందుం గలయీవిధంబుఁ దెలుప న్సాధారణోపాధుల
న్వీన రెవ్వారును నీసమక్షమునఁ గావింపన్ జగద్వ్యాప్త వౌ
నని నేఁజేసినయత్న మింక నయినం బ్రార్థింతు రక్షింపవే.

ఈశ్వ—శుక్రాచార్య! నీయభిప్రాయము తెలిసినది. స్నేహితుఁడు వచ్చి గోల యెత్తిన నొక్కింత యనాలోచితముగా నే నడచితిని. వెలికి రమ్ము.

శుక్ర—(ఈశ్వరుని దేహమునుండి వెలికివచ్చి నిల్చును.)

ఈశ్వ—దైత్యగురు! నీయభిమత మేమి?

శుక్ర—దేవాదిదేవ! నాయభిమత మిది. (ఇటునటుచూచును.)

సూత్రధారుఁడు—(ప్రవేశించి)

మ. ధనగర్వంబుఁ దొలంగి యర్థులకు విత్తం బిచ్చి సత్కావ్యవి
జ్ఞనగణ్యుల్ పొనరించుజ్ఞాన మదియే సర్వత్ర విత్తేశులం
దున వ్యాపించుతఁ బాత్రదత్తధనమెం దున్నాటికిం గోటియై
ధనులం బుణ్యపథంబునం దిడుతఁ దద్వాత్సల్యమో శంకరా.

ఈశ్వ—తథాస్తు. (అందఱును నిష్క్రమింతురు.)

ఇది కావ్యకౌబేర మను చతుర్థాంగము.

# ౫. ప్రయోగవేషణము.

సూత్ర—గీ. తండ్రి తనపుత్రునకుఁ బెండ్లి తగుణమందుఁ
గట్నమడుగుట మానినఁ గట్టువడును
భూమి లమ్ముట యప్పుల మునిఁగి చెడుట
బలిమిఁ జాఁబోక; సౌఖ్యంబు ప్రజకుఁ గలుగు.

నటి—మనకుఁ గొడుకులు లేరు గనుక మీరీమాట యనఁగలిగితిరి.

సూత్ర—ఉన్న నేమి లేకున్న నేమి నాకు మాటలలో నొకటియు మనసులో నొకటియు లేదు.

నటి—ఆత్మస్తవముఁ బరనిందయు లేనివారివలెఁ గనఁబడుచున్నారు.

సూత్ర—నిన్నటిసభలో లేచి పెద్దగొంతుతో, మనబిడ్డలకు మన బిడ్డలకని యఱచినవారు, బిడ్డలులేనివారు భార్యలు లేనివారును గదా.

నటి—మొట్టమొదట నగ్రాసనాధిపతి యెట్టివాఁడు?

సూత్ర—తన పెండ్లి కెన్నిసారులో ఖండించి పుచ్చుకొన్నతఁడే.

నటి—ఇఁక మన దేశములో యువకులకు యువతులకుఁ బెండ్లిండ్లు జరగుట కష్టము.

సూత్ర—మొన్నటిసభ చిత్రము-బిడ్డపాపలు లేనివారే మేము కట్నములు శుల్కములు మానెదమని చేవ్రాళ్లు చేసినారఁట.

నటి—కొందఱు వెడతెక్కలపిల్ల లుండఁబట్టియే సజ్జనులు వినయసంపన్నులగు సాధారణగృహస్థులబిడ్డలు తృణీకరింపఁబడుచున్నారు

సూత్ర—నా కింకను నల్లమందు పట్టీయలేదు. ముందు మాట వెడలుటలేదు.

నటి—మీరు కొంతవిశ్రమింపుఁడు అల్లుఁడుగదా యిపుడు నారసపాత్రము ధరించి వచ్చువాఁడు. ఇంతలో మీరు సరుదుకొందురు.

సూత్ర—నీవెంటనె వచ్చెదను పదపద (నిష్క్రమింతురు.)

నారసుఁడు—(ప్రవేశించి) చీ నరజన్మము దుర్లభ మనువారిపక్షమున నేను నిలువను. ఏదో ప్రపంచాతీతమైన దుష్కర్మము చేసినవానికే మానవజన్మములభించును. పూర్వజన్మకృతపాపమంతయు ముద్దయై మాతృగర్భమునఁబడు నని నాయభిప్రాయము. సుఖపడుచున్నవాఁడు కోటికొకఁడుండఁడు. ఉండెనా వాఁడు బ్రహ్మదేవుని పొరపాటునఁ బడినవాఁడు. దురాశాగ్రస్తమైన యీప్రపంచములో-అసూయాపిశాచబాధిత మగు నీజగత్తులో సుఖము దొరకుటకు

సం దున్నదా! బలవన్మరణము పాతకహేతు వను భయమున నీకుంటిమాట లాడుచున్నవాఁడను, గాని, యీవేషముం దాల్చి యిట్టిగాఢారణ్యములో నొక్కక్షణ కాలమైన నుండవలసినదా. గ్రామములలో నోట బెల్లము హృదయములోఁ గత్తెరయుఁ గలనగువారిలో నుండుటకంటె నోరులేని యీ మృగములలో నుండుట యెక్కింత సుఖకరముగానే యున్నది. ఓసరు లారా! ఏమి మీ ప్రయత్నములు!

మం. మసిఁబూసి చేయరె మారేడుఁగాయ, మంచిచెక్కఁగఁ జేసి మాయ చేసితిరి
పూఁట కన్నము లేని పురుషుని గొప్ప, ధనవంతుఁగాఁ జెప్పఁ దలఁచితి రెట్టె
పెద్దవేషము వేసి విద్యార్థులలము, మేలంచు మోఁగెడు మి మ్మెనసందు
ఎరువుసొమ్ములు పెట్టి హీనునిఁ దెచ్చి, రాజాసనముం దని వాకొనఁ దగునె
మీఋణంబుల దాచి మేటిగ విత్త, వంతుల ననుకొన వాకెటు వచ్చె
దొంగపం డొక్కటిఁ దుద నదికించి, పిగిలిపిట్టను బట్ట వేసితి గుచ్చి
గిలిగిచ్చకాయగుత్తులు చూపి రత్న,కింకిణుల్ హరియింపఁ గృషి యొనరింత్రె
గడ్డిపోఁచలు మచ్చుగాఁ జల్లి చకిత, హరిణశాబముఁ బట్ట సత్త్వాఢ్యుఁ దగునె
ఉప్పిపండులగుత్తు లొక్కటఁ జూపి, యాణిముత్తెపుఁగోవ నడుగంగఁ దగునె
కుంటివారలు గ్రుడ్డికంటివారలును, హాసభాసవిలాసహారు లటంచు
మోసగింతురె మీకు మోమెట్లు చెల్లు,ధనవంతులార మీధన మెందుకొఱకు
గుణముగ్రహించెడుగుణ మెడలంగఁ,బగులమాటలె మీకుఁ బ్రాఁబల్కులయ్యె

(దిక్కులఁ బరికించి) ఆఁ! ఏమిది! వనమెల్లఁ గోలాహలధ్వని మృగములు పరు వెత్తు తొందరలోఁ బర్వతముమీఁదినుండి శిలలు దొరలుచున్నవి. ఇంకను బూర్ణముగ సంధ్యాకాలము రాలేదు.

గీ. అనుభవముగల పెదపెద్దవనమృగములు,పొదలుచేరంగఁ బోయెడుఁ బూర్వరీతిఁ
జలన మొందక యెడపిల్లలబలముగ,ముందుఁబరువెత్తలేఁగలు మూఁగుకొనుచు.
ఇది యేమై యుండునో.

గీ. డొక్కలఱనిండెఁబరువెత్తఁబ్రక్కలెగిరి,యెగిరిపడుచుండె నేలఁగూలుమృగికిఁ జాల
ప్రొద్దునుండియు నలజడి పుట్టెఁబోలు, నడవిలోపలఁ గని పెట్టనైతి నౌర.

ఇట్టి అడవిలోఁ బడియుండియుఁ దుచ్ఛమానవలోకముం దలంచుకొనుచున్న నాదోషముననే హాయిగా నుండుజంతువులకుఁ గష్టము ప్రాప్తించినది. ఇంతకాలమునుండి యిందలిజంతువులతో సహవాసముచేయుచున్నను నాకు

వానితృప్తియు సౌమ్యగుణము సన్నిక యిప్పుడు పశుప్రాయత మాత్రము కలిగినది (పరికించి) ఏమిది నాశరీరముగూడ భయముచేతనో యానందము చేతనో గగుర్పొడుచుచున్నది. పెల్లాఁకలిగొన్న మృగరాజు తనగుహ నుండి వెడలి వచ్చుట లేదుగద! నోరులేని మృగముల కున్న పసికట్టుగుణ ము నాకు లేదు. ఒక్కజంతువున కైనను నాశరీరమును సమర్పించి బలవన్మ రణదోషమునుండి తప్పించుకొను భాగ్యము నాకు దొరకదా! భూతతృప్తి చేయుట యెంత వానికి! (చూచి) అద్దిర! ఈయడవియంతయు మలయపర్వ తమునుండి పిలెంచు చల్లగాలి వలనఁ గాఁబోలు మంచిగంధపువాసన కొట్టు చున్నది. ఇదియేదో శుభసూచకమే. నాయొడలు చల్లఁబడినది. నే నెవ్వరి కైన నుపకారము చేయఁగలుగుదునా! నేనా పరోపకారిని! (విని) మనుష్య స్వరము. విచారించెదను

(పరిక్రమించును.)

సూత్రధా—(ప్రవేశించి) ఇప్పటికి నల్లమందు పట్టుచేసినది. భుక్తాయాసమును గొంత తీరినది

నటి—(ప్రవేశించి) నల్లమందుతిక్కలో సారసునివలె నెక్కడికైనఁ బోయినా రేమో యని భయపడి వెదుకవచ్చితిని.

సూత్ర—నీవేమి చేయుచున్నదానవు.

నటి—పిల్లకు బాలయోగివేషము వేయుచున్నదానను.

సూత్ర—ఇందాఁకటి తంవాయి రెండుమాటలు వినవా? ఒకపెద్దయుద్యోగి కూఁతునమ్మిన ధనముతోనే నేను మనఁగట్టినాఁడు.

నటి—ఉద్యోగులకు డబ్బు కొలబత్తెము. ఇట్టికోవు రాకున్న వారికి గృహస్థ నామము రాదు. బీదవారు పుచ్చుకొన్నఁ దప్పేమి.

సూత్ర—ఇంకొకటి వినుము.

గీ. పెద్దవారలతనయుల విద్యఁ జూచి, పేదవారలు వారితో వియ్యమందఁ
దలఁచుటయనర్థహేతువుదానివలనఁ,గొంపగుండమువడుచుండెఁగొందఱకును

నటి—“వివాహశ్చ వివాదశ్చ సమయో రేవ శోభతే” ఆహా! ఎంత యనుభవ శాలి చెప్పెనో.

సూత్ర—విద్య లేకున్నను ధనముగలవారి కెంద ఆిచ్చుచున్నారు. దానివలన హాని లేదు.

నటి—కట్నములు మెండు; అసమానసంబంధములు విశేషము.

సూత్ర—ఇనుకప్రాంతజా; సమానసంబంధమునకు నేనొక యర్థము చెప్పెదను. తల్లిదండ్రుల యైశ్వర్యములలో సామ్య మక్కఱలేదు. వధూవరుల మనస్సులలోని ప్రేమ సమానముగా నుండినం జాలునని—

నటి—ఇప్పటి మనప్రహసనరంగములోని కథ యట్టిదే గదా. (విని) అమ్మా వచ్చుచున్నానే.

సూత్ర—సారసుని వెదకు బాలయోగి భూమిక మనయమ్మిణీ వేసినావు సరి మనమిరువురమును బైనుండి కుఱ్ఱవాండ్ర సంభాషణము వినుచుందము రా.

(అని పరిక్రమింతురు.)

(బాలయోగి ప్రవేశించును.)

బాల—అగమ్యగోచరము ఏవైపునకుం బోవుచున్నదాననో. ఎపుడు నా యెడల యౌవనాంకురము పొడసూపినదో నాండే నేనొరులసొమ్ము కావలసినదాన నైతిని. అది యేటిమాట. ఆడుది పుట్టిననాండనే యొరులసొత్తు. పుట్టుటయే యొరులకొఱకు; తమశరీరములను బోషించినట్లు బిడ్డలను దల్లిదండ్రులు పోషించి కాలగతిచేం జేతులలోనుండి విసరివైచెదరు. పుట్టమీంద నే పడునో పుడుకమీందనే పడునో దూరముననే పడునో దాపున నేపడునో యదృష్టము. ఉద్యోగవశమున భర్తలతో దూరదేశములలోం బడుట వింతకాదు. ప్రత్యవాయజనకమును గాదు.

గీ. పనులవెంబడి నుద్యోగవశత దూర, దేశముల కేగినంతనె దిగులుపడుట
యాత్మనాశనహేతువౌ నకట కన్నం, బ్రామిజనులను ముగ్ధులుగా మదించి
కాలిక్రిందను గన్నము ల్గాలిలోన, హర్మ్యనిర్మాణములు సేయునట్టి వారి
నెట్లుతప్పించుకొనవచ్చు నెవరితరము, దొంగయుమనుష్యునట్లెం జేతూఱిచూడ
రాదు మాటలు నేర్చిన ప్రజకె యిట్టి, కలిని బలమెక్కుడగు మాట కారెఁ గడవ
బ్రహ్మవశమా నెమాటలంబక్షిగణము, మృగతతియు లోపడుటవింత యేదిగంత
కీర్తులగు దొడ్డవారును గిక్కురుమన, కుండ లొంగుచు నుండి రుద్యోగ మేది
యాస్తి యెక్కడ నిల్లెందు నైన బలంగ, మెచటం గలదను శంకకే యెడము లేక
పెద్దతలపాగ గలవాండు వృద్ధుం డాలు, బిడ్డలున్నారు వీనిని విశ్వసింప
వలయునని ముందువెనుకలు కలయంజూడ, కాన్కజలం గోలుగానిచ్చి యన్నిటికిని
దూరులగుచున్న జనకుల దూఱనగునె, - - - - - - -

ఎవ్వరికిం దెలియకుండ నిలువిడిచి వచ్చితిని. తగినఫల మనుభవించుచున్నాను. లేనిది లేనే లేదు. పోయినవాండు పోయెను. ఊరకుండక యేల యీయర

ణ్యము చోరవలయును. వైరాగ్యముచే నాతఁ డేవంకకుఁ బోయెనో వెద కుట నాతరమా! ఒడిలోని వస్తువును గానక యూరెల్ల వెదకు నే నట్టి సద్గు ణాన్వితుని నిగర్వచూడామణిని పట్టుకొనఁగలనా. న న్నక్కఱ చేయునా. మూఁడుదినములనుండి తిండిలేదు. నిద్రలేదు. ఎవ్వరు చూచెదరో యను భయము. ఓపరమేశ్వరా! ఇపుడు సాయంకాల మగుచున్నది. ఎక్కడ నిలుతును. ఏచెట్టుక్రిందఁ బండుకొందును ఏవనమృగమైన నన్ను మ్రింగి వైచు నేమో. ఇప్పుడుగాదు ప్రాణములమీఁది నిరాశ. (చూచి) చీఁకటి పడుచున్నది. క్రింద ముల్లున్నదో కల్లున్నదో! ఇఁక నొక్కయడుగుఁగదపఁ జాలను. కాని యిట్లే నిలువుగాళ్లమీఁద నుండెదను. అల్లదె! రెండుదీప ములు కానవచ్చుచున్నవి. నాతండ్రితో వేఁటకాండ్రు చెప్పినట్లు పెద్దపులి కన్నులు చీఁకటిలో మెఱయుచున్నవి గాఁబోలును. క్రమక్రమముగఁ బెద్ద విగా సమీపమునకు వచ్చుచున్నవి. కాదు కాదు, పులికాదు నాతండ్రి యాజ్ఞపై నన్ను వెదకవచ్చువారి కాఁగడాలు. బోయిలమోఁత యేమి. నా తండ్రి యందలమెక్కి వచ్చుచున్నాఁడా. ఇంక దాఁగినలాభము లేదు. వారికంటఁ బడియెదను. నేను వారి నెలుఁగెత్తి పిలుతునా. ఈరాత్రి భయ ము లేకుండును. (గొంతు సవరించుకొని) కంఠములో చెమ్మలేక మాట వెడలుట లేదు. ఓదయాళులారా! నావంకకు వచ్చి రక్షింపుఁడు. అంధ కారములోఁ బడియున్న దానను.

సార—(ప్రవేశించి) నాగుండె గరఁగించు నీయార్తనాద మెవ్వరిది.

గీ. బాటసారి వెఱవవలదు వచ్చుచునుంటి, నడుగుఁ గదపి యవల నరుగఁబోకు
మోసపోకు దీపములు గాఁగడా లంచుఁ, గొఱవిదయ్యము లవి గొంకఁ బోకు.

బాల—(విని) ఎవ్వరి దీస్వరము. ఎంతశ్రావ్యముగా నున్నది.

గీ. రమ్ముదీనబంధు రక్షింపుమీ నన్ను, నడచినడచి కాళ్లు వడఁకెఁ జొచ్చె
నెంతనడచె నేని యిద్దరియుద్దరి, దొరక దడవి నాకుఁ దోఁడువచ్చె.

సార—ఇటు ర మ్మిటురమ్ము, నీకు దగ్గఱగాఁ జీతుకులు రగిల్చి మంట వేయు చున్నాఁడను. ఈవైపునకు మెల్లగ రమ్ము. వలదు వలదు కొఱవిపాలకట్టి వెలిఁగించుకొని నేనే నీకడకు వచ్చెదను నిలువుము.

బాల—చాలును స్వామీ! మీయాదరభాషణము లూఁతగ నేనే వచ్చుచు న్నాను, మీకు శ్రమమువలదు. (నడచి) ఇదియేగదా దడిలోనుండి వెలుఁగు కనఁబడుచున్నది. ఏమహాత్మునిదో యాకుటిల్లు. గుమ్మ మాప్రక్కను.

సార—(తడుకు విప్పి యూసలకు వచ్చి) రమ్ము! చాల బడలియుందువు. మాట లో యేటం బడినది, కొంచెము విశ్రమింపుము, పాదప్రక్షాళనము చేసికొని శ్రమదీరుటకు శాంతింపుము. చల్లగాలికై యీకాతిమీందం గూర్చుండుము. మే మడవి మనుష్యులము, మాయాహారము రుచింపదేమో కాని తెల్లవాఱుదాంక ప్రాణము నిలుపును. మాతిండి గడ్డితిండి.

బాల—స్వామీ! ఎంతమాట! ఆదరముతో మీ రొసంగునది నాపాలిటి కమృతము. (కాలుసేతులు కడిగికొని కూర్చుండును.)

సార—ఎప్పటి కయ్యది ప్రస్తుతము.

బాల—మీరు కొఱకివిడిచిన దుంపతూండు నాకు యూమూత్రమైన నధికారమున్నదా. పంచభక్ష్యపరమాన్నములు దిను నాగరకు లేమి వనవాసుల కంటె దృఢకాయులా! నీరోగులా.

గీ. తినక నిలువలేరు తిని నిల్వంగలేరు, జీర్ణశక్తిలేక జీర్ణదేహు
లగుదు రన్నెచూడుం డని విఱ్ఱవీఁగుదు, రిస్సి నాగరకులు హీనమతులు.

సార—నాయింట నీకు సంశయము వలదు. ఇం దొకరియధికారము లేదు. వలసినపదార్థములు నాజోలిలో నున్నవి. పెట్టెకుం దాళము వేయు లేదు. ఎవ్వరి కైనను నిరభ్యంతరముగ నివి యన్నియుం గొనదగ్గములు; భక్షింపుము. (అని కొన్నిముందు పెట్టి తినిపించును.)

బాల—(భక్షించి) ఇంకం జాలును.

సార—సందేహింపకు-కమండులువులోని నీళ్లు త్రాగి నిద్రింపుము. సెలయేటికిం బోయి నేను మరలం దెచ్చికొందును. లోనికి వచ్చి నెగడి యొద్ద నొక్కింత చలి కాచికొని—(లోనికిం గొనిపోవును.)

బాల—(లోనికిం బోయి) మౌనీంద్ర నాకు నిరాయాసముగా నున్నది. ఇట్టి సౌఖ్యము రాజభవనములలో నుండదు.

సార—ఏమొ నన్ను వెక్కిరించుచున్నావు. లేక మెఱమెచ్చులో.

బాల—నేను భక్షించినది నీకై పోవుంగాక-నిక్కమే చెప్పితిని.

సార—గీ. కడుపు నిండ లేదు కన్నులు లోంతుగాం
బోయె మొగము వాడిపోయెం బోండి
మెడలియున్న దీవ దెన్నివచించినం
దృప్తికాదు నీకుం దృప్తియెట్లు.

నీకు నాకు నేదో సంబంధ మున్నదేమో! నాకడుపు నిండుగా లేదు కావున నీకడుపు నిండినట్లు నేను నమ్మను.

బాల—మా యింటియొద్దికంటె నిక్కడ నొకముద్ద యెక్కువే యొసఁగెది.

నార—నీయాఁకలి తీఱినదా.

బాల—నిక్కముగాఁ దీఱినది.

నార—అట్లయిన నీమోము మేలయి యొప్పవడఁగి యున్నది.

బాల—అనవరతప్రయాణముచే.

నార—ప్రయాణాయాసము వేఱు చిన్నఁబోవుట వేఱు. ధనముం బోఁగొట్టుకొంటివా.

చ. కడుఁ శ్రమకోర్చి న్యాయమున గవ్వగ గవ్వగఁ బ్రోగుచేసి నీ
పదసిన ద్రవ్య మన్యులకుఁ బాల్పడెనో యది పెద్ద వంతయే

బాల—గడియకువచ్చు నాగడియకంటెను లోపుగఁ బోవు దానికై
పడుదునె దుఃఖ మట్టి దొకపాటియు నామది లేదు సంయమీ.

నార—నీజ్ఞాతు లన్యాయము చేసిరా.

బాల—చలిది కుండిన సంగీతము, పగటి కుండిన భాగవతము నను జ్ఞాతులు నాకు లేరు.

నార—నమ్మి చెలిమి యొనర్చిన నీయవ్యాజప్రేమకు స్నేహితులు వంచించిరా. ఈడు కానివారలతో స్నేహము చేసితివా.

బాల—స్నేహితు లున్న న న్నీయవస్థకు రానీయరు గద! నిక్కమైన స్నేహితుఁడు లేకయే గద యేమిటికిఁ గొఱగాక పోయితిని.

నార—దుర్వ్యసనములను దాల్చి జనులచే నిందింపఁబడితివా.

బాల—కాల మట్టిదియే కాని నాకట్టి యవస్థ ప్రాప్తింపలేదు.

ద్వి. మ్రింగ మెతుకు లేదు మీసాలమీఁద, సంగతి సంపెంగచమురును రాచి
తిరిగెద నని యొరు లిట్టంగ లేదు, పరు వెఱుంగక పెద్దపరు విడ లేదు
మ్మన్మథాకారంబు మఱపించి యుంటేఁ, దన్నయు ల్నాదుసౌందర్యంబు గన్న
నొగు లని యెన్నఁడు నుప్పొంగ లేదు, - - - - - - - - - - - -
నన్ను నేనే దర్పణంబునఁ గాంచి, కన్నులు ద్రిప్పుచుఁ గంత హారంబు
సవరించుకొనుచును శ్రవణభూషలను, రవధూళి దుడుచుచుఁ బ్రబలగర్వమున
నొపలెఱుంగక మిన్న కుప్పొంగ లేదు, నొడలుబ్బ మెడవంచి యోరగాఁ జూచు
చడుగడుగునఁ దన్ను నందఱుఁ జూచి, కడుఁ గుల్కుచుం దని గర్వింప లేదు
తొడిగిన కవచంబు తుల లేని దనియు, మడుఁగుఁ గట్టితినంచు మడమల దాఁక

జీరాడుచుండేఁ గుచ్చెళ్ల లనుకొనుచు, నీరమ్య వేషంబు నితరులు గాంచి
పొగడుచున్నా రని పొంగుట లేదు, తెగడుదు రనుభీతి తెగిపోను లేదు
నానల్లెవాటున నాకేమి మేలు, గావించు నితరులఁ గావించు నేమి
హానాయములనకై పైఁట యోరగావింప, నయు మితరుల కేమి నాసిగ్గుచేటు
మీసంబు మాటికి మెలివెట్టుచున్న, గాసియే గాని లోకమున కేమేలు
నగలతో మేనెల్ల నలఁగించుకొన్న, వగగాక లోకులు పడసిన దేమి
చెప్పులకిఱ్ఱికిఱ్ఱ చెవులు నిండింప, నొప్పరికింతునే నోఱసినకాలు
ముఱునాఁడు గుస్తాలు ముడఁతలు వెట్టి, కుఱుచగాఁ గుంటుట గొప్పయే నాకు
చిరిగినకుబుసంబు చిల్లులు మాట, విరులు గూరిచి నేను విఱ్ఱవీఁగుదునె
పొగచుట్ట చేఁ బెదవులు నల్లఁబాఱ, వగరు ధమ్ములమున వచ్చునే యొఱ్ఱ
లుకలుక మ్మని తలలోఁ బుట్టుపేలు, మొకమునఁ బ్రొంకఁ బూల్మసుటు నెసికను
తలటొప్పి యోరగాఁ దగిలించుకొన్న, నొలికిన దేమి నాయొడిలోనఁ జెపుమ.

సార—మఱి యేల నీమొగము వికాసము మాలియున్నది? ఎంతదుఃఖితున కైన నూఱట గలిగించెడు నీయరణ్యవినోదములు నీ కేల రుచింపవు. చూడు మీయెలుక మనయెదుట నిర్భయముగఁ దిరుగుచున్నది. ఈజవ్వాజిపిల్లిపిల్ల తల్లిమీఁదినుండి కుప్పించుచు నెట్లాడుకొనుచున్నదో! (మొగము చూచి) నామాటలు నీకు దుఃఖోపశమనము చేయుట లేదు. కన్నీ రేల విడుచుచున్నావు. నీకేరసమిష్టమో యారసముననే కొన్నిమాటలు చెప్పెదను. కథలు చెప్పుదునా.

బాల—నాచరిత్రమే యొకకథ.

సార—ద్వి. వెనుకముందెఱుఁగకవిద్యాధికుఁడను, ఘనకవిననిపెద్దగర్వంబునూని
సకలజ్ఞుఁడ నటంచు వికలప్రసంగ, వికటవాదంబుల వెఱ్ఱినై సభల
నపలాపములు చేసి యందఱిలోన, నపకీర్తిభాజనం బగుసందడితో.

బాల—ద్వి. కప్పలరీతి బెకబెకలు వోవు, తప్పుడుకవుల నిందఱఁ జూచుచుండి
తగుదునమ్మా యని దఱికొననంత, మగువనె యటు సిగ్గుమాలితి నొక్కొ.

సార—లోకమున వల పనునొకవస్తువు కలదు; స్త్రీపురుషుల నది మోసగించును. ఒక వేళ నీవట్టి వెఱ్ఱిలోఁ బడితివా సిగ్గుసిగ్గు - ప్రేమ, వలపు నను మాటలు మఱచిపొమ్ము. యౌవనవంతుల పరిహాసమే ప్రేమ. ప్రపంచమున నిజమైన ప్రేమ లేదు. మనసు గలసిన ప్రేమము లేదు.

వ. ప్రత్యుత్థానం బొనరించి యాదిత్యపతిం గౌఁగిలించుకొని యాతిథ్యం బొసంగి తథ్యంబులు హితంబులు నైన వాక్యంబులు గొన్ని నక్కాణించి పిశితభుక్కులశ్రేష్ఠుం డిట్లనియె. ౯౦

శా. అన్నా యన్నలఁ దమ్ము లైనయిము ము న్నాక్షేపము ల్పల్కి నే
నిన్నాళ్లెలితి మూఁడులోకములు మి మ్మేప్రొద్దుఁ గాఁరించితిఁ
వెన్నుం డుగ్రుఁడు నంవ్రయు న్ననుచుబల్వ్రీ ల్గాఁగితిఁ లోకర
క్షౌన్నత్యంబున కోప భోగములయుం దాసక్తి గొంటిం గడున్. ౯౧

గీ. ప్రాజ్ఞుఁడవు నీవు నయకళాప్రౌఢమతివి, యాబృహస్పతి నీకూర్పు నాశ్రితుండు
తాల్మి గలవాఁడ వోపుదు ధరణిభుజగ, సదననాకంబు లొక్కట సపరరింపు.

క. ఏకాతపవారణ మగు, లోకత్రయ మేలు మనుజలోకమును మగు
ల్లోకము సరిగాఁ జూడుము, నాకాప్తుఁడ వగుచు నుండు నాకాధీశా. ౯౩

గీ. అనిశఁ గపటనాటకారంభనిపుణుండు, నేఁడు చిక్కె [1]మత్తి కాఁడు నాకు
ననుచు వజ్రి దలఁచి హస్తాబ్జముకుళన, శాలి యగుచు దనుజపాలుఁ బలుకు.

మ. తపముల్ సేయుచు వ్రస్సి క్రుస్సి విపినాంతర్వాసు లై సద్విజ
త్రిపురంధ్వంసులచే వరంబు గొని దైతేయారిచేఁ జచ్చిన
ట్టిపలాదుల్ నినుఁ బోలఁగాఁ గలరె కంటి న్వారిచందంబు నీ
యపరిక్షీణపురాతపఃఫలము లత్యైశ్వర్య మిచ్చెం దగన్. ౯౫

గీ. ఒకని తెరువు సనక యొకని నొప్పింపక, సకలలోకములును సాధ్యపఱిచి
యేలుచున్న నీదులీలావిభూతికిఁ, దలఁకి రచ్యుతాదు లలఘుచరిత. ౯౬

క. ఏనుఁగుపల్లం బేడిక, పై నుసిచిన తెఱఁగు గాదె భవదురుబాహా
స్థాని సుఖ మున్న రాజ్య, శ్రీ నాపై నిలుపు టెల్ల జితశత్రుబలా. ౯౭

వ. అటు లేని యు భవదీయ చరణాస్థగణంబునఁ గృతకృత్యుండ నై దేవర యాన తిచ్చిన ప్రకారంబున నవికారవిచారుండ నై సచరాచరం బగునీజగత్త్రయం బుం బాలించెదఁ [2]గ్రేడించి చనిన దనుజకుమారవర్గంబు నిసర్గస్నేహంబున రప్పించి తత్తజ్జీవితంబు లిప్పించెద మీర లిచ్ఛానురూపంబు లగువిభవకలాపంబుల నాపోవుచు నెడనెడ మదీయం బగునడనడికి వెడఁగుఁదనంబు గలిగిన నుడిగించుచు సుఖం బుండుం డని యాఖండలుం డతనిచిటికెన[4] వ్రేలికీలితమణిశిలాకాశకలం బగుముద్దుటుంగరం బొసంగిన నంగీకంచి రాత్రించ

[1] మత్తి గాఁడు. [2] గేళించి. [3] నుడిగింపుచు. [4] వ్రేలంగ్గీలితమణి.

రపంచాననుఁ దత్స్యందనాంతరంబునకుం బోవ విన్నవించి తదీయంబగు పంచానన
పీఠంబున వసియించి. ౯౮

క. ఉరగుల సురగాలయమున, ధరణి నగస్త్రీలఁ దివిని, దివిజశివసర్గము దాఁ
జరగ యథాపూర్వస్థితి, హరిహయుఁ డను దాటయు బ్రహ్మాదుల్ఁ బోనుయ్యెన్.

గీ. శూలధరుఁ జేరెఁ గైలాసశైలదుర్గ, మబ్జసంభవుఁ డుండె సత్యస్థలమునఁ [ను
గూర్మి వైకుంఠుఁడను రె వైకుంఠమునను, దానవకృతాంతరాయముల్దొలఁగుటయు

క. యాగపురోడాశములను, రాగంబుల నారగించి ప్రబలబలభుజా
భోగములు చూచుకొనుచు, న్వేగన్నులు వేల్పుఁ బొదిని విబుధశ్రేణుల్.

క. దేవవిరహితము లగుదే, వావసథస్థలము లెల్ల వహారిమహా సుమనో
ర్వావిభవపూరితము లై, భూవలయంబున గాంగె భూరిసుఖంబుల్. ౧౦౨

క. వాసవుకతమున విగత, త్రాసము లై ముజ్జగములు బ్రమదము నొందెం
గాసరసముపతి యగురా, కాసులఁగమికాఁడు సుదవి కారార్జితుఁ డై. ౧౦౩

క. మదిరయు మదిరాదేవియు, మదనాహవతంత్రవిధికి మర్మముఁ దెలుపం
బదియైదువత్సరము లా, త్రిదశారి యు భోగకాంతుఁ దేసులక [1]యుండెన్.

సీ. అష్టావశిష్టంబు లానవాలకకొన్ని చక్కెరపానకా లొక్కకొన్ని
పచ్చితేనెలు గాలు ఫలము లొక్కొకకొన్ని కొన్ని దివ్యామోదకుసుమసరము
లేణమదంబును నిందుఖండంబులుఁ గలపినపూఁతపింగాండ్లు గొన్ని
యుహవ్వనసూఁదినసుడువీథిఁదాఁకుదివ్యాంబరంబులుగొన్ని యనుముహూర్త
మును బరంపరగాఁ బంపు ననిమిషేంద్రుఁ, డూడిగపుఁగిట్టియలచేత నుసలోనఁ
గ్రీడలాడుచునున్న యక్షీణసుదన, రాగరసమత్తమతికి నారాక్షసునకు.

గీ. హోంములును జతుర్విధాహారభాండ, నికరములుఁ బచ్చికస్తూరినికరములును
ననుచు లోనికి రాజయోగ్యంబు లైన, వానిఁ దెందేవగాఁగ దైనతోవిభుండు.

గీ. విభుఁడు చెప్పినవానిలో వృత్రవైరి, దానవుఁడుకును కడు నెగ్గుఁ దలఁచుఁ గాని
నాకమునకును దక్కినలోకములకు, నాద్యతానందసౌందర్య నుందఁ జేయు.

గీ. వేఁటలాడించు [2]దుష్ట్యాతవిధులు దెలుపుఁ, గాను శోస్త్రగిహాస్యసంగతులఁగఁ అపు
గాని నీతికిఁ జొరనీఁడు దానవేంద్రుఁ, గూల్పఁ బొంచి వసించిన కులిశపాణి.

వ. అంతఁ గొంతకాలంబు చన్నపిమ్మట మగుడ్క్రొత్తుం దేకాంతంబునకు శాం
బరి నాకర్షించి మహామాయా నీవు మాయనుబుకుంబున నంతిపురంబునకుం
జని మదిరాకన్యక నయ్యన్యాయువర్తికడం బ్రవర్తింపనీక తొలంగిదూగంబు [3]సనఁ

[1] యుండ్డునూ. [2] దుద్యూతశ. [3] చని.

దన వెంబడిం జనుదెంచిన యాక్రీడాంచుదెంపంబుఁ బ్రవేశించు నాని నొడివిన
నప్పుడంతియు వేల్పుమోఱియని పేరుకొని క్రీడాభవనంబు సొచ్చి విబుచ్చర
పతి తన్నుం బనిచినపని సఫలంబు గావించుటయు. ౧౦౯

ఉ. నోరును నోరుఁ గీల్కొనఁ దనూలతయుం దను [1]వల్లిబిల్లి యై
కూరిచినట్లు లుండఁ దలఁగోక యెఱుంగక పుష్పబాణు పె
న్బోరున సీధుపానమున బుద్ధివిదూరత సిద్రవోవు ర
క్షోరమణుం ద్యజించి జగు న్నదిరాంగన సంగదూర యై. ౧౧౦

గీ. ధనము రాజ్యంబుఁ దనకొఱకు నెగ్గజించి, మాఱు సేఁత లెఱుంగక మాన్పరకును
బ్రియము చెప్పి చరించు నా ప్రియుని బాసె, మదిర పాతకముల కెల్లఁ గుదురు చెలువ.

క. దానవుఁడు మేలుకని సుది, రానీరజవదన గానరామి కులికి నా
నానిలయాంతరములకుం, దానె యరిగి వెదకు హృదయతాపముతోడన్.

క. వచ్చినచోటికిఁ గ్రమ్మఱి, వచ్చుం బూఁదోఁట సూచి వచ్చుఁ బ్రియముతో
నెచ్చెలుల నడుగు నడుగులు, మచ్చనురయునొఱలుఁ దెరలు మలఁగుం గలఁగున్.

వ. ఇవ్విధంబున నవ్విబుధారి వధూవియోగధూమధ్వజసందహ్యమానమాన
సుండై యానిశాసమయంబున నసమనయనకఠోరకంఠకుహరఘటితహాలా
హలఘుటికాచటులం బగుకటికిచీఁకటిని నిశాచరుం డగుటను నిర్భయుం
డగుటను నెఱి దప్పక గుప్పునం బ్రాకారలంఘనం బాచరించి చరాచర
విలోచనభయద జ్వాలాకరాళం బగుకరవాలంబు దక్షిణకరంబునం జళిపిం
చుచు విలపించుచు నుత్తరాభిముఖుం డై తత్తనూసౌరభంబు పులుగునొడు
వఁ గడునడి నడునం జొచ్చె నిచ్చట. ౧౧౪

క. మానవతి దలఁగి పోకయు, దానవుఁ డట చనినవిధముఁ దా నెఱిఁగి మహా
సేనలతో వెన్నాడె బలానలజలధరము ప్రహసితాననుఁ డగుచున్. ౧౧౫

మ. చరణాంభోరుహయావకాంకములు భూషాస్త్రస్తమాణిక్యముల్
తరులగ్నాంశుకఖండముల్ పథిగళద్ధమ్మిల్లమాల్యంబులున్
సరసాంగచ్యుతగంధకర్దమములోల స్వేదసౌరభ్యముల్
తరుణీరత్నము చన్నత్రోవఁ దెలిపెన్ దైత్యాన్వయస్వామికిన్. ౧౧౬

క. [2]విఘటికలోపల సురపుర, విఘటనలంపటుఁడు గాంచె విపులతరసుధా
లఘుజల మధరీకృతపం, కఘనము మానససరశ్శిఖాశేఖరమున్. ౧౧౭

సీ. వినవచ్చె దవ్వుల వెక్కి, వెక్కి యెనర్చు పరిదేవనధ్వని పాటపాట
నాపిలాపములోన హా దైవమా యను విధ్యుపాలంభనవిధము దోఁచ

---

[1] వెల్లిబెల్లి. [2] విఘడియ.

నాదూఱుమాటలయంతరాంతరములఁ బొడకట్టె హంసుఁ డా విడిచిరాక తత్తదుక్తులఁ బిలుచుఁదన హంసుఁ డిఁక నేమి యా నాకో యను నృపాహ్లాదభాష లెసఁగ నెంతయు నాలించియసురభర్త, కంటిఁగలకంఠిననుచునుత్కంఠ మెఱయ నుట్టిపడ్డట్టు చెట్టుననుండి దిగిన, కరణి నయ్యింతియగ్రభాగమున నిలిచి.

క. వెఱవకు మిఁక నే వచ్చితిఁ, దెఱవా నెఱజాఁడిసూది దెగిపాఱని యా
కఱకుఁజీఁకటి వచ్చిన, కఱటివి నిను దూఱ మాకుఁ గలవే ఫలముల్.

ఉ. ర మ్మని చెట్ట వట్టుకొని రాజముఖిన్ గురి వెంగలిఁగ మొ
త్తముల యింటిలోపలికిఁ దారిచి కూరుచుమాటలాడి నె
య్యమ్మునఁ గౌఁగలించుటయు నాసుదతీతిలకంబు పల్కె ఖే
దమ్మునఁ దల్లడిల్లెడువిధంబు ప్రవృద్ధము చేయుచుం బతిన్. ౧౨౦

మ. వినవయ్యా దనుజాధినాథ త్రిజగద్వీరా నినుం గూడి నా
యనుజభ్రాతముఁ దల్లిఁ దండ్రిని వయస్యాకోటులం బాసి కం
తు నిశాతాశుగతప్తచిత్త నగుచుం దొట్రిల్లు టెల్లన్ ఫలిం
చె ననుం జంపఁ గడంగినాఁ డఁట సునాసీరుండు క్రూరోద్ధతిన్ ౧౨౧

వ. తత్ప్రేషిత యగునొక్క యోష నిజభూషావిశేషమురీచిగండూషితాజాండ మండలంబుగ మనక్రీడించుమేడకు వచ్చి మీరు విచ్చలవిడి నిద్రించువేళ ననుం గనలి చూచుచు నోమచ్చెకంటి నీ విచ్చట నునికి వియచ్చరపతియిచ్చకు వైరస్యకారి దూరంబు చనుము చనకున్న నిన్నుం దునుకలు సేసి "నీకతంబున నవాకృతరాజ్యభారుం డగుదానవవీరు నుదారోత్సవంబులఁ ద్రిజగత్సామ్రాజ్యపూజ్యుం జేయు" నిది నిక్కంబ యని చక్కం జాగి పోవుటయుఁ గపటనాటక సూత్రధారుం డగుజంభారి సంరంభంబునకుం గలంగితింగాక నీకిచ్చినప్రాణంబు నొందుకడం జొనుపుదునే వినుము. ౧౨౨

క. సురనాథుతోడ వలవని, విరసత మన కేల నీదు విమలతరహృదం
తరమందిరదీపికనై, పొరయింతు నపారసౌఖ్యములు ముఖ్యగతిన్. ౧౨౩

వ. నీవు ప్రాణాయామపరుండ వగుము పవనపరంపరాప్రవాహసోపానంబులు మెట్టి నీడెందంపుం గందువకుం జని యనిమిషపతికిం గన వశంబు గాక యశోకానందంబు నొందెద ననుటయు నాకుటిలకుంతలసట లెఱుంగక నిశాపతి తద్వచనప్రకారం బాచరించుటయు. ౧౨౪

---

"..." ఈచోట నేదో కొంతలోపించి యుండును.

క. మదిరాకన్యక హంసుని, హృదయంబున నిలిచె సురమహీధరగుహాలో
మదభుజగయునతి క్రుద్ధురు, విదమున లుబ్ధప్రసక్త విత్తములేలన్. ౧౨౫

క. హృదయముచొచ్చిన మదిరా, మదచేష్టలచేత మేను మఱచి ప్రబోధా
భ్యుదయరవి గ్రుంక హంసుఁడు, నిదురయుఁ బోఁ జొచ్చె నిట్టనిల్గుచు నచటన్.

క. కొండంతమేను బూడిద, పండుగ నిలఁ బొరలిపొరలి ప్రబలనిజభుజా
దండము తలగడగా నా, ఖండలరాజ్యాపహర్త కడు నిద్రించున్. ౧౨౭

క. నిద్రాసమయంబున నా, యుద్రిక్తస్వాంతుఁ డిచ్చునూర్పులవడి సా
ముద్రజలంబులు ఘూర్ణిలు, నద్రులు గంపించు ధరణి యట్టిట్టు పడున్. ౧౨౮

క. ముని వెన్నాడినసురపతి, యుని నచటికి వచ్చి వానియునికిఁ గని మనం
బున నలరియు బెగడెఁ దదు గ్రనిబిడనిశ్వాసవాతకంపితబలుఁడై. ౧౨౯

గీ. వజ్రి వేసెఁ దనదువజ్రంబు దైత్యేంద్రు, మేనుగొండఁదునిమి మెఱయఁదలఁచి
యదియుఁ దానవేంద్రుఁడొదవించునిశ్వాస, మారుతాభిహతుల మ్రానుపడియె

క. ఆచంద మెఱిఁగి ఫాలవి, లోచనజలజాతపత్రలోచనవాణీ
లోచనచకోరచంద్రులు, వాచాలము లైన దివిజవర్గంబులతోన్. ౧౩౧

వ. అచ్చటికి వచ్చి మచ్చరంబున నవ్వియచ్చరపరిపంథిపై శూలచక్రదండం
బులు ప్రయోగించిన నవి యవిరళవేగంబున నయ్యోగవిద్యావిదుం
డాఁకి కాఁక యుడిగి శిరీషప్రసవమృదులప్రసారంబు లగుట యుఁ ద్రిజగం
బులు విన్ననయ్యె యోగానలతప్తంబు నుత్తప్తసువర్ణవర్ణంబు నగు నతని
యంగంబున ఖంగుఖంగు మనునినదంబుల కొని సప్తధాతువులుం బొఁతు
కలంగుట కానంబడదయ్యె నయ్యెడ. ౧౩౨

క. లోకత్రయవిజ్ఞానక, శోకుశోలుం డైనయాదిలక్ష్మీపతి శ్రీ
ప్రాకారు వాయువుం గని, శ్రీకంటం జేరఁ బిలిచి కృపవెట్టుటయున్. ౧౩౩

వ. అతండు సాష్టాంగనమస్కృతిచతురుం డై పుండరీకాక్షున కిట్లనియె. ౧౩౪

గీ. దేవ పనిగొమ్ము నాకు నీసేవకునకు, నేఁడు ఫలియించెఁ దపములు నీరజాక్ష
యెద్ది పనిచినఁ గావింతు నెదురులేని, క్రీడనంబున విహరింతుఁ గీర్తిఁ గాంతు.

చ. అన హరి వల్కె నోపవన యంతటివాఁడవ నీవు యోగసి
ద్ధి నితని మేను నొవ్వదు మదీయసుదర్శనతీక్ష్ణధారచే
మనసిజవైరిశూలమును మాటుమణంగె విఱించిదండము
న్వనట మునింగెఁ గీడ్వడియె వాసవువజ్రము కంటివే కదా. ౧౩౬

వ. ఉపాయంబునం గాసి యపాయకరం బగునీసురారిశరీరంబు చిరుంగదు మెఱుం
గు మెఱచి యడంగు తెఱుంగున నీ వితనియంతరంగంబు సొచ్చి మర్మంబులు

గ్రొచ్చి సంధులు బంధించి పలుకులు వాకట్టి బలంబు వోఁదట్టి [1]ద్వితీయ
భంగిం జేయు మనిన నతండు నట్లచేసె ననురేశ్వరుండును ననువిదూరుం
డయ్యెఁ గావునఁ బగవారిం గలసి వర్తించుతుచ్ఛవర్తనుం డపకీర్తి రాకకు నైశ్వ
ర్యంబు పోకకు నెదురుకొని యుండుం గావున. ౧౩౮

గీ. [2]హంసునంతవాని కర్తైఅం గైనచో, నితండనుజకోటి నెన్న నేల
మీఁదు దెలిసి వేల్పు మేలాటములు మాని, నిలుపవయ్య కీర్తి నిలుపవయ్య.

గీ. తండ్రిఁ జంపినపగవాని దానవేంద్ర, నమ్మకుము తక్కురాజుల నమ్మరాదు
కృత్య మంతయు మాయందఁ గీలుకొనఁగఁ, జేయు నీకు నభీష్టంబు సేయువాఁడ

## ప్రహ్లాదుఁడు దేవతలపై విరోధించుట.

క. అని పలికినఁ బ్రహ్లాదుఁడు, తనమది దేవతలమీఁదితలఁ పుడిగి సుధా
శనవిమతమతము గైకొని, పెనిచె విరోధంబు సాధుబృందము మీఁదన్.

సీ. నిప్పచ్చరం బయ్యె నిర్జరేశాసక్తి పావకుచేపట్టు పట్టు వదలె
శమనంబుఁ గనియెఁ దచ్ఛమనుమీఁదితలంపు కోణపుపక్షంబు గుంటుపడియెఁ
బాశపాణిప్రీతి పలుచన యై సోఁచె గాలిపై నెయ్యంబు [3]తీలు పడియె
ధనదానురాగంబు దవ్వులఁ దలచూపె శంకరప్రణయంబు క్రుంకుపడియెఁ
దాపసులమీఁదితగులంబు తెఱఁగె వైష్ణ, వాగమంబుల తరితీపు బాగు దప్పెఁ
గుటిలదానవనిర్దిష్టకుత్సితప్ర, చారపారగుఁ డైన దేవారి కపుడు. ౧౪౧

క. కరుణార్ద్రవీక్షణుం డై, హిరణ్యకశిపుప్రసూతి యేకాంతముసం
బరమాప్తు లైనరాక్షస, పరివృఢులం బలికె వినయపరిచితఫణితిన్. ౧౪౨

క. పెద్దఱికంబున మును మా, పెద్దలకును వేల్పుకులము పెద్దలకు మహో
దృద్ధాంతిశాంతికర మగు, నిద్దపునీపలుకు మాననీయము కాదే. ౧౪౩

సీ. సంవర్తసమయభీషణవజ్రినజ్రాభ్రఘోష మై పటుహాయహేష మగుచు
సప్తానిలస్కంధసంధిబంధవిభేదవేగ మై నిర్భరోద్యోగ మగుచు
ఫాలలోచనఫాలఫలకకీలివిశాల తేజ మై శౌర్యనిర్వ్యాజ మగుచు
శమనకటాక్షవీక్షణపాతసన్నాహఘోర మై యాయుధోదార మగుచు
నాదుమూలబలంబు నానాదిగంత, రాళముల వేరుపాఱి యుత్తాల మైన
నేమి సేయంగ నోపుదు రెంతవారు, నాదివామననిభ వామనాభిధాన.

గీ నిప్పుమీఁది నివుఱుకప్పిల్ల నొయ్య నే, పార నూఁది యూఁది ప్రజ్వలితము
చేయు హోమి యనఁగఁ జిక్కులన్నియుఁ [4]బాపి, నామనంబు దేర్చి తో మహాత్మ.

---

[1] ద్వితీయ్యాభ్యంగ్గిం. [2] హంసుఁడంతవాని. [3] తీలిపడియె. [4] బాశి.

క. [1]ఎఱుఁగనికాలంబున నే, నెఱుఁగక దుర్బుద్ధి నైతి నెఱిఁగినతఱి మీ
రెఱుకపడఁ దెలిపినప్పుడ, మఱి యెఱుఁగకయునికి గలదె మాన్యవిచారా.

క. గెలిచెద భూమీవలయము, గెలిచెద బలిసద్మతలము గెలిచెద దివియుఁ
గెలు పనఁగ నెంత యుద్య, ద్బలు లగుమీప్రాపు గన్నబాలునంతులకున్.

ప్రహ్లాదుఁడు శ్రీవిష్ణువుపై దాడి వెడలుట.

క. ఆయుధములు కంకటములు, నాయిత్తముచేసి దండయాత్రకు మీమీ
దాయాదులఁ గూరిచికొని, వేయరుగుఁడు సకలదిశల వెంబడి మీరల్ ౧౪౮

సీ. అని రాక్షసకుమారుఁ దర్గ్వగుణంబులు విడిచి దుర్జనబుద్ధి వినశుఁ డగుచుఁ
దామసవిక్రియాస్థగితచేతస్కుఁడై యాఁగాము తెఱుఁగక యఘళించి
త్రిజగత్కుటుంబి యై దీపించుగోపాలదేవునిపై వైరదృష్టి నిలిపి
తనతండ్రిఁ బట్టి చంపినపగ లూఁగుదు నీఁగకుండిన నన్ను నీఁగ యనరె
యనుచు శ్రీహరితనువులై యతిశయిల్లు,విప్రులకు ధేనువులకును వేదములకుఁ
బుణ్యతీర్థంబులకు నెగు ల్పొడమఁ జేసె, జన్యజనకంబు లేకలక్షణము లరయ.

వ. ఇట్లాహ్లాదభరితాంతఃకరణుం డై ప్రహ్లాదుండు వామనుపలుకులయెడ సాద రుం డగుచుఁ దత్సహితంబుగ నమరాహితులం దమతమయిండ్లకుం బోవం బనిచి యనుదినప్రవర్ధమానస్పర్థానిర్ధాతప్రణయహృదయుం డై [2]యయ్యుద యుండు జగత్త్రయగిళనోత్సాహంబున నుత్సేకంబు గైకొని యుండి యుండి యొక్కనాఁడు. ౧౫౦

సీ. తోడిమ లూడినజరద్ద్రుమపుష్పములు వోలెఁ జదలఁ దారలు జలజలన రాలఁ
గ్రొత్తమెత్తిన సూర్యరశ్మి రేఖలువోలెఁ బేఁకెత్తి దిక్కుల బీఁట లెగయ
సమ్మెట నడిచిన సంతప్తలోహపిండమువోలె మిణుఁగుఱు లుమియ ధరణి
ధరణి పల్లాఱుఁ గుమ్మరిసారెయును బోలె గిరగిర నుడుగక తిరుపుగొనఁగ
గిరులు గోలాటమాడ నయ్యురగలోక,మురకప్రేళ్లకుఁ బెకలంగఁ గఱకుటసుర
సమరసంరంభియై భేరిచఱచఁ జేయ, నందుఁగ్రందయ్యె భాంకారకందళములు.

సీ. అశ్వరక్షకులార హయరత్నముల నెల్లఁ బల్లనకట్టుఁడీ పాటవమున
మావంతులార సంబాళించి ఘనపతాకంబు లెత్తుఁడు మత్తకరులమీఁద
సారథులార శస్త్రధ్వజంబులతోడ మెలపుఁడీ రథము లచ్చలము మిగుల
భటులార కదలుఁడీ చటులకార్ముకలతాజ్యాఘోషములు నభఃస్థలము ప్రింగఁ
ద్రిభువనాభీలభుజశక్తివిభవ మెసఁగ, దండయాత్రాభిముఖుఁ డయ్యె దనుజభర్త
యనుచు ఘోషించి[3]రిభమునందధవసించి,రాజపురుషులు ఘంటికారావ మెసఁగ.

---

[1] యెఱిగినకాలంబున. [2] నెయ్యుదయుండై. [3] రిభవమున్దధివశించ్చి.

సీ. వింధ్యశైలమునందు వెలయు నేనుంగులు నివియ నేనువునొకో యెన్నిచూడ
శాలిహోత్రు నియందు జనియించు నశ్వంబు లివియ నేనువునొకో యెన్నిచూడ
మనుగదీశవిశ్వకర్మకుఁ బుట్టు నరదంబు లివియ నేనువునొకో యెన్నిచూడ
[1]ప్రష్ఠ ప్రాథమికమౌ సృష్టి నుప్పవమొందు నివియ నేనువునొకో యెన్నిచూడ
ననఁగ నిభములుఁ దురగంబులు రథములును, గాల్బలంబులు నెసలెనొక్కటఁగ ఘోర
భుజబలాటోపమున దైత్యపుత్రుఁ డఖిల, దిగ్విజయయాత్ర సేయంగఁ దివురునపుడు

సీ. విభునిఁ బాయఁగ లేక వెనువెంట నంటులై యరుగ నుద్యోగించునట్టివారు
లై చేలఁ గొంగెలఁ బట్టి పోవఁగనీక ప్రాణనాథుల నొడంబఱచువారు
గద్గదస్వరములఁ గన్నీరు వెడలంగఁ బతులఁ బోఁజనదని పలుకువారు
మోహాంబు సిగ్గునుముడిచినఁ బ్రియుల యొద్ద నిల్చి తలవంచికొని డువారుఁ
గూర్మిభర్తల దీవించి కుంకుమాక్షతలు శిరంబుల పైఁ గీలుకొలుపువారు
నగుచుఁ దత్పురవీరనాయకులసతులు, విరహసంతాపతప్తలై వెల్లసరి. ౧౫౪

చ. ఎడపక పార్శ్వభాగముల హెగ్గడికత్తెలు వేత్రహస్తలై
సుడియఁగనీక పౌరగతిఁ జోఁపుచు నర్మవచోవిలాసముల్
నడుపుచుఁ గప్పుసందులు దొలంగ జనావళిఁ బ్రేమఁ జూచుచు
న్వెడలిరి రాజభోగినులు వేడుకతో శిబికాధిరూఢలై. ౧౫౫

చ. అలయికఁ బోలెఁ బూర్వవిటహస్తము లూఁతగఁ బట్టి తేటతా
బలుపులమాటలుం జిలుకబోదల నేలుకలస్వరంబులుం
దలకొను లేఁతజంకెనల దట్టపుఁజూపుల నేపుమాపుచున్
వలపులు చల్లుచుం బురము వారసతుల్ చనఁ జొచ్చి రచ్చటన్. ౧౫౬

వ. మఱియుఁ జర్మకార లోహకార స్వర్ణకార యంత్రికాదికులును భిషక్పురోహిత జ్యోతిషికామాత్యవర్గంబులును గవిభటపాఠకపటలంబును ధాన్యవస్త్ర హిరణ్యరత్నముక్తాప్రవాళగుడతైలాజ్యతండులముద్గచణకహింగుమరీచ్యాది పదార్థనానాక్రయవిక్రయాది వ్యవహారప్రాజ్ఞులైన నైగమసంఘంబులును మొదలుగాఁ గల పౌరలోకంబు నిరాకులప్రమదంబునఁ జనుచుండె దప్పు డప్పిశితాశనులు సమరసన్నాహసమన్వితులై. ౧౫౭

మ. మఱి గాఢానందాంధనేత్రములతో మత్తద్విపారూఢులై
విదితానేకపసంయుతుం డగుచు విద్విడ్భూపతుల్ భీతి నొం

[1] ఈచరణములోఁ గాల్బలము పేరు కనఁబడదు.

ద దివిజ దేవగణంబు లెల్ల సణఁకఁగ ధారాధరాకారులై
కదలె నృపృశ్చికరోముఁ డుగ్రవిచరత్ప్రవ్యాదయూథంబుతోన్. ౧౫౮

ఉ. భూరిబలప్రతాపములఁ బొంపిరివోవుచు శూలహస్తులై
హారిసువర్ణవర్ణము శతాంగమున న్వెలసిల్లి గాఢసం
చారఘనాఘనధ్వనులచందముఁ జూపెడు బృంహితంబులిం
పారుమతంగసంభవసహస్రము గొల్వఁ జనె న్బలీంద్రుఁ డున్. ౧౫౯

ఉ. అక్షయశౌర్యసంపదయు నద్భుతశౌర్యము నింపుమీఱఁగా
రాక్షసకోటి గొల్వ మదరాగము మోమున నిండ నాసహ
స్రాక్షసరోరుహాక్షనిటలాక్షుల గెల్చిన మేటిజోదు ధూ
మ్రాక్షుఁడు పోరికి న్వెడలె నద్రినిభద్విపవాహనంబుతోన్. ౧౬౦

క. కౌక్షేయపాణియై కపి, లాక్షుఁడు చనఁదొడఁగె క్షోణి యల్లాడంగా
నక్షతబలమున నార్వే, లక్షీణము లైనహయము లాగుబ్బకొనన్. ౧౬౧

ఉ. కంకటముల్ ధరించి శరకాండధనుర్ధరులై కిరీటులై
కంకటకాలకేయు లవికారరణోత్సవమత్సరోగ్రులై
యంకముఁ గోరి యేగిరి భయంకరశంఖరవంబు దిక్కుకూ
లంకషఁ గ్రీడలాడునబలాజనముం దలఁకొందఁ జేయఁగన్. ౧౬౨

సీ. దిగ్గజంబులఁ బట్టి తివియంగఁ బోనూకఁ జాలినమదసామజములతోడఁ
బవమానవేగంబు నవమానముగఁ జూచి పరఁగు నాజానేయహరులతోడఁ
గేతనానిలసమాకృష్టతారకము లౌ రమణీయరత్నరథములతోడ
నఖిలాండకోటుల నఱచేతికిని దెచ్చు చటులరాక్షసవీరభటులతోడ [డఁ
విమలముక్తామయాతపత్రములతోడఁ, గమియఁ బొదివిన వింజామరములతో
గాలదంష్ట్రుండు రథ మెక్కి కదలె దిగ్వి, జయమనీషావిశేషవిశాలుఁ డగుచు.

ఉ. శంబరదీర్ఘజిహ్వులు విశంకటకంకటగర్భితాంగులై
కంబుమృదంగగోవదనకాహళకాంస్యరవంబు లేక మై
యంబుధినీటి దాఁటుగొన నాజికి నేగిరి రాజమార్గము
ధ్వంబు తురంగచంక్రమణధారలఁ జూర్ణముగాఁగఁ జేయుచున్. ౧౬౪

క. వికటబలశూర్పకర్ణులు, ప్రకటబలోపేతు లగుచు భద్రేభశతా
ధికపట్సహస్రములతో, వికసితవదనాబ్జు లగుచు వెడలిరి యనికిన్. ౧౬౫

వ. ఇవ్విధంబున నధికబలపరాక్రమవిధేయు లగుయాతుధానవీరు లుదారాకారు
లై చతుర్విధశృంగారభంగీతరంగితనిజాంతరంగులై సంగరంబునకు వెడల,

సంగలించురాక్షసపుంగవునాగమనంబుఁ గోరుచు హజారంబుకడం బవుజుఁ దీర్చి రంత. ౧౬౬

సీ. సంగత్నకుండలద్వయరత్నదీధితి గండస్థలంబులఁ గప్పుకొనఁగ
సంగుళీయకకిరీటాంగదహారాది భూషణంబులతోడఁ బోలుపుమీఱి
పింజించికట్టినకెంజాయవలిపంబు మొలనూలికాంతులముసుఁగుఁ దిపియఁ
గస్తూరికుంకుమాగరుదర్పసారాంకమృగనాభిపంకంబు మేఁ దలిర్ప
బిరుదులందియ నలకాలమొరయుచుండ, నలిననయనలునీరాజనంబు లొసఁగ
దిగ్విజయయాత్రపైసముద్రేకమొనవఁ, బ్రోదిఁ బ్రహ్లాదుఁడాహ్లాదపూర్ణుఁడయ్యె

సీ. కంకణక్రేంకారసంకులంబుగఁ జేరి రమణులు వింజామరములు వీవ
బంగారుగుదియలు వట్టి పొంగారుచుఁ గించుకిన్నెరాశంబు [1]గజబిజింప
మురజభేరీశంఖనిరుపమధ్వానంబు పాథోధిఘోషంబుఁ బరిహసింప
సంగీతవిద్యావిశారదగాయకస్తుతులు పార్శ్వములందుఁ దోడుసూపఁ
జిత్రపల్యంకికాసమాసీనుఁ డగుచు, ధవళముక్తాతపత్రశతంబుతోడ
రాజబింబాస్య లాచారలాజలొలుక, సురవిరోధిసుతుం డంతిపురిము వెడలె

వ. ఇట్లు ప్రహ్లాదుండు నిజపురంబు వెలువడి పలుదెఱంగుల దళంబులు బెడంగు మెఱయఁ జనునప్పుడు ధూమ్రాక్షకపిలాక్షాదిరత్నోమంత్రులు తమతమ సేనాతంత్రబులతోడఁ గూడి యుద్ధానకచూడామణిం బురస్కరించుకొని తిరస్కృతదిగంతదంతిదంతనైశిత్యం బగు భుజబలంబున జిగిమీఱి యొక యోజనమాత్రం బరిగి రంత నమరాంతకుండు హేమనగరప్రాంతమునఁ బుష్పసరోవరతీరంబున నఖిలబలంబులును విడియ నేమించి యొక్క.సుర పున్నాగమూలంబున విశాలం బగురత్నకంబళంబునం దాసీనుండై యున్న సమయంబున. ౧౬౯

సీ. క్రయసమాగతజనప్రియవస్తువిస్తీర్ణవిశిఖాశతంబులు విశదపఱిచి
హేమకూటంబుతో నెక్కసక్కెం బాడుపటమండపంబు లాపటముచేసి
గజఘటకోటి నొక్కట నీరుద్రావించి కట్టుఁగంబంబుల నట్టుపఱిచి
పసిఁడిపక్కెరలతోఁ బల్యాణములు డించి శ్రమము మానిచితురంగములఁగట్టి
రథవినిక్షిప్తవివిధశస్త్రములు దెచ్చి, కదియ నొక్కొకతావునఁ బదిలపఱిచి
రఖిలసైనికు లధిపతి యానతంగ, సేన విడియించి రింగితజ్ఞాను లగుచు. ౧౭౦

[1] గజభజింప.

గీ. అసురసందను దోఃప్రతాపాగ్నిశిఖలు, వెట్ట కోర్వంగఁ జాలక [1]త్రొట్టగిలుచు
నపరవారిధిజలముగ్నుఁ డయ్యె ననఁగ, నస్తమించె దివాకరుం డంతలోన.

క. హరిణాక్షీనయనద్యుతి, హరిమణివళదుత్పలప్రియంభావుకభా
స్వరనైల్యగుణము లన్నియుఁ, బరువడి సురమార్గమహిమఁ బాటింపంగన్.

క. మాసినయద్దంబులక్రియ, గాసిల్లెన్ హరిదిభేంద్రకటభాగంబుల్
వాసి నవలి నలుపయు సం, త్రాసంబున బుద్ధి గలఁగి తహతహనొందెన్.

క. మొకమ నుడిచినఁ గానఁగ లే, కొకవస్తువు నిట్టి దనఁగ నోడిరి లోకుల్
శకలితహరిహయమణికో, నకముులలో నణఁగి రనఁగ రాత్రిటివేళన్.

సీ. హేమారవంబులు నెఱుఁగంగఁ దగుఁ గాని తురగరూపంబులు లోపవయ్యె
విపులఘీంకారము ధ్వనితోలంగుబె కాని తెలియంగరావయ్యెఁ గలభఘటలు
చక్రనేమిరాన[2]ప్రక్రమంబునె కాని తిలకింపరా దయ్యెఁ [3]దేరిపిండు
స్వరమున భటునిపే రరయుమాత్రమె కాని దర్శనస్పర్శనస్థైర్య ముడిగె
దృష్టిగోచర మెల్ల నదృష్ట మయ్యె, మిన్ను మన్నును గోవెలవన్నె యయ్యెఁ
గరపటమునింప నించినకజ్జలంబు, కరణిఁ జీఁకటి బ్రహ్మాండఘటము నిండె.

క. ఆపంబినతిమిరంబుప్ర, తాపంబున సకలభువనదర్శన మాఁగన్
దీపస్తంభము లెత్తిరి, యాపటమండపములందు నసురేంద్రభటుల్ ౧౭౬

సీ. కరచపేటంబుల గాఢాంధకారసింధురకుంభములు వ్రచ్చి విరియఁ జేసి
శారకామిషమునఁ దన్మౌక్తికంబులు పలుదిక్కులందునఁ బాఱఁజల్లి
కాఱు తద్దేహరక్తముచాయ నవసాంధ్యరాగవిలాసంబుఁ బ్రోగుచేసి
తద్వధదోషంబు తగిలెనో యన మేన మృగచిహ్నగరిమంబుఁ దగులుకొలిపి
నిగిడెఁ గస్తూరిపూరపన్నీరునీర, హారనీహారహారిచంద్రాతపములు
ననుమతిచక్రముఖలంబు వాపఁ దేర్పఁ, గైరవప్రియబింబప్రకాశమహిమ.

క. ఈకరణిఁ జంద్రికాపరి, పాకములోకముల కెల్లఁ బరమానందో
ద్రేకంబు సేయ దానవ, లోకాధీశ్వరుఁడు మిత్రులును దా నలరెన్. ౧౭౭

వ. ఆసమయంబున సూచీముఖశంఖుకర్ణవికటధూమ్రాక్షకపిలాక్షులు మొదలైన
కదలక యేప్రొద్దుం దన్నుం గొలిచి యున్న యన్నిర్జరారులం గనుంగొని
ప్రహ్లాదుం డిట్లనియె. ౧౭౮

ఉ. ముంపటికార్య మెద్ది మనము౦ జతురంగబలాన్వితంబుగా
నిందుల కేగుదెంచితి ముదీర్ణులు మీరలు కర్ణధారు లై

[1] త్రొట్రగిలుచు. [2] ప్రక్రమంబ్బయె. [3] తేరుమిండు.

సందడి గాకయుండ రిపుసైన్యపయోనిధిలంఘనక్రియా
మందతఁ జూపఁగానలయు మానుషభీషణభాషణోద్ధతిన్. ౧౮౦

గీ. ఎటకు నడువవలయు నిది మీరు తలపోసి, సర్వసమ్మతముగఁ జర్చ చేసి
నిర్ణయింపవలయు నీతిశాస్త్రవివేక, శౌర్యనిధులు సఫలకార్యవిదులు. ౧౮౧

వ. అని యిట్లు ప్రహ్లాదుండు పలికిన మహోల్లాసంబునుం బొంది బృందారకవిరోధులతని నభినందించి దేవా నరేశ్వరుం డగువాఁడు హస్త్యశ్వరథపదాతి ప్రముఖ సకలసేనాసమన్వితంబుగా స్వామ్యమాత్యసుహృత్కోశరాష్ట్రదుర్గబలంబు లను సప్తాంగంబులుం గలిగి సంధివిగ్రహయానాసనద్వైధీభావసమాశ్రయంబు లనం బరఁగు షట్ప్రయోగంబులఁ గుశలుం డై సామదానభేదదండంబు లను నుపాయంబులుం దత్ప్రయోగసమయంబు నెఱింగి చతుర్విధదుర్గావనభర్గుం డై నిజరాజ్యంబు నిష్కంటకంబుగం బాలించి మే లెంచు నది యాకర్ణింపు మనుటయు నాత్రిలోకవినుతుండు వారలవాక్యంబు లంగీకరించి సంగరోద్యోగవినిద్రహృదయుం డై వారలఁ బోవం బనిచి తాను యథోచితప్రకారంబున నారాత్రి గడపె నప్పుడు. ౧౮౨

మ. రజనీపన్నగదష్టమూర్ఛితజగద్రక్షార్థ మై పూని పం
కజమిత్త్రుం డను తుండికుండు దశదిగ్భాగాంతరానోకహ
ద్విజకోలాహలమంత్రము ల్నుడువుచు న్వేగంబ మంత్రింప ని
ల్చె జలేశాంతరపూర్వభూధరమహాశృంగాగ్రపీఠంబునన్. ౧౮౩

### ప్రహ్లాదుఁ డంగరాజుపై దాడి వెడలుట.

సీ. అట్లు సూర్యోదయం బైనఁ బ్రహ్లాదుండు జయభేరి వేయించి చండవృత్తి
తురగేభరథపదాతులతోడ దైతేయభటసమూహము మహోత్కటముగాఁగ
విజయుఁ డై సర్వదిగ్విజయంబు సేయంగఁ బూని మహేంద్రదిగ్భూమిపాల
పురములకై దాడివోవ నుద్యోగించి కదలి యాత్రేయనగంబునందు [లోన
విడిసి మఱునాఁడు శత్రుభూవిభులు నడఁక, సంగదేశాభిముఖుఁ డయ్యె సంత
సంగభూపతి గజతురంగాదిసైన్య, సంయుతంబుగ నేతెంచె శౌర్యగరిమ.

క. కరితురగరథభటాహ్వయ, పరివృతుఁ డై బాహుయుగము పక్షయుగముగా
శరచంచునిహతిఁ జించెన్, శరభముక్రియ నంగవిభుఁడు శత్రుబలంబున్.

క. అంతం బోవక మఱియును, బంతంబున దైత్యబలముఁ బవనాస్త్రహతిన్
గంతులు వేయించె మహీ, కాంతుఁడు విలయానిలంబు కనకాద్రిబలెన్.

గీ. అంగభూపతి యిట్లు నిజాంగబలము, చెంగఁ దోలిన దానవపుంగవుండు
రోషభీషణమూర్తి యై శోష మొందఁ, జేసె నాగ్నేయశరమున శత్రుబలము.

చ. అరిబలమర్దనుండు దనుజాధిపపుంగవుఁ డంగదేశభూ
వరబలము న్నిజాశుగదివాకరపంక్తుల నింతలింత లై
ధరఁ దొరుఁగంగఁ జేయుటయు దైత్యమహోద్ధతి కోర్వలేక య
న్నరపతి వాఱె నాతనిధనంబులు చిక్కె నిశాటభర్తకున్. ౧౧౮

క. [1]అంగాధీశవిమర్దన, శృంగారపువింతసొబగు చెలు వమరంగా
నంగాలంకృతిబలుఁ డై, చుం గదలెన్ దైత్యరాజసుతుఁ డుద్ధతుఁడై. ౧౧౯

వ. ఇ ట్లంగరాజభంగప్రదుం డగుదానవపుంగవుం డచ్చోటు గదలి వియచ్చర వాహినీసమీపంబునకుం జని బలాశ్వ ద్రోణాశ్వ ధూమధ్వజ చంద్రధ్వజ సుభద్ర భద్రప్రముఖు లైనసముద్రతీరనివాసు లగు సౌసాధనభూధవులం జయించి తదర్పితబహుపదార్థపరిబృంహితహృదయానురాగుం డై యానా గరకోత్తముండు వియత్తరంగిణీసముత్తరణంబు చేసి పారియాత్రగోత్రసవిధం బున వివిధబలంబులును విడియించి యడరునప్పుడు. ౧౨౦

ఉ. సైనికు లెల్ల నాసవరసంబులు గ్రోలి మదాంధచిత్తు లై
సానుమదగ్రభాగములఁ జందనశీతలచంద్రకాంతవే
దీనివహంబులందు వడఁ దేఱి పథశ్రమ ముజ్జగించి నా
నానుపమానసౌఖ్యవిభవాతిశయంబునఁ బొల్చి రచ్చటన్. ౧౨౧

గీ. భానుఁ డంత నస్తపర్వతంబున కేగెఁ, దమము ముదిరెఁ దారకములు మింటఁ
దెలివి మెఱసి నెఱసె జలజారి ప్రాక్శైలల, శృంగ మెక్కి కళలఁ జెంగలించె.

## ప్రహ్లాదునికడకు దేవరాతుఁడు వచ్చుట.

గీ. అట్టివేళయందు నచటికి భువనైక, పూతుఁ డాదృతార్థజాతుఁ డఘవి
ఘాతుఁ డైనదేవరాతుండు చనుదెంచె, శుక్రశిష్యుఁ డుక్తిశక్రగురుఁడు. ౧౨౩

వ. ఇ ట్లేగుదెంచి యానీవారముష్టింపచుండు త్రివిష్టపపరిపూర్ణప్రభాపటల జటి లుండై నిశాటపతిం గదియ నతం డతనిఁ బ్రత్యుత్థానప్రణామప్రార్థనా ప్రముఖసపర్యాచర్యలం బరితుష్టహృదయుం గావించి యుచితాసనంబున సమాసీనుం జేసి ఘటితకరకమలుం డై విమలవచోవిలసనంబు లొలయ ని ట్లనియె. ౧౨౪

[1] వంగాధీశ.

ఉ. భూరితపోవిశేషమున బుద్ధివివేకమునందు శంభుభ
ట్టారకుఁ బోలు మీరలు జనత్వపయోనిధ యైన నాపయిం
గూరిమిఁ గల్గి వచ్చితిరి క్రొంకక యానతి యిండు దేహముల్
దారములుల్ ధనంబులు మొద లన్ను వేఁడిన వేగనిచ్చెదన్. ౧౯౫

క. భావించి యేను జేయం, గావలసిన దెద్దియనుడుఁ గలకల నగి య
క్కావిదవరుఁ డిట్లనియె య, శోవిజితసుధామయూఖు సురరిపుసూనున్.

క. నీ వంతవాఁడ వగుదువు, దేవాంతకవరకుమార దీర్ఘాయువ వై
యీవిశ్వ మేలు వేఁడం, గావచ్చినవాఁడఁ గాను గాంభీర్యనిధీ. ౧౯౭

వ. అవక్రనీతిక్రమచక్రవర్తి యగు శుక్రాచార్యుండు నీకడకును బనిచినఁ బని
విన్నవాఁడ నతనివాక్యప్రకారంబు నక్కాణించెద వినుము. ౧౯౮

సీ. నీతండ్రిఁ దీండ్రగా మించంగ వలదె యామేటి కీటములైన మేదినీజ
నములఁ గారించెనే నముచిసూదనముఖ్యదిక్పాలకులము మద్దించెఁ గాక
చీమలపై దాఁటునే మహాసింహంబు కఱకుటేనుఁగులపై నుఱుకుఁ గాక
ధనము లర్పించి నిన్ గని మనికొలిచెద రన్న మర్త్యులమీఁద నాగ్రహింప
కాహవోత్సాహశక్తి నీ కగ్గలంబు, గలిగి యున్నదియేని నాకంబుమీఁద
నడువు సాళ్వంబుకొక్కెర నడఁచినట్లు, వాసవుని గెల్చి విక్రమోల్లాసి వగుము.

వ. దుర్వారం బగు దూర్వాసు శాపంబు కారణంబుగ నిర్వాణలక్ష్మి పూర్వ
గీర్వాణాయత్తంబు గాఁ గలిగి యున్నయది యిట్టియభిసంధి ననుసంధించి
యాసింధుశయనపూర్వజు గర్వంబు సర్వంబును విడిపించి త్రైలోక్యసామ్రాజ్య
సౌభాగ్యంబు ననుభవింపు మని దేవరాతుండు శుక్రవాక్యప్రకారంబుగా
నాన తిచ్చుటయు నట్లె యని యసురవల్లభుం డసురవల్లభుపైఁ జనుపనికి
నుల్లంబు పల్లవింప ధరాపల్లవికసమర్పితనానావిధపదార్థపరిపూర్ణభాండాగా
రుం డై నిజరాజధానికి విజయంబు చేసి. ౨౦౦

క. భూరిభుజాబలమున ర, క్షోరాజ్యం బేలుచుండె శూరశిఖామం
దారసుమకళిక దనుజకు, మారుఁడు మా టెందు లేనిమగఁటిమి నిగుడన్.

క. బాహుబలానంతహయా, రోహా - - - - - - -
మోహనసీమంతిన్యుప, గూహనలీలానితాంత కుశలజయంతా. ౨౦౧

ఉ. హావళిచిన్నయోభళధరాధిపశేఖరసైన్యపాల నా
నావిధ - - - - - - - - లాసతే

జోవనజాప్త ధర్మగుణశోభిత శిష్టజనానురాగ భా
షావంధీవిశేష మదశాత్రవమర్దన దానకర్దనా. ౨౦౩

ఉత్సాహ. - - - - - - - - - -

పత్త్రిరాజవాహనాంఘ్రి పద్మసద్మమానసా
పాత్రదాన నానధాన పద్మినీహితద్యుతీ
స్తృత్త్రదానవారిసూను విక్రమక్రియోన్నతా. ౨౦౪

గద్యము ఇది శ్రీహనుమత్కటాక్షలబ్ధ వరప్రసాదసహజసారస్వత చంద్రనామాంక భారద్వాజసగోత్రపవిత్ర రామవిద్వన్మణికుమా రాష్టఘంటావధానపరమేశ్వర హరిభట్టారకప్రణీతం బైన శ్రీనారసింహపురాణోక్తం బగు నుత్తరభాగంబునందుఁ బ్రహ్లాదగుణవర్ణనంబును నతనికి దైత్యులు దుర్నయం బుపదేశించుటయు - - - - - - వామనుండను దానవుండు సుమాలివంశకు శేశయుండగు హంసునిన్నృత్తాంతంబుఁ దెలుపుటయును బ్రహ్లాదుని దిగ్విజయంబును - - - - చ్చటికివచ్చి దేవరాతుండు ప్రహ్లాదునితో దూర్వాసుశాపవృత్తాంతంబుఁ జెప్పుటయు ననంబరఁగు తృతీయాశ్వాసము. ౨౦౫

---

# నారసింహపురాణము.

## ఉత్తరభాగము

### చతుర్థాశ్వాసము.

---

క. శ్రీమహితరామమాద్య, గ్రామణీరాంబురాశిరాకాచంద్రా
సామాద్యుపాయనయవి, ద్యామతినిస్తంద్ర రంగయప్రభుచంద్రా. ౧

వ. ఆకర్ణింపు మాశౌనకాదిమహర్షులకు రోమహర్షణుం డిట్లనియె దేవరాతిప్రణీతం బగునీతివాక్యజాతం బంగీకరించి పంచజనపతిసంహారణపరాఙ్ముఖుం డై శతమఖప్రముఖనిఖిలబర్హిర్ముఖవిదారణదారుణారణోత్కంఠుం డై దనుజకంఠీరవుండు సుఖం బుండునవసరంబున. ౨

#### వర్షాకాలవర్ణనము.

సీ. ప్రోగువైచినపద్మరాగఖండంబులగతి నింద్రగోపసంఘములు దనరె
గరుడపచ్చలడాలుఁ గన్నుఁగొట్టఁగఁజాలు లేఁతపచ్చిక పిసాళించి మించె
నీశానదిగ్వాయులేశంబు లోకకొన్ని భంజళిగతుల విభ్రమము చూపెఁ
బ్రథమోదబిందుసంపర్కంబు పుడమిమైపొక్కు లాఁపఁగఁ దైలపూరమయ్యె
గగనగోపాలకృష్ణశిఖాపరీత, పింఛవలయంబు వోలె దీపించె నింద్ర
చాపవల్లిమతల్లి వర్షాళిలోక, లాపములు రాలె మొగులు మొల్లములనుండి.

స్వాగతవృత్తము. వారిదఘోషము వారిరుహాక్షీ, వారముసల్క నివారణ సేయఁగ్
నారవసోదయసంభ్రమలీలా, స్మేరముఖు ల్విలసిల్లి రథీశుల్. ౩

సీ. ధళుధళుక్కున నింగిఁ దాటించెఁ బలుమాఱు లలితవిద్యున్నటీలాస్యకేళి
ఘుమఘుమ నుఱిమె దిక్కులు పిక్కటిల్లంగ భూధరస్థలుల నంభోధరములు
జలజలఁ దలలెత్తి చా తేరుపడియె విదూరభూస్థలుల వైడూర్యశిలలు
నకనక లిచ్చుమానసఖేదదశ డించి పురివిచ్చి యాడె నయ్యురగభోజి
పాంథమోహనమంత్రదీపములువోలెఁ, గడిమిపూఁజేగు లురవయ్యె గహనవీథి
గాఢవర్షాగమారంభగర్వరేఖ, యవనితాపనివారణం బాచరింప. ౪

మ. గుడిచుట్టుం బలుమాఱుఁ జందురుఁడు దిక్కుల్గ్రాంచమై తోఁచెఁ గ
వ్వడినామంబులు వల్కి రెల్లనుజనుల్ వజ్రధ్వని న్వచ్చి పె
క్కిడుముల్ గాంచిరి పాంథు లంధనిభ మయ్యెం జంతుసంచార మే
పడరెఁ జాతికిఁ బ్రీతి వాన జడిపింపం బోధముల్ చూపఁగన్. ౫

7. భగవద్గీతావచనము - గ్రం - సం - 37.

ఈవచన మెవ్వరు రచియించినదో తెలియరాదు. ఈసంపుటములో నిదియు, నవధూతస్వాముల గురుశిష్యసంవాదము, మహావాక్యము, నాత్మైకబోధమును గలవు. సంస్కృతమునకు సరియైన తెనుఁగువలెఁ గన్పట్టుచున్నది.

ప్రారంభము.

క. శ్రీరమణీహృత్కయప్రియ, నారసపత్త్రాయతాక్ష సకలాధ్యక్షా
హారికగుణావిలాస, శ్రీరాజితసుగుణజాల శ్రీగోపాలా

వ. అవధరింపుము భవదీయచరిత్రాశ్రయం బైనశ్రీమహాభారతంబున భీష్మపర్వంబునందుఁ గౌరవశ్రేష్ఠుఁ డైనధృతరాష్ట్రుండు వ్యాసవరప్రసాదలబ్ధదివ్యజ్ఞానసంపన్నుం డగుసంజయునివలన భూగోళవిస్తారంబును జంబూఖండవినిర్మాణంబును చప్పన్నదేశప్రవర్తనంబులును విని కౌరవులును బాండవులును గురుక్షేత్రంబునందు యుద్ధసన్నద్ధు లైనమనవారును బాండవులు నేమి గావించిరని యడిగిన ధృతరాష్ట్రునిం జూచి సంజయుం డి ట్లనియె. వ్యూహాకారంబుగా నిలిచియున్న పాండవబలంబు నీక్షించి దుర్యోధనుండు ద్రోణాచార్యసమీపంబునకుం జని యతనితో ని ట్లనియె. నీశిష్యుం డైనదృష్టద్యుమ్నునిచే వ్యూహాకారంబుగా నిర్మితం బై సన్నద్ధం బైనపాండవబలంబుం గనుంగొనుము. ఆసేనయందు భీమార్జునులకు సమానులు శూరు లగు మేటివిలుకాం డ్రెవ్వ రెవ్వ రంటేని యుధామన్యుండును, ఉత్తమౌజుండును—

- - - - - - - -

ప్రకృతిపురుషయోగములో:—

భారతా క్షేత్రంబులయందలి క్షేత్రజ్ఞుం డగువాని నన్నుఁగాఁ దెలియుము. ఈక్షేత్రజ్ఞస్వరూపం బెఱింగెడిజ్ఞానంబు తనకు సమ్మతంబ క్షేత్రం బనునట్టిది, ఏవికారంబు గలది, యెందువలన జనించినది, యెటువంటిభేదంబు గలది. క్షేత్రజ్ఞుం డన నెవ్వఁడు, ఎటువంటి ప్రభావంబు గలవాఁడు. ఆయర్థంబు సంక్షేపంబుగా వివరించెద."

ఇట్లు సర్వత్ర మృదుమధురముగా వ్రాయఁబడినది.

ధాతృనామసంవత్సర మాఘశు ౧౨ సోమవారమువరకు రాజశ్రీ దేవకొండరామప్పనాయనివారి కొమారుడు బొజ్జానాయనివారికి శ్రీశైలపతికొమారుడు వాసుదేవుడు వ్రాసిన భగవద్గీతావచనము ౧౮ అధ్యాయాలు సంపూర్ణము

శ్రీఘ్రమేవవివాహప్రతిష్ఠాసిద్ధిరస్తు అనేకరాజ్యాభివృద్ధిరస్తు దేవతాబ్రాహ్మణే ష్వచంచలా భక్తిరస్తు. అనవరతబాహురాశీర్వాదసిద్ధిరస్తు. - - - అని యున్నది.

8. చిల్లరపద్యములు - గ్రం - సం - ౬9.

ఇది యొక 16 పత్రముల చిన్నపుస్తకము. ఇందు దక్షిణదేశములో నున్న ప్రసిద్ధులపై పద్యములు వ్రాయఁబడినవి. పుదుక్కోట నుదుగపాటి రామస్వామయ్యగా రిచ్చినది. ఇందుఁ గొన్ని మనుచరిత్రము వసుచరిత్రము విజయవిలాసము మొదలగు గ్రంథములలోని పద్యములును గలవు. గువ్వలచెన్నశతకము, కవిచౌడప్పశతకములలోనివియు నున్నవి. కొన్నిపద్యము లిం దిచ్చుచున్నారము

సీ. వలికెనా కపురంపుఁబలుకులై దవనంపు మొలకలై ఘుమఘుమల్ దొలఁకఁ బలుకు
నవ్వెనా విరవాజిదువ్వలై తెలిగంటిబువ్వలై ధళధళల్ పొసఁగ నవ్వుఁ
జూచెనా యమృతాంశు రోచులై కరుణాబ్ధివీచులై నిగనిగల్ వెలయఁ జూచు
నిచ్చెనా వేయింటి కెచ్చులై ముత్యాలపుచ్చులై మదిఁ గవుల్ మెచ్చ నిచ్చు
బుధులమన్నించు మాశేముషీనిధులఁ బెంచు, స్వజనులను బ్రోచు, మును వైరిజనుల నేఁ
బ్రియుఁడశుభవనమధ్యమాభిఖ్య భువన, పాలనపరుండు రాజగోపాలవిభుఁడు [చుఁ

క. వకుళవననిత్యవాసిని, సకలాభీష్టముల నిచ్చు చక్కనితల్లీ
ప్రకటితము సేయు నీకృప, నృకలుషగిరిభేదశంబ శ్రీబృహదంబా.

మ. గణుతింప న్వశమా భవద్విజయజాగ్రద్వీరవిద్యావిజృం
భణపాండిత్యము నీకుఁ జెల్లు భళిరా భద్రేభసుంటాఘణం
ఘణనిక్వాణనిరాఘ్యనిర్భరమహాగంభీరభేరీధణం
ధణధాణంధణధాణిరాయరఘునాథా యోధయూధాగ్రణీ.

క. అందఱు నీసరిదొరలా, మందరధరకుహరవిహరమాణమృగేంద్రా
స్పందితనిజజయపటహా, మందరవా రాయభూప మధురాలాపా.

క. కోటిగదా వితరణ శత, కోటిగదా నుతి సహస్రకోటీరలుఠ
త్కోటి గదా పాదతులా, కోటి బలీ కోటిరాజగోపాలపతీ.

క. అహాహా నీపలుకా శ్రీ, మహిళాకుచగంధగంధవహమోముహ్యా
త్కహానాన్వపరిదృఢీయః, కహాకహారవ మొప్పఁ బచ్చకస్తురికుప్పా.

క. వచియించెద నొకపరి నిను, రుచిరగుణప్రథితకీర్తిరుక్ఛ్వేతసుధా
రుచిబలహారి విచికిలహారి, ఖచరలహరికాతరంగ కస్తురిరంగా.

క. ఎంతు న్నిను వరమురళీ, కాంతారవపూరితఘోష కాంతాలసదే
కాంతాలసకాంతాలస, కాంతాలసదంతరంగ కస్తూరిరంగా.

క. శంకా నాకింక భవ, త్కింకరుఁడను శమనదమన కేళీహాళీ
ఝాంకరణ గుహాసరోమరు, దంకూరక్రమణ వేంకటాచలరమణా.

క. కొద్దిగఁ జలించె నామది, సద్దావా తెలుపఁ జెలువ నేజాసుంధా
ముద్దియవా యొకతీయుని, ముద్దియవా చెలి కోసంగ ముద్దులమంగా.

క. చెందొవలవిందు నీముఖ, మందమునకు నంది కైశ్యము నళినింది పరా
కెందున నీయుగమున నిరి, పొందినదే పొందు విను కరూరానందీ.

క. శ్రీమంతుఁడ వై పరవుశ, సామంతుఁడ వై మనీషిసన్నుతవిలస
ద్ధీమంతుఁడ వై వర్ధిల్లు, రైమంతా ముద్దుపడుగ రాజనతంనా.

శా. తంజాధీశుఁడు పంపఁగా దశము లుత్సాహంబుతో వచ్చి నీ
గంజాతిండిమురాటిఘోఁజులవయిం గత్తెత్తఁగా నేలరా
కెంజం జొత్తుగు నీదుచేతికొరడా కీయాతఘా కేసుమీ
కంజాక్షీసుమచాప ముద్దువిజయస్తోపా నృపాలద్విపా.

మ. చిలుతా తాళునా గొగ్గి యానుకొనునో చేదస్తువా నిల్చునో
తళుకుం గేడెపుఁబిళ్ల నష్టముగనో(డ్డ) త్తన్వచ్చునో యొడ్డినన్
ఘుళుఘుల్ ఘల్లుఘణిల్ ఘళిక్కురని వ్రక్కల్ సేయునీఖడ్గకో
శల మొక్కొక్కఁడఁ బోవ ముద్దుపడుగస్తోపా నృపాలద్విపా.

క. కుంకుమ లేదో మృగమద, పంకము లేదో పటీరపాంసువు లేదో
సంకుమదము లేదో యశు, భంకర ముగుభస్తమేల బాలానీకున్.

క. దాశకుఁ బద్యము లిచ్చిన, నాశేఁడు ధన మొసఁగఁ గవుల కపుడే సెలవోఁ
గూఁతురి నమ్మిన రీతిని, రీతిని చంద్రగిరిరామకృష్ణనృపాలా.

క. కలిమిగలనాఁడె మనుజుఁడు, విలసితసత్కీర్తిచేత వెలయఁగవలదా
కలి మేమి పొల్లకాలము, కులగిరులా కదలకున్న గున్నాలచెన్నా.

క. రండలకొడుకులు యాచక, తండంబుల కేమి త్రవ్వి తలకెత్తేరా
రెండాకు లొక్కపోఁకయుఁ, గొండనుమీ దానశర్వ కోమటిగుర్వా.

క. కోమటి వేమనత్యాగము, భూమి ప్రసిద్ధంబు కల్పభూజము చెంతం
బాముున్నయట్లు తురకా, రాముం డున్నాఁడు చేగరా దెవ్వరికిన్.

క. ఈరేడు జగము లనియెడి, యూరయఁ బదునాల్గుగ్రుడ్లు ననిశము తెక్కల్
ధీరతఁ బొదుగుచు నున్నది, కోరికి నీకీర్తిహంస కోమటివేమా.

ఈరీతిగా 1 జానకులపాటికుల కొండ్రాజా 2 లక్షణరంగా 3 బంగరు యాచా 4 కచ్చిరంగభాగ్యతరంగా 5 చిన్నరంగ బుద్ధిభుజంగా 6 రాయని బాచా 7 శాఖమూరి మల్లయజన్నా 8 యాతముగంగా 9 పులుగంటన్నా 10 అళియతిరుమలరాజా 11 పిచ్చయరంగా 12 బొమ్మయలింగా 13 కుమార భట్టరార్య 14 భట్టసుతిక్కా 15 గంగయ్యసింగ 16 సంకడిమల్లా 17 దాసర చెన్నా 19 కవివెంకన్నా 18 రాయబిరుదాంకరఘునాథరాణ్మృగాంక యనుసంబోధనలతోఁ బెక్కుపద్యములుగలవు. మఱియుఁ దంజాపూరిమీఁద:—

క. పురమ్మునుండేకవులే, చొరఁబడి తినఁ గూడులేక చుంబించంగాఁ
బరకవు లేటికి వచ్చిరి, తరమెఱుఁగక అరికి విరికిఁ దంజాపురికిన్.

క. లేదా తంజావూరిదొ, రాదొరలున్నారు లంజలకు మాపోడిం
జేఁ దేవా రెవ్వరు నీ, యాదరణ వినాగ నరసయప్రభునాఁగా.

అను నీరెండుపద్యము లేసందర్భములోనివో కలవు.

9. ఆంధ్రమహాభారతము. ఆరణ్యపర్వము. గ్రం । సం ॥ 1077

ఈసంపుటములో నారణ్యపర్వమును స్త్రీపర్వమును గలసియున్నవి. 308 పత్రములు గలవు:—ప్రారంభమున.

ఉ. ఆసరసీజయోనిరసనాగ్రములందుఁ బ్రభూత మైనవే
దానవపానమత్తు నపరాం (బుజ) లోచను భారతార్థవి
ద్యానువిలాసుఁ బ్రావృడసితాంబుదకాంతితనూవిభాసు న
వ్యాసమునీంద్రవర్యుని పదాంబురుహంబుల కేను మ్రొక్కెదన్.

అనుపద్యము తరువాత శ్రీకీర్తిశ్రీవల్లభ-యనుకందపద్యము వ్రాయఁబడినది. ప్రథమాశ్వాసాంతమున శ్రీకుడుపూరుహరిహరాయనమః.

శ్లో. వైదేహీకుచమండలాగ్రవిలసన్మాణిక్యహస్తాంబుజం
కాంచీకంకణహారనూపురలసత్కేయూరహారాన్వితమ్
దివ్యశ్రీమణికుండలోజ్జ్వలమహాభూషాసహస్రాన్వితం
వీరశ్రీరఘుపుంగవం శరకరం సీతాసమేతం భజే.

శ్రీవేంకటరమణాసహాయం శ్రీరామాయనమః శ్రీరాములుమాదైవము-అనుపద్యమునుగలవు. ద్వితీయాశ్వాసాంతమున శ్రీకుడుపూరినీలకంఠేశ్వరాయ నమః, శ్లో. సాకేతేశరదిందుకుందధవళే-అనునదియు, తృతీయాశ్వాసాంతమున శ్రీకుడుపూరినీలకంఠేశ్వరాయనమః.

శ్లో. కర్పూరాంగవిలేపనం రఘుపతిం రాజీవనేత్రాయుతం
కస్తూరీతిలకాకృతిం విమలసత్యాంతాత్మమేకంప్రభుం
కందర్పాయుతకోటికాంతిసదృశం కారుణ్యపాథోనిధిం
కాంతంకా—ఇంతే—యున్నది.

చతుర్థాశ్వాసమునడుమ — అంబరపూరితంబులై — యనుదానితర్వాత ,, యిక్కడనుంచ్చియఱ్ఱాప్రగడగారికవిత్వమారణ్య పర్వశేషము అని- ౧౨౭-వ పత్రము రెండవప్రక్కను "స్ఫురదరుణాంశురాగ" ప్రారంభించెను ఆశ్వాసాంతమున శ్రీకుడుపూరు నీలకంఠేశ్వరాయనమః అని. పంచమాశ్వాసములో గద్యమున్న ౧౮3 పత్రము లేదు. సప్తమాశ్వాసము చివర—

సీ. భవ్యచరిత్రుఁ డాపస్తంబసూత్రుండు శ్రీవత్సగోత్రుండు శివపదాబ్జ
సంతతధ్యానసంసక్తచిత్తుఁడు సూరనార్యునకును బోతమాంబికకును
నందనుం డిలబ్రాంకనాంటిలో నీలకంఠేశ్వరస్థానమై యొసకమెసంగ
గ్రుడ్లూరి నెలవున గుణగరిష్ఠతనొప్పు ధన్యుండు ధరైకతత్పరాత్ముం
డెఱ్ఱనార్యుండు సకలలోకైకవిదితుం డైన నన్నయభట్టమహాకవీంద్రు
సరససారస్వతాంశప్రశస్తి తన్నుఁ, జెందుటయు సాధుజనహర్షసిద్ధిగోరి.

క. ధీరవిచారుడు తక్కవి, తారీతియ గొంతదోంప దద్రచనయకా
నారణ్యపర్వశేషము, పూరించ్చె గవీంద్రకనఁవుట పేయముగఁ.

క. వీరావతారవిమలా, చార అని కలదు—గద్యాంతమున శ్రీకుడుపూరునీలకంఠేశ్వరాయనమః శ్రీసీతారామార్పణమస్తు. శ్రీకుడుపూరుమదనగోపాలాయనమః. సౌమ్యనామసం॥ శ్రావణబ ౧౦ సో॥ వర్కు బాలాంత్రపు కృష్ణంరాజుగారిప్రతినున్న క్రమానున అరణ్యపర్వం సంపూర్ణంగా మల్కపల్లి బోగిరాజు ఖానాకువ్రాశెను. వ్రాలాశభ్రలు ఇత్యాది ౨౬౮ పత్రము. ౨౬౯ నుండి స్త్రీపర్వముగలదు. గ్రుడ్లూరునీలకంఠేశ్వరస్వామికి గుడుపూరునీలకంఠేశ్వరస్వామికి నేమైనఁ జుట్టఱిక మున్నదా. మల్కపల్లి జోగిరాజుగారిచ్చినది.

10. ఆంధ్రమహాభారతము - ఆరణ్యపర్వము - గ్రం-సం. 1123.

ఇందును అరణ్యపర్వముతో సౌప్తికపర్వమును గలదు. ఆరణ్యపర్వము 235 పత్రము. ఇందుఁ బ్రత్యాశ్వాసమునందును వరుససంఖ్యతో నాశ్వాసమునందలి పత్రసంఖ్య వేఱుగా వేయఁబడినది. ఇందు మొదట క. శ్రీకీర్తి స్త్రీవల్లభ

అని తర్వాత అక్కథికుండు శౌనకాదిమునీంద్రులకు—అను చో కథకుండు అని మొదట వ్రాసి దీక్రింద దిద్దినాఁడు సర్వత్రకథికుఁ డనియే కలదు. వ్రాఁతలో నున్నలపిమ్మట ద్విత్వములు లేవు ఱఅనున్నలు శకటరేఫలును లేవు. పద్యాంగ ములన్, పూర్తిగా వ్రాసినాఁడు. కొన్నిటికి, ఇట్లనియే, ముహూర్తమాత్రంబునా యనిదీర్ఘము లున్నవి. ౧౦౬-వ పత్రములో అనఁగా నాల్గవయాశ్వాసము ౧౧ పత్రములో—శారదరాత్రు లను పద్యము తర్వాత "నన్నయభట్టుకవిత్వము యిక్కడికి సంపూర్ణము యింతటనుంచి అరణ్యపర్వశేషము యర్రాప్రగడ విరచితము—

చ. స్ఫురదరుణాంశురాగరుచి బొంపిరివోయి నిరస్తనీరదా
వరణముల౯ దళత్కుముదవైభవజృంభణ ముల్లసిల్లను
ద్ధురతర హంససారసమధువ్రతసిస్వనముల్ చెలంగఁగా
గరము వెలింగె వాసరముఖంబులు శారదవేళ జూడఁగా౯," అని.

అన్నితావులను, అక్షరమున ౖత్వము వచ్చునపుడు "నీరదావరణముల౯ వైభవజృంభణము ఇట్లె యున్నది గాని యెత్వమిచ్చి యైత్వమిచ్చినతా వెక్కడను లేదు. భవ్యచరిత్రుఁ డనుపద్యములో పోతనార్యునకును సూరమాంబికకును" అనియును, ధీరవిచారుఁడు అనుదానిలో "తత్కవితారీతియె, తత్ప్రచనయె కానియు భేదములున్నవి. ఎవ్వరువ్రాసినది తెలియదు. ఏలూరిలో మల్లంపల్లి కోటీశ్వరశర్మగా రిచ్చినగ్రంథమిది.

### 11. ఆంధ్రమహాభారతము. ఆరణ్యపర్వము గ్రం. సం. 1107.

ఇది యొక్కటే—యిందు రెండవపర్వ మేదియుఁ జేరలేదు. 228 పత్రములు. ఇది పిశిపాటితిమ్మయ్యశాస్త్రులఁగారికొమాళుడు వెంకటదాసు భారతము అరణ్యపర్వము సంపూర్ణముగా వ్రాసుకొనెను (సౌమ్యనామసంవత్సర భాద్రపదశుద్ధ సప్తమీశుక్రవారంవరకు)—ఏలూరునోరిసీతారామశాస్త్రిగా రిచ్చినది. దీనియందును ఐత్వము పైదానిలోవలెనే కలవు సమస్తవిధములఁ బై ప్రతిని బోలియున్నది. నాల్గవయాశ్వాసములో ౧౦౫-వ పత్రము (అనఁగా చతుర్థాశ్వాసము ౧౦-వ పత్రము) లో యథాప్రకారము నన్నయభట్టుకవిత్వము యిక్కడికి సరీ సంపూర్ణము యింతటనుంచి అరణ్యపర్వశేషము యెర్రాప్రగడ విరచితము అనియును చిట్టచివర భవ్యచరిత్రుఁడు, ధీరవిచారుఁడు ననునవియుఁ గలవు. పోతనార్యునకు సూరమాంబిక కనియేకలదు.

12. ఆంధ్రమహాభారతము. ఆరణ్యపర్వము. గ్రం. సం. 108.

ఇం దొక్కయారణ్యపర్వముమాత్రమే కలదు. శ్రీకీర్తిప్రియవల్లభ యనిప్రారంభము. వ్రాఁతతప్పు లనేకవిధములఁ గలవు. అయ్యేకకు, అయ్యెడ; వలసెను వలశె ననియు ఏచుశేయుదు, దరిశి తల్లిదండ్రులు ఇంద్రుండు మొ॥ అరసున్నలకు బదులెల్లచోటుల నిండుసున్నలు నిండుసున్నలతర్వాతియక్షరము ద్విత్వము—శకటరేఫములు పాటింపలేదు అయ్యెడమని కలదు. ౧౧౩ పత్రములో, యింత్తటనుంచ్చి యఱ్ఱాప్రగడగారు చెప్పిన ఆరణ్యపర్వశేషము అనికలదు. సూర్యనార్యునకును పోతమాంబ్బికకును, బ్రాంకనాటిలో - గుంట్టూరినెలవున గుణగరిష్ఠు-సరసనారస్వతాంత్త ప్రసక్తి-శద్రీతియ తద్రచనయయనికలదు. ౩౬౯ పత్రములు సంపూర్ణము. ఎవ్వరిచ్చినదో యెక్కడనుండి వచ్చినదో తెలియరాదు. ప్రమాదినామసంవత్సర ఫాల్గుణశు ౭ ఆ॥ సర్కి వాడ్రేవు కామయ్యగారు వ్రాశిన ప్రతినుంన్న క్ర,మానను శ్రీమహాభారతములో ఆరణ్యపర్వము నడ్డాదివెంక్కయ్యకొమాళ్లు నరిశింహ్వులు వ్రాయించుకొనెను. మంగ్గళము.

13. ఆంధ్రమహాభారతము. ఆరణ్యపర్వము. గ్రం. సం. 103.

ఇందు శ్రీకీర్తిశ్రీవల్లభ యనిప్రారంభము: ఆరణ్యపర్వ మొక్కటియే 257 పత్రములలోఁ గలదు. ఇందును వ్రాఁతతప్పులు కావలసినన్ని. వ్రాయసకాంద్రయాచారప్రకారము కంటె నెక్కుడు గలవు. అన్నింటితోపాటు శమిఇంచు మొ॥ రూపము లింకెక్కుడు. ఎఱ్ఱాప్రెగడగారి భాగము నాలవయాశ్వాసములోఁ గలదు. ఇంత యఱ్ఱాప్రగడగారు చెప్పిన ఆరణ్యపర్వశేషము అని ౧౧౧ పత్రము రెండవవైపునఁ గలదు. తర్వాత స్ఫురదరుణాంశురాగమునబొంపిరిపోయి యని మొదలు - చివరసీసములో సూరనార్యునకుఁ బోతమాంబికకు -గుంటూరు నెలవునగుణగరిష్ఠత, యనియున్నది. అక్షయనామసంవత్సర ఆశ్వీజబ ౨. గురువారంనర్కు జొంన్నలగడ్డవ్యాసులుగారి పెద్దకొమారుఁడు కామయ్య స్వంతముకు శ్రీపార్వతీపరమేశ్వరార్పణముగా వ్రాసుకొనెను. వ్రాలాశబ్రలు తప్పులు తాసెలాగలవేను శబ్దసంఖ్య లెరుగనుం - అనుపద్యమున్నది.

14. ఆంధ్రమహాభారతము—ఆరణ్యపర్వము. గ్రం. సం. 944.

ఇదియు నొక్కపర్వమే విడిగా నున్నది. శ్రీకీర్తిశ్రీవల్లభ, అక్కధికుండు, ఊరుభంగం బయ్యెడమని, నన్నభట్టుగారు చెప్పినకవిత్వము సమాప్తము, అరణ్యపర్వశేషము యఱ్ఱాప్రెగడంగారివిరచితము, స్ఫురదరుణాంశురాగరుచి బొం

పిరిపోయి యనియుంగలదు. సప్తమాశ్వాసముచివరఁ గొంతలేదు కాఁబట్టి భవ్య చరిత్రుఁ డాదిపద్యములుగలభాగము కనఁబడలేదు. మొత్తము 255 పత్త్రము లున్నవి. నడుమనడుమఁ గొన్నిపత్త్రములలోఁ గొంతభాగము వ్రాయఁబడలేదు. మాతృకలో లేదు కావలయును. నర్సాపురం గంగ విశ్వనాథశాస్త్రిగారిచ్చి నది. అక్కడక్కడ శ్రీగిరీశ్వరా! ఉమామహేశ్వరా! ఆపన్నార్తిహరేశాయ శంకరాయ నమోనమః. అనుమాటలుండుటంబట్టి యెవ్వరో శైవుఁడు వ్రాసి యుందురు.

15. ఆంధ్రమహాభారతము—ఆరణ్యపర్వము. గ్రం. సం. 363.

ఇదియొక్కపర్వమే యీగ్రంథములోను గలదు. ఇది దక్షిణదేశప్రతి. నత్తం వేంకటేశయ్యగారిచ్చినది. దక్షిణదేశమునఁ బ్రచారము చేసిన వారి నేతు రామయ్యగారు సంపాదించినది. 231 పత్త్రములు గలది. ఊరుయుగళంబు భగ్నంబయ్యెడమని కలదు. అక్కథికుండు, సర్వత్రపూర్ణబిందువులు తర్వాత ద్విత్వ ములు వ్రాఁతతప్పులుం గలవు. అక్షరలోపములు పెక్కుతావులఁ గలవు. చతుర్థాశ్వాసములో యింత్తనుండి యెఱ్ఱాప్రగడవారికృతము అనితర్వాత "స్ఫుర దరుణాంశురాగరుచిఁ బొంపిరివోయి "యని ప్రారంభించెను. సప్తమాశ్వాసము కడపట భవ్యచరిత్రుఁ డాపస్తంబసూత్రుం డనుదానిలో బోతమాంబిక, పోకనాటి లో, గండ్లూరు నెలవున గుణగరిష్టత, పూరించె కవీంద్రకర్ణపుట మోదముగానూ అని పాఠభేదములు కలవు. ఈరీతినే వ్రాఁతతప్పులు పెక్కులు. శుభకృతునామ సంవత్సరం పుష్యశుద్ధ ౧౪ యిందువాసరమున్ను పుష్యమీనక్షత్రమున్ను కూ డినశుభదినమందలి గోకవరం వెంకట్రామయ్య ఆరణ్యపర్వం సమాప్తః అని యున్నది. కొంతకాలమున కీవల నొక్కరు సమాప్తః అనుదానిక్రింద "వ్రాసి నది" అని చేర్చినారు. వ్రాలాశభ్రలు పద్యముగలదు.

16. ఆంధ్రమహాభారతము—ఆరణ్యపర్వము. గ్రం. సం. 1131.

ఇదియొక్కటే పర్వము. 226 పత్త్రములు. ఏలూరు కుప్పా నాగేశ్వర సిద్ధాంతిగారిచ్చినది. ఇందును శ్రీకీర్తిస్త్రీవల్లభ, అక్కథికుఁడు, ఊరుయుగంబు భగ్నంబయ్యెడమని శాపంబిచ్చిన, ఇట్టివిగలవు. కొంతయొక్కరుఁ గొంతయొక్క రును వ్రాసినట్లు భేదము గలదు. ఒక్కరు వ్రాసినదానిలో "భార్గవుండట్టనచ్యవ నుండు, కృతస్నానులైనవారు నిట్లు గలదు. రెండవవారివ్రాఁతలోఁ నిరస్తనీర దావరణములై దళత్కమలవైభవజృంభణముల్లసిల్ల, అనియిట్టివ్యాసములు గలవు ఈ రెండవవారివ్రాఁతలోఁ దప్పులుతక్కువ.

శా. దానాంభఃపటలంబునం బృథుపయోధారావలిం జాల్చి గ
ర్జానిర్ఘోషము బృంహితోచ్ఛలన నాచ్ఛాదించి ప్రావృట్పయో
దానీకంబు శరద్భయంబున నిగూఢాకారతన్ డిగ్గనా
గానొప్పారె మదోత్కటద్విరదసంఘంబుల్ వనాంతంబునన్.

ఇట్లున్నది. నన్నయభట్టుకవిత్వము యిక్కడికి పరిసంపూర్ణము యింతట నుంచి అరణ్యపర్వశేషము యెఱ్ఱాప్రగడవిరచితము, అనికలదు. పోతనార్యునకును సూరమాంబికకును అని యున్నది వ్రాసినవారి పేరులు తెలుపుటలేదు. మూఁడువ్రాఁతగాఁడును వ్రాయపడినట్లు కొన్ని పత్రములలోఁ గనవచ్చును. అక్షరములు చక్కనివే గాని యొకఁడును దప్పులు వ్రాయువాఁడే. ౧౧ గుచ్ఛబృద్ధ మిదియు గర్కోటకుని దమయంతి పుణ్యమూర్తి యునలునుఁ, ఋషిచరిత్రుఁడైన ఋతుపర్ణు గీర్తింప, గభయంబులెల్ల గ్రాగుచుండు" అని యిట్లుండును. శీఘ్రముగా ముగించుకొనుటకు ముగ్గురుంగలసి కొంతకొంత భాగము పుచ్చుకొని వ్రాసికొనిరి.

## 17. కువలయాశ్వచరిత్రము. గ్రం సం. 72.

సవరము చిననారాయణనాయకప్రణీతము.

గద్యము—ఇది శ్రీమదనగోపాలకృపాకటాక్షవీక్షణసమాసాదిత సరస కవితావైభవ సవరముస్వయాభరణ తిమ్మభూపాలతనూభవ శఠగోపతాపసేంద్ర చరణారవిందసంచరన్మానసమిళింద సంతతభారతభాగవతాదిశ్రవణానంద కామినీ మనోహర రూపరేఖావిజితచైత్ర కాశ్యపసగోత్రపవిత్ర జాతివార్తాకవిజనా మోద సంధాయక చిననారాయణనాయకప్రణీతం బైనకువలయాశ్వచరిత్రం బనుమహాప్రబంధంబునందు—

ప్రారంభపద్యములు:—

శా. శ్రీరాధాలలనాధరాధరసుధాబృందాతిమాధుర్యగా
ధారీతుల్ ప్రకటించి లీల మురళీధారేయుఁడై గీతసం
చారంబు ల్వెలయించు కృష్ణుఁడు దయాసర్వస్వతాగారనం
బూరన్ సౌరమునారణాధిపుఁ జిరాయుశ్శ్రీయుతుం జేయుతన్.

సీ. తనమందహాసనూతనకాంతి కాంతుకీర్తికలాపములును సంధించుకొనఁగఁ
దనయాస్యఘుర్ఘంబు ధవరాగరసఝరీపటలితోఁ డుత మాటపలుకులాడఁ
దనతనూదీప్తిసంతతులు నాయకమహస్తోమంబునకును విందులు ఘటింపఁ
దనయురోజాలసత్వంబు మనోనాథకఠినధైర్యముతోడఁ గలసిమెలఁగ

రాజులఁ దిరస్కరించుచు రమణుఁడున్న, యుదయ మెక్కి నరసింగ్నిసింహాసిజా-యు
తాష్టి సవరచు నారాయణాధిపేంద్రు, శుభదమూపూర్ణవీక్ష చేఁ జూచుఁగాత

ఈనారాయణాధిపుఁడు కవికిఁ బాలకపితయుఁ దనజనకపితకు సవతితమ్ముఁడునై యున్నాఁడు.

మ. అలతిమ్మాధిపునారసేంద్రుఁడు దయోదారుండు సన్నుం జయో
జ్జ్వలుఁ గృష్ణాధిపుపుత్రు వేంకటపతిత్మ్ర్కాంతిచంద్రుం గుమా
రులఁగాఁ గైకొని ప్రోచెఁ గాన నతఁడే రూపింపఁగా దల్లిదం
డ్రులు దైవంబును నయ్యె నిందులకు నెందుఁ సందియం బేటికిన్. అని.

పాలకజనకునకే యీనాయైదాశ్వాసముల ప్రబంధముం గృతి యిచ్చెను. ఈ నారాయణనృపాలుఁడు వీరవేంకటరాయలకగుణాఁ బరఁగువాఁడఁట. కర్ణాట రాజ్యములోని వాఁడగును. ఈతని నివాసస్థానము.

క. మణినాగనగరకాంతున, కణుసుధ్యాజనమనోజయుంతునకు సుధీ
గణగణితరామణీయక, మణిఘృణిఫణితాతిమంజిమనిశాంతునకున్.

అనుష్ఠ్యంతపద్యమునుబట్టి మణినాగనగరమని తెలియవచ్చినది. మణినాగనరము నిప్పు డేమందురో! ఈతని సమకాలనృపులు—

సీ. తనమాట చెంజికాతంజాపురీమధురాధినాథులకు నెయ్యంబు నెఱపఁ
దనచీటి గోలకొండనరేంద్రముఖధరాధనపద్మబంధు లొందల వహింపఁ
దనకీర్తి నుట్లనంతనృపాలముఖ్యగోత్రానురేంద్రులు గొనియాడికొనఁగఁ
దనదానగుణము గోదావరీతీరభూనిర్జరేశ్వరులు సర్ణించికొనఁగ
వెలయు వేతండగండనిర్గళదనర్గ, ళమదధారాధునీనాథకుముదబంధు
కార్యకృడ్డిండిమారావధుర్యసైన్యుఁ, డతఁడు ప్రభుమాత్రుఁడే నారనాధినేత.

అను పద్యమునలన నెఱుఁగఁబడుచున్నారు. ఈనారాయణనాయకకవి కవిత్వము ప్రౌఢమైనది. కల్పన లద్భుతములు. అం దందుఁ గొన్నిలక్షణవిరుద్ధ పదప్రయోగములును గలవు మచ్చునకుఁ గొన్నిపద్యములు.

సీ. తనయిల్లు విడిదిసేయ నటంచుఁ జలపట్టు కొఱకు చేతులు పట్టుకొనఁగవలసె
నలరంభ వారి కీయ నటంచు వాదించు కౌబేరి కుడుగర గప్పవలసె
నులుపక్కె యీగి మ్రాఁకుల చెంతకును దానె చనియిప్పుడా దుకొమ్మనఁగవలసెఁ
దెల్ల తేజీఁగన్నఁ దెన్నుందురో వార లని దాని వెన దాఁచికొనఁగవలసె
నౌర తిప్పనృపాలు బాహాసిధార, నవని విడనాడి ఱొమ్ముగాయముల వచ్చ
కడిఁదిపగరకు నుచితము లౌదుపునపుడు, చాలు పత్రికి ఫణురరాజత్వగరిమ.

సీ. విడు పైంట చెఱంగు నేవెఱతు గాయముసు మానవిమ్మని చాయ యెంతేని వేఁడ
నశ్వినుల్ సుందులకై ద్రోణగిరికి నిచ్చలు వోవు కతన వేసరుకొనంగ
నిరుపద్రవము గామి నిలువరాదని రమాపతి వేఱెపాళెంపుపట్టు వెదక
నాయయ్యకిది యుపాయ మంచు నలసింహికాతనూభవుఁడౌడుగ నచికొనఁగఁ
జెలఁగుతోఁగ కొమ్ము మూఁకింత సేసికొనఁగఁ, దిమ్మనృపశౌరిదినదినోద్భిన్న వైరి
వారబహువారభేదనవర్ధమాన, మైన రవిమేని పెనుగిండి మానదయ్యె.

సీ. ఐశ్వర్యగతిమీఁద నరుచి పుట్టినఁగాని బలహంత మీచెంత నిలువ వెఱచుఁ
జక్కఁదనంబుపైఁ జౌక దోఁచినఁగాని సురభామ మీసీమఁ జొరఁగ వెఱచుఁ
దన పేరు మాత్రంబు కనరు వేసినఁగాని హరిపట్టి మిము గిట్టి యడుగ వెఱచు
విబుధదాతృతమీఁద వెగటు గల్గినఁగాని వనజారి మిముఁ జేరి చనక వెఱచుఁ
గాన తావకనియమవిఘ్నంబు నడుగ, నళికెదను గాని యోపనాని యట్టులేని
ఘోరమహానుకతూణీరగుప్తశాస, శరములకు నొక్కచరణాట సౌదరింపు.

ఈ కువలయాశ్వచరిత్రమును గొంతకాలముక్రిందటఁ గాకినాడ సరస్వతీ పత్రికాధిపతులు కీ॥ శే॥ పోలవరము జమీందారుగారు ముద్రించిరి.

## 18. చంద్రాననానందండకము--గ్రం. సం॥ 55.

సుదుగుపాటి సాంబకవిరచితము. ఈసాంబకవి యాంధ్రభాషార్ణవకర్త యగు వేంకటకవిపుత్త్రుఁడు - తొండమాన్ నృపాలురయాస్థానములోని కవి యితఁడు. ఆసంస్థానములోని తనప్రభువుపైఁ జెప్పినదే యీదండకము. కాగణ మేమో యెక్కడఁ జదివినను రాజుపేరు, వంశము వచ్చినతావుల నెల్లఁ జోటు విడిచిపెట్టినాఁడు గాని వ్రాయలేదు కాఁబట్టి వారిపేరులు తెలియరావు.

దం॥ శ్రీదక్షిణాభిఖ్య గోకర్ణనక్షత్రారవిందస్ఫురద్దివ్యతేజస్సుదాధ్యానసక్తాత్మ భావుండు భావోద్భవామిత్రఫాలాక్షికీలాసమానప్రతాపార్కబింబద్విషద్ధ్వాంత వారుండు, వారాశిగాంభీర్య గాఢత్వదానప్రవీణాతిగంభీరతాశాలి శాలీనవిద్వద్ధరాపాలమాళీస్ఫురద్రత్నమంజు రత్నచ్ఛవిచ్ఛన్న చక్రాదిరేఖోల్లసత్పాదపద్ముండు, పద్మానభూమాటీపదాబ్జస్ఫురద్రత్న మంజీరసంగావతులోల్లసద్రమ్యతౌర్యత్రికస్వాన భాస్వన్నిశాంతుండు శాంతాతిదాంతద్విజాశీర్వచఃప్రాప్త దీర్ఘాయురారోగ్య సామ్రాజ్యలక్ష్మీసనాథుండు - - - వంశాబ్ధిసోముండు సర్వజ్ఞతాతుల్యకాముండు - - - - మహీనాథుపౌత్త్రుండు, సల్లక్షణోపేతగాత్రుండు - - - - దాత్రీంద్రపుత్త్రుండు రాకేందునీకాశవక్త్రుండు, హూణాదిరాజన్యసంస్తూయమానోల్లస - - - - సమాఖ్యాభిరాముండు - - - - తానొక్కనాఁటన్ మహాజారంబునం

భేటికై భూపతుల్ కాచి యున్నారనే జాడఁ దెల్పంగనో నాఁగ భూపాలరాగాధుఁ-॥ మాగధుల్ వేకువ స్నానముల్ సేయఁ దద్రాగనామంబు డెందంబునం దోఁచ స్వీయేతరంబైన భూపాలశబ్దార్థముత్వంబునం గిన్కనుంబోలె నోనాగ విప్పాచు నొప్పారు నేత్రారవిందంబులం గెంపుడాల్కొంత చెన్నొంద భూమండలి న్నీసమానంబునుం జూడఁగాఁ గోరితే దర్పణంబందునే గాక వేఱొందునం గానరాదంచుఁ జూపించె నోనాఁగ వాల్గంటి యొక్క-ర్తు తాఁ జేతినిం బూనునద్దంబునం జూచి ------ స్వర్ణస్ఫురత్పూర్ణకుంభంబునుం గాంచి ------ స్నానగేహంబునం జేరి బల్చల్లనౌ చుక్కరారాతితీఁంచకాల్ పీఠఁ గూర్చుండి --- కృతస్నానుఁడై ----- ఫాలమ్మునన్ భూతినింబూసి --- సద్బంధువర్గంబుతో భుక్తిని న్సల్పి వాల్గంటి యొక్కర్తు తాపండుటాకుల్ సుకీతుండహస్తంబుచేఁ జట్టి యియ్యంగ బాగంబునుం జేసి ---- హాజారముం జేరి కొల్వుకై మూఁగియున్నట్టి దళ్వాయులన్ శౌర్యచాతుర్యయుక్తుల్ జెమేదార్లనుం దాకృపాకటాక్షంబుచేఁ జల్లఁగాఁ జూచి సాదిన్నిరీక్షింపఁగా వాఁడు ---- ముస్తీదుగావించి సర్వోత్తమత్వంబునుం దెల్పు మేల్దేసమణ్యాది నానావిధావర్తసల్లక్షణంబైన బారాహజార్ తేజి ముమ్ముంగలఁ న్నిల్పఁగాఁ గాంచి యత్యున్నతంబైన యంకెం బదంబూని ---- వాగె కేలాసరాగాఁ జివ్రుక్కంచు పైదాఁటి దౌర్చక్కఁగాదీర్చునాలోననే నిల్వకే చిందులంద్రొక్కుచోఁ గందముం దట్టుచుండ ---- నవ్వేడుక ల్పొచ్చడఁగా మేడలన్ సంభ్రమం బొప్పఁగాఁ బాలమున్నీటిలోనుండి పైవచ్చు లక్ష్మీసరోజాక్షియో నాఁగ నీరాడుచున్నుండి యుట్టే వెసన్నార్ద్రభావంబుతో నొక్కపూఁబోఁడి వచ్చెన్ ---- (అని మొదలైనది. ఇంకమీఁద నాపూఁబోఁడి విరహము --- ఈరాజుగారితో వివాహము) ఆకాంతతోఁ గూడ హాయిగా మానసానందసంధాయిగాఁ గూడి --- యారాధకం జేసు శ్రీవేణుగోపాలుచందంబున న్నిత్యలక్ష్మీసనాథుండుగా నుండుమంచున్ శుభాకారుఁడై సద్గుణాధారుఁడై సత్కళాభోజుఁడై రాజ్యసంరక్షణోద్యుక్తుఁడై ---- సద్గర్భవారాశిరాకానిశాకాంతుఁడై సద్యశః కాంతుఁడై యొప్పు ---- క్షితీంద్రు పేరన్ స్ఫురన్నిత్యసామ్రాజ్యసత్పుత్రసంతానసంపత్తు లింపొంద నుద్దండవిద్వత్కవిత్వాంకనుండైన శ్రీసాంబనాభిఖ్యవిద్వత్కవీంద్రుండు కైసేయచంద్రాననాంకంబగున్ దండకం బుర్వి నాచంద్రమస్తారమిత్రంబుగా వర్ధిలున్.

ఈదండకము ౨౨ చిన్నపత్రములలో వ్రాయఁబడినది.

౨ ఈపుస్తకములోనే, పిళ్లారప్పాయనునవి తొమ్మిదిపద్యములు వేంకటాచలరమణాయనునవికొన్ని పద్యములు నున్నవి. తల్లినన్ను, ఏణీలోచన, అంబనవాంబుజోజ్జ్వల, తొండముసేకదంతము, మోదకహస్తునికి —వీనితరువాత.

క. శ్రీకర రుచివిజితను, ధాకర మృడపార్వతీముదాకర గుణర
త్నాకర వరధీకర పర, భీకర వదనతంకుప్ప పిళ్లాంప్పా.

క. మల్లెలు మొల్లలు జాజులు, గొల్లలుగాఁ గోసి తెచ్చి కొనియాడి నినుం
జల్లగఁ బూజింతుము కృప, వెల్లునగాఁ జూడుమప్ప పిళ్లారప్పా.

క. ఓరీ బాలుఁడ నీపేటు, రారా యని నన్నుఁ బిలిచి రంజిలునయ చేఁ
గోరిక లొసఁగుము భువి నీ, పేరును బ్రకటించి చెప్పఁ బిళ్లారప్పా.

క. భక్షింపుము కావలసిన, భక్షణములు నీకునిత్తు భక్షించియు నీ
కుక్షిగల విద్యమాకుం, భిక్షంబిడి కావుమప్పా—ఇత్యాదితొమ్మిది.

క. ఒక తేప నీగుణస్థితిఁ, బ్రకటింతుఁ బరాకు చకితబలభిన్నాశమే
చరచకచకవికచస్ఫుట, - - - - - వేంకటాచలరమణా.

క. శంకా నాకింకభవ, త్కింకరుఁడను శమనదమన కేళీహాళీ
ఝాంకరణగుహాసరోవర, దంకూరక్రమణ వేంకటాచలరమణా

క. ఎక్కడు నీకొండేగా, యెక్కుడు నీదారినభల నిభవిక్రమ ఘ
న్యక్కృతబలధిక్కృతన, మ్యక్కృతఘీంకరణ వేంకటాచలరమణా.

క. ఎల్లప్పటికిని మాకిఁకఁ, గొల్లలు మీదాస్యధనము గుహాపుష్కరిణీ
కల్లోలమతల్లిమత, హల్లీసకచరణ వేంకటాచలరమణా.

క. సింహము మెడఘంటను నా, జిహ్వను నినుదలఁచినపుడె సేవనమాత్రా
రంహోజ్జ్వలబంహిష్ఠల, తాంహోసంహారణ వేంకటాచలరమణా.

క. ఆమిడి మొక్కులసామివి, మాముకనుతు లెంతిచూడు మణిదామసము
ద్దామఘనస్తోమచతు, ర్యామాలంకరణ వేంకటాచలరమణా. మొదలైనవి

క. వకులవననిత్యవాసిని, సకలాభీష్టములనిచ్చు చక్కనితల్లి
ప్రకటితము సేయు మీకృతి, నృకలుషగిరిభేదశంబ శ్రీబృహదంబా.

క. మడువుకుఁజని కాళిందుని, పడిగలపై భరతశాస్త్రపద్ధతి వెలయఁ
గడువేడుకతో నాడెడు, నడుగులు నామదిఁదలంతు నచ్యుతకృష్ణా.

గీ. నిన్నఁగుప్పయు నేఁడాళ్లు నెలఁత తాను, గోరి నామీఁదనే చేసెఁ గారుబారు
ముక్కుపచ్చలుమానకమునుపె బిరుదు, పిచ్చికలతోడఁ గాట్లాడవచ్చెనట్లు.

గీ మూఁడుశిరంబులు ముదమొప్పఁ బదికాళ్లు, కలువతోఁక రెండుకన్ను లాఱు
చేతు లెన్న - - - చెవికిఁగొమ్ములు నాల్గు, దీనిభావము దెల్పుతిరుమలేశా.

కొన్ని సంస్కృతశ్లోకములు గలవు.

గరుడేన వినాయాతి గగనే మధుసూదనః
ముక్త్వకం వృషమారుహ్యా భిక్షామటతి శంకరః
జగదధిపాలో మోరో నాయోనరి - - - భం
తం దమయ దుర్వినీతం మర్త్యానివ సూను రంశుమతః
అభినారసమానోసి న్యభిచారి సమస్తథా
రూపే పరాక్రమే చైన నరపాలశిరోమణే ॥
సూకరః కంకణం ధత్తే కంకణే రమణిస్థితా
తత్రాపి తరశ్చిత్రం కిం దీర్ఘసురతం వినా.
వినాజరాజపుత్రారే గ్యన్నామచతురక్షరమ్
పూర్వార్ధంతనశత్రూణా ముత్తరార్ధం తవైవహి ॥
రావణస్యకీయద్వక్త్రం, నూపురంకుత్ర ధార్యతే,
ఆంధ్రగీర్వాణభాషాభ్యా మేకమే వోత్తరంవద ॥ పది ॥
ప్రభాతేకీదృశంవ్యోను ప్రమాణేకీదృశంపచః, ఆంధ్రగీర్వాణ ॥ నీశోడు ॥
కింప్రియంలోహకారాణాం వాహనంకింశచీపతేః
ద్రావిడామరవార్తాభ్యా మేకమే వోత్తరంవద ॥ కరీ ॥ కరి = బొగ్గు.
దమయంతీనళంవృష్ట్వా యయాపరవశీకృతా
సీతాఇత్యుత్తరంయస్య ప్రశ్నస్యతదిహోత్తరమ్ ॥ రాధుమకా
ఉత్తిష్ఠోత్తిష్ఠరాజేంద్ర ముఖంప్రక్షాళయస్వతః (టః)
ఏషఆహూయతేకుక్కు చవైతుహిచవైతుహి.

ఇట్టిసంస్కృతశ్లోకములు సుమారు డెబ్బదివఱకుఁ గలవు. మఱియు జానకీపతి యను తెనుఁగుపద్యములు కొన్ని గజేంద్రమోక్షములోనిపద్యములు కొన్ని ఎఱుపుపద్యములు, పచ్చపద్యములు, నలుపుపద్యములు, తెలుపుపద్యములుం గలవు. వీనిని దసరాపండుగలలో బాలురు చదువుదురు, గాని, యిందలిపద్యములు చాలఁ దప్పులుగా నుండుటచే నా సీసపద్యములును బ్రస్తుతము విడిచిపెట్టఁబడినవి. ఇది దక్షిణదేశమునుండి తెచ్చినపుస్తకము

19. ఆంధ్రమహాభారతము. ఆరణ్యపర్వము. గ్రం. 2644.

ఈసంపుటములో, ఆది, సభా, ఆరణ్య విరాటోద్యోగపర్వములు గలవు. 359 పత్త్రములు గలవు. 126 మొదలుకొని ఆరణ్యపర్వము వ్రాయఁబడినది. ప్రారంభము; శ్రీమతేరామానుజాయనమః,

క. శ్రీకీర్తిశ్రీవల్లభ, లోకజనస్తుత్య సర్వలోకాశ్రయర
త్నాకరపరివృత సకలధ, రాకాంతజితారి రాజరాజనరేంద్రా.

వ. అక్కథికుండు శౌనకాదిమహామునులకుం జెప్పినట్లు, అనికొన్నితావులనుగొన్ని తావుల "అక్కథకుం" డనియుం గలదు. భీముగదాఘాతంబున నియ్యూరు యుగళంబు భగ్నం బయ్యెడు మని యే శాపమిచ్చినాఁడు

నాలుగవయాశ్వాసములో యంత్రట చదలువాడ యర్రాపెగడ కవిత్వం॥ అని తర్వాత, భూసతికిం దినంబునకుం బొల్పెసఁగంగ శరత్సమాగంబని ప్రారంభించినాఁడు పత్రములో సంకెవేయుచోట, యింత్రట రెండ్లోవారికవిత్వం, అని సూచించినాఁడు. ఈపుస్తకములో నాయాఘట్టముల విషయసూచిక ప్రక్కలను యుగధర్మాలు,కలియుగధర్మం, కృతయుగప్రవర్తనం, వామ్యాశ్వహరణం, యింద్రద్యుమ్నోపాఖ్యానం, దుంధుమారచరితం అని సూచింపఁబడినది వ్రాఁతతప్పులనేకవిధములైన విందును గలవు. పూర్ణబిందువు పిమ్మట సకారముక్రింద ద్విత్వముండుటయు లేకుండుటయుఁ గూడఁగలదు. సప్తమాశ్వాసము చివర "సూర్యనార్యునకును బోతమాంబికకును నందనుం డిలపాకనాటిలో నీలకంఠేశ్వరస్థానమై యెసకమెసగు గుండ్లూరి నెలవున గుణగరిష్ఠతనొప్పు - - - - - సకలలోకైకవిదితుడైన యన్నయభట్టమహాకవీంద్రు - - - - - అనియు, తత్కవితారీతియ కొంత దోప దద్రచనయకా. నారణ్యపర్వశేషము బూరించ్చె కవీంద్రకర్ణపుటపుటపేయముగఁ అనియునున్నది.

ఈసంపుటములో నన్నిపర్వములలో నన్నియాశ్వాసములలో మొట్టమొదట జిత్రజిత్రములైన లతలు, చిత్రములు, శంఖచక్రాదులు, బహునిపుణముగా వ్రాయఁబడియున్నవి. ప్రత్యాశ్వాసముచివరను, శ్రీమత్సదాచార్యశేషగురువేయనమః శ్రీమద్వేంకటవరదాచార్య గురువేయనమః అనియున్నది ఏసంవత్సరములో వ్రాయఁబడినదో యెవ్వరు వ్రాసిరో తెలియరాదు. దత్తమండలములలో సంపాదింపఁబడినది.

ఆదిపర్వములో "అని సకలభువనరక్షణప్రముఖులై - - - - - పద్మోమావాణీపతుల స్తుతియించి - - - - - భారతభారరణంబునందు నారాయణునట్లు దాను వసుధామరవంశవిభూషణుండు - - - - - అది మికప్పంబులు మోదముతోఁ గొనుచును బలిమిని యున్నభూవలయపతుల నుక్కణగింపుచు దిక్కుల దనయాజ్ఞ వెలిగించుచు - - - - గలవు. పదిదినము లైదుప్రొద్దు లను కందపద్యము లేదు. గూఢిం గొంవసైన్య మీయుభయముకఁ అని కలదు. "కావన

కిట్టి పాటియపకారం" మను పద్యము ప్రథమాశ్వాసములో లేదు ద్వితీయాశ్వాస
ములో, నేకవిప్రసంబోధన చేసిచేసె రిపుసూదన అని యున్నది విరాటపర్వ
ములో, శ్రీయును గౌరినాఁ బఱఁగు చెల్వలచిత్త మని కలదు వ్రాఁత నుంచిది

20. కచ్చిరంగరాజదండకము గ్రం. సం. 67

ఇదియుఁ జంద్రాననాదండకమువంటిదే.

దండ. శ్రీమత్సమస్తావనీనాథయూథైకసంస్తుత్యనిస్తుల్యకల్యాణనానాగుణ
శ్రేణికాపాదనానూన కచ్చాన్వయక్షీరవారాశిసంపూర్ణచంద్రుండు చంద్రాభ్ర
మాతంగ చంద్రాతపాభంగ సాంద్రామృతాంభోధునీభంగ రంగత్సుధాశారదా
శారదాభ్రాసుహిభ్రాజితానందభ్రశుభ్రస్వకీర్తి ప్రధావాహినీబుద్బుదీభూతకంజాత
గర్భాండసంఘుండు సంఘాతితారాతిభూపాతి మాత్రోన్నమత్కుంభికుంభస్థలీ
నిర్గళద్వక్తముక్తాతతిస్ఫీతశోభాభరప్రాపితఖ్యాతి రాజద్వితానాథకద్యోత మా
నాభ్రదేశుండు దేశాంతరాయాత (శుంభ) త్కవీంద్రాస్య విద్యాధికశ్రేణి సం
రక్షణాక్షీణ కారుణ్యధారాధురావార సత్సత్కటాక్షక్షణోదారతా రానుభ
ద్రుండు భద్రేభయానానవీనప్రసూనాస్త్రకల్పుండు కల్పావనీజాత భాస్వత్తనూ
జాతకంజాత - - - - - దానధారాసుధాపూర పాత్రీకృతాశేషధాత్రీ నరశ్రేణి
కర్ణుండు కర్ణాటరాజన్య - - - - - - - - కచ్చాన్వయాధీశరంగక్షమానుండలా
ఖండలస్ఫీతగర్భాబ్ధిచంద్రుండు జ్ఞానప్రసూనాంబికాపుత్ర రత్నాగ్రగణ్యుండు
- - - - - శ్రీమహారాజ్యాభిషిక్తుండు సర్వక్షమాపాలనాశక్తియుక్తుండు శ్రీకచ్చి
రంగావనీపాలచంద్రుండు తానొక్కనాఁ డెక్కవౌ మక్కువల్ పిక్కటిల్లంగఁ
దొల్లుబ్బలి న్నిబ్బరంబొప్పఁగాఁ గస్తునెత్తమ్మిరామేటి గాటంపుఁ గెంజాయచే నట్టి
గన్పట్టు నప్పట్టునన్ వందిబృందస్తవంబుల్ చెవిన్ సోఁకగాఁ దీవినెత్తావి చెంగల్వ
తేకుల్ హొసంగంగ బసంగాంచు పూసజ్జలో మెల్ల నేనిద్ర మేల్కాంచి యకాంచ
నాంచ చ్ఛభాంరంభకుంభాది సద్వస్తువుల్ గాంచి నిద్దంపు పెన్నిల్వటద్దంబు వీ
క్షించి, - - - - - - చల్లడంబుం గడుం బాగుగాఁ దాల్చి పాటంబుగా నామ
కూటంబునం జేరి - - - -

ఈరీతిగా వర్ణనాంతరములతో రాజుస్నానము భోజనము వేషము సభా
ప్రవేశము వీథులవెంట వాహ్యాళి, మేడమీఁదినుండి యొకవ్వారో పడుచుది చూచి
విరాళిఁబొందుట దాని సంధానము-ఇదియేకథ-కవి యెవ్వరో తెలియరాదు. కవి
త్వము చంద్రాననాదండకములోకంటె విశేషవర్ణనలు, పదజటిలముఁ గలది.
యమకములు గమకములు మెండు-పూర్తిగా లేదు. 41 పత్రములుగలవు.

దక్షిణ దేశప్రతి-వళైపనూరు కళ్యాణరామయ్యగారిచ్చినది.

# విషయసూచిక.

విషయములు.





# ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక.

సంపుటము ౧౩. | రక్తాక్షి నామసంవత్సరము. శ్రావణ—కార్తికమాసములు. | సంచిక ౩-౪.

## నన్నిచోడకవి కాలము.

నన్నిచోడకవికృత కుమారసంభవములోని మొదటియెనిమిదాశ్వాసములును పీఠికతోఁగూడ శ్రీమానవల్లి రామకృష్ణకవిగారు 1909-వ సంవత్సరమునఁ బ్రకటించిరి. ఆపీఠికలో "ఇతఁడు (నన్నిచోడుఁడు) క్రీ. శ ౯౪౦ లోఁ బాశ్చాత్య చాళుక్యులతో యుద్ధముచేసి రణరంగమున నిహతుఁడయ్యెను." అని యొక చోటను, "ఈకృతి నన్నయభట్టుకంటె నూఱేండ్లు పూర్వము దైనను ౧౦౦౦ సంవత్సరములుగా నెవ్వరును గుర్తెఱుంగక యుండుటఁ దటస్థింపఁ దనయు దీనిని నేనో మఱియెవ్వరో రచించి గ్రంథప్రాశస్త్యమునకై ప్రాచీనుపేర నారోపింపఁబడెనని యీగ్రంథమును బ్రచురింపకముందే యొకవార్త పుట్టినది" అని మఱియొకచోటను వ్రాసి, నన్నిచోడుఁడు నన్నయభట్టుకంటెఁ బ్రాచీనుఁడను నభిప్రాయమును వ్యక్తపఱిచిరి. ఈయభిప్రాయము సరియయినది కాదనియు నన్నిచోడుఁడు నన్నయభట్టుకంటెఁ దరువాతివాఁడు గాని పూర్వుఁడు గాఁడనియుఁ గొందఱు విమర్శకులు పత్రికాముఖమునఁ బ్రకటించిరి. 1914 సంవత్సరములోఁ గుమారసంభవముయొక్క యుత్తరభాగమును బ్రకటించుచు రామకృష్ణకవిగారు పూర్వోదాహృతవిమర్శనములఁ బరిశీలించి పూర్వభాగపీఠికలోని వ్రాఁతలయందలి వేగమును గొంతవఱకుఁ దగ్గించుకొనిరి గాని నన్నిచోడుఁడు భట్టారకునికంటెఁ బ్రాచీనుఁడను వాదమును మాత్రము విడువలేదు. ఇటీవల శ్రీ నడకుదుటి వీరరాజుపంతులుగారు రామకృష్ణకవిగారి మతము నవలంబించి యామతమును ఖండించిన విమర్శనముల ఖండించుచు నొకవ్యాసమును రక్తాక్షి సంవత్సరాషాఢమాసమునందు వెలువడిన "శారదా" పత్రికయందుఁ బ్రకటించిరి. ఇందును గుఱించి నాయభిప్రాయము బ్రకటింపవలయు నని కొందఱు భాషాభిమానులు కోరుటచేతను, నే నీవిషయమై కొంత పరిశోధన చేసియుఁ

డుటంబట్టియు నింతవఱకు జరిగినవాదప్రతివాదములఁ బరిశీలించి నానిశ్చితాభిప్రాయమును దెలుపఁ బూనినాఁడను. ఈపత్త్రికావాదములు పుట్టకపూర్వమే, యనఁగా 1910-వ సంవత్సరమున (సెప్టెంబరు నెలలోఁ గాఁబోలును) చెన్నపట్టణమున రాజకీయకళాశాలలో జరిగిన యాంధ్రభాషాభివర్ధనీసమాజసాంవత్సరికోత్సవసమయమున నే నగ్రాసనాధ్యక్షుఁడనుగా నుండుట తటస్థించి యాసమయమున "నన్నయభట్టునకుఁ బూర్వము తెలుఁగుకవు లుండిరా" యను విషయమును జర్చించుచు నాసందర్భమున నన్నిచోడుఁడు నన్నయభట్టునకుఁ దరువాతివాఁడు గాని పూర్వుఁడు గాఁ డని చెప్పియుంటిని. కావున రామకృష్ణకవిగారి మతమును ఖండించినవారిలో నేను ప్రథముఁడనే. అయినను బట్టుదల మాని యిటీవల జరిగిన వాదప్రతివాదములు సాధ్య మగునంతవఱకు మధ్యస్థభావముతో విమర్శించి సత్యమును నిర్ణయించుటకే యత్నించెదను.

నన్నిచోడుని చరిత్రమును దెలుపుపద్యములు మూఁడు కుమారసంభవమునందుఁ గలవు. అవి ప్రథమాశ్వాసములోని 53, 54, 55 సంఖ్యలు గలవి. 53-వ పద్యమువలన నన్నిచోడుఁడు "పాకనాఁటియం దిగునదియొక్క వేయిటి కధీశుఁడు నాఁ జనుచోడబల్లికి"ని, "హైహయాన్వయాంబరశశిరేఖ యైనగుణభాసిని శ్రీసతికి"ని, దనూజుఁ డయినట్లును, 54-వ పద్యమువలన నతఁడు "ఓరుయూరి కధిపతి"యుఁ "దెంకణాదిత్యుఁడు" ననియు, 55-వ పద్యమువలన నతఁడు "కాశ్యపగోత్రుఁడును," "మిత్రాన్వయశేఖరుఁడు" ననియును గనఁబడుచున్నది.

కాలనిర్ణయమునకుఁ బూర్వము కవి యేదేశమువాఁడో నిర్ణయింపవలసియున్నది. ఈచర్చకు నవతారికగా చోడరాజులవృత్తాంతము కొంచెము విచారింతము. చోడరాజులలో అరవచోడు లనియు, ఆంధ్రచోడు లనియు రెండుశాఖలవారున్నారు. ఈయిరువురకును కరికాలచోడుఁ డనునాతఁ డొక్కఁడే మూలపురుషుఁడు. కరికాలునికాలమందును, పిదప నించుకొంతకాలమువఱకును అరవచోడులు తిరుచునాపల్లికిఁ జేరియున్న ఒఱయూ రనునూరు రాజధానిగాఁ జేసికొని కొంత ద్రావిడదేశమును బాలించుచుండి కాలక్రమమున పల్లవరాజులను జయించి కంచి రాజధానిగా నొనర్చుకొని చోళదేశ మంతయు నేలిరి. వారిలోఁ గొంద ఱాంధ్రదేశమునకు వచ్చి తొలుత కడపమండలమునందలి పొత్తపియను గ్రామము రాజధానిగాఁ జేసికొని తత్ప్రాంతదేశము పాలించుచుండి క్రమక్రమముగా సముద్రమువఱకును బ్రాఁకి పలుతెగలై యొకతెగ వారిప్పుడు నెల్లూ రనుపేరుగల విక్రమసింహపురమును, వేఱొకతెగవారు నెల్లూరిమండల

ములోని కందుకూరును, మఱియొక శాఖవారు గుంటూరుమండలమునందలి కొణిదెన యను గ్రామమును రాజధానులుగాఁ జేసికొని యాయా ప్రాంతముల యందలి దేశమును బాలించుచుండిరి. ఈయాంధ్రచోడుల కిటీవల దక్షిణదేశముతో సంబంధ మేమియు లేకపోయినను దాము కరికాలవంశమువార మని చెప్పుకొనుచుండుటంబట్టి ఒరయూరుపురవరాధీశ్వర ఉంకరాదిత్యేత్యాది పూర్వచోడబిరుదములఁ బెట్టుకొనుచుండిరి. ఇది యంతయు శాసనమూలమున స్పష్టపడుచున్న నిర్వివాదాంశము. నన్నిచోడుఁడు ఆంధ్రచోడుఁడా లేక అరవచోడుఁడా యని విచారింపవలసియున్నది. పూర్వభాగపీఠికలో రామకృష్ణకవి గారు "ఇతఁడు కావేరితీరమున నొఱయూరను పట్టణము రాజధానిగా గోదావరీసింహాళమధ్యదేశము నేలెను." అని వ్రాసి దానిపైఁ బుట్టిన ఖండనములను విమర్శించుకొని యుత్తరభాగపీఠికలో "ఆంధ్రచోడులు కారికా కావేరీతీరకరికాల చోడవంశజు లగుటయు నొరయూరిపురవరాధీశ్వరు లగుటయుఁ జోడశాసన విఖ్యాతాంశములు. అయినను నన్నిచోడుని వర్ణనము నించుక చక్కఁగా నాలోచించినచో నతఁ డొరయూరికే పరిపాలకుఁ డనియుఁ గేవలము కులక్రమాగత బిరుదమును బెట్టుకొన్నవాఁడు గాఁ డనియుఁ దోఁపక మానదు." అని వ్రాసిరి. మొదటిపీఠికలో నాంధ్రచోడుల మాటయే తలపెట్టని రామకృష్ణకవిగారు రెండవపీఠికలో నట్టివా రున్నట్టులే గాక వారందఱు నన్నిచోడుఁడు పెట్టుకొన్న కులక్రమాగతబిరుదముఁ బెట్టుకొనుచుండి రనికూడ నొప్పుకొనవలసిన వారయ్యును జిట్టచివరమాటలో నన్నిచోడుని రాజధాని యొరయూరే యని సిద్ధాంతీకరించుట వింతగా నున్నది. వింత యేల? పట్టినపట్టు విడుచుట కష్టము గదా!

నన్నిచోడుఁడు ద్రావిడుఁ డనుటకంటె నాంధ్రుఁ డనుటకే హేతువు లెక్కువగాఁ గనఁబడుచున్నవి. అవి యేవి యనఁగా:—

(1) ద్రావిడచోడవంశావళిలో నెచ్చటను నన్నిచోడుఁ డనుపేరు గాని చోడబల్లి యనుపేరు గాని కానరాదు. (2) ఈనామము లాంధ్రచోళవంశావళులలోఁ బెక్కుతావులఁ గన్పట్టుచున్నవి. (3) నన్నిచోడుఁడు ద్రావిడుఁడే యయినచోఁ గుమారసంభవమువంటి ప్రౌఢకావ్యము రచించుటకుఁ జాలినంత యాంధ్రభాషాపాండిత్య మలవడుట దుర్లభము.

ఈకారణములంబట్టి నన్నిచోడుఁ డాంధ్రచోడుఁడే యని నిశ్చయింపవలసియున్నది. రామకృష్ణకవిగారును రెండవపీఠికలో నన్నిచోడనామము గల

శాసనములఁ జేర్కొని యీ రెల్లరును క్రీ. శ. 850 మొదలు 1210 లోఁగా నుండినవారు. వీరిలో నెవ్వఁడు కుమారసంభవకావ్యకర్తయో నిర్ధారణము సేయుట సులభసాధ్యము కాదు." అని వ్రాసిరి. దీనినిబట్టి కుమారసంభవకర్త యాంధ్రచోడుఁడే యై యుండవచ్చు నని రామకృష్ణకవిగా రొప్పుకొన్నట్లు స్పష్టపడుచున్నది గదా. నన్నిచోడుఁ డాంధ్రచోడుఁడే యనుటకు కొన్ని హేతువులు కనఁబడుచున్నను నాతఁ డొరయూరునందే రాజ్యము చేసె ననుటకుఁ బట్టినవాలయే ముఖ్యకారణము. ఈకారణమునకుఁ గారణ మయిన "ఒరయూరికధిపతి"యను నన్నిచోడవాక్యము "ఒరయూరిపురవరాధీశ్వర" యను బిరుదము వలెనే యర్థవాదముగా గ్రహింపవలసియున్నది. నన్నిచోడుఁ డాంధ్రుఁడో యెవఁడును దక్షిణదేశమును జయించి యొరయూరిలో రాజ్యము చేసియుండు నని రామకృష్ణకవిగారు గాని తత్పక్షమువారు గాని చెప్పవచ్చును కాని యట్లనుట కాధారము లేమి యు లేవు. కావున సర్వవిధముల నన్నిచోడుఁ డాంధ్రచోడుఁ డనియే సిద్ధాంతీకరింపవలసియున్నది.

ఆంధ్రచోడశాసనములలోఁ బెక్కుఱు నన్నిచోడులు కనఁబడుచున్నారు. కుమారసంభవకర్త వీరిలో నెవ్వఁడై యుండునో నిర్ణయింపవలసియున్నది. పత్రికలయందు వ్రాసినవిమర్శకులు శాసనముల విమర్శించి యొక్కొక్క రొక్కొక్క శాసనము ప్రమాణము చేసికొని యందఱు నేకగ్రీవముగా నన్నిచోడుఁడు నన్నయభట్టునకుఁ దరువాతివాఁ డని నిశ్చయించిరి. కీర్తిశేషు లగు వీరేశలింగము పంతులుగారుఁ గూడ నిట్లే యభిప్రాయపడిరి. వీరందఱివాదములను విమర్శించి వీ రాధారములుగాఁ దీసికొన్న శాసనములు సరిగాఁ బట్టలే దని వీరరాజుగారు ఖండించిరి. ఈఖండనము యుక్తియుక్తముగా నున్న దనియే నాయభిప్రాయము. వీరు నిరాకరించిన శాసనము లేవియుఁ గుమారసంభవకర్తకు సంబంధించినవి కావు. అతనికి సంబంధించిన శాసనము పెద్దచెఱుకూరుశాసన మను శాసన మొక్కటియే. ఈశాసనమును బత్రికలలో నీవిషయము చర్చించిన విమర్శకులు చూచినట్లు లేదు. రామకృష్ణకవిగారు మాత్రము చూచినట్లు వారి రెండవపీఠిక వలనఁ దెలియుచున్నది. ఈశాసనము నాధారము చేసికొనియే 1910-వ సంవత్సరములో నేను "నన్నిచోడుఁడు నన్నయభట్టునకుఁ బూర్వుఁడు కాఁ డనియు సుమారు నూఱుసంవత్సరములు తరువాతివాఁ డనియు స్పష్టపడుచున్నది." అని యభిప్రాయపడి యుంటిని. ఈశాసనము గుంటూరుమండలము నందలి పెద్దచెఱుకూరుగ్రామములో నొకవీథిలో నున్నరాతిమీఁదఁ జెక్కఁబడి

యున్నది. 1897-వ సంవత్సరములో రాజకీయశాసనాధికారులు (Government Epigraphist) సంపాదించిన శిలాశాసనములలో నిది 243-వది. దీనిప్రతిబింబము నాయొద్ద నున్నది. వీరరాజుగారు చూచినారు. ఇతరు లెవ్వరైనఁ జూడఁగోరిన చోఁ జూపఁగలను. ఈప్రతిబింబమును బట్టి వ్రాసినప్రతి యీవ్యాసమున కనుబంధముగాఁ బ్రకటించుచు నందులోని విషయ మిచ్చుట సంగ్రహముగాఁ జూపుచున్నాఁడను. కరికాలాన్వయమునందు చోడబల్లినృపుఁడు పుట్టె ననియు, నతనికి నన్నిచోడుఁడు, నతనికి సూరభూపుఁడును కొడుకు లనియు, సూరభూపునకు ఘటంకారినృపుఁ డనుతమ్ముఁ డుండె ననియు, ఘటంకారునకు చోడమహాదేవియందు మల్లిదేవనృపుఁడును, మల్లిదేవునికి మహాదేవియందు నన్నిచోడుఁడును, నన్నిచోడునకు గంగాదేవియందు మల్లిదేవుఁడును గొడుకులు పుట్టి రనియు, రెండవమల్లిదేవుఁడు కాకతీయగణపతిదేవునకుఁ బుణ్యముగా పరిదపూండి యనుగ్రామము నిత్తుపుర (పెద్దచెఱుకూరు)మందలి శ్రీభీమేశ్వరస్వామి కిచ్చె ననియు నీశాసనమం దున్నది. వంశావతారవర్ణన మయిన పిదప "స్వస్తి చరణసరోరుహవిహితవిలోచనత్రిలోచన ప్రముఖాఖిలపృథివీశ్వర కారితకావేరీ తీరకరికాలకులరత్నప్రదీపాహితకుమారగజాంకుశ కందుకూరిపురవరేశ్వర కాశ్యపగోత్ర పాకనాంటివిషయ ఏకవింశతిసహస్రగ్రామావనీవల్లభ భయలోభ దుర్లభ సత్యరత్నాకరనామాది సమస్తప్రశస్తిసహితం" అని రాజప్రశస్తి కలదు. దానమును వర్ణించుటలో "శ్రీమద్గణపతిక్ష్మేశః పరిదపూండి మిమం పునః భీమేశ్వరాయ దేవాయ ప్రాదా దాచంద్రతారకం" అని చెప్పి తిరిగి "బహుభిర్వసుధా దత్తా బహుభి శ్చానుపాలితా యస్యయస్య యదా భూమి స్తస్య తస్య తదా ఫలం ఇతి సంచింత్య మల్లిదేవచోడమహారాజ్ఞాసమధిగత పంచమహాశబ్ద మహామండలేశ్వర వీరరాజేంద్ర కాకతియ్యగణపతి మహాక్షోణీశస్య ధర్మార్థం క్రీతం" అని చెప్పఁబడి యున్నది. దీనినిబట్టి దానకర్త యగుమల్లిదేవుఁడు కాకతీయగణపతిదేవరాజునాజ్ఞకు లోఁబడిన సామంతరాజనియు, నా గణపతిదేవునకుఁ బుణ్య మగునట్లుగా దానముచేసె ననియుఁ దేలుచున్నది. ఈశాసనమం దిద్దఱు నన్నిచోడు లున్నారు. అందు మొదటి నన్నిచోడుఁడే కుమారసంభవకర్త యని సహృదయు లగుపండితులకుఁ దోఁచకమాన దని నా నమ్మకము. తల్లిపేరు లేకపోవుట తప్ప శాసనమునకు ను గుమారసంభవము లోని పద్యమునకు నన్నివిధముల సరిపోవుచున్నది. శాసనములోఁ దల్లిపేరు లేకపోవుట యొకదోషము కాదు. తల్లిపేరు కూడ నున్న దనుకొందము.

అప్పుడు మాత్రము తల్లిదండ్రుల పేళ్లును దనపేసను సమానములుగా నున్నవా రిద్దఱుండఁగూడదా యనువాదము రాకుండునా? కుమారసంభవకర్త యితఁడే యని కూడ నుండిన నట్టి యాక్షేపములు రాకుండు నేమో! అట్టిశాసనములు లేనిచోఁ గవికాలనిర్ణయ మసాధ్య మనుకొనవలయునా? శాసనములోని మొదటి నన్నిచోడుఁడే కుమారసంభవకర్త యని నిశ్చయించి యాతనికాలము నిర్ణయింతము. దీనికిఁ బూర్వము రామకృష్ణకవిగారి యపసిద్ధాంత మొకటి ఖండింపవలసియున్నది. పూర్వభాగపీఠికలో రామకృష్ణకవిగారు "ఇతఁడు (నన్నిచోడుఁడు) క్రీ. శ. ౮౪౦ లోఁ బాశ్చాత్యచాళుక్యులతో యుద్ధముచేసి రణరంగమున నిహతుఁడయ్యెను." అని నిరంకుశముగా వ్రాసి యుత్తరభాగపీఠిక వ్రాయునప్పటికిఁ బూర్వాపరవిమర్శనము కొంత చేసికొని తాము మొదట వ్రాసిన వ్రాఁత నిలువదని తెలిసికొని "ఒకనన్నిచోడుఁడు పాశ్చాత్యరాజులచే రణరంగమున క్రీ. శ. ౮౪౦ లో నిహతుఁడయ్యె" నని మార్చినారు. ఇప్పుడైనను దను కాశాసన మెచ్చట లభించినదో చెప్పియుండలేదు. కావున నీవ్రాఁత నిరాధారమే. ఇఁక, పెద్దచెఱుకూరుశాసనకాలనిర్ణయములోనికి దిగెదము. ఈ శాసనములోని వంశావతార మిట్లున్నది:—




రెండవమల్లిదేవునికాలములో శాసనము పుట్టినది. శాసనకాలము చెప్పఁబడియుండలేదు, గాని యూహించుట కాధారము లున్నవి. కాకతీయగణపతిదేవునకుఁ బుణ్యముగా మల్లిదేవుఁడు దానము చేసెను. గణపతిదేవుఁడు 1120-వ శకాబ్దము మొదలు 1182-వ సంవత్సరమువఱకు 62 సంవత్సరములు రాజ్యము చేసెను. కొంతకాలము రాజ్యముచేసినపిదప నీతఁడు కమ్మనాఁడు, పాకనాఁడు జయించి స్వాధీనము చేసికొనెను. పాకనాఁటిచోడు లందఱు

నీతని కాజ్ఞావర్తు లయిరి. ఈతని నాశ్రయించియే తిక్కనసోమయాజులు తన యేలికయైన మనుమసిద్ధికి రాజ్యము తిరిగి సంపాదించి పెట్టె నని సిద్ధేశ్వరచరిత్రము చెప్పుచున్నది. ఈగణపతిదేవుని నాఁటిశాసనములు కమ్మనాఁడునం దచ్చటచ్చటఁ గలవు. గుంటూరుమండలమందలి ఒంగోలుతాలూకాలో దయ్యాలరేపూ రనుగ్రామమును "శకవర్షంబులు ౧౧౭౦ శ్రీమన్మహామండలేశ్వర కాకతియ్యగణపతిదేవమహారాజులు" బ్రాహ్మణాగ్రహారముగా నిచ్చిన ట్లొకశాసనము కలదు. (చూ. Nellore Inscriptions No. 17 of Ongole.) గుంటూరు మండలములోని కోనిదెన శంకరేశ్వరస్వామియాలయములో నున్న యొకశాసనములో "ఒరయూరిపురవరాధీశ్వర సూర్యవంశోద్భవ కాశ్యపగోత్ర వెంకణాదిత్య జగనొబ్బగండ కీర్తినారాయణ సమస్తప్రశస్తిసహితంబు శ్రీమన్మహామండలేశ్వర యోపిలిసిద్ధనదేవ చోడమహారాజులు స్వస్తిశకవర్షంబులు ౧౧౪౭ గు తారణసంవత్సర కార్తికశుద్ధ శ్రీయేకాదశీశుక్రవారమునం గమ్మనాంటిలోన నిజరాజధానియైన కొట్టియదొన శ్రీశంకరేశ్వర శ్రీమహాదేవరకు గణపతిమహారాజునకు ధర్మముగా హవిర్బలి యర్చనలకు నంగభోగరంగభోగాలకు నందుల మొగడ చెఱువు దేవభోగ మాచంద్రార్క తారకము సర్వకరపరిహారముగా నిచ్చితిమి" అని యున్నది. ఈశాసనము 1899 సంవత్సరములో శాసనాధికారులు సంపాదించిన శిలాశాసనములలో 183-వది. వీనినిబట్టి చూడ పెద్దచెఱుకూరు శాసనము ౧౧౪౦-వ శకాబ్దప్రాంతము దని యూహించుట యాక్షేపార్హముగా నుండదు. రెండవమల్లిదేవునకును మొదటినన్నిచోడునకును, నడుమ నాలుగు తరములు గలవు. చరిత్రకారులు తరమున కిరువదియైదు సంవత్సరముల లెక్కను గణింతురు. రెండవమల్లిదేవుఁడు శ 1140-వ సంవత్సరప్రాంతమువాఁ డయినచోఁ బ్రథమనన్నిచోడుఁడు శ 1040-వ సంవత్సరప్రాంతమువాఁ డగును. అనఁగా నన్నయభట్టారకున కించుమించుగా నూఱేం డ్లిటీవలివాఁ డగును. ఇతరశాసనముల నాధారముచేసికొని వ్రాసినవారి సిద్ధాంతము కూడ నించుమించుగా నిదియే. ఘట్టకుటీప్రభాతన్యాయముగా నెట్లు చూచినను నన్నిచోడుఁడు నన్నయభట్టునకును తిక్కనసోమయాజులకును నడిమివాఁ డని తేలుచున్నది. ఇదియే సిద్ధాంతము.

శాసనసాహాయ్యముచేత నన్నిచోడుఁడు నన్నయభట్టునకుఁ బూర్వము వాఁ డని రుజువు చేయఁజాలక, రామకృష్ణకవిగారు "ఇఁక నన్నిచోడుఁడు నన్నయభట్టాదులకంటెఁ బ్రాచీనతరుఁ డని కుమారసంభవములోని వ్యాకరణఛందో

విశేషాపూర్వపదప్రయోగములు సహస్రముఖముల ఘోషించుచున్నవి." అని ద్వితీయపీఠికలో వ్రాసిరి. దీని కనుగుణముగా వీరరాజుగారును "ఒకకవికాలమును నిశ్చయించుటకు నిరాక్షేపము లైన శాసనాదిదృష్టాంతము లెవియు లభింపనినాఁడు, ఆతనికవిత్వమును బట్టి యాతనికాలమును నిర్ణయింపవలసి యుండు ననుట చారిత్రవేత్తలకు నూత్నవిషయము గాదు. ఇప్పు డిద్దానింబట్టి యాతఁ డెప్పటివాఁ డైయుండునో కనుఁగొందము" అని వ్రాసి కుమారసంభవమునుండి కొన్నిభాగముల నుదాహరించి వానిని బట్టి నన్నిచోడుఁడు నన్నయభట్టునకంటె ముందువాఁడే యని నిర్ణయించుకొనిరి. గ్రంథభాషనుబట్టి గ్రంథకాలము నిర్ణయించుట సత్సంప్రదాయమే. కాని యాభాష గ్రంథకర్తృప్రయుక్త మనఁదగినదిగా నుండవలయును. అట్టినమ్మకము లేనిచో నాభాష ప్రమాణము కానేరదు. రామకృష్ణకవిగా రచ్చువేయించిన కుమారసంభవము భాష కొన్నికొన్నితావులందుఁ గవిప్రయుక్త మయినది కాదేమో యని యనుమానింప నవకాశము కలదు. గ్రంథమునకు మాతృక యేదియో ప్రథమభాగ పీఠికలో రామకృష్ణకవిగారు చెప్పియుండలేదు. ద్వితీయభాగపీఠికలో "కుమారసంభవప్రతులలో నొకటి నాకు నైజామురాజ్యమునఁ బ్రాచీనశాసనశోధనార్థము పోవుచుండఁగాఁ గర్ణాటదేశముననే లభించెను. తక్కినవి రెండును శుష్ఫద్రవిడదేశముననే యఁగపడియె" నని తమకు మూఁడుప్రతులు దొరకినట్లు వ్రాసిరి, గాని యేయేగ్రామములం దేయేగృహస్థులవలన నేయేప్రతులు లభించినవో తెలుపరైరి. ఆప్రతులు కావలసినవారు చూచుట కవకాశము కలుగునట్లు రాజకీయపుస్తకభాండాగారమునందుఁ గాని, యాంధ్రసాహిత్యపరిషత్పుస్తకభాండాగారమునందుఁ గాని, వానిని బోలు మఱియొకపుస్తకాలయమునందుఁ గాని యుంచవలసియుండెను. అట్లును జేయలేదు.

లోకమునకుఁ దెలిసిన తాటియాకుప్రతి యొకటి గలదు. అది తంజావూరుమహారాజా సర్ఫోజి సరస్వతీమహాలులో నున్నది. దీనికిఁ బ్రతి యొకటి రామకృష్ణకవిగారు వ్రాయించుకొన్నా రనుట నిశ్చయము. అట్టిచో రామకృష్ణకవిగారీప్రతిని స్మరింపకపోవుటకుఁ గారణ మే మున్నదో తెలియదు. తంజావూరు పేరైనను రామకృష్ణకవిగారు తలపెట్టలేదు. తంజావూరుప్రతికిని రామకృష్ణకవిగారిప్రతికిని పాఠభేదములు పలుతావులఁ గనఁబడుచున్నవి. వానిలోఁ గొన్నిటి నుదాహరించెద.

౧ ఆశ్వాసము. ౨ పద్యము.

1. హరుఁ డాదిగ సకలచరా, చరమయజీవాళి నెల్ల సతతము గనుమా
తురులుగ వలగతిఁ జేసిన, మహుఁ డీవృత పుణ్యశ్వమతి మత్స్యారికిన్.

రా - కృ - పాఠము.

మూఁడవపాదమునందు "నశగనై" యని తంజావూరిపాఠము.

౧ ఆ. ౧౭ పద్యము.

2. శ్రీపీఠంబున నిడుకొన, శ్రీపాదుక లంచు వ్రాలి సేవించెద నేఁ
బాపహతిఁ జెప్పి పుణ్యాం, బాపాదింపఁగ మల్లికార్జునదేవున్.

రా - కృ - పాఠము.

శ్రీపీఠంబున నిడుకొని, శ్రీపాదుక లిచ్చిలిచ్చి సేవించెద నేఁ
బాపహతిఁ జేసి పుణ్యాం, బాపాదింపంగ మల్లికార్జునదేవున్.

తం - పాఠము.

౧ ఆ. ౨౯ పద్యము.

3. మును మార్గకవిత లోకం,బున వెలయఁగ దేశికవితఁ బుట్టించి తెనుం
గు నిలిపి రంధ్రవిషయమునఁ, జన సత్యాశ్రయునితోట్టి చాళుక్యనృపుల్.

రా - కృ - పాఠము.

మును మార్గకవిత లోకం,బున వెలయఁగ దేశికవితఁ బుట్టించి తెనుం
గును నిలిపి రంధ్రవిషయం,బునఁ జనఁ జాళుక్యరాజు మొదలుగఁ బలువుర్.

తం - పాఠము.

౧ ఆ. ౪౧ పద్యము.

4. మునుమున సత్కవిశాస్త్రము, ననరంగ విలుకానిపట్టినమ్మును బ్రహ్మా
ద్భుతమై తలయూపింపని,యది శాస్త్రమె ములరిపట్టినదియుం గరమే

రా - కృ - పాఠము.

నాలవపాదమునందు-యది శాస్త్రమె సాక్షియుఁ బట్టినదియు స్వరమే.

తం - పాఠము.

౪ ఆ. ౯౮ పద్యము.

5. నలి మొగ్గలు విరిపువ్వులు, నలిలితనుయి మూఁడనొప్పెఁ జంపకమ్ముత్యా
జ్వాలరుచి రేవగ లూరక, వెలిగెడు నుద్దీపదీపవృక్షమువోలెన్.

రా - కృ - పాఠము.

నలిమొగ్గల విరిపువ్వుల,నలలితనుంగా మూఁడనొప్పెఁ జనుపక (జంపకి) ముత్యా
జ్వాలరుచి రేపగ లారక, వెలిగెడు నుద్దీపదీపవృక్షము వోలెన్.

తం - పాఠము.

౧౦ ఆ. ౧౫౯ పద్యము.

6. వడిఁ ద్రిదశాలి నోర్చు డాకవావిరిబీరముగాఁగ రజ్జుఁ జె
ప్పుడు నది నీవుచేసిన తపోవిభవంబున నబ్జగర్భుచేఁ
బడసినవిద్య గాక - - - -

రా - కృ - పాఠము.

వడిఁ ద్రిదశాలి నోర్చు డాకవావిరిబీరముగాఁగ రజ్జుఁ దెప్పుడు నది.

తం - పాఠము.

౧౦ ఆ. ౧౬౩ పద్యము.

7. ఏం డేమిసేయుఁ బంచిన, వాండుండఁగ నిక్కమునకు వధ్యుఁడు గా నా
ఖండలుఁడు గాక యేలిన, వాండుండఁగ నేమిసేయు పరికరం మునిలోన్.

రా - కృ - పాఠము.

ఏం డేమిసేయుఁ బంచిన, వాండుండఁగ నిక్కమునకు వధ్యుఁడు గా నా
ఖండలుఁడు గాక యేసిన, వాండుండఁగ నేమిసేయు నరశర మునిలోన్.

తం - పాఠము.

౧౨ ఆ. ౭౨ పద్యము.

8. నిరుబుతి వారిమాయల కనిం బ్రహ్మమాయ లొనర్చి.

రా - కృ - పాఠము.

నిరుతి (యు) వారిమాయల కనిం బ్రహ్మమాయ లొనర్చి

తం - పాఠము.

ఇట్టిభేదము లనేకము లున్నవి. కొన్ని తావులందు తంజావూరిప్రతిలోఁ దప్పులుగాను సంశయాస్పదములు గాను నున్నపాఠములు కవిగారు సవరించినారు. కాని సవరించినభాగములకు గుఱుతు లేవియు లేకపోవుటచే మూల పాఠము లెవ్వియో కవిగారిపాఠము లెవ్వియో తెలిసికొనుట కాధారములు లేకున్నవి. కొన్నిచోటుల మూలమం దున్నచక్కనిపాఠముల నెఱిఁగియో యెఱుఁగకయో కవిగా రనవసరముగా మార్చినారు. ఈపాఠాంతరముల నితర ప్రతులనుండి తీసికొని రనుకొనుట కట్టిప్రతు లున్నవనుకొన్నను నేప్రతిలో నే పాఠమున్నదో కవిగారు సూచింపలేదు. మనకువలెనే కవిగారికిని తంజావూరు ప్రతి యొక్కటి మాత్రమే లభించియుండు నని యూహించుట కొకహేతువు కనఁబడుచున్నది. తంజావూరుప్రతిలో నేకాదశాధ్యాయమందు నలువదియాఱవపద్యము పిదప నిట్లున్నది.

వృ. తన కని దాఁప కర్థికి సుధానుయపక్వఫలంబు లిచ్చునో
లిన కొనుకాలి వహ్నికిఁ జలింపక మార్గాన నిల్చి కాలు నీ

మనుజులు కొంద ఱాయడవి మ్రాఁకులు కంటెను కష్ట సర్తి నెం
చుం జాగియు నేనని య తలంచు లోభి యెప్పుడు పసికిన్.
క. జానని య తలఁచు పీరుఁడు, జాననియ తలంచుఁ బంద్ర సరిపెట్ల కునున్.

ఇందు మొదటిమూఁడును జంపకమాలాన్త్యపాదములు. తక్కినవి కందపద్యభాగములు. రామకృష్ణకవిగారికి నింతమాత్రమే దొరకినదిగాని లోపించిన భాగములు దొరకలేదు. వేఱువేఱు ప్రదేశములందు దొరకిన మూఁడు ప్రతులలోను నొక్కచోటనే లోపము లుండుట చిత్రము.

ఈకారణములంబట్టి రామకృష్ణకవిగారి పాఠము లన్నియుఁ బ్రమాణములు కానేర వని చెప్పవలసియున్నది.

నన్నయాదుల కవిత్వమునకుఁ గూడ నీదోషము పట్టియే యున్నది. కావునఁ బాఠములఁ జక్కఁగఁ బరీక్షించి కవిప్రయుక్తపాఠము లనఁదగినవానిని మాత్రమే ప్రమాణములుగా గ్రహింపవలసి యున్నది. అట్టిపాఠము లున్నను నన్నిచోడుఁడు నన్నయభట్టారకునికంటెఁ బూర్వుఁ డని చెప్పఁజాలవు. రామకృష్ణకవిగారును వీరరాజుగారు నుదాహరించిన ప్రయోగములు నన్నిచోడుఁడు ప్రాచీనకవి యనుటకే పనికివచ్చును గాని యాతఁడు నన్నయభటుకంటెఁ బూర్వుఁ డనుటకుఁ బనికిరావు. నన్నిచోడుఁడు ప్రాచీనకవి కాఁడనువా రెవరును లేరు. ఆతఁడు ప్రాచీనకవియే గాని నన్నయభట్టునకుఁ దరువాతివాఁడు తిక్కనసోమయాజులకు ముందువాఁడు.

జ. రామయ్య.

---

## అనుబంధము.

గుంటూరుజిల్లా పెద్దచెఱుకూరుగ్రామములో నొకవీథిలోనున్న
రాతిమీఁది శాసనము.

(243 of 1897.)

స్వస్తిశ్రీస్తనచందన
లిప్తశ్రీశస్తదివ్యా
నాభ్యాబ్జాతో జగతి
లతికాబీజంబ్రహ్మో

రాష్ట్రాపతిస్సోభూత్ ॥
దానశౌర్యగుణాక
స్వంసిగూపయున్నివా
త్మనః । తస్యతాద్రిగ్విధా
దంగాద్దోద్వర్ణయాన్త్మ్రియా
న్వయః । అత్రసూర్యాన్వర్ణ
న్మనుస్తస్మాదిక్ష్వాకుస్త
త్కుల్తేన్త్రిపః । అదేవిత్క
రికాలాఖ్యచోడస్త
స్యాన్వయేజని । చోడ
బల్లిన్త్రిపస్తస్మాన్నన్నిచోడ
స్తదాత్మజః । సూరభూప
స్సుతస్తస్యరాజరాజమహీ
పతిః । తస్యానుజోఘటంకార
న్త్రిపోహంకారశంకరః । తస్య
చోడమహాదేవీప్రియాత
త్తనయోనయీ । మల్లిదేవ
న్త్రిపోయత్త్రతౌత్రధర్మార్ణవస్య
లియ్యతా । తస్యకాంతామహా
దేవీనన్నిచోడస్తయోస్సుత
ః । స్వగ్రహీదుగ్రవీరారిస్వగ్ర
హీద్విజయశ్రియం ॥ గంగాదే
వీప్రియాతస్యయాదేశమ
తిచక్రమే । తాభ్యాంభూచక్ర
శక్రోభూస్మల్లిదేవమహీశ్వరః ।
ధర్మసంస్థాపనార్థాయ గా (౦)
గేయఃకలియుగేపునః ॥ స్వ
స్తిచరణసరోరుహావిహితవి
లోచనత్రిలోచనప్రముఖా
ఖిలప్రిధ్వీశ్వరకారిత

కావేరీతీరకరికాలకుల
రత్నప్రదీపాహితకుమా
గజాంకుశకంద్దుకూరిపు
రనరేశ్వరం కాశ్యపగోత్రపా
కనాంటివిషయ ఏకవింశ
తిసహస్రగ్రామావనీవల్ల
భభయలోభదుర్లభసత్య
రత్నాకరనామాది సమస్తప్ర
శస్తిసహితం శ్రీమన్మహామ
ండలేశ్వరమల్లిదేవచోడ మ
హారాజ్ఞాపురాణన్యాయమీమా
ంసాంగ మిశ్రితవేదధర్మశాస్త్రా
యుర్వేదాద్యష్టాదశవిద్యాస్థా
నసప్తశతోత్తరసహ
స్రభాగపరిపూర్ణస
ప్తశతాగ్నిహోత్రాలంకా
రైనమాదిగుణాగ
ణశోభితేషు గ్రామా
గ్రహార శ్రీవర్ధమా
నాయ శ్రీభీమేశ్వర
దేవాయ అంగభో
గార్థండగ్గాంబికా
నందనేనమారాయ
నేనపూర్వదత్తప
రిదపూండినామ
గ్రామోష్టదిక్సీమాస
హితస్సర్వకరపరి
హారమాచంద్రార్కం ద
త్తః తత్కులీనరాష్ట్రకూ
టప్రముఖాన్ కుటుం

బినస్సమాహూయే
త్థమాజ్ఞాపయతివి
దితమస్తువః శ్రీమ
ద్గణపతిక్ష్మేశః ప
రిదపూండిమిమం
పునః భీమేశ్వరాయ
దేవాయప్రాదాదాచ
ంద్రతారకం । బహు
భిర్వ్వసుధాదత్తా బ
హుభిశ్చానుపాలితా
యస్యయస్యయ
దాభూమిస్తస్యత
స్యతదాఫలం ఇతి
సంచింత్యమల్లిదేవ
చోడమహారాజ్ఞాస
మధిగతపంచమహా
శబ్దమహామండలేశ్వ
ర వీరరాజేంద్రనాక
తియ్యగణపతి మహా
క్షోణీశస్యధర్మ్మాత్ర
ంక్రితం । స్వదత్తాద్ద్వి
గుణంపుణ్యంపర
దత్తానుపాలనం
పరదత్తాపహారే
ణస్వదత్తం నిష్ఫల
ంభవేత్ ॥ స్వదత్తా (ం) పర
దత్తాంవా యోహరేత
వసుంధరా (ం) షష్టిర్వ్వర్ష
సహస్రాణివిష్టాయాం
(ం) జాయతేక్రిమిః ॥

శ్రీ దేవాయ నమః

# కవిరాజశిఖామణి—కావ్యవిశేషములు.

(ఆంధ్రసాహిత్యపరిషద్వార్షికోత్సవసమయమునందు తణుకుపురమున 11-10-1924 తేదిని జదువఁబడినది.)

## ఉపోద్ఘాతము.

ప్రాచీనాంధ్రకవులలో నన్నిచోడదేవుఁ డను మహారాజకవి యొకఁడు చేరి యున్నాఁ డనువిషయము పందొమ్మిదవశతాబ్దియందున్న యాంధ్రలోక మెఱుఁగ దనియే చెప్పవచ్చును. పెక్కండ్రు నన్నిచోడరాజులనామములను వెలువరించిన శాసనపరిశోధకులకు నయితే యిక్కవిరాజశిఖామణియుదంతమును దెలుపు శాసన మొక్కటియు నేఁటికిని లభించియున్నట్లు గానరాదు.

విషయ మిట్లుండ, ఇరువదియవశతాబ్దిప్రారంభమున—"నన్నయభట్టునకు నూఱేండ్లు ముందున్న రాజకవిచంద్రుని గ్రంథ మొకటి లభియించె—" నను వృత్తాంతము వార్తాపత్త్రికలయందు ప్రకటింపఁబడి, యాంధ్రప్రపంచ మంతయు నమితసంభ్రమాశ్చర్యాదులపా లగున ట్లొనర్చెను.

గీర్వాణకవితాసతికి వాల్మీకిమహర్షి *జనకుఁ డని భారతవర్ష మంతయు విశ్వసించి యుండినట్లే, ఆంధ్రకవితాకన్యకకు నన్నయభట్టారకుఁడు తండ్రి యని యాంధ్రదేశ మెల్ల నమ్మి యుండెను. ఏతద్విశ్వాసమునకు విరుద్ధముగా, పందొమ్మిదవశతాబ్ది కడపటిభాగమున విద్యాధికు లగువిమర్శకులు గొందఱు నన్నయభట్టు ప్రథమాంధ్రకవి గాఁ డనియు, నతనికి మున్ను దెలుఁగునఁ గవిత్వమే లేని యెడల నన్నికట్టుదిట్టములతో నంతనిర్దుష్టముగా నూతనముగా గ్రంథరచన సేయుట నన్నయభట్టునకుఁ గాని, మఱియెవ్వరికిఁ గాని సాధ్యమై యుండ దనియు - - - వ్రాసి, యాంధ్రవాఙ్మయచరిత్రమున నభినవప్రకరణము నొక

*వేదములయం దనేకచ్ఛందములనానాను లుండుటయే కాక వేదములలో ననేకభాగములు ఛందోబద్ధములై యుండుటచే ప్రథమకవి వాల్మీకి గాఁడని కొందఱయభిప్రాయము. రచనాదివిశేషములనుబట్టి భారతముకంటె రామాయణమే యర్వాచీన మని కొందఱయాశయము. వాల్మీకికంటె మున్ను కవు లుండి నట్లు రామాయణగ్రంథమే చెప్పుచున్నది. దానిచర్చ కిది యదనుగాదు. కాని, వాల్మీకిని వ్యాసుఁడు గాని, వ్యాసుని వాల్మీకి గాని పేర్కొనకుండుట యాశ్చర్యవిషయముమాత్ర మగును.

దానిని జేర్చిరి. ఈవిమర్శనప్రకరణము దేశమునఁ గొంతకలవరపాటును జని యింపఁ జేసెను.

ఇట్టిసంచలనసమయముననే పైని వ్రాసిన 'ప్రాచీనగ్రంథసంపాదన వృత్తాంతము' పత్త్రికలయందు ప్రకటింపఁబడి యాంధ్రదేశము నొక్కసారి యుయ్యాలలూఁగించెను. కొంద ఱాప్రకటనమును గని పెదవులు విఱిచిరి. కొందఱు గ్రంథసంసిద్ధికై యెదురు చూచుచుండిరి. కొందఱు నన్నయకుఁ బూర్వపుఁ గవిపేరిట గ్రంథమే సృష్టింపఁబడుచున్న దని వాకొనఁజొచ్చిరి.

క్రీ. శ. 1909-వ సంవత్సరమున—"కుమారసంభవము, నన్నిచోడదేవ ప్రణీతము—" అనుశీర్షికతో నొకగ్రంథము (ప్రథమభాగము) ముద్రితమై ప్రకటింపఁబడియెను. దానిముఖపత్త్రమునందును, పీఠికయందును నగ్రంథకర్త క్రీ. శ. 940 సం॥- అనఁగా నన్నయభట్టునకు నూటేఁబదేండ్లకు మున్నుగ నున్నవాఁ డని వ్రాయఁబడియుండెను. అందులకవిత్వము ప్రాచీనతానామము యుండుటంజేసి దాని నాధునికులు సృష్టించుచున్నా రన్నప్రవాదము చల్లఁగా నడఁగంటిపోయెను. భాషాభిమాను లాగ్రంథ మేనాఁటిదో నిశ్చయింపఁ బూర్వగ్రంథశాసనాదులను బరిశీలింప దొరఁకొనిరి.

భట్టారకమహాశయునికిఁ బూర్వము తెనుఁగునఁ గవిత్వమే లే దని విశ్వసించియున్నయాంధ్రుల హృదయక్షేత్రములయందు 'ఆతనికి మున్ను తెలుఁగు కవిత గలదు.' అనువాక్యబీజముల నావాసించుటయే మొదట దుర్ఘట మయ్యెను. ఎట్టకేలకుఁ బరిశోధనములు వెల్లివిరిసినకొలఁది నవి నాటుకొన, "అతనికిఁ బూర్వ మగ్రంథములు లేవు గాని స్వల్పముగ పాటలు, పద్యములు నుండినవి." అనుభావాంకురములు క్రమముగాఁ దలసూపెను. ఇట్టిచో, "నన్నియకు మున్ను ప్రబంధము లుండెడివి" అనుఫలకుసుమతీవలు లేకెత్తుటకుఁ గాలచక్ర మింకను దొరలవలయు నేమో!

ప్రస్తానమున నున్నకుమారసంభవము ప్రకటింపఁబడినతరువాత విద్యాధికులు పలువురు కడుంగడు నోపికమై శాసనాదులను బరిశోధించి, తత్కర్తయగు నన్నిచోడఁడు నన్నియభట్టునకుఁ దరువాతివాఁ డనియు, తిక్కనకుఁ బూర్వుఁ డనియు నిశ్చయించిరి. నేఁటివఱకును నన్నిచోడకవికాలమునుగూర్చి కావింపఁబడిన విమర్శములయం దొక్కటియు నిర్బాధక మగునొక్కయాధారముతో నైనఁ గూడినదిగా నుండలే దనియు, నాతఁడు నన్నియకుఁ బూర్వుఁ డయియే యుండు ననియు నిరూపించుచు నేనొకవిమర్శమును వ్రాసితిని. అది మచిలీ

పట్టణములోని 'శారద' యందు (మొన్నటి ... ... ...
ప్రకటింపఁబడినది గావునఁ గవికాలమునుగూర్చి యిచ్చట మరలఁ జర్చింపనైతి.

ప్రస్తుతవ్యాసము.

ఇప్పుడు—నన్నిచోడమహారాజకవి తనకావ్యము నేరూపమునఁ దీర్చి యున్నాఁడు? దానియవతారిక యెట్టున్నది? ఇతనికాలమున నంధ్రభాషకుఁ గలపదపరికరసంపత్తి యెట్టిది? అందలఛందోవ్యాకరణాది విశేషము లేమి?— ఇత్యాదివిషయములుమాత్ర మీవ్యాసమునఁ బ్రశంసింపఁబడుచున్నవి.

కుమారసంభవము ప్రబంధము

కవిరాజశిఖామణి తనకావ్యమును ప్రబంధరూపమున మనోహరముగాఁ దీర్చియున్నాఁడు. ఆశ్వాసాంతగద్యముల—"కుమారసంభవకథ"—అని వ్రాసికొనియున్నను, తాను వ్రాయునది ప్రబంధమే యని గ్రంథావతారికయం దిట్లు చెప్పికొనియున్నాఁడు:—

ఉ. "జంగమమల్లికార్జును నిసర్గకవిస్తవనీయసూక్తియు
క్తింగొనియాడి - - - - - - - - - - - - - -
భంగిగ విస్తరించెదఁ బ్రబంధము సద్రసబంధురంబుగన్."

దీనినిబట్టి నన్నియనన్నిచోడకవులకుఁ బూర్వమే యాంధ్రకవితాసీమంతిని, గీర్వాణాద్యన్యకవితాసతులతోఁ పాటు మనోహరాలంకారవిభూషితయై, త్రిలింగ వాఙ్మయరంగమునఁ బ్రబంధభూమికం గైకొని స్వతంత్రప్రచారము సలుపఁదగి నంతవయఃపరిపాకము నందినప్రోఢయై యుండె నని విశద మగుచున్నది.

గ్రంథావతారిక.

ఇప్పటికి మనకుఁ దెలిసినంతవఱకు నన్నిచోడనికుమారసంభవములోని యవతారికయే యితరాంధ్రకవులగ్రంథములలోని యవతారికలకు మార్గదర్శిని యై యుండినట్లు గానవచ్చుచున్నది. ఎట్లన-ఇందు, ఇష్టదేవతాప్రార్థనము, గురుచరణాభివందనము, పూర్వకవిస్తుతి, పండితసంభావన, కుకవినింద, కావ్యనిర్మాణప్రశంస, అష్టాదశవర్ణనాదికవివరణము, కృతిసమర్పణవిధానము, స్వకీయకులగోత్రాద్యభివర్ణనము, నిజగురువైదుష్యాభినుతి, షష్ఠ్యంతములు, కుమారసంభవకథాసంగ్రహము, కథారంభము—క్రమముగాఁ జేయఁబడినవి. పిమ్మటికవు లిట్టివీనిలోఁ దమకు వలయువాని ననుసరించి పారంపర్యముగఁ దమగ్రంథములయం దిష్టదేవతాస్తుత్యాదులను గల్పించుకొనుచువచ్చినట్లు గానగుచున్నది. (చోడనికిఁ బూర్వమును నిట్టిపద్ధతు లుండియుండును.)

## ఇష్టదేవతాప్రార్థనము.

కవి నన్నెచోడరాజు శైవుఁడు గావునఁ దన గ్రంథమున మొదట మహేశ్వరునిఁ బ్రధానదైవతముగా స్తుతించెను. పిమ్మట — హరి, అజ, రవి, గజానన, షణ్ముఖ, మార, గిరిజా, సరస్వతీస్తవములను వరుసగా నొక్కొకపద్యమునఁ గావించెను. ఇది, నన్నయకుఁ బూర్వము దేశికవులు కావ్యారంభమున నొనర్చుచుండిన ప్రాచీనస్తోత్రపద్ధతి గా నుండినట్లు తోఁచెడి. మఱియు నన్నయభట్టు తనకు ముందున్న యీసనాతనాచారమును విడువలేక — దానిని గొంత సంస్కారమునకుఁ దెచ్చి — సంగ్రహపఱచి,

"హరి, హర, అజ, గజానన, నార్క, షడానన, మార, సరస్వతీ,
గిరిసుతాదిక దేవతాతతికి న్నమస్కృతిఁ జేసి - - - - - -"

అని సగముపద్యమునఁ బ్రాచీనాచారంబునకు నిలుపుఁజేసి కేవలనమస్కారముతో వారిస్తోత్రమును సాగించినట్లును (కేవలమహేశ్వరాదులమాత్రము చోడకవి స్తోత్రవిధానమును గొంతవఱకు ననుసరించినట్లును) పిమ్మట నది విరళమై (తిక్కనాదులనుండి మాఱిపోయి) నట్లును గానవచ్చుచున్నది. నన్నయభట్టారకుఁడే ప్రథమాంధ్రగ్రంథనిర్మాతయై యుండెనేని, నపూర్వముగాఁ దానుసృష్టించుచుండిన యమ్మహాకావ్యమునఁ దాను స్తుతించు దేవతల నందఱను పరమభక్తియుక్తిని సావధానముగా నొక్కొక్కపద్యమునను బ్రశంసించియే యుండును గాని యేకపద్యార్థముననే స్తుతించియుండఁడు.

నన్నెచోడనిగ్రంథములోని యిష్టదేవతాప్రార్థనమున నొకవిశేషము గన్పట్టెడిని. ఈశ్వరేతరులకు తమగ్రంథములను గృతియిచ్చువారనేకులుండఁగను, కృత్యాదిని దాము స్తుతించు దైవతములు, తత్తత్కృతినాయకుల రక్షించునట్లు వ్రాయుదురు. చోడకవి తనగ్రంథమును నిజగురువగు జంగమమల్లికార్జునునకు గృతిగ నిచ్చియుండియు, నాయామహేశ్వరాది దేవతలు తత్కృతిపతిని గాచునట్లు వ్రాసియుండలేదు. ఈవిధాన మపూర్వముగఁ గన్పట్టుచున్నది. *"గురుర్బ్రహ్మా గురుర్విష్ణుః, గురుర్దేవో మహేశ్వరః - -" అనుసూక్తిచొప్పున నాతఁడు వారియందభేదమును బాటించియున్నాఁడు. కావుననే

*పింగళిసూరనార్యుఁడు తనరాఘవపాండవీయమహాకావ్యమును విరూపాక్షదేవున కంకితమిచ్చియుండియుఁ, దద్గ్రంథమును వ్రాయఁ దన్నుఁ బురికొల్పిన యాకువీటి పెద్దవేంకటనృపాలు నాయాదైవములు రక్షించునట్లు వ్రాసియున్నాఁడు.

చ. "గురువున కిష్టదైవమునకుం బటికం గృతిసెప్పి పుణ్యమున్
వరమును దేజముం బడయవచ్చు జగంబుల నిశ్చయంబు; స
ద్గురువును, నిష్టదైవమును గూర్చని జేసెదఁ గాన; నాకుఁ గా
కొరునకు నిట్లు సేకుఱునె యొక్కట లాభము లెన్ని యన్నియున్."

అని తనజన్మము సార్థకమొందువిధమును మనవారిఁ దెలిపికొనియున్నాఁడు.

పూర్వకవిస్తుతి.

గురుసంకీర్తనానంతరము మన మహారాజకవిరాజు పురాతనకవిస్తోత్రము ననిదంపూర్వముగా రచించియున్నాఁడు:—

క. "కవితామృతోదధిసారాంబుధిఁ, గవిసజ్జనకనకు వస్తుకావ్యప్రభవిం
గవితారంభంబుల న, త్యువ్వు లభినందించెదను నాదికవి వాల్మీకిన్."

క. "వేదాంతభారతపురా, ణాదులు సేయుడొక పేర్మి యనుచుం బొగడం
గాదెట్ట*నజుండు నోవని, వేదము లేర్పఱిచె నంద్రు వేదవ్యాసున్.

క. "భాసురమతి వాల్మీకి, వ్యాసాదులు సనినజగతి నరకవితాసిం
హాసన మెక్కి కవీంద్రుల, దాసులుగా నేలెఁ గాళిదాసుఁడు వేడ్కన్."

క. "భారవియు, వస్తుకవితను, భారవియును బరగి రుదయపర్వతశిఖరా
గ్రారోహణేంద్రకీలన, గారోహణవర్ణనల జనారాధితులై."

క. "క్రమమున నుద్భటుఁడు గవిత్వము మెఱయఁ గుమారసంభవము సాలంకా
రము గూఢవస్తుమయకా, వ్యముగా హరులీలఁ జెప్పి హరు మెచ్చించెన్."

క. "కరములు దునుముఁడుఁ బరముని, వరదునిఁగాఁ గొలిచి కవితవలన నెమగుసీకా
గరములు వడసి జగంబులఁ, బరగె మహాకవి యనంగ బాణుఁడు వేడ్కన్."

క. "మును మార్గకవిత దేశం, బున నెలయఁగ దేశికవితఁ బుట్టించి తెనుం
గును నిలిపి రంధ్రవిషయం, బునఁ జనఁ జాళుక్యరాజు మొదలుగఁ బలువుర్."

(కవిరాజశిఖామణి గావించినకవిస్తుతిపద్యములు కడపటికిఁ గందములే)

పైపద్యములలోఁ గడపటిపద్యముతరువాత నాంధ్రకవులను స్తుతించిన పద్య మొకటి పోయియుండు నని భావించి, కీ. శే. వీరేశలింగముపంతుల వారు కవిచరిత్రమున నిట్లు వ్రాసిరి:—

"కవి వాల్మీకి, వ్యాసుఁడు, - - - మొదలగుసంస్కృతకవులను గొండఱిని ప్రశంసించి, తెనుఁగుకవులను విడిచిపెట్టెను. అయినను సంస్కృతకవులను జేర్కొన్నతరువాత,

---

* ఇచ్చట టకారమును దేలఁబలుకవలయును.

క. "మును మార్గకవిత లోకం, బున వెలయఁగ - - -" (పైపద్యమును జూడుఁడు)

"అనుపద్యమును, దానితరువాత,"

చ. "సురవరులం గ్రమంబున వచోమణిసంహతిఁ బూజచేసి మ
ద్గురుచరణారవిందములకుం దగ సన్నతిఁ జేసి కొల్చి వి
స్తరమతులం బురాణకవిసంఘము నుత్తమమార్గసత్కవీ
శ్వరులను దేశిసత్కవుల సంస్తుతిసేసి మనోముదంబునన్."

"అనుపద్యమును పుస్తకములోఁ గానఁబడుచున్నవి. ఈపద్యములలోఁ గవి చెప్పిన దేవతాస్తుతియు, గురువందనమును, పురాణకవిప్రశంసయు, సంస్కృతసత్కవీశ్వరులస్తోత్రమును పుస్తకములోఁ గానఁబడుచున్నవి. కాని దేశిసత్కవుల సంస్తుతిమాత్రము కనఁబడకున్నది. దేశిసత్కవుల స్తుతింపనిది స్తుతించితి నని కవి యబద్ధము వ్రాసియుండఁడు. అందుచేత 'మును మార్గకవిత' అను పద్యమునకును 'సురవరులన్' అనుపద్యమునకును నడుమ తెలుఁగుకవులను స్తుతించిన పద్య మొకటి యుండియుండవలెను - - - -" (అని వ్రాసిరి.)

పైపంతులవారి వ్రాఁతలోని 'దేశిసత్కవుల సంస్తుతిమాత్రము కనఁబడకున్నది. కవి యబద్ధము వ్రాసియుండఁడు - -' మొదలగువాక్యములవలన ననేకుల కనేకభావము లుదయించినవి. కొన్నికథలు నయితము పుట్టినవి. ఆభావములతోఁగాని, అక్కథలతోఁగాని మన కిప్పుడు పని లేదు. "పై స్తుతిపద్యములలో నొకపద్యము పోయియుండునా?" అనువిషయముమాత్రమే ప్రస్తుతము విచార్యము.

పైనన్నిచోడనిపూర్వకవిస్తోత్రవిధానము సూక్ష్మముగఁ బరికించువారికి, శైవుఁ డైనయారాజకవి,

1. సత్కవులు వాల్మీకి నభినందింతురు.
2. వ్యాసుఁడు వేదముల నేర్పఱిచె నందురు.
3. కాళిదాసుఁడు కవులను దాసులుగా నేలెను.
4. పర్వతవర్ణనమున భారవి వినుతి కెక్కెను.
5. ఉద్భటుఁడు కవిత్వముచే హరుని మెప్పించెను.
6. బాణుఁడు కవిత సెప్పి కరములు వడసెను.

అని యమ్మహాకవుల కవిత్వచారిత్రాదులనుమాత్రమే యభివర్ణించినట్లు గానవగును గాని యం దొక్కనికేని యాతఁడు నమస్కరించినట్లు గానరాదు. అట్లే,

"చాళుక్యరాజాదులు పలువురు దేశికవితను బుట్టించి నిలిపిరి" అని యాంధ్ర కవితాపతి జనపచారిత్రమునుసయితము కవి చెప్పియున్నాఁడు. పైచంపకమాల లోని "దేశిసత్కవులసంస్తుతి" అనునది యదియే. అంతేయ కాని యాంధ్ర కవిస్తుతిపద్యము వేఱేదియు పోయి యుండదు.

మొదట స్తుతింపనివారిని స్తుతించినట్లు తరువాత వ్రాసికొనునాచారము మనలో విశేషముగాఁ గలదు. మచ్చున కొకటి:—

తెనాలి రామకృష్ణుఁడు తనపాండురంగమాహాత్మ్యమున, ఇష్టదేవతాస్తుత్యాదికము నెఱపినతరువాత—"అని నిఖిల....దైవతంబులఁ గొనియాడి........ వంచకులగుకొంచెపుంగవుల రిసళి నదలించి... పరమవైష్ణవరత్నంబులకు వంద నం బాచరించి....అని వ్రాసియున్నాఁడు.

ఇందు మొదటిదేవతాస్తుత్యాదికమంతయు గ్రంథమునఁ గానంబడు చున్నది గాని పరమవైష్ణవరత్నంబుల నుతించినపద్యముమాత్రము గానరాకున్నది. ఇంతమాత్రమున 'రామకృష్ణకవి యబద్ధము వ్రాసియుండునా?' అని మనము సంశయింపఁబనిలేదు. ఆవాక్యమే యాతనివైష్ణవస్తుతి. నన్నిచోడకవిరాజు ననేకస్థలంబుల ననుకరించిన మనరామలింగకవి యీస్తోత్రవిధానమున సయితమాతనినే యనుకరించి, చోడనిపైస్తుతిక్రమము తనస్తుతియట్టిదే యని యు, నం దొకపద్యమును బోలే దనియు మనకుఁ దెల్పుచున్నాఁడు!

ఇది యిట్లుండ, మా(పీఠికాపుర)మహారాజావారు, తంజావూరిప్రతినుండి యొకప్రతిని వ్రాయించి తెప్పించినారు. అది యిప్పుడు శ్రీసూర్యారాయ నిఘంటుకార్యస్థానమున నున్నది. ముద్రితపుస్తకమున నున్నస్తుతిపద్యములే దానియందును నున్నవి. వేఱొకపద్యము దానియందును లేదు. మఱియు,

"No. 189.

పద్యకావ్యం.

పద్యకావ్యకుమారసంభవం — తెలుగులిపి-ఆకులు 127 పూర్తి."

అని యావ్రాఁతప్రతిమీఁద వ్రాయఁబడియున్నది. 189 అనునది గ్రంథసంఖ్య. 127 ఆకులును వరుస దప్పకుండ నున్న వని పై 'పూర్తి' అనుపదము దెలుపుచున్నది. కావున పైస్తుతిపద్యములలో నొకటిగాని, మఱికొన్నిగల యొక యాకుగాని పోయిన వని తలంప నక్కఱ లేదు. 'మును మార్గకవిత' అనుపద్యమే యాంధ్రకవిస్తుతిపద్యము. తక్కినవానివలెనే యదియుఁ జరిత్రాత్మకము.

ఈపూర్వకవిస్తుతివిమర్శనసందర్భమున నింకొకవిషయము చర్చింపఁబడ వలసియున్నది:—

శ్రీ బుఱ్ఱా శేషగిరిరావుపంతులుగారు, 'ఉద్భటదేవచరిత్రము' అను కర్ణాటగ్రంథమును దాము చెన్నపురి ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారమున (వ్రాఁతప్రతిని) చూచితి మనియు, ఆతఁడు కర్ణాటకకవి యేమో యనియు, నన్నిచోడఁడు నుతించిన 'ఉద్భటుఁ' డాతఁడై యుండు నేమో యనియు, కన్నడభాషయం దాతఁడు కుమారసంభవము వ్రాయఁగా దానిని నన్నెచోడఁడు తెలుఁగునకుఁ దెచ్చెనేమో విచారింపవలసి యున్న దనియు నొకప్పుడు నాతోఁ బ్రస్తావించినారు. అప్పుడు నేను, "ఆయుద్భటదేవచరిత్రమునఁ జెప్పఁబడిన యుద్భటదేవుఁడు, రాజో కవియో యెట్లు నిర్ధరించితి రనియు, ఒకవేళ కవి యే యని యూహించినను వాల్మీకి, వ్యాస, కాళిదాస, భారవి, బాణులనడుమ—అనఁగా సంస్కృతకవులనడుమ—నీకర్ణాటకకవి యెట్లు దూఱి యుండు ననియు, దేశభాషాకవుల నెవ్వరిని స్తుతింపని మనకవిచంద్రుఁడు, ఆకన్నడకవి నెవ్వనినో తెచ్చి, కడపట నైన వ్రాయక గీర్వాణకవులమధ్యమున నెట్లు చేర్చియుండు ననియు, సుప్రసిద్ధుఁడై, కాశ్మీరజయాపీడసంస్థానవిద్యాపతిపీఠము నలంకరించిన మహాకవి యుద్భటుఁ డనువాఁడు సంస్కృతభాషను సాలంకార మగుకుమారసంభవమును రచియించినట్లు గీర్వాణాలంకారశాస్త్రవ్యాఖ్యానగ్రంథములు ఘోషించుచుండ, ఉద్భటదేవుఁ డనుపేరు గలవాని నెవ్వనినో—కవియో ప్రభువో నిశ్చయింపరానివానిని ఇప్పట్టునఁ బేర్కొన నేల యనియు వారిని బ్రశ్నించితిని. ఆ గ్రంథమును జూచినపిమ్మట నాప్రశ్నములకుఁ బ్రత్యుత్తరము నిచ్చెద మని వారు సెలవిచ్చిరి. కాని వారిదైన యీయభిప్రాయమే 'భారతి'పత్రిక 7-వ సంచికయందు 'ఆంధ్రకవిత్వచరిత్రము' అనువ్యాసమున నుదాహరింపఁబడి సమర్థింపఁబడినది. శ్రీ శేషగిరిరావుపంతులుగారు గాని, 'ఆంధ్రకవిత్వము'ను వ్రాయుచున్న నారాయణమూర్తిపంతులుగారుగాని పైప్రశ్నములకు దృష్టాంతపూర్వకము లగుసదుత్తరముల నిచ్చుదనుక వారియభిప్రాయములు సమంజసము లనుటకు వలనుపడదు.

## కుకవినింద.

చోడకవికుమారసంభవమునఁ గుకవినింద గావింపఁబడినది. ఈయాచారము మన తెలుఁగు పొత్తములలో నేనాఁడు పుట్టినదో తెలిసికొనునాధారము గానరాదు. పూర్వకాలమున మతవైషమ్యాదులవలనఁ గలిగిన పరస్పరద్వేషాదులే యిట్టినిందలు పుట్టుటకుఁ గారణములై యుండును. కాలక్రమమున నట్లు నిందించుట గతానుగతిక మగుచాచార మయ్యె నని తోఁచెడిని. సంస్కృతాం

గ్లేయాద్యన్యభాషాగ్రంథములయందును నిట్టినిందించుటలు గలవు. కుకవినింద లేని యాంధ్రకావ్యములును గలవు.

కావ్యప్రశంస.

కావ్యనిర్మాణమునుగూర్చి నన్నిచోడకవిరాజు మనోహరముగఁ బ్రశంసించియున్నాఁడు. అందొండు రెండు పద్యములు మాత్ర మిచ్చుటఁ జూపఁబడుచున్నవి:—

చ. “సరళము గాఁగ భావములు జాను తెనుంగున నింపు పెంపుతోఁ
బిరిగొన వర్ణనల్ ఫణితిఁ బేర్కొన నర్థము లొత్తగిల్ల బం
ధురము గఁ బ్రాణముల్ మధురమృదుత్వరసంబునఁ గందళింప న
క్షరములు సూక్తులార్యులకుఁ గర్ణరసాయనలీలఁ గ్రాలఁగన్.”

(ఆంధ్రభాషావధూటి జాను తెనుంగుపోయుగమునకు నిక్కవిరాజశిఖామణి గ్రంథమే మేలినిధాన మని యీతనిగ్రంథమును జదువువారి కెల్లఁ దెల్లము గాఁగలదు.)

ఆదిపర్వములోని,

ఉ. “సారమతిం గవీంద్రులు ప్రసన్నకథాకలితార్థయుక్తి లో
నారసి మేలు నా నితరు లక్షరరమ్యత నాదరింప నా
నారుచిరార్థసూక్తినిధి నన్నయభట్టు తెనుంగున న్మహా
భారతసంహితారచనబంధురుఁ డయ్యె జగద్ధితంబుగన్.”

అనునన్నియభట్టారకునిపద్యము పైనన్నిచోడనిపద్యమును జూచుచున్నది. మఱియు,

క. “చతురోక్తుల నుత (పద) బహు, గతుల నలంకారభావకాంతిరసార్థో
న్నతిఁ గృతి నతిరసికులు పర, సతిగతి నెఱఁగింపవలదె సౌభాగ్యమునన్.”

అనుమనయాంధ్రకవిచంద్రునిపద్యమును విలోకించి,

క. “మృదుపదగతియుం రసభా,వద పేర్చిం పణ్యవనిత వోల్ కృతి సౌంద
ర్యద చాతుర్యద కణియునె, విదగ్ధబుధజనదమనము నెళెయొలె వేడా?”

అనుకన్నడకవీంద్రునిపద్యము మో నుఱవాంచుచున్నది.

అష్టాదశవర్ణనాదికము.

నన్నిచోడనినాఁటికే మనయాంధ్రభాషావధూటికి మహాకావ్యలక్షణము లన్నియుఁ గుదురుకొని యున్నట్లు “క. * వనజలకేళీరవిశశి........దాత్యవర్ణ

* ప్రౌఢకవిమల్లనరుక్మాంగదచరిత్రమున “వనజలకేళీశశిరవి తనయోదయ...” ఇత్యాదిగ నల్పభేదముతో నిట్టిపద్యమే కలదు.

నాష్టాదశముగా" బరిపూర్ణం బై, దశప్రాణంబుగ సప్రాణం బై, నవరసభావ భరితం బై, షట్త్రింశదలంకారాలంకృతం బై, రమణీయం బైనదివ్యకథారంభంబు ........" అనుకుమారసంభవములోనివ్రాఁతవలనఁ దెలియ నగుచున్నది. చిర కాలము మహోన్నతదశ ననుభవించిన గీర్వాణకవితాసతీమతల్లికతోడి సంత తసాహచర్యముననే యీయామె కీవిన్నాణము లన్నియుఁ బన్నువడి యున్న వని యెన్న నగును.

## కవిబిరుదములు.

శ్రీరామాదుల కెనవచ్చుపుణ్యశ్లోకధనుఁ డైన మనరాజరాజనరేంద్ర చోడ దేవుని ప్రభు త్వంపుబిరుదములు మనప్రసంగమునకుఁ దగిలి వచ్చునవి గావు. "కవిరాజ శిఖామణి", "వివేకాబ్జజుఁడు...." ఇత్యాదు లీతనికవిత్వంపుబిరుదము లై యున్నవి. వీరేశలింగముపంతులవారు, "ఈకవి, కవిరాజశిఖామణి యన్న బిరు దును తానే పెట్టుకొనెను.," "ఇతఁ డాత్మస్తుతియందుఁ గొంచె మిష్టము గల వాఁడు." అని కవిచరిత్రమున వ్రాసియున్నారు.

మన దేశమునఁ బండితులకును, కవులకును వశ్యపరిపూర్ణము లైనయాత్మ శక్తులను గ్రంథస్థములుగా నొనరించుకొనుట, చిరకాలమునుండి పరంపరగా వచ్చుచున్నయాచారమై యున్నది. వాల్మీకిమహర్షి ? తననోటనే కవిత్వము వెడ లిన దనువిషయము నెంతో చమత్కారముగాఁ బొగడికొని యున్నాఁడు. కృష్ణద్వైపాయనుఁడు భారతమునఁ దన్నుఁ దా నెన్నోవిధముల స్తుతించుకొ న్నాఁడు. ఇట్లే గీర్వాణకవులు పెక్కండ్రు తమతమశక్తులను దామే వెల్లడించు కొని యున్నారు. మఱియు, విద్వచ్ఛిరోమణియు, వ్యాఖ్యాతృచక్రవర్తియు నగు మల్లినాథసూరి, రఘువంశవ్యాఖ్యానావసరమున, "వాణీం కాణభుజీ" మిత్యాది శ్లోకములతో షట్ఛాస్త్రములయందును స్వేచ్ఛావిహారముఁ గావించిన తన పాండిత్యప్రకర్షమును మిక్కిలియుఁ బొగడికొనియున్నాఁడు. ఇఁక మన తెలుఁగు కవులయాత్మస్తుతులను గనుఁగొనుఁడు!

నన్నయ— 'విపులశబ్దశాసన, ఉభయభాషాకావ్యరచనాభిశోభిత, సత్ప్రతి భాభియోగ్య, మత్యమరాధిపాచార్య, సుజన—" ఇత్యాదిబిరుదములను విశేష ముగాఁ జెప్పికొన్నాఁడు.

తిక్కన— "అమలోదాత్తమనీష నే నుభయకావ్యప్రౌఢిఁ బాటించు శిల్పమునం బారగుఁడన్, కళావిదుఁడన్, సన్మాన్యుఁడన్ కవితావిలాసవిస్తరమహా నీయుఁడన్—" అని తన్నుఁ దానే పొగడికొనియున్నాఁడు.

సోమన—"సకలభాషాభూషణ, సాహిత్యరసపోషణ సంవిధానచక్రవర్తి, సంపూర్ణకీర్తి, నవీనగుణసనాథ" అనుబిరుదములు వ్రాసికొనినాఁడు.

కేతన—"కవితయందు బ్రహ్మ నైన మెచ్చునిత్తిక్కనచే మెచ్చఁ గాంచిన ప్రౌఢ నైననన్ను వేఱ పొగడ నేల?—వివిధకళానిపుణుండన్, అభినవదండిన్ ...." అనుబిరుదములను దానే పెట్టుకొనెను.

(చూడఁ బూనిన నిట్టియుదాహరణములు వేలకొలఁది గలవు.)

ఇట్టి వ్రాఁతలు వారివారిప్రజ్ఞావిశేషములు శాశ్వతముగ గ్రంథస్థములై యుండుటకు నేర్పఱుపఁబడిన కవిసమయములలోఁ జేరునుగాని యాత్మస్తుతులలోఁ జేర వని తలంచెదను. నన్నిచోడమహారాజునకుఁ గలచౌషష్టికళానిపుణత్వమునుబట్టియు, కవిత్వాతిశయమునుబట్టియు నాతని యాస్థాని నలంకరించు విద్వత్కవులు, 'కవిరాజశిఖామణి' యని యాతనిఁ బొగడుచువచ్చు చుండిన హేతువున నైన నాతఁ డాబిరుదమును వ్రాసికొనియుండును. ఎట్లు వ్రాసికొనిన నేమి?

క. "ఓలిన కడసన నఱునది, నాలుగువిద్యలను నేర్పు నైసర్గిక మై
వాలినసుకవులకుం గా, కేల దరమె కృతులు సెప్ప నెవ్వరికైనన్."

అని వ్రాసికొనిన యమ్మహారాజకవిచంద్రునిసామర్థ్య మిట్టిబిరుదమున కైన నర్హ మైన దేకదా! *

కృతిసమర్పణవిధానము—కృతిపతి.

చోడకవిరాజు తనకుమారసంభవమహాకావ్యము నాత్మవిద్యాగురుఁ డగు జంగమమల్లికార్జునునకు నంకితముగ నిచ్చెను. ఇమ్మహారాజునకుఁ గలగురుభక్తి నిరవధికము. ఆశ్వాసాద్యంతపద్యములందును, గ్రంథమధ్యమునను మహేశ్వరునకును, మల్లికార్జునునకును నభేదము సెప్పి యపారగురుభక్తి వెల్లడించియున్నాఁడు. ఇట్లభేదము సేయుట "విరుద్ధముగాను, కొంత యసంగతముగాను ఉన్న దేమో!" అని కవులచరిత్రమున వ్రాయఁబడి యున్నది గాని "గురుర్దేవో మహేశ్వరః" అనునార్యోక్తి నీతఁడు సార్థకముఁ జేసె నని తలంపవచ్చును.

* కీ. శే. వీరేశలింగముగారు, కవిచరిత్రమున "ఇక్కవి నాచనసోమనాథాదిమహాకవులతోఁ దులఁదూఁగఁదగినవాఁడు గాని సాధారణుఁడు గాఁడు." అని వ్రాసి యుండియు, తాము ప్రకటించిన యుత్తరహరివంశ, దశకుమారచరిత్రకర్తలు పెట్టుకొన్నబిరుదులను పోషించి యుండియు నిప్పు డిట్లు వ్రాయుటకుఁ గారణము వేఱుగానుండనోపు.

జంగమల్లికార్జునుఁడు పండితమల్లికార్జునుఁ డేమో యని కొందఱు వలంచిరి గాని యాతఁ డీతఁడు గాఁడు. పండితమల్లయ్య వీరశైవుఁడు, నన్నిచోడదేవుఁడు వీరశైవుఁడు గాఁడు. కావున నీకవి యారాధ్యులశిష్యుఁ డగుట పొసఁగదు. వీరశైవులు శివేతరదైవములను గొలువరు. చోడకవి బహుదేవతాస్తుతిని గావించియున్నాఁడు. మఱియు, విష్ణుదేవునిమహిమలను విశేషించియున్నాఁడు. (ద్వి. భా. 421, 860)

మల్లికార్జునయోగియుఁ గవితల్లజుఁ డైనట్లును, ఆతఁడే తనకుఁ గవిత్వమును బ్రసాదించి యున్నట్లును మనకవీంద్రుఁడు తనగ్రంథమునఁ జెప్పియున్నాఁడు. మఱియుఁ దనగురువు దనకుఁ బ్రసాదించినకవిత్వము నాతనికే సమర్పించుట నిట్లు మనోహరముగాఁ దెలిపికొనియున్నాఁడు:—

సీ. ఘనాఘనములు పయోధరములు గొనివచ్చి కురిసి వారిధియందు గూర్చునట్లు
పూనఁ బండినవిత్తు చేనికే ఫలకాంక్షఁ బ్రోవఁ ద్రవ్వుట చెదఁ బెట్టునట్లు
రోహణాచలపతి కూహించి వరరత్న మంచియాంబులఁ బ్రభూషించునట్లు
త్రిస్రోత కర్థిఁ దత్తీర్థోదకంబులు నెసకంబుగా సంస్కరించునట్లు
నింగి ముట్టి యున్న జంగమమల్లయ, వరమునందు గనినసుకవితఁ
దనిలి వారియంద నెగడింతు రవికి దీ, పమున నర్చ లిచ్చుపగిదిపోలె."

## షష్ఠ్యంతములు.

ఒకకవీంద్రునిచేఁ గృతి నందుభాగ్యశాలి సామాన్యుఁ డై యుండఁడు. సామాన్యునకుఁ గృతి నిచ్చునేని కవి నిందాపాత్రుఁ డగును. కావునఁ దనకృతికన్యను సమస్తసద్గుణాలంకారవిశిష్టునకే యిచ్చియుండుటను లోకమునకుఁ దెలిపికొనువాఁడుంబోలె, కవిచంద్రుఁడు, తదీయనిరంతరాభ్యుదయమును గోరువాఁడై, అట్లు గోరుట సమయముగా, తనగ్రంథమున, షష్ఠ్యంతముల నేర్పఱుచుకొని తద్గుణోత్కర్షమును వర్ణించుచుండును. ఇది పురాతనసంప్రదాయసిద్ధమైనకవిసమయముగాఁ గానఁబడియెడి (కవి తనకోశమును భగవంతున కర్పించునేని యాతనిమహిమలను బొగడును.) నన్నియభారతభాగము, తిక్కనరామాయణము, మొల్లరామాయణము మొదలగునవి షష్ఠ్యంతములు లేనియాంధ్రకావ్యములై యున్నవి.

## కుమారసంభవకథ.

కుమారసంభవకథ, శివ, లింగ, స్కంద, వహ్నిపురాణాదులలోనిది. దీనిని మహాకవు లనేకు లాయాపురాణములనుండి తీసి ప్రత్యేకకావ్యములుగా వివిధ

నామములు రచియించియున్నాఁడు. ఇట్టి కథ నాంధ్రమునకుఁ దొలుదొల్తఁ దెచ్చిన వాఁడు నన్నిచోడకవిరాజనియే తోఁచుచున్నది. ఏతత్కథాసంవిధానమును గూర్చియు, కవిరాజశిఖామణికవిత్వతత్త్వమును గూర్చియుఁ బ్రశంసించుటకు మఱియొకయదను గైకొనియెదను.

## శబ్దపరికరసంపత్తి.

### ౧. అన్యదేశ్యములు.

చిరకాలమునుండి యాంధ్రదేశమునకును, దక్షిణదేశములకును నన్యోన్యానుబంధము విశేషముగఁ గలిగియుండుటచే, త్రిలింగభాషాసీమలకవలి, దాక్షిణాత్యభాషాధాతులకును గీర్వాణరమణితో పాటు, ఎకతెగనివియు, కావుననే, అఱమరిక లేనిదియు నగు పరస్పరసాహాచర్య మేర్పడియున్నది. దానం జేసి యొకభాషలోనిశబ్దములు వేఱొకభాషలోనికి సంస్కృతశబ్దములవలెనే చేరి పోయి, అవి యేభాషలోనివో యేర్పఱింప శక్యము గానియంతటియైక్యమును గాంచినవి. అప్పకవీయము, కావ్యాలంకారచూడామణి మొదలగులక్షణగ్రంథములలోని 'దేశ్యపదలక్షణము' అనుభాగమును జూచువారికి ద్రావిడభాషల కన్నిటికిఁ బూర్వమునుండియుఁ గలమైత్త్రికము నత్యంతాశ్చర్యమును గొలుపఁ గలదు.

ఇక్కాలమున మహమ్మదీయాంగ్లేయాద్యన్యభాషాపదములగు "కవులు, కదపా, జప్తు, జమాబందీ, తహశ్శిల్దారు, దస్తు, శిస్తు, వసూలు, రోజు...." "రైలు, రైల్వే, టిక్కెట్టు, ఇంటరు, లాంతరు, చిమ్నీ, సమ్మన్సు, స్టేటుమెంటు, డిక్రీ, వారంటు, రిజస్ట్రారు, రశీదు (రిసీట్ అనుదానివికృతి!) బయోగ్రాఫ్, గ్రామోఫోన్, ఇస్పేటు (స్పేడ్స్!) డైమాను (!)...."

మొదలగునవి యాంధ్రభాషలోనికి దొరలి వచ్చి పడి, ఇవి యిట్టివను తలంపునైనఁ గలిగింపకుండునంతటిచనవును గాంచి జనులచే వ్యవహరింపఁబడు చున్నవి. కాలప్రవాహమునఁ గొట్టుకొనివచ్చి యీజీవభాషాసముద్రమునఁ జేరు చున్న యిట్టివానిని జనవ్యవహారమునుండి యెవ్వరు తప్పింపఁగలరు?

సుసూక్ష్మముగ నాలోచనము సేయుచో గీర్వాణమునయితము మన కన్య భాషయే, వేలకొలఁదిసంవత్సరములు మహోన్నతపదమున నుండి భారతవర్షము నందంతట నిరతిశయవ్యాపనముఁ జెంది దేశభాషల కన్నిటికిని మూలకందమును విఖ్యాతిని గాంచిన దగుటచేతను, వేదశాస్త్రపురాణేతిహాసాదు లనేకములు దానియం దుండుటచేతను పూజనీయ యగునయ్యార్యభాషను మనవారు 'దేవ

భాష, ఆద్యప్రకృతి' అను గౌరవబిరుదముల నిచ్చి పూర్వమునుండియు నాదరించుచున్నారు గాని తెలుఁగునకు సంస్కృత మెట్టిదో ప్రాకృతము నట్టిదే; ప్రాకృత మెట్టిదో తక్కినద్రావిడ భాషలు నట్టివే! ఆద్యప్రకృతి తల్లి యేని ద్వితీయ ప్రకృతి పినతల్లి; తక్కినప్రకృతులు సోదరీమణులు. అందఱును బాంధవులే.

నన్నిచోడనిగ్రంథమునఁ గొన్ని యన్యభాషాపదము లుండుటం గాంచి శ్రీ వీరేశలింగముగారు తమకవిచరిత్రమున,

"నన్నిచోడనికవిత్వ మన్యభాషాపదదూషితము గానియెడల నుత్తమమైనదే" అని వ్రాసిరి.

శబ్దానుశాసనుఁడు మొదలుగ నేఁటివఱకును గలకవులలో నన్యభాషాపదమును బ్రయోగింపనికవి నొక్కనినేని వ్రేలుమడఁచి చూపఁజాలము. ఇది గాక,

ఆడు, పాడు, కట్టు, పడు, కై (చేయి), ఆఱు, మూఱు, వేఱు—ఇత్యాది శబ్దములు తెలుఁగునను, అఱవమునను రూపభేదము లేక యున్నవిగదా! ఇవి యేభాషలోనివో యెవ్వరు నిర్ణయింపఁగలరు? ఇంతేల? 'తావి, మోవి' ఇత్యాదు లన్యదేశ్యము లని మనవ్యాకర్తలు వ్రాసినప్పుడు మనభాషయం దన్యభాషాపదదూషితము గానిగ్రంథ మేదీ? నన్నిచోడనిగ్రంథమున మన మన్యభాషాపదము లని తలంచునవి యాతనికాలమున ద్రావిడభాషల కన్నిటికి సామాన్యములై జనవ్యవహారమునను, గ్రంథములందును నుండెడివి గావని యెట్లు చెప్పనచ్చును?

మఱియు, వీరేశలింగముపంతులుగారు, "నన్నిచోడని కర్ణాటకపదప్రయోగము" లని కొన్నిటి నెత్తి చూపుచు, ఈతఁడు వాడిన కన్నడపదము లన్నియు? పూర్వకాలమున కర్ణాటకాంధ్రభాషలకు సామాన్యము లని మనవారు చెప్పనత్తురు. అవి పూర్వము రెండుభాషలకును సామాన్యము లని యెట్లు తెలిసికోవచ్చును? ఏపూర్వకవులు వీనిని బ్రయోగించిరి? నన్నయభట్టారకాదులు ప్రయోగింపలేదు. అని వ్రాసినారు. అతివిస్తర మేల?

అవి రెండుభాషలకును సామాన్యములే యనియు, మనపూర్వకవులు వానిని బ్రయోగించియే యున్నారనియుఁ బంతులవా రిచ్చినప్రయోగముల లోనివానినే రెండిటినిమాత్ర మిచ్చటఁ జూపుచున్నాను:—

౧. "బెదరుచు నంతరంగమున భీతికిఁ గండవడంబు నుట్టి పల్కెడును . . ."

కండవడ మనఁగా కన్నడమున 'తెఱ' గావున నన్యదేశ్య మని పంతుల వారియాక్షేపము.

ఇది "కాండపట" శబ్దవికృతి యని శబ్దరత్నాకరనిఘంటుకర్తలు 'గండవడము' అను గకారాదిరూపమునుఁ గ్రహించి, మనయాంధ్రగ్రంథములోనిదే యైన యీక్రిందిప్రయోగము నిచ్చిరి:—

క. "ఉండిరి పతియును గాంతయు, గండవడముమాటునందు . ."

పాలశేఖరచరిత్రము.

పంతులవారియాక్షేపమునకు సమాధానముగా, శ్రీ. శే. తేప పెద్దుమాళ్లయ్యగారు, "కండవడము నిఘంటుకారుఁడే కాక పోతశరాజచరిత్రకర్తయుఁ బ్రయోగించినాఁడు గావున నిది లాక్షణికము కానోపును." అని (ఆం. సా. పరిషత్పత్రిక, 7 సంపు 1 సం. లోన) వ్రాసినారు! ఇతరకవి ప్రయోగింపనిపదములు నన్నెచోడునివి యలాక్షణికములే యగునా? నన్నయభారతమునఁ గనుపట్టుచు నితరకవులు ప్రయోగింపనివి కొన్నియున్నవే! అవి యలాక్షణికము లైనవా? ఇ దేటిన్యాయము?

చ. "ఎలమిన పూరి మేసి, సెలయేఱుల నీరులు ద్రావి మేలి వెం
చల, నెలమావిజొంపముల చల్లనినీడల నిల్చి పొల్చి . . ."

"వెంచ-అనఁగా, కన్నడమున సరస్సు కావున నన్యదేశ్యపద మని పంతులవారి యాక్షేపము.

దీనినిసయితము శబ్దరత్నాకరనిఘంటుకారుఁడు దేశ్యపదముగానే గ్రహించి, యాంధ్రగ్రంథోదాహరణమునే యిచ్చినాఁడు. పంతులవారు పైపదములను శబ్దరత్నాకరమునఁ జూచియుండ లే దని తోఁచెడిని. చూచి యుండిరేని "ఏపూర్వకవులు వీనిని బ్రయోగించిరి? అని ప్రశ్నించి యుండరు.

ఈరీతిని గ్రంథముల నింకను బరిశోధించుచో, నన్యభాషాపదము లని మన మిప్పు డనుకొనుచున్నవి, చాలవఱకు దేశ్యములుగానే కానఁబడఁగలవు. అట్టివానిలోఁ గొన్నిటినిమాత్రము మనయాంధ్రమహాకవులగ్రంథములనుండి యెత్తి చూపుచున్నాను:— *నక్షత్రచిహ్నము గలవి చోడకవిగ్రంథమునను గలవు.

*విగుర్వించు, *కెలసము, తావు—నన్నయభట్టారకుఁడు.

*అగుర్వు, *గండరువు, *కెడ్డెరను—తిక్కనసోమయాజి.

దిశాపట్టము, టోపి—నాచనసోమనాథుఁడు.

*ముడి, తావు—నంచన.

జాళువా, సెరిగె—రంగనాథుఁడు.

*గట్టివాలితి, విభాళించు--ఎఱ్ఱాప్రెగ్గడ.

నిరాణా, బత్తెళి — పండితమల్లికార్జునుఁడు.

జగజంపు, సామాన్లు, ఖుసిమీఅ, *కైజ్జీరము — శ్రీనాథుఁడు.

పచ్చనిహులుసుబంజిపనివాగె పక్కెర పారసీపల్లంబు — పెద్దన.

బిజనగాడు దేఁర నిజకృపానుహిమునఁ జెన్నారునాయిల్లు బిడారు నీకు జేకు — ధూర్జటి.

అంచనా, ఖండా, దసిలి — పింగళిసూరనమంత్రి.

దివాణము, తింగణా — కృష్ణదేవరాయలు.

సువారి, పుంజాలసంచి — తెనాలి రామకృష్ణుఁడు.

ముసలిమానాన్యాదులనేకములు — రామరాజభూషణుఁడు.

హేజీబు, హుజూరు — కాకమాని మూర్తికవి.

పిళ్లారి, సాహేబు — సాంబనిఘంటువు — రంగకవి.

హజారము, అసాదు — రామభద్రయ్య — రామాభ్యుదయము.

హిజారాద్యసంఖ్యాకములు — కదిరీపతి — శుకసప్తతి.

ఈవిధమున నన్యదేశ్యముల నుపయోగింపని యాంధ్రకవి యొక్కఁడు లేఁడు! ఒక్కయాంధ్రమునందే కాక యెల్లభాషలయందును అన్యదేశ్యపదము లనివార్యముగఁ బ్రవేశించియున్నవి. వివరణ మనావశ్యకము.

మఱియు వీరేశలింగముగారు,

"చెనసిగుణమైనదోసంబు సేయనేర్చుఁ, గుకవిగ్రృతులందు దోసంబు గుణము సేయ నేరఁ డదియట్లు దొంతులు సేరి నాయి, దోర్పనేర్చుఁగా కది యెట్లు సేర్పనేర్చు?"

అనుపద్యము నుదాహరించి, "ఇతఁ డనావశ్యకముగా 'కుక్క' యనుటకు మాఱుగా 'నాయి' యనునన్యభాషాపదమును బ్రయోగించియున్నాఁడు." అని వ్రాసినారు.

ఇక్కాలమున కిరోసినాయిల్, లైన్సు, లాంతరు, చిమ్నీ మొదలగువానివలె, అక్కాలమున 'నాయి' మొదలగునవి జనులతలవాకిళులయందు చనవుగా నిరంతరము తిరుగుచుండినవై యుండును. పూర్వకాలమునందు అన్యభాషాపదముల ప్రయోగము దూష్యమై యుండదు. ఉండెనేని నన్నిచోడ, నన్నయ, తిక్కనాదిమహాకవు లెల్లరును నేల వానిని బ్రయోగించి యుందురు?

౨. దేశీయపదములు.

శబ్దరత్నాకరాదినిఘంటువుల కెక్కియుండని దేశిపదములు కొన్ని కవిరాజశిఖామణిగ్రంథమునఁ గానవచ్చుచున్నవి. ఆనాఁడు నిఘంటుకర్తలకు లభిం

పని గ్రంథములు కొన్ని యీనాఁడు లభింపకుండుటచే వానియందు చోడకవిశబ్దములు కొన్ని యిప్పుడు చిక్కకున్నవి. ప్రాచీనకోశజాల మింకను బయలుపడునేని మఱికొన్ని ప్రయోగములు దొరకొనవచ్చును.

నన్నిచోడనిపొత్తములోని దేశ్యపదములను కొన్నిటిని గాంచి, యవి నిఘంటువులయందు గానరాకుండుటచేఁగాఁబోలు, శ్రీయుతులు బుఱ్ఱా శేషగిరిరావుపంతులు ఎం. ఏ. గారు, 'ఇక్కవి పనిగట్టి ప్రాఁతమాటలను ప్రయోగించె' నని వ్రాసియున్నారు. కీ. శే. వీరేశలింగముపంతులుగారును 'ఇక్కవి గ్రాంథికభాషలోను, వ్యావహారిక భాషలోనుగూడ లేని యప్రతీతపదములను వాడినాఁ' డని శేషగిరిరావుగారి వ్రాఁతను పోషించినారు.

కాలము క్రమించినకొలఁది యెల్లభాషలయందును లోకవ్యవహారకవిప్రయోగాదుల ననుసరించి కొన్నిపదములు ముచ్చుముడుఁగుచుండఁగా, కొన్నిపదములు తలసూపుచుండును. ఇది భాషాస్వభావము. వేదములనాఁటిభాష పురాణములనాఁటికి కొంతమార్పుపాటు నొందినది. పురాణములనాఁటిది కావ్యనాటకాదులనాఁటికి కొంతవేషాంతరమును దాల్చినది - - - - - - ఇట్లే నన్నిచోడనినాఁటిభాష నన్నియభట్టునాఁటికిని, నన్నియనాఁటిది తిక్కననాఁటికిని, తిక్కననాఁటిది శ్రీనాథునినాఁటికిని, శ్రీనాథునినాఁటిది రాయలనాఁటికిని, రాయలనాఁటిది తిమ్మకవినాఁటికిని, తిమ్మకవినాఁటిది నేఁటికిని క్రమముగా నస్తమితపదములతో, ఆవిర్భూతపదములతో, నభినవప్రయోగములతో, నానారూపధారణము నొనర్చుకొనుచు వచ్చినది. చూడుఁడు.

నన్నియనాఁటి 'పశువరించుట' లు, రంగనాథునినాఁటి 'దూరడించు' లు తిక్కననాఁటి 'లేటమొగమునడుట' లు, సోమునినాఁటి 'బైసుకవెట్టుట' లు, మంచననాఁటి 'కీనుగ్గొట్టుట' లు, ఎఱ్ఱననాఁటి 'విభాళించుట' లు, శ్రీనాథునినాఁటి 'పాతలించుట' లు, రామలింగనినాఁటి 'కావడించుట' లు, పూర్వులనాఁటి కంపు (సువాసన) నింపుట' లు - - - మన మిప్పు డెఱుఁగము. ఇట్లే నన్నిచోడనినాఁటి—

“మొసరుమునుఁగనుటలు, పేర్చిందులుదంపడించుటలు, సొంపుకన్నెకుక్కటలు - - - - - -” నన్నియాదులకు సుపరిచితము లైనపదము లై యుండకపోవచ్చును మఱియుఁ జోడకవిచంద్రునినాఁటి,

౧. 'నడునడ నడుంగు' లు నన్నియనాఁటికిని, ౨. 'లగ్గబెగ్గడిల్లుట' లు తిక్కననాఁటికిని, ౩. 'పేటంబేటంబగుట' లు కేతననాఁటికిని, ౪. 'తాడిడిపందు

గొనుట' లు మంచననాటికిని, ౫. 'కీడ్పొరసగుట' లు శ్రీనాథునినాఁటికిని, ౬. కాఁడించుటలు రామలింగనినాఁటికిని - - - - - -

అస్తమితపదములు గాకపోయి యుండవచ్చును. మఱియు, కవిరాజశిఖామణిగ్రంథమున ప్రాఁతమాటలు, అప్రతీతపదములు, అపూర్వపదములుగాఁ గానవచ్చుచున్న వని మన మనుకొనుచున్న పదములలోఁ గొన్నిటికి నిప్పు డిప్పుడు ప్రయోగము లితరకవుల గ్రంథములలో లభించుచున్నవి. అందు గొన్నిటి నిచ్చటఁ జూపుచున్నాను.

బడగూఁడు, మేలిల్లు—శివతత్త్వసారము (పండితమల్లికార్జునుఁడు.)
కంబకల్లు, సమూహి—బసవపురాణము (పాల్కురికిసోమనాథుఁడు.)
దాఁగగొనుట, తొప్ప—నిర్వచనోత్తరరామాయణము.
ఱంకగొలుపుట, ఊఁపఱాడుట—సోమునిహరివంశము.
నట్టుటెఱుచు, తఱుసంటె—సభాపర్వము.
పరముఁడు, పఱిచుంచు—అరణ్యపర్వము.
అనురాగిల్లు, ఆలించివిను—ఆదిపర్వము.
కనుఁబేటము, ఏలము, కోసనపుచ్చు—దశకుమారచరిత్రము (కేతన.)
బింకము—కావ్యాలంకారచూడామణి—విన్నకోట పెద్దన.
కలుచు—కేయూరబాహుచరిత్రము—మంచన.
పూన్చు (సమర్పించు, పూజించు)—పా. సోమన, పండితారాధ్యుఁడు.
బండఁగి—కకుత్స్థవిజయము, మనుచరిత్రము.
నక్రంబు—నత్తి—ప్రాచీనశాసనములు. మొ ॥

నిఘంటువులలోఁ జేరనియంతమాత్రమున నివి యప్రతీతపదము లైనవా? పైపదములు మొదలగునవి యన్నియు మనకు నప్రతీతపదములు గాని కవినాఁటికి వ్యవహారాదులయం దున్నవే!

ప్రాఁతవడ్డమాటలు.

నన్నిచోడదేవుని గ్రంథములోని యపరిచితములైన (నిఘంటువులలో లేని) శబ్దములను గొన్నిటిని గాంచి—తిక్కననిర్వచనోత్తర రామాయణములోని "పలుకులపొందు లేక . . ." అను కుకవినింద గలపద్యమునందు గానవచ్చు 'ప్రాఁతవడ్డమాటలు' అనుపాఠమును గ్రహించి, మనకవీంద్రునిశబ్దములకును, ఆ 'ప్రాఁతవడ్డమాటలకు' ను సంబంధమును గల్పించి, తిక్కన దిట్టిన కుకవి, నన్నిచోడదేవుఁడే యై యుండు నని భావించి, శ్రీ శేషగిరిరావుపంతులుగారును, (వారినిబట్టి) వీరేశలింగముపంతులవారును మనకవిని నిందాపాత్రునిఁ గావించిరి.

నిర్వచనోత్తరరామాయణము వ్రాఁతప్రతులఁ గొన్నిట "భ్రాంతిపట్టమాటలు" అని యున్నది. తిక్కన వ్రాసిన దదియే యై యుండును. కాలక్రమమున లేఖకులు కొన్ని ప్రతులకు 'ప్రాఁతపట్టమాటలు' అనుపాఠము ప్రసాదించినారు. ఆపాఠమే ముద్రణమునకును, నిఘంటువులకును నెక్కిపోయినది! అదియే యాధునికులకు నిట్టిభావమును పోషించినది.

తిక్కనార్యుని 'పలుకులపొందు లేక....' అను పద్యములోని యొకవాక్యమైనను కవిరాజశిఖామణి కనుసరింపదు. 'ప్రాఁతపట్టమాటలు' అనుపాఠము బొత్తిగా నిలువదు. ఈవిషయము లెల్ల కుమారసంభవకవి కవిత్వతత్త్వవిమర్శనమునఁ జర్చింపఁబడును.

## ఛందోవ్యాకరణవిశేషములు.

నన్నిచోడరాజకవికాలమున ఛందోవ్యాకరణాదినిబంధనము లెట్లుండెడివో తెలుపుశాస్త్రగ్రంథము లెవ్వియు నీనాఁడు గానరావు. లక్షణగ్రంథములనేకహేతువులచే ననేకములగు మార్పుల నొందుచు వచ్చిన వనుట యెల్లరకుఁ దెల్లము. కవిరాజశిఖామణిప్రయోగములకును, నన్నయతిక్కనాదులప్రయోగములకును పెక్కుచోట్ల సామ్యము గానవచ్చుచునే యున్నది. భిన్నములుగా నగపడుచున్నవానిలోఁ గొన్నిటిమాత్రము సంగ్రహముగ నిచ్చుటఁ బ్రవర్తించుచున్నాను.

## ఛందోవిశేషములు.

(అ) గణము—౧,

చ. "అలకలఁ జిన్నిపూ పలికినంతనె మోము పెమర్చుఁ జన్నుఁగ్రే
వల మృదుపత్త్రభంగములు వ్రాయుఁడుఁ గౌ నసియాడు లగ్గన
మ్మెలుఁతకు మాధవీకుసుమమేఖల గట్టుటయున్ వణంకు నూ
రులు నిజ మింత గోమలి మరుప్రసవాస్త్రహతిం జలింపదే?"

కుమా. 5 ఆ. 612.

మ. "మన మారంగ నొకక్షణంబయిన నిన్ మర్త్యుండు భావించి.... ,,

10 ఆ. 459.

ఇందు 'మరు—ఒక' అనువికృతపదములు, 'ప్రసవ, క్షణము' అనుప్రకృతిపదములతో సమసించుచున్నవి. మిశ్రసమాసములయందు ఉత్తరపదాదినున్న సంయుక్తాక్షరము తనకుఁ బూర్వమున్నయక్షరమును గుర్వక్షరముగాఁ జేయు

నేర దని మనయిప్పటిలక్షణగ్రంథములు శాసించుచున్నవి. చోడకవికాలము నాఁటికి నిట్టిశాసనము పుట్టియుండలే దని తోఁచెడిని. కర్ణాటగ్రంథములయం దిట్టిప్రయోగము సాధువుగానే యెన్నఁబడెను. మఱియు, తెనాలి రామకృష్ణుని,

“తే. గీ. వెలయుమంగయగురునభూవిభుని పెద్ద, సంగభూపాలమణి వ్రాయసప్రవృత్తి....” పాండు. ప్ర. 20.

అనుదానిలోని ‘వ్రాయసప్రవృత్తి’ అనుప్రయోగమును నిట్టిదే.

(౩) ఎడ్డ—

శా. “శ్రీరామేశకవీశ్వరాదు లెడ్డ నీశ్రీపాదముల్ భక్తితోఁ
నారాధించి సమస్తలోకసముదాయాధీశులై రన్న సం
సారాహల్ దుఃఖనివారణార్థ మభవున్ సర్వేశు లోకత్రయా
ధారు న్నిన్నదిఁ గొల్వ కున్కి యుఱవే దారిద్ర్యవిద్రావణా!”

కుమా. దశ. 455.

‘ఎడ్డ’ అనుపదము రెండులఘువులు గలదిగా నన్నిచోడనిగ్రంథమునఁ బలుచోట్లఁ బ్రయోగింపఁబడియున్నది. దీనినిగూర్చి వీరేశలింగముపంతుల వారు,

“ఈపుస్తకములో నిప్పు డున్నట్లు ‘ఎడ్డ’ అని యుంచినచో గణభంగము గలుగుచున్నది. ఎడఁద, ఎద, ఎడ, ఎడ్ల అని నాలుగురూపము లుండఁగా నిర్బాధకమైన నడిమిరెండురూపములలో నొకదానిని వేయక సబాధకమైన ‘ఎడ్డ’ అనురూపమును వేసి ‘ఇందు డకారమును దేలఁబలుకవలయును’ అని టిప్పణి మేల వ్రాయవలెను? ఇట్టియసాధారణరూపము వేసినంతమాత్రమున నిది యత్యంతపురాతనగ్రంథముగాఁ గలుగునా?” అని వ్రాసినారు.

అచ్చుపొత్తములోని ‘ఎడ్డ’ అను రూపమునకు మాఱుగా వ్రాఁతప్రతిలో ‘ఎడ్ల’ అని కలదు. ‘ఎడ్డ’ అని యుండవలయు ననియే తోఁచెడి. ఏరూప మున్న నేమి? ఇందు డకారమును దేలఁబలుకవలసినదే! ‘అట్లు తేలఁబలుకుట సరి యగునా, కాదా?’ అనునదియే యిప్పుడు విచారణీయ మగువిషయము.

ఆంధ్రమహాభారతాది పురాతనగ్రంథముల పూర్వపు వ్రాఁతప్రతుల యందు దేలఁబలుకవలసిన యిట్టిరూపము లనేకములు గలవు. అందు గొన్నిటి నిచ్చటఁ జూపెదను:—

(౧) ఎడ్డ—“క. తగు నిడి వగ దని యెడ్డలో, వగవక . . .”

(ఆదిపర్వ. ప్రథ కర ప్రాంతప్రతి.)

“కొడుకుం ద్రైలోక్యవిజయుం, బడయుదు నని ఘోరనాగశతం బొనరింపం
దొడఁగె సురరాజు నెడ్డలో, నిడికొని యేకాగ్రబుద్ధి . . .”

(ఆదిప. కం. 120. (ప్రా. ప్ర.)

పైవానియం దున్న ‘ఎడ్డ’ అనుదానిలోని ‘డకారము’ను దేలఁబలుకవలయును కాలక్రమమున లేఖకులు దీని యుచ్చారణము దెలియక గణభంగము గలుగుచున్న దను భ్రాంతిచే నందలి డకారమును దీసివైచి ‘ఎడ’ అని కొందఱు ఎడ అని కొందఱు వ్రాయుచువచ్చినట్లు దోఁచుచున్నది. కావున ‘ఎడ్డ’ అనునదియే ప్రాచీనరూపము. అత్యంతపురాతనగ్రంథమును జేయుటకు నుజ్జీవు రును వేసినరూపము గాదు. ఎట్లును ప్రాంతపుస్తకము క్రొత్తపాత్రమును గానేరదు! (౨) తొడ్డి—చ. పొలుపుగఁ గట్టి, పూసి, తొడ్డి, భూరివిభూతి . . .

భారత. ఆదిప. (ప్రాంతప్రతి.)

ఇందు, ‘తొడ్డి’ అనుదానిలోని ‘డకారము’ దేలఁబలుకకున్న గణభంగమగును. ఈరూపమును పై హేతువుచేత ‘తొడి’ క్రింద మాఱిపోయి ‘తొడు’ అనుధాతువును బుట్టించినది!

(3) మొగిడ్చి—సీ.గీ. అందు గొంద ఱధికహాస్యంబు సేసిరి, యుడవి నేమిరో సెదనిరి కొంద,ఱవ్వ నీవు వేల్పవగుదనికొందఱు, మొగిన కేలు మొగిడ్చి మ్రొక్కిరంత.

ఆరణ్య. ద్వి. 102.

ఇందు ‘మొగిడ్చి’ అనునది ‘మొగుచి’ అనురూపాంతరమును ధరించెను! (ఇట్లే వ్యవహారమున ‘కదల్పు’ అనునది ‘కదపు’ అయినది! ఇట్టి వింకను గలవు)

(४) ఎద్రుచు, అద్రుచు, పద్రుచు, విద్రుచు, చిద్రుపలు—వీని నేల తేలఁబలుకవలయును? అట్లే ‘ఎడ్డ’ను! ఇంత యేల? లేఖకులకుఁ గాని, పరిష్కర్తలకుఁగాని మార్పను—దిద్దను శక్యముగాని యుద్ధమల్లుని బెజవాడశాసనము శిలాక్షరములలోని,

“గొరగల్గా, కొరు లిందు, ఐడిసి, బృందంబు గొనియుండు, వారు . . .”

అను మధ్యాక్కరపాదమును గనుఁడు! ఇందు ‘గొరగల్గా’ అను మొదటి యింద్రగణములోని ‘లకారము’ను దేలఁబలుకవలయును. ఇందు ఒకమాత్ర యెక్కువ యైన దని తత్ప్రకాశకులు వ్రాసియున్నారు గాని పైవానివలెనే

దీనినినయితము చేయఁబూనుచో మాత్రయు నెక్కువరాదు; మధ్యాక్కఱల లక్షణమును గ్రొత్తగా సృజియింప నక్కఱయు నుండదు.[1]

కన్నడభాషయందు నిట్టియుచ్చారణము గలదు.—

ను ముగిలం ముట్టిద పెంపు పెంపనాళ్కొం డుద్యోగ ముద్యోగదొళ్
నెగ ళ్దాటాబల మాజెయొళ్ ప్రవర్ధగు రొప్పందొం దగుర్వం దగు
ర్వగో ళుర్తి ప్పరిముండలం - - - - - - - - - - పంపభార. ౧ ఆ.

క. జగదొళగిదొందుమిగిలెనె, నెగళ్దిదు వేంగివిషయమా విషయదొళ్.."

ఛందోంబుధి.

(౫) యతి:— ఈతనిగ్రంథమున నన్నియాదులయతులకు భిన్నములుగా నున్నవి గానరావు కాని, నన్నియకును, చోడకవికిని నొక్కశబ్దమునమాత్రము యతిభేదము గానవచ్చుచున్నది:—

"చ. అనిశము గ్రమ్ముపుష్పమధునవ్యరసప్రజలంబుగఁ గొమ్మ లెక్కి బో
రనఁ జెలరేఁగుపక్షిరవ మ్మార్గరవంబుగ - - - - - - - - -"

కుమారసం. పం. 562 ప.

ఇందు "బోరు+అనన్" అని ఛేదముగ నన్నిచోడకవిరాజు, స్వరమునకు యతిఁ గూర్చినాఁడు. ఆతనిగ్రంథమున మూఁడుచోట్ల నీశబ్దము స్వరమునకే యతి గూర్పఁబడియున్నది. (325, 455-ప్రథమభాగము.)

నన్నయభట్టారకుఁడు,

"క. మనుజేశ్వరు లెల్లను బో,రన దమయంతీస్వయంవరముఁ గను వేడ్కన్
జనుదెంచిరి సైన్యంబుల, దనఘట్టన నవనితలము దల్లడపడఁగన్."

అరణ్య. ద్వి. 29.

అని వ్యంజనమునకు యతి నిల్పినాఁడు.

ఈరీతి మూఁడుచోట్లను నన్నియ దనగ్రంథమున బో, రనశబ్దము వ్యంజనమునకే విశ్రమము ఘటించినాఁడు. తిక్కన 'బో, రన' ను యతిస్థానమున నిల్పినప్రయోగము గానరాలేదు. కేతనకవి తననశకుమారచరిత్రమున,

చ. "కనుకనిఁ దూలఁదోలి బలగర్వమునం దలపడ్డ వారలం
దునియలు సేసి యొండొరులదోర్బలసంపదఁ జెప్పికొంచు బో

[1] తిక్కనపద్యములవలె మధ్యాక్కఱలనడక సరిగాఁ బట్టువడమిఁ బూర్వలేఖకులు పెక్కుమార్పులు గావించినారు. వానిం గని యిప్పుడు కొందఱు మధ్యాక్కఱల లక్షణములను గ్రొత్తగా సృజియింపఁ జూచుచున్నారు.

రసఁగటకంబు వెంట్రుకకై నృపాత్మజు వేలముఁ జొచ్చి మంత్రినం
దనుఁ డగుమానవపాలు నుచితంబుగఁ గాంచి యనాకులస్థితిన్."

(దశకు. 4. ఆ. 22.)

అని యచ్చునకే విరతి గల్పించినాఁడు. ఇంకను దీనిని 'అఖండయతి' యను పేరితో కవ్యాసమునఁ జర్చించెదను. (గ) ప్రాసము—

చోడకవిరాజప్రోక్తమునఁ బ్రాసభేదములు (ఇప్పటిలక్షణమునకు సంబ నివి) కొన్ని గలవు;—

ఉ. ౧. పింగళసారసత్త్వగుణవిస్ఫురణాం బరమేశ్వరోరువా
మాంగమునందు మున్నదయమై నియమస్థితిఁ గొల్చి పద్మయున్
లోంగొని మైత్రితో నఖిలలోకములం దగఁ గాచుచున్న వే
దాంగ సనంతు విష్ణుఁ గమలాధిపు సంస్తుతిఁ జేల్చి నక్రికా.

కుమా. ప్ర. 4 ప.

ఇత్యాదిపూర్ణాపూర్ణబిందుప్రాససంఘటన మీప్రాచీనకవి గ్రంథమునఁ జూపట్టుచున్నది. నాయెఱిఁగినంతవఱకు 'పాల్కురికి సోమనాథుని గ్రంథముల యందుమాత్ర మిట్టిప్రాసము గలదు. శివతత్త్వసారమున నట్టిప్రాసము గానరాలేదు. ఇది పురాతనలక్ష్యమునకుఁ జెందినప్రయోగ మనియు, నన్నియాదులు దీనిం ద్రోచివైచి రనియు, పాల్కురికి సోమనమాత్రము శైవుఁ డగుచోడకవి ప్రయోగమును గౌరవించె ననియుఁ దోఁచెడిని.

౨. న, ణ ప్రాసము:—

ఈప్రాసము పూర్వకాలమున సంస్కృతకవు లందఱచేతను బ్రయోగింపఁ బడియున్నట్లును, లక్షణగ్రంథకర్తలు దానికిఁ గొన్ని నియమము లేర్పఱిచి, యా నియమములకు లోఁగని వానిని సవరించివైచుచువచ్చినట్లును గన్పట్టుచున్నది. దీనింగూర్చి యప్పకవ్యాదులు పడినపాట్లు శోచనీయములై యున్నవి. వానివివరణమున కిందు చోటులేదు. ఆయాలక్షణగ్రంథములను గనుఁగొన్నచో నణప్రాసము సాధువే యని తోఁపఁగలదు.

క. వేణుజమౌక్తికములు దొడ్గి,* వీనుల కింపెసఁగ నెఱుకు వెలఁదులు...."

నన్నిచో. కుమా. ప. 705

సీ. భూరితరోగ్రగంభీరాబ్ధు లణఁగించు, నౌర్వాగ్ని కెంత నీహారకణము?
ఘోరకాంతారసంహారకారణ మగు, వనవహ్ని కెచ్చటఁ దృణకణంబు,'

దశ. 537.

---

*ఇక్కడ ఎకారమును దేలఁబలుకవలయును.

ఇత్యాదులు కుమారసంభవమున వ్రాఁతప్రతియందు గలవు. (ముద్రిత గ్రంథమున వీనికి వేఱుపాఠములు గలవు)

నన్నయార్యులును న ణ ప్రాసమును గూర్చియే యున్నారు.

ఎ. గీ. దున్నయమున శకుని "కర్ణదుశ్శాసనుల్ . . ." ఆదిప 3 ఆ 12 ప.

తే. గీ. దున్నయమ్ముల్ పుట్టిన "నిర్ణయించి . . ." ఆరణ్య 1 ఆ 49 ప.

క. "కర్ణుండు రేఁచి పెట్టిన, దున్నయపరులైన . . ." ఉద్యో. ద్వి 248 ప.

ఇత్యాదిప్రయోగములు గోచరించుచున్నవి. ఇంకను బలువురచే సవరింపఁబడిన వెన్నియో యుండియుండును.

3. త్ర, న్న ప్రాసము:—

ఎ. గీ. "చిత్రపత్త్రాత్తశయనూత్నరత్నచిత్ర, తాంగరంగవల్లీసుసంగాంగణములు . . ." కుమార. స. 9-7.

ఇదియు ప్రాచీనప్రయోగములలోఁ జేరుచున్నట్లు తోఁచుచున్నది. నన్నయభట్టు,

"శల్యుఁ డట్టు నేలఁ ద్రెళ్లి చెచ్చెర లేచి".*

అని వ్రాసియుండఁగా లక్షణగ్రంథకర్తలు 'సెల్లుఁ' డనువికృతిని బుట్టించిరని తోఁచెడి. శైవగ్రంథ మగుటచేఁ గాఁబోలు, పాల్కురికి సోమనాథునిబసవపురాణము పలువురచేతులఁ బడక దానిలోని,

"అక్షణంబునఁ 'బంచభక్ష్యము ల్గుడిచి' ఇత్యాదిప్రయోగములు సవరింపఁబడియుండ లేదు.

ఇట్టిప్రయోగము లింకను గలవు. గ్రంథవిస్తర మగు నని ప్రస్తుతము నిల్పితిని. నన్నయతిక్కనాదులమూలగ్రంథము లిప్పుడు చిక్కుటం జేసి వారి వివిధప్రయోగము లెట్లుండెడివో తెలియఁజాలము.

"ప్రాస స్సర్వేషు చ, ఏక ఏవ స్యాత్" అనునిబంధనము యుక్తియుక్తమైనదే. కాని యది పూర్వకవులను శాసింప నేరదు. పూర్వకవు లేయేవిధముల వేనిని బ్రయోగించుచువచ్చిరో. తరువాతిలక్షణగ్రంథకర్తలు వాని నెట్లెట్లు శాసించుచువచ్చిరో, ప్రాచీనప్రయోగము లెట్టిమార్పులను జెందుచువచ్చినవో యెఱుఁగ నభిలషించు భాషాచరిత్రకారులకుఁ దెలియరాకుండ మనవారు వానిని దాఱుమాఱొనరించుచువచ్చుటమాత్ర మెట్టివారికిని విషాదముఁ గలిగింపకమానదు. లక్ష్యలక్షణాదు లన్యోన్యము క్రమాభివృద్ధి నందుచునచ్చె

---

* అనేకములగు వ్రాఁతప్రతులందును, పూర్వతరముద్రణమునందును 'శల్య' అనియే యున్నది.

ననుట సమంజసము గాని, కవిత్వ మొక్క మాత్రే (కన్నుచ్చునం దీసిన బంగారు తీరునలె) నిర్దుష్టతతో నావిర్భవించిన దనుట న్యాయ్యమగునా?

ద్వితీయభాగము 356 పద్యమున నున్న వ, స ప్రాసము నుదాహరించుటయే యిట్టిదే.

"క్రొవ్విరి, ఎవ్విరి, యౌవన, తీవ్వడు" (కుమా. న. 356)

ప్రాచీనకవులయిట్టిలక్ష్యములను గాంచియే,

"నవ్వుచు, యౌవన, ఉవ్విళులు, ఇవ్విధము." (భోజరా. సప్త. 108)

అని పొనంతామాత్యుడు (ఛందోదర్పణాంకుణగ్రంథకర్త)

"ఎవ్వరి, యౌవన, ఇవ్విన, నెవ్వగ" (ఉత్తరహరివంశం. ద్వి. 49)

అని తక్కళ్లపాటి లింగనామాత్యుడు, మొదలగుకవీంద్రు లిట్టిప్రాసములను గూర్చియున్నారు (క) శసప్రాసము (?)

క. "ఏసియు - - -, వేసరక - - - పొసఁగక కేనా, కేసి - - - ను,హాసుర ముగ - - - కుమా. ద్వా. 949.

వ్రాఁతప్రతియందు 'కేనాకేసి' యని యున్నది; అచ్చుప్రతియందు 'కేశాకేశి' అని యున్నది. అచ్చులోనిపాఠమును జూచి వీరేశలింగముపంతులవారు, నన్నిచోడుడు శస ప్రాసనాంకర్యముఁ జేసినాఁ డని వ్రాసినారు గాని, యజ్ఞశాల - జన్ననాల మొదలగువానివలె, 'కేశాకేశి'కి 'కేనాకేసి' అనునది వికృతపదమై యుండు నని తోఁచుచున్నది. ఇక్కవిగ్రంథమున నిది దప్ప నిట్టి ప్రాసము వేఱొకటి లేదు. మఱియు, నీ శ సల యుచ్చారణము పూర్వకాలమున మన భరతఖండమున నెట్లుండెనో కాని యిప్పుడు కొన్ని దేశములయందు శ-స-ష-స-ల యుచ్చారణము భిన్నముగా వినఁబడుచున్నది. వేషము, వేశము, వేసము; కోసల, కోశల, కోషల; శాసనము, శాశనము, నాసనము - ఇత్యాదులు. ఇది యిట్లుండ నీక్రిందిమహాకవి ప్రయోగములు శసల ప్రాసమైత్రి గలవి కొన్ని తాళపత్త్రగ్రంథములయందు గానంబడుచున్నవి.

క. "ఆసభ నమ్మయి - - -, డై శంక లేక - - -" భార. స్త్రీప.

క. "రాసొబగున నున్నత్తుం, డై శంకింపక - - -" సిర్వ. ష. 11.

క "కంసునిబాధలన్ - - -, వంశము - - - - - -" ఎఱ్ఱనహరివం. పూ. భా.

శా."సంసారభ్రమ - - - -, వంశంబు - - - - - -" శ్రీనా. హరివి. ద్వి

పై శస ప్రాసనాంకర్యము లేఖకులే చేసిరో, కవులనాఁటి కది నిర్దుష్టమై యుండెనో నిర్ణయింపరాదు. కాని విరళముగా నున్న పైప్రయోగాదులనుబట్టి శసప్రాసమును నిర్ణయించుటకంటె, తిక్కనప్రయోగములలో (కొందఱు ముద్రింపించినట్లు) మొదటిదానిని 'సంకు-సుంకు' అనియు, రెండవదానిని 'సెంకింపక'

అనియు— ఎఱ్ఱన శ్రీనాథులు 'సంశయము' అనుదానికి 'సంసెయము' అను వికృతి యుం డెడి దేమో యనియు గ్రహించుట యుక్త మని తోఁచుచున్నది.

౫. రేఫద్వయమైత్రి—ఇది నన్నిచోడని గ్రంథమున నెచ్చటను గానరాదు. నన్నిచోడనన్నయభట్టారకాది ప్రాచీనకవుల గ్రంథములయందు రేఫ ద్వయమునకుఁ గలయిక గానరాదు. అక్కాలమున వానిలేఖనోచ్చారణములు భిన్నముగా నుండినట్లును, తిక్కనాదులకాలమున కవి సడలినట్లును దోఁచు చున్నవి. ఈ రేఫద్వయమైత్రినిగూర్చి యనలక్షణగ్రంథకర్తలు పొందినభిన్నాభి ప్రాయములును, తాళపత్త్రగ్రంథజాలమునఁ గలవ్రాఁతలను నమ్మి వారు పొందిన పొరఁబాట్లును విస్తృతవివాదములను గలిగించుచున్నవి. వానిని దెలుపుట కిచ్చట నిమ్ము చాలమి విరమించితిని (కొన్నిశబ్దములలోని రేఫములకు ద్వైవిధ్య వ్యవహారములు గలవని చెప్పువారికిఁ దిక్కనాదులప్రయోగములే పట్టుఁగొమ్మ లయి నట్లు కనబడెడిని)

### వ్యాకరణవిశేషములు.

బాలవ్యాకరణసూత్త్రములను గొన్నిటిని సవరించుచు, ప్రౌఢవ్యాకరణ సూత్త్రములను గొన్నిటిని బోషించుచు సంపూర్ణాంధ్రవ్యాకరణ మావశ్యకమే యని ఘోషించుచుఁ గొన్నిప్రయోగము లిమ్మహాకవిగ్రంథమున గోచరించుచు న్నవి. వానిలోఁ గొన్నిటినిమాత్ర మిచ్చట సంగ్రహముగఁ జూపుచున్నాను:—

౧. "లుక్సంశ్లేషౌ నాచి ద్రుతస్య - ద్రుతమున కచ్చుపరం బగునపుడు లోపసంశ్లేషంబులు లేవు" వ్యా. సూ.

(మొదట-'ద్రుతము'-అనుదానిస్వరూపమే పెద్దవివాదములోనిది. దాని విచారణమును మాని మనయాంధ్రవ్యాకరణకర్తల యర్థమునకు గుఱియైన దానినే యిచ్చట వ్యవహరించుచున్నాను.)

సీ. "మనకులదైవ మన్ నున్నన లేదేని, త్రిభువనారాధ్యుఁ డన్ తెంక లేక
పరమయోగాత్ముఁ డన్ భక్తి లేదేనియు, సర్వేశ్వరుం డను శంక లేక
యజశిరోదళనుఁ డన్నదరు లేదేనియు, గాలారియను నోటకండ లేక
విషమాంబకుండను వెఱపు లేదేనియుఁ, బ్రళయాగ్నిరుద్రుఁ డన్ భయము లేక.
(కుమా. చ. 417.)

ఇందు - అన్ + అదరు=అన్నదరు - అని సంశ్లేషము వచ్చినది.

ఉ. పొన్నలు పూచెఁ బొన్న లొగిఁ బూవకముందఱ పూచె గోఁగు లా
పొన్నలఁ గొండగోఁగులును బూనకముందఱ పూచె బూరువుల్

ఇత్యాద్యనుకరణవిహితంబులు ప్రయోగంబు లెందును జూపట్టు చున్నవి గాని పైప్రయోగవైచిత్ర్యముమాత్రము వ్యాగ్యమై యున్నది.

(ర) "సంకా"—కువర్గకంబు పరం బగునపు డుకారం బుకారంబునకు నగాగమం బగు" అని వ్యా. సూ.

చ. "నడు మన వింతిచన్నులతనస్సున ముందఱు గానరాదు మా
కడు గిడుచోటఁ గా ర్దెమలినంతన కౌనుకు బింద మయ్యెడున్"

కుమా. అష్ట. 16.

కవిత్రయమువారును నిట్టిప్రయోగమును జేసియుందురు. కావుననే సీతారామాచార్యులవారు,

"కువర్గకంబు పరంబగునపుడు కవిత్రయంబువారిప్రయోగంబులం దక్కఁ దక్కినమహాకవిప్రయోగంబులందునుం గొన్నియెడల నగాగమంబు సూపట్టదు."

(ప్రౌఢవ్యా. శబ్దప. 19 సూ.)

అని యనేకప్రయోగముల నిచ్చియున్నారు. కావునఁ బైచోడకవిప్రయోగము సాధువే.

౫. పదమధ్యస్వరలోపము:—

తెర్చు, పొడ్మ, ఎగ్గు, దృష్ట్లు....ఇత్యాదిశబ్దప్రయోగములు కుమారసంభవమునఁ గలవు. ఇట్టిప్రయోగములు నన్నియభట్టారకాదులగ్రంథములందును గానవచ్చుచున్నవి:—

తెర్చు—"పర్వతవివరముఁ దెర్చి విగుర్వింపుము"—ఆదిప. సప్త. 275.

పొడ్మ—"బోరన విస్ఫులింగములు వొడ్మఁగ—"ఆరణ్య. ష. 178.

ఎగ్గు—"కావ్యముల నెగ్గవలయు సంస్కారములను" - అప్పక. ప్ర. 120

దృష్ట్లు—"తన్నుఁ గనియనిమిషులైరో....నాఁగ ననిమిషదృష్ట్లను...."

కుమారసం. చతు. 395.

,,—"అమ్ముదితఁ జూచి యన్నయుఁ, దమ్ముఁడు నొక్కట మనోజతాడితులై
రా,గమ్మున నన్యోన్యస్నే, హమ్ములు సెడి *దృష్ట్లు, నిలిపి రయ్యువతి
పయిన్." ఆదిప. అష్ట. 106 ప.

—"లింగవంతులు గానిలెంగులదృష్ట్లు—పాల్కురికి సోమన. బసవపు".

---

*ఆనందముద్రాలయాధిపతులు ప్రకటించినభారతమున 'దృష్ట్లు' అనియే యున్నది. కాని కొందఱు 'దృష్టి' యని ముద్రింపించినారు. నేను జూచిన వ్రాతప్రతు లన్నిట 'దృష్ట్లు' అనియే గానఁబడెను.

౬. కేవలసంస్కృతశబ్దముతోడ నాంధ్రశబ్దము సమసింప దని వ్యాకరణసూత్రము.

అరదాశ్వ = అరద + అశ్వ - అరదానీక = అరద + అనీక-మరుప్రసవ, ఒకక్షణము - ఇత్యాదులు.

ఇట్లే 'కర్ణాటకశబ్దము' నగు 'విగుర్వణము' అనునదియు 'పటువోష్ఠలగర్వ విగుర్వణంబులన్' ఇత్యాదిగ సంస్కృతసమాసమునం జేర్పంబడినది. తెనాలి రామకృష్ణుడును 'ప్రాపనప్రవృత్తి' అను ప్రయోగమును గావించినాడు.

౭. పుడమీశుఁడు (గ్రామ్యము?)

చ పుడమీశుఁడున్ ధనాఢ్యుఁడును భూరిబలుండును . . . '' కుమా. 11 ఆ 61 ప.

ఇందు 'పుడమీశ' శబ్దము గ్రామ్య మని వీరేశలింగముగారు వ్రాసినారు.

పుడమీశాదిశబ్దములు ప్రామాణికకవులగ్రంథములలోఁ గలవు. 'పుడమీశుఁడు' అనుదానిని అనింద్యగ్రామ్యముగానే శబ్దరత్నాకరమున సీతారామాచార్యులుగారు గ్రహించినారు. 'పుడమీశ' అనున దెట్టిదో 'పుడమిప' అనునదియు నట్టిదే 'కఱకంఠా'దులవలె నవ్వియు వికృతులే. ఈప్రయోగములను జూడుఁడు:—

క. పుడమీశ! సత్యవాక్యము, నడపుము - - - సకలకథా. ౨ ఆ. (మా. శ. ర.)

ద్వి. పా. పుడమీశ! మీధనంబునకుఁ జేసాప....'' పాల్కురికి సోమనబసవపు.

ఇత్యాదులు ఇట్టిసమాసపదము లనేకములు మనభాషయం దనింద్యములుగాఁ బ్రయుక్తములై మహాకవులగ్రంథములఁ గానంబడుచున్నవి. అందు గొన్ని యిచ్చటఁ జూపఁబడుచున్నవి.

కాంచనపిండు, కఱకంఠుఁడు—నన్నియభట్టు.

ప్రాణగోడ్డము—తిక్కనసోమయాజి.

తానపతి—యుద్ధమల్లుని బెజవాడశాసనము.

అర్ఘ్యపళ్ళెము—మంచన కేయూరబాహుచరిత్రము.

ముల్లోకవంద్యుఁడు—పాల్కురికి సోమన.

దినవెచ్చము—శ్రీనాథుఁడు, తెనాలిరామ.

జీవగఱ్ఱ—చేమకూర వేంకటపతి (విజయవి.)

పిండకూడు, దర్భత్రాళ్లు—పండితమల్లికార్జునుఁడు (శివత.)

యోగపట్టె—పెద్దనామాత్యుఁడు (మనుచ.)

బడితెపాఠము—గౌరనమంత్రి (హరిశ్చం)

ఇక్ష్వాకునాథు, గురుకరనవృథ, నారదమునిసి, పిననాద్రిధాలు, సర్వాంగ కచ్ఛపము, సుగన్ధైలు, వనలక్ష్మి, రాగిదివియాలు మొదలగు సమాసవికృతు లనే కము లనేకాంధ్రమహాకావ్యములయందు నిరంకుశముగాఁ బ్రయోగింపఁబడి వెలయుచున్నవి.

'పుకమిప' శబ్దము 'పృథ్వీప' శబ్దభవము, కఱకంఠాదులవంటిది. కావున ననింద్యమే యగును.

౮. భావార్థక 'ట' కారమునకు 'డ' కారాదేశము:—

కాంచుట + అరుదయ్యెన్ = కాంచు డరు దయ్యెన్; ఇట్లే-ఒదవు డి దేమి; చేయు డొక పెక్కి,

ఇట్టిప్రయోగములు కవిసార్వభౌమునిగ్రంథమున నవి లెక్కకు మిక్కిలి గానంబడుచున్నవి. వీరేశలింగముపంతులవారిట్లు వ్రాసినారు:—

"ఒదవు టిదేమి యనుటకు, ఒదవు డి దేమి యనురూపము వాడఁబడి నది. తంజాపూరిలోని యఱవవాండ్రకు టడభేదము చక్కఁగాఁ దెలియకపో వుటచేత వ్రాఁతలో నిట్టిరూపములు పడియుండవచ్చును. అవి పూర్వకాలపు రూపము లని భ్రాంతి చెంది ముద్రాపకులు వాని నట్టె యుంచియుందురు. అపూర్వరూపములు వేసినంతమాత్రమున క్రొత్తకవి ప్రాఁతకవి గానేరఁడు. ఈకవి భావార్థక టకారము వాడె ననుట కొక్కయుదాహరణమును జూపె దను:—

క. "దొనఁ గోలఁ గోలవేగం,బున నరిగోల్పుటయుఁ దిరుపుఁ బోరిపోరి విడుపుం
జనుటయు దనుజులఁ గొనుటయు,ననిమిషులకు నైనఁ గాంచు డరుదయ్యె ననిన్.
ద్వి. భా. ౨౩౩.

అరిగోల్పుట, చనుట, కొనుట—అని మొదట మూఁడుచోట్ల టకారము వేసినవారు కడపటఁగూడ 'కాంచుట' అని టకారము వేయక కాంచు డని డకార మేల వేయవలెనో దురూహ్యముగా నున్నది. 'కాంచు టరుదయ్యె' నన్నచో యతిభంగము వచ్చునా? ప్రాసభంగము వచ్చునా? ఏదియును రాదు." (అని వ్రాసిరి)

తంజావూరిలో టడభేదము తెలియని యఱవవాండ్రు, పై పద్యమున మూఁడుచోట్ల టకారము నెట్లు తెలిసినారో, నాలవచోటమాత్ర మేల తెలిసి నారు గారో. పంతులవారు వ్రాయకపోవుటయు దురూహముగానే యున్నది.

మా మహారాజావారు వ్రాయించి తెప్పించిన వ్రాఁతప్రతియందును నిట్టి రూపములు పెక్కుచోట్ల డకారయుక్తము లయియే యున్నవి. భావార్థకట కారమునకు అచ్చుతో సంధికార్యము జరిగించినప్పు డెల్ల డకార మాదేశ మగుచున్నది. పంతులవారు వ్రాసిన ట్లితరస్థానముల, టకారము వేసినను డకారము వేసినను భంగ మేదియు రాదు గాని, ఈక్రిందిప్రయోగములవంటివాని యందు టకారము వేసినచోఁ బ్రాసభంగము తప్పక వాటిల్లును:—

(౧) చ. "పడిఁ ద్రిదశాలి నోర్చు డాకొనవానికి బేరము గాఁగ రజ్జుసె
* ప్పఁ డదియు నీవు సేసిన తపోవిభవంబున - - - - - - - - - -"

కుమార. ద్వి. భా. ౭౬

(౨) క. "ఘనరత్నిధనుర్ధరుఁ డై, యొయ్యడ నజితుఁడు గాన వాని హీనుంగాఁ జే
† యుడ నాకుఁ జతుర్వర్గము, నడయుట యని పృషతసుతుఁడు ప్రార్థించె మునిన్.

ఆది. సప్త. 16

భావార్థకటకార మచ్చుతోఁ గూడినప్పుడు డత్వమును బొందినరూపములే పూర్వరూపములు. అంతియ కాని క్రొత్తకవిని ప్రాఁతవానిని జేయుటకు మఱియొకరు వేసినయపూర్వములు గావు. మఱియు,

ఆంధ్రమహాభారతవ్యాఖ్యానమును వ్రాసిన భారతము లక్ష్మీపతి సోమయాజులగారి కాలమున నయిత మిట్టిరూపము లున్నట్లు కొన్ని దృష్టాంతములు నూపట్టుచున్నవి. అం దొకదానినిమాత్రము చూపెదను:—

క. "సమచిత్తవృత్తు లగుబుద్ధిమంతులకు నిప్పుడు ద్రౌపదీప్రశ్నవిచా
రము సేయవలయు నవిచారమునఁ బ్రవర్తిల్లు డది నరకహేతు వగున్.

సభాప. ద్వి. 226.

---

*(౧) కుమారసంభవము వ్రాఁతప్రతియందును, అచ్చుపొత్తమునందును 'చెప్పఁడు నది' అని యున్నది. సముచ్చయ మెట్లును దప్పలేదు గావునను, 'చెప్పఁడు నది' అనుచోట నున్నసముచ్చయముకంటె, 'చెప్పఁ డదియు' అనుచోటిసముచ్చయ మధికరసవంతమును, అర్థవంతమును నై ప్రాచీనప్రయోగపద్ధతిని దెల్పుచున్నది గావునను, భావార్థకటకార మచ్చు పరమైనపు డెల్ల డత్వమును జెందుచుండుట గ్రంథమునం దంతటను గానవచ్చుచున్నది గావునను కవిప్రయోగము 'చెప్పఁడదియు' అని యుండు ననియే తోఁచుచున్నది.

† (౨) ఈభారతపాఠమున 'చేయుడ' (చేయుట+అ=చేయుటయే) అనుపురాతనరూపమును పరిష్కర్తలు 'చేయుడున్' అనునానంతర్యార్థకరూపముగా గ్రహించి ముద్రింపించినారు. ఆనంతర్యార్థముకంటె నిచ్చట భావార్థమే యన్వయసుభగముగ నుండును. కావున 'చేయుడ' అనునదియే నన్నయ్యప్రయోగము.

అను నన్నియభట్టారకుని పద్యమునం దున్న 'ప్రవర్తిల్లుట' అనుదానిని 'ప్రవర్తిల్లుడు' అనుశబ్దముగానే గ్రహించి, లక్ష్మీపతిసోమయాజిగారు దానికి,

ప్రవర్తిల్లుఁడు=ప్రవర్తిల్లుట—అని వ్యాఖ్యాన మొనర్చినారు. దీనినిబట్టి పూర్వపుఁ బ్రాఁతప్రతు లన్నిట (భావార్థకటకారము నచ్చు సంధించినప్పు డది) డత్వము చెందినరూపములే యుండెడి ననుట విస్పష్ట మగుచున్నది.

మఱియు వీరేశలింగముపంతులవారు, "ఇచ్చుట యన్నదే పూర్వకాలపు రూపము గాని యిచ్చు డన్నది గాదు. 'మాపట్టణములో నంతకంతకు త్రాగుడు హెచ్చుచున్నది.' అనువిధమున నిప్పు డిప్పుడు త్రాగుట యనుటకు త్రాగు డని వాడుకలోనికి వచ్చినది." అని వ్రాసినారు.

'త్రాగుడు' అనునది పూర్వకాలపురూపమే కాని యిప్పటిది గాదు. శబ్దరత్నాకరమున నీశబ్దము వ్రాయఁబడి 'చిట్టకంపుఁద్రాగుడు' అను నాముక్తమాల్యదలోనిప్రయోగ మియ్యఁబడినది.

౯. తత్సమేకారాంతమహతీవాచకములకు యడాగమము:—

కం పా. "తరుణియ యొక్క_ర్తు వికటతాపసివోలెన్." కుమా. ద్వి. భా. 68

ఇట్లే వనేచరియలు (ప్ర. భా. 701), విటియలు (ద్వి. భా. 120) మొదలగునవి.

నన్నియభారతమునను,

"తరుణియ లొప్ప నాడిరి ముదంబునఁ దమ్ము జనాలి మెచ్చఁగన్."

ఆది. అష్ట. 175.

అనుప్రయోగము గానంబడియెడి. ఆనందముద్రాలయాంధ్రమహాభారతమున (1907) 'తరుణియలు' అనియే యున్నది. కాని, కొందఱు పరిష్కర్తలు "తరుణులు నొప్పనాడిరి - - -" అని సవరించి "నిరర్థక మగుసముచ్చయమును దెచ్చి పెట్టి" ముద్రింపించిరి.

శ్రీనాథమహాకవిశివరాత్రిమాహాత్మ్యమున 'సెట్టియమారయ, సెట్టియభీముఁడు' ఇత్యాది తత్సమేతరమహద్వాచకంబులకును యడాగమము గన్పట్టెడిని. పైప్రయోగములనుగూర్చి యింకను వ్రాయవలసినవిషయములు గలవు గాని విస్తరభీతిని ప్రస్తుతము నిల్పితిని.

(౧౦) ఉపమానోపమేయవిపర్యయ, భిన్నలింగ భిన్నవచనాదులుగల ప్రయోగము లనేకములు చోడకవిగ్రంథమునఁ గలవు. వానింగూర్చి కాలనిర్ణయవిమర్శనమున సూచించియే యుంటిని. ఈతెలుఁగుప్రయోగములకుఁ బురాతనదివసములందు శాసనము లు పుట్టియుండలే దని తోఁచుచున్నది.

కుమారసంభవమున నపూర్వము లగుశబ్దములు కొన్ని గానవచ్చు చున్నవి. అందు గొన్ని నిఘంటువుల కెక్కవలసియున్నవి; కొన్ని లేఖకప్రమాద జనితములో కవిప్రయుక్తములో విచారింపవలసియున్నవి:—

(౧) నేని—ఇది హాలాదిగనుఁ గన్పట్టుచున్నది.

> ఉ. "నీపరిరంభణంబు ధరణీపరిరంభణ మయ్యె నన్నుదా
> రోపితశుష్కరోదన మురోదన మయ్యె రతిక్రియాంచితా
> లాపము లాత్తవేపితవిలాపము లయ్యె మనోజ నేనియుం
> జూపవు నిన్ను నన్నొరసి చూచెడొ నాడెనఁ దప్పఁ జూచెడో".
>
> పం. 556.

> సీ. "తలిరాకుకంటెను మెలుపారునడుగులు, ధరమీఁద మోపుఁడుఁ దెరలిపోవు
> గ్రొవ్విరితోవకంటెఁ గోమలం బగుమోము, రేయెండ ముట్టిన నోయుఁ దద్ద
> దవనంపుఁబొటకంటె ననకంపుమెయితీవ, వడగాలి సోకుఁడు వాడు లగ్గ
> నాఁగ ర్భేశ్వరి వంటినఁ గందెదు, నెలక న్నెటుంగవు నేని ముంద
> ఱున్నయునికిన వెలునడ నుత్సహింపఁ, దలఁచి తేనియు నిది దుదిదాఁక నెట్లు
> నెయిద నేరదు గానవీవింద యుండి, కోర్కి నేకుఱ నర్వేశుఁగొలువు మబల!"
>
> షష్ఠా. 670.

నన్నియతిక్కనలును 'నేని' ని బ్రయోగించినారు:—

ఉ. "వాఁడిమయూఖముల్ - - - - - - కెచుండు నేన్రియున్." అది. తృ. 111 వ.

ఉ. "నీవును జూచి తట్టినభ నైని వివంబడ దేయుగంబులన్." సభా. ద్వి. 95.

ఉ. "కావలివారిఁ దోలి - - - - - - యాతల కెద్దుట లేదు నేనియున్."

విరా. చతు. 192.

౨. రేయెండ—(చూ. పైని వ్రాసిన సీసపద్యము.)

సీ. పా. "గ్రొవ్విరితోవకంటెఁగోమలంబగు మోము, రేయెండముట్టిననోయుఁదద్ద"

నన్నిచోడుఁడు మొదలగుప్రాచీనకవులు 'రేయెండ' శబ్దమును బాలా తపపరముగా నుపయోగించియున్నారు. శబ్దరత్నాకరమున 'రేయెండ' యన 'వెన్నెల' యని యర్థము వ్రాయఁబడినది. కాని యిది విచార్యము. లక్షణచే 'వెన్నెల' గావచ్చు ననికొందఱు. ఎట్లయినను పూర్వప్రయోగములుమాత్రము 'ఈరెండ' అనునర్థమునే యిచ్చుచున్నవి:—

సీ. పా. వెలుఁగొందు రేఖాంతమేమఁ ద్రొక్కిడి యుచ్చి, రాజితంబుగఁ బత్రావళులను.
నన్నెచో.

సీ. పా. ''సమరవికాసంబు చెనుటనొప్పుఅకుంఠ, హాటిదేశతలు రేయెండనాడుచు''
తిక్కన.

సీ. పా. ''ఒకదీవి నిండుచంద్రికలు మిన్నులు వ్రాఁకు, నొకదీవి రేయెండ యుబ్బికాయు''
శ్రీనాథుఁడు.

సీ. పా. ''రేకులన్నియు విచ్చి రేయెండ జిగినిండి, కర మొప్పు తెల్లతామరలకంటె''
భాస్కర.

3. ఆలించి విను—

సీ. పా. ''అలిరుతి సెవిపెట్టి యాలించివిని పోలి, పరనశస్త్రై యుండుభ్రకరులు''
కుమా. ప్ర. ౪1.

వ. '' - - - - అద్దెస యాలించి విని - - - '' కుమా. పం. 566.
నన్నియ—''చిత్తగించి వినుము - - - '' ఆది. చతు. 36 ప.
మల్లన—''అంచలార! యాలకించి వినుఁడు'' చంద్రభా.
పినవీరన—''లిఖితుఁ డిట్లను శంఖుఁ డాలించి వినఁగ''. జైమినీభా.

ఇట్లే కటాక్షించి చూచు—మొ.

౪. సమూహి—సురసమూహి (ద్వి. 225), గణికాసమూహి (తృ. 351) నీరదసమూహి (దశ. 355) వసుసమూహి అష్ట. 191 - - - ) ఇట్టివే భస్మాంగి (శివుఁడు), దాసి (దాసుఁడు) మొ.

౫. నిరుఋతి—ఇక్కడి నిర్ ఋతి (నిర్ఋతి)యనుటకు నిరుఋతి యని (ద్వా. 522) నాలుగులఘువులు గలదానిఁగాఁ బ్రయోగించియున్నాఁడు. రంగనాథుఁడును,

ద్వి. ''గణుతింప నిరుఋతి గాఁడు నీకోడ, రణవిశారదుఁ డగు రాముండు గాని'' యుద్ధకాం. అని ప్రయోగించినాఁడు. పాల్కురికి సోమనయు నిట్లే ప్రయోగించినాఁడు.

ఇది కాళిదాసుని 'త్రియమ్బకం' వలె వేదోచ్చారణము ననుసరించి వ్రాయఁబడిన దని యింతకుమున్న కాలనిర్ణయవిమర్శమున వ్రాసియే యున్నాను. ఇట్లే,

అలరులమందహాసమున కన్నినపల్లవమంజుగీతి రా
చిలుకలముద్దుమాటలను జెందలిరాకులరాగలీలఁ గో

కిలసినపదంబులన్ బర్హిబర్హా కేశభరంబున ముక్తసక్తమై
ఖిల నభిరామమయ్యె నహాకాంతతాంగి మఘప్రాంగతిన్. కుమా. చతు. 463.

సీ. పా. "జలజాతకైరవోత్పలకల్హారాదిగంధంబు లోలి సద్గంధములుగ"
నవ. 271.

అనునీపద్యములయందు 'బరుహి, కలుహారి' అనునవి సంహిత లేకుండ (బర్హి, కల్హార,) పై 'నిర్ ఋతి' వలెనే ప్రయోగింపఁబడినవిగాఁ దోఁచెడిని, వీనిని నయిత మితరకవు లిట్లే వాడియున్నప్రయోగము లున్నవేమో తాళపత్త్రగ్రంథములయందు వెదకవలసియున్నది. మఱియు,

సీ. "మొలుపారు నెలవాఁవితలిరులనొకకొన్ని గమనీయమగు చంపకములు వొడివి,
లాలితాశోకపల్లవముల నొకకొన్ని కమనీయ మగు కుర్వకములఁ బెట్టి--"
5 ఆ. 502.

ఇందు 'కురవకము' అనుదానిని 'కుర్వకము' అని ప్రయోగించినాఁడు. 'ఆరగ్వధము, ఆర్గ్వధము' వలెఁ బూర్వము దీనికి 'కురవకము, కుర్వకము' అని రూపద్వయ ముండెడిదో, కురువకము (లేక గురువకము) అనువికృతిపద ముండెడిదో విచారింపవలసియున్నది.

(౬) స్త్నేహము:—

"ఆహారి విడిచి నిసర్గ, స్త్నేహంబునఁ బాలుదెంచె..." కుమా. దశ. 442

అని వ్రాఁతప్రతియందు 'స్త్నేహ' మనురూప మపురూపముగఁ గానవచ్చుచున్నది.

"శ, ష, స" అనునివి యమాయనునాసికములతోఁ గూడినప్పు డాయా యనునాసికముల వర్గప్రథమాక్షరము లాగమములుగా వచ్చి చేరును. (ఇది వేదవిధి) వీనికిఁ గ్రమముగ నుదాహరణము:-

పద్భ్యామధరేణ శిశ్న్చా, నిష్ట్ర రమ్ప్శుక్, నవిఁనన స్త్నాయాత్. ఇత్యాది.

కావుననే విద్వత్క-విశిరోమణి యగుశ్రీనాథమహాకవి,

ఉ. "ధీనిధి సెట్టినంబి తనదేహమునిండ విభూతినంగళ
స్త్నానము సేసి ధౌతపరిధానముఁ గట్టి........" హరవి. ద్వి. 36.

అని 'స్త్నాన' శబ్దములోని తకారమునకు యతిని గూర్చి, తన వేదవిధిజ్ఞతను నెఱపినాఁడు. ఇప్పటికిని గొందఱు పెద్దలు 'స్త్నాతకము' మొదలగువానిని తకారయుక్తములు గానే పలుకుదురు. ఇదిగాక ఆన్లవార్థక మగు 'తానము' అనువికృతికి 'స్త్నానమే' ప్రకృతియై యుండినట్లు చూపట్టుచున్నది. కాకున్న తకారమున కాకరము గానరాదు.

(౭) ధారుణి—

ధరణి, ధారుణి, ధారిణి—అనురూపములే కాని, 'ధారుణి' యనురూపము లేదని కొంద ఱందురు. చిరకాలమునుండియు తెలుఁగుపొత్తముల వ్రాఁతప్రతులయందును, అచ్చుప్రతులయందును 'ధారుణి' యనురూపమే కాని 'ధారణి, ధారిణి' అని భూమ్యర్థమున రూపములు గానరాలేదు.

మ. "మణికోదండము లింద్రచాపములుగా........ధా
రుణియుం గప్పుచుఁ ద్రోచి రోలిఁ దాలుకొరుం బోలె......"

కుమా. ఏకా. 705.

అని నన్నిచోడకవిరాజును,

చ. గుణముల నొప్పి బ్రాహ్మణులకుం గడు భక్తుఁడ వై సమస్తధా
రుణిప్రజ సొంపుఁగా విగతదోషుఁడ వై........" ఆదిప. సప్త. 128.

అని నాగనుశాసనుఁడును యతిస్థానములయందే 'ధారుణి' శబ్దమును ప్రయోగించియుండుటచే మనయాంధ్రకవులు దీని నీరూపముతోడనే సాధువుగా గ్రహించిరని తెలియనగుచున్నది. అనేకవిషయముల సంస్కృతవ్యాకరణనియమములను పాటింపని మనయాంధ్రకవుల నిరంకుశప్రయోగములలో నిది యొకటిగా నెన్నఁదగియున్నది.

(౮) అచ్చరువు—అచ్చెరువు.

కవిరాజశిఖామణి యీరెండుశబ్దములను ఉపయోగించియున్నాఁడు. ఇందు 'అచ్చరువు' అనుపదమును గాంచి వీరేశలింగముపంతులవారు,

"అచ్చెరువు అనుటకు 'అచ్చరువు' అని యపశబ్దము వేయఁబడినది."

అని వ్రాసినారు.

"అరుణజలంబు లాడి, తురగాజినవస్త్రము లర్థిఁ గట్టి, భీ
కరకరిదానకర్దమము గస్తురి గాఁగ నలంది - - - చాల న
చ్చరువుఁ బిశాచకాంతలు విశాచములం దవిలించి కొల్పొఁగన్."

కుమా. ద్వి. భా. 768.

ఇట్లే 468 పద్యమునఁ 'అచ్చరువడి' అని ప్రయోగింపఁబడినది. మఱియు,

"అరుదుగఁ జంద్రకాంతనిలయంబులలో విహరింతు రర్థిఁ దా
రరయఁగ నెల్లవారికి బయల్పడి తోఁపఁగ నంద కొంద ఱ
చ్చెరువుగ నింద్రనీలరుచి చీకటి - - - - - - - - - - - "

కుమా. ప్ర. భా. 258.

ఇట్లే ప్ర. భా. 406, ద్వి. భా. 838, 941-పద్యములయందు 'అచ్చెరువు' లోని 'చ్చె' పాదప్రథమాక్షరముగాఁ బ్రయోగింపఁబడినది. కావున సూరకవి, 'అచ్చరువు, అచ్చెరువు' అని రెండురూపములను వాడినాఁ డనుట స్పష్టము.

ఇందు మొదటిది 'అచ్చరువు' ఆశ్చర్యశబ్దభవము. 'నిశ్చయమ్-నిచ్చయము, నిశ్చలమ్-నిచ్చలము; శ్యామా-చామ; పశ్చాత్-పజ్జ-నంటిది' ఇది కేవలసంస్కృతశబ్దమునుండి పుట్టినప్రాచీనరూపము. రెండవది 'అచ్ఛేరం' అను ప్రాకృతమునుండి పుట్టిన తెనుఁగువాడుకరూపము. నన్నయభట్టారకాదికవులు పూర్వరూపమును విడనాడినారో, ప్రయోగించినారో తాళపత్రగ్రంథములను బరిశీలింపవలసియున్నది.

మఱియు, "చాలరేఁగునకు 'చలరేఁగు' అని యిక్కవి ప్రయోగించినాఁ" డని కీ. శే. తేవప్పెరుమాళ్లయ్యగారు వ్రాసిరి (ద్వి. భా. 690 పద్యమును జూడుఁడు) 'చలరేఁగు' అనునది 'చలపట్టు' మొదలగువానివంటిది. కావున దుష్టము గాదు.

కుమారసంభవములోని 'తోఁకరాడి, పోలనాడి' ఇత్యాదిశబ్దములను గాంచి వీరేశలింగముపంతులవారు, 'ఇక్కవి క్త్వార్థకేకారసంధిని గూర్చినాఁ' డని వ్రాసినారు. కాని, ఇవి పెనఁగాడు, దిట్టాడు, మట్టాడు, ఊఁగాడు, తేలాడు, నిలుచుండు, అందిచ్చు మొదలగువానివలె శబ్దపల్లవములు.

చోడకవీంద్రుని సంస్కృతశబ్దప్రయోగములయందును కొన్నివిశేషములు గలవు. వానిం గూర్చినచర్చను గ్రంథవిస్తరభీతిని ప్రస్తుతము నిల్పితిని.

## పాఠభేదములు.

కవిరాజశిఖామణికుమారసంభవము వ్రాఁతప్రతికిని, ముద్రితగ్రంథమునకును గొన్నిపాఠభేదములు గలవు. అందు చాలవఱకు 'ముఖ్యపాఠభేదములు' అనుశీర్షిక గలయనుబంధపత్త్రమును రెండవభాగముకడపటను గ్రంథసంపాదకులు చేర్చియే యున్నారు. ఇఁక నచ్చటచ్చట నున్నవి యెల్ల స్వల్పములగు నక్షరభేదములు మాత్రమే.

ఈగ్రంథము ప్రాచీనమైన దని తోఁపించుటకై గ్రంథసంపాదకులగు రామకృష్ణకవిగారు దానియందు పెక్కులు మార్పులు గావించినా రను గొప్ప ప్రవాద మొకటి లోకమున మిక్కిలియుఁ బ్రాఁకియున్నది. వ్రాఁతప్రతికిని ముద్రితగ్రంథమునకును గలభేదములలో ముఖ్యమైనది యిది:—

క. "మునుమార్గకవిత లోకం, బున వెలయఁగ దేశికవితఁ బుట్టించి తెనుం
గును నిలిపి రంధ్రవిషయం, బునఁ జనఁ జాళుక్యరాజు మొదలుగఁ బలువుర్".
వ్రాఁతప్రతి.

క. మునుమార్గకవిత - - - - - - - - - - తెనుం
గు నిలిపి రంధ్రవిషయమునఁ, జనసత్యాశ్రయునిఁదొట్టి చాళుక్యనృపుల్".
అచ్చుప్రతి.

ఇందు మొదటిపాఠమునయినను పిమ్మట రెండవభాగమునను బంధమున వెలువరింపఁబడియే యున్నది. రెండవపాఠము రామకృష్ణకవిగారియొద్ద నున్న వేఱొకప్రతిలో నున్నదేమో తెలియఁజాలము.

తక్కిన భేదములలో-నేను చూచిన వ్రాఁతప్రతికిని ముద్రితపుస్తకమునకును గలపాఠభేదములలో—కొన్ని, యిప్పటిఛందోవ్యాకరణనిబంధనములకు లోంగనిప్రయోగములు కొన్ని దుష్టము లనునభిప్రాయమున నాధునికలక్షణములకు సరిపడునట్లు సవరింపఁబడినవిగాఁ గానవచ్చుకొలఁదిమార్పులే నైయున్నవి; మఱికొన్ని లేఖకప్రమాదజనితములై యున్నవి. ఇవ్విషయములఁ దెలుప నొండు రెం డుదాహరణములనుమాత్రము చూపెదను:—

అ-(౧) ప్రాసము-

ఎ. గీ. "చిత్రవర్ణాతిశయనూత్న + రత్నచిత్రి, తాంగరంగవల్లీసురంగాంగణములు
వ్రాఁతప్రతి.

" " చిత్రవర్ణాతిశయరత్న + చిత్రితాంగ*రంగవల్లీబహుసురంగాంగణములు
(సప్త. 9-7) ముద్రిత.

క. "వేణుజమౌక్తికములు - - - - వీనుల కింపెసఁగ నెఱుకు + వెలఁదులు
వ్రాఁతప్రతి. (ష. 705.)

క. "వేణుజ ,, గానాల కింపెసఁగ నెఱుకుఁ + గన్నెలు-ముద్రితపుస్తకము

సీ. పా. "ఘోరకాంతారసంహారకారణ మగు, వనవహ్ని కెచ్చుటఁ దృణకణంబు
వ్రా. ప్ర. (దశ. 537)

" ,, ,, మగు, కార్చిచ్చునకు నెంత గడ్డిపఱక-ముద్రితపాఠము.

ఇందు నణప్రాసము సవరింపఁబడినట్లు గన్పట్టెడిని.

---

*ఇందు గణము తప్పినది. (ఈ గీతమున, త్ర, త్న ప్రాసము సవరింపఁబడినదిగాఁ దోఁచుచున్నది.)

(౨) యతి—

చ. సకలకళాధరుండు జలజప్రభవుండు విరించి యుండఁ, బా
　యక సిరిఁ దక్కనేలిన మురాంతకుఁ డుండ, సమస్తదేవతా
　ప్రకరముగొల్వ నున్నసురపాలకుఁ డుండఁగ నిట్టిమూర్ఖ భి
　క్షుకు నపరాద్ధు నేమిగతిఁ గల్చితి శంకరుఁ బంకజాననా" వ్రా. ప్ర. సప్త 856.
భి, క్షుకు నపరాద్ధు నేమిగతిఁ గోరితిశంకరుఁ బంకజాననా?" ముద్రితపుస్తకము.

ఇందు భిక్షుక, శబ్దము దుష్ట మనుభ్రమమున 'భిక్షుక' అని దిద్దఁబడి, దానికి యతిని సరిపుచ్చుటకై 'కల్చితి' అనునది 'కోరితి' గాఁ జేయఁబడిన దని తోఁచెడి.

(౩) వ్యాకరణము:—వనేచరియులు, దృష్ట్వ, ఎర్గు-ఇత్యాదులు కొన్ని సవరింపఁబడినవి. మఱియు,

"ఈశానదత్తి త్రిశూలాయుధం బెత్తి - - - -,' ద్వాద. 797. వ్రా. ప్ర.
ముద్రితపుస్తకమునందు నిట్లేయున్నది గాని శుద్ధపత్రికయందు 'దత్తి' అను సవరణ చూపఁబడినది. 'దత్తి' అనునది ప్రాచీనశాసనములయందు బహుళము గఁ జూపట్టుచునే యున్నది గాన సాధువే—

(౪) అక్షరభేదములు:—

క. "వీం డేమిసేయుఁ బంచిన, వాం డుండఁగ నిక్కమునకు వధ్యుఁడు గా నా
　ఖండలుఁడు గాక యేసిన, వాం డుండఁగ నేమిసేయు నంశర మనిలోన్".
　　　　　　　　　　　　　వ్రాఁతప్రతి (దశమా. 520)

ఇందు 'ఏసిన' అనుటకు 'ఏలిన' అనియు వరశరము అనుటకు 'పరికరము' అనియు ముద్రింపఁబడినది. ఈ లేఖకప్రమాదమువలన రసభావములు పోయినవి. మఱియుఁ బ్రాచీనకవిసమ్మతము గాని 'పవ'ల యతియు సిద్ధించినది. పైని వ్రాసిన భేదములవంటివి దక్క, నన్నిచోడకవిని ప్రాచీనునిఁ జేయుటకై కావించిన మార్పు లెవ్వియును లేవు.

## ప్రక్షిప్తములు.

వ్రాఁతప్రతిలోఁ గానవచ్చుచు, ముద్రితగ్రంథమునఁ గానరాక జాఱి పోయినపద్యము లొండురెండు గలవు:—

(౧) ప్రథమభాగము 943 (వరువడి - - - అను) పద్యము తరువాత,

క. "కులగిరులు బలసి కొలువఁగఁ, బొలు పగుహేమాద్రివోలెఁ బురవరహార్మ్యా
　వలి నడుమఁ గనకమయమై, యలఘుతరోన్నతిగ రాజహర్మ్యము వెలుఁగున్."
అనుపద్యమును,

(౨) ద్వితీయభాగము 520 (క. వీండేమి సేయు ....అను) పద్యముతరువాత,

"వ. అదియునుం గాక,

"క. గుణములునుమునులునుసుకవులు, పరిచారకులు బ్రాతలును బరాంగనలునుహీ
నులును మిత్రులు బాలుర, నిరతము సంపద దగ దెంత సేరకయున్నన్.

అనువచనపద్యములును,

(3) ద్వి. భా. 684 (అంత నొండొంటి - - - అను) వచనముతరువాత—

"తే గీ ఉభయబలభటకోపజ్వలోగ్రవహ్నిఁ
బొగలు మునుముట్టి నుఱి మంట లెగయునట్లు
పాదఘట్టనమునఁ దూలి పర్వి పొదల
నస్త్రఘట్టన నుఱి లోహితాగ్ని లెగసె.

"వ. ఇట్లతిభయంకరం బైనసంకులయుద్ధంబున,

అనుపద్యవచనములును ముద్రితపుస్తకమున లేవు.

(౪) వ్రాతప్రతియందును, అచ్చుపొత్తమునను గానరాక యీక్రింది పద్యము 'ప్రబంధమణిభూషణము' అనుసంకలితగ్రంథమున నన్నిచోడనికుమార సంభవములోని దని యుదాహరింపఁబడి నట్లు లఘుటీకగలయనుబంధమున సంపాదకులు వ్రాసియేయున్నారు.

ఉ. "భూచరు లంబరంబున నె పోవుట మే లన నంబరేచరుల్
భూచరవృత్తి మే లనఁగ భూచరఖేచరు లాజలప్రకే
ళీచరణంబు మే లన జలేచరు లంబరమధ్యయాన ధా
త్రీచరణంబు మే లనఁగఁ దీవ్రనిదాఘము పర్వె నుర్వరన్."

బ్ర. శ్రీ. రామకృష్ణకవిగారు, గ్రంథపీఠికయందు తమకు కుమారసంభవముప్రతులు మూఁడు లభించియున్న నని వ్రాసినారు. తంజావూరివ్రాఁత ప్రతిలో లుప్తములై యున్నభాగము లేముద్రితపుస్తకమునందును గానరాక, ఆయాస్థలములఁ జుక్కలు పొడుపఁబడియున్నవి. భిన్నదేశములయందు పుట్టిన ప్రతులు మూఁటియందును ఒక్కచోటనే పాఠములు పోయియుండుట యెల్ల వారికి నాశ్చర్యముఁ గొలుపకమానవు. కవిగారు లోకమునకుఁ గల యీసందేహాశ్చర్యములను దీర్పవలసియున్నారు.

రామకృష్ణకవిగారియొద్ద నున్నప్రతులు మూఁడును ఏకమాతృకకే పుత్త్రికలేమో యని యనుకొనుటకు—వా రచ్చటచ్చటఁ జూపిన 'పాఠభేదములును,

వారిచ్చిన 'ముఖ్యపాఠభేదములు' అనుశీర్షిక గలయనుబంధపత్త్రమును, ఒండు రెండుచోట్లఁ గల లుప్తభాగపూరణములును-వలనుపడనీయ కున్నవి:—

౧. పాఠాంతరము లనునవి:—ప్రథమభాగము 417 పద్యములోని ఎత్తుగీతిపాదములకు-పుటయడుగున సూచిక చూ. ౫౮ పుట.

ద్వితీయభాగము 356 పద్యములోని మూఁడవపాదమునకు లఘుటీక చూడుఁడు. 36. పు.

౨. ముఖ్యపాఠభేదములు — ఈశీర్షిక గలపత్త్రము ద్వితీయభాగము కడపటఁ జేర్పఁబడియే యున్నది.

3. లుప్తభాగపూరణములు — పంచమాశ్వాసము 549 పద్యము (సీసము) లోని 3, 4 పాదములును; ఎత్తుగీతిలోని 1, 2 పాదములును, 580 ప. సీ. మొదటిపా. 2 దళమును, సప్తమాశ్వాసము మూఁడవపద్యము సీసము నెత్తుగీత రెండవపాదమును వ్రాఁతప్రతియందు లేవు. ఇట్టి వింకను అందందు కొన్ని గలవు. వీనింగూర్చి యనేకు లనేకవిధములుగఁ జెప్పుదురు. ఎవ రేమి చెప్పిన నేమి? ఎవ రేమన్న నేమి? ఏది యెట్లున్న నేమి?

అనాంధ్రదేశమునఁ జూచునట్టిదిక్కు లేక పడియుండిన యుత్తమోత్తమమైన యిమ్మహాకావ్యము పురువులపా లయి నశింపకుండ, శ్రమముమై సంపాదించి, యాంధ్రలోకమునకు సులభసాధ్య మగు నట్లాచ్చొత్తించి, మాసిపో నున్న మనకవిరాజశిఖామణికీర్తిని నిలువంబెట్టి యాంధ్రులకు నామోదము నొడఁగూర్చిన బ్ర॥ శ్రీ॥ మ॥ రా॥ రా॥ శ్రీ॥ మానవల్లి రామకృష్ణకవిగారు తెలుఁగువారి కందఱకు నభినందనీయులే యగుచున్నారు. మఱియు వేయిసంవత్సరములకుఁ బూర్వమే యాంధ్రకవితాసతీమతల్లి, యుత్తమకావ్యరత్నభూషణవిభూషితయై త్రిలింగవాఙ్మయరంగమున మహోన్నతదశను విహరించుచుండినసంగతి నాంధ్రలోకమునకు వెల్లడించుచున్న యశశ్శరీరుఁడు మహారాజకవిరాజశిఖామణి నన్నిచోడదేవుఁడును నాంధ్రమహాజనులకు సంతతస్మరణీయుఁ డగుచున్నాఁడు.

నడకుదుటి - వీరరాజు.

శ్రీ

# గ్రాంథికవ్యావహారికభాషావివాదతారావళి.

---

సీ. శ్రీమించునొసలం జెరువుక్రొన్నెలపూవు చెలువారు లేఁతవెన్నెలలు గాయ
వెలిదామరలకు విందులు సేయు కన్దోయిఁ గరుణాకటాక్షవీక్షణము లొలయ
నాల్గుహస్తముల వీణాలతాపుస్తకస్ఫటికాక్షమాలికల్ పరిఢవిల్ల
స్తనగళత్సంగీతసాహితీరసమయక్షీరముల్ సుతులనో రూరఁ జేయఁ
దమ్మిగద్దెమీఁద నెమ్మిఁ గొల్వై యి మహాదరము వెలయ దివ్యదర్శనమ్ము
మాకొసంగుచున్న మాతల్లి నీకివే, వందనమ్ము లాంధ్రవాఙ్మతల్లి ౧

ఆ. "దేశభాషలందుఁ దెలుఁగులె" స్సని మహా, రాజసుతులు గాంచి ప్రబలు నీకు
నతులభాగ్యవతికి సుతుల మైతిమి మాకు, నింతకంటెఁ బెంపిఁ కేటు గలదు.

చ. దరిసెనపూలమొత్తనయుఁ దేనియతీపును బండువెన్నెలం
బరఁగిన తేట గప్పురపుఁబల్కుల చల్లనితావి గల్గి పె
న్మరు వెసలారఁగాఁ గరము ముద్దులు గుల్కెడు కల్కిపల్కులన్
మురిసెడు నీదుగర్భమునఁ బుట్టిన యాంధ్రులభాగ్య మెట్టిదో. ౩

శా. మాయమ్మా నిజపుత్రకుల్ గలసి యెమ్మాడ్కిన్ నినుం బెద్దగాఁ
జేయంగల్గునొ యంచుఁ బెక్కుగతులం జింతించుచున్నారు నీ
శ్రేయోవృద్ధికి నేది మంచితెరువో చెప్పంగదే దేశభా
షాయోషామకుటీమణీమయవిభూషా యాంధ్రభాషాసతీ. ౪

చ. కడుకొని నీదు పెంపునకుఁ గానిది యౌ నిది గాదటంచు నీ
కొడుకులలోన నొండొరులకుం దగవుల్ ఘటియిల్లె నమ్మ నీ
యెడ నెడ భక్తిలేని సుతు లేరును లే రిరువాఁగునందు నే
వడువున నింక వీరలవివాదములం దొలఁగించి ప్రోచెదో. ౫

సీ. నిను వేల్పుబాసతోఁ బెనఁచి ప్రోడను జేయునన్నయ్యకవినాథు తెన్ను హితవో
జిలిబిలిముద్దుఁబల్కులు నేర్పి నినుఁ బెంచు తిక్కన్నసుకవీంద్రుపక్కి హితవో
సూక్తివైచిత్రిచే సొబగు నించి ప్రసిద్ధిగావించు నెఱ్ఱన్నత్రోవ హితవో
కమనీయగజరాజగమనమ్ము గఱపి నిన్ దగఁ బ్రోచు శ్రీనాథుదారి హితవో
కోమలశిరీషతులితసుధామయోక్తి, సంపదలఁ గూర్చు పెద్దన్నసరణి హితవో
కాక యీనాఁటిగ్రామ్యోక్తికలనహితవో, చెప్పవే తల్లి యేమార్గ మొప్పు నీకు.

ఉ. నన్నయముఖ్యపూర్వకవినాథులు సొంపులు దిద్ది గ్రామ్యతా
పన్నతఁ బాపి నిన్నుఁ బెఱబాసవెలందులలోన నెంతయుం
మిన్నగఁ జేసినా రదియు మే లనుకొంటిమి గాని దాన నీ
కున్నతి గల్గదందు రిది యొప్పునొ యొప్పదొ నీవ చెప్పుమా. 7

సీ. పరమపావనకథావిరచనాకలనమై మనసురంజించు రామాయణమ్ము
తత్త్వరసములందుఁ దన్మయత్వమ్మునాపాదించుశ్రీమహాభారతమ్ము
ముక్తినిదానమై భక్తిరసావేశపరవశత్వముఁ గూర్చు భాగవతము
శ్రుతిపర్వమై ప్రౌఢకృతిసంతతికి శిరోభూషణమ్మై యొప్పునైషధమ్ము
తే. మొదలయిన పూర్వకృతులలోఁ బొదలుభాష
ప్రాఁబలుకు బాసయుంబోలెఁ బ్రాఁతవడియెఁ
బనికిరా దది యీనాఁటి ప్రజలకందు
రకట కొంద ఱీవే మందు నంబ చెపుమ. 8

తే. అతులితాధ్యాత్మరామాయణాదికృతులు, నందనులచేతఁ బాడించినావుతొల్లి
యిపుడు కటకట "యెత్తినా యెంకి" పాట, నీకు నింపయ్యెనే యాంధ్రలోకజనని

ఆ. దినదిన మ్మొకొక్కతీరుగా మాఱుచు, దారి తెన్ను లేక నోరికొలఁది
వాడఁబడుచునున్న పలువేసములబాస, తల్లి కైఁతలకును దగునె చెపుమ. 10

ఆ. బ్రదుకు దారవోసి పాశ్చాత్యభాషైక, పాండితిం గడించుప్రౌఢులకును
గొన్ని నెలలు నిన్నుఁ గొలువ నోపిక లేదొ, మాత నీదురూపు మాపనేల. 11

ఆ. పండితులు మాటలాడెడుభాషలోనఁ, గైఁత సెప్పుట లోకోపకార మండ్రు
పామరులబాస చేసినపాప మేమొ, మాత యదిగూడ నుద్ధరింపంగఁ దగదె.

క. ఇద్దానికి దిగినన్ మఱి, హద్దుండునె యిచ్చవచ్చినట్టులు మార్పన్
ముద్దులు గులికెడు నీనగు, సుద్దులు చెడిపోవె నియమశూన్యము లగుటన్.

ఆ. కన్నతల్లి వీవు గావంచు నీపద, సేవ లింక శవముసేవ లంచు
మఱియు నీదురూపు మాఱిపోయె నటంచు, నిందు నందు దూఱుచుందు రకట

మ. అవునా మాఱవె నీవునన్ నిజముగాదా లేదనన్ వచ్చునే
కవివర్యుల్ నిజకావ్యసంతతులఁ దత్కాలమ్మునం గల్గుస
ద్వ్యవహారోక్తులు సంస్కరించి కయికోరా దాననే నీకుఁ బెం
పవుఁగా కొక్కటఁ బుట్టి మున్గినటు క్రొత్తా యిట్టిమార్పేటికో. 15

శా. స్వాతంత్ర్యప్రియులయ్యుఁ దిక్కనముఖుల్ ప్రాచీనమార్గమ్మునం
జేతఃప్రీతిదలిర్పఁ గైఁతలను దేశీయోక్తులం గూర్పరే

యా తీరొప్పదె మాటలాడుకొనుచు న్నట్లుండదే యానుడుల్
నాతా దీనికి లేనిపోనితగ వేలా నీవ యూహింపుమా. 16

ఆ. తొంటిదారి మార్పు దొరకొన్న నీసుతుల్, వ్రేలుసూప మంత్రిగఁ జూతు
రదియుఁ గాక కొంత బెదరులేకె దనీదు, కొలువు నేవగించుకొందు రకట.

క నెట్టన మునుతమపట్టిన, పట్టు విడువలేక విసివిసలు దెఱఁగుల నిన్
దిట్టలయి సభలలోఁ బడఁ, గొట్టుదురట కొడుకు లెంత తెంపరితనమో. 18

సీ. పువ్వుఁదేనెసోనలై చెవులపండువు సేయు కలికిపలుకుల ముద్దుగులుకు నిన్ను
నియతి దప్పక కృతిక్రియల నొప్పులుగొన్న యిల్లాలవై యుల్లసిల్లు నిన్ను
నాచంద్రతారార్క మవనినిల్చెడు మహాకవులైన కొడుకులం గన్న నిన్నుఁ
బ్రణుతవిద్వత్కవిప్రభువర్యులగు వేలమన్నిగ్రహమున్నసల్ గొన్న నిన్నుఁ
"తెవులుగదిరి క్రుళ్ళిచివుకులం జియయయి, త్రెళ్ళె" నని యొఁబ్రొఁత తెనుఁగుఁ గమ్మ
జనని సాధ్వి నిట్టులనఁగూడునే వింతె, కొడుకునుడులు చెప్పఁగొనిన సిగ్గు. 19

ఉ. భారతికిల్లునాఁ బరఁగి పండితపామరహృద్య మైనయా
భారతభాష వచ్చె నని వల్కిరి పాపము శాంతమౌత మీ
పై రచియింతురో మరలభారతమున్ వ్యవహారభాష నే
దీ రచియింపరాదె యదియెట్లు రుచించునొ చూత మన్నరో. 20

ఉ. చీటికిమాటికిన్ నిను నిసీయనుచున్ వెలయాలనంచుఁ దా
రేటికి దూఱఁగావలె నదేపనిగా నిదియేటి న్యాయ మీ
పాటి భవత్తిరస్కరణపద్ధతి మాని సుబోధమంచు ము
మ్మాటికిఁ దారు మెచ్చెదు: నంచితభాష నెకొల్వరాదొకో. 21

ఆ. పుట్టగొడుగు లెన్ని పుట్టవో గిట్టవో, కట్టులేసి రోసఁ బుట్టుకృతులు
గాలికెగిరిపోవుఁ గాక విలిచ్చునే, భారతాది కృతుల పగిది జగతి. 22

ఉ. భారతముఖ్యసత్కృతులపద్ధతి నాఱడిపుచ్చి యిచ్చమై
నోరికి వచ్చినట్టులు నినుం గృతులన్ వికృతస్వరూపఁగాఁ
గూరిచి వాడఁజొచ్చి రిదిగూడదు నా వినిమానువారలె
వ్వారును గారు కాల గుణివాగ్య మిఁకేగతి మారిపోవునో. 23

తే. ప్రకృతిమాత్రఁ గాలము మాత్ర భాషమాత్ర
మంచికో చెడ్డకో యిట్టి మార్పువచ్చె
మాన్ప నెవ్వరి శక్య మీమార్పు తుదకు
నంబ నీకు శుభోదర్కమగును గాక. 24

ఉ. కన్నులు మూసి పెన్గఱపుకక్కుఱితిం బెఱబాసఁ గోల్పుటన్
మొన్నటిదాఁక నీజగము మున్నతి యేగతఁగల్గు నస్తలం
పున్నదె నీదుపుత్త్రులు కహో యది యిప్పుడు గల్గె దానకా
భ్యున్నతిసూచకమ్మిది యు పో యెటులైన శుభమ్ము నీకగున్. 25

సీ. సంస్కృతాంధ్రాంగ్లేయనానారస్వతానూనవిజ్ఞానసంపత్ప్రవీణమతులు
సామాన్యదుర్జ్ఞేయసకలభాషాతత్త్వసారసంగ్రహకలాసంగరతులు
భాషాళివిమలవాగ్ధాటీరమాతోషితాశేషవిద్వజ్జనాభినుతులు
భాషాంగనామణీభూషాయితవిచిత్రకల్పనాకల్పితానల్పకృతులు
తే. గాని సర్వసాధారణులఁ గారు సూవె,యిరువెఱంగుల నినుఁ గొల్వనెంచువారు
వీరి నొండొరు నేకీభవింపఁ జేసి, మంచిదారిని నడపింపుమా మదంబ. 26

ఆ. ఉభయవాదులకును నుల్లములందు నీ, హితమిదంచుఁ జక్క నెఱుఁగఁ జెప్పి
యీసు లుడిపి కలపి నీసేవసేయించి, ప్రోపునొంది మమ్ముఁ బ్రోవు మంబ. 27

త్రిపురాన వేంకటసూర్యప్రసాదరావు.

---

ఆంధ్రసాహిత్యపరిషత్తు:

## త్రయోదశవార్షికసభావృత్తాంతము.

ఈత్రయోదశసభ కృష్ణామండలములోని తెనుకులోఁ గరణములసత్రములో అ 1924 సం॥ అక్టోబరు నెల ది 9-10-11-12-13 తేదులు (గురు, శుక్ర శని, ఆది, సోమవారములు) జరగినది. పలుతావులనుండి యాహ్వానింపఁబడినవారును మఱియు ననేకులు భాషాభిమానులును, పెక్కురుపౌరమహాశయులును విచ్చేసిరి.

మహారాజశ్రీ, ఆచంట వేంకటరాయసాంఖ్యాయనశర్మగారు — (పార్వతీపురము) సభాధ్యక్షులు.

,, ఆచంట వేంకటరావుగారు— పార్వతిపురము.

,, రావుసాహెబు గిడుగు వేంకటరామమూర్తిపంతులుగారు, బి ఏ, పర్లాకిమిడి.

మహారాజశ్రీ, గిడుగు సీతాపతిరావుగారు—బి. ఏ., పర్లాకిమిడి.
,, బంకుపల్లి మల్లయ్యశాస్త్రిగారు—పర్లాకిమిడి.
,, శ్రీత్రిపురాన వేంకటసూర్యప్రసాదరావుదొరగారు—సిద్ధాంతము గంజాముజిల్లా.
,, విద్వాన్ గరిమెళ్ల సోమన్నగారు—ఎం. ఏ, విజయనగరము.
,, కోరాడ రామకృష్ణయ్యగారు—ఎం. ఏ, విజయనగరము.
,, నిడుదవోలు వేంకటరమణరావుగారు—బి ఏ., విజయనగరము.
,, విద్వాన్ కత్తి సాంబమూర్తిశాస్త్రిగారు—నరసన్నపేట, గంజాము.
,, పుష్పాల ఆనందగజపతిదొరగారు—విశాఖపట్టనము.
,, గొబ్బూరు వేంకటానందరాఘవరావుగారు—బి. ఏ, ఎలమంచిలి.
,, కవిరాజు, శ్రీవత్సవాయ వేంకటనీలాద్రిరాజు గారు—తుని.
,, శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రిగారు—పిఠాపురము.
,, నడకుదుటి వీరరాజుగారు—పిఠాపురము.
,, ఉమర్ ఆలీషాకవిగారు—పిఠాపురము.
,, సత్యవోలు రాధామాధవకవిగారు—పిఠాపురము.
,, ఆంధ్రవిద్యావాచస్పతి, కావ్యనిధి, కొత్త శ్యామలకామశాస్త్రి గారు—కరప (కాకినాడ.)
,, పొక్కులూరి లక్ష్మీనారాయణగారు—కరప, (కాకినాడ.)
,, శతావధాని చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారు—కడియము.
,, కవిరాజ శ్రీపాదకృష్ణమూర్తిశాస్త్రిగారు—రాజమహేంద్రవరము.
,, చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు—రాజమహేంద్రవరము.
,, చిలుకూరి నారాయణరావుగారు—ఎం ఏ. రాజమహేంద్రవరము.
,, నాళము కృష్ణారావుగారు—రాజమహేంద్రవరము.
,, బోడపాటి సత్యనారాయణగారు—రాజమహేంద్రవరము.
,, భమిడిపాటి కామేశ్వరరావుగారు—బి. ఏ., రాజమహేంద్రవరము
,, రాళ్లబండి సుబ్బారావుగారు—బి ఏ, రాజమహేంద్రవరము.
,, తల్లాప్రెగడ సూర్యనారాయణరావుగారు—కొవ్వూరు.
,, ద్రోణంరాజు కామేశ్వరరావుగారు—రాజమహేంద్రవరము.
,, కురుగంటి సీతారామయ్యగారు—ఎం. ఏ., కొవ్వూరు.
,, అనిపెద్ది జగన్నాథశాస్త్రిగారు—కొవ్వూరు.

మహారాజశ్రీ. ఆచంట సూర్యనారాయణరాజుగారు—నిడుదవోలు.

,, టి వి. యస్. ప్రకాశరావుగారు—నరసాపురము.

,, చర్ల నారాయణశాస్త్రిగారు-ఆహ్వానసంఘాధ్యక్షులు-కాకరపఱ్ఱు

,, అల్లమరాజు సత్యనారాయణశాస్త్రిగారు— కాకరపఱ్ఱు.

,, వేదుల రామచంద్రశాస్త్రిగారు—కాకరపఱ్ఱు.

,, వేదుల సూర్యనారాయణశాస్త్రిగారు— కాకరపఱ్ఱు.

,, ఇనటూరి సుందరయ్యగారు—అమలాపురము

,, బండారు తమ్మయ్యగారు—అమలాపురము.

,, మున్నంగి లక్ష్మీనృసింహశర్మగారు—ఏలూరు.

,, ఈదర వేంకటరావుగారు—ఏలూరు.

,, వేలూరి శివరామశాస్త్రిగారు—శతావధాని, చిరివాడ కృష్ణాజిల్లా.

,, రుద్రరాజు నరసింహరాజుగారు—పోడూరు.

,, అయ్యంకి వేంకటరమణయ్యగారు—బెడవాడ.

,, కొడాలి ఆంజనేయశర్మగారు—బెజవాడ.

,, కొలిపాక వేంకట అప్పారావుగారు—బెజవాడ.

,, తుర్లపాటి గోవర్ధనరావుగారు—బందరు.

,, గుడిమెళ్ల తిరుమలశేషాచార్యులుగారు—తెనాలి.

,, కోన వేంకటరాయశర్మగారు—పెద్దచెఱుకూరు, బాపట్ల.

,, తుమ్మల సీతారామమూర్తి చౌదరిగారు—కావూరు, రేపల్లెతా.

,, సాహిత్యసరస్వతి మంకాలదొరసామయ్యగారు—మాంబళము, చెన్నపురి.

ది 9 తేదియుదయము శ్రీయుత నిడుదవోలు వేంకటరమణరావు బి ఏ, గారు భారతీదేవిని సంస్కృతశ్లోకములతోను, కవిరాజు శ్రీపాదకృష్ణమూర్తిశాస్త్రి గారు వేదవాక్యములతోఁ బ్రార్థనము గావించినపిమ్మట సాహ్వానసంఘాధ్యక్షులు తమస్వాగతోపన్యాసమును జదివిరి.

కవిరాజ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు, వ్యాసునివంటి యధ్యక్షుఁ డుండఁదగిన యీసభకు, భాషావేదులు, లోకజ్ఞులు, వ్యాసతుల్యులు న్యాయ వాదులును, శ్రీమేరంగిరాజుగారిదివానును సర్వగుణలక్షితులు నగు శ్రీయుత ఆచంట వేంకటరాయసాంఖ్యాయనశర్మగారు అధ్యక్షులుగా నుండఁదగినవారని చెప్పుచు నిప్పటిభావకవిత్వములు వెంకిడొంకిపాటలు ముచ్చటించుచు, శ్రీసాం

ఖ్యాయనశర్మగారు కొంతకాలము ప్రకటించిన కల్పలతాపత్త్రికం దెల్పి వారి సామర్థ్యమును వెల్లడించి, యుపపాదించిరి. దానిని రా॥ సా॥ గిడుగు వేంకట రామమూర్తి పంతులు బి. ఏ., గారు బలపఱచుచు సభ్యులు స్వయంకృషిని పాండిత్యము సంపాదించిన వారి యసామాన్యశక్తిని, విమర్శకతాశక్తిని స్తుతించిరి. అధ్యక్షునిపైఁ బుష్పవృష్టిఁ గురిసిరి.

మధ్యాహ్నమున:—రాఁజాల మని వ్రాసినవారి యుత్తరములు ఆహ్వానసంఘకార్యదర్శులలో నొకరగు బ్రహ్మశ్రీ యేలూరిపాటి రామభద్రచయనులు గారు చదివినపిమ్మట నధ్యక్షోపన్యాసము కావింపఁబడినది. తర్వాత సరస్వతిపైఁ శ్రీ॥ కందుకూరి వీరబసవరాజుగారు పద్యములు చదివిరి. అనంతరము:—కవి కొండల వేంకటరావు బి. ఏ. బి. ఎల్., గారు, అఖిలాంధ్రసారస్వతమును గూర్చిన వ్యాసముం బఠించిరి.

ది 10 తేది ప్రొద్దున, పుష్పవృష్టి యనంతరము శ్రీకురుగంటి సీతారామయ్య ఎం. ఏ., గారి వేదవాక్యములతో సభ ప్రారంభ మయ్యెను:—

1. కోరాడ రామకృష్ణయ్యగారు ఎం. ఏ., భాషోత్పత్తిక్రమము. భాషా. చరిత్రము 2. విద్వాన్ గరిమెళ్ల సోమన్నపంతులుగారు ఎం. ఏ. ఎల్. టి., ఆంధ్రమున కాది యనునవియు, మధ్యాహ్నము 1. బండారు తమ్మయ్యగారు, పిల్లలమఱ్ఱి పినవీరభద్రకవి వాణీనారాణి 2. పెనుమెత్స సత్యనారాణరాజుగారు, అన్యభాషాపదములు 3. అనిపెద్దిజగన్నాథశర్మగారు సాహిత్యము సారస్వతము 4. మున్నంగి లక్ష్మీనరసింహశర్మగారు ఆంధ్రసారస్వతము తత్త్వపరిణామము. ఈ వ్యాసములు చదివిరి.

ది 11 తేదియుదయమున 1. నడకుదుటి వీరరాజగారు కవిరాజశిఖామణి కావ్యవిశేషములు 2. ఇవటూరిసుందయ్యగారు స్వభాషోద్ధరణము 3. గిడుగు సీతాపతిరావు బి. ఏ., గారు, పద్యరచనావ్యవస్థ—సమ్మయలక్షణము నను వ్యాసములు చదివిరి మధ్యాహ్నమంతయు రావుసాహెబు గిడుగు రామమూర్తిపంతులు బి. ఏ., గారు వ్యావహారికభాషావిషయ మువన్యసించిరి.

ది 12 తేదియుదయమున 1. సాహిత్యసరస్వతి, మంకాలదొరసామయ్యగారు శాకుంతలసంశయనిరసనము 2 తల్లాప్రెగడ సూర్యనారాయణరావుగారు ఉత్తరరామచరిత్రము—రాముఁడు దయాశూన్యుఁడా 3. శ్రీత్రిపురాన సూర్యప్రసాదరావు దొరగారు గ్రాంథికవ్యావహారికభాషా వివాదము పద్యములు, 4 పొక్కులూరి లక్ష్మీనారాయణగారు అనర్థకవాఙ్మయము 5. ఆంధ్రవిద్యావాచ

స్తుతి, కావ్యనిధి కొట్రశ్యామలకామశాస్త్రిగారు ప్రపంచమందలికావ్యములలో రామాయణస్థానము 6. గొబ్బూరు వేంకటానంద రాఘవరావుగారు బి. ఏ., గారు తిక్కనకవిబ్రహ్మ ఆంధ్రజాతికొసంగినమహాసందేశము 7. ఆచంట సూర్యనారాయణరాజుగారు ఆంధ్రభాషప్రస్తుతస్థితి, అనునీవ్యాసములును, మధ్యాహ్నము:— 1. శ్రీకవిరాజువస్రవాయ వేంకటనీలాద్రిరాజుగారు, విగుర్వణము 2. చిలుకూరి నారాయణరావు ఎం. ఏ., గారు సోమయాజులనియమములు 3. విద్వాన్ కట్రి. సాంబమూర్తిశాస్త్రిగారు శబ్దలక్షణసంగ్రహము 4. కోన వేంకటరాయశర్మగారు నాటకములుఅను వ్యాసములుచదివిరి 5. భమిడిపాటి కామేశ్వరరావుగారు బి. ఏ., నాటకములు, అందును సాహిత్యనాటకముల యావశ్యకత యను విషయముం గూర్చి యుపన్యాసము గావించిరి.

ది 13 తేదిని 1. అల్లమరాజు సత్యనారాయణశాస్త్రిగారు సంస్కృత మహాకవులు, బిరుదములు 2. పుల్లెల శ్రీరామశాస్త్రిగారు, అభినవాంధ్రకవితా పితామహ స్మృతి 3. సత్యవోలు రాధామాధవరావుగారు, తాళపత్రగ్రంథములు, లేఖకులు ననువానింజదివిరి 4. శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రిగారు పిఠాపురములో జరగుచున్న శ్రీసూర్యరాయాంధ్రనిఘంటుకార్యమునుగూర్చి ముచ్చటించిరి. 5 కవిరాజ శ్రీపాదకృష్ణమూర్తి శాస్త్రిగారుపద్యములుచదివిరి. ఉమ్రా ఆలీషాగారు కొంతయుపన్యసించిరి. 7. పెన్మరాజు సీతారామసోమయాజిగారి వర్ణలిపి యను వ్యాసము కట్టకడపటిరాత్రి కొంతచదువఁబడినది. పలువురు కార్యక్రమములోఁ జెప్పఁబడినవారు రానికారణమున వారి వ్యాసములు చదువఁబడలేదు.

ఈనాఁడు కార్యనిర్వాహకసభ కొంతసేపుజరగినది.

అనంతరము సభాధ్యక్షులు సభ్యులను, అయిదుదినములు నిర్వహించిన ఆహ్వానసంఘమువారి నభినందించుచు సభ ముగించిరి.

## కార్యనిర్వాహకసభ.

ది 12 అక్టోబరు 1924 సంవత్సరము, ఆదివారము సాయంకాలము (రక్తాక్షిసం॥ ఆశ్వయుజశు ౧౫) తణుకులో, కరణములసత్రములో సమావేశమైన పరిషత్కార్యనిర్వాహక సభావిషయము.

—వచ్చినసభ్యులు:—

౧ మ-రా-శ్రీ, ఆచంట వేంకటరాయసాంఖ్యాయనశర్మగారు పార్వతీపురము.

౨ ,, తల్లాప్రెగడ సూర్యనారాయణరావుగారు కొవ్వూరు.

౩ మ-రా-శ్రీ, రా॥ సా॥ గిడుగు వేంకటరామమూర్తిగారు. బి. ఏ పర్లాకిమిడి.
౪ ,, శ్రీత్రిపురాన వేంకటసూర్యప్రసాదరావుగారు సిద్ధాంతము.
౫ ,, ఈదర వేంకటరావుగారు ఏలూరు.
౬ ,, శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రిగారు పిఠాపురము.
౭ ,, చిలుకూరి నారాయణరావుగారు ఎం.ఏ. రాజమహేంద్రవరము.
౮ ,, చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు రాజమహేంద్రవరము.
౯ ,, శతావధాని చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారు కడియము.
౧౦ ,, అయ్యంకి వేంకటరమణయ్యగారు బెజవాడ
౧౧ ,, పరిషదుద్ధారకులు శ్రీతునిమహారాణిగారిపక్షమున శ్రీవత్సవాయి నీలాద్రిరాజుగారు తుని.
౧౨ ,, గొబ్బూరు వేంకటానందరాఘవరావుగారు బి. ఏ. ఎలమంచిలి.

—తీర్మానములు:—

౧ ఈసభకు శ్రీయుత ఆచంట వేంకటరాయసాంఖ్యాయనశర్మగారధ్యక్షులుగా నెన్నుకొనఁబడినది

౨. కావ్యనిధి చెలికాని లచ్చారావుగారును పండిత వంగూరి సుబ్బారావుగారును కీర్తిశేషులైనందున వారి యకాలమరణమున నాంధ్రభాషకు జరిగిన కొఱఁతకు వగచుచు వారికి శాశ్వతానందము కలుగుఁగాకయని యీసభవారు కోరుచున్నారు

ఈసభ రేపటియుదయమునకు నిలుపుచేయుటయైనది.

ది ౧౩ అక్టోబరు, ఉదయమున మరల సభ ప్రారంభము.

3. ఈక్రిందివారిని గౌరవసభ్యులుగాఁ జేర్చుకొనుట యైనది.

౧. శ్రీయుత గురుగంటి సీతారామయ్యగారు ఎం ఏ. (హానర్సు) కొవ్వూరు
౨ మంగిపూడి వేంకటశర్మగారు తణుకు.
3. చెర్ల నారాయణశాస్త్రిగారు కాఁకరపఱ్ఱు.
౪. విద్వాన్ కజ్జి సాంబమూర్తిశాస్త్రిగారు వరసన్నపేఁట.

౪ సభ్యులుగాఁ గ్రొత్తగాఁ జేరువారు సొమ్ము చెల్లించునఱకు సభ్యులుగా నెన్నుకొనఁబడరు. అని తీర్మానమైనది.

౫ ఈక్రిందివారు సాధారణసభ్యులుగాఁ జేర్చుకొనఁబడిరి.

౧. ఏలూరిపాటి రామభద్రచయనులుగారు తణుకు.

౨. నడకుదుటి వీరరాజుగారు పిఠాపురము.

౩. కొత్ర శ్యామల కామశాస్త్రిగారు, కరప, ఆంధ్రవిద్యావాచస్పతి.

౪. కొడాలి ఆంజనేయశర్మగారు బెజవాడ.

౫. గుదిమెళ్ల తిరువేంకట శేషాచార్యులుగారు తెనాలి.

౬. నాళము కృష్ణారావుగారు, రాజమహేంద్రవరము.

౭. బోడపాటి సత్యనారాయణగారు, రాజమహేంద్రవరము.

౮. ద్రోణంరాజు కామేశ్వరరావుగారు, రాజమహేంద్రవరము.

౯. శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు రాజమహేంద్రవరము.

౧౦. అనంతపంతుల రామలింగస్వామిగారు పార్వతీపురము.

౧౧. కొలిపాక వెంకటప్పారావుగారు బెజవాడ.

౧౨ బండా సూర్యనారాయణపంతులుగారు బి. ఏ. ఎల్. టి. తణుకు.

౬. రుధిరోద్గారిసంవత్సరము కార్యనివేదనము చదివి యామోదింపఁబడినది.

౭ గతసంవత్సరము తునిలో జరగిన తీర్మానము ననుసరించి పరిషత్కార్యస్థానమును ఆంధ్ర దేశమునకు వెంటనే మార్పవలయు ననియు గతతీర్మానములో "కాకినాడకు" అనుటకుమారు "రాజమహేంద్రవరమునకు" అని మార్పవలయు ననియు నీసభవారు తీర్మానించుచున్నారు.

౮. ఈసంవత్సర మాంధ్రసాహిత్యపరిషత్తునకు మ॥ శ్రీ॥ ఆచంట వేంకటరాయ సాంఖ్యాయనశర్మగారధ్యక్షులుగా నుండుటకుఁ దీర్మానించుట యైనది.

౯. పరిషత్తువారు పరిష్కరించి ప్రకటించిన ప్రాచీనగ్రంథములలోని పాఠములు బుద్ధిపూర్వకముగా మార్చుట యుచితము గాదనియు నిప్పటివఱకుఁ బ్రకటించిన గ్రంథముల కనుబంధములుగా వ్రాఁతప్రతులలోనిపాఠములు వెంటనే ప్రకటింపవలెననియుఁ దీర్మానించుటయైనది.

౧౦. గ్రామ్యము కాని వ్యావహారికాంధ్రభాషలోఁ బూర్వసాంప్రదాయము ననుసరించి గ్రంథములు రచింపవచ్చు నని యీసభవారు తీర్మానించుచున్నారు.

౧౧. ఇటుమీఁదట పరిషద్వార్షికసభలు జరగించినపుడు ముఖ్యమైన శాస్త్రములను గుఱించి కళలను గుఱించి యొక్కొక్కదాని కొక్కొక్క శాఖ యేర్పఱిచి దానియందాసక్తి గలవారు దానితో సంబంధించినవిషయములు సవిస్తరముగాఁ జర్చించుట కనుకూలమగునట్లు చేయవలయునని తీర్మానించుట యైనది.

౧౨. పరిషత్తువారు తలపెట్టిన యుద్యమము లనేకములు నెఱవేఱనందు కీసభ వారు మిక్కిలి విచారించుచున్నారు.

౧౩. చందాలు చెల్లింపని సాధారణసభ్యుల పేళ్లు, ఈ తేది మొదలుకొని యాఱు మాసములలోగా బాకీసీదాగాఁ జెల్లింపకుండిన రిజస్టరులోనుండి తొలఁగింపవలసిన దనియు నట్టివారు మరల సభ్యులు కాఁగోరినయెడల బాకీయున్నసొమ్ముతోఁగూడ ముందుగాఁ గ్రొత్తచందా చెల్లింపవలయు ననియుఁ దీర్మానించుటయైనది.

౧౪. ఆంధ్రదేశగ్రంథాలయసంఘాధ్యక్షులగు శ్రీసూరి వేంకట నరసింహశాస్త్రిగారు తంజావూరుసరస్వతిమహాల్ గ్రంథాలయమందుఁ గలయాంధ్ర గ్రంథముల వివరణపట్టికను దయారుచేయుటను గూర్చి వ్రాసినయుత్తరమును జదివి యందుకై రూ. 500 ముందుసంవత్సరము బడ్జెట్టులోఁ జేర్చుటకుఁ దీర్మానించుట యైనది.

౧౫. రాజమహేంద్రవరము గౌతమీగ్రంథాలయమువారు తమభవనమునఁ బరిషత్కార్యాలయమునకుఁ దగినంత తావిచ్చెద మని లేఖవ్రాసి యిచ్చియున్నారు గాన వారిదానమునకు వారినభినందించుచు గ్రంథాలయసంఘమువారి తీర్మానము పరిషత్కార్యస్థానమునకుఁ జేరిన యాఱుమాసములలోఁగాఁ గార్యస్థానమును మార్పుచేయవలయునని యీ సభవారు తీర్మానించుచున్నారు.

౧౬. సాహిత్యపరిషత్తు యొక్క నిబంధనలను, ఈసభలో నామోదింపఁబడిన తీర్మానముల ననుసరించి మార్చుట కీక్రిందివారి నుపసంఘముగా నేర్పఱచుట యైనది. వీరిని వేదికమును ఈ తేది మొదలు 6 మాసములలోఁగాఁ బరిషత్తున కందఁజేయవలయును.

౧. తల్లాప్రెగడ సూర్యనారాయణరావుగారు. (కార్యదర్శి)
౨. అయ్యంకి వేంకటరమణయ్యగారు.
3. చిలుకూరినారాయణ రావుగారు ఎం ఏ.,

౧౭. కీర్తిశేషులైన కొమర్రాజు లక్ష్మణరావుగారిస్థానమున మ॥ తల్లాప్రెగడ సూర్యనారాయణరావుగారిని గార్యదర్శిగ నియమించుచుఁ గార్యస్థానము రాజమహేంద్రవరమునకు మాఱువఱకు మ॥ గుమ్మిడూరి వేంకటరంగరావుగారు, ఇప్పటివలెనే యచ్చటి కార్యక్రమమును జరపుచుండవలయు ననియు నీసభవారు తీర్మానించుచున్నారు.

౧౮. పరిషత్తు సభ్యులు చెల్లింపవలసినచందాలు తరగతివారిగా సంవత్సరమునకు రూ. 6, రూ. 4, రూ. 1 చొప్పుననుండవలయుననియు, రూ. 1 చెల్లించు వారి కోటునిచ్చునధికారము మాత్రముండవలయు ననియు రూ 4 ఇచ్చువారికిఁ బత్రికకూడఁ బంపవలయు ననియు రూ. 6 ఇచ్చువారికి, ఈయధికారముతోపాటు కార్యనిర్వాహకసభకుఁ బ్రతినిధులుగా నిలుచునధికార ముండవలయు ననియు నీ సభ వారుతీర్మానించుచున్నారు అని రా॥సా॥గిడుగు రామమూర్తిపంతులుగారు, కోడవాటి సత్యనారాయణగారును బెట్టినయీతీర్మానమును ఎవ్వరునంగీకరింపలేదు. తీర్మానము త్రోసి వేయఁబడినది.

౧౯. రాఁబోవునాంధ్రసాహిత్య పరిషత్సభను గుంటూరుమండలములో జరుపుటకుఁగాను ఆహ్వానించుచున్నాము.

అని కోన వేంకటరాయశర్మగారు తుమ్మల సీతారామమూర్తి చౌదరిగారును ఆహ్వానించిరి.

౨౦ అధ్యక్షులుగు శ్రీయుత్ ఆచంట వేంకటరాయసాంఖ్యాయనశర్మగారు పరమ శాంతముతోను సమర్థతతోను సభా కార్యక్రమము మంగళాంతముగ నిర్వర్తించినందుకు ఈసభ వారు వారికి హృదయపూర్వకవందనము లర్పించుచున్నారు. వచ్చిన ప్రతినిధులకు సమస్తసౌకర్యములను గలుగఁజేసి యాదరించినందుకు ఆహ్వానసంఘాధ్యక్షులకును గార్యదర్శులకును, ఆహ్వానసంఘమునకును వందనముల నర్పించుచున్నారు.

# ప్రాకృతకావ్యములు.

విద్వాంసు లగువారు వివిధభాషాతారతమ్యవిమర్శనము (Philological Research) దధికశ్రద్ధ గలవారై నూతనవిశేషములఁ గనుఁగొనుచున్న యీ కాలమందుఁ బ్రాకృతభాషను గుఱించియుఁ దద్భాషానిబద్ధకావ్యములను గుఱించియుఁ గొంతవఱకు నుపన్యసించుట యనావశ్యకము కాదు. బౌద్ధులగ్రంథములన్నియు, పాలీభాషలో వ్రాయఁబడి యున్నట్లు జైనులగ్రంథము లన్నియు నీ ప్రాకృతభాషలో వ్రాయఁబడి యున్నవి. ఈజైనపండితులలోఁ బ్రాచీనులైన ఆచార్యహేమచంద్రుఁడు, జినదేవముని, జినధర్మసూరి, రుద్రదేవుఁడు, సిద్ధసేనుఁడు, ప్రభచంద్రసూరి, మానతుంగాచార్యుఁడు, బప్పభట్టు, వీరగణి మొదలగువారు ప్రాకృతవాఙ్మయమునకే గాక సంస్కృతవాఙ్మయమునకుఁగూడ సంవర్ధకులైనవారు ప్రాచీనహిందూదేశచరిత్రము చాలవఱకు జైనవాఙ్మయము వలననే తెలియవచ్చుచున్నది. ప్రాకృతసంస్కృతకావ్యములు ప్రాకృతసంస్కృత నిఘంటువులు, జ్యోతిస్సిద్ధాంతగ్రంథములు, వ్యాకరణశాస్త్రగ్రంథములు, తర్కగ్రంథములు, మొదలగునవి యెవ్వి గలవో యవి యన్నియును జైనులవలననే మనకు లభించినవి. ఇపుడు హిందూదేశమందు మాటలాడఁబడుచున్న ఘూర్జరీ మహారాష్ట్రి మొదలగు దేశభాషలకు సంస్కృతమునకు నడుమను ప్రాకృతభాష యనునొక ద్వార మేర్పడక పోయినయెడల వానియుత్పత్తిప్రకారము వానిపరిణామవిధులు మన కేమియుఁ దెలియకుండ నుండవలసి వచ్చును. ప్రాకృతభాషసహాయమువలననే మనము దేశభాషలఁ దెలిసికొనఁ గలిగితిమి. అది లేనిచో నవి యన్నియుఁ బ్రహేళికలవలె దుర్జ్ఞేయార్థములై యుండును. ఇంతియకాక యీప్రాకృతగ్రంథములు మనకు మఱియొకయుపకారమును గూడ, నొనరించుచున్నవి బౌద్ధమతోత్పత్తికి మహమ్మదీయులు హిందూదేశము నాక్రమించుకొనుటకు మధ్యనున్న కాలమందు జరిగినవృత్తాంతమును, సంస్కృతగ్రంథములకంటె నధికతరముగాఁ దెలుపుచున్నవి. ఆకాలమందు ప్రాకృతభాష జనవ్యవహారమం దుండెను. ప్రాకృతగ్రంథములు కూడ మొట్టమొదట సంస్కృతగ్రంథములకంటె సులభతరముగా సామాన్యజనులు తెలిసికొనఁదగినవి గా నుండెను. అర్థపుష్టి రసము లేక కేవలశబ్దాడంబరమయ మగునర్వాచీన సంస్కృతకవనముకంటెఁ బ్రాకృతకవనము స్వభావసిద్ధమైనమనోహరత్వము

మాధుర్యము, మార్దవము, శ్రావ్యత గలదియై యుండును ఈదిగువవ్రాసిన శ్లోకములఁ జూడుఁడు. శాతవాహనుని గాథాసప్తశతి చతుర్థశతకము—

1 "ణగుణేణ హీరఇ జణో హీరఇ జోజేణ భావిఓ తేణ।
మోత్తూణపుళిందా మో త్తిఆఇం గుంజాఓ గేణ్హన్తి" (నగుణేన హ్రియతే జనో హ్రియతే యోయేన భావిత స్తేన। ముక్త్వా పుళిందా మౌక్తికాని గుంజా గృహ్ణన్తి).

2 "ణవిణా సబ్భావేణ ఘేప్పఇ పరమత్థజాణుఓ లోఓ,
కోజుణ్ణమజ్జరం కాంజియేణ వేఆరిఉం తరఇ".

(నవినా సద్భావేన గృహ్యతే పరమార్థజ్ఞో లోకః। కోజీర్ణమార్జారం కాంజికయా ప్రతారయితుం శక్నోతి.)

ఇపుడు మన కున్నప్రాకృతగ్రంథము లల్పసంఖ్యాకములై యున్నవి. మఱికొన్ని ప్రాచీనగ్రంథములను గనిపెట్టి పైకిఁ దీసినయెడల సంస్కృతవాఙ్మయములోని కొన్నిగ్రంథముల కాలమును నిర్ణయించుటకు సాధనములై యుండును.

ఇట్లు బహుకాలము సంకరస్థితిలో నున్న యీప్రాకృతభాష కాలక్రమమునఁ జెప్పశక్యముగాని వికృతినొంది యనేకశాఖలుగా మాఱి పోయినది. సంస్కృతనాటకకవులు సంస్కృతమును బ్రాకృతముగా మార్చుట కారంభించినది మొదలుకొని చెడినది. నానాఁటి కిది పండితులకుఁ దప్పఁ దదితరులకు దుర్బోధ మయ్యెను. భవభూతి మాలతీమాధవము సప్తమాంకములోని యీ వాక్యమును జూడుఁడు. దేవాలయమునందు మాలతి లవంగికతోఁ జెప్పెడు వాక్యము—

"తస్సిం దిహాఏ కుసుమాఉరుజ్జాణ పేరంత రచ్ఛా ముహ సమాయమే సవిచ్ఛముల్లసిఅ కోఊహాళుప్ఫుల్ల పరిసరు వ్వేల్లమాణ సవిళాస మసిణసిణిద్ధ సంచార చారు తారయాఅ వియంభమాణాణంగ సింగారాయరియ సవ్వాయమోప దేశ ణిమ్మావిద వియద్ధ ముద్ధ మణహరా ఎయే ణిరూవిదా విట్ఠిసంభేదా"

రాజశేఖరుని బాలరామాయణము ద్వితీయాంకము.

"ఇదోవి ఎదే ఉత్తుంగలంగూలగ్గాలింగిఅ గఅణంగణుచ్ఛంగా ఘణఘోణఘురుఘురాఘోస ఘగ్ఘరిజ్జన్తగళగుహాకుహారఫాలఫుల్లగల్లవిదురిల్లా విజ్జుప్పుంజపింజరిద దిట్ఠిచ్ఛటాకడక్ఖదుప్పేచ్ఛా సహస్సత్తి సీహసంఘా ఓదరంతి"

ఈభాష వ్యవహారములోనుండి తొలఁగిపోయిన తరువాత వ్యాకరణములు వ్రాయఁబడినవి. ఈవ్యాకరణము లైనను సంస్కృతశబ్దములను బ్రాకృ

తములోనికి మార్పువిధానము నే నేర్పుచున్నవిగాని అసలు దేశ్యశబ్దములకు లక్షణమును జెప్పవు. అనేకసంస్కృతశబ్దముల కొక్కటియే ప్రాకృతరూపము. వీనిని దెలిసికొనుట యెంతచిక్కుగా నుండునో చూడుఁడు. "అవతార, అపచార, అపకార-అనునీమూఁడింటికి "ఓయార" అనుప్రాకృతరూప మొక్కటియే. అట్లనే గత, గద, గజ, అనువానికి "గఅ"; పాద, పాత, పాక అనువానికి "పాయ"; పాంశు, పాశ, వాస అనువానికి "వాస" ఇట్లనేకములు గలవు. ఇట్టి కష్ట మీప్రాకృతమందే గాక మూలభాషలనుండి పుట్టిన యితరభాషాశబ్దముల వ్యుత్పత్తులయందుఁ గూడఁ జూపట్టుచున్నది. ఇట్టియుదాహరణములు ఫ్రెంచి భాషలో మెండుగా నున్నవి.

é (though written et) stands for et.
a (though written ai) for habet.
vu (though written veut) for vult.
pu (written peut) for potest.
voi (written voit) for videt.

ఈభాషకు మొట్టమొదట వ్యాకరణమును వ్రాసినవాఁడు వార్త్తికకారుఁడైనవరరుచి. దీనికి హలాయుధుఁ డొకవృత్తిని వ్రాసెను. క్రీ. శ. 1089-1174 మధ్యను జీవించిన హేమచంద్రుఁడు ప్రాకృతశబ్దానుశాసన మను నొకపెద్ద వ్యాకరణమును వ్రాసెను. ఇపు డున్నప్రాకృత వ్యాకరణములలో నిదియె మిగులఁ బ్రసిద్ధికెక్కినది. వాల్మీకి యొకవ్యాకరణమును వ్రాసెను. ఇవిగాక త్రివిక్రముని ప్రాకృతవ్యాకరణము లక్ష్మీధరపండితుఁడు వ్రాసిన షడ్భాషాచంద్రిక యను మఱి రెండువ్యాకరణములు గలవు.

## ప్రాకృతకావ్యములు.

1. ప్రవరసేనుని సేతుకావ్యము. దీనికి దశముఖవధ యని నామాంతరము గలదు. 2. ఆచార్యహేమచంద్రుని కుమారపాలచరిత్ర 3. గాధాశాతవాహనుని గాధాసప్తశతి 4. వాక్పతిరాజకృత గౌడవధ, గుణాఢ్యుని బృహత్కథ పైశాచీభాషలో వ్రాయఁబడినది గాని యది నష్టమై పోయినది. మన మెఱిఁగిన ప్రాకృతకావ్యము లివియే.

### 1. సేతుకావ్యము.

కాశ్మీరదేశాధీశ్వరుఁ డగుప్రవరసేనమహారాజు దీనిని రచించెను. ఇందు లోఁ బదునైదాశ్వాసము లున్నవి. భారవిమాఘులు తమకావ్యములలోఁ బ్రతి సర్గాంతశ్లోకమును యథాక్రమముగా లక్ష్మీశబ్దశ్రీశబ్దాంకితముగాఁ జేసిన ట్లీగ్రన్థ

కర్తయుఁ బ్రత్యాశ్వాసాంతస్కంధకమును అనురాగశబ్దాంకితము గావించెను. ఎట్లనఁగా:—ఎత్థ సముప్పఇ ఎఅం సీహూలంభేణ జణిఅ రామబ్భుదయమ్, రావణవహత్తి కవ్వం అణురాఅంకం సమత్థజణణివ్వేసమ్ (అత్ర సమాప్యతే ఎతత్సీతాలంభేన జనితరామాభ్యుదయమ్, రావణవధ ఇతి కావ్య మనురాగాంకం సమస్తజననిర్దేశమ్) ఇందలి వృత్తములకు స్కంధకము లని పేరు. ఈ కావ్య మష్టవిధప్రాకృతభాషలలోఁ బ్రశస్తతమ మైన మహారాష్ట్రభాషలో వ్రాయఁబడినది. దీనిని గుఱించి దండి కావ్యాదర్శములో నిట్లు వ్రాసెను. "మహారాష్ట్రాశ్రయాంభాషాం ప్రకృష్టం ప్రాకృతం విదుః, సముద్ర స్సూక్తిరత్నానాం సేతుబంధాదియ న్మయమ్" ఎనిమిదవశతాబ్దములో నున్న భవభూతి కూడ హర్షచరిత్రప్రారంభమందు "కీర్తిః ప్రవరసేనస్య ప్రయాతా కుముదోజ్జ్వలా। సాగరస్య పరంపారం కపిసేనేవ సేతునా" అని చెప్పి యున్నాఁడు. ప్రాచీనలేఖమాలలో (Indian antiquary) వ్రాయఁబడిన శాసనములను బట్టి యీసేతుకావ్యనిర్మాత యగుప్రవరసేనుఁడు కావాటకవంశస్థుఁ డనియు నితఁడు క్రీస్తుశకము - పంచమశతకమందుఁ గాశ్మీరదేశపాలకుఁడై యుండె ననియు బుహ్లర్ పండితునిచే నిశ్చయింపఁబడెను. దీనికిఁ డీక వ్రాసినవాఁడు కూడ నొకమహారాజు; అతనిపేరు రామదాసమహీపతి. ఇతఁడు జలాలుడ్డీను నాజ్ఞచే దీనికి రామసేతుప్రదీప మనువ్యాఖ్యానమును వ్రాసిన ట్లీదిగువశ్లోకములోఁ జెప్పెను. "తద్వ్యాఖ్యాసౌష్ఠవార్థం పరిమది కురుతే రామదాస స్సఎవ గ్రంథం జిల్లాలదీంద్రక్షితిపతివచనా రామసేతుప్రదీపమ్" ఈవ్యాఖ్యాత జయపురసంస్థానాధీశులు పూర్వపురుషుఁ డైనమానసింహమహీపాలునికి సన్నిహితబంధు వనియు జయపురసంస్థానములోఁ జేరిన ఓలీ యనుపట్టణమున కధిపతి యనియు జయపురరాజకీయ వంశచరిత్రమువలనఁ దెలియవచ్చినది.

2 కుమారపాలచరిత్ర.

ఇది యాచార్యహేమచంద్రునిచే వ్రాయఁబడినది. ఈగ్రంథకర్త సంస్కృతశబ్దానుశాసనము ప్రాకృతశబ్దానుశాసనము ననుపేరులుగల సంస్కృతప్రాకృత వ్యాకరణములను వ్రాసి వాని కుదాహరణముగాఁ గుమారపాలచరిత్ర మను నొక ద్వ్యాశ్రయకావ్యమును రచించెను. దీనిలో నిరువది సర్గలు సంస్కృతము నెనిమిది సర్గలు ప్రాకృతము. ఇద్దఱువ్యాఖ్యాత లీరెండుభాగములకు వ్యాఖ్యానములను వ్రాసిరి. వారిలో సంస్కృతభాగమునకు వ్యాఖ్యానమును వ్రాసినవాఁడు అభయతిలకగణి యని వ్యాఖ్యానాంతగద్యమువలనఁ దెలియవచ్చుచున్నది.

"ఇతి శ్రీజినేశ్వరసూరిశిష్యాభయతిలకగణి విరచితాయాం శ్రీహేమచంద్రాభిధాన శబ్దానుశాసనవివృతౌ వింశస్సర్గ స్సమర్థితః" ప్రాకృతభాగమునకు వ్యాఖ్యానము వ్రాసినవాఁడు పూర్ణకలశగణి - ఇతఁడు గ్రంథాంతమున నిట్లు వ్రాయుచున్నాఁడు. తత్తోముదా జైజినరత్నసూరి క్షమాధిపై ర్బోధనునిప్రదీపః। శ్రీప్రాకృత ద్వ్యాశ్రయ గేహగర్భ స్థితం యదాదర్శ యదర్థజాతమ్। శ్రీమజ్జినేశ్వరయతీశ్వరదత్తదీక్షా శిక్షో౽త్ర పూర్ణకలశో గణిరల్పబుద్ధిః। అన్యోపకారిషు పదం పరిలబ్ధుకామో వృత్త్యానయా కిమపి తత్ప్రకటీచకార.

ఇఁక నీకావ్యమును గుఱించి, యిప్పుడు పాటణ్ యని పిలువఁబడు అణహిల్లపురమనుపట్టణముయొక్క వర్ణనతో నీకావ్య మారంభ మైనది తరువాత నీపట్టణమును బరిపాలించుచున్న రాజు, వానివిభవములు, వదాన్యత, పరాక్రమము మొదలుగునవి వర్ణింపఁబడినవి తరువాత గ్రంథమున కుమారపాలునికి కొంకణదేశపు రాజైన మల్లికార్జునునికి జరిగిన యుద్ధము. ఆయుద్ధమందు మల్లికార్జున నృపాలుని వధ వర్ణింపఁబడినది. హేమతుంగాచార్యులు వ్రాసిన ప్రబంధచింతామణిలో నీకుమారపాలునిచరిత్రము విపులముగా వ్రాయఁబడియున్నది. అణహిల్లపురాధీశుఁ డగుభీమదేవుఁడు బౌలదేవియను నొకవేశ్యను తన దేవిగాఁ బరిగ్రహించి యంతఃపురమునం దుంచెను. ఆమె క్షత్రియస్త్రీ కాకపోయినను శీలసంపదకు భర్తృభక్తికి మిక్కిలి ప్రసిద్ధికెక్కినది దాని గర్భమందుఁ బుట్టినవాఁడు హరిపాలుఁడు, వానిసుతుఁడు త్రిభువనపాలుఁడు, త్రిభువనపాలుని పుత్రుఁడు కుమారపాలుఁడు, ఈకుమారపాలునిసాముద్రికలక్షణమును జూచి యొకసిద్ధుఁ డీతఁ డీ అణహిల్లపురాధీశుని జయించి యారాజ్యమున కధీశ్వరుఁ డగు నని చెప్పెను ఆకాలమునం దారాజ్యము నేలుచున్న రాజు వృత్తాంతము నాకర్ణించి కుమారపాలుని వధింపవలె నని యుద్యమించెను. కుమారపాలుఁ డీవృత్తాంతము నెఱింగినవాఁడై భిక్షువేషమును ధరించి విదేశములలోఁ గొంత కాలము గడపి మరల నణహిల్లపురమునకు వచ్చి యొకసత్రమునందు బసచేసి యుండెను. ఆపట్టణపురాజాదినమందు తనతండ్రి యాబ్దికమగుటచే నారాధించుటకు సన్యాసుల నందఱను బిలువనంపెను. కుమారపాలుఁడు కూడ నాసన్యాసులతో రాజసన్నిధికిఁ బోయెను. ఆరాజు భక్తిశ్రద్ధలతో సన్యాసులకాళ్లుగడుగుచుఁ గుమారపాలునిపాదముల యందున్న చక్రవర్తిచిహ్నములను జూచి యాశ్చర్యపడెను. అంతట కుమారపాలుఁడు రాజనుమానించుటఁ జూచి పాఱిపోయెను. వెదకుటకుఁ బంపఁబడిన రాజభటులకు దొరకక పరుగిడి కొన్నిదినములు

పోయిపోయి యనేకదేశములయందుఁ గ్రుమ్మరి కొనకు స్తంభతీర్థ మనుస్థలమును జేరెను. దానికే యిపుడు కాంబే యని పేరు. ఆకాలమందు ప్రసిద్ధికెక్కిన జైనసన్న్యాసి యగుహేమచంద్రాచార్యుఁ డాస్థలమం దుండెను ఆదేశపురాజు మంత్రియగు ఉదయునునియింటికి కుమారపాలుఁడు భోజనమునకుఁ బోఁగా వానియసాధారణసాముద్రికచిహ్నములను జూచి హేమచంద్రుఁడు వీఁడు సార్వభౌముఁడు కాక తప్ప దని చెప్పెను. హేమచంద్రుఁడు చెప్పిన మాటలయందు కుమారపాలుఁడు నమ్మకము లేనివాఁడై యుండఁగా హేమచంద్రుఁడు (సంవత్ 1199 వర్షే కార్తికవది ద్వితీయాయాం రవౌ హస్తానక్షత్రయుక్తే యదిభవతః పట్టాభిషేకో నభవతి తదాతఃపరం నిమిత్తావలోకసన్న్యాసః) ఆగామి కార్తికబ॥ విదియనాఁడు నీవు తప్పక పట్టాభిషిక్తుఁడ వగుదువు అట్లు కానిచో నే నీదైవజ్ఞత్వమును విడుచుకొందు నని రెండుపత్రములపై వ్రాసి యొకటి యుదయునునికి రెండవది కుమారపాలునికి నిచ్చెను. నేను జెప్పినట్లు నీకు రాజ్యము లభించినయెడల నీవు జైనమత మవలంబింపవలయు నని చెప్పెను. అందు కంగీకరించి కుమారపాలుఁడు మంత్రియింటికిఁ బోయి యచట సుఖముగాఁ గొన్నిదినము లుండి మాలవదేశమునకుఁ జనెను అచట నొకదేవాలయపు గోడమీఁద—ఓయి విక్రమార్కుఁడా నీశకము 1199 సం॥ అయిన తరువాత కుమారుఁడనువాఁడు నీయుంతరా జగును." అనునొకశాసనమును జూచి యాశ్చర్యపడెను. ఇంతలో అణహిల్లపురాధీశునిమరణవార్త విని యాపురమునకుఁ బోయెను. మృతుఁడైన యారాజుయొక్క మంత్రులలో ముఖ్యుఁడైన కన్నడదేవుఁ డచట వీనిని జూచి సన్నిహితబంధువుఁ డగుటచే వీనినారాజ్యమం దభిషేకించెను. అప్పటికిఁ గుమారపాలుఁ డేఁబదివత్సరముల వయస్సు గలవాఁడై యుండెను. అనేకదేశములను జూచి యమితమైన లోకానుభవము గలవాఁ డగుటచే రాజ్యతంత్రమును జక్కగా నడిపించుచుండెను. తనపై ద్రోహబుద్ధి గలప్రాచీనమంత్రుల నందఱను వధించెను. కుమారపాలుఁడు రాజ్యమందు స్థైర్యము లభించి కొంకణదేశపురా జైన మల్లికార్జునదేవుని బరిమార్చి వాని రాజ్యమును దీసికొనెను. యథాప్రతిజ్ఞాతముగా జైనమతమందుఁ బ్రవేశించి తనరాజ్యమం దామతమును స్థాపించెను.

### 3. గాథాసప్తశతి.

ఇది ప్రాచీనప్రాకృతకవుల ప్రాకృతగ్రంథములనుండి గ్రంథకర్తచే నెత్తి వ్రాయఁబడిన యేడువందలగాథల సమూహము ప్రాకృతములో గాథ యనఁగా సంస్కృతములో నార్యాగీతివంటిది. దీనిలో శ్లోకము లన్నియుఁ బండితరాజ

శతకశ్లోకములవలె నన్యాపదేశార్థకములు నీతిని శృంగారమును బోధించునవి. ఇది సంస్కృతములో నున్న శార్ఙ్గధరపద్ధతి, సుభాషితావళి మొదలగు గ్రంథములవంటిది. దీనిని జూచి గోవర్ధనపండితుఁడు సంస్కృతములో నార్యాసప్తశతిని వ్రాసెను. ఈగాథాసప్తశతిని వ్రాసినవాఁడు శాతవాహనుఁడు. ఇతఁడు దీపకర్ణి యనువానిపుత్త్రుఁడు. ప్రతిష్ఠానపురము నేలినమహారాజు. ఇతనియాస్థానమందు బృహత్కథాకారుఁ డైనగుణాఢ్యుఁడు, కలాపవ్యాకరణకర్త యగుశర్వవర్మ మొదలగుమహావిద్వాంసు లుండి రని కథాసరిత్సాగరము నాఱవతరంగములో నున్నది. "సోహం దరిద్రో విత్తార్థీ ప్రయాతో దక్షిణాపథమ్, ప్రాప్తః పుంప్రతిష్ఠానం శాతవాహనభూపతేః" "రాజాహారత్ననిచయై రథశర్వవర్మా తేనాచిరాత్ గురురితి ప్రణతేన రాజ్ఞా, స్వామీకృతశ్చ విషయేభరుకచ్ఛనామ్ని కూలోపకంఠ వినివేశిని నర్మదాయాః" శాతవాహనుఁడు శర్వవర్మను నర్మదానదీతీరమందున్న భరుకచ్ఛ మను దేశమునకుఁ బ్రభువుఁ గాఁజేసి రాజాహార్హమైన వస్తువులఁ బారితోషికముగా నొసంగె నని కథాసరిత్సాగరషష్ఠతరంగాంత్యశ్లోకము చెప్పుచున్నది. "కర్తర్యా శాతవాహనో మలయవతీం మహాదేవీం జఘాన" అని యీశాతవాహనుఁడు తనదేవియగు మలయవతిని గత్తెరచేఁ జంపె నని వాత్స్యాయనతంత్రమునందు ద్వాదశాధ్యాయములో నున్నది. పీటర్సన్పండితుఁడు బెర్లిన్పుస్తకభాండాగారమునుండి సంపాదించి తెచ్చిన గాథాసప్తశతికొన నొకగద్య కానవచ్చుచున్నది. "ఇతి శ్రీసుత్కుంతలేశ్వర ప్రతిష్ఠానపట్టణాధీశ - శాతకర్ణోపనామక - దీపకర్ణాత్మజ - మలయవతీప్రాణప్రియ - కలాపప్రవర్తకశర్వవర్మధీసఖ-మలయవత్యుపదేశపండితీభూత-త్యక్తభాషాత్రయ స్వీకృతపైశాచికపండితరాజగుణాఢ్యనిర్మిత భస్మీభవద్బృహత్కథావశిష్ట సప్తమాంశావలోకన ప్రాకృతాది వాక్పంచకప్రీత-కవివత్సల హాలశాలవాహనాద్యుపనామక శ్రీసాతవాహననిర్మితా-వివిధాన్యోక్తిమయప్రాకృతగీగుంభితా-శుచిరసప్రధానా కావ్యోత్తమా-సప్తశత్యవసాన మగాత్" ఈగ్రంథాంతగద్యమువలనఁ గొంతవఱకీకవివృత్తాంతము, నితని యాస్థాని నలంకరించిన విద్వత్కవులవృత్తాంతము, హాలుఁడు, శాతకర్ణి, శాలవాహనుఁడు ననునామాంతరములు గలవనుటయుఁ దెలియవచ్చుచున్నది. గ్రంథాంతశ్లోకమందుఁగూడ నిట్లు వక్కాణింపఁబడినది. "ఇఅ సిరిహాల విరఇఏ పాఉయకవ్వమ్మి సత్తసఏ సత్తమసఅం సమత్తం గాహాణం సహావరమణిజ్జమ్" (ఇతి శ్రీహాలవిరచితే ప్రాకృతకావ్యే సప్తశతే, సప్తమశతం సమాప్తం గాథానాం స్వభావరమణీయమ్) బాణుఁడు హర్షచరిత్రారంభమందు "అవినాశిన మగ్రామ్య మకరో త్సాతవాహనః విశుద్ధ

జాతిభిః కోశం రత్నైరినసుభాషితైః" అని యీకవిని శ్లాఘించెను. "జగత్యాం గ్రథితా గాధా సాతవాహనభూభుజా, వ్యధుర్ధృతేస్తు విస్తార మహో చిత్ర పరంపరా" అని రాజశేఖరుఁడు కొనియాడెను. "జజ్ఞే శాలమహీపాలః ప్రతిష్ఠాన పురే పురా" దినంగతే హాలవసుంధరాధిపే, శాలోహాలన్ృపేపిచ, "సత్తసయో సమత్తో సాలాహాణ విరఇయో కోసో (సప్తశతికసమాప్తః శాలవాహన విరచితః కోశః, హాలస్స్యాత్సాలవాహనః" ఇత్యాది ప్రమాణములచే నితఁడే శక ప్రవర్తకుఁడైన శాలివాహనుఁ డని తేలుచున్నది కావున నితఁడు క్రీస్తుశకము ప్రథమశతకమం దున్నవాఁ డని నిర్వివాదముగాఁ జెప్పవచ్చును.

4. గౌడవధమహాకావ్యము.

ఇది కాన్యకుబ్జేశ్వరుఁ డగుయశోవర్మభూపాలుని యాస్థానమం దున్న వాక్పతిరా జను కవీంద్రునిచే రచింపఁబడినది. "కవివాక్పతిరాజ శ్రీభవభూత్యాది సేవితః" అని రాజతరంగిణిలోఁ జెప్పఁబడినట్లు వాక్పతియే కాక భవభూతి మొదలగు మఱికొందఱుకవు లాయశోవర్మ యాస్థానమం దుండిరి. ఈ గ్రంథమందు వాక్పతి తనకుఁ బోషకుఁ డైన యశోవర్మయొక్క శౌర్యధైర్యపరాక్రమాది గుణములను, గౌడదేశపురాజుపై దండెత్తివెళ్లి వానిని జంపుట మొదలగు వృత్తాంతములు విపులముగా వర్ణించెను. కావుననే యీకావ్యమునకు గౌడవధ యనిపేరు. ఇందలి శ్లోకసంఖ్య పండ్రెండువందల తొమ్మిది. ఇంత పెద్దగ్రంథమును వ్రాసినను వాక్పతి యెచ్చటను దనవృత్తాంతము నించుకైనఁ దెలియఁజేయలేదు. "భవభూఇ జలహి ణిగ్గయ కవ్వామయ రసకణా ఇవ ఫురంతి, జస్స విసేసా, అజ్జవివియడేసుకహాణి వేసేసు) (799) భవభూతిసముద్రమును మథించి తీయఁబడిన కావ్యామృతరసకణము లిప్పటికి నాకథానిబంధముల యందుఁ బ్రకాశించుచున్న వని చెప్పుటచే వాక్పతి భవభూతివిరచిత గ్రంథములను గూలంకషముగాఁ గృషిచేసి యున్నాఁ డని మన మూహించుకొనవలెను గాని యతనియొద్ద శిష్యుఁడై పుస్తకముఁ బట్టి చదివినట్లు కానరాదు. ఏలయనఁగా పైశ్లోకమందు "అద్యాపి" అనుటచే వాక్పతి యీగ్రంథమును రచించినకాలమునకు భవభూతి గతించినట్లు కానవచ్చుచున్నది "భాసమ్మి జలణమిత్తే కుంతీదేవేఅ జస్సరహుయారే, సోబంధవే అబంధమ్మి హారిచందేయ ఆణందో" భాసుఁడు, జ్వలనమిత్రుఁడు, కుంతీదేవుఁడు, కాళిదాసు, హారిచంద్రుఁడు మొదలగుకవులయందు సుబంధునివాసవత్తయందుఁ దనకు మిక్కిలి యానంద మని చెప్పుచున్నాఁడు. వేదము, వ్యాకరణము, న్యాయశాస్త్రము, అలంకారశాస్త్రము, ఛందశ్శాస్త్రము మొదలగు శాస్త్రములయందు నిరూఢప్రజ్ఞ గలవాఁడ నని చెప్పుకొనుచున్నాఁడు.

## యశోవర్మకాలనిర్ణయము.

యశోవర్మ కాలము నిర్ణయింపఁ బడఁగా వాక్పతిరాజు కాలము నిర్ణయింపఁబడును. ఈయశోవర్మ చరిత్రమును దెలిసికొనుటకు కల్హణకృతరాజతరంగిణి ముఖ్యమైన యాధారము. కాశ్మీరదేశము నేలినరాజవంశములలో నొకటియైన కార్కోటకవంశమందుఁ బుట్టిన లలితాదిత్యునిచరిత్రముతో నీయశోవర్మచరిత్రము సంబంధించియున్నది. ఈలలితాదిత్యుఁ డమితపరాక్రమశాలి, శత్రుభయంకరుఁడు. భూతలఖండము నంతను నేకచ్ఛత్రాధిపత్యముగా నేలెను. తనజీవితకాలమం దెయును జైత్రయాత్రలలోఁ గడపినవాఁడు. తూర్పుదిక్కున రాజుల నందఱను జయించి వారివలనఁ గప్పములఁ గొనియెను. యశోవర్మను గూడ జయించెను. అపుడు యశోవర్మ యనన్యగతికుఁడై యేమియుఁ జేయునది లేక లలితాదిత్యునితో సంధిఁ జేసికొనుటకుఁ గోరెను, గాని, లలితాదిత్యునిమంత్రి యగు మిత్త్రశర్మయు దీర్ఘయుద్ధకుతూహలులై యున్నసైనికులును సంధి కొప్పుకొనక పోవుటచే యశోవర్మ తనస్వల్పసైన్యముతో లలితాదిత్యు నెదిరించి పరాజితుఁడయ్యెను. అపుడు లలితాదిత్యుఁడు తనమంత్రిచేసిన యుపదేశమువలనఁ దనకు జయము కలిగిన దని సంతసిల్లి వాని కైదుబిరుదముల నొసంగెను. ఇట్లు యశోవర్మ శత్రునికి లోపడి తనపండితులును దాను వాని గుణస్తుతిపాఠకు లైరి. పిమ్మట లలితాదిత్యుఁడు తూర్పుసముద్రపుటొడ్డున నున్న దేశములపై దండెత్తి వెళ్లి గౌడదేశపురాజు నేనుంగులఁ బట్టుకొనెను. దేశముతరువాత దేశమును జయించుచుఁ బోయిపోయి కొనకు సప్తకోంకణములను బుక్కారా దేశమును జయించెను. జయించిన దేశములయం దెల్లఁ బట్టణములను నాపట్టణములలో దేవాలయములను నిర్మించెను. లలితాదిత్యుఁడు పరాక్రమశాలి, ధార్మికుఁడు, దయతోఁ బ్రజలఁ బాలించినవాఁడు నై యుండెను. యశోవర్మచరిత్రముతో సంబంధించిన లలితాదిత్యుని వృత్తాంత మిది. రాజతరంగిణీవచనప్రకారముగా లలితాదిత్యుఁడు క్రీస్తుశకము 695 సం॥ మందు సింహాసన మెక్కెను. అతఁడు ముప్పదియాఱుసంవత్సరములు, నేడుమాసములుఁ, బదిదినములు రాజ్యముఁ జేసెను. కావున నతనిరాజ్యపరిపాలనకాలము 695 మొదలుకొని 732 వఱకు. అతఁడు యశోవర్మను జయించుట యెనిమిదవశతాబ్దముయొక్క ప్రారంభమం దై యుండవచ్చును. యశోవర్మ గౌడరాజును వధించినకథను బూర్ణముగాఁ జెప్పెద నని ప్రతిజ్ఞఁ జేసి వాక్పతిమిశ్రుఁడు దానిని సంగ్రహముగాఁ జెప్పి గ్రంథమును ముగించెను.

మేడేపల్లి వేంకటరమణాచార్యులు.

శ్రీ

# సంస్కృతమహాకవులు, బిరుదములు.

---

మహాశయులారా!

భూలోకమున ఖ్యాతిలాభపూజలయందు నంతఃకరణాదులచేఁ బరాఙ్ముఖుఁడు దుర్లభుఁడు గదా. సచేతన మగుసమస్తప్రాణిజాతమును స్వస్వయోగ్యతానుసారముగాఁ బ్రఖ్యాతిని గోరుట మన కనుభవగోచరమే గదా. అట్టిప్రసిద్ధి ధైర్యము శౌర్యము నౌదార్యము దానము కావ్యమును ననునీయాఱింటిచేతను గలుగుచున్నది. ప్రాస్తావిక మగుకావ్యమును గూర్చి యాలోచింతము. ఇప్పటికిని వాఙ్మయైకజీవను లగుతర్కవాచస్పతి, విద్యాభూషణుఁడు మున్నగుబిరుదాంకితు లగుకవులు గానవచ్చుచున్నారు. ఈరీతినే ప్రాచీనమహాకవులును బిరుదాంకితులుగాఁ గానవచ్చుచున్నారు. కాని వారికిని వీరికిని జాల భేదము గలదు. సాంప్రతికులబిరుదములు స్వయంస్వీకృతములు ననన్వయములు ననను గుణములునుగా నున్నవి. ప్రాచీనుల నట్టివిగాక వారివారి వర్ణనౌచిత్యమునుబట్టి పరులచే నొసంగఁబడినవి గాఁ గానంబడుచున్నవి. మున్ముందుఁ గవికులశిఖామణి యగు కాళిదాసుని గూర్చి యాలోచింతము. కాళిదాసమహాకవి రసమయ మగుతన రఘువంశకావ్యమం దిందుమతీస్వయంవరవర్ణనాసమయమున,

> సంచారిణీ దీపశిఖేవ రాత్రౌ యం యం వ్యతీయాయ పతింవరా సా ।
> నరేంద్రమార్గాట్ట ఇవ ప్రపేదే వివర్ణభావం సస భూమిపాలః ॥

అనుశ్లోకమందు నిందుమత్యనభిమతులు గనుకనే యుపేక్షింపఁబడిన భూపతులకు నతిదయనీయ మగునవస్థాంతరము ననుభవింపఁ జేయుచుఁ బండితులచే "దీపశిఖాకాళిదా" సనుబిరుదుచేఁ బిలువఁబడుచున్నాఁడు. స్వభావోక్తిసరస మగునీవర్ణనము "ఉపమా కాళిదాసస్య" అను ప్రాచీనవాదమును స్థిరపఱుచుచున్నది. ఈమహాకవి సర్వథా యాదికవి ననుసరించెను. అపరవాల్మీకియనియు నీతనికి విఖ్యాతి గలదు. ఇతనిచే రచింపఁబడిన రఘువంశకావ్యమునకు నిరువదిరెండు వ్యాఖ్యానము లున్నట్లు గానఁబడుచున్నది. కుమారసంభవమునకుఁ బదివ్యాఖ్యానములు గలవు. మేఘసందేశమునకు నిరువదిమూఁడు వ్యాఖ్యానములు గలవు. రఘువంశ కుమారసంభవ కిరాతార్జునీయ శిశుపాలవధ నైషధీయచరిత కావ్యములు పంచమహాకావ్యము లని వ్యవహరింపఁబడు

చున్నవి. సాహిత్యవిద్యానిష్ణాతు లగుకొందఱు పంచమహాకవు లగుకాళిదాస, భట్టి, భారవి, మాఘు, శ్రీహర్షులయొక్క కృతుల నన్నింటిని బంచమహాకావ్యములనుగా వ్యపదేశించుచున్నారు. వారిపక్షమున మేఘదూత భట్టికావ్యములు గూడఁ బంచమహాకావ్యములలోఁ జేరును. ప్రపంచమున సామాన్యముగాఁ గవులు తమజీవితకాలములోఁ దమకృతులయందుఁ బండితులకుఁ గలయాదరమును జూచుట దుర్లభము. ఈమహాకవి యట్లుగాక తనజీవితకాలములోనే యట్టిగౌరవమును జూచినట్లు తనమాళవికాగ్నిమిత్రమందలి పీఠికలో వ్రాసిన,

పురాణమి త్యేవ న సాధు సర్వం నచాపి కావ్యం నవ మి త్యవద్యమ్
సంతః పరీ క్ష్యాన్యతరద్భజంతే మూఢః పరప్రత్యయ నేయబుద్ధిః ॥

అనుశ్లోకమునవలనఁ దెలియఁజేయుచున్నాఁడు. ఇఁక భారవినిగూర్చి వ్రాసెదను ఈమహాకవియుఁ దనకృతియందు—

ఉత్ఫుల్లస్థలనళినీవనా దముష్మా దుద్ధూత స్సరసిజసంభవః పరాగః
వాత్యాభి ర్వియతి వివర్తిత స్సమంతా దాధత్తే కనకమయాతపత్రలక్ష్మీమ్ ॥

అనుశ్లోకమందు స్థలనళినినుండి బయలుదేఱి వియత్తునందు వ్యాపించిన పరాగము గనకమయాతపత్రముగాఁ జమత్కారసహితముగా నుత్ప్రేక్షించుటవలన "ఛత్త్రభారవి" యనుబిరుదును బొందియున్నాఁడు. భారవి కావ్యమునకు వ్యాఖ్యానములు పదునేడు. ఈకవి తనకావ్యమును లక్ష్మీపదాంకము. గాఁ జేసినాఁడు. ఇఁక మాఘునిగూర్చి వ్రాసెదను. ఈమహాకవి రైవతకగిరి వర్ణనప్రకరణమున—

ఉదయతి వితతోర్ధ్వరశ్మిరజ్జా వహిమరుచౌ హిమధామ్ని యాతి చాస్తమ్
వహతి గిరిరయం విలంబిఘంటాద్వయపరివారితవారణేంద్రలీలామ్ ॥

అనుశ్లోకమందు రాకాతిథియందు నుషఃకాలమున రైవతకగిరి ప్రాక్పశ్చిమభాగములయం దహిమకిరణ శీతకిరణులు వ్రేలాడుచుండఁగా భాగిద్వయమందును ఘంటాద్వయసంయుక్త మగుగజరాజు ననుకరించుచున్న దని వర్ణించుటవలన ఘంటామాఘుఁ డనుబిరుదుచేఁ బిలువఁబడుచున్నాఁడు. ఈతనికావ్యమునకు వ్యాఖ్యానములు పదునాఱు. ఈకావ్యమునకు శ్రీపద మంకము. ఈ కవి తనకీర్తివలన భారవి నతిక్రమించినట్లు "తావద్భారవి ర్భాతి యావ న్మాఘ స్య నోదయః" అనుశ్లోకపాదమునఁ దెలియుచున్నది. ఈమాఘుఁడు భారవికి విపక్షుఁడువలె నతనికావ్యము "శ్రియః కురూణా" మని శ్రీశబ్దముచేఁ బ్రారంభింపఁబడుటను జూచి తానును "శ్రియఃపతి" యని శ్రీశబ్దముచేతనే ప్రారం

భించెను. అతఁడు మొదటిసర్గములో వంశస్థవృత్తము నుపయోగించుటవలనఁ దానును దానినే యుపయోగించెను. రెండవసర్గలో నతనివలెఁ దానును నీతి శాస్త్రమునే చూపెను. అతనికావ్యము లక్ష్మీపదాంకముగానఁ దనకావ్యమును దత్థానీయముగా శ్రీపదాంకితమును జేసెను. ఈవిషయమునే తాను గావ్యాంత మందు – "శ్రీశబ్దరమ్యకృతసర్గసమాప్తిలక్ష్మ" యని స్పష్టముగా వక్కాణించెను. భారవి కవి కిరాతార్జునుల నుద్దేశించి వ్రాసెను గానఁ దత్ప్రతిద్వంద్విగా మాఘ కావ్యమును శ్రీకృష్ణశిశుపాలుర నుద్దేశించి వ్రాసెను. బిరుదలంభక మగుపద్య మందు భారవివలె నివర్ణనో త్ప్రేక్షాలంకారములనే వాడెను. అపరవర్ణనావైచిత్ర్యయములు నచ్చటచ్చటఁ దఱచుగా భారవిప్రహతమార్గముననే నడిచెను. భట్టికావ్యమునకు వ్యాఖ్యానములు మూఁడు, నైషధీయచరితమునకు వ్యాఖ్య లిరువదియైదు. శ్రీహర్షుఁడు తనకావ్యమునకు నానందపదము నంకముగాఁ జేసెను. ఇఁక రాజానకరత్నాకర మహాకవిని గూర్చి కొంచెము ముచ్చటించె దను. ఈకవితల్లజుఁ డేఁబదిసర్గలు గలహరవిజయ మనుమహాకావ్యమును రచించెను. ఈప్రబంధ్రశేఖరుఁడు తనప్రబంధాంతమందు—

హరవిజయమహాకవేః ప్రతిజ్ఞాం శృణుత కృతప్రణయా మమప్రబంధే
అపి శిశు రకవిః ప్రభావా ద్భవతి కవిశ్చ మహాకవిః క్రమేణ ॥

అనుపద్యముచేఁ దనప్రబంధరాజపఠనమువలనఁ గవులు గానివారు గవు లగుదు రనియుఁ గవులు మహాకవు లగుదు రనియు విశదపఱిచియున్నాఁడు ఈతఁడు తనప్రబంధమును రత్నపదాంకితముగఁ జేసెను. ఈరత్నాకరరచయిత తనహరవిజయకావ్యమున సాయంకాలవర్ణనాసమయమందు—

అస్తావలంబి రవిబింబత యోదయాద్రి చూడోన్మిషత్సకలచంద్రతయా చ సాయం
సంధ్యాప్రనృత్తహరవాద్యగృహీతకాంస్య తాళద్వయేన సమలక్ష్యత నాకలక్ష్మీః॥

అనుపద్యమువలన రాకాతిథియందు నుభయాద్రులయందు జ్యోతిర్ద్వయము వెలుంగుచుండఁగా నాకసంపత్తును సంధ్యాకాలమందు నాట్యము చేయుచున్న హరునిచే గృహీతము లగుకంచుతాళములతో సరసముగాఁ బోల్చుట వలన "తాళరత్నాకరుఁ" డనుబిరుదును బడసెను. ఇఁకఁ ద్రివిక్రమభట్టును గూర్చి కొంచెము వినిపించెదను. ఈకవివతంసుఁడు శ్లేషబహుళ మగుటచేఁ వాసవదత్తకు సరియగుఁదగినదియు వాగ్దేవిచేత స్వీయముగాఁ జేయఁబడిన న్యపదేశము గలదియు హరచరణసరోజపద మంకముగాఁ గలదియు దమయంతీకథ

యను నామాంతరముగల నలచంపూగ్రంథమును రచించెను. ఈకవి తనగ్రంథమందుఁ బ్రాతఃకాలవర్ణనయందు—

ఉదయగిరిగతాయాం ప్రాక్ప్రభాపాండుతాయా
మనుసరతినిశీథే శృంగమస్తాచలస్య ॥
జయతి కిమపి తేజ స్సాంప్రతం వ్యోమమధ్యే
సలిలమివవిభిన్నం జాహ్నవం యామునంచ.

అను పద్యమునఁ దూర్పుదిక్కున సూర్యకాంతులు వ్యాపించుచుండఁగాఁ బడమటిదిక్కునందుఁ జీఁకటియుండఁగా నాకాశమధ్యమునఁ గొంచెము చీఁకటియుఁ గొంచెము వెలుతురు నుండఁగా నట్టియాకసమును గంగాయమునాసంగమమందలి నీటితో సరసముగా ననుభవసిద్ధముగా నుత్ప్రేక్షించుటవలన నీతనికి యమునాత్రివిక్రముఁ డనుబిరుదు నిచ్చిరి. విష్ణుపదీహేతు వగుప్రాచీన త్రివిక్రముఁ డాకసమున గంగనుమాత్రము సృజించెను. ఈయపూర్వత్రివిక్రముఁడు యమునను గూడ సృజించెను. అహాహ యేమి యీకవియొక్క కవితాసామర్థ్యము. ఈకవిప్రాగల్భ్యము వర్ణింప వాక్కులకు నలవిగాకున్నయది. ఇంక మురారిని గూర్చి వినిపించెద. ఈమహానుభావుఁ డోజోగుణయుక్త మగు "ననర్ఘరాఘవ" మను నాటకరత్నమును రచించెను. ఈసుగుణమణికి బాలవాల్మీకి యను నామాంతరము గలదు. ఈరచయిత్రనేత—

భూయస్తరాణి యదమూని తనుస్వినీషు జ్యోత్స్నాషు చ ప్రవిరళాని తతః ప్రతీమః
సంధ్యానలేన భృశమంబరమూషికాయా మావర్తితైరుడుభిరేవకృతో యమిందుః॥

అనుశ్లోకమందుఁ జీఁకటిరాత్రులందు నక్షత్రములు హెచ్చుగాఁ గానవచ్చుటచేతను వెన్నెలరాత్రులందుఁ దక్కువగాఁ గానవచ్చుటచేతను గాలమనెడి కమసాలి సంధ్యయను నగ్నిహోత్రమున నాకాశమను మూసయందు నక్షత్రములను వెండిముక్కలను కరఁగించి చంద్రుఁడను వెండిదిమ్మఁ బోయుటవలన శుక్లపక్షమందు నక్షత్రములు తగ్గినవని యుత్ప్రేక్షించుటవలన నీకవిరాజున "కిందుమురారి" యనుసరసమైన బిరుదు నొసంగిరి. హరవిజయకావ్యకర్త యగు తాళరత్నాకరుఁడు—

అంకేషు నాటక ఇవోత్తమనాయకస్య నాశంకవిర్వ్యధితయస్యమురారిరిత్థమ్
ఆక్రాంతకృత్స్నభువనఃక్వగతస్సదైత్య నాథోహిరణ్యకశిపుస్సహబంధుభిర్వః॥

అనుపద్యమందు నాటకాంకమురారిపదములచేత మురారికవిని స్మరించినట్లు తోఁచుచున్నది. ఇంకఁ గాదంబరీహర్షచరితములకుఁ గర్తయు నిరస్తదుఃఖ

లనము సుఖైకమయము నగుశబ్దప్రపంచమునకు స్రష్టయు నగుబాణునిఁ గూర్చి

- - - - - - - - -

- - - - - - - - -

(ఇక్కడఁ గొన్నిబంతులు ప్రమాదమునఁ బోయినవి.)

త్వంగత్వఙ్గ్రలగ్నప్రతనుబుసకణం కోణమక్ష్ణఃఖురేణ ॥

అనుపద్యద్వయముచేత గుఱ్ఱమును స్వభావోక్తిమధురముగా వర్ణించుట వలన నీయపరసరస్వతికిఁ దురంగబాణుఁ డనుబిరుదు గలిగినది. సహృదయులారా నిశ్చయముగా మనము నేత్రములను మూసికొని యీపద్యద్వయమందలి స్వభావోక్తి రమణీయ మగునర్థమును ముహూర్తమాత్ర మాలోచించినయెడల మన కట్టిగుఱ్ఱము ముందు నిలిచియున్నట్లు కానఁబడు నని హృదయమును వంచింపకుండఁగఁ బలుకుచున్నాఁడను. కాదంబరియందు నింద్రాయుధము నత్యుత్తమముగా వర్ణించుటవలన నీబిరుదు గలిగె నని కొందఱు వక్కాణించుచున్నారు. మఱికొంద ఱతనివాగ్ధోరణి యశ్వధాటివలె నిరర్గళముగా బయలు దేఱెను గాన నట్టి బిరుదము వచ్చె నని చెప్పుచున్నారు. మఱియు,

లబ్ధం సత్ప్రజ్ఞకైర్య న్నజగతి కవిభి ర్వస్తుత న్నాస్తికిచిత్
క్షుణ్ణే క్షుణ్ణత్వచింతా గహనవిషయతా తస్యదూరోస్తుతావత్
తన్నందాభి ప్రగల్భప్రసరగురుగిరా మగ్రణీ ర్బాణఏకః
రాజన్ రత్నాకరంశ్చ జ్వలనవదననౌజాజ్వలీతి ద్వితీయః ॥

అను సభియుక్తోక్తిప్రకారము బాణుఁడు ద్వితీయాగ్నిహోత్రుఁడు వలె నేఁటివఱకుఁ బ్రపంచమునఁ బ్రకాశించుచున్నాఁడు. ఈకవిచంద్రుఁడు తనయశశ్చంద్రికల నహోరాత్రములయందు సర్వదా నిరర్గళముగా నాకల్పాంతము వ్యాపింపఁజేసెను. "బాణోచ్ఛిష్ట మిదం జగత్" అనుసూక్తిప్రకారము బాణునిచే వర్ణింపఁబడని వర్ణనాప్రణాళిక యితరస్థలములందుఁ గానరాదు. రసదేవత సర్వాత్మనా నీతనినే యాశ్రయించెను. కవితాకామిని యీతని స్వయముగా వరియించెను. ఈతనియిచ్ఛాధీనవర్ణనలకు లోపడి యీకామిని వర్తించెను. వేయేల కవితాకామినికి బాణుఁడు హృదయమందు వసించుచున్న పంచబాణుఁడే చోరకవి చికురనికరమే మయూరకవి కర్ణపూరమే భాసకవి హాసమే కవికులగురువైన కాళిదాసు విలాసమే శ్రీహర్షకవి హర్షమే కాన నిట్టిబాణకవినిఁ గూర్చి యెంతవ్రాసినను లేఖనీయార్థము సశేషమే కాని యశేషము కాదు. ఇఁక భవ

భూతిను ద్దేశించి కొంచెము వ్రాసెదను. ఈతనినామధేయము శ్రీకంఠుఁడు, తండ్రి నీలకంఠుఁడు, తల్లి జతుకర్ణి. ఈశ్రీకంఠుఁ డొకరాజసభయందు శ్లో॥ "తపస్వీ కాంగతో వస్థా మితిస్మేరాననా వివ। గిరిజాయాః స్తనౌ వందే భవభూతిసితాననౌ" అనుశ్లోకమున గిరీశశాంకరీ సమాలింగనమునఁ బార్వతీచూచుకములకు లగ్నమయిన విభూతిని జూచి తపస్వి యగు శంకరుఁడు ఏమియవస్థను బొందెనని పార్వతీ స్తనములు నవ్వుచున్నవా యని యుత్ప్రేక్షించుటవలన భవభూతి యను బిరుదు గలిగెను. తదాదిగ నీతనినామధేయము తిరోహితమై బిరుదనామమే సర్వత్ర వ్యాపించెను. తననామధేయము తిరోహిత మగుననునుద్దేశముచేతనే యీకవి తనప్రతినాటకమందును "శ్రీకంఠపదలాంఛనో భవభూతి" యని వ్రాయుచున్నాఁడు, శ్రీకంఠ యనుపదము లాంఛనముగాఁగలవాఁడు గాన శ్రీకంఠపదలాంఛనుఁడు. కొందఱు పండితులు "సాంబా పునాతు భవభూతిపవిత్రమూర్తిః" అనివర్ణించుటవలనఁ గలిగె నని చెప్పుచున్నారు. కొందఱు రసికు లీతని తండ్రికిఁ జాలకాలమువఱకు సంతానము లేకపోవుటచే నీశ్వరుని సేవించుచుండఁగా నీతఁడు జన్మించుటవలనఁ దండ్రి యీతనికి భవభూతి యనిపేరు పెట్టె నని చెప్పుచున్నారు. భవభూతి యనఁగా నీశ్వరప్రసాదము, శ్రీకంఠుఁ డనఁగా శ్రీః సరస్వతీదేవి కంఠుఁడు కంఠమందుఁగలవాఁడు, అందువలననే యీతనికవితాప్రవాహము నిరర్గళము. కొందఱు విద్వాంసు లీతనికి బిరుదు వేఱుగఁ గలదనియు భవభూతి యనుపేరు తండ్రిచే నీయఁబడిన దనియు శ్రీకంఠపదలాంఛనుఁ డనఁగా నీతఁడు శివభక్తుఁడు గాన రుద్రాక్షను వలె నీశ్వరపాదప్రతికృతి గలసువర్ణమును కంఠమందు ధరించుటవలన శ్రీకంఠపదలాంఛనుఁ డనియుఁ జెప్పుచున్నారు. ఇఁక రత్నఖేటదీక్షితకవిని గూర్చి కొంచెము వినిపించెదను. ఈమహాకవి తుండీరమండలమందు శూరసముద్ర మనుపేరుగల యగ్రహారమున జన్మించెను. విశ్వామిత్రవంశమునకు ముక్తామణి వంటివాఁడు. శ్రీకృష్ణభట్టారకునికిఁ బౌత్త్రుఁడు. భవస్వామిభట్టునకు లక్ష్మ్యంబయందు జన్మించినవాఁడు. రాజచూడామణి దీక్షితునకు జనకుఁడు. ఈతనిచే రచింపఁబడిన భావనాపురుషోత్తమ మనెడునాటకమందలి ప్రస్తావనయందలి,

శ్లో. తత్రాస్తి కశ్చి త్తరుణాగ్నిహోత్రీ మద్దర్శనీసాగరపారదృశ్వా
శతావధానీ త్యపరాభిధానః శ్రీశ్రీనివాసాధ్వరిసార్వభౌమః ॥

అనుశ్లోకమువలన నీతనినామధేయము శ్రీనివాసుఁ డనియు నీతఁడు శతావధాని యనియుఁ దెలియుచున్నది. ఈతనికి,

శ్లో.సంధ్యాసంధుక్షితాంభోధర నళికగణాదుద్గతాన్ సీసఖండాన్
తారాకారాన్నిరోద్ధుం రవిశశికపటాద్బిభ్రతౌ రత్నఖేటౌ
అన్యోన్యం యుధ్యమానా వుదయచరమభూ భృత్ప్రవీరావితిద్రా
గుక్త్యా ఖ్యాతాపరాఖ్యః క్షితిపతివచసా రత్నఖేటాధ్వరీతి ॥

అనుశ్లోకమువలన రత్నఖేటాధ్వరి యను బిరుదు గలిగెను. ఈరత్నఖేట దీక్షితునిగూర్చి యొకచిన్న యితిహాసము గలదు దానిని వినిపించెదను. పూర్వమం దొకపండితుఁడు రత్నఖేటదీక్షితులవారిని వాదమందు జయించు నుద్దేశముతోఁ బ్రాతఃకాలమందే యతనిగృహమునకు వచ్చెను. అప్పుడు బాహ్యాంగణశోధనముకొఱకు గోమయజలముతో నిండినభాండమును బట్టుకొనివచ్చుచున్న ముగ్ధ యగుతత్కులస్నుషను జూచి "రత్నఖేటదీక్షితుని వాదంబునం జయించుట కేతెంచితిని వారింట నుండిరా" యని యడిగెను. ఆమె యావాక్యమును విని సహింపనిద్దై వినవట్టభినయించుచుఁ దనకార్యమందుఁ దొందర గలదై గోమయాంబుసేచనానుగుణముగా

శ్లో.విపశ్చితా మపశ్చిమేథ రత్నఖేటదీక్షితే
సపత్నజిత్యయత్నతో వివాదకేళి మాగతే
బృహస్పతిః ప్రజల్పతి ప్రసర్పతి క్వసర్పరాట్
షడాననో నతాననశ్చతుర్ముఖశ్చ దుర్ముఖః ॥

అనిపాడుచు సంమార్జనముఁ జేసెను. దాని నీపండితుఁడు విని యహో యేమి యీగృహమందలి పాండిత్య మని పరుగిడెను. ఇఁక మంఖకవిని గూర్చి వినిపించెదను. ఈకవి శబ్దార్థసంఘటనాదులచే నతిప్రౌఢ మగునక్రోక్తివిలాసలోలనీయ మగుశ్రీకంఠచరిత మనుమహాకావ్యమును రచియించెను. ఈకవిశేఖరుఁడు—

శ్లో.విస్తృణ్వతా సౌరభలోభదోషం వందివ్రతం వర్ణగుణైస్సప్రశంత్యాః ।
వికస్వరే కస్య నకర్ణికారే ఘ్రాణేన దృష్టే గ్వివృధే వివాదః ॥

అని కర్ణికారరూపమును సౌరభ్యాభావమును సహృదయహృదయచమత్కారముగా వర్ణించుటవలనఁ గర్ణికారమంఖుఁ డనివిఖ్యాతిఁ బడసెను. ఈపద్యము:—

వర్ణప్రకర్షే సతి కర్ణికారం దునోతి నిర్గంధతయాస్మ చేతః
ప్రాయేణ సామగ్ర్యవిధౌ గుణానాం పరాఙ్ముఖీ విశ్వసృజః ప్రవృత్తిః.

అను కాళిదాసపద్యమును స్మరింపఁజేయుచున్న యట్లున్నది. ఈరీతినే బాలభారతకర్త యగునమరచంద్రసూరియు,

దధిమథనవిలోలల్లోలదృగ్వేణిదంభా
దయముదయమనంగో విశ్వవిశ్వైకజేతా।
భవపరిభవకోపత్యక్తబాణః కృపాణ
శ్రమమివ దివసాదా వ్యక్తశక్తి ర్వ్యనక్తి॥

అని వర్ణించుటచే వేణీకృపాణామరుఁ డను బిరుదుచేఁ బిలువఁబడుచున్నాఁడు. ఈవిధముననే యింకను బెక్కండ్రు మహాకవులకును వారివారి బిరుదములును గలవు. ఈమహాకవులను గూర్చి యెంతవ్రాయవలసియున్నను శ్రోతలకు విసుగు గలిగించు ననుభీతిచే సభాహ్వానకర్తలు సంగ్రహముగా వ్రాయుఁడని ప్రోత్సహించుటచేతను గడుసంగ్రహముగా వ్రాసి ముగించితిని.

అల్లమరాజు సత్యనారాయణశాస్త్రి.

# పరిషత్ప్రశంస.



మ. పరమాత్ముండను జగన్నియంత భువనబ్రహ్మాండమ న్నాటకాం
తరకూలంకషసూత్రధారి తనప్రస్తానంబున న్నాందిను
స్థిరనీరాజనగానముం జలుపుతఱిఁ శ్రీయాంధ్రసాహిత్యస
త్పరిషత్కన్యక మాకుఁ గూర్చుటకు సంభావించి యర్థించుచున్.

శా. ప్రాచీనాంధ్రమహాప్రబంధముల సంపాదించి సత్సాకృతుల్
ప్రాచుర్యం బొనరించి తద్విషయభావవ్యక్తి గల్పించి వి
ద్యాచిత్రంబుల మూటవిప్పి తెలుఁగందం బందుఁ జూపించి యెం
తేచాతుర్యముఁ గంటి వాంధ్రపరిషద్దివ్యాంగనారత్నమా.

మ. ధనవంతు ల్మదవంతులౌ నృపులు విద్యావంతులౌ పండితుల్
నిను సర్థించిరి గాని నీవెవరికై నీరాజనం బిచ్చిపో
యినజాడ న్వినలేదు నీయశము నేఁ డీరేడులోకంబులం
జనె నీభాగ్యమె భాగ్యమమ్మ పరిషత్స్వర్గాంగనారత్నమా.

ఉ. వేలకువేలు వెచ్చమును బెట్టి తెలుంగు నిఘంటుసూర్యభూ
పాలునిపేర భారతి కృపామతికిం దొలికాన్కగాఁగ నీఁ
జాలెద వంచు నాంధ్రపరిషల్లలనా నినుఁ జూచుచుంటి మే
వేళను జాతకంబు వినువీదినిపానకుఁ జూచుకైవడిన్.

ఉ. నీవు తెలుంగుభూమిని జనించితి వాంధ్రులపాలికల్పకం
బైవిలసిల్లినావు మహిమాస్పదమైన తెలుంగుబాసకున్
జీవముఁ బోసినావు చెడిజీర్ణములై చనువాఙ్మయంబునీ
వీవల దీసినావు గను లేటిన రత్నచయంబు పోలికన్.

సీ. గోదావరీదేవి కొంగుపట్టిన దివినుండి చంగున వచ్చి యుఱికినావు
నెల్లూరినెఱజాణ నెత్తమ్ము లాడఁబిల్చిన తోడనే పోయి చేరినావు
పలనాటివీరపత్నులు పాడుజాతిగీతములకు శ్రుతివేయఁ దరలినావు
ఏకశిలాశైలమెక్కి తీఁగలఁ దూఁగుటుయ్యాలలోఁబండి యూఁగినావు
తుంగభద్రాజలం బానఁ దూఱినావు, కృష్ణవేణమ్మ చెలిమి హర్షించినావు
తెనుఁగుకవితామతల్లి యీతఁనుకుపిలువఁ, దెలిసి పరిషత్తుతోడనే తెంచినావు

ఉమర్ అలీషాకవి.

# గ్రంథవిమర్శనము.

---

రామకుమారాభ్యుదయము:—

శ్రీమదుత్తరరామాయణకథఁ గొని మ-రా-శ్రీ గార్లదిన్నె సుబ్బరావుకవి గారు "రామకుమారాభ్యుదయ మనుపేర నేడంకములనాటకము రచించినారు. నాటకము కరుణరసప్రధానము. కవిగారు జగజ్జనని యగు శ్రీసీతాదేవి సద్గుణ కదంబమును, కుశలవుల ఆభిజాత్యశౌర్యధైర్యలక్షణములను చక్కఁగాఁ జిత్రించినారు. ప్రజాసంప్రీతికై ప్రభువు పరమపతివ్రతాతిలక మగుభార్యను సైతము విడనాడు ననువిషయమును బాగుగాఁ గథలో ద్యోతితము చేసినారు. కవి గ్రాంథికాంధ్రభాషాభిమాని. పెక్కుపద్యములు మనోజ్ఞములుగ నున్నవి. అందు నాల్గిక్రింద ఎత్తి వ్రాయఁబడినది.

1. ఉ మున్ను దశాననాద్యసురముఖ్యులతో సమరంబు సేయుచో
నెన్నఁ జతుర్దశాబ్దముల నిద్ధవనంబుల సంచరించుచో
ఖిన్నత లేనినీ విపుడు కీడ్పడియున్న తెఱంగ దేమియో
యున్నది యున్నచందమున నొప్పుగఁ జెప్పఁగదన్న లక్ష్మణా. (36 పుట)

ఇది కన్నీ రెన్నఁడు దేవు తండ్రి చెపుమా కల్యాణమే చక్రికిన్—అను పోతనామాత్యభాగవతపద్యమువలె రసవంతముగనున్నది.

2. ఉ. వీరసతీతనూభవుఁడు వీరనరార్చితపాదపద్ముఁ డా
శ్రీరఘురామచంద్రనృపశేఖరుఁ డంపిన యధ్వరంపుబల్
వారువ మిద్ది, సల్పుఁదగుఁ బ్రాభవగౌరవ మెల్ల భూపతుల్
ధీరతఁ బట్టఁగాఁ దలఁచుదిట్టలు పట్టఁగవచ్చు నోపినన్. (63 పుట)

3. సీ. హృదయేశుకరమున నేవేళఁ దళతళ నొప్పెసలారెడునుంగరంబె
యీహనుమంతునితో హత్తి నాకొఱ కుదధి దాఁటినముద్దుటుంగరంబె
నానాథుసేమంబు నాకెఱింగించి నన్నూఱడించినయట్టియుంగరంబె
లంకలో రెండునెలలు నాదుపూజల నొందుచుండిన యట్టియుంగరంబె
ఘనసముజ్జ్వలరత్నప్రకాశితంబు, రామశుభనామముద్రావిరాజితంబు
పుడమిఱేనికినిదిప్రియభూషణంబు, నతనినెడఁబాసివచ్చెనే యకట నేఁడు.

4. ద్వి. గుణరత్నసముదయాకూపారమితఁడు, గుణలతాంతమనోజ్ఞగుచ్ఛమీతల్లి
యననిధర్మంబులయవతారమితఁడు, నవియిట్టివని తెల్పునర్థమీతల్లి

తిలకింప నేకపత్నీవ్రతుం డితఁడు, విలసిల్లు పతిభక్తివిఖ్యాతయీమె
ప్రజలను గృపనేలు రాజన్యుఁ డితఁడు, ప్రజలమదులు గొన్న రాణియీతల్లి
ధరణిలోఁ బూరుషతల్లజుం డితఁడు, ధరలోననారీనుతల్లి యీతల్లి.

ఈహానుమద్వాక్యములు మహాభక్తుఁ డగునతనికిఁ దగినట్లున్నవి.

80 పొరటలోని కుశమృత్యుంజయ సంభాషణవిషయము తత్పూర్వోక్తమైన దేశానఁ బునరుక్తముగాఁ గాన్పించుచున్నది.

కొన్ని పట్ల నాటకపాత్రసంభాషణము త్రుంపివేసినట్లున్నది. అనఁగా:— ఒకప్రశ్నకిచ్చినయుత్తరము తరువాతవచ్చు ప్రశ్నమును స్ఫురింపఁ జేయుట లేదు.

వనవిహారమునందును యుద్ధమునందును జరిగిన కొంతవృత్తరూపప్రసంగము ప్రబంధోచితముగాఁగాని నాటకరసపోషకముగాఁ గాన్పించుట లేదు

రామపుత్రుఁ డని తెలియక శత్రుఘ్నుఁడు లవునితో యుద్ధము చేయుట సరిగా నున్నది కాని కుశలవులు శ్రీసీతారామసుతులని స్పష్టముగాఁ దెలిసియు సౌభ్రాత్రనిధి యగు లక్ష్మణుఁడు వారితో "బాలకాధములారా" యని పలికి యుద్ధము చేయుటకుఁ దగిన ప్రబలకారణములు కల్పించి యుండిన బాగుగ నుండును.

సీతను మాలిన్య మంట దని 119-వ పొరటలో వాల్మీకి చెప్పిన పద్యమందుఁ దక్కిన మూఁడుపమానములును జక్కఁగా నున్నవి. డె, బ్బదితడవ ల్దపించినను బంగరు మిత్తడిరూప మందునే?—అనునది యంతతృప్తికరముగా లేదు. ఇత్తడి బంగరగుటకుఁ దపింపవచ్చును గాని బంగరిత్తడి యగుటకుఁ దపింపదు.

పామరపాత్రలను గ్రామ్యభాషతో సంభాషింపఁజేసినారు. అది తప్పుగాదు, కాని కవిగారితావుల వాడుకొనుభాష వాడిరి గావున, అది యితరస్థలముల నుండువారికి స్పష్టముగాఁ దెలియుట లేదు ఈలోపము కవిగారి దెంతమాత్రమును గాదు. వ్యావహారికభాష గ్రాంథికభాషఁ జేయఁబూనుమిత్రులీచిక్కుతమమనసుల కొక్కింత యెక్కించుకొందురు గాక!

అర్ధానుస్వారశకటరేఫములు కొన్నిపట్ల వేసి కొన్నిపట్ల మానినారు. అంతట నేదో యొకరీతిగా నుండుట మంచిది.

కవిగారు లలితమైన గ్రాంథికభాషలోనే వ్రాసినారు. ఎట్టి ధీమంతుల కైనను బ్రమాదము లుండును సదుద్దేశముతోఁ గొన్ని యీక్రిందఁ జూపఁబడినవి. అందుఁ గొన్ని ముద్రణప్రమాదములు కావచ్చును.

వనమునోజ్ఞమును జూచి (9) తనయుల దెందరేని (10) హిరణ్యకశ్యప, యశోవంతులు (31) పొరబడు, పొరఁబడితివా (37) గీ. నాదు గుణము తాను దెలిసినదియె యనుము (41) అఖండయతి కవిగా రొప్పుకొనిన నిది ప్రమాదము గాదు. కూర్చుని యుండుము (45) నాబహిఃప్రాణమా (53) జాగ్రత్తరండు (69) బ్రతిమాలుచేమి (73) మూర్ఖము వహించి యున్నారు (87) బుద్ధిశాలురు (93) బాలులారా (94) అమలచైత్ర (102) పాపచరిత్రి (122) గీ. చెల్లియుండ్రతోను ద్యానసీములందు (126) పొగడముల (131)

విపులగుణమధ్యమున నున్న స్వల్పదోషము లైనను జూపుట విమర్శకుల విధి గాన, నట్లు చేయవలసి వచ్చినది.

---

# విజ్ఞాపనము.

పాఠకమహాశయులారా!

(1) హరిభట్టు రచించిన వరాహపురాణములోఁ బంచమాశ్వాసము మాయొద్దఁ గలదానిలో గొంత లోపించినది. దయచేసి రెండవప్రతి యెవ్వరియొద్దనైన నున్నచోఁ బంపిన సంప్రతించుకొని మరలఁ బంపించెదము.

(2) నిర్దుష్టశైలిలో భాషా విషయమయినవి, చారిత్రాత్మకములు పద్యములు, వ్యాసములు, వ్రాసిపంపఁ బ్రార్థించుచున్నారము.

(3) చందాదారులు—తమతమచందా యొక్కొక్కసంవత్సరమునకుఁ దోడన పంపెదరని కోరుచున్నారము.

(4) తాతంభట్టు కవిచింతామణి పూర్ణప్రతి యెవ్వరియొద్దనైనఁ గలదా తెలుపఁగోరెదము. ప. అ.

---

బాల—(ఉస్సురని కన్నులు తుడిచికొని) స్వామీ! నన్ను క్షమింపుఁడు. నన్నా వస్తువే చెఱచినది. నీయట్టిమహాత్ముఁడు నివసించు నీపవిత్రస్థలమున నాయపవిత్రపాదమును బెట్టినందుకు మన్నింపుము. నాయందు నీకు జాలి పుట్టుఁగాక! శాంతికొఱకు వెదకుచున్నాను. గాని, నిరాశ నాకుఁ దోడైనది.

సార—తెలిసినది, నిమిషములో నీకు శాంతిని గలిగించెదను.

బాల—నీపాదము లాశ్రయించి యుండెదను.

సార—నీయుదంతము వినవలసి యున్నది. నీతండ్రి?

బాల—గౌతమీతీరవాసి. ఒకప్రభువు.

సార—గౌతమి యనిన నెక్కడి యొడ్డు—తొంబదియామడ—

బాల—రాజమహేంద్రసమీపమున.

సార—గొప్పవారలలో నె ప్రేమకు భంగము, ధనికులబిడ్డలకై నిర్ధనుల వేసములు

బాల—అట్లే జరగినది. నాచక్కఁదనమును బొగడిరి. కొందఱు నాతండ్రిని బొగడిరి. కొందఱు తమ్మే పొగడికొనిరి.

సార—(తన) ఈవేషము స్త్రీవేషమా! సరి.

బాల—పూర్వవంశమును గొందఱు స్తుతించిరి. కొందఱు సమీపబాంధవ్యము-కొందఱు పౌరుషము- కొంద ఱసమర్థులు పరులచేఁ బొగడించికొనిరి.

సార—ఇఁక మోసము సులభముగా నగును.

బాల—ఎన్నో కానుకలు - ఉత్తరములు - రాయబారములు.

సార—చెప్పవలసిన దేమి.

బాల—వారిలోఁ గొందఱు నన్ను నిజముగా వలచిరి.

సార—నీవు స్వయంవరప్రసంగమా చెప్పునది.

బాల—ఆఁ! ఎందఱో వచ్చిరి.

సార—అంతమందిలో నొక్కని నేఱికొనుట కష్టము.

బాల—రెండావృత్తులు తిరిగి మూఁడవనారి నిర్ణయమునకుఁ గడఁగితిని. ఇంతకంటెఁ గన్నులు గట్టి యొకరిచేతి కందిచ్చిన మే లనుకొంటిని. లేదా యొకరు రాక్షసకృత్యమో-లేదా చీట్లువేయుటయో మేలని యెన్నుకొంటిని.

సార—తరువాత.

బాల—ఒక్కపురుషుఁడు నావంకఁ దిన్నఁగఁ జూడలేదు. నమ్రత!—సాధారణ వేషము. అధికార ముండినట్లు కనఁబడలేదు ఆభరణములు లేవు. జ్ఞానము కంటె విలువయైన యాభరణము లేదు. నాకదియే కావలయును. మాట

లాడిన సభయంతయు నిశ్శబ్దము. కాని, మాటయే కఱవయ్యెను. నేను నిర్ధారణకై యొకతావునఁ గన్నుమరలించితి నని కుపితుఁడై కాఁబోలును నన్ను నీగర్వి మఱచును లే యనుకొనియో నేమో దిగ్గున లేచి పోయెను. ఎక్కడికో పోవును. బ్రదికియుండెఁ డని తలఁచెద. కృతఘ్నం నాది. అతని మరణ స్థలమున నాకు మరణము దొరకుఁగాక.

సార—అంతనుంది యుండఁ, బోయినవానికై యేల.

బాల—అతఁడు నాకొఱకుఁ జచ్చును. నేనతనికొఱకు జచ్చెదను.

సార—ప్రాణము పోఁగొట్టుకొనఁగాదు నే నట్టియత్న మొకప్పుడు చేసియు మానితిని. (చేయిపట్టుకొనును.)

బాల—(స్పర్శచే) నీవేనా యేమి! అట్లే యున్నది.

సార—సారంగివా యేమి! నేనే యాపాపిని.

బాల—పాపి వెట్లయితివి.

సార—నీ వనికొనినట్లు చావని వాఁడను.

బాల—(కౌఁగిలించి) ముందే చెప్పితిని. నిన్ను సంతసొందించితినని.

సార - కాదు! ఈశ్రమ కలిగించినది ముందు నేను.

బాల—సారసా ప్రాణపదమా!

సార—మనోహారిణీ సారంగి.

సారం—ఇఁక నాకష్టము తీఱినది.

సార—ఇఁక నెవ్వరికష్టము తీఱవలయును.

సారం—నే నిట్లయితి నని పరరాజులు నాతండ్రిపైఁ గత్తికట్టిరి.

సార—(పర్ణశాలలో నొకమూలనున్న కత్తి పట్టి కొని) అట్లయిన రిమ్ము. మన మాతని కష్టములం దీర్తము.

సారం—నాతండ్రికిఁ బుత్త్రులు లేరు. వానియనంతరము మనమే.

సార—అతనినే వేయేండ్లు సుఖముగా మననిమ్ము. మన మిట్లున్న మన కిదియే సర్వరాజ్యమును.

(ఇరువురును నిష్క్రమింతురు.)

ఇది ప్రియగవేషణ మను పంచమరంగము.

---

# ౬. అర్ధరాజ్యము.

(సూత్రధారుఁడు ప్రవేశించి)

గీ. కొలుతుఁ దాదృగ్గభీరవాఃకలిత నద్రి, దక్షిణోత్తరపాంచాలధరణి రాజు
నకును విప్రునకును బంచుటకుఁ బఱచిన, గడను బురుడించునట్టి గంగాభవాని.

ఆహా ఏనుఁగునకుఁ గడుపునిండ నాహారము కట్టుఁగంబమునొద్దకుఁ దెచ్చిపెట్టి చీమ తిరిగి తిరిగి సస్తుపడియుండునట్లు చేయుభగవంతుని విలాసము.

గీ. వివిధవేది చాపవిద్యాగురుండు దే, హీ యటసంగఁ బ్రభువు హీనునట్లు
లేదు పొమ్మటంట లేశంబొసంగుట, యజ్ఞ నధకుఁ జేయు టతని లీల!

మాకథానాయకుఁడును మాకవియు నొక్కస్థితిలో నున్నారు. ఎల్లకాలము నెవ్వరు నొక్కరీతి నుండరు. (అటునిటుచూచి) నాప్రియురాలు వచ్చెనా పెద్దనాటకములకువలెఁ బెద్దయుపోద్ఘాతము నడుపును. దిగుదిగు మని యెందఱు చెప్పుచున్నను వినని యుపన్యాసకునివలె విడువదు. పైఁగా వారివలెనే యున్న ప్రొద్దుమాడక యిట్టివా రేల రమ్మనవలె నని తిరుగఁబడును. వచ్చినఁ దా నేల హ్రస్వముగాఁ జెప్పక పెంచవలయునో! కుదించుము, సాఁగవేయు మని యెవ్వరైన మొదటఁ జెప్పిరా యనును. కొంపముంచి నేనును బెంచుట లేదుగద? కథలోనికి దిగుచున్నాఁడను. (అని పూవులు చల్లి వెడలిపోవును)

(ఇరువురు పురుషులు ప్రవేశించుచున్నారు)

ఒకఁడు—బావా! కాంపిల్యనగరమునకు నీవు ప్రాఁతకాఁపవు.

రెండవ—ఔను నాజన్మభూమినే మఱచితిని.

ఒకఁడు—రాజున కానన్న పరిచారకుఁడవు! నీపల్లెటూరు పడియుండనిమ్ము.

రెండ—జన్మభూమి కీడులేదోయి. నీ కారుచి బాగుగాఁ దెలియునే.

ఒకఁడు—ఇక్కడ నేమియుఁ దోఁచుట లేదు.

రెండ—మాకందీపురము కొట్టినపిండి - రాజభటుఁడనని యూళ్లపైఁబడి మల్లెపురుగువలె దోఁచుకొని తినువానికిక్కడఁ దోఁచునా. కనిపెట్టి సీకిట్టి శిక్ష విధించినారు.

ఒకఁడు—రాజ్యము పోయినపిదప మనరాజుగారిచర్య క్రొత్తక్రొత్తగా నగపడుచున్నది. మాటిమాటికి నీశ్వరధ్యానము.

రెండ—నీ కింటిమీఁద ధ్యానము లేదా.

ఒకఁడు—అది యెట్లు చెప్పుము.

రెండ—నీవింటిపట్టున నుండి యొడలు మఱచితివి.

ఒకఁడు—మనమహారాజు?

రెండ—రాజ్యగర్వమున మిత్త్రుని మఱచినాఁడు.

ఒకఁడు—నాకిక్కడ శిక్షగానే యున్నది. రాజాజ్ఞాశిక్ష దైన మొకశిక్ష.

రెండ—కన్నులగర్వము దిగుట కొక్కపు డొకయుక్తి దైవము పన్నును.

ఒకఁడు—శివధ్యానము చేసిన గర్వము దిగునా.

రెండ—పిచ్చివాఁడా! అది ధ్యానము కాదు.

ఒక—విజయపక్షపాతి - అనిన—

రెండ—మఱి యేమనును.

ఒక—మహాధనుర్ధర! కుమారైకప్రియ! చాపగురు! రాజకళాహారి! శుద్ధబ్రహ్మ స్వరూప! ఇవి?

రెండ—మఱి యేమి—ప్రక్క బెదరుమాటలు.

ఒక—కోపముద్రితములా?

రెండ—అందుకు సందేహ మేమి?

ఒక—నేను నిలుచుటకు సమయము గాదు. వినవచ్చెడ నేని రహస్య మొక్క ముక్కలోఁ జెప్పుము.

రెండ—తన్నవమానించిన ద్రోణాచార్యుని గూర్చినవి.

ఒక—అట్లు చెప్పుము. పల్లెటూరిబడిగుమ్మజపలె నుచ్చరించినమాటల యర్థమే తెలియకున్నవాఁడను.

రెండ—శ్లేషార్థము తీయవలయును.

ఒక—నే నింకను బెరటిత్రోవనే యున్నాఁడను.

రెండ—ఇప్పుడు తెమలదు. నీవు పొమ్ము. నేనును బోవలయును. పోని నిలు నిలుము.

యౌవరాజ్యపట్టాభిషేకమునాఁటికి నీ పసూయ విడిచి పూర్వస్నేహమును బాటించి విచ్చేయుమని ద్రోణాచార్యులు శుభలేఖ వ్రాసినారఁట.

ఒక—పట్టిచేతుల—తనకు లేదు తగ వెట్లు కొనిపోవును.

రెండ—బెల్లము వండినప్రొయ్యిలే. కొండంతగర్వము వహింపవచ్చును గాని గోరంత యవమానము సహించుట కష్టము.

ఒక—అశ్వత్థామకు యౌవరాజ్యపట్టాభిషేకమా! ద్రోణునంతవానికి రాజ్య మేటికి.

రెండ—జయించినవాఁ డేమిచేసికొనును. తెలియనివాఁడవు నీపని నీవు చూచు కొమ్ము త్రాడెక్కువాని నెంతదూరమెగఁద్రోయుదును.

ఒక—రాజ్యము లేనిరాజుకడ నాకొలువు నచ్చలేదు. (పోవుచున్నాఁడు)

రెండ—ఇదిగో సభ!

గీ. ఖండపరశునిశిష్యుఁ డఖండపరశుఁ, డతనిప్రియశిష్యుఁ డవనికి నస్త్రగురుఁడు
వానిశిష్యుఁడు విజయుఁ డీనరుసఁ గాదె, వసుధ శిష్యపరంపర వఱలవలయు.

స్వయముగా మారా జభిషేకసమయమునకుఁ బోయిన లాభ ముండును. పోక పోయినను భారద్వాజుఁడు దీర్ఘకోపి గాఁడు. అంతయుఁ జూచెదను. ఈ కన్నుల కిటెప్పు దూరముగా లేదు. (అనిపోవుచున్నాఁడు)

(భీష్మద్రోణకృపులు ప్రవేశించుచున్నారు.)

ద్రోణు—దేవవ్రత! లక్ష్మి యొకరి సొత్తు కాదు. ధనగర్వము విష్ణుదేవునకును నాకప్పుడు తగ దనియే తలంచెదను నన్నడిగితిరా—

గీ. వైదికుని కేల మేదిని ప్రాభవంబు, నైదుస్రేళులు లోనికి నరుగఁ జాలు
బిడ్డఁ డేడ్చినఁ బాలకై గిడ్డి నీఁడె, బాల్యమిత్త్రుఁ డటంచు సంబరపడితిని.

అడుగుటయే సిగ్గు. అడిగి లే దనిపించుకొనుట యంతకంటెను సిగ్గు. లే దని చల్లఁగఁ జెప్పిపుచ్చక నిందతో వెడలించినపుడు నీకువలె నాకు స్వచ్ఛంద మరణముండినచో నపు డాతని గుమ్మములోఁ జచ్చి బ్రహ్మహత్య వానితలఁ గట్టియుందును.

మ. అపు డీ వించుక యాదరింప వను, నావ్యాపార మేమౌనో యీ
కృపుఁ డున్నాఁ డిఁక వల్దు పొమ్మనిన నే నీపాటి కెం దుందునో
కృపి యే మౌనె కుమారుఁ డెం దరుగునో,

భీష్మ—............................పృథ్వీ జనుల్ తిండిలే
కుపతాపంపడు చెందఁబో బ్రదుకలే దో యట్లనం జెల్లునే.

నిన్నుఁ జూడకున్న నీవిద్యను జూడకున్న వారు గ్రుడ్డివారు.

మ. ఒక రే మీఁగల రీవిధాద్భుతకళాయుక్తుండ వౌ నీకు నీ
సకలక్షోణి యొసంగఁ దీఱ దపుడా జ్ఞం జేసి కైజీతమి
చ్చి కడుం జుల్కన జేసినాఁడ నదియే సిగ్గయ్యెడిం జాలుఁ జె
ప్పకు నీ వీయఖిలోర్వి నేలఁదగు ద ల్పం బెంత పాటింపఁగన్.

ఓచాపాచార్య!

ఉ. నీవును నీతనూజుఁడును, నేఁడు జయింపరె లోకమెల్ల నా
త్రోవకు రారుగాని ద్రుపదుం డురుగర్వము నొందు టబ్బురం
బీవసుధాధినాయకులు నీవు సమానులె పాలనంబునం
బావకతేజులై నెగడు బ్రాహ్మణు లెంతకుఁ జాల రెన్నఁగన్.

బెడఁద నెత్తిఁ బెట్టికొనక రాజులచే మోయించుచున్నా రన్నది మఱచి యిల్లు సొచ్చి వాసములు లెక్కించు దుష్టరాజుల శిక్షించుట కెన్నియో మార్గములు. అందు నీదొక్కటి.

గీ. బ్రాహ్మణుం డంత యతఁగుఁడే రాజ్యమున్న,
జాదులుఁ బ్రసాదమును నట్లు జను లదృష్ట
పంతు లీనీతనూజుండు వలఁతి యావ
రాజ్యమున నిల్పు మేలును బ్రాభవముగ.

ద్రోణ—గాంగేయ! నా కీటరు వేల.

క. ఉడు రాజై గర్వ మూతని, కుడిగించిన యంతలోన నుర్వీభర మి
ప్పుడు తనయునిపై నునిచెద, బుడుతల కది యొకవిలాసముగ సుఖమిచ్చున్.

భీష్ము—సత్యమే. అశక్తతవలన నా కొడుకులపై రాజ్యభార మిడి పెద్దరాజులు తప్పుకొనుచుండుట - వారియూహాయు నిట్టిదియే.

ద్రోణు—నా కిప్పు డొక్కటి తోఁచుచున్నది. దీనికి మీ రేమందురు.

భీష్ము—నీకుఁ దోఁచినదాన నొఁగాము లెవ్వరు తెల్పఁగలరు.

ద్రోణు—గీ. పిలిచితిని మాటమాత్రకు బిడియపడక
వచ్చునే ద్రుపదుండు సర్వధరఁ గోలు
పోయి సామాన్యనరునట్లు పోల దొక్కొ
యర్ధరాజ్యంబు వాని కీయంగఁ దలఁపు.

భీష్ము—ఉత్తమ మైనయూహ. అశ్వత్థామ నయకోవిదుఁడు. ఇప్పని కెవ్వరి నియోగింతము.

ద్రోణు—వెదుక నేల బాల్యమునుండి నీచేతులలో మెలఁగి శాపమునకుఁ జాపమునకుఁ జాలిన కృపుఁడు గలఁడుగద! ఇది వ్రాసి యుంచినాఁడను వినుండు.

భీష్ము—సర్వము సిద్ధము చేసియే యుంచినారు.

ద్రోణు—"నీవు నావశమైనపుడే నీరాజ్యము నావశ మైనదిగదా.

గీ. అపహరించుదురుద్దేశ మెపుడు లేదు, నాదుకోపంబు చల్లాఱె నాఁడె, నీదు
గర్వ ముడిగినదో లేదొ కనుఁగొనంగ, నింతకాలము నీరాజ్య మీయకుంటి.

సీ. పశ్చాత్తాపముఁ దెలిసికొంటిని గంగానది దక్షిణపుటొడ్డు మొదలుఁ జర్మణ్వతి
గరుసుఁగాఁ గల దక్షిణపాంచాలమును గొని యిప్పటి నీకాంపిల్యపురమునో
మాకందీపురమునో రాజధానిగాఁ బరిపాలించుకొమ్ము. ఉత్తరపాంచాలము
మాయశ్వత్థామ యిచ్చివచ్చినన్ని నాళ్లు తన కహిచ్ఛత్రపురము రాజధానిగాఁ
బాలించి కౌతుకంబుతీఱిన వెనుక నీరాజ్యమున కప్పటిరాజున కిచ్చివేయును"

భీష్మ—బలే స్తుత్యర్హముగా నున్నది.

ద్రోణు—మధ్యవర్తి మాబావ యిచ్చచొప్పునఁ జెప్పినను - ఈమాటలు చెప్ప
వచ్చును.

కృపు—నడుమ నామాట లేల మీరు చెప్పినట్లే యక్కడఁ బాడెదను.

ద్రోణు—మీయల్లుని నే నన్యాయము చేసినట్లు నీవు తలంతువేమో యని
భయముచే నీస్వాతంత్ర్యమునకుఁ గొన్ని విడిచితిని.

భీష్మ—అతుకులు గలియున ట్లీకృపాచార్యుఁడు కొన్ని తోవాసములు వేసి
మాటలాడఁగలఁడు.

కృపు—కానిండు కానిండు.

ద్రోణు—ఒక్కటి మఱవకుము.

గీ. బ్రాహ్మణుఁడుసంతసించు నాప్రాతికూల్య, మెప్పుడును రాదు రాజులుతృప్తులయ్యు
హృదయకాఠిన్యమును వీడ రెల్లవాఁగు, నది పరీక్షింపఁ జేపట్టె ననుము సగము

భీష్మ—అనమానము నొందినవారు విరోధిచే మరల రాజ్యముంగొనుట కష్టమే,
పుచ్చికొని కుయుక్తులు పన్నకుండువా రుండుటయుఁ గలదు. కావునఁ
జేతిప ట్టుండవలసినదే యని నాతలంపు.

ద్రోణ—కృపాచార్య నీవు ద్రుపదుని సంతుష్టుం జేసి వచ్చినదాఁక యౌవరాజ్య
మున కశ్వత్థామ నభిషిక్తుం జేయను.

భీష్మ—దానికి దీనికి సంబంధ మేమి.

కృప—ఇదె పోయి వచ్చెదను. (నిష్క్రమించుచున్నారు)

(ద్రుపదుఁడు ప్రవేశించును)

ద్రుప—నేను జేసినది పెద్దతప్పు. తప్పుచేసితి నని యొకని కెట్లు లోపడుదును.
ఎట్లు ప్రార్థింతును.

గీ. బ్రాహ్మణుం డవమానింప వచ్చు బ్రహ్మ, వేత్త వాని నెదుర్చుట వెక్కసంబు
పాటిరాజకుమారుని సాహసంబు, నోర్వఁజాలనియుడుకయి యున్న దిపుడు.

ఆహా! విజయుని సాహసము! గర్వము లేని రాజుండఁడు. ఉండిన వింతలోనిదే. రాజ్య మున్న దని గర్వింపవచ్చును. అప్రతిహతశక్తి గలదని యుప్పొంగ వచ్చును. అట్టిది పరాక్రమాయత్తము.

మ. హితుఁడో శత్రువొ సత్తముండొ భటుఁడో పృథ్వీశు దర్శించి వాం
ఛితముం దెల్పిన వానిఁ దృప్తునిగ నేఁ జేయంగ ధర్మంబు భూ
పతినై యుండియు బాల్యమిత్త్ర మని చెప్పన్ బ్రాహ్మణున్ ధిక్కరిం
చితిఁ దప్పం చొక రాఁడఁగా వలయునే, నీ నిందకుం బాత్రుఁడన్.

అంటి నఁట గదా నేను రాజైననాఁడు నీవు నాతో సుఖంబు లనుభవింప రమ్మని—బ్రాహ్మణుం డసత్యము లాడునా. మదావృతి నేనే మఱచియుందును.

గీ. రాజ్యమంతయు హరియించి ప్రాభవమున
నన్నుఁ బట్టాభిషేకమ్మునకును బిలిచె
గర్వమా యది స్నేహమార్గమ్ము ద్రోణు
నింతమాత్ర నహంకార మేలపట్టు.

పిలిచినదానికిఁ బోవలయునా వలదా. వీతరాజ్యుఁడ నేనని పోదును. అనఁడు గాని రాజ్యముగల బ్రాహ్మణునకు వీతరాజ్యు లగురాజులతో మైత్త్రియెట్లు పొసఁగు ననిన—

గీ. బ్రాహ్మణుఁ దిరస్కరించిన వంతగూర్చు, దర్థినని వచ్చి బాలునకంచుఁ గోర
ఘోరకృత్యం బొనర్చితి ధారుణీశు, రాజ్యమది గర్వపుంబ్రోవు ప్రకట మయ్యె

లోకులు తమతమ పూర్వసంచితమైన యదృష్టమును రాజునొద్ద దాఁచిపెట్టు కొందురు.

గీ. ధారుణీపతి కోశాధికారి ప్రజలు, పన్ను లనుమిష ధనము దాపఁగ నొసంగి
కొందురు సుఖార్థ మపుడప్పు, డందు గవ్వ, యైన ముట్టంగ రాజున కైతిగాదు.

ప్రపత్తిసంఘములు సహాకారసంధులు నిట్టివే కాని రాజున కవి క్రిందిమెట్టులు. ప్రజలసంతృప్తి యనుఫలమును మాత్రమె రా జనుభవింపవలయును గాని దాఁపుడుధనముం దాఁకనైన రాదు.

గీ. అడిగినప్పుడు వారికీయక తిరస్క, రింప నేమర్థ మగును హరింపఁ గన్ను
కుట్టెననుమాట కాదెలోకులునహింతు, రేయొనర్చితిఁదప్పుతా నెట్లుతొలఁగు.

స్రగ్ధర. మొరయు న్మండూకపంక్తుల్ మును రెసఁగ నహంబుల్ [1]తమిస్రాసమత్వా
దరణంబుం బొంద సింధూత్కారము జలనిధిం దార్కొనన్ జాజిపూచ
ప్పరము ల్భోగుల్ నుతింపం బటిపరిగతులం [2]బర్వపున్ గ్రాఁజపూవుల్
దొరఁగింపం బుష్పొడుల్ బంధుర మగుచు నిలం దోఁచె వర్షర్తు వందున్

సీ. పెనుఁబాము వ్రేలఁగట్టినరీతిఁ గురిసెఁ గుంభద్రోణమగువృష్టిఁ బలుమొగుళ్లు
చను జారసంకేతనమునకుఁ బాంసుల రేయిఁ జినుకు పంక ముఱుము చీఁకటనక
ఫుక్కిటిబంటియాపొలపు వెల్లికి నోర్చి మెలఁగఁజొచ్చిరి హాలికులు ప్రియమున
నాశిపాకాంక్షమై నడవిలోపల గూడువడి మూఁకలై యుండె బలుమృగములు
నట్టివర్షాగమంబున నసురభర్త, విజయయాత్రాసమారంభవృత్తి వదలి
సంకుమదమార్గమదలిప్తచతురయువతి, కుచపరీరంభశాలియై కుతుక మొందె.

క. పాపాంధకార మణఁచి ప్ర, దీపించు ప్రబోధచంద్రు తెలివియు పోలెం
జూపట్టె జలదసమయ, వ్యాపదఁ గడ కొత్తి శారదాగమ మంతన్.

సీ. తెలుమొగల్ ? చిలుకముక్కులఁబోలె [3]భంగభంగములయ్యెమువ్వన్నెగనపవిల్లు
తాండవక్రీడ ముక్తాశశి సోగకాసియ యూడ్చె శిఖి వనశ్రేణియందుఁ
క్రేంకారశబ్దంబు లంకురించె మరాళజాతికిఁ గమలకాసారవారి
సత్తచ్ఛదక్షీరసౌరభం బై పర్వె గజకపోలముల వెక్కసపుమదము
పుట్టఁ [4]గోరాడె నాఁబోతు పొట్టకట్టి, లవిసె సస్యంబునకు నింకె నసలు నిసుక
వెరిఁగె నేఱుల ధౌతముకురసమాన, కాంతిఁ దిలకించెఁ బూర్ణరాకావిధుండు.

క. ఏలాలవంగతక్కో, [5]లాలీజాతీఫలప్రియంభావుకగం
ధాలీఢశిశిరమారుత, బాలక్రీడలు చెలంగెఁ బర్వతభూమిన్. [లెల్లఁ

గీ. వేఁడిమియుమాంద్యమును లేక వెలుఁగుఱేఁడు, పసిగలోఁగొనుధరఁగల్గురసము
క్రూరుఁడును శాంతుఁడునుగాక కువలయేశుఁ, డవనిజనముల చేఁగప్పమందినట్లు

## ప్రహ్లాదుఁడు స్వర్గముపై దాడి వెడలుట.

గీ. అంకురించె మహోత్సాహ మవనిపతుల
డెందముల శత్రువిజయంబు నొందుకొఱకుఁ
బ్రజ్వలించు కృశానుపైఁ బ్రబలు నిబిడ
కీలయును బోలె దేజోవిశాల మగుచు. ౧౩

[1] తమిస్రాసమ [2] పర్వపుంగ్రాజి (పరువముగల గ్రాఁజచెట్టు.) [3] ఖండఖండము.
[4] గోడాడె. [5] లాలితజాతీఫల.

శా. ఆకాలంబున నొక్కనాఁడు చతురంగాభీలకోలాహలో
త్సేకం బంబుధిఘోషముం బొదువ నిస్త్రింశోగ్రరోషాగ్నియై
నాకౌకఃపతిమీఁద దాడి వెడలె న్నానాసురాధీశసే
నాకోటుల్ భజియింప నమ్మనుజభుగ్జ్యేష్ఠుం డనాధృష్టతిన్. ౧౪

సీ. ధణధణంధణమ్రోయు తమ్మటధ్వానంబు ప్రయ్యలుగా మిన్ను వ్రచ్చివైచె
నినమండలము గప్పె నిసుమంతయును గానరాకుండ సేనాపరాగరాజి
కనుమోడు పొదవించె ననిమిషాంగనలకు శాతాస్త్రప్రచయ చాకచక్యగరిమ
భరము తాళఁగలేక ప్రథమకచ్ఛపరాజు వికలుఁడై యొక్కింత వెన్ను వంచె
మ్రొగ్గదిగ్గజములు శైలములు చలించె, రాలెఁ దారలు జలరాశి దీలువడియె
దనుజనాయక దండయాత్రామహోగ్ర, వీరరసవిభ్రమస్ఫూర్తి గారుకొనఁగ.

క. ఆదేవవిభునిపైఁ బ్ర, హ్లాదుఁడు చనుపూన్కి వలవ దని పల్కెడును
ర్యాద ఘనఘటలఁ దోఁచె, న్నేదురనాదములు దిక్సమితి చెవుడుపడన్. ౧౬

క. నభ మెల్ల నిండి రక్షో, విభుసైన్యము కామరూపవిభ్రమమున న
క్షుభితగతి వచ్చుపూనికి, సభయుంగావించెఁ బాకశాసను నంతన్. ౧౭

చ. కొలువున నుండి దేవపతి కూర్చుదిశాపతులు న్మరుద్గణం
బులు వసురుద్రకోటులుఁ బ్రబుద్ధులు వృద్ధులు నైనవారు వీ
నుల నిడి మేలుమే లన వినూతనసూక్తుల దేవతాగురుం
బలుకు గభీర[1]కంఠరవభర్త్సితనీరదగర్జనంబుగన్. ౧౮

మ. హరినామస్మరణంబు శ్రీహరిపదధ్యానానుసంధానమున్
హరిదాస్యంబు హరి న్భజించుటలు నిత్యాచారముల్గాఁగ భూ
సురసంప్రీణనము న్సురావనము నస్తోకోన్నతిం జేయు లో
ల్యరజోగర్వవిముక్తబుద్ధి యగుఁ బ్రహ్లాదుం డఖేదోన్నతిన్. ౧౯

ఉత్సాహ. అతనిధర్మ మిన్నినాళ్లు నసురభయవిదూరతో
న్నతి వహించి విభవభోగనయసమున్నతిం జగ
త్త్రితయ ముదయ మొందె నిపుడు దివిజవిమతదుష్టవా
గ్వితతి నతఁడు సత్త్వగుణము విడిచి యడిచిపాటుతోన్. ౨౦

క. హరిమీఁద మనలమీఁదం, బరుషత వాటించెనఁట యపారబలముతో
నరుదెంచుచున్నవాఁ డఁట, కరణీయం బెద్దియో యకల్మషచరితా. ౨౧

[1] కంఠగవభర్జిత.

గీ. నక్క రేనుబండ్లు నసులంగ నొల్లని, వ్రతముపట్టి పిదపి బతము చెడిన
నీతి నిక్క మయ్యె దైతేయసూతిహృ, చ్ఛాంతి విడిచి దాష్ట్యవంతుఁ డగుట.

క. నావిని చిత్రశిఖండిజుఁ, డావజ్రాయుధునిఁ బల్కు నమరాధిప ర
క్షోవరులకు నైజము దా, ష్ట్యావేశము శాంతిగుణము లాగంతుకముల్. ౨౩

చ. హరికృప గల్గియున్ననిను నాయసురేశ్వరుఁ డేమిసేయు సం
గరము జయాజయంబులకుఁ గారణ మాతఁడు నిన్ను నోర్చిన
న్సురపురిఁ గొన్నినాళ్లు నిలుచుం గదనంబున వాని నీవు ని
ష్ఠురగతి నోర్చితేని జయశోభనము ల్నినుఁ జేరు నారయన్. ౨౪

గీ. ముట్టఁబడినపనికి నట్టిట్టు చనఁబోల, దసురఁ దాఁకి పొడువు మసము మిగిలి
చంపఁ బొంచి యున్నజంతువుపట్టునఁ, దడయనలవ దాత్మ జడియవలదు. ౨౫

క. గర్వించి యశోవాన్వు, త్యుర్వా యని దివిజబలమహోగ్రాకృతి వై
గీర్వాణ విమతజలనిధి, పర్వతమై నిలువవయ్య పాకధ్వంసీ. ౨౬

సీ. విమతేంధనముల వేలిమి వేల్వఁగాఁ జాలు ననవద్యతేజుఁ డీయనలుఁ డుండ
నిటలాక్షునది యైనఁ బొటిలి పోవఁగఁ జేయు కఠినప్రచారుఁ డీకాలుఁ డుండఁ
దనవారిఁ దమివాసి యనిమిషావళిఁ గూడి వర్తించు నీకోణభర్త యుండ
సప్తసాగరరాజు సకలధర్మస్వరూపం బైన యీ పాశపాణి యుండ
గంధవహుఁ డుండ నియ్యలకాధినాథుఁ, డుండ ఖండేందుధరుఁ డుండ సురల నీకుఁ
జంచలింపంగ నేల నిశాచరార్తి, జాతమాత్రంబునకు వజ్రసాధనుండ. ౨౭

క. హరి గలఁడు నీకు నిన్నొక, దరిఁ జేరుచుఁ గాని బెట్టిదపుఖేదములం
బొరయంగనీఁడు రక్షః, పరివృఢుఁ డన నెంత నీకుఁ బరబలభేదీ. ౨౮

క. తనతండ్రి నంతవానిం, దునుమాడిన విష్ణుశక్తి తొర మనక య
మ్మనుజాశనుఁ డచ్యుతుపైఁ, గసలుట పులిమీఁద లేడి గవయుట గాదే. ౨౯

గీ. అరులఁ జంపవలయు నరులచేఁ దానైనఁ, జావవలయుఁ గాక శౌర్యఘనుల
కహితు లెదురునప్పు డట్టిట్టు చనరాదు, చనిరయేని గీర్తి హానిఁగువడదె. ౩౦

చ. ఘనులు ప్రియోక్తు లాడిన వికాసముఁ గొంతురు గాని దుర్జనుల్
చెనఁటులు నైన రక్కసులచిత్తము మెత్తన గాదు పోరికి
న్ననికిది వేళ గా చనిన మానరు గావున వైరివీరమ
ర్దన మొనరింపు దుర్దమవిధానదురావహశౌర్యశాలి వై. ౩౧

వ. సామదానభేదంబు లొనరించుతఱి తప్పఁ గ్రుంకినయది నిరాతంకహృదయుండ
వై దండంబున విమతఖండం బొనరింపు మని యనిమిషపతికి బృహస్పతి నీతి
మార్గం బుపదేశించుసమయంబున. ౩౨

గీ. చారు లరుగుదెంచి జంభారిఁ బొడఁగాంచి, ఘర్మసలిలబిందుకలితమూర్తు
లగుచు సంభ్రమోక్తు లడరంగ నిట్లని, రదరుగుండెతోడ బెదరి బెదరి. ౩౩

సీ. పొడకట్టె భూరజఃపుంజంబు మాంజిష్ఠపటవితానముగ నంబరమునకును
గదిసె నాజానేయకంఖాణసంఘాత మనిలోచ్చలితపిచివనమువోలె
గంధాంధబంధురసింధురంబు లకాలజలదోదయముఁ జేసె సకలదిశలు
గగనగంగాపయఃకాండ మంతయుఁ గ్రోలె నందితస్యందనోన్నతపతాక
లాయుధప్రభ లర్కాంశు లట్లు వెలిఁగె, భేరిభాంకార మబ్ధిగభీర మయ్యె
నచ్చెఁ బ్రహ్లాదుఁ డాదిత్యవంశవర్య, శాత్రవంబునతో మైత్రి జరపుటకునొ.

వ. అనిన నదరిపడి త్రిదశపతియుం గొలువువిరిసి కలయ నెఱసిన కోపంపుం
గెంపు పెంపున సొంపారి సహస్రలోచనంబులు గలుగు నిజశరీరంబు చెందమ్మి
కొలనిచందమ్మున నందంబుగఁ గుటిలతరభ్రుకుటిఘటనంబు నిటలంబున
నటింపఁ గటము లదరం బుటములు గొనునిట్టూర్పులు కందర్పహరకంఠ
సర్పంబుఁ దలఁపింప నలందిన హరిచందనంబుం దెరలించి ముంచుకొను
నులివేఁడిచెమటలు చోటచోట వడియ నిలువెడలి హజారంబున కెడ
గలుగ నిలిచి నిలింపులం బిలిచి పలలాశనసంహారంబునకు [1]సరంహంబుగం
బయనంబు గం డని తానును భండనోచితశృంగారం బనంగీకారాంగీకా
రకలితంబు గైకొన్నవాఁడై వాఁడియు వేఁడియుం గలకులిశంబు జళిపించు
చుం గలధౌతకుధరతులితవపురుత్సేధంబును నగాధదానపాథఃపరంపరా
పారిప్లవభ్రమరసముదయంబును నుదితనిజనినదవిదళితబ్రహ్మాండకటాహం
బును హాటకఘంటికాఘణాత్కారఘోరవేగంబును నితాంతచతుర్దంత
కాంతి సంతానకల్పితాకాలచంద్రోదయంబునుం జారుతరావదాత చమర
వాలవల్లీవేల్లిత గల్లస్థలంబును జిత్రకంబళ కలనాభిరామోర్ధ్వకాయంబు
నగునైరావణంబు నెక్కి రక్కసులమూఁక దిక్కుల కలకలం బాలించుచు
నుండె నంతం దండోపతండంబులై యమరవీరులు సమరోత్సాహసంభ్రమ
భ్రమితహృదయంబుగం బదనుమీఱిన కరవాలంబులు శూలంబులు ఖేటం
బులుం గిరీటంబులు వారవాణంబులు బాణంబులుఁ జాపంబులుం బ్రాసక

[1] సంరంహ్వంబ్బుగంబ్బయనంబ్బుగాండ్లని.

లాపంబులు దీపింపఁ గోపాటోపంబున నంబరంబు ఘూర్ణిల్లం బెట్టు వలుకుచు నరదంబులు ద్విరదంబులు హయంబులుం బదాతిచయంబులు నయుత నియుత లక్ష దశలక్ష కోట్యర్బుద న్యర్బుదప్రముఖంబు లగుసంఖ్యావిశేషంబుల నుల్లంఘించి [1]క్రేళ్లుమెలంగం గసిమసంగి సింగంబులు గిరిగుహాంగణంబులనుండి వెడలువడువున స్వర్గంబు వినిర్గమింపం దొడంగి రప్పుడుత్పాతంబు లనేకంబులు గనుపట్టె నట్టు లయినను నెట్టవియసి గట్టిమనంబుతో నదితిపట్టి చూపట్టి జయంతుం బురరక్షణంబునకు నియమించి చనుదెంచు సమయంబున. ౩౭

ఇంద్రుఁడు ప్రహ్లాదునిపై యుద్ధమునకు వచ్చుట.

క. కనలుననో నైజగుణం, బుననో తనువందు నుష్ణము ఘనంబుగ న
య్యనలుం డేడికతత్తడిఁ, గొని దాఁటించుచు బలాంతకునిగని మ్రొక్కెన్.

చ. వగరుపు తేజి నెక్కి యిరువంకలఁ గింకరకోటి బింకముల్
నగవులు నట్టహాసములు నల్లనిమేనుల నుబ్బుగబ్బునై
మొగివిడ కేగుదేర దివిముట్టిన పట్టిన పోటుముట్టుతోఁ
బొగరున నేగుదెంచె రవిపుత్త్రుఁడు గోత్రవిరోధి డాయఁగన్. ౩౮

గీ. ఆత్మతుల్యమూర్తి యగు రక్కసుని నెక్కి, ఘోరభంగి వాఁడికోఱ లెసఁగ
వివిధభూషణాస్త్రవిద్యోతితాంగుఁ డై, దానవుండు వేల్పుఱేనిఁ గదిసె

శా. యాదోభేదము లెన్ని యేని గొలువ న్వ్యాలోలపాశప్రభా
ప్రాదుర్భావము కల్పవహ్ని సుషమన్ భాసిల్ల నక్రోపవా
హ్యాదీర్ఘక్రమణప్లుతింబుల మనం బానందముం బొంద మాం
సాదధ్వంసనకాంక్షమై నడచెఁ బాశాంకుం డశంకోద్ధతిన్. ౩౯

క. గంధవహుండు [2]సుధాంధో, బంధురు నలరించెఁ జిత్రపర్యాయగతిన్
గంధాంధహారిణసైంధవ, ముం దేయని పఱపి సైన్యముఖతిలకం బై. ౪౦

గీ. గరుడగంధర్వకిన్నరగణము సిద్ధ
సాధ్యరక్షోబలంబు లసంఖ్యములుగ
హాయము దాఁటించుచును గదాభయదబాహుఁ
డగుచు విత్తేశుఁ డనికి నై యంగవించె. ౪౧

క. ఈశానుఁ డేగుదెంచె శి, ఖాశీతమయూఖరేఖఁ గళలుబ్బఁగ బా
హాశూలప్రభ ప్రబల న్వృ, షేశవిశంకటవిహారహేలావశుఁ డై. ౪౨

---

1 క్రేళ్లు మెలంగ్గ. 2 సుధాంధ్ధోబంధ్ధూనలరించ్చె.

క. వసురుద్రాదిత్యులు తీ, వ్రసమీరక్షుభితవిలయవారిధు లన ను
ల్లసితోగ్రవీరరసకే, లిసహితగతి వచ్చి రఖిలలేఖోన్నతులై. ౪౩

క. వీరాలాపంబులు ఘీం, కారంబులు హేషితములుఁ గలయ బెరయుటన్
ధీరంబు లయ్యెఁ దూర్య, స్ఫారారావములు త్రిదశబలములలోనన్. ౪౪

క. పొగలేనిమంట లొక్కట, బుగులుకొనియె నాయుధములఁ బున్నమరేలన్
జిగిదేఱు లేఁతవెన్నెల, మొగడలక్రియ నఖిలసుభటముఖరుచు లలరెన్.

క. నలువదినాలుగుయోజన, ముల వెడలుపు నిడుపుఁ గలిగి భువనభయద మై
వెలిఁగె న్శకటవ్యూహం, బలన మరుద్బలము కంశగర్జలు చెలఁగన్. ౪౬

వ. అందు నవగ్రహంబులు దక్షిణచక్రంబును విశ్వేదేవతలు వామచక్రంబును సిద్ధసాధ్యసమూహంబులు నొగలును నశేషమంత్రంబులును సమస్తాభిచారికక్రియాకలాపంబులును సకలయోగవిద్యారహస్యంబులును నాభిఫలకంబును ధర్మం బిరుసుం గా నిర్మథితనిఖిలవిమతహృదయం బై యమ్మహావ్యూహంబు త్సాహసాహసికత్వంబుల నొత్తరించె నత్తఱి నుత్తాలరోషానలజ్వాలాభీలం బై ప్రహ్లాదవాహినియు సూచీముఖ శూర్పకర్ణ శంబరదీర్ఘజంఘ కాలకేయ కాలదంష్ట్ర దంతవక్త్ర వృశ్చికరోమ ధూమ్రాక్ష కపిలాక్ష వామనప్రముఖాఖిలశతముఖవిరోధియూథమేదురం బై దురంబునకు సంగవించె నిట్లుభయసైన్యంబులుఁ దారసించు నవసరంబున వాసవుం డాసురబలంబును నిజమాయాబలంబునం జేసి ధూసరధరారజోవిసరప్రసరణం బగుసమీరణంబుఁ బుట్టించుటయు నమ్మాయగాలి యుద్వేలం బై తద్వరూథిని నొత్తరించుకొని యుత్తరదిక్కునకుం బోవ నూకుటయు సోకోర్చి లోకత్రయగీతకీర్తి యగు దానవచక్రవర్తి శాంబరీచక్రిశతంబులఁ బుట్టించుటయు నాబుసకొట్టుం దెట్టువలు బిట్టలమి యక్కపటపవనంబు నపహరించె నప్పుడు. ౪౭

క. కలయంగ [1]బెరసె నిరువాఁ, గలఘుతరాయుధవిఘట్టనానలకణముల్
జలజల రాలఁగఁ గోలా, హలహాలాహలవిదారితాఖిలదిశమై. [సేయు

గీ. కరులుఁ గరులు హరులు హరులును రథులును, రథులు భటులు భటులు రణము
నుద్దవిడి సహింప [2]కూటాడ, బ్రహ్మాండమండలంబు తొంటిమట్టుఁ గడచె.

క. తెగియొడుతలలును దెగి ధర, జిగినగవులతోడ రాలి చెన్నగు తలలున్
సగము తెగుతలలుఁ గలిగెం, బొగరున ననిసేయు రెండుమూఁకలయందున్.

---

[1] బెరశనిరువాఁగలఘుతర. [2] కూటాడె.

గీ. మీఁదిమూఁకుల్లు దెఱచిన మెఱుఁగు లురక
[1]చొంగలించెడురత్నపంక్తులును బోలెఁ
గళిసహేతుల నుపరిభాగములు [2]ద్రెవ్వి
కాఱెఁ గరికుంభమౌక్తికోత్కరము గరము. ౫౧

క. ముంగాలుగొరిసె లసిహతు, లంగెడసిన మ్రొగ్గె నురుబలము గలిగియు ను
త్తుంగతురంగశరీరము, లంగద వజ్రాభిహతనగాగ్రము లనఁగన్ ౫౨

క, ఘోరానిలవిఘటితరం, భారణ్యము వోలె సాయకాసారముచేఁ
దేరుగమి చిక్కుజీరై, వైరూప్యము నొంది తోంటివన్నియ దఱిఁగెన్. ౫౩

గీ. కదిసి కత్తుల కింతింతకండ లగుచు, నంటుకొని పోవు నుభయసైన్యములభటుల
కాయమీఁచాయదని పోరఁగానఁబడమి, నచ్చెరువు సేసె దివిఁ జూచునచ్చరలకు

ఉ. తాలతమాలనీలవసుధారజ మాకస మాక్రమించి పా
తాళము వేళ్లచేఁ బొదివి దట్టదనంబున బిట్టు పర్వఁ ద
స్త్రాలముఁ ద్రెంచె శాతశరముద్గరచక్రగదాత్రిశూలభి
న్నాలఘుయోధయూథవపురస్రపయోధివధూసహస్రముల్. ౫౫

ఉ. పోకుము పోకు మోరి యనఁ బో నిదె వచ్చితిరా యటంచు నై
రాకులచిత్తవృత్తి నుభయధ్వజినీభటకోటి ఘోర న
య్యాకస మెంత గల్గు నది యంతయు నిండెఁ గబంధమాలికల్
కోకిలవర్ణ మయ్యె నసికుంతరజఃపిహితాఖిలాండముల్. ౫౬

ఉ. వాహనహీనులయ్యు నసివాడక మిన్నులు చూడ కుద్భటో
త్సాహసమగ్రచిత్తముల ధైర్యము శౌర్యము నావహిల్ల బా
హాహవదోహలిత్వముగ నచ్చెరువా టొనరించి రమ్మహో
వ్యూహాయుగోగ్రవీరులు పయోబలపౌరుషగాఢమూర్తులై. ౫౭

క. త్రాసునఁ దూఁచినకైవడి, వాసవసేనయును నసురవరుసేనయు న
త్త్రాసగతి హెచ్చుగుందులు, వాసిన సమరేఖ రణము పాటించుతఱిన్. ౫౮

క. కరిఁ గొలిపి కులిశధారలు, గరళంబుల నుమియ దివిజగణములతోడన్
హరిహయుఁడు చుట్టుకొనియెం, బరిపంథిబలంబు విజయపటహము లులియన్.

సీ. కరవాలదండభీకరవేల్లనంబుల గళనాళములు బిట్టు నులిచి త్రెంచి
చక్రిచక్రోపమస్పర్శంబు లగుపాదహతులఁ గందనగాయ లట్లు రాచి

---

[1] దొంగ్గలింప్పెడు. [2] ద్రవ్వి.

శూలిశూలాగ్రనిష్ఠురదంతముఖములఁ బొడవుగా నందంద పొడిచి యెత్తి
యడ్డతాఁకుల నేనుఁ గైన హయంబైన రథమైన మృదులచూర్ణముగ మెదిపి
తిరిగెనైరావణము మహాసురబలంబుఁ, జొరుగుఁ జేయుచుఁ గ్రొత్తనెత్తురులు మెదడుఁ
గండలును గొండలై నిండియుండ దివిజ, మండలాధీశుఁ డెందంబు నిండ ముదము.

క. తెరలిననిజసైన్యంబుల, మరలిచికొని యసురభటసమాజము లోదివె
న్సురబలము నాసురోద్ధతి, ధరణీశల మదరఁ ద్రిదశధాముము చెదరన్. ౬౧

సీ. సూచీముఖుండును శూర్పకర్ణుండును శంబరుండును సురేశ్వరునితోడఁ
గాలకేయుండును గాలదంష్ట్రుండును వక్రదంతుఁడు గంధవహునితోడఁ
గల్పకేతుండును గంకటాహ్వయుఁడును వామనుండును సమవర్తితోడ
వృశ్చికరోముండు వికటసత్త్వుండును గపిలాక్షుఁడును జలాధిపునితోడ
ఖరుఁడు బలియును గుహ్యకేశ్వరునితోడ, దీర్ఘజంఘుద్విమూర్ధులాదితిజు తోడఁ
దవిలిధూమ్రాక్షుదూషణుల్ శివునితోడ, నఖిలరాక్షససైన్యంబు లగ్నితోడ.

వ. ఘోరాకారంబులం బోరం దొడంగి రప్పుడా సూచీముఖశూర్పకర్ణశంబ
రులు శంబధరుం బొదివి పొది విప్పక వెనుకదివ్వక వేసరక విసువక వెలియం
బొఱక విషాతాసారంబు తోరంబుగ జోరనఁ గురిసి తత్కరిశిరంబు శిలీ
ముఖవిద్ధంబు సేయుటయుఁ గ్రుద్ధంబై యాసిద్ధసింధురంబు శూర్పకర్ణసువర్ణ
స్యందనంబు నమంద వేగంబునం గడనొగలు పట్టి బిట్టు వీచి వైచుటయు
నన్నిశాచరుండు పిశాచబలప్రయత్నంబున రథాంతరసంపాదనలంపటుం డై
సిలింపులగుంపుల కుఱికి వే ఱొక్కచక్కిఁ జిక్కువఱుచుచుండె సూచీముఖుం
డేచినఁ బ్రాచీదిశ్వరుండు [1]భాస్కరకరభారాధాశధశ్యతస్కరంబు లగు
శరంబులు శరధరమాలికావిభూషణం బగుభీషణకార్ముకంబునం గీలు
కొలిపి కరి నంటఁగొలిపి యతం డేయుసాయకంబులు పాయం దట్టుచుఁ
బతాకానివళనం బొనరించుటయు నమ్మదవదసురవిసరపతి సురపతికిం గాలా
యసనారాచంబున ఫాలతలంబునం గీలాలధార వొడమించి యూర్చినం
బేర్చినకోపంబునం జాపం బెత్తి యాదేవోత్తముండు [2]చిత్రజల్లు పగిదిఁ గ్రొత్త
లగుపుత్తడిపింజియలతూపులు పింజపింజయుఁ గొనం బఱపుటయు నయ్యుర
వడికిం జాలక మొరవడి వీడనాడి యాసూదిముక్కురక్కసుం దూడనిం బోడె
శంబరుం డంబరంబునం బన్ని శాంబరీసహస్రంబులం బొడమించుటయు

---

[1] భాస్కరకథా రాధారధర్యతస్కర (భాస్కర కరభారా ధారంధర్యతస్కర.) [2] చిత్తదల్లు.

వేల్పుటూపయం డనల్పక్రోధంబున నయ్యాతుధాను గంధర్వాస్త్రప్రయో
గంబున నంధునిం గావించి శంఖంబు పూరించె నంత. ౬౩

ఉ. ముక్కిడిమూఁక లన్ని పయి ముంచిన మించినకోపరేఖ నా
పొక్కు వెలుంగు కాఱడవిఁ బోలె నరాళకరాళహేతి యై
రక్కసిమూఁకఁ జక్కడిచి రక్తమయంబుగఁ జేసె నేల న
ల్దిక్కులఁ బాఱఁజొచ్చె నతిదీనము లై హతశేషసైన్యముల్. ౬౪

వ. కల్పకేతుకంకటవామనులు వైవస్వతుం బొదివి యనశ్వరపౌరుషంబునం బెనం
గం గన లధికం బై జముండు భండనంబు ప్రచండభంగికంబుగం గావించె
నయ్యిరువురుదెఱంగునుం గ్రేడింపక క్రీడాకందుకఖేలనప్రాయంబుగం గాయ
పతిత సుభటశిరఃస్తోమజంబుల ధరణీతలంబుం గప్పుచు నుప్పొంగె నయ్యెడ.

గీ. దీర్ఘజిహ్వద్విమూర్ధ్ను లాదితితనూజు, నేసి రేసిన రేసిన హృదయ మదర
నదరిపడి వార లెక్కినమదగజంబు, నశ్వరత్నంబుఁ దునుమాడె నసురభర్త.

క. వా రంతఁ బోక ఘోరా, కారంబుల నతని రెండుకడల నిలిచి దు
ర్వారతరవారినిఁ గరా, మూరిని నొప్పింప నతఁడు సొరిగెం బెలుచన్. ౬౭

క. క్రోణపుఁడు మూర్ఛ దెలిసి క్రౌ, పాణహతి న్వారి విపులబాహామధ్య
క్షోణులు వ్రేసిన ధరణీ, రేణువునం బ్రుంగు డైరి త్రిదశవిరోధుల్. ౬౮

వ. ఇట్లు ప్రాణాపాయప్రాయంబగు నైర్ఋతిచేతహేతిపాతంబున భూతలపతితు లై
మొట్టకేలకుం దెలిసి యలసి యయ్యసురవరు లిరువురు దూరంబునకుం
దొలఁగి పఱచి రంత నంతకాకారు లయి నీరధిపతిం బొదివి వికటసత్త్వ
వృశ్చికరోమ కపిలాక్షులు నిశితక్షురప్రంబులం గప్పిన యాదఃపతి ప్రతి
విశిఖపరంపరల నాతెంపరులపెం పుడిపె గంధవహవేగంబునకు నోర్వక
విముక్తగర్వు లై కాలకేయ కాలదంష్ట్ర వక్రదంతులు దిగంతంబులం బరిభ్ర
మింపం దొడంగిరి రయ్యెడ. ౬౯

క. ఖరబలులు బలవదాహవ, ఖరు లై క్ష్వేళార్భటీముఖరు లై యలకే
శ్వరుఁ బొదివిరి యరదంబుల, పరుషరవము పిండ్లయులివు ప్రతిభయములుగన్.

గీ. వారితోఁ గూడి శస్త్రాస్త్రవారవాణ, వరశిరస్త్రాణధరులు దుర్వారబలులు
రాక్షసులు గొంద ఱాధనాధ్యక్షుమీఁద, నురవడించిరి భూరజంబుత్కటముగ.

వ. యక్షాధ్యక్షుండును యక్షరాక్షసకిన్నరబలంబులతోఁ జలంబు మెఱసి హారిం
బఱపి పరుషగదాదండంబుల నఱకి యు నురియుల నసువులు వెఱికి యు

శరంబుల నురంబులు చించియుఁ బరిఘంబులఁ బృష్ఠకంబులు మురియం
జేసియు నస్త్రశంబుల నొత్తియుఁ బ్రాసంబులం ద్రాసంబు నొందించియుఁ
జక్రంబులం జక్కుసేసియు ముసలంబులం గసిబిసంగాయు నొక్కఁడయ్యును
బెక్కురూపంబులు దాల్చి పోల్చి నిల్చినయట్లుండె నుండుటయు. ౭౨

శా. బల్లంబోయిన సేనఁ గన్గొని ఖరుం డుగ్రాస్త్రసంక్తిం నలల్
డోల్లంజేయుచు యక్షరాడ్బలము [1]బిట్టుంజెందను న్నాన్పి చే
విల్లాఖండలచాపలీల వెలుఁగ నవ్వైత్తిశ్వగం డాసి క్రో
ధోల్లాసంబున నాస్పమిం జలుకు పిడుగ్ధీనుదంష్ట్రాస్యుఁ డై. ౭౩

ఉ. కోటిబింక మేమిటికి ఘోరపరాక్రము డైన రాక్షస
స్తోమముఁ గిట్టుమెల్ల నిది దోసము లౌ మజరాజుఁ దాఁకి సం
గ్రామము సేయుచంద మగుఁ గాదె ధనాధిప బుద్ధి గల్గిన
న్వేనగుడంగఁ బాడి యవివేకమున న్నెఱదప్పఁ గార్యముల్. ౭౪

గీ. గుహ్యకేశాభిధానంబు గుర్తిగన్వఁ, బోలు నెఱ గుఱ్ఱు హయమహోపాదవుగల్లు
నీదుపోటును గలిగిన నేఁటినుండి, కలుగకుండును జగములోఁ గప్పకాటు.

ఉ. నావిని విత్తనాథుఁడును సంజుడు నెత్తురుఁ గ్రొవ్వ నాని పె
న్నావర మెత్తి పక్కెదప్పు కత్తసిశౌచం లావు గల్గినం
బోవక పోరు నన్నెదిరి పోటునకై [2]యఘ్రుక్రమ్మి నిచ్చ దో
లా వదరంగ దుర్వచనలాలను మెత్తురె శౌర్యవిత్తముల్. ౭౬

క. నీరజ్జు లణఁచి పుచ్చెద, నోరోరీ నిలువు మనుచు నుజ్ఝోగదుఁడై
యారాక్షసు ముంచె శరా, సారంబున యక్షరాజు చాపము మెఱయన్.

క. హరిచిత్రగతులు మెఱయఁగఁ, బరిపంథిరథాశ్వపంక్తి బడలువఱిచి ని
ష్ఠురభల్లంబున నొక్కట, హరసఖుఁ డసురేంద్రసూతు నసువులఁ బాపెన్.

మ. విరథుం డై దనుజాధినాథుఁడు మహావేగంబుతో ధారుణీ,
ధరకూటంబుననుండి డిగ్గు మదనద్ధంతానఘారాతిభీ
కరరేఖ న్వసుధాస్థలంబునకుఁ జక్కం దాఁటె యుష్మేశుబల్
తురగంబు న్నిజముష్టి నొంచుటయు నెత్తుర్గక్క నాపితియున్. ౭౯

క. కనుచెదరి హయము గూలిన, ధననాథుఁడు విల్లు విడిచి దారుణగదఁ గై
కొని యసురకడకు బ్రేసిన, వెనుక కొదిఁగె నతఁడు ధాతువికలత్వమునన్.

---

[1] బిట్టుంజెంద్దము (బిట్టుంబెయ్దుము?) [2] పోటునకైయ్యరుగ్రమ్మి.

క. తనయన్నకైనదుర్గతిఁ గని బలిదానవుఁడు తనదుకనకరథంబున్
ధనపతి కభిముఖుఁ డై సూ, తునిచేఁ జేయించి వింటఁ దూపులు గురిసెన్.

క. గద విసరి యంపవఱపులు, వికలించుచు యక్షరాజు వెసఁ గదిసి హాస
ధ్వనముగఁ బగఱయరదముఁ, జిదుపలుగఁ జేయు టధికచిత్రం బయ్యెన్.

క. అన్నయుఁ దమ్ముఁడు నిటఁ, గిన్నరపతిచేతఁ బొందు కృతనిశ్చయులై
విన్నంట నార్చి వేఱొక, సన్నిరథ మెక్కి కేలిబలువిం డ్లుఱుమన్. ౮౩

క. శరములు గురియుచు ధరణిన్, జరుఁ డగు విత్తాధినాథు జన మడఁచినఁ గి
న్నరవిభుఁడు దెరలుటయుఁ డ, త్పరమసఖుఁడు రుద్రుఁ డేచి ప్రమథావృతుఁడై.

గీ. తొలుతఁ దనమీఁద ధూమ్రాక్షదూషణాఖ్యు
లసురవర్యులు గవిసిన నదియు సరకు
గొనక నిజసఖరక్షకై యనికి నఱిమె
ఖరబలులమీఁద వృషభవల్గనము లలర. ౮౫

శా. ఆమాయాశనుఁడు శూలహస్తులుఁ గపాలాలంకృతుల్ కృత్తివా
సోయుక్తుల్ భసితాంగరాగులును జటాశ్రోత్రహారుల్ ఘన
చ్ఛాయగ్రీవులు నైనకింకరుల నిచ్ఛారూపులం బంప న
మ్మాయాసంగరకోవిదుల్ గదిసి నిర్మర్యాదనాదోగ్రులై. ౮౬

సీ. పులులఁ బుట్టించియు నెలుఁగులఁ జూపియు గజములఁ గొల్పియుఁ గాలసర్ప
సమితి నాడించియుఁ జండానిలంబులు విసరఁ జేసియు రాలు నినుముఁ గురియు
మొగులుమొత్తంబుల మునుమాదిగల్పించియును సంధకారంబు గొనలుసాగఁ
బ్రబలించియును నస్థిపలలమేదోఽసృజ్జరాసులు వెనిచియు రాసభోగ్ర
నాదములుదీటుకొల్పియు నవసబంధ,బంధురముగను నానభఃపథము మునుఁగు
వడనొనర్చియుఁ బోరి రపారశౌర్య,ధుర్యులై రాక్షసేంద్రులుద్రొక్కొనఁగ.

క. మాయాసంగరమున ని, చ్చాయుం బగుసురబలముఁ జదియఁగ నలకా
నాయకుఁడు మోడఁ గదఁ గొని, యామాయాశనుఁడును నసురహరణ మొనర్చెన్.

వ. ఇవ్విధంబున నవ్విబుధయోధులచే విచ్చియుం జచ్చియు వ్రీలియుం దూలియు వెఱచియుం బూరిగఱచియు మఱలియుం దెరలియు నోటరియుం బోటువడియు స్రుందియుం గుందియు స్రుగ్గియు మొగ్గియు నలసియు సొలసియు నసురపిసరంబు పసచెడి దశదిశలకుం బాఱినయెడ వారవాణంబు లవారణంబులై మానంతులు లేమిం దమయంత విభ్రాంతంబులై

వంతల దుంతలుంబోలెఁ గాంతి దఱిఁగి [1]సురిగ హరిగ కరవాలంబుఁ గిరుసు
వంకిణియు డొంకెన జముదాడి కొంగవాలు హలాయుధంబు మొదలుగా
నాయుధంబులు విడిచి పదాతు లనవదానవదను లై పెదవులు దడుపుచు
నాదిఁగిరి రాహుగ్రస్తవిహీనంబు లగు పరుస్తిమానవులు ప్రోవులుగట్టి కల్యాణ
పల్యాణప్రముఖంబు లగు ననణాలతోడ నేడఁజూచినం దామయై సము
ద్రంబునందు నవిసినకలశంబుల చందంబున యథాయథ లై యపథిం బొరలెఁ
బృథులంబు లగురథంబు లుపభుక్తపూర్వపుణ్యఫల పురుషవిముక్త సురపుర
విమానంబులుం బోలె ననమానంబులకు నధిష్ఠానంబు లగుచు నున్నయవి
యున్నయట్లనె వన్నెదఱిఁగి యొఱగెఁ గామలకుఁ బాసిన హేమచ్ఛత్త్రంబులు
మృత్యుభుక్తిపాత్త్రంబులు భుక్త్యంతంబునం బోనైచినయవి యివి యనరవణంబు
లుడిగి బెడంగు దఱఁగె నంచలు చంచువులం ద్రుంచివైచిన నెండవడి
బడలు పుండరీకంబులలాగున ననాళంబు లగుచమరవాలంబులు సమర
సరిత్తీరంబునకు జరత్కాశప్రసూనంబు లై ది - - - - నుడిగి కానంబడియెఁ
గంకణాంగదగ్రైవేయకటకతులాకోటికోటులు విటతాటం బై యుత్పాతకాల
పతితనుహోల్కాజాలంబుల గేలిసేయుచు నేలయెల్లనుం దామ యై యప
హృతరామణీయకంబు లై విశీర్ణంబు లయ్యె నెత్తురొత్తరించె నెమ్ములు దుమ్ము
లయ్యెఁ గండలుగుండుగూలెఁ బ్రేగులు ప్రోగువడియె వాద్యంబులుప్రద్యో
తంబయ్యె(?) నెయ్యెడఁ జూచిన దయ్యంపుగుంపులు క్రొత్తయొఱచిగరచిలు
వులు(?) మేయుచు నర్తింపం దొడంగె నయ్యెడ. ౮౯

సీ. గగనగంగాపయఃకాండంబుఁ గబళించు నిబిడధగారేణునిచయధార
గుభగుభల్లున హరితోఽ్ౕణసామజకర్ణవిదళనం బొనరించురొదలకతన
వియదంబురాశినవీనవిద్రుమలతాతతి యైనయాయుధద్యుతివిభూతి
నజునిసర్గమునందు నవతారమందు జంతువులట్లు తలచూపు వివిధసేన
రాక్షసోద్రేకనిర్వాపణక్షణోగ్రుఁ, డగుసహస్రాక్షుదృష్టికి నపగతారి
యయ్యెభువనంబుశాత్రవవ్యాప్తమైన,కరణిఁగనుపట్టెఘూర్ణితాకారమగుచు.

క. మరుదీశవిశ్వవసుకి, న్నరనరగంధర్వయక్షనాగఖచరు లా
హరిహాయునిరుగడల భయం, కరరోషోదగ్రు లగుచుఁ గమియుట యొప్పెన్.

క. పాకారి యిట్లు విజయ, శ్రీకాంతుం డగుచు నడువఁ జెవరి బెదరి ముం
జీకాపడినరక్షో, నీకిని ప్రహ్లాదుఁ గాంచి నివ్వెఱ గదురన్. ౯౨

[1] సురిగె హరిగె.

సీ. వీరరసోధస్య వికృతియందలి [1]జున్ను వడువున నురువులు వొడమ నోళ్ల
విజయాదిగుణములు వెడలంచో నడరెడు కన్నీరు క్రియ ఘర్మకణము లురులఁ
బరిపంథిపదములఁ బడితి మి ట్లనులీలఁ బడుచు లేచుచు నున్న భంగ మెసఁగ
నినకరంబులఁ జిరింగిన తమోదేహజక్షతములక్రియఁ బోటుగింపు లొప్పఁగ
బాదహతి నేల వ్రక్కలువార గళిత, ఖడ్గనల్లులు పకకంటకములు గాఁగ
నాహిరణ్యకశిపుసూను నపుడు గాంచి, పలికి రొక్కట వేగులపరికరంబు.

శా. దేవా దేవవిభుండు దిక్పతులు నుద్రేకించి బాహార్గళ
వ్యావల్గత్కరవాలదీప్తులు ధరాస్వర్లోకము ల్నిండ వీ
రావేశంబున రాక్షసధ్వజినిఁ బాయం జేసెఁ గయ్యానకు
న్నీవైదగ్ధ్యము చూపఁగాఁ దగు బలోన్మేషంబుఁ బోషించుచున్. ౯౪

క. నావుడు నేవోసిన జి, హ్వావలి వెలయంగ వెలుఁగునగ్నియ పోలెన్
దైవతవిమతుఁడు తెల్లని, మావుపయి న్నిలిచి శత్రుమర్దనపరుఁ డై ౯౫

వ. త్రోచి నడచె నయ్యెడ ననీచంబు లగు చమూసమూహంబు లుభయపక్షం
బులయవియు నభయోల్లాసంబునం దారసించి పోరునెడ. ౯౬

సీ. ధరణీపరాగ మంతయు నొక్కట్రుక్కఁగాఁ గొనియె నూతనరక్తఘనరసంబు
శాకినీఢాకినీలోకంబు లిచ్ఛానురూపవర్తనముల నేపుచూపెఁ
గరవాలలూనభీకరశిరఃపంక్తులు పక్వతాళీఫలభ్రాంతిఁ జూపె
నొఱగు నేనుంగులఁ బఱచునశ్వంబులు విఱుగు తేరులుఁగను వేఁదు లొసఁగెఁ
గెడసె గొడుగులు పడిగాలునడియెఁ బడగ,లఖిలదిక్కులు ఘూర్ణిల్లె నాహిరణ్య
కశిపుసంభవుఁడత్యుగ్రగమనరేఖ, నమరవాహినిమీఁద బిట్టయుముటయును.

గీ. అపుడు ప్రహ్లాదుఁ డనిపని కగ్గలింపఁ,దొలుత విఱిగినబలములఁ తోడుచూపె
నిందుబింబంబు హెచ్చునుగుందుహేతు, వులుపయోధులనుబ్బింపఁజాలుకఁజే

క. అనలయమదనుజవరుణప, వనధనదేశాను లపుడు వజ్రాయుధు దూఁ [య
కొని కదనమునకు నతిమిరి, యనిమిష సైన్యములు నడిచె నత్యుగ్రము లై.

క. ఆసేనకు నాసేనకు, నానురగతి సమర మయ్యె ననిముసలగదా
ప్రాసకరవాలధారో, ల్కానమితి జగత్త్రయంబుఁ గనుమూయింపన్. ౧౦౦

సీ. విలుమ్రోఁత లార్పులు వేదండఘీంకృతు లశ్వహేషితములు నఖిలవాద్య
హృద్యస్వనంబులు నేకీభవింపఁ జుక్కలు రాలె నెత్తురు గ్రక్కె మొగులు

[1] జిడ్డు.

యోగనిద్రాసక్తి నురగేంద్రశాయియగా నీలవర్ణుఁడు బిట్టు మేలుకొనియె
నభవుఁ గౌఁగిటఁ జేర్చె నచలరాజతనూజ కైలాసశైలంబు కంపమొందె
ధాత దిటదప్పె వేదమంత్రములయందు, సప్తవాయుప్రచారంబు చండిమడియె
బీడువాఱిన యద్దంపు బిల్లవోలె, హల్లకారాతిబింబంబు క్రేళ్లునులఁగె. ౧౦౧

క. ఆయెడఁ బ్రహ్లాదుఁడు కా, లాయసనారాచధార లసురబలముపైఁ
గోయని యార్చుచు సింగిణి, మ్రోయించుచుఁ గురిసె భువనములు ఘూర్ణిల్లన్.

వ. సూచీముఖ శూర్పకర్ణ శంబర కాలకేయ కాలదంష్ట్ర వృశ్చికరోమ ధూమ్రాక్ష కపిలాక్ష వామనదంతశూక ప్రముఖ ప్రధమబర్హిర్ముఖులు శితముఖుం బొదివి రాజానుమతంబున నాజినైపుణంబు మెఱయుటయు హరిహయుండు కుండలితకోదండుండై వేదండంబు దిక్కొలిపి కాకోలకీలికీలాకలాపరూపంబు లగుతూపుల నాపిశితాశనులం గసిమసంగుటయు సింగంబుకరణిం బొంగి యసాదసంగరాహ్లాదుం డగుప్రహ్లాదుండు పాదరసంబుకరణిం ద్రొక్కనిచోటులు ద్రొక్కుచు నుక్కుమెఱయుతురంగమంబుం బంచవిధగతితరంగితంబుగం గదలించి తనపేరు ముదలించి యదలించి ప్రదరపంచకంబున సహాల్యానంచకు నొంచియు సప్తసాయకంబుల సప్తజిహ్వు రంహంబు నాఁగియు మూఁడువాఁడితూపుల నంతకుఁ బ్రశాంతుం గావించియు నిశాటు విపాటదశకంబునం బాటితలలాటతలుం జేసియుఁ బాశపాణి నాశుగనవకంబున నవకంబు చెఱచియుఁ బవనుఁ బవనజవంబు లగుపంత్రెండువెడందవాఁడితూపుల నేపణంచియు ధనదు నెనిమిదివిశిఖంబులఁ బిశితమయశరీరుం గావించియు నీశానుం గృశానుజ్వాలాచటులంబు లగుబలుగోలలు పదునొకంట గెంటించియు మిన్నంట నార్చి పేర్చిన [1]దివిజనివహంబు లుపచితాగ్రహంబులుగం బొంగారి చెలంగె. ౧౦౩

చ. మరలక రాక్షసేశ్వరకుమారుఁడు భల్లయుగంబు నేసి ని
ర్జరపతికేతనంబును నిశాకరవిస్ఫురదాతపత్త్రము
న్నరియలు సేసి వేఱొక యమోఘశరంబున విల్లు ద్రుంప న
చ్చెరు వెదఁ బిచ్చలింపఁగ శచీవిభుఁ డన్యధనుర్లతాగ్రుఁ డై. ౧౦౪

ఇంద్రుఁడు ప్రహ్లాదునకు బోధించుట.

క. శర మరిపోసి చతుర్దం, తరుచిరదంతావళాద్రి ధారాధరమా
గరువంపుమేను వెలయఁగఁ, బరిపంథిం బలుకుఁ బ్రౌఢభాషారభటిన్. ౧౦౫

[1] దివిజనివహంబులు లపహృతాగ్రహంబులుగం.

క. భగవత్పదయుగభక్తియు, సుగుణంబులు విడిచి నీకు సురసైన్యముతోఁ
దగు నే కయ్యము సేయఁగ, నగవే లోకంబు లసురనాయక నిన్నున్. ౧౦౮

గీ. కప్పయెలుఁగుపాముగతి మేఁకవన్నియ, పులి విధాన నీవు పొంచి యుండి
సురల భూమిసురులఁ జుఱవుచ్చుటకు నిడ, వేళ యయ్యెఁ గాదె వినయదూర.

సీ. పుల్లకండపుఁగొండ పొడిసేసి చల్లిన నుప్పు మాను నె లవణోదవేల
ప్రోదిఁ నావులపాలు పోసి పెంచిన నైనఁ దొలఁగునే పాముకోఱల విషంబు
నిండఁ బాదునఁ దేనె నించి పెంచినయేని వెడచేఁదు మానునే వేఁపమ్రాను
కప్పురం బెరువుగా గుప్పళించిననాఁడు నుల్లిదుర్గంధంబు నోసరిలునె
తఱచు మెఱుఁగిడ్డ నిత్తడిత్తడియె కాక, హాటకాభరణాకార మందునోటు
చదువు లేరాళముగఁ జాలఁజదువుచున్నఁ,దొలుత వేల్పులఁ బాయునే దుర్గుణంబు

చ. జనకుఁడు కోప మెత్తి నినుఁ జంపఁ గడంగి నిశాటవీరులం
బనిచిన వారు తీవ్రతరబాధల నొంప దృఢానుకంప న
వ్వననిధిశాయి గాచెఁ దగవా పగవాఁడవె పోలె నాజనా
ర్దను దెస నీసడించెదవు దానవనాయక నీకు నాయమే. ౧౦౯

ఉ. అక్షతదానవైభవవిహారుల కేనియు ధర్మసంహితా
ధ్యక్షులకైన నాత్మవిదులైనమహాత్ముల కైన నెందుఁ బ్ర
త్యక్షముగాని విష్ణుఁడు ప్రియంబున బాలుఁడ వంచు నిన్ను సం
రక్షితుఁ జేసెఁ గాక యసురస్థితి సైఁచునె దానవారికిన్. ౧౧౦

శా. ఆకంజాక్షుకళావిశేష మతిరమ్యం బై భవన్మూర్తియం
దే కాలంబు వసించి యున్నకతనన్ హేమాసురప్రేషితా
నేకాభీలనిశాటహేతివితతుల్ హేలాసరోజాతప
త్రాకారంబులఁ గప్పెఁ గాదె మును నిన్నాహా వివేకింపవే. ౧౧౧

చ. హరిపదభక్తియుక్తి విడనాడి నిశాచరబోధయూథముం
బిరిగొని రాజ్యగర్వమున మీఁదటికార్యము నెన్నలేక యీ
బరువలఁ గూడి సత్యమును బాడియుఁ దప్పి చరించు నీకు మా
కరివరదుండు తోడగునె కల్గునె భద్రము లెందుఁ జూచినన్. ౧౧౨

చ. పెనఁగొని నీవు నే ననఁగ భేద మొకింతయు లేక ప్రాణముం
దనువును బోలె నున్నయెడ ధర్మపథస్థితిఁ దప్పఁ ద్రొక్కి నీ
వనిమిషలోకకాంక్ష మది నందితి వేనియు నేల కల్గుఁ గో
రినకోలఁదిన్ ఫలించునె యరీణరమాతరుణీవిలాసముల్. ౧౧౩

సీ. ఘోరాణకోణాగ్రనిర్గళదుగ్రపవనార్తిఁ గనకాద్రిముఖగిరుల్ గాతుకలఁగ
దంష్ట్రావిటంకసంహతి నప్పాకణములు గుములుగులై నలుగడఁ గొండ్లిసూపఁ
జఠరాభిహతి విశ్వధరణీతలము వ్రస్సివ్రయ్యలై యురగవర్గములఁ జూప
భ్రుకుటీభయంకరాద్భుతముఖాంబుజమున మూఁడుకన్నులు ఱెప్పమూయకలర
హరినృసింహాకృతి ఘోరవిస్ఫురణమెఱయఁ, గంబమునఁ బుట్టి మీఱెంద్రిఁ గఠినసఖర
శిఖలఁ జెండాడునప్పుడు నీచేర్వదారులుఁ[1] ఘూర్ణిఁ బ్రుంగిరో గగనంబుదాఁటి చనిరో

క. కూటికి నీటికినై నిను, మాటికిమాటికిని గపటమార్గంబున జం
జాటముఁ ద్రిప్పు దుష్టుని, సౌటులఁ బొం దేల నీకు ననఘవిచారా. ౧౧౫

సీ. శ్రీవత్సకౌస్తుభశ్రీసమావృతవక్షు నంభోరుహాక్షుఁ గృపార్ద్రవీక్షు
నాశ్రితావనదక్షు నాదిమధ్యాంతవిరహితుని యోగముద్రాసహితుని
బ్రహ్మరుద్రాదిభర్మకిరీటకోటిసంఘటితరత్నప్రభాకవచితాంఘ్రి
నఖిలజగత్పూర్ణు నసితసారసవర్ణు యతిమనోభ్యర్ణు లాలితసుపర్ణు
నాదిదేవు సమస్తేంద్రియార్థగమ్యు, సౌమ్యు ధృతశంఖచక్రు శ్రీరమ్యమూర్తి
విడిచితివి గాన నింక నీవిభవ మెల్ల, దినదినంబున కసధ్వమై జనునిజంబు. ౧౧౬

వ. అని పురందరుండు పలికిన హిరణ్యకశిపునందనుం డిట్లనియె. ౧౧౭

చ. హరికిని నీకు నేమి పని యాయన నన్నెఱుఁగే నెఱుంగుదుర్
హరి నటు లుంపనిమ్ము తులువా బలువా దొనరింపఁ బోవునే
పరమవిరోధియూథకృతబాధలు యోధులు మెచ్చ నాపఱుం
గరిఁ బురికొల్పు పొల్పునరఁ గయ్యము సేయుము వేయు నేటికిన్. ౧౧౮

గీ. శూద్రవృత్తి గాఁగ సురలోకసౌఖ్యంబు, లిన్నినాళ్లు నీవ యేకహేళిఁ
గైవసంబు చేసి తీవలదా యింక, నాకు నేలుబడికి నాకపురము. ౧౧౯

క. చిలువదొర లిచ్చి రందఱు, బలిసద్మము తనకు వసుధ వాయకనాఁగా
వలమూఁపునందు నున్నది, కులిశాయుధ నాకమేలుకొదవయు తెక్కున్.

గీ. అడిచినడకుము నాకంబు విడిచి వేగ, నీదుకుళికంబు నీవును నేఁడె వెడలు
మద్భుజాయత్తమగు రథామంబు నీకు, నన్యవిత్తాపహారణంబు ధన్యమగునె.

క. తొడివినజోడే విడునం, బొడిచి యొడిచి వేల్పుగములఁ బోనొత్తి రయం
బడర సుధాశనలోకము, గడిమేరగఁ దోరణంబు గట్టక వింటే. ౧౨౨

క. నీవేగుము వలసినకడ, కీవిబుధావాస మేన యేలెద ననుచున్
దేవేంద్రుఁ డాగ్రహంబున, దేవారిం జూచి పలుకు ధృతపవి యగుచున్.

---

[1] ఘూర్ణి మ్రింగిరో.

దరువు, సావేరిరాగము - రూపకతాళము.

పాదగమననిడుదగమన స్వామిదొడయపాదవింతె
పాదపద్మనడదుగమన స్వామిద్రోహరగండబిరుద।
పాదాలంకారచెలువ దేవేంద్ర దృష్టిముష్ట్యవధాన
పాదావధానయనుచుఁ గటికగమికాఁడువచ్చె॥

వా. ఈరీతివచ్చిన చేరువకాఁడు తనవెంట నెట్టుకొనివచ్చిన కట్టికవారినిం జూచి యేమనుచున్నాఁడు.

కటికచేరువకానిమాట:—

యెనంద్రా, వోరి మనవాండ్లు యేలినవారు కోవిలకు నామతిరుతానకు వేంచ్చేస్తావుండారు తోలంగించ్చరావోరి। లేరయా వోయి లేరయా. యెయె. యెయరావోరి। అల్లా బొంపనవాంణ్ని తోయరా। ఆముసుంగువాణ్ని లేపరా హోహోహో సామిపరాకు పరాకు।పరాకు దొరలు పరాకు।రాజులుపరాకు।విద్యావస్తులుపరాకు। పరాకున్నావు

వా. అని బరాబరి సేయుచున్నసమయంబున నన్నరనాథుండు మన్ననారుసన్నిధికి నేమంబున నామతీర్థంబునకు వచ్చెనఁట యెటువలెను.

దరువు, ఆహరి - ఆదితాళము.

ఎలమి మన్నారుదాసుం డింతులు గొలువంగాఁ। జెలువ మన్ననారు చెంగటికివచ్చె॥

వా. ఇవ్విధంబున వచ్చిన యవ్విభుం డచ్చట నైచ్చువచ్చు నవరత్నసింహాసనంబునఁ జెంగమలాంబికచెంగటం జెలంగ నిరువంకలఁ బొంకంబుగా రుక్మిణీసత్యభామలు కొలువుసేయఁ గన్నులపండు వగుచుఁ దనసన్నిధి సేసి పెన్నిధి వలెఁ గొలువున్న మన్ననారుల సేవించి సాష్టాంగదండప్రణామంబులు గావించి యాచెంగట రంగుమీఱ నొద్దిక గావించిన బంగారుగద్దియమీఁద శతక్రతు శ్రీనివాసతాతయాచార్యశేఖరు లగ్రభాగంబునం గూర్చుండఁ బద్మాసనాసీనుం డై యస్మహోనుహానుపదేశక్రమంబున శుద్ధాచమనం బొనర్చి యందుఁ గొంద ఱాచార్యశిఖామణులు దివ్యప్రబంధంబులును గొందఱు భాగవతాదిబహుపురాణంబులు వినికిసేయుచునుండ నాకర్ణింపుచు ద్వాదశోర్ధ్వపుండ్రంబులు ధరియింపుచు నయ్యాచార్యవర్యుండు ప్రశస్తంబగు తమ శ్రీహస్తంబునం బ్రసాదించు మన్నారుదాసనామముద్ర భద్రంబుగా వక్షఃస్థలంబున ధరియింపుచు యత్నంబుమీఱఁ గావించిన రత్నమయం బగుజప

సరంబు చేఁబూని యష్టాక్షరీమంత్రజపంబు నలరాజగోపాలమంత్రజపంబు గావించి నిత్యదానంబు లొనర్చి తిరుశిరగోపంబులకుఁ దిరువారాధనంబు సేసి తదనంతరంబున ముదంబున మన్నారుసన్నిధి నిలిచి సంతసంబున నింతు లొసంగు చెంగల్వసరంబులను సేనంతులను నింపులునింపు చంపకకుసుమం బులను జాజులఁ గెందమ్ములను జెలువుమీఱు శ్రీతులసీదళంబులను సహస్ర నామంబుల నర్చనంబు గావించి ధూపదీపనైవేద్యతాంబూల సమర్పణంబు సేయించి యారాజవదనలుం దానును నీరాజనంబు లొసంగి ధ్వజవ్యజనాత పత్ర చామరదర్పణధారణ ప్రముఖంబులగు సకలోపచారంబులుం గావించి నచనకుసుమార్చనలుగాఁ దాము విన్నవించిన విన్నపంబులు వినుపించుచు సన్నుతించి సన్నిధివా కొసంగు తీర్థప్రసాదంబులం గైకొని యయ్యింతులుం దాను నాగోపాలున కభిముఖుండై వచ్చి యచ్చట మెచ్చుగా నూత్నంబు లగురత్నకంబళంబులయందు నొద్దికయగు రతనంపుగద్దియమీఁద నిండువేడు కతోడం గూర్చుండి చెలువుమీఱఁ గొలువుసింగారంబై యయ్యాచార్య వర్యు లగ్రభాగంబున కలంకారంబుగా వేంచేసి యున్నయవసరంబునఁ గవులు విద్వాంసులు విద్వత్కవులును వచ్చిరఁట యెటువలెను.

దరువు, తోడి - ఆదితాళము.

నీలాలపోఁగులు నీర్కావిదోవతులు, మేలుకుళ్లాయలు మిసిమిదావళులు। శాలువల్ తలపాగలు చెలువఱచట్టలు, చాలమెఱయు విద్వత్కవులు సముఖా నకు వచ్చిరి॥

వా. ఆసమయంబున గొల్లలచేరువకాఁడైన మల్లుగాఁడు వెట్టిగొల్లగనుక గట్టునఁ దేఁచుచుఁ జిట్టుమనుచుఁ జేరుననున్నతమగొల్లలంజూచి యేమనుచున్నాఁడు.

గొల్లచేరువకాఁడేమనుచున్నాఁడు:—

అదొరాంఁడ్రా వాకిట సంద్దడి, మణమణా యెంద్దీ, మిణమిణా యెంద్దీ, మరమరా యెంద్దీ, మిరమిరా యెంది, వెయివెయరావోరి, వోరెవోరె చినమల్లుగ, వోరె వోరెపాప, వోరెవోరె చినసూరి, వోరెవోరె పెదబొమ్మ, వోరెవోరె చినబొమ్మ, యీడకూశికాడేవాండు తవుడో అంట్టావుంట్టే నువ్వా, వోరెవోరెకూడు దిని వస్తినంట్టరా, కూరాకేమిరా ॥ ౧ ॥

మఱొకగొల్లమాట:—వోరెకూరాకె। అల్లబొంపనవాండు సొరకాయ గానుగబిండ్డిన్ని యిచ్చెరా ॥ ౨ ॥

మొదటి గొల్ల అడిగేది:—వోరె యే బొంపనవాంఁడ్రా ॥ 3 ॥

మఱొకగొల్లమాట:—వొరె అల్లబక్కలావాటివాండు, పొట్టిపొడుగాటివాండు, వొకకన్నుపూసం వొకకన్ను తెలియదు, చెవిటివాండు, కాలుకుంట్టుతా వచ్చునే నిమ్మపండ్లువలె నల్లనిబొంపండు వాండురా ॥ ౪ ॥

మునుపటిగొల్లమాట:—వొరెవొరె ఆబాపణ్ని యేల వాకిలి విడిస్తివిరా, వానిచేత నేమైనా పరకాలు నాచుకొంట్టివో. దివాళికి రూకా, పొంగటికి రూకా, వుగాదికి రూకా, తలమూయ పాలతా, ఆముచ్చుబొంపండు రాని కొల్లె యిరగ్గొట్టెగాని ॥ ౫ ॥

వొరెవొరె చినబొమ్మ యీాడ యేంట్టిరా గుంపు ॥ ౬ ॥

మఱొకండు:—వొరె వీండ్లె విద్యావస్తులురా ॥ ౭ ॥

మునుపటివాఁడె:—వొరె నిత్యాపస్తులా, అయితే నామీాంద వొకపదం వింద్రా.

ద. కూనలమ్మపెద్దకొడుకు గొల్లమల్లుగాండు, బోనపుటికె యిరుచుక తినేరా పోతరాజనలెను.

మాట:—వొరె చినమల్లుగ అల్లవాండె మద్దెల కొరుకుతావుండ్డాండె తెము అబ్బడితరమా ॥ ౯ ॥

వొరె వొరె అల్లవాండు నాగసరం మింగ్గుతా వుండ్డాండు గొంత్తునబడేనేమో చూడరా ॥ ౧౦ ॥

వొరె అల్లవాం డెంద్దిరా అబక చాతం బట్టికిని వచ్చివుండ్డాండు ॥ ౧౧ ॥

వేఱొకనిమాట:—వొరె అది అబక కాదురా. తంబ్బురంటరా ॥ ౧౨ ॥

అమ్మతోడు తంబురా అది అట్లాం జెప్పరా తంబూరా ॥ ౧౩ ॥

వొరె వొరె అదెందిరా గణం మణం గణం మణం అనేది ॥ ౧౪ ॥

వేఱొకనిమాట:—వొరె అది తాళం రా ॥ ౧౫ ॥

యేమి అదితాళమా, అంద్కు మేముతాళం ॥ ౧౬ ॥

వొరె వొరె ఆమద్దెలలోనుండ్డి మాట్లాడువాం డొంద్రా ॥ ౧౭ ॥

వొరె ఆమాట్లాడు వాండ్లు వాళ్లుదా ॥ ౧౮ ॥

విద్వాంసుం డాడేమాట:—వొరె మల్లుగ, యేలినవారు కొలువైవున్నారు, మంచిసమయం దాన మడుక్కునేము విడువరా ॥ ౧౯ ॥

గొల్లమాట:—వోరి నీకు దాన మియ్యకుంట్టె నేమి మరొక బొంపండికిచ్చేరు పోరా ॥ ౨౦ ॥

అట్లా యేల అనేవురా నీకు అమావాస్యనాడు కూడు వేశేముగాని విడువరా ॥ ౨౧ ॥

గొల్లమాట:—అయ్యా మీాను బాంపలేనా మాయింట్లో కూడు దినరో ॥ ౨౨ ॥

విద్వాంసునిమాట:—వోయి మేము బాంపలముగాదవవోయి మీాయింట్లో కూడు దింద్దుమా ॥ ౨౩ ॥

గొల్లమాట:—అట్లాం జెప్పవోయి, అయితే వోరె వోరె యీాపట్టె నామాలబప్టమయ్యను విడువరా వోరె, అల్ల జుట్టువాండు వుండ్డాండె వాండు మాయావాది బాపలకొడుకు, కర్రలు యేశి యిరికించ్చి నడ్డి యిరగ వడ్డించ్చరా వోరి ॥ ౨౪ ॥

వా. అనిన విని వారి పారుష్యంబులు వినలేక కాలుష్యంబున దొమ్మిసేసి యొమ్ముగా నిలిచి దుముదారుగా నడచి యాగొల్లం బడఁద్రోసి విచ్చనవిడిగా వచ్చిరఁట యెటు వలెను.

వా. ఇవ్విధంబున వచ్చియచ్యుతవిజయరాఘువధరాధినాథుని చెంగటంగూర్చుండి మంగళాశాసనంబు సేసిరఁట యెటువలెను.

మంగళానిభవంతు అంగజసరూప! అఖండిత ప్రతాపోస్తు చండకర తేజ! దీర్ఘాయురస్తు తే దీనమందార.

వా. అని నానా ప్రభంగులుగా విద్యాప్రసంగంబు నడపించిరఁట యెటువలెను.

శ్లో. ఔదార్య మంగనృపభంగ విధానధుర్యం
శౌర్యంచ ధైర్యమపి శౌర్యుపలాలనీయమ్
రూపం చ పంచశరవీరవిలోభనీయం
యస్యాస్త్యహో విజయరాఘువసార్వభౌమ ॥

చూర్ణిక. అయం కిల సకలమహీపాలమకుటోపలాలితచరణకమలయుగళో వీప్సేవ విశ్వవిశ్వంభరస్య, విభాషేవ భాషాపతే రనువాదఇవ రఘునాథస్య సంవాదఇవ సంవరణస్య ప్రవాదఇవ భార్గవస్య ప్రతిచ్ఛంద ఇవ హారిశ్చంద్రస్య ప్రత్యాదేశఇవభరతస్య ప్రతిబింబమివ చంద్రబింబస్య మూర్తిభేదఇవ కార్తవీర్యస్య వికల్ప ఇవ కల్పపాదపస్య ద్విరుక్తి రివ దిలీపస్య పునరుక్తి రివ పురూరవసో విరాజమానో, నకేవలం చంద్రఇవ శీతలః తపనఇవ ప్రతాపశీలో, నకేవల మింద్రఇవ భోగీ త్యాగీచ ధనదఇవ, నకేవల మనుకూలో రామఇవ కృష్ణఇవ దక్షిణనాయకోపి, ఇందురివ కువలయానంద

కరో నందకరఇవ పరితోషితగోపాలః, సంగీతసరస్వతి, సాహితీభోజ, సంగ్రామగాంగేయో వితరణజితరాధేయో విలాసినీజనమోహనరూపధేయో విజయసారథిభాగధేయో విజయరాఘవనామధేయో రాజాయ మధివసతి రాజధానీమ్.

చూళిక—ఖుసుళవిలోచణ మధణే। యాచకరఘుణ ధౌవ్యపాధపో యేసో
భాహాభళభళపద్దో। ఆరవికారయ వియయరాఘవో వియయు ॥ ౧ ॥

అపభ్రంశము—పుణుకావిగోడితుంహే। డర్టూణ మణేణ్ణ చూపు అసమాణు
తాయియ నిర్భరవిరహ। ప్పహోవు మణ్ణారుదాసు భూపాళు ॥ ౨ ॥

ప్రాకృతము—భద్దం దేయు పుణేతుహ చంపయ రణ్ణప్ప యేససంచాళో
హారిద్దణంయితదుజ్జ్వల సుందిరవిహాఝూయు రాయగోపాళో ॥ ౩ ॥

పైశాచి—సొవజ్జో గునవంతో బహ్మనహచ్చానుపూళనద్దమహదానో
నార్యవెన్ను సమానో ళోకవిళోకస్స పున్నెనిమచందో ॥ ౪ ॥

శౌరసేని—విదదయసో వత్థిదిసో। జయయి సుహద్దణ్ణిదోయేసో
కణ్ణవనభత్తి సీళో మణ్ణారుదాసో మహీపాళో ॥ ౫ ॥

మాగధ—పుశుపళరాశన శరిశే రూవేణ హరియ్యు మహిమా యే
దాణేహిం రాహేయే వియయయి రహుణాహశామిసంతానే ॥ ౬ ॥

దేశి—తిహువణకర్తారు తుమం ధణేసుదాతారు గాణబయుకారు
సమరహళబ్బాళదు నెదారు మహోదారు మన్నారు ॥ ౭ ॥

డిండిమము—కాంచివల్ల ద్వలగ్నకం। ప్రాంచదుచ్చ స్తనద్వయం
కాచి దంబుజలోచనా। రఘునాథనందన నాథ తే త్వామ్ ॥ ౮ ॥

రూపకతాళము:——చందనాచలకందరోదర మందమారుతబృందసోదర
నంద్యకోవిదనంద్య సద్రసతుందిలోదితకందళోజ్జ్వల ॥ ౯ ॥

వర్ణము—లలితస్వభావ కలితప్రభావ రిపుభంగకృతిచంగ రణరంగభీమ
దినప్రదానప్రదానప్రధావిప్రహర్షణోజ్జ్వలా విజయరాఘవ ధరాపురందరా

శ్లో. భునక్తు వసుధాతలం విజయరాఘవక్ష్మాపతిః
వ్యనక్తు కవితాస్థితిం విజయరాఘవక్ష్మాపతిః
నయం వ్రజతు మానసం విజయరాఘవక్ష్మాపతిః
శ్రియం భజతు సర్వదా విజయరాఘవక్ష్మాపతిః ॥ ౧౧ ॥

శ్రియం భజతు సర్వదే త్యత్ర లిఙ్ లోట్ తవ్యప్రత్యయానాం విధాయకత్వాత్ స్వరైశ్వర్యసిద్ధతయా పునర్విధానం కథం సిద్ధసాధనత్వాత్। విధేరజ్ఞాతజ్ఞాపకత్వాత్.

కిముచ్యతే హా భునక్తు వసుధాతల మిత్యత్ర "ఐంద్రంపదం భూమిగతో నభుంక్తే" ఇతిరఘువంశప్రయోగానుసారేణ ఆత్మనేపదే ప్రయోక్తవ్యే కథం పరస్మైపదప్రయోగః.

అత్రేద ముత్తరం భుజోనవన యితి సూత్రానుసారేణ అనవనార్థేత్వాత్మనేపదవిధానా న్నాయ మాక్షేపః।నచ వాచ్యం। తర్హి తత్ర కాగతిరితి। అత్ర అనుభుంక్తే అనుభవతీత్యర్థః తథాచ న దోషః.

మాట:—అవునోయి యెషువంట్టి భ్రాంత్తుం డయినా యిషువలె భ్రమసును కొనునా। భుజిధాతువుకు అనుభవ మర్థ మని యెషునలె చెప్పుచున్నావోయి ॥ ౧ ॥

వజ్రశుంఠ మల్లుభట్టిగాండు యేమోయి అనే అట్టు ఆయనా నాబ్రదుకు॥

యిషువంటి బ్రహ్మహోబ్రహ్మ కొడుకును యేమోయి అనవచ్చునా

వోరి నీవలె వుభయతో బట్టి ప్రాయశ్చిత్తం చేసుకోకవుంటి నమరా ॥ ౩ ॥

వోరీ నీవు పుట్టి మూం డాయిత్తారాలు లే నిన్నటి సుడుపడవు।నావంట్టి యోగ్యుణ్ని జూచి యేమి వదరేవురా శునకం వలె। పాదరక్షులు తీసి రెండు ప్రహరింత్తుమో ॥ ౪ ॥

వోరి వృద్ధగార్ధభమా। నోరుగల దంచున్ను నెత్తినోరు బెట్టుక కూయ వచ్చినాండవు। కపోలతాడనం శేతునో।త్వమేవ గార్దభః ॥ ౧ ॥ త్వమేవ శునకః॥ ౨ ॥ త్వమేవ సూకరః ॥ ౩ ॥

వా.అనిన విని నృపాలుం డే మనుచున్నాఁడు.

నాయనిమాట:—తాళరోయి యేలకూశేరు.

విద్వాంసుఁడు:—పః పః పః పరాకా। రాఽఽంరారాామునికి సీసీసీసీత యేంగావలెను

నాయనిమాట:—భళానోయి మంచ్చాక్షేపం।యే మొ అంచ్చున్ను వుంటిమి యిటువంట్టి యెత్వమా నీవు.

వా. అని యొకనిం జూచి చేసన్న చేయఁగా నే మనుచున్నాఁడు.

మాట:—ఔ కుంభకర్ణునికి భీమసేనుండు యేంగావలె.

పోః పోః పోః పోః ప్రప్రప్రప్రతిబంధి పట్టుచున్నాండవు.

↞ లయగ్రాహి. ↞

భావమునవిన్నుఁ గులదైవతముగాఁదలఁచి సేవయొనరించు విబుధావళికి నెల్లన్

శ్రీవిజయలాభములు భూవిదితకీర్తులును దేవపతిభోగమును ధీవిభవముల్ దం

తావళసమాహములుతావులతురంగములుకావలయుగ్రామములు వేవగలసొమ్ము
లీవిగడుఁగల్గుధరణీవలయమందు నవురావిజయరాఘవ మహీవరవరేణ్యా॥౧॥
తావిజగజంపుసిగపూవులసరుల్తళుకుమోవిపలుగెంపుబురుసావలువసొంపు
లీవిదులకింపనొకతావి చురుకున్నరుతు మావుపయినెక్కి పురిలోవెడలిరాఁగా
నీనగలుఁజూచి చెలి రేపగలుఁ జొక్కు చును బూవుజము దాఁడిదొంహావళికిఁ జిక్కె
న్నా వెలఁది నేలుకొనరావలదె నీవుదయతో విజయరాఘవ మహీవరపరాకా.

క. భూతలమున శిబికర్ణులు, దాత లనే సుద్ది సుద్దదబ్బఱ నిన్నేఁ
చేతఁ వదాన్యుఁడవ్వఁడు, రా తంజావూరివిజయరాఘవనృపతీ.

వా. అని యీవిధంబున నానావిధలౌకికవైదికప్రసంగంబులు నడచుచున్న సమ
యంబునఁ బుడమితేఁడు గడియ లడుగు మనెనఁట యెటువలెను.

నాయనిమాట:—ఘడియ లడగరా.

అణ్ణాగళుమాట:—ఘడియారం ఘడియారం.

వా. ఆసమయంబున గడియారమువాఁడు వచ్చి గడియలు విన్నవించెనఁట యెటు
వలెను.

శ్రీరాజగోపాలస్సహాయః। ఘడియలు యిరువయి.

వా. అనిన విని యవనీశ్వరుండు దిగ్గున లేచి యగ్గలిక మీఱ మన్నారుల సన్నిధిఁ
జేరి సన్నుతిచేసి పల్లవాధరలు గొలువఁ బల్లకి యెక్కి యుల్లంబు రంజిల్ల
మెల్లమెల్లనె భేరీమృదంగపణవపటహముఖరవఢక్కాహుడుక్కాది వాద్యధ్వ
నులు దిక్కటాహంబులఁ బిక్కటిల్ల నందంబుగా వందిమాగధబృందహృ
ద్యానవద్య గద్యపద్యారావంబులును భూనభోంతరాళంబుల బోరుకలంగ
రాజాధిరాజులు కైజీతంపుపౌఁజులు నెన్నందగు మన్నెదొరలు నసమానల
సమానసాహసంబున మీరుహసము వారును సద్వంద్వ్యలగు విద్వత్కవులును
జాణ లగు గాణలును బ్రవీణు లగు వైణికులును నటచేటపీఠమర్దవిదూషకులుఁ
గొలువ నగరప్రవేశంబు నటించిన సమయంబున విలాసవతి వచ్చెనఁట
యెటువలెను.

దరువు, సైంధవి - ఆదితాళము.

గజనిమ్మపండు చేకానుక పూని విజయరాఘవునిఁ జేర విలాసవతి వచ్చె.

వా. ఈవిధాన వచ్చినవిలాసవతి దగ్గఱ నున్న యొకానొక హెగ్గడినిం జూచి
యేమనుచున్నది.

విలాసవతిమాట - వోయక్క మీయేలినవారిసనుయ మేమక్క, విలాసవతి వచ్చె
నని విన్నపం శేయునక్క.

వా. అనిన విని యగ్గలిక మీఱ హెగ్గడికత్తె యేలినసామితో నేమనుచున్నది.

హెగ్గడికత్తెమాట—వోసామి యెవరో విలాసవతి యట వచ్చినానని యిన్నపం
శేయునునె.

వా. అనిన విని యానీశ్వరుం డేమనుచున్నాఁడు.

నాయనిమాట--అవును మంచిదే పిలవ్వా

వా అనిన విని హెగ్గడికత్తె యే మనుచున్నది

హెగ్గడికత్తెమాట—రావో విలాసవతి యేలినవారు పిలిచేరు.

వా. అనిన విని వారిజాక్షి చేరవచ్చి యే మనుచున్నది.

విలాసవతి—మొక్కేను మొక్కేనయ్యా చక్కని మన్నారుదాస.

వా. అని యాగజయాన విజయరాఘవధీరునికి గజనిమ్మపండ్లు కానుక యిచ్చిన
నామేటి యాబోఁటినిం జూచి యే మనుచున్నాఁడు.

దరువు—ఎవరంపఁగా వచ్చితి నెవ్వరిదానవు, జనరాల తెలుపవె జాగు సేయకను॥
నినుజూచినంత నెమనసు చల్లనయ్యాని, వనజలోచన నీవువచ్చినపని యేమి॥ ౨॥
రాకేందువదననీ రాకమాకొక మేలు, చేకూర్పవచ్చిన చెలువునఁదోఁచె ॥ ౩॥

వా అనిన విని యానవఁబోఁణి యే మనుచున్నది.

విలాసవతి చదివే పద్యం.

సీ. శ్రీరాజగోపాల శౌరి చెంగమ్మయు గరుడవాహన మెక్కి కదలిరాఁగ
రాజచంద్రునివాత్రి రాజబింబానన యులకాంతిగుతి చూచి యపుడు మిమ్ము
నారాత్రి కలలోన నక్కఱమీఱఁగఁ గలసినయట్లుంచెఁ గలఁగి మిగుల
విరహాంబుచే సొక్కి మరునికాఁకకుస్రుక్కి మనసు నీపైఁ జిక్కి మనుచు హెచ్చఁ
బ్రాణపదమైన వనుఁబిల్చి పద్మగంధ, స్వామికిని దెల్పు మనుచును సంగఁబనిచెఁ
గాంతిమతి చెలువంబు నేఘనతమీఱ, విజయరాఘవ తెల్పెద వేడ్క వినుము.

వా. అని వెండియు నావేదండయాన యామండలాధిపునితో నేమనుచున్నది.

విలాసవతి చదివేద్విపద.

ఆయింతి మరుదంతి యంగురులబంతి, కాయజుచికటారి కలికి మిటారి
ఘనసీలవేణి పంకజమృదుపాణి, వినుతికెక్కిన మొల్లవిరిఁబోణి యల్ల
కమలాక్షి పాలిండ్లు గజనిమ్మపండ్లు, విమలాంగికరములు విరులసరములు
కలకంఠికళము చొక్కపుశంఖకులము, చెలువకర్ణంబులు శ్రీవర్ణమూలగు

21. ఆముక్తమాల్యద - వ్యాఖ్యానము - గ్రం. సం. 63.

ఇది దక్షిణదేశప్రతి. పుదుకోట వేంకటశాస్త్రిగారిచ్చినది. ప్రాచీన వ్యాఖ్యయే యని తోఁచుచున్నది, గాని, యెవ్వరు వ్రాసిరో యెఱుఁగరాదు. పద్యములను బూర్తిగా వ్రాయక కొంచెము సూచించి యర్థము భావము వ్యాఖ్యానము వ్రాసినారు పూర్తిగా లేదు. అన్నిపద్యములకును లేదు. నడుమనడుమఁ గొన్నిపద్యములు విడిచి పెట్టినారు. కొన్నింటికి - అర్థము, కొన్నింటికి - భావము నీరీతిగా వ్రాసినారు. కృత్యాదిని కవింగూర్చిన పద్యములు చాలభాగము లేవు. కీ. శే. వావిళ్ల రామస్వామిశాస్త్రిగారు వ్యాఖ్యానము వ్రాయునప్పుడు పరిశీలించిన బహుప్రతులలో నిద్దాని ప్రతియుఁ గల దని కనఁబడుచున్నది. వాఁడుక మాటలలో వ్రాయఁబడినది. ఇందు మొదటిపద్యమును గడపటి పద్యమును మాత్రమిందుఁ దెల్పఁబడుచున్నవి.

ఉ. శ్రీకమనీయహారమణిఁ జెన్నుగఁదానును గౌస్తుభంబునం
　దాకమలావధూటియు నుదాంతఁ దోఁపఁ బరస్పరాత్మలం
　దాకలితంబులైన తమయాకృతు లచ్చతఁ బైకిఁ దోఁప న
　స్తోకత నందుఁ దోఁచె నన శోభిలు వేంకటభర్తఁ గొల్చెదన్.

వ్యాఖ్యానగ్రంథములో నీపద్యము లేదు. వ్యాఖ్యానము మాత్ర మున్నది. పాఠకులకై యిందు వ్రాయఁబడినది. వ్యాఖ్యానము వ్రాఁత కొంచెము సవరించియే యిందు వ్రాయఁబడినది.

శ్రీకమనీయ శ్రీ మహాలక్ష్మి యొక్క కమనీయ మనోజ్ఞమైనట్టి హార ముత్యాలదండయందలి మణి నాయకరత్నమందు చెన్నుగఁదానును సిరనధిక సౌందర్యధుర్యుఁడైనటువంటి తానును కౌస్తుభంబునందు స్వకీయవక్షఃస్థలంబున నున్న కౌస్తుభంబునందు ఆకమలావధూటియు ఆమహాలక్ష్మియును ఉదాంతఁదోఁప తిన్నదనమునఁ గనుపట్టఁగా పరస్పరాత్మలం దాకలితమ్ములైన అన్యోన్యహృదయగతములైన తమయాకృతులు తమయాకారములు అచ్ఛతఁ బైకిఁ దోఁచి అపగతరజస్తమోవిమోహము లైన అన్యోన్యహృదయముల స్వచ్ఛతచేతను వెలుపటికిఁ గనుపట్టి అస్తోకతను ఆధిక్యముచేతను అందుఁ దోఁచె ననఁ బరస్పరహృదయవినిహితనాయకరత్నములందు కనుపట్టెనో యనఁగ శోభిలు ప్రకాశించునటువంటి వేంకటభర్తఁ గొల్చెదన్ వేంకటాచలపతిని సేవించెదను. అనిపదార్థము. ఈపద్యమందు మొదట కర్తృద్వయము నేకవచనగ్రహణము చేసినందుకు, అభిప్రాయము, యతోహరిస్తతోలక్ష్మీః యనియు, విష్ణోశ్శేషానపాయినీ యనియు,

హాగర్థావినసంపృక్తావనియు, అనన్యారాఘవేణాహంః భాస్కరేణప్రభాయథా ఇత్యాదు లైన ప్రమాణసహస్రములచేత నారాయణ పదార్థగ్రహణముచేత లక్ష్మీపదార్థగ్రహణము సిద్ధము. ఈపద్యార్థముచేత నీప్రబంధమందు వక్ష్యమాణ మైనటువంటి యాముక్తమాల్యద రంగనాథుక పరిణయసముచిత పరస్పరాభి ముఖ్యావస్థితి వ్యంగ్యమర్యాదచేత సూచితమగుచున్నది. ప్రబంధములయందు మగణస్థిత్యర్థముగా శార్దూలము ప్రయోగించుట కలిగినప్పటికి నిక్కడ నుత్పల మాలికా వృత్తము ప్రయోగించినది యాముక్తమాల్యద చెంగలువదోమాలె గదా యని యుత్పలమాలికాసమర్పణము. అందునుంచి భగవన్ముఖోల్లాసము కలిగిన కథ రచియించువాఁడు గనుక ఉత్పలమాలికా వృత్తరూపమైన వాక్సు మదామము సమర్పించినాఁడు.

కడపటనున్న నాల్గవ యాశ్వాసములోని పద్యము.

క. నాని శిఖి వంటచెఱకుల, చేనవి వెండియును వంటచెఱకులె యగుటన్
బోనములు ప్రజకు జక్కుల, బోనంబులెయయ్యెఁ బ్రొయ్యిపొగయమివృష్టిన్.

టీ. అని వేఁడికట్టెలు లేవు గనుక మిక్కిలి కలువకాఁడలవలెఁ దడిసినకట్టెలు పైవేసినందుచేతను తడిసి యారిపోఁగాను అవి ఆయింధనములు మఱి విచా రించిన బెల్లము వండ యోగ్యమైన చెఱకులె యగుటన్ బెల్లమువండ యోగ్యమైన చెఱకు లెటువలె రసమైయుండునో అటువలె.

ఇంతేయున్నది ౧౦౦ పత్త్రములు గలవు

## 22. వేదాంతప్రకరణము - గ్రం. సం. 60.

ఈ 60 సంఖ్యగలది కాగితముల పుస్తకము. పూర్వప్పు వీఁచుకాగితములు. ఇందు దీనితోపాటు నవకృతోపదేశము, నిజానందయోగి కృతమైన యుమా మహేశ్వరసంవాదము, నారపామాత్యుని గురుగీతాసారము, వేదాంతకీర్తనలు, పంచీకరణము, దృగ్దృశ్యవివేకము నుత్తరభాగమును గలవు. ఇద్దఱు ముగ్గుఱ వ్రాఁతలిందున్నవి. మొదటఁ గొన్నిపాటలును "అందరాని మానిపండు అందిత్రి మూర్తుల కలవిగాకుండు' మొదలైనవి గలవు తర్వాత కఠవల్లి ఉపనిషత్తునకుఁ దెనుఁగు నాచికేతు కథగలదు. కొంతమచ్చునకు వ్రాఁతిసవరించి వ్రాయఁబడు చున్నది.

"సాధనచతుష్టిసంపత్తి గలశిష్యుఁడైనవాఁడు, ఉపశాంతి గలటువంటి గురు నిబోయి శరణుపొంది యడుగు ప్రకారము,

అయ్యా, శరీరమే యాత్మయో, లేక శరీరము కాక వేఱేయాత్మయా యని యడిగిన శిష్యుని జూచి గురువైన సనత్కుమారుఁ డుత్తరము చెప్పే ప్రకారము, వాసవుఁడనెడు ఋషియైనవారు సర్వస్వయాగము చేయునప్పుడు దూడలేని యావును దక్షిణగానిచ్చెను. అపుడు నాచికేతుఁడను కొమారుఁడు చూచు కొనుచుండి దూడలేని యావును దక్షిణగానిచ్చిన నరకముకలదే, నన్ను దక్షిణ గానిమ్మని మూఁడు మాటులుగాఁ జెప్పెను. నాల్గవసారి చెప్పునప్పుడు వాసవుఁ డను ఋషికి మహాకోపమువచ్చి "నిన్ను మృత్యువునకిచ్చి"తి నని చెప్పిరి. అపుడు పితవాక్య మసత్యముగాఁ బోఁగూడదని తండ్రివద్దఅనుజ్ఞ తీసికొని ధర్మరాజు పట్టనమును బొందెను. ధర్మరాజు పట్టనమునుబొంది యు ధర్మరాజును గానక మూఁడుదినములు పస్తుండిరి. నాల్గవదినము ధర్మరాజుచూచి యగ్నికి సమాన మయిన బ్రాహ్మణులు మూఁడుదినములు పస్తున్నారే ఆయుస్సును ఐశ్వర్యమును బుత్రులును పశువులకును వీనిదేనికిని నాశము వచ్చుచున్నదా యని మూఁడుదిన ములు పస్తున్నందుకు మూఁడువరా లడుగుమని చెప్పినారు. నేను మాతండ్రి దగ్గఱ చేరవలయునని యొకవరము నడిగినాఁడు. రెండవవర మేమి కర్మముచేసి ధర్మరాజుపట్టనము పొందితి నని యడిగినాఁడు. రెండువరముల నడిగి మూఁడవ వరమడుగు ప్రకారము:—అయ్యా పరలోకానికిఁబోయెడు నాత్మనుగొందఱున్న దని చెప్పుచున్నారు. కొందఱు లే దని చెప్పుచున్నారు. ఉన్నదని చెప్పిరా కర్త గాను భోక్తగాను సంసారిగాను నుండును లేదంటిరా యెనా యాత్మకు సంసారమే లేదు దీనినిమీరు నాకుఁ జక్కఁగాఁ జెప్పవలయునని వినయముగా నమస్కరించిన నాచికేతునిజూచి ధర్మరాజు—

పదిపుటలుగలదు. కడపట ఆచార్యస్వామి చెప్పిన వేదాంతప్రకరణము సంపూర్ణ మని యున్నది.

2. నవకృతోపదేశము:—"ఎవ్వరురచించినదో తెలియదు. దీనిలోని కొన్నివాక్యములు:—దిద్దివ్రాయఁబడినది.

"తత్త్వజ్ఞానము వలననుండి యజ్ఞాననివృత్తి కావలయును, తత్త్వజ్ఞానమెందు వలన వచ్చునంటేని గురుకృపచేతను, ఈశ్వరానుగ్రహము చేతను, అనేకజన్మ సుకృతవిశేషము చేతను, వేదాంతశ్రవణము చేతను రావలెను—వేదాంతశ్రవణ మనఁగా నేదంటేని, శ్రవణమనననిధిధ్యాససమాధిలక్షణములతోఁ గూడుకొని యుండును. శ్రవణమునకు లక్షణమేది, మననమునకు లక్షణమేది, నిధిధ్యాసకు లక్షణమేది, శ్రవణమునకు లక్షణమనఁగా నెటువలె నంటేని—ఉపక్రమము, ఉప

సంహారము, అభ్యాసము, అపూర్వతాఫలము, నర్థవాదము, నుపపత్తి, లింగము, తాత్పర్యనిర్ణయము. మననమునకు లక్షణమునఁగా నెటువలెనంటేని శ్రుతులు చెప్పినయర్థమునకు నాచార్యులు చెప్పినవాక్యమునకు, నింకను విశేషతః తన యొక్క బుద్ధి నిశ్చయముచేతను గూడును గూడ దని యనుసంధానము చేయు నదియే మననమునకు లక్షణము - - పదిపత్త్రములలోఁ గలదు. కడపట-

“యథా సౌమ్య నైకేన మృత్పిండేన సర్వం మృణ్మయం వా జ్ఞాతం కస్మాత్ వాచారంభణం వికారో నామధేయం మృత్తికేత్యేవ సత్యం ఉపక్రమం ఉపసంహారం అభ్యాసం, అపూర్వతాఫలం అర్థవాద ముపపత్తిలింగం తాత్పర్యనిర్ణయం ననకృతోపదేశం సమాప్తః అనియున్నది.

౬. ఉమామహేశ్వరసంవాదము - ఇదియు వేదాంతమే - పార్వతికీశ్వరుఁడు చెప్పినది. “ - - - - జ్ఞానంబుకొఱకుఁగాక వివాదంబు ప్రసంగోచితకరమై వర్తించునో, అటుగనుక వేదశాస్త్రపురాణాదులచేత జ్ఞానసిద్ధికొఱకుఁ దెలియఁబోయిన బహుకాలవ్యాప్తియు ననేకవిఘ్నములును దేహము క్షణభంగురము గనుక సకలలోకోపకారముగా సకలార్థసారానుగ్రహమైన యాత్మతత్త్వబోధ యాత్మానాత్మవివేకంబుకొఱకుఁ జెప్పఁబడెను. ఇందులవివరంబున జన్మస్థితిలయంబులును తొలంగును. మహదాదిభూతంబులును సకలచరాచరజంతుజాల లక్ష్యాలక్ష్యబ్రహ్మాండ పిండాండలక్షణంబులును ప్రకృత్యాత్మవిచారంబును మోక్షహేతువు బంధకంబును మిథ్యయునైనప్రకృతిని శ్లేషముగా లయముచేసి నిజమైనయాత్మ తానేస్వయంప్రకాశుఁడును నై వెలుఁగుచుండును. శాస్త్రపురాణాదు లనంతములు, అందు గ్రంథము విస్తరమును కాలము స్వల్పమును గాఁగా హంసగదా పాలుగ్రోలి యుదకము విడిచినట్లు ఆత్మజ్ఞానులు సర్వార్థపరమైన పరమాత్మనిష్ఠులై యితరవాంఛలు విడుతురు - - - - - ”

ప్రథమప్రకరణముచివర యిది వుమామహేశ్వరసంవాదే ప్రథమప్రకరణం సంపూర్ణం శ్రీవేమనసద్గురు తిరువేంగళగురుబ్రహ్మకే, అర్పితం. స్థిరకాల జీవన్ముక్తి స్థిరంజీవి వర్ధతాతిం అనియున్నది. రెండవప్రకరణము చివర శ్రీసద్గురు భావేస్కందపురాణే వుత్తరకాండే వుమామహేశ్వరసంవాదే నిజానందయోగ విరచితన్నామద్వితీయప్రకరణము సమాప్తము అనియున్నది. మూఁడవప్రకరణము పూర్ణముగాలేదు.

4. గురుగీతాసారము:—కవి కంభముపాటి నారపామాత్యుఁడని

క. క్రమమున సద్గురుముఖమున, వమలినతరమైన బ్రహ్మానురంగుటచేఁ గం
భము వాటి నారపనిధిధర, సుమతులచే నెన్నఁబడితి శోభధరాత్మా.

క. శ్రీరామగురుని కరుణను, దారక యోగానుభవవిచారము మదినే
మారక ధ్యానించుటచే, నీరీతిని నాంధ్రభాష యేర్పఁజేతున్.

ఈగ్రంథము మూఁడాశ్వాసముల పద్యకావ్యము. మొదటి పద్యములు.

శా. శ్రీకైల్యవిశేషస్థానము నుదిం జేరంగ నేఁగోరితిన్
లోకాచార్యుని దత్తవంశజుని సత్కాగుణ్యపాథోధియై
లోకాచారవిచారసంపదల కాలోకింపకవ్మోక్షుల
శ్రీకాంతుం డగు రామబ్రహ్మగురునే స్తోత్రింతు నశ్రాంతమున్.

చ. శివకరలీలఁ బ్రాణుల సృజించు నెవండు గమలాసనుండు నై
యవని సమస్తజంతునివహంబులఁ బ్రోవఁగ నచ్యుతుండు నై
ప్రవిమల జీవసంఘముల ప్రాణముఁ బాపి హరింప రుద్రుఁడై
యవలఁ ద్రిమూర్తులొక్కటగు నాద్యునవంతుని వేఁడి మ్రొక్కెదన్.

కొందఱు నాకుఁ గవిత్వము చెప్పుట చేతఁగాదు కాకపోయినను వెఱ్ఱియు
త్సాహముతోఁ గడఁగితిని క్షమింపుఁడని వేఁడు నాచారముగదు. ఈతఁడట్లు
గనఁబడఁడు.

మ. సరసోదార కవీంద్రు లీకవితలో సవిశేషముల్నిండి శ్రీ
కరమైయుంట దటంచు నెంచెదరుగా గాంభీర్యవాక్చాతురి
న్నరుల న్వేఁడి గజాశ్వయానములకు న్నాసక్తులై పల్కు తా
త్సరణాల్ గావ్యమహోత్తులా ఘనులకున్ స్వారస్యమైయుండునా.

క. ప్రాసములు యతులు గణములు, భాసురముగనుండ వనుచుఁ బలికెద రేమో
దేశికగురువరు చరణో, పాసకులకు నేలయిట్టి భ్రాంతులఁ బొందన్.

గీ. ప్రాసములు యెంచ గురుపదప్రాప్తి సుమ్ము
యతులు గురుపాదసేవ సుమతి నిలుచుట
గణము సద్భక్తజనములఁ గలసియుంట
సకల మీభావములు గూర్చి చెప్పువాఁడ.

అని ధైర్యముగ నుడివెను. భావమే ప్రధాన మనువారిలోని వాఁడుగా
నున్నాఁడు. దీనికిఁ బైపద్యములో

క. పలికెద శ్రీగురుగీతలు, పలికించెటివాఁడు రామబ్రహ్మము నాలో
పలనిలిచి యే విధంబున, బలికించునో యావిధమునఁ బలికెద నుర్విన్.

ఈతని గురువు ధేనువుకొండతిమ్మనయోగిశిష్యపరంపరలోని సాంబబ్రహ్మ గురుఁడు. ఈకథకు మూలము పార్వతి శంకరుని—

క. ఏమార్గమునను నోహర, యీమహిదేహాత్మభావ మెఱుఁగుదురది యె
ట్లామహిమంతయు నేవినఁ, గామించితిఁ దెలియఁబలుకు గజదైత్యహరా

అని యడిగిన బోధించిన వేదాంతము. అక్కడక్కడి కొన్ని పద్యములు.

క. చావులు తనువుకుఁ గలుగును, జీవునకెప్పటికిఁ జావుచెప్పఁగరాదే
యోనరుల జీర్ణవస్త్రము, పోవిడిచియుఁ గ్రొత్తవస్త్రమును గట్టుగతిన్.

గీ. తెలివిలేనివాఁడు దేహమేకాదశి, నాఁడు విడిచెనేని నందుముక్తి
ఆత్మగన్నవాఁడు సమవసనంగంబు, బాసెనేని జనులు పాపియండ్రు.

గీ. గురువుకంటెను నిహపరమరియ లేదు
యనుచు శ్రుతులందు పలుమాఱు నెన్నఁబడును
వాక్కుకాయంబు మనసుచే వకటిగాను
నెంచి గురుపదపూజ లొనర్చవలయు.

చ. రవియుదయించి లోకక్రియలన్నియుఁ జేయఁగ నీజగత్త్రియల్
రవికిని నెట్టులంట వటు రాజిలుచుండ్ దనుధర్మలీల లీ
శివకరమైన యాత్మునకు జెల్వనటంచటంచు భ్రాంతులం
దవులకు సాక్షిరూపుని మదిందలపోయుచు జ్ఞప్తినుండుమీ.

5. మఱియుఁగొన్ని వేదాంతకీర్తనలు, జోలపాటలు, లాలిపాటలు, పంచీకరణమనువచనము నున్నవి. కీర్తనలలోఁ జాలభాగము— "భుజంగగురుకృపను బుధుఁడైయున్న నిజగోపాలశిష్యునికి నిత్యానందము" అనుమొదలుగానుండును. భుజంగ గురుఁడెవ్వరో గోపాలశిష్యుఁడెవ్వరో తెలియదు.

6. దృగ్దృశ్యవివేకము;— ఈవచనము మఱియుఁ దప్పులతడిక — మచ్చునకు—కొన్నియున్నవున్నట్టు.

"శ్రీగురుచరణారవిందవేనమః, యిఖను జీవుడు యవడంటె స్థూలశరీరమందు అభిమానంచేశ్ని జీవుడికి విశ్వుడని పేరు, వీడికి అవస్థజాగ్రదవస్థ సూక్ష్మశరీరమందు అభిమానం చేశ్ని జీవుడికి తైజసు డనిపేరు వీడికి అవస్థస్వప్నావస్థకారణ శరీరమందు అభిమానం జేశ్ని జీవుడికి ప్రాజ్ఞుడనిపేరు వీడికి అవస్థసుషుప్తి యీప్రకారంగా జీవభేదంచెప్పబడెను, యిఖను యీశ్వరభేదం యెటువలెనంటేను."

చిట్టచివర, ఈయొక్క పంచవింశతితత్త్వ ప్రకరణము లోకోపకారము కొఱకు, ఆచార్యస్వాముల వా రనుగ్రహముచేసినారు, గనుక ౨౫ తత్త్వములు

నెపరైన నేమిశోధించి కన్నవారికి సంసారమువలన సంబంధము విడుచును. సిద్ధము అనియున్నది.

23. శృంగారాంధ్రరసమంజరి—గ్రం. సం. 97.

దీనికవి నారాయణకవియని—

శా. పన్నొల్లిఁగ నుల్లసిల్లిన భరద్వాజీయగోత్రార్ణవో
త్పన్నశ్రీగొనుసూరి చంద్రుఁడు దలిర్పన్ వేంకటాచార్యశ్రీ
మన్నాయణసత్కవీంద్రు నొనరింపన్ రమ్యమైయాంధ్రమై
యున్నన్నారసమంజరీకృతి చతుర్థాశ్వాస మొప్పెం దగున్.

అను కడపటి పద్యమువలనఁ దెలియవచ్చుచున్నది. ఈక్రింది వాక్యములు ప్రతి వ్రాసినవారు వ్రాసినవి. దీనిలో దీనివివరమంతయుఁ గలదు.

"యీరసమంజరి యనుగ్రంథము నవనాలపుర మనునట్టి యీపుదుకోట సమస్తానమున్నటువంటి పడమటి నగిరి ప్రభువుపై శ్రీనున్నారాయణయ్యంగారు అనేటి మహాకవిచే రచియింపంబడినది. పచ్చిమిరియం ఆదిప్పయ్యగారి మనముడు కుప్పణ్ణయ్యగారి కుమారుడైనట్టి సుబ్బయ్యవ్రాశినది. ఆశ్వాసములు నాల్గింట మొదటియాశ్వాసం వంశావతారం మాత్రం వ్రాయలేదు. శ్రీముఖనామ సంవత్సరము ఫాల్గుణ బహుళ త్రితియ్యభృగువారం సమాప్తమైనది" అనికలదు. (కాగితపుప్రతి)

ఇక్కవి గద్యములకు బదులు పద్యములే రచియించెను.

శా. విశ్వాసంధననాయికౌఘగణనావిభ్రాజితంబైసుధీ
విశ్వాసప్రియహేతువై కృతరసావేశప్రహృష్టాత్మన
ద్విశ్వంబై రసమంజరిం దెనుఁగునన్ విద్యోతితంబై ద్వితీ
యాశ్వాసంబిది నారణార్యరచితం బైయొప్పువేడ్కన్ మహిన్. (ద్వి - ఆ.)

మ. ఇది శ్రీమన్ఘననారణార్యరచితప్రేంఖత్తరప్రౌఢిమ
త్పదవృత్తిన్ రసమంజరిన్ నవవిధోద్యన్నాయికా లక్షణా
భ్యుదితశ్రీగుణచేష్టితప్రకటనాభోగప్రసక్తిన్ రసా
స్పదమై యాంధ్రమునై తృతీయమగు నాశ్వాసంబు ధాత్రిందగున్. తృతీయా

పుదుకోట సంస్థానప్రభువు కోటి విజయరఘునాథరాజునకు (తొండమానునకుఁ) గృతియిచ్చెను. ఒక్క యాశ్వాసమంతయుఁ గృతిపతి వంశావతార వర్ణనమున్నది వ్రాయమానినారు. అందెంతవిశేషమున్నదో! ఆశ్వాసాంతము నందలి పద్యములు సంక్షేపవర్ణనలతోనున్నవి. చతుర్థాశ్వాసముచివర—

శా. సర్వోర్వీమణివిక్రమోదయ దయాపాంగత్వలక్ష్మీసఖా
ఖర్వోర్వన్యవిలాపలాపక సుదృగ్గ్రాగాభిలాషాత్మభూ
పూర్వశ్రీంజితరంజితాఖిలసభామర్త్యాళిసంశ్లాఘితా
గీర్వైఖర్యనువాదిపంజరసంత్యక్తాళిశుకీశారికా.

మాలినీ- దివిజదుమకుసుమాప్తా దివ్యగంధానులిప్తా
కనకకృతమరక్తా కంతుజిద్భక్తియుక్తా
భువనభరణదక్షా పుణ్యలబ్ధాక్షివీక్షా
రవికులయమతిసాంద్రా కోటివంశాబ్ధిచంద్రా.

మ. విజితారాతినరాధనీశ మకుటావిర్భూతముక్తాఫల
వ్రజరోచిస్తటినీతరంగితపదాబ్జాత ప్రభానందిత
ద్విజమోహార్జితభవ్యదివ్యవిభవోద్వేలప్రకాశాంకురా
విజయశ్రీరఘునాథభూవర జగద్విఖ్యాతతేజోభరా.

ఇట్లే ప్రతిపద్యము చివరను గొంచెముకొంచెముగా నీరాజును సంబోధించుచు వచ్చినాఁడు. ద్వితీయాశ్వాసము ప్రారంభము.

క. శ్రీమహినిలయితదృఢభుజ, సామంతనరేంద్రమకుటచయమణికిరణ
శ్యామలితపదనఖాంకుర, ధీమత్కులశంసనీయ ధిషణాభ్యుదయా.

వ. అవధరింపుము మునివర్యులు సూతుం గనుంగొని రసమంజరి తెనిఁగించిన ప్రకారంబును వివరించి పలుకరింపుమనవుడు నక్కథకవర్యుం డిట్లనియె. అప్పు డక్కవీంద్రుఁ డా నృపతినుపలక్షించి.

మ. నిజపాదంబును మున్ను నిల్పి నడుచు న్విమ్మోన్నతోర్వీ దరుల్
నిజహస్తమ్మున వంచి కొమ్మువిరుగందిచ్చున్ శ్రమాశంకచే
నిజభాగం బిడి జింకకోల్పుఅపునన్ నిద్రింపునే యాశ్వగుం
డజహాస్త్రైమునినాలసైకప్రియ భార్యందాల్చి యంగంబునన్.

క. నీకతఁ డొసఁగుఁ జిరాయు, శ్రీకీర్తులు శౌర్యవీర్య ధృతిమతులుసదీ
యాకృతులు లోకరక్షణ, ధీకృతులినశశికరక్షితి ఖమతులిలాన్.

సీ. శ్రీకరసత్కీర్తి జితపూర్ణకుముదబాంధవ రాజగోపాల తనయవిజయ
రఘునాథనీపేర రసమంజరి తెనుంగు నంకితింబొనరింతు నాలకింపు
లక్ష్యైకదేశతల్లక్షణావర్తిత్వ మవ్యాప్తియగు నతివ్యాప్తి యింక
లక్షణంబునకు నలక్ష్యవర్తిత్వంబుఁ దెలిపిచే నీరెండుఁ దెలియవలయు.

శ్రీరస్తు.

# ఆంధ్రసాహిత్యపరిషత్తు.

---

## TELUGU ACADEMY.

### శ్రీరుధిరోద్గారినామసంవత్సర కార్యనివేదనము.

గతవర్షమునఁ బరిషద్వార్షికసభ, పండ్రెండవది తునిలో శ్రీరాజాగారి హైస్కూలుభవనములో జరగినది. ఇది పదుమూఁడవసభ.

### సభ్యులు మొదలగువారు.

ఈపరిషత్తు ఆ 1911 సంవత్సరములో శ్రీపిఠాపురము మహారాజాగారును కీ॥ శే॥ శ్రీవేంకటగిరిమహారాజావారును స్థాపించిరి, కావున, వీరిరువురు బరిషత్ప్రతిష్ఠాపకులు.

పిదప శ్రీబొబ్బిలిమహారాజావారు, శ్రీతునిరాణిగారు, శ్రీఉయ్యూరు జమీందారుగారు నుద్ధారమునకుఁ దోడ్పడుటచే వీరుముగ్గురును బరిషదుద్ధారకులు.

శ్రీ నడిమి తిరువూరు, మునగాల, ముక్త్యాల, శ్రీభద్రాచలము జమీందారులును శ్రీ వేంకటగిరి రాజాగారును రా॥ బ॥ పైండా వేంకటాచలపతిగారు, హాస॥ శ్రీపానగల్లు రాజాగారును, వీరేడుగురును బరిషత్పోషకులు.

యావజ్జీవసభ్యులు 23 గురలో నిద్దఱు కాలధర్మము నొందిరి.

సాధారణసభ్యులు క్రొత్తవారుఁ బ్రాఁతవారు 203 రు.

గౌరవార్థసభ్యులు 36 గురు.

కార్యనిర్వాహకసభాసభ్యులు 46 గురు.

కార్యనిర్వాహకసభాధ్యక్షులొకరు. కార్యదర్శి యొక్కరు.

హా॥ న్యాయమూర్తి వేపా రామేశము పంతులుగారును దివాన్ బహద్దరు శ్రీమాన్ ధర్మవరము శేషాచార్యులు గారును గోశాధ్యక్షులు.

పరిషత్తునకుఁ బ్రారంభమునుండియు యావజ్జీవసభ్యులుగానుండి కార్యదర్శిగాఁగూడఁ బనిచేసిన కొమఱ్ఱాజు వేంకట లక్ష్మణరావుగారు కీర్తిశేషులగుట పరిషత్తున కొక తీరని లోపముగానున్నది.

ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక.

పరిషత్తు వారిచేఁ బండ్రెండుసంవత్సరములనుండి కొన్నియేండ్లు మూఁడు నెలల కొకతూరి, కొన్నిసంవత్సరములు నెలకొక మారును కొన్ని వర్షములనుండి రెండుమాసముల కొకపర్యాయముగను నడుపఁబడుచున్న పరిషత్పత్రిక పని గతసంవత్సరమునఁ దృప్తికరముగా జరుగలేదు. దీనికిఁ గల యనేక కారణములలో ముఖ్యమైనది మేనేజరునకుఁ గలిగిన దీర్ఘానారోగ్యస్థితియే. తర్వాత ముద్రాయంత్రమువారి యశ్రద్ధ. ముఖపత్రము సుందరముగా లేదని హ్రస్వగీతములు ఖండకావ్యములు లేవని ప్రతినెలకు ఫైలు వెడలుచుండవలయునని యుఁ గొందఱు సూచించిరి. అనేకవిషయము లిందుఁ జిరస్థాయులుగానుండు నవి ప్రకటింపఁబడుచున్నవి. కొందఱు సంశయించినటులు పరిషద్వార్షికసభలో జదువఁబడిన వ్యాసములే కాక యనేకేతరపండితులు వ్రాసిన వ్యాసములును బ్రకటింపఁబడుచున్నవి. ఎవ్వరేదివ్రాసిపంపిన నద్దానినెల్లఁ బత్రికలోఁ బ్రకటించు విషయము మాత్రము పరిషత్సమ్మతము కాలేదు. ఉపయోగించు భాషావిషయకవ్యాసము లెవరు పంపినను బ్రకటింపఁబడుచున్నవి.

పత్రికకుఁ జందాదారులు 235 గురు కలరు. వీరిలో ననేకులు మొదటి నుండియు నున్నారు. బోర్డులవారు, మ్యునిసిపాలిటీలవారు నుపాధ్యాయుల యుపయోగార్థము తమతమచే నడుపఁబడు పెక్కుపాఠశాలలకుఁ బరిషత్పత్రికం దెప్పించుచున్నారు. పఠనాలయాధికారులుఁ గూడ నీవిషయమును గనునింతురేని పరాపేక్ష లేకుండఁ బరిషత్పత్రిక వర్ధిల్లును. ఇట్టి వారితోడ్పాటున్నచో సర్వజనాదరముం గాంచును.

పుస్తకభాండాగారము.

పరిషత్పుస్తకభాండాగారములోని పురాతనతాళపత్రగ్రంథములు 441; అచ్చుపుస్తకములు గతసంవత్సరముతుదను 1141; ఈసంవత్సరమునఁ గొనినవి 8; ఉచితముగా వారువారు పంపినవి 43; కాగితములపై వ్రాయించినవి 36. ఇందు మైసూరు దొరతనమువారు పంపించిన శాసనములు, కర్ణాటశబ్దానుశాసనము, శ్రీపిఠాపురము మహారాజావారొసంగిన యాంధ్రసూత్రభాష్యము, ఆంధ్రప్రచారిణీగ్రంథనిలయమువారి నవలలు ముఖ్యమైనవి. ఉచితముగాఁ బంపఁబడిన పుస్తకములలో పరిషదభిప్రాయమునుగోరినవి చాలఁ గలవు. కాని ప్రేషకులకుఁ దగినంతప్రోత్సాహము పరిషత్తు కలిగింపలేదు. విమర్శకులై నియమింపఁబడినవారు పలువురు పలు తావులలో నుండుటను గార్యాంతరనిమగ్న

లకుటను శీఘ్రకాలములో నాపని జరుగుటలేదు. ముందీలోపము దీర్పఁబడును.

కొనినపుస్తకములలో చతుర్భాషి - దిఙ్నాకగవి ఛందమాల - మడికి సింగనార్యుని సకలనీతిసమ్మతము నెన్నికయైన పూర్వగ్రంథములు. K. S. N. మూర్తిగారు రచించిన తెలుఁగు బుక్కుకీపింగు, అండు అక్కౌంటు" అను పుస్తకము క్రొత్తరీతిది. విద్యార్థులు పాఠశాలలలో లెక్కలుచేయుటయేగాని తాము వ్యయముచేసిన రొక్కమును జమతా చూచుకొనుటకు గాని నెలనెలకు నిలువచూచుకొనుటకుఁగాని చాలమంది వెనుకఁబడియున్నారు. అట్టివారికిని, వర్తకులయొద్ద లేఖరులుగా నున్నవారికిని బ్రయోజనకారులుగా నుండు విషయము లిందుఁ దెల్పఁబడినవి. ఇది మొదటిపుస్తకము. సంక్షేపలిపి మున్నగువానితో దీనినిగూడఁ బాఠశాలాధ్యక్షులు బాలురకు బోధించు నేర్పాటు చేయఁదగినది. శాస్త్రాదివిషయముల స్వభాషలోనే నేర్పవలయు నను మన యూహకు దీని నొకదానిసిగా గ్రహింపవచ్చును.

పరిషత్తువారిచేఁ బ్రకటింపఁబడిన గ్రంథములయొక్కయుఁ బత్రికసంచికలయొక్కయుఁ బఠనము సాధారణముగానున్నది. జనసామాన్యమునకు విశేషించి యాదరభావము లేకున్నను బండితలోకమును బఠనమందిరములును దగినంతశ్రద్ధతోఁ జదువుచున్నవి. ఈసంవత్సరమునఁ బుస్తకభాండాగారముప్రాఁతప్రతులలోని వచనకావ్యము లన్నియుఁ గొందఱు శోధించి ముఖ్యాంశముల నెత్తి వ్రాసికొనిరి.

శ్రీసూర్యరాయాంధ్రనిఘంటువుంగూర్చి మొదటి యనుబంధములోఁ జూడవలయును.

వృత్తాంతపత్రికలు:—పరిషత్పత్రికకు వినిమయముగావచ్చు పత్రికలను రెండవయనుబంధములోఁ జూడనగును. అనేకులు చదివినపిమ్మట యాపత్రికలన్నియు భద్రముఁ జేయఁబడి యవసరమైనవారికిఁ జూపఁబడుచున్నవి.

పరిషత్తుయొక్క రుధిరోద్గారిసంవత్సరము—ఆదాయవ్యయములు మొదలగునవి యీక్రిందిపుటలలోఁ జూడవలయును.

రుధిరోద్గారి పరిషత్పత్రికలోఁ బ్రకటింపఁబడిన వ్యాసములయుఁ దత్కర్తలయుఁ బేరులు మూఁడవయనుబంధమునఁ జూడనగును.

---

## ఆంధ్రసాహిత్యపరిషత్తు—చెన్నపురి. శ్రీరుధిరోద్గారినామ సం॥ (ది 18 మార్చి

### ఆయము.

| | రూ. | అ. | పై. | రూ. | అ. | పై. |
|---|---|---|---|---|---|---|
| సంవత్సరాదిని నిలువ - - - - - | | | | 45 | 3 | 10 |
| బ్యాంకివడ్డీలు - - - - - | | | | 769 | 7 | 4 |
| బ్యాంకినుండి తెచ్చినది - - - - | | | | 2359 | 8 | 8 |
| చందాలు:— | | | | | | |
| ఉద్ధారకులవలన - - - - | 2500 | 0 | 0 | | | |
| యావజ్జీవసభ్యులవలన - - - - | 10 | 0 | 0 | | | |
| సాధారణసభ్యులవలన - - - - | 245 | 0 | 0 | | | |
| పత్రిక చందాదారులవలన - - - | 181 | 0 | 0 | | | |
| | | | | 2936 | 0 | 0 |
| చిల్లర జమ - - - - - - | | | | 2 | 12 | 0 |
| విడిసంచికల విక్రయము - - - - | | | | 50 | 0 | 0 |
| పుస్తకముల విక్రయము:— | | | | | | |
| విప్రనారాయణచరిత్రము - - - | 4 | 7 | 6 | | | |
| జైమినిభారతము - - - - | 24 | 1 | 0 | | | |
| కవిజనాశ్రయము - - - - | 14 | 9 | 0 | | | |
| జ్యోతిశ్శాస్త్రసారము - - - - | 2 | 8 | 0 | | | |
| యుద్ధమల్లుని బెజవాడ శిలాశాసనము - - | 3 | 0 | 0 | | | |
| నీతిసీసపద్య శతకము - - - - | 1 | 13 | 9 | | | |
| చంపూరామాయణము - - - - | 14 | 14 | 0 | | | |
| జ్ఞానప్రసూనాంబికా శతకము - - - | 0 | 11 | 9 | | | |
| సర్వేశ్వరశతకము - - - - | 1 | 7 | 6 | | | |
| కావ్యాలంకార చూడామణి - - - | 7 | 5 | 0 | | | |
| అకారాద్యముద్రిత గ్రంథసూచిక - - | 1 | 8 | 0 | | | |
| ప్రాకృతభాషోత్పత్తి - - - - | 3 | 11 | 0 | | | |
| డిఫెన్సు ఆఫ్ లిటరరీ తెనుఁగు - - - | 0 | 15 | 0 | | | |
| చంద్రభానుచరిత్రము - - - - | 16 | 12 | 6 | | | |
| శివతత్త్వసారము - - - - | 6 | 0 | 0 | | | |
| శివరాత్రిమాహాత్మ్యము - - - - | 15 | 6 | 6 | | | |
| దాక్షిణాత్యాంధ్రులు - - - - | 0 | 4 | 0 | | | |
| | | | | 119 | 6 | 6 |
| చేబదుళ్లు - - - - - - - | | | | 300 | 0 | 0 |
| వి. పి. పోస్టేజి - - - - - | | | | 18 | 6 | 0 |
| ఇతర ముద్రణము బైండింగు - - - | | | | 11 | 0 | 0 |
| మొత్తము - | | | | 6611 | 12 | 4 |

నెం. 20, తంబుచెట్టివీథి, మదరాసు.
27—5—1924.

గుళ్లపల్లి నరసింహము,
ఆడిటరు.

## 1923 సం॥ మొదలు ది 4 ఏప్రిల్ 1924 సం॥ వఱకు) ఆయవ్యయముల లెక్క.

### వ్యయము.

| | రూ. | అ. | పై. | రూ. | అ. | పై. |
|---|---|---|---|---|---|---|
| బ్యాంకికి బంపినది | | | | 3897 | 3 | 4 |
| చేబదుళ్లు | | | | 500 | 0 | 0 |
| వి. పి. పోస్టేజి | | | | 23 | 10 | 0 |
| బ్యాంకి చిల్లరవ్యయము | | | | 0 | 4 | 0 |
| ప్రయాణవ్యయములు:— | | | | | | |
| పండితులవ్యయము | 12 | 8 | 0 | | | |
| ఉద్యోగులవ్యయము | 36 | 10 | 0 | | | |
| | | | | 49 | 2 | 0 |
| పత్రికావిషయము:— | | | | | | |
| బ్లాకులు, ప్రతిమలు- | 18 | 4 | 0 | | | |
| కాగితములు | 195 | 0 | 0 | | | |
| ముద్రణము | 255 | 0 | 0 | | | |
| పోస్టేజి | 59 | 13 | 6 | | | |
| చిల్లరవ్యయము | 4 | 6 | 0 | | | |
| | | | | 532 | 7 | 6 |
| ఇతరముద్రణము బైండింగు | | | | 42 | 2 | 0 |
| పుస్తకభాండాగారము:— | | | | | | |
| కొనినపుస్తకములు (ముద్రితము) | 8 | 6 | 0 | | | |
| ఇతరవ్యయములు | 10 | 12 | 6 | | | |
| | | | | 19 | 2 | 6 |
| ఉద్యోగుల జీతములు | | | | 823 | 8 | 0 |
| ఇంటి యద్దె | | | | 480 | 0 | 0 |
| చిల్లర పోస్టేజి | | | | 26 | 5 | 3 |
| తంతులు, రిజష్టరీ పోస్టేజి | | | | 1 | 11 | 0 |
| కార్యస్థానము చిల్లరవ్యయము | | | | 16 | 8 | 9 |
| ఆడిటరు ఫీజు | | | | 50 | 0 | 0 |
| నిఘంటు చిల్లరవ్యయము | | | | 0 | 10 | 0 |
| పుస్తకప్రకటనము - ముద్రణాదికము - | | | | 100 | 0 | 0 |
| కార్యస్థానమున సంవత్సరాంతమున నిలువ | | | | 49 | 2 | 0 |
| మొత్తము - | | | | 6611 | 12 | 4 |

గుమ్ముడూరి వేంకటరంగ రావు,

కార్యదర్శి.

## ఆంధ్రసాహిత్యపరిషత్తు—చెన్నపురి. శ్రీరుధిరోద్గారినామసంవత్సరాంతము

### అప్పు.

| | రూ. | అ. | పై. | రూ. | అ. | పై. |
|---|---|---|---|---|---|---|
| [illegible]త్తు ఫండు:— | | | | | | |
| గతసంవత్సరాంతమున నిలువ - - - | 86,396 | 6 | 1 | | | |
| ఈసంవత్సరమున హెచ్చు ఆదాయము - - | 130 | 10 | 10 | | | |
| | | | | 86,527 | 0 | 11 |
| తంజావూరు లైబ్రరీ చందా - - - - | | | | 33 | 0 | 0 |
| చేబదుళ్లు - - - - - - | | | | 1,200 | 0 | 0 |
| నిక్షేపుఫండు:— | | | | | | |
| గతసంవత్సరాంతమున నిలువ - - - | | | | 15,000 | 0 | 0 |
| మొత్తము - | | | | 102,760 | 0 | 11 |

పైని దెలుపఁబడిన జమాఖర్చు నిలువ లెక్కను, ఆంధ్రసాహిత్యపరిషత్తువారి రుధిరోద్గారి నామ సంవత్సరపు లెక్కలతో తనిఖీచేసి సరియైనట్లు తెలుపుచున్నాను.

నెం: 20, తంబుచెట్టివీథి, మదరాసు.
27-5-1924.

గుళ్లపల్లి నరసింహము,
ఆడిటరు.

(ది 4 ఏప్రిల్ 1924 సం॥) న జమాఖర్చు నిలువ లెక్క.

## ఆస్తి.

| | | రూ. అ. పై. | రూ. అ. పై. |
|---|---|---|---|
| పరిషత్తుఫండు:— | | | |
| మదరాస్ ఇంపీరియల్ బాంక్ ఆఫ్ ఇండియా వారి జాగ్రత్తలో నుంచఁబడినవి:— | | | |
| 3½% 1900-01 గవర్నమెంటు పత్రము - - | | 10,000 0 0 | |
| గతసం॥ లెక్క దాఖలా తరుగు - - - | | 4,450 0 0 | 5,550 0 0 |
| 5% 1929-47 గవర్నమెంటుపత్రము - - | | 10,000 0 0 | |
| గతసం॥ లెక్క దాఖలా తరుగు - - - | | 2,000 0 0 | 8,000 0 0 |
| నగదువగైరా నిలువ:— | | | |
| మేనేజరు వశమున నిలువ - - - - | | 49 2 0 | |
| ఇంపీరియల్ బాంక్ ఆఫ్ ఇండియాలో కరెంటు అక్కౌంటులో - - - - - | | 694 10 3 | |
| ఇంపీరియల్ బాంక్ ఫిక్స్‌డ్ డిపాజిట్‌లో - - | | 1000 0 0 | 1,743 12 3 |
| సభ్యులవలన రావలసిన చందాలు:— | | 15395 11 0 | |
| గతసం॥ లెక్క దాఖలా రానిబాకీలు - - | | 1226 0 0 | 14,169 11 0 |
| బర్చీలు మొదలగు సామానులు (అసలు) - - | | 525 8 0 | |
| గతసం॥ రాంతమున మినహా | 206 2 0 | | |
| ఈసంవత్సరమునకు మినహా | 24 4 0 | 230 6 0 | 295 2 0 |
| ప్రచురింపఁబడిన పుస్తకముల నిలువ:— | | 3117 7 0 | |
| పత్రికల నిలువ - - - - - | | 2327 8 0 | |
| కాగితముల నిలువ - - - - | | 136 4 0 | 5,581 3 0 |
| పుస్తకభాండాగారము ముద్రితప్రతులు - - - | | 1786 12 0 | |
| ఈసంవత్సరము - ఉచితముగా వచ్చినవి - - | | 61 13 0 | |
| ఈసంవత్సరము కొనినవి - - - - | | 8 6 0 | |
| | | 1856 15 0 | |
| గతసంవత్సరాంతమున మినహా | 655 0 0 | | |
| ఈసంవత్సరమున మినహా | 56 15 0 | 711 15 0 | 1,145 0 0 |
| పుస్తకభాండాగారము వ్రాఁతప్రతులు - - - | | | 51,427 8 6 |
| నిఘంటువ్యయము:— | | | |
| గతసంవత్సరాంతమునకు - - - - | | 14847 2 2 | |
| ఈసంవత్సరమునకు - - - - - | | 0 10 0 | 14,847 12 2 |
| మొత్తము - | | | 102,760 0 11 |

గుమ్మడూరి వేంకటరంగరావు.

కార్యదర్శి.

## ఆంధ్రసాహిత్యపరిషత్తు – చెన్నపురి. శ్రీరుధిరోద్గారినామ

## వ్యయము.

| | రూ. | అ. | పై. | రూ. | అ. | పై. |
|---|---|---|---|---|---|---|
| ఉద్యోగుల జీతములు - - - - - | 823 | 8 | 0 | | | |
| ప్రయాణవ్యయములు - - - - - | 49 | 2 | 0 | | | |
| ఆడిటరుఫీజు - - - - - - | 50 | 0 | 0 | | | |
| కార్యస్థానము అద్దె - - - - - | 480 | 0 | 0 | | | |
| చిల్లర పోస్టేజి - - - - - - | 36 | 5 | 3 | | | |
| రిజిస్టరు పోస్టేజి - - - - - - | 1 | 11 | 0 | | | |
| చిల్లరవ్యయములు - - - - - - | 16 | 12 | 9 | | | |
| వి. పి. పోస్టేజి - - - - - - | 23 | 10 | 0 | | | |
| ఇతర ముద్రణము - బైండింగు - - - | 42 | 2 | 0 | | | |
| పుస్తకభాండాగారము చిల్లరవ్యయము - - - | 10 | 12 | 6 | | | |
| | | | | 1533 | 15 | 6 |
| పుస్తక ప్రకటనము - ముద్రణాదికము - - - | | | | 100 | 0 | 0 |
| పత్త్రికావిషయము :— | | | | | | |
| గతసంవత్సర ప్రతులు - - - - | 1757 | 4 | 0 | | | |
| కాగితములు ముద్రణము మొదలైనవి - - - | 532 | 7 | 6 | | | |
| కాగితములునిలువ - - - - - - | 156 | 6 | 0 | | | |
| | | | | 2446 | 1 | 6 |
| మినహాయింపులు:— | | | | | | |
| కుర్చీలు సామానులు - - - - - | 24 | 4 | 0 | | | |
| పుస్తకభాండాగారము - - - - - | 56 | 15 | 0 | | | |
| గత సంవత్సరము ప్రచురింపఁబడిన పుస్తకముల నిలువ - | 2806 | 1 | 0 | | | |
| | | | | 2887 | 4 | 0 |
| హెచ్చు ఆదాయము - - - - - - | | | | 130 | 10 | 10 |
| మొత్తము - | | | | 7097 | 15 | 10 |

నెం. 20, తంబుచెట్టివీథి, మదరాసు,
27-5-1924.

గుళ్లపల్లి నరసింహాము,
ఆడిటరు.

## సంవత్సరాయవ్యయముల లెక్క.

### ఆయము.

| | రూ. | అ. | పై. | రూ. | అ. | పై. |
|---|---|---|---|---|---|---|
| చందాలు:— | | | | | | |
| సాధారసభ్యులు - - - - | 270 | 0 | 0 | | | |
| పత్రికచందాలు - - - - | 214 | 0 | 0 | | | |
| | | | | 484 | 0 | 0 |
| విడిసంచికల విక్రయము - - - | 50 | 0 | 0 | | | |
| పుస్తకముల విక్రయము - - - - | 119 | 6 | 6 | | | |
| పత్రికల నిలువ - - - - | 2327 | 8 | 0 | | | |
| కాగితములు నిలువ - - - - | 136 | 4 | 0 | | | |
| | | | | 2633 | 2 | 6 |
| పుస్తకముల నిలువ:— | | | | | | |
| బైండువి - - - - | 1798 | 11 | 0 | | | |
| బైండుకానివి - - - - | 1318 | 12 | 0 | | | |
| | | | | 3117 | 7 | 0 |
| బ్యాంకివడ్డీ - - - - - | 769 | 7 | 4 | | | |
| వి. పి. పోస్టేజి - - - - - | 18 | 6 | 0 | | | |
| చిల్లరజమ - - - - - | 2 | 12 | 0 | | | |
| ఇతర ముద్రణము - బైండింగు - - - | 11 | 0 | 0 | | | |
| ఉచితముగా వచ్చిన పుస్తకములు - - - | 61 | 13 | 0 | | | |
| | | | | 863 | 6 | 4 |
| మొత్తము - | | | | 7097 | 15 | 10 |

గుమ్ముడూరి వేంకటరంగరావు,

కార్యదర్శి.

పరిషత్కార్యక్రమము మిటీవలఁ జప్పచప్పగా నున్నదని కొందఱయభిప్రాయము. అది కొంతవఱకు నిజమే. పరిషత్పత్రికలోఁగూడఁ గొన్ని మార్పులు చేయవలసియున్నవి. ఈలోపములకు ధనాభావమే ముఖ్యకారణము. ఇప్పుడు నిలువయున్న మూలధనమునకు వచ్చువడ్డియు సాధారణసభ్యు లిచ్చుచందాలును సాధారణవ్యయములకే చాలకున్నవి. కొందఱీయవలసిన చందా లింకను రావలసియే యున్నవి. ఇంతవఱకు ధనవంతులగు జమీందారులనే మనము యాచించి ధనము సంపాదించియున్నాము. జనసామాన్యముతోడ్పాటు మిక్కిలి తక్కువగా నున్నది. ఇది ప్రబలినఁగాని యట్టి ఘనోద్యమములు చక్కగా నడువవు. వంగీయసాహిత్యపరిషత్తులో రెండువేలకెక్కుడు చందాదారు లున్నారఁట. వారివలన సంవత్సరమునకు పండ్రెండు వేలరూపాయలకుఁ బైఁగా నాదాయమువచ్చుచున్నది. రెండుకోట్ల జనసంఖ్యగల యాంధ్రసంఘములో రెండు వేలచందాదారులు పరిషత్తునకు దొరకుట యశక్యముకాదు. కాని పాటుపడి ప్రయత్నముచేసి సంపాదింపవలయును. ఈసంపాదనకార్య మొకరిద్దఱిమీఁదఁ ద్రోసివేయక భాషాభిమాను లందఱును బూనుకొనవలసినది. పరిషత్కార్య మొకరియింటిపెండ్లికాదు. అందఱికార్యమును. దృఢమైన భాషాభిమానమును బట్టుదలయుఁగలిగి పనిచేయువారైదాఱుగురుచాలును. వారుకలసి యూరూరునకుఁబోయి యత్నించినయెడలఁ బెక్కురు చందాదారులను సంపాదింపవచ్చును. వచ్చిన చందాలనుబట్టి కార్యక్రమమును వృద్ధిచేయవచ్చును. కాఁబట్టి యీవిషయమై తగుయత్నము చేయుటకై భాషాభిమానులు పూనుకొందురని నమ్ముచున్నాము.

---

# మొదటి యనుబంధము.

శ్రీసూర్యరాయాంధ్రనిఘంటునిర్మాణము.

రుధిరోద్గారిసంవత్సరము (1923-24 సం.) కార్యనివేదిక.

దుందుభి సంవత్సరకార్యనివేదికలోఁ దెలుపఁబడిన ప్రకారమే తత్సమ పద విమర్శనము జరుగుచున్నది. ది 1-4-1923 సం॥ మొదలు ది 1-4-1924 సం॥ వఱకు విమర్శింపఁబడి గ్రహింపఁబడిన తత్సమ పదములసంఖ్య ౧౩౬౪౪. ఇంతకుమున్ను విమర్శింపఁబడినవి ౧౧౪౯౦ మొత్తము ౨౩౩౩౪ ఇరువదిమూఁడు వేలు మున్నూట ముప్పదినాలుగు తత్సమపదములు, అచ్చునకు సిద్ధముగా నున్నవి. ప్రస్తుతము నకారాదిపదముల విమర్శజరుగుచున్నది.

తత్సమేతరశబ్దముల విమర్శించుట యనుకార్య మీ సంవత్సర మారంభమైనది. కార్యాంతర వ్యగ్రతచేతను, శరీరారోగ్యము చక్కఁగ లేకుండుట చేతను, సంపాదకుఁ డీవిషయమై తదేకనిష్ఠఁ బనిచేయుట కనుకూలపడినది కాదు. శీఘ్రకాలములోనే తిరిగి పని యారంభించి పూనికతోఁ బనిచేసి యచిర కాలమందే యకారాదిశబ్దము లొక సంపుటముగాఁ బ్రకటింపవలయునని యుత్సహించుచున్నాము. దైవము తోడ్పడుఁగాక.

ఈసంవత్సరములో నిఘంటువిషయమై యయినవ్యయము.

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| జీతములు | .. | .. | .. | 2615 | 9 | 6 |
| కాగితములు | .. | .. | .. | .. 62 | 8 | 0 |
| చిల్లరవ్యయము | .. | .. | .. | .. 32 | 12 | 6 |
| ఇంటియద్దె | .. | .. | .. | 180 | 0 | 0 |
| | | | | 2890 | 14 | 0 |

# రెండవ యనుబంధము.

1. అభినవసరస్వతి—జానపాడు—గుంటూరుజిల్లా.
2. రవి—కాకినాడ.
3 ఆంధ్రపత్రిక—చెన్నపురము.
4. కృష్ణాపత్రిక—బందరు.
5. సుదర్శని—నరసాపురము.

6. ధర్మసాధని—గుంటూరు.
7. వైఖానసపత్రిక—ఈగావారిపాళెము—చెంగల్పట్టుజిల్లా.
8. పంచానన—సోంపేట—గంజాము.
9. ఆయుర్వేదసమ్మేళనపత్రిక—ఏలూరు.
10. కర్ణాటగ్రంథమాల—మైసూరు.
11. క్షత్రియపత్రిక—ఈగావారిపాళెము.
12. త్రిలింగ—చెన్నపురము.
13. ఆంధ్రభాషావిలాసిని—చిత్రాడ.
14. నవ్వులతోట—బందరు.
15. మాతృసేవ—నంద్యాల
16. శ్రీవైష్ణవపత్రిక—పెంటపాడు, కృష్ణాజిల్లా.
17. పినాకిని—అనంతపురము.
18. వర్ణాశ్రమధర్మసంస్థాపని—కావలి.
19. మీమాంస—తెనాలి.
20. మధురభాషిణి—తెనాలి.
21. విద్యార్థి—బెజవాడ.
22. హిందూయువతి—తిరువలిక్కేణి—చెన్నపురము.
23. నీలగిరి—నల్లగొండ—నైజాం.
24. కళ—చెన్నపురము.
25 రామకోటి—కెలమంగలం—సేలము.
26. స్వరాజ్యపత్రిక—బెజవాడ
27. సారస్వతసర్వస్వము—తణుకు—కృష్ణా.
28. సరస్వతి—ముక్త్యాల—కృష్ణా.
29. రెడ్డిరాణి—వెదురుపాక రాయవరము—గోదావరి.
30. ధన్వంతరి—చెన్నపురము.
31. కర్ణాటసాహిత్యపరిషత్పత్రిక—బెంగుళూరు.
32. ప్రబుద్ధాంధ్ర—వెదురుపాక రాయవరము—గోదావరి.
33. పాఠశాలాపత్రిక—గుంటూరు.
34. సాహితి—బెజవాడ.

# ఆంధ్రసాహిత్య పరిషత్పత్త్రిక.

సంపుటము ౧౩. | రక్తాక్షి నామసంవత్సరము. మార్గశిర - ఫాల్గునమాసములు. | సంచిక ౫-౬.

## వైశంపాయనుఁడు.

౧. శ్రీకరంబై 'విదిశ' యనునగర మొకటి వెలయుచుండెను. దానికొక రాజుండెను. అతని పేరు శూద్రకమహారాజు. ఆయన యౌవనవంతుఁడు. అయినను నారీపరాఙ్ముఖుఁడు. నిరంతర మతనికి వేఁటయం దెక్కువప్రియము. ఒకనాఁ డాతఁడు నిండుకొలువున నుండెను. ఆసమయమున నొక మాతంగవనిత యట కరుదెంచెను. ఆమె మిక్కిలి చక్కనిది. ఆమెచేతిలో నొకబంగారుపంజర ముండెను. అందొక చక్కనిచిలుక యుండెను. అది సామాన్యమైనచిలుక కాదు. మాట లెఱుంగును. పూర్వజ్ఞానము కలది. సకలకలాజ్ఞానము కలది. పంజరమును సభామధ్యమున నుంచి యాకన్యక వెడలెను. అనంతర మా చిలుక రాజునుజూచి ముద్దులొలుకుపలుకులతో ఋషులాశీర్వదించునట్లు వింతగా దీవించెను.

రాజాయాశీర్వచనమును వినియెను. ఆనందపరవశుఁడై యాశ్చర్యరసమగ్నుఁడై చిలుకను జూచి "ఓ చిలుకా! నీయుదంత మేమి? ఎందుజన్మించితివి? ఎచ్చటఁ బెరిఁగితివి? తలిదండ్రు లెవ్వరు? ఎట్లు శాస్త్రజ్ఞుఁడవైతివి? పూర్వ మెచ్చోట నుంటివి? వయస్సెంత? పంజరబంధ మెట్లుకలిగెను?" అని యడిగెను. చిలుక యిట్లు పలుకఁదొడఁగెను.

వింధ్యపర్వతసమీపమున నొకగొప్పయరణ్యము కలదు. అందొక శాల్మలీవృక్షమున్నది ఆవృక్షకోటరమున నేను నాతండ్రితో నివసించుచుంటిని. నేను జన్మించినపుడే ప్రసవవేదనాతిశయముచే నాతల్లి లోకాంతరమున కేగెను. తండ్రిసైతము కాలవశమున శబరహస్తగతుఁ డయ్యెను. ఆఁకలిబాధ కోర్వక వృక్షమునుండి క్రిందఁబడి నేను పరితపించుచుంటిని. అప్పుడొకఋషికుమారుఁ డటకు

వచ్చెను అతఁడు మహాత్ముఁడు. భూతదయ కలవాఁడు. నాకు మంచి యాహార పదార్థములు నిచ్చెను. చల్లనిజలము త్రాగించెను. అందువలన నాశ్రమమంత యుఁ దొలఁగెను. అనంతరమాయన తనయాశ్రమమునకు నన్నుఁ గొనిపో యెను. ఆయాశ్రమసౌందర్యము వర్ణింప నాదిశేషునికైనఁ దరముకాదు. అచట నుండుఋషులు మూర్తీభవించిన శాంతదేవతలు. నన్నుఁ దీసికొనిపోయిన ఋషి కుమారునితండ్రికూడ నట నుండెను. ఆబ్రహ్మఋషి దివ్యదృష్టిచే నావృత్తాంత మంతయు నెఱింగెను. పకపక నవ్వఁదొడఁగెను. అది చూచి యచటిఋషు లందఱు నాతనితో నిట్లనిరి. ''స్వామీ! ఈచిలుక పూర్వజన్మమున నెట్లుండెను? ఇప్పుడేల యిట్లయ్యెను? ఇఁక నేమగును?'' అనిన నామహర్షి యిట్లు చెప్పనారం భించెను

౨. 'ఉజ్జయిని' అని యొకపట్టణము కలదు. అది సకలసంపదల కాలవా లంబు దానికిరాజు 'తారాపీడుఁడు' అతనికొకమంత్రి యుండెను. ఆయనపేరు శుకనాసుఁడు. రాజుభార్యపేరు విలాసవతి. మంత్రిభార్యపేరు మనోరమ. ఆహా! వారిసంపదలు! వారివిలాసములు! వారిసద్గుణగణములు! పొగడుట కెవరితరము! అయినను వారికొక కొఱంత యుండకపోలేదు. చిరకాలమునఱకు వారికి సం తానభాగ్యము కలుగలేదు ఇట్లుండఁగా నొకనాఁటిరాత్రి రాజు తనభార్య వదనమున సకలకలాపరిపూర్ణమండలుఁడగు చంద్రుఁడు ప్రవేశించినట్లు స్వప్న ముం గాంచెను.

అప్పటినుండి రాజుభార్య యగువిలాసవతి గర్భవతి యయ్యెను. క్రమ క్రమముగా ప్రసవసమయము వచ్చెను. ఒకదినమున నామెకు సకలలోకహృద యానందకరుఁడగు కుమారుఁ డుదయించెను. అది ప్రశస్తవేళ. ఆబిడ్డసౌందర్య మును వర్ణింప నలవికాదు. ఆసమయముననే మంత్రిభార్యయైన మనోరమసహిత మొకకుమారునిం గనియెను. ఆబిడ్డఁడు నందకాఁడె. ఆహా! ఏమికల్యాణ పరంపర! వారిమనోరథసిద్ధి యయ్యెను. పదిదినములు కాఁగానే పుణ్యముహూర్త మున యథావిధిగా బిడ్డలకు జాతకర్మనామకరణాది శుభక్రియాకలాపంబులు నిర్వర్తించిరి. రాజకుమారునికి ''చంద్రాపీడుఁ'' డనిపేరు పెట్టిరి. మంత్రికుమా రునికి వైశంపాయనుఁ డనిపేరిడిరి.

కుమారులిరువురును దినదినప్రవర్ధమానులైరి, బాల్యముననే సమస్తవిద్యల నవలీలగా నెఱింగిరి. అనంతరము వారిశరీరమున యౌవన మంకురించెను. రాజు తనకుమారుని యౌవరాజ్యమునఁ బ్రతిష్ఠించెను. అప్పుడు పారశీక

దేశపురాజు గుఱ్ఱమునొకదానిని చంద్రాపీడునికి బహుమానమొసంగెను. దాని పేరింద్రాయుధము. అది గుఱ్ఱముకడుపులోనుండి జన్మించినదికాదు. మఱియెట్లందురా? సముద్రమునుండి పుట్టెను. ఆ గుఱ్ఱము జ్ఞానసంపద కలది మహా వేగము కలది. రాజకుమారుఁడా గుఱ్ఱము నెక్కి స్వారిచేయుచుండెను. ఇట్లుండ విలాసవతి యొకరాజకన్యకను చంద్రాపీడునికిఁ దాంబూలకరంకవాహినిఁగా నుండుటకై పంపెను. ఆకన్యక మిక్కిలి యందకత్తె 'పత్రలేఖ' యనునది యామె పేరు. రాజకుమారుఁడామెను మిక్కిలి ప్రేమించి సగౌరవముగాఁ దన కడ నుంచుకొనెను. ఆమెయు సానురాగయై యతని సేవించుచుండెను.

ఒకనాఁడు రాజకుమారుఁడును మంత్రికుమారుఁడును సపరివారులై గుఱ్ఱముల నెక్కి దిగ్విజయమునకై బయలుదేఱిరి. పత్రలేఖకూడ రాజ కుమారునితోఁ జనియెను. వారు జయింపనిదేశము లేదు. ప్రపంచమందలి రాజులందఱు చంద్రాపీడుని కరిగాపులైరి. ఒకప్పుడు సువర్ణపురమను కిరాతనగ రమునకు వచ్చి స్కంధావారము నట విడియించెను. శ్రమపరిహారార్థము కొన్నిదినము లచట నుండెను. ఒకదినము రాజకుమారుఁడు పరివారము నచ టనే నిలిపి తానుమాత్రము గుఱ్ఱమెక్కి వయాళి వెడలెను. అటనొక మహా పర్వతముమీఁద నొకకిన్నరమిథునముండెను. దానింబట్టుకొనవలయునని రాజ కుమారుఁడు తలంచెను. గుఱ్ఱమెక్కి వెంబడింపఁగా నామిథునము రాజకుమా రునికిఁ జిక్కక యేఁబదియోజనముల దూరము పరువెత్తి తరువాత మాయమై పోయెను. రాజకుమారుఁడు దుఃఖించెను. యోజింపక యంతదూరము వచ్చి నందుకై తన్నుఁదాను నిందించుకొనియెను. కాని యతనిప్రయత్నము వ్యర్థము కాలేదు. మఱియొకవిధముగా సఫలమయ్యెను.

అచట నొక చెఱువు కలదు. దానికి "అచ్ఛోదము" అనిపేరు. అందలి నీరు నిర్మలమై యుండెను. రాజకుమారుఁడా చెఱువులో స్నానమాచరించి నీరాని దప్పితీర్చుకొనియె. గుఱ్ఱమును నీరుద్రావించి పరిసరతరుమూలమునఁ గనకశృంఖ లచే బంధించి సమీపమందలి గడ్డిని దానిముందువైచి తానొక వృక్షచ్ఛా యను విశ్రమించెను. అప్పుఁడొక సంగీతధ్వని యాతని కానందము గలిగింప వినవచ్చెను.

3. అందువలన నతఁడు గుఱ్ఱము నెక్కి శబ్ద మేదిక్కునుండి వచ్చుచు న్నదో యచటికి వెడలెను. అట్లు వెడలఁగా నొక శివాలయము దాని యెదుట

నొకమండపమునం దొక దేవకన్యక దేవుని స్తోత్రముచేయుట చూచెను. ఆమె కంఠస్వర మతిమనోహరమై శ్రావ్యమై యుండెను. స్వరమున కనుగుణముగా నామెరూపమునుం జక్కగానుండెను. రాజకుమారుఁ డిట్లాలోచించెను. "ఆశ్చర్యము! సర్వేశ్వరునిమాయ లతిగూఢములు! ఈకాంతారత్నము నవయౌవనవతి, రూపమో వర్ణింపనలవిగాక యున్నది అదియుఁగాక యీమె వేల్పుటింతి వలెఁ గనఁబడుచున్నది. సుకుమారమగు నీవయస్సున కాయక్లేశకర మగు నీకఠినవ్రత మనుష్ఠించుటకుఁ గారణమేమి? ఏదియో యొకమహాకారణ ముండి తీరవలయును."

ఇట్లాలోచించుచుండఁగా నామెభజనము ముగించి రాజకుమారుని సాదరముగాఁ జూచి "భద్రుఁడా! రమ్ము. అతిథిసత్కారముల నందు" మనియెను. చంద్రాపీడుఁడు "తల్లీ సంభాషణమాత్రముననే ధన్యుఁడనైతి"నని సగౌరవముగా నమస్కరించి యామెను వెంబడించెను. ఆమె తనయాశ్రమంబునకు వెళ్లి యొకచంద్రకాంతశిలమీఁద చంద్రాపీడుని గూర్చుండనియోగించి వన్యఫలాహారాదు లొసంగెను. పరిసరసరోవరమునుండి జలముఁ దెచ్చియిచ్చెను. అతిథిసత్కారముల వందనపురస్సరముగా నందికొని పరమానందభరితుఁడై చంద్రాపీడుం డిట్లుపలుక నారంభించెను. తల్లీ! నీవింతచరిత్రము నాకాశ్చర్యము కలిగించుచున్నది. ఏగంధర్వకులము, లేక, యేదేవవంశము నీవుజన్మించుటచేఁ బవిత్రమైనది? ఈకుసుమసుకుమారమైన నవయౌవన మెక్కడ? తప మెక్కడ? అమానుష్యమగు నీయరణ్యమున నివసించుటకుఁ గారణమేమి? అనిన నామె యిట్లుపలుక నారంభించెను.

ఆయుష్మంతుఁడా! ఈదీనురాలివృత్తాంతమును వినుము. " హంసుఁడను గంధర్వరాజొకఁడు గౌరియను నొకకన్యారత్నమును బరిణయమయ్యెను. వారిద్దఱకు నేను జన్మించితిని. ఇతరసంతానము లేకపోవుటచేతను సౌందర్యాతిశయముచేతను దలిదండ్రులు నన్నుఁ గడుగారాబముతోఁ బోషింపసాగిరి. నాకు "మహాశ్వేత" యనిపేరు. 'తరళిక' యనునాచెలికత్తెయొకతె కలదు. దినక్రమమున నాశరీరమున యౌవన మంకురించెను. ఇదిగోఁ జూడు, మీకొలనునకు స్నాన మాచరించుటకై యొకనాఁడు సఖీద్వితీయనై యరుదెంచితిని. ఇందు స్నానముచేయుటకే మునికుమారుఁడుసహిత మొకఁడు తనచెలికానితో వచ్చెను. అతనిపేరు పుండరీకుఁడు. చెలికానిపేరు కపింజలుఁడు. పుండరీకుని ముఖము పుండరీకమును జయించునది. అట్టియందకాఁడు ముల్లోకములయం

దును లేఁడు భగవంతుఁడా! ఈమనోహరుని నాకుఁ బతిఁ జేయు" మని మనస్సున దేవుని ధ్యానించుచు నింటి కేగితిని. నావలెనే మునికుమారుఁడు సహితము నన్నుఁ బ్రేమించి చెలికానిమూలమున నుత్తరమొకదాని వ్రాసి నాకుఁ బంపెను. తలిదండ్రులయనుమతి వడయవలయు ననిన నాలస్యమగు నని యెంచి తరళికాద్వితీయనై మునికుమారుఁడుండు నరణ్యమునకు వచ్చితిని. నేనువచ్చు నంతలో మనోజవేదనఁ దాళఁజాలక పుండరీకుఁడు పరలోకగతుఁడయ్యెను. కపింజలుఁడు పలువిధములుగా విలపించుచుండెను.

సమీపమునకు వచ్చితిని. ప్రియుమరణమునుజూచి మరణైకనిశ్చితనై తరళికనుగాంచి "సఖీ! లెమ్ము చితిఁ బేర్పుము. జీవితేశ్వరు ననుసరించెద" నంటిని. ఇంతలో నొకయాశ్చర్యము సంభవించెను. చంద్రమండలమునుండి దివ్యాకృతి గల పురుషుఁ డొకఁడువచ్చి పుండరీకునికళేబరమును బట్టుకొని నన్నుఁ జూచి "బిడ్డా! మహాశ్వేతా! ప్రాణములను వదలకుము. మరల నీకు నీప్రియునితో సమాగమము కలుగును" అని పుండరీకునిశరీరమును దీసికొని గగనతలమున కెగసిపోయెను. కపింజలుఁ డాదివ్యపురుషునిఁ జూచి "ఓరీ! దురాత్మా! ఎచటికి నావయస్యుని దీసికొనిపోయెద?" ననుచు నాతని వెంబడించెను. చూచుచుండఁ గానే వారందఱుఁ దారాగణమధ్యప్రదేశముం జొచ్చిరి.

నాదుఃఖము ద్విగుణమయ్యెను "ఇఁక నాజన్మ మెందుకు? తలిదండ్రు లెందుకు? సౌఖ్యము లెక్కడివి?" అని యాలోచించి యాభరణాదులను బరిత్యజించి యీవేసమును ధరించితిని. ఆపుండరీకునిదే యీయక్షమాల, ఆతనిదే యీకమండలువు, నాఁటినుండి బ్రహ్మచర్యవ్రతనై యీస్థాను నాశ్రయించి యిక్కడనే నివసించుచున్నదానను. తలిదండ్రులు నాయొద్దకేతెంచి గృహాగమనమునకై బహుభంగులఁ బ్రయత్నించి దృఢనిశ్చయనగు నన్నువదలి నిరాశులై సశోకులై మరలిపోయిరి. అనియిట్లు తనవృత్తాంతమును జెప్పుచునే యాసాధ్వినయనారవిందములనుండి వెలువడుబాష్పకణములు ముక్తాహారములను విడంబింప ముక్తకంఠయై యేడ్వ నారంభించెను.

చంద్రాపీడుఁ డామెను బహువిధోపాయములచే నోదార్చెను. అనంతర మామె మెల్లగా లేచి సంధ్యోపాసన మొనరించి కమండలుజలముచేఁ బ్రక్షాళితచరణకమలయై వల్కలశయనమునఁ గూర్చుండెను. చంద్రాపీడుఁడు "తల్లీ! నీచరిత మతివిచిత్రమై యున్నది. సఖియగుతరళిక యెచటి కేఁగెను. దోషము కాదేని వినిపింపుమని ప్రార్థించిన మహాశ్వేత యిట్లు చెప్పందొడంగెను.

౪. గంధర్వకులమున "చిత్రరథుఁడు" అను మఱియొకరాజు కలఁడు. ఆయన గంధర్వరాజలోకసార్వభౌముఁడు. సమీపముననే యుండు హేమకూటమనుపర్వత మతని నివాసస్థానము. అతఁడు మదిర యనుకన్యకను బెండ్లియాడెను. వారికొక చక్కనిస్త్రీశిశువు పుట్టెను. ఆబిడ్డకు "కాదంబరి" యని పేరిడిరి. కాలక్రమమున నాశిశురత్నము యౌవనవతి యయ్యెను. చిన్ననాఁట నుండియు మేమిరువురముఁ బ్రాణసఖుల మై యుంటిమి. నా యీచరితమును విని యామె బెంగపెట్టుకొని యున్నది. తలిదండ్రు లోదార్పలేక వ్యర్థమనోరథులై తుదకు నాకడకు వార్తపంపిరి. ఆమెకు ధైర్యముచెప్పి యోదార్చుటకై నాచెలికత్తెయగు తరళికను బంపితిని.

ఇట్లు మహాశ్వేత చెప్పుచుండఁగా దినకరుఁ డపరగిరి కేగెను. రాత్రియగుడు, మహాశ్వేత శయనించెను. చంద్రాపీడుఁడు దవ్వుననుండు నొకచంద్రకాంతశిలమీఁదఁ బవ్వళించెను.

తెల్లవాఱిన వారిద్దఱు లేచి సంధ్యనుపాసించి కూర్చుండిరి. ఆసమయమున హేమకూటమునకుఁ బోయియుండిన తరళిక యొకయువకుని వెంటఁబెట్టుకొనివచ్చెను. మహాశ్వేతను జూచి "భర్తృదారికా! కాదంబరినిఁ జూచితిని. నీవానతిచ్చిన సందేశము నివేదించితిని. ఆమె బదులుపలికినవిధము నీయువకుఁడు చెప్పఁగలఁడు. ఈతఁడు కాదంబరికి వీణావాహకుఁడు. ఇతనిపేరు కేయూరకుఁడు" అని తరళిక విన్నవించి విశ్రమించెను. అంతట కేయూరకుఁ డిట్లు చెప్పఁదొడఁగెను.

తల్లీ! మహాశ్వేతా! ఆమె యెవ్వరిమాటల నాలకింపదు. ఆమెమనస్సును బాగుపఱుచుటకు నీవే సమర్థవు. నీ వీక్షణమున రానిచో నామె జీవించుట దుర్లభము. అనిన మహాశ్వేత యాలకించి "అహో! ఎంతకష్టము కలిగెను. నాచెలిని నేనేవచ్చి యోదార్చెదను" అని కేయూరకుని బంపి చంద్రాపీడునిజూచి భద్రుఁడా! రమ్ము గంధర్వలోకమునకు; మన్నిర్విశేషయగు కాదంబరినిఁ జూచి సఫలమనోరథుఁడ వగుము. హేమకూటము రమణీయముగా నుండును. చిత్రరథునిరాజధాని యతిచిత్ర మని పలికెను. అందుకుఁ జంద్రాపీడుఁడు తల్లీ నీవాజ్ఞాపించినట్ల యని పల్కి యామె వెంటనే గుఱ్ఱము నెక్కి పయనమయ్యెను.

అట్లు వెడలి హేమకూటమును బ్రవేశించి గంధర్వరాజకులమును దర్శించి కన్యాంతఃపురము ప్రవేశించిరి. అట శ్రీమండపమధ్యభాగమున నొకశయ్యపైఁ

గాదంబరి పవ్వళించియుండెను, ఆప్రదేశము కనులపండువై యుండెను. అందలియువతీరత్నము లందఱు స్వర్ణప్రతిమలను దిరస్కరించురూపముకలవారు. కాదంబరిరూపము మిక్కిలిరమణీయమై యుండెను చంద్రాపీడుఁడామెనుజూచి యనంగబాధాపరవశుఁ డయ్యెను. కాదంబరియు నాతనిఁ జూచి ప్రేమించెను. మహాశ్వేతను జూడఁగానే కాదంబరి నిర్భరానందవివశయై యామెను గౌఁగిలించుకొనియెను. శోకముతొలఁగి మహాశ్వేతను, చంద్రాపీడుని సగౌరవముగా నాదరించెను. వారిరువురు నాదినమంతయు నచటనే యుండిరి. మఱునాఁడు కాదంబరియొద్ద సెలవు గైకొని నిర్గమించిరి. చంద్రాపీడుని మనస్సంతయుఁ గాదంబరిమీఁదనే యుండెను. ఆమెసహితము చంద్రాపీడునే స్మరించుచుండెను. ఇట్లుబయలుదేఱిన యారాజకుమారుఁడు మహాశ్వేతయాశ్రమము నగ్గఱఁ దన్ను వెదకుచువచ్చియుండు తనసైన్యమును వీక్షించెను. వైశంపాయనుఁడును బరిజనమును చంద్రాపీడునిఁజూచి సంతసించిరి.

ఇట్లు రాజకుమారుఁడు స్కంధావారమున వైశంపాయనునితోను, పత్రలేఖతోను ముచ్చటించుచుఁ బ్రతిక్షణమును మహాశ్వేత యిట్టిది, కాదంబరి యిట్టిది యని వారివాత్సల్యమును రూపములను బొగడుచుండ నొకదినము గడచెను. మఱునాఁటియుదయమున, కేయూరకుఁడు మహావేగముతో వచ్చి చంద్రాపీడునిఁ జూచి "ఆయుష్మంతుఁడా! నీవురానిచో, కాదంబరి బ్రతుకుట దుర్లభము" అని విన్నవించెను. చంద్రాపీడుఁ డావార్త నాలకించి ససంభ్రమముగ నింద్రాయుధము నెక్కెను. తనవెనుక పత్రలేఖ నెక్కించుకొనెను స్కంధావారము నచటనే యుండనియోగించి కేయూరకునితోఁగూడ హేమకూటమునకుఁ జని కాదంబరిని దర్శించి సంతసించెను.

ఇంతలో కేయూరకుఁడు కాదంబరినిఁ జూచి 'తల్లీ యీమె చంద్రాపీడుని తాంబూలకరంకవాహిని. 'పత్రలేఖ' యని యీమెకుఁ బేరు' అనివిన్నవించెను. కాదంబరి పత్రలేఖను గౌఁగిలించుకొని యామెసౌందర్యమున కాశ్చర్యపడి "ఆహా! మానవులయందు విధాతకెంతపక్షపాతము! దేవకన్యకలుకూడ నీమెను బోలరుకదా!" యని తలంచెను. బహుదినములపర్యంతము పత్రలేఖాచంద్రాపీడులు కాదంబరిగృహమున నుండిరి. తనయందు గాఢానురాగముగల కాదంబరి నెట్టకేలకువదలి చంద్రాపీడుఁడు బయలుదేఱెను. కాదంబరి ప్రార్థించుటచే పత్రలేఖను హేమకూటముననే నిలిపెను, వారిరువురును వేడుకగాఁ గాలము గడపుచుండిరి. రాజకుమారుఁడు స్కంధావారముం బ్రవేశించెను.

పత్త్రలేఖ యిదియంతయు నెఱింగెను. దుఃఖావేశపరవశయై యింద్రాయుధమును మున్నిడికొని అచ్ఛోదసరోవరమునఁ బ్రవేశించి మగ్నయై తిరోహితయయ్యెను. అశ్వముసహితము మాయమైపోయెను. కింకర్తవ్యతామూఢులై యొకరిముఖము నొకరుచూచుచు నితరులు నిలుచుండిరి.

అప్పుడొకయాశ్చర్యము సంభవించెను. ఆసరస్సునుండి కపింజలుఁడు వెలువడి మహాశ్వేతనుజూచి నేనెవ్వఁడనో నీకు జ్ఞప్తియున్నదా? అనియడిగినాఁడు. మహాశ్వేతయు సంతోషముతో నెదురేగి భక్తితో నమస్కరించి స్వామీ మిమ్ము నేను మఱతునా? నాయనోనాయకుని ప్రియవయస్యులు కారా? తమపేరు కపింజలమహామునులుగదా? తమప్రియుఁడును నాయనోనాయకుఁడు నగు పుండరీకుఁ డిపుడెచ్చటనున్నాఁడు? అతనివృత్తాంతమేమి?" అనియడుగఁగా నాతఁడిట్లు పలికెను.

మహాశ్వేతా! ఆలకింపుము. నీవుచూచుచుండఁగానే పుండరీకునినిర్జీవకళేబరమును గొనిపోవుచున్న దివ్యపురుషుని వెంబడించి గగనతలమున కెగసిపోయితినిగదా! ఆయన చంద్రమండలమును బ్రవేశించెను. అచట 'మహోదయము' అనుపేరుగల దివ్యసభ యొకటి యుండెను. అందలి యిందుకాంతమయపర్యంకమున నాదివ్యపురుషుఁడు కూర్చుండి నన్నుఁజూచి యిట్లుపలికెను. కపింజలా! నన్ను చంద్రునిగా నెఱుంగుము. నీనెచ్చెలియగు పుండరీకుఁడు నిష్కారణముగా నన్ను "దురాత్ముఁడా! ఇందుహతకుఁడా! నేను నీకరములచే సంతాపింపఁబడినవాఁడనై యిదిగోఁ బ్రాణములను వదలుచున్నాఁడను. అట్లే నీవుసహితము భారతవర్షమున జన్మింపుము. అలబ్ధసమాగమసుఖుఁడవై తీవ్రతరహృదయవేదనల ననుభవింపుము. అనంతరము ప్రాణములను వదలుము" అని, శపించెను. నిష్కారణముగాఁ గలిగినశాపమునకై నేను రోషారుణితనేత్రుఁడనై పుండరీకునిజూచి నీవుసైతము మత్తుల్యసుఖదుఃఖములపాలగు మని ప్రతిశాపమిచ్చితిని. అనంతరము మహాశ్వేత నూఱడించి పుండరీకునిశరీరమును గొనివచ్చితిని. స్వయంకృతదోషముచే వీఁడు నాతో మర్త్యలోకమున జన్మించి వారద్వయముండును. అంతదనుక నీశరీరమున కేహానియు సంభవింపదు. కావున నీవు పొమ్ము. అని చంద్రుఁడు చెప్పఁగా విని మఱలివచ్చుచుంటిని.

మార్గమున మహాకోపియగు వైమానికుఁడొకఁడు వచ్చుచుండెను. నే నాతనిఁజూడక యడ్డుపెట్టినందున వాఁడు కోపగించి నన్ను గుఱ్ఱముగా జన్మింపుమని శపియించెను. నేను బ్రార్థింపఁగా శాపావధిఁ గరుణించెను. అందువలన

నేను గుఱ్ఱముగా జన్మించితిని. ఆగుఱ్ఱమే చంద్రాపీడుఁ డెక్కి స్వారిచేయుచుండిన యింద్రాయుధము. ఆచంద్రుఁడే కాదంబరీప్రియుఁడగు చంద్రాపీడుఁడు. ఆ పుండరీకుఁడే మంత్రికుమారుఁడైన వైశంపాయనుఁడు. వానిని శపించితివి. అందు వలన వాఁడు చిలుకయై పోయెను. అనియీవిధముగాఁ గపింజలుఁడు తనపోయి వచ్చినవృత్తాంతమును విన్నవించెను.

"ఏమియాశ్చర్యము! నాప్రియుఁడగుపుండరీకుఁడా వైశంపాయనుఁడు? హా దేవ! జన్మాంతరమునసైతము నన్ను మఱవక ప్రేమించితివి. పాపాత్మురాల నగు నేనే నీపాలిటికి రాక్షసి నైతిని" అని మహాశ్వేత రోదనముచేయ నారంభించెను. "కల్యాణి! శోకమును వదలుము. అచిరకాలముననే మీకు మంగళ మొనఁగూడును" అని కపింజలుఁడు మహాశ్వేత నోదార్చి చంద్రాపీడవైశంపాయనుల వృత్తాంతముల నెఱుంగుటకై వెళ్లెను.

ఇదియిట్లుండ, నుజ్జయినీపురమున తారాపీడమహారాజున కీవృత్తాంతము తెలియవచ్చెను. అందువలన నతఁడు మంత్రిపరిజనపరివృతుఁడై మహాశ్వేతాశ్రమమునకు విలాసవతితోఁగూడి వచ్చెను. రాజును రాణియు నొక్కపెట్టున విలపించిరి. శుకనాసుఁ డతని కనేకపురాణోక్తులను, సర్వేశ్వరుని మాయలను, ప్రపంచమునస్థిరత్వమును బోధించెను. అందువలన వారు తెలివిఁజెంది విలపించుటమాని యచ్చోటనే నివసించుచుండిరి.

౭. పాఠకులార! ఈకథ యత్యద్భుతమైన దని చదువుచుండు మీరే గ్రహింపఁగలరు. జ్ఞప్తియందున్నదా? ప్రథమాధ్యాయమున నీకథ నొకచిలుక శూద్రకుఁడను మహారాజునకుఁ జెప్పుచున్నది. ఆచిలుక చెప్పునట్టికథనే ఋషిశ్రేష్ఠుఁడొకఁడు తక్కినఋషులకుఁ జెప్పినట్లుసహితము పఠించితిమి. ఆచిలుక పేరుకూడ వైశంపాయనుఁ డని మీకుజ్ఞాపక మున్నది. అది శూద్రకమహారాజును జూచి యిట్లనెను.

రాజా! ఆఋషీశ్వరుఁ డీకథచెప్పుచుండఁగానే తెల్లవాఱెను. "అహో! రజని ప్రభాతప్రాయ" యని నుడివి యాయన స్నాన మాడుటకై వెళ్లెను. తక్కిన ఋషులుకూడ నతనిని వెంబడించిరి. ఆకథను వినుచుండఁగా నాకుఁ బూర్వజ్ఞానము కలిగెను. అదేసమయమునఁ గపింజలుఁ డచటికివచ్చి నన్నుఁ జూచి ప్రేమించి చిరకాలము నాస్పర్శసుఖ మనుభవించి, యచ్చోటనేయుండు మనిచెప్పి ఋషిజనశుశ్రూషకై వెళ్లెను.

నేను సంచరించుచుండఁగాఁ గ్రిష్మకాలమున బోయవాఁడొకఁడు నన్నుఁ బట్టుకొని యాకనకపంజరమున నునిచి మాతంగకన్యకహస్తమున నప్పగించెను. ఆమె నీచేతికిచ్చెను. ఓరాజా! మహాశ్వేతను గామించిన పుండరీకుఁడను నేనే. శుకనాసమంత్రికుమారుఁడైన వైశంపాయనుఁడను పేరితో మరల మహాశ్వేతను గామించి "చిలుకవుకమ్ము" అని యామెచే శపింపఁబడినవాఁడను నేనే.

శీతకరుఁడు పుండరీకుని శాపముచేఁ దారాపీడమహారాజునకు చంద్రాపీడుఁడను పేరితో జన్మించి, కాదంబరిని గామించి ప్రియమిత్రుఁడగు వైశంపాయనునిమరణవార్తను వినఁగానే ప్రాణములను వదలెనుగదా! ఆచంద్రాపీడుఁడే నీవు! మనకందఱకు శాపావసానసమయము సమీపించెను. అనిచెప్పి చిలుక మాయమైపోయెను.

ఆసమయమున లోకమాతయగు రమ ప్రత్యక్ష మయ్యెను. శూద్రక మహారాజునుజూచి రాజా! నేనే చండాలకన్యరూపముం దాల్చి వచ్చితిని. నీవు నా సోదరుఁడవు. పుండరీకుఁడు నాయంశమువలన జన్మించినవాఁడు. కావున నట్లువచ్చితి ననిచెప్పి తిరోహిత యయ్యెను.

ఆశ్చర్యము! ఆశ్చర్యము! శూద్రకమహారాజు పూర్వజ్ఞానసంపన్నుఁడై జీవాత్మను వెలుపలికి చంద్రమండలమునఁ బ్రవేశించెను.

పాఠకులారా! మనమిఁక శూద్రకమహారాజును మఱచిపోవుదము. మహాశ్వేతాశ్రమమునకు వత్తము. కాదంబరి తనప్రియునిశరీరమును భద్రముగా సంరక్షించుచు నొకనాఁడు తనయొడిలో నాతనిశిరము నుంచుకొని చేతిచే నిమురుచుండెను. నాఁటిదినము చంద్రాపీడునిశరీరమున నొకవింతకాంతి యబ్బెను. ముఖకమలము వికసింపనారంభించెను. అత్యాశ్చర్యముతో కాదంబరి ప్రియుని ముఖమును వీక్షించుచుండెను. అప్పుడొకజ్యోతి చంద్రాపీడునిముఖమునఁ బ్రవేశించెను. అది చంద్రజ్యోతి. తక్షణమే యాచంద్రాపీడుఁడు నిద్రనుండి మేల్కాంచినవానివలె లేచి కాదంబరిని కౌఁగిలించుకొని యానందపరవశుఁడ య్యెను. అప్పుడే గగనమునుండి పుండరీకుఁడు భూతలమున కరుగుదెంచెను. మహాశ్వేత సుందరవదనారవిందయై యాతనిపాదములకు నమస్కరించెను. అందఱు నిర్భరానందపరవశులైరి.

అంత్యము సంతోషముగా మాఱిపోయెను. ఆవనమునందే చంద్రాపీడునికిని కాదంబరికిని మహావైభవముతో వివాహము జరిగెను. పుండరీకుండు

మహాశ్వేతను బెండ్లియాడెను. చంద్రాపీడుఁడు కాదంబరితోఁగూడ నుజ్జయిని కరుదెంచి పట్టాభిషిక్తుఁ డయ్యెను. పుండరీకుఁడు మంత్రిపదవి నలంకరించెను.

ఒకనాఁడు కాదంబరి చంద్రాపీడునిఁజూచి "ఆర్యపుత్రా! మనమంద అము సర్వసుఖములనందియుండఁగాఁ బత్రలేఖమాత్రమట్లయ్యెనేల?" యని యడిగెను. చంద్రాపీడుఁడిట్లనియెను హృదయేశ్వరీ! నేను చంద్రుఁడనని యెఱుం గుదువుగదా! పరమపతివ్రతయగు రోహిణి జన్మాంతరమునసహితము నన్నుసే వించుచుండుటకై పత్రలేఖగా జనించెను. నామరణమునకైనగచి మఱలఁ జంద్ర మండలముం బ్రవేశించెను. అనినవిని కాదంబరి రోహిణిని బహువిధముల నుతించుచుండెను.

అట్లాదంపతులు చిరకాల మైహికసుఖముల ననుభవించుచు సుఖముం డిరి. ధర్మపరాయణుఁడై చంద్రాపీడుఁడు ప్రజలయోగక్షేమములనారసి రాజ్య మును బరిపాలించుచుండెను. మహాశ్వేతామనోహరుఁడగుపుండరీకుఁడు శక్రు నికి బృహస్పతివలె నతనికి సర్వవిధముల ననుకూలమంత్రియై యుండెను.

మంకాల దొరస్వామయ్య.

# స్వభాషోద్ధరణము.

స్వదేశోద్ధరణవిషయమున, స్వజాత్యుద్ధరణవిషయమున, స్వభాషోద్ధరణవిషయమునఁ, బ్రతివ్యక్తికి నభిలాష మధికముగ నుండుననుట నిర్వివాదాంశము. ప్రయత్నవిషయమున మాత్రము ప్రతివ్యక్తియు ముందంజ వేయుననుట వివాదాంశము. ఇట్లనుటచే బొత్తిగఁ బ్రయత్నించువా రుండరని నాయభిప్రాయము కాదు. ప్రస్తుతకాలమున మనదేశమున స్వదేశోద్ధరణప్రయత్నకోలాహల మొకవంకను, స్వజాత్యుద్ధరణసంరంభకోలాహల మింకొకప్రక్కను, స్వభాషోద్ధరణనిర్వహణకోలాహల మొకదెసను, బయల్వెడలి ప్రపంచమును జెవుడ్పడఁ జేయుచున్న వనుటకు సందియ మెంతమాత్రమును లేదు. ఈకోలాహలముల వలనఁ గార్యసిద్ధి గాకున్నను, గొంతవఱకు లాభము కలుగకపోదు. ఇందుఁ బరప్రతిబంధకముల నెదుర్కొని వానిని బోకార్చి నిర్వహింపవలసిన దొకటి. స్వీయజనపరస్పరాభిప్రాయ వైరుధ్యములకు లొంగక వానిని బరిమార్చి నెఱవేర్పవలసిన దొండు. ఇట్టికష్టములంతగా లేక కొంచెము శ్రద్ధమాత్రము వహించి సాధింపఁదగినది మఱియొకటి. ఈమూఁటిలోఁ దృతీయమే ప్రథమద్వితీయకార్యనిర్వహణములకుఁ బ్రధానసాధనము. ఉన్నతసౌధాధిరోహణమునకుఁ బ్రథమసోపానసౌష్ఠవ మెంతావశ్యకమో స్వదేశౌన్నత్య పదాధిరోహణమునకు స్వసారస్వతౌన్నత్యసౌష్ఠవ మంతయావశ్యకము. కావున స్వభాష నుద్ధరించుకొని, దానిమూలమున విజ్ఞానమును సంపాదించి, పైరెండుకార్యములను నిర్వహింపవలసిన భార మాయాప్రజలయం దున్నది.

ప్రస్తుతము మనదేశమున బయల్వెడలిన భాషావిషయికకోలాహలము సారస్వతాభివృద్ధి కెంతవఱకుఁ దోడుపడుచున్నదో నిర్వచింపవలసియున్నది. తెలుఁగున నవలాదినూతనగ్రంథరచన మావశ్యక మనియు, నది బాగుగ జరగుట లేదనియు, నది యభివృద్ధి గాంచినఁ గాని యాంధ్రభాష సంపూర్ణావస్థితికి రానేర దనియుఁ గోలపెట్టుటయే కాని శబ్దసంస్కారము, మృదుశైలి, భావగాంభీర్యము, మొదలయిన సుగుణములతో వినూతనరచనావిధాన మలవడినఁగాని యేనవలలు, నేనాటకములు, నేశాస్త్రగ్రంథములు, వెలువడినను, వాఙ్మయ మభివృద్ధికి రాఁజాల దనుసంగతిమాత్ర మీకోలాహలములో నిమిడియున్నట్లు తోఁపదు.

మనయాంధ్రవాఙ్మయమున నవలలు, నాటకములు, మున్నగువిషయములితఃపూర్వము కొఱవడె ననుట నిశ్చయమే; కాని సంస్కృతాంధ్రభాషలయందసమానపాండిత్యము గలకొందఱు, గీర్వాణభాషయం దున్నట్టి మహానాటకముల నాంధ్రీకరించియుఁ, గొందఱు నవలలు వ్రాసియు, నాలోపముఁ గొంచెము కొంచె మిప్పుడు తొలఁగించుచున్నారు. ఇంతకంటె నధికప్రావీణ్యము కలిగి యాంధ్రకవితాకన్యను సృజించి, గీర్వాణవాణితోఁ జెలిమిచేయించి, యామెచే నొసంగఁబడిన గోరసాదులచేఁ బుష్టివహింపఁజేసి, యితిహాసముల నేర్పించి, పురాణముల వినిపించి, నూతనమార్గములఁ గావ్యరసముఁ గ్రోలించి, కథానకముల నభ్యసింపంజేసి, రసవిస్తారము లైనహావభావాదులచే విలసిల్లఁజేసిన ప్రాచీనాంధ్రవిద్వత్కవు లామెకు నాటకప్రదర్శనంబును, నవలాపరిచయంబును నొనర్పక యెందుచేతనో యుపేక్షవహించినారు, కాని వారి కీకార్యము నందు సామర్థ్యము లేక కాదు. ఇప్పుడట్టిపాండితీపటిమ గలకవు లంతగా లేకపోవుటచేఁ బ్రకృత మాంధ్రీకరింపఁబడిన నాటకములలోఁ గొందఱుచే రచింపఁబడిన కొన్నియు, స్వకల్పితములందు మిక్కిలి కొంచెమును మాత్రమే మనోహరములుగాఁ గాన్పించుచున్నవి. అయినను నేవో కొన్నిస్వరూపము లేర్పడుటచేతను, నవి మనోరంజకములు, నీతిబోధకములు మాత్రమె యగుటచేతను మన మిప్పుడు వానితోడనే తృప్తిపొందినఁ బొందవచ్చును. ఇఁక శాస్త్రగ్రంథము లన్ననో జీవనోపాయకరము లగుటచేతను, వానిచేఁ గాని దేశోద్ధరణకార్యనిర్వహణము కా కుండుటచేతను, వానికై మన మిప్పు డెక్కుడుగాఁ బ్రయత్నింప వలసియున్నది. వీనినిఁ గూడ నొకరిద్దఱు (బ్ర॥ శ్రీ॥ కొమఱ్ఱాజు లక్ష్మణరావుపంతులుగారు మొదలగువారు) శ్రమకోర్చి రచించియున్నారు. కాని యవి చాలవు. ఇఁకను విశేషముగ రచించుట కాంగ్లేయభాషాపరిచయము గలయాంధ్రపండితసమూహ మావశ్యకముగా నున్నది.

మనవా రిపుడు మనభాషలో నవలాదిగ్రంథములు బయల్వెడలిన వని సంతసించుటయు శాస్త్రగ్రంథములు మున్నగునవి బయల్వెడలవలసియున్నది కనుక వానిని రచించుటకుఁ బ్రయత్నె మొనర్పవలయునని యన్నిసభలయందును గంభీరోపన్యాసములు చేయుటయునే గాని యిదివఱకు బయల్వెడలిన నవలాదికము లెంతవఱకు మనోహరముగ నున్నవో యూహించువారు గాని శాస్త్రగ్రంథములు మొదలగునవి రచించు నాంధ్రసారస్వతపాటవము గలపండితు లెట్లుబయల్వెడలుదురో యాయుపాయ మాలోచించువారు గాని కానరారు.

పూర్వకాలమున "మెట్రిక్యులేషన్" పరీక్షలున్నప్పు డం దుత్తీర్ణులైన వారిలోఁ గొందఱకుఁ గాకపోయినఁ గొందఱికైనను విశేషపాండిత్యము లేకపోయిన గ్రంథపఠనాభిలాషము, వ్యాసరచనాభిలాషమునైన నుండెడిది. దీనికిఁ గారణ మాయాంతరగతుల కనుకూలములైన భాషాప్రౌఢిమ గల గ్రంథములు పఠనీయములుగ నుండుటయు, బోధనాపరీక్షావిధానములు భాషాప్రావీణ్యజనకములుగ నుండుటయునే. అప్పుడైనను బరీక్షావిధానములోఁ గొంతలోపము లేక పోలేదు. భాషాంతరీకరణమునకు వచ్చు గుణములు సాహిత్యమునకు వచ్చు గుణములుగాఁ బరిగణింపఁబడుచుండెడివి. అందుచేతఁ గావ్యపఠనాదులం దభ్యర్థు లశ్రద్ధ వహించెడివారు. అయినను నప్పు డుభయభాషలయందును బరస్పరము భాషాంతరీకరణ మొనర్ప వలసియుండెడిది. ఆంధ్రమునందలి పద్యముల భావ మాంగ్లములోనికి మార్చవలసియుండుటచే నభ్యర్థుల కాపద్యముల భావములనైనను గ్రహింపఁగలిగిన శక్తి యవసర మయ్యెడిది. అందుచేఁ బరీక్షావిధానమునఁ గించిల్లోపమున్నను నభ్యర్థుల కీషన్మాత్రమైన నాంధ్రసాహిత్యజ్ఞానము కలుగకుండెడిది కాదని చెప్పక తప్పదు.

"మెట్రిక్యులేషన్" పరీక్షావిధాన మంతరించుటకుఁ బూర్వమే నాలుగైదుసంవత్సరములనుండి, యే కారణముచేతనో పరీక్షావిధానము మొదలయినవి క్రమక్రమముగా భాషాహైన్యజనకములుగాఁ బరిణమింపఁజొచ్చినవి. అంతట స్కూలుఫైనల్ విధాన మేర్పడినది. అం దాంధ్రమునకు గౌరవమే లేదు కదా! ఇట్లుండ నొక్కపెట్టున గ్రామ్యకటకములు బయల్వెడలి నవనవలాడు నాంధ్రభాషాలతికను గ్రమ్మివైచి, పత్రములు డుల్చియుఁ, జిగురుల మెక్కియు, జొంపముల రాల్చియు లేఁగొమ్మల మోడుపర్చియు, నానావిధములఁ బాడుచేయుటకును దుదకు మూలచ్ఛేద మొనర్చుటకును సిద్ధమైనవి. ఎప్పుడును మంచికంటెఁ జెడుగునకు వ్యాప్తి యెక్కుడుకదా! ఇమ్మహోపద్రవముం గాంచి, యాంధ్రభాషాభిమాను లందఱు తల్లడించి యీకీటకసంహారమునకు విశ్వప్రయత్న మొనర్పవలసివచ్చినది. సామాన్యజనుల ప్రయత్నమే యైనచో లాభము కలుగకయే పోవునుగాని యాప్రయత్నములు రాజపురుషులవగుటచేఁ గొంతవఱకు లాభించినది. ఈమహాకార్యనిర్వహణమున కాధారభూతులగు మ॥ రా॥ శ్రీ॥ శ్రీ॥ జయంతి రామయ్యపంతులుగారి కాంధ్రు లందఱు నీవిషయమునఁ గృతజ్ఞులై యుండవలసినదే. ఎంతకష్టపడి గ్రామ్యకీటకముల సంహరించినను నిప్పటికిని నవి లోలోపల సంచరించుచునే యున్నవి. ఈమహావిప్లవము మూలమునఁ బాఠశాలలలోని తెలుఁగు పూర్తిగ నశించి నామమాత్రావశిష్టము కానై యున్నది.

ఇప్పుడు బయల్వెడలిన నవలాదికగ్రంథపఠనము మూలమున జనులకు నేవిధమయినగ్రంథరచనాసామర్థ్యమును గలుగుట లేదు. లోకోపకారములైన శక్తులఁ గలిగించుటకు నూతనవిషయప్రపంచము వాఙ్మయమున బయలు దేఱుట యావశ్యకమే కాని యాయావిషయములను వెల్లడించుటకుఁ దగినసాహితీ పటిమ కూడ నావశ్యకము కాదా? అట్టిసాహిత్యపాటవమునకు ముఖ్యావసర మైనది, పూర్వగ్రంథపఠనము. నవలలు బయలుదేఱినను నాటకము లేతెంచి నను నేమి యెంతవఱకు జరిగినను నది యంతయుఁ బూర్వగ్రంథపఠనము మూలమునఁ గలిగినవిశేషమే కదా! నూతనగ్రంథములందుఁ గూడఁ గొన్ని పఠనార్హములని యొప్పుకొనక తప్పదు. మనపాఠశాలలయందు బాలురకుఁ బఠ నీయములైన గ్రంథము లెంతమాత్రము సాహిత్యపాటవమును గలిగించు నవిగా నుండక కేవలము వృద్ధలైనస్త్రీలకుఁ బొద్దుపోకకును, బాలకుల లాలిం చుటకును, నప్పుడప్పుడు చెప్పుకథలయందలి పదపాటవము మాత్రము కలవై యున్నవి.

ఇంతియ కాక బోధనావిధానమును, బరీక్షావిధానమును, బాలకులకు వాక్యనిర్మాణశక్తి నైనను గలిగించునవిగా లేవు. ఈపాఠశాలోన్నతపరీక్షయం (1) దాంగ్లేయభాషాసాహిత్యమును (English) (2) ఆంధ్రవ్యాసరచనాభాషాంత రీకరణములు (Vernacular translation and composition) (3) ప్రారంభగణి తము (Elementary Mathematics)ను నిర్బంధముగను, (౧) భౌతికరసాయన శాస్త్రములు (Physics and Chemistry) (౨) ఆంధ్రసాహిత్యాంగ్లేయచరిత్రలు (English History and Telugu) (3) హస్తముద్రాసంక్షిప్తలేఖనములు (Type-writing and Short hand) (౪) భౌతికగణితశాస్త్రములు (Mathematics and Physics) (౫) రసాయనగణితశాస్త్రములు (Mathematics and Chemistry) మున్నగునవి ద్వంద్వములుగ నైచ్ఛికములుగను, బఠింపవలసినదిగా నిర్ణయించి నారు. ఈవిభాగ మైదవఫారము మొదలుకొని మాత్రమే విధింపఁబడియున్నది. నాలుగవఫారమువఱకు మాత్రమే యాంధ్రమును బఠించి, యాంధ్రసాహిత్య సంకలితద్వంద్వేతరము (other groups not including Telugu) నైచ్ఛికపాఠ్య ముగఁ గొనిన బాలకుఁడు నిర్బంధముగా నేర్పఱిచిన యాంధ్రవ్యాసరచనా భాషాంతరీకరణముల లెస్సగ నెట్లొనర్పఁగలఁడో యూహింప శక్యముగాకున్న యది. మఱియు నొకటవఫారమునుండియు నైదవఫారమువఱకును సంస్కృత మభ్యసించిన విద్యార్థి నైదవఫారమునుండి యాంధ్రసాహిత్యసంకలితద్వంద్వే

తరము నైచ్ఛికపాఠ్యముగఁ దీసికొన్నను సంస్కృతసాహిత్యసంకలితద్వంద్వమే యైచ్ఛికముగఁ దీసికొన్నను, నిర్బంధపాఠ్యములలోఁ జేరినవ్యాసరచనాభాషాంతరీకరణము లాంధ్రముననే యొనర్పవలెనంట. ఆహా! ఇది చూడ "సాహేబునకు—కాదు సాయీబునకు సంధ్యావందన పరీక్ష" యను లోకోక్తి సార్థకమగుచున్నది.

ఆభాషాంతరీకరణ మైనను బూర్వమువలె నాంధ్రాంగ్లేయభాషలలోఁ బరస్పరముకాక యొకయింగ్లీషునకుఁ దెలుఁగుచేయుట మాత్రమే యైయున్నది. భాషాంతరీకరణమునకు వచ్చుగుణములు సాహిత్యమునకు వచ్చుగుణములతో వేఱుచేసి వ్యాసరచనావిధానమునందుఁ గలుపుచుంటి మనునితరమార్గ మొకటి క్రొత్తగఁ జూపినను బూర్వమువలె నాంధ్ర మర్థముచేసికొని యింగ్లీషులోనికి మార్చునవసరము లేనందున నాంధ్రభాషయం దర్థాదిజ్ఞాన మభ్యర్థికి లేశమయిన నక్కఱలేకున్నయది. ఇఁక భాషాంతరీకరణనిర్ణీత హూణభాషావ్యాసఖండమును (Translation piece) సరియైన యాంధ్రమునకుఁ దీసికొని వచ్చుటకుఁ దగినపదార్థపరిజ్ఞానము విద్యార్థికి లేనికారణమున సందలిభావము మనస్సునకవగత మయ్యుఁ దనకుఁ దెలిసిన యేకొలఁదిమాటలమూలముననో దానిని దెలుపవలసివచ్చుటచేసంపూర్ణమైనభాషాంతరీకరణమును జేయఁజాలకున్నాఁడు. భాషాంతరీకరణమునకును వ్యాసరచనావిధానమునకును ననువగు సాహిత్యము కలుగుటకై రెండాంధ్రగ్రంథములను (సవిమర్శముగ నొకటియు,వస్తుగ్రహణమాత్రముగ నొక్కటి యు) బఠనీయములుగ నిర్ణయించుటయుఁ బరీక్షించుటయు ననెడి యొకతంతు జరుపఁబడుచున్నది. కాని యాగ్రంథములపై నిచ్చుప్రశ్నపత్రములకు గుణములు (డిగ్లైకు 25 కాంపోజిషన్ ట్రాన్స్లేషన్లకు 75) బహుస్వల్పముగ నుండుటచేతను, ప్రశ్నములు సాహిత్యపాటవపరీక్షకములు కాకుండుటచేతను, విద్యార్థి యాగ్రంథములను సవిమర్శకముగఁ బఠించుటయే లేదు. సంస్కృతవిద్యార్థి కట్టిసవిమర్శకపాఠ్యగ్రంథము సంస్కృతభాషలోను, కథామాత్రపాఠ్యగ్రంథమాంధ్రమునందును బఠనీయములుగ నిర్ణయించినారు. దీనిని బట్టి చూడ నాసవిమర్శకపాఠ్యగ్రంథము వ్యాసరచనావిధానసామర్థ్యసంరక్షణముకొఱ కేర్పఱిచినది కాదని తోఁచుచున్నది.

ఆంధ్రసంకలితద్వంద్వ మైచ్ఛికముగఁ దీసికొన్నవారికి నైన సాహిత్యము కుదురవలసినది కదా? వారైన నీనిర్బంధవ్యాసరచనాదికమునందును, సాహిత్యమునందును సమర్థులై యుండకుందురా యందురేమో? ఆయైచ్ఛికాంధ్రము

కూడ బహుకాలాంతరాయసన్నిశ్రితమై చెడుటచే వారికిని సాహిత్యజ్ఞానము కలుగుట దుర్లభము. ఏమనినఁ బఠనీయగ్రంథములు కేవలము పేలవములై యుండుటయు బోధనావిధానపరీక్షావిధానములు భాషాప్రావీణ్యజనకములుగా నుండకుండుటయు, గుణనిర్ణయములో లోపముండుటయు మున్నగునవి కారణములు. ఇన్నిటికంటె గొప్పవగు ననర్థహేతు వొకటి యున్నది. ఉన్నతపాఠశాలలందుఁ బ్రధానోపాధ్యాయులుగా నుండువారిలోఁ గొందఱు సంపూర్ణదేశభాషాపరిజ్ఞాతలు—కాదు, కాదు!:—తుదకు సారస్యగ్రహణపారీణులు కూడ కారు. అందుచేఁ గ్రిందితరగతులనుండి యుఁ బాఠశాలలందుఁ జరుగుపరీక్షలలో బాలకు లాంధ్రమున స్వల్పగుణములనైనఁ దెచ్చుకొనకున్నను, నాయాతరగతులయం దుత్తీర్ణులైనట్లు గణించి యాంధ్రము ననాదరముగఁ జూచుటచే బాలకులుకూడ దాని నట్లే చూచి శ్రద్ధతోఁ బఠింపకున్నారు. విశేషించి క్రిందితరగతులయం దాంధ్రమును బోధించుటకు స్కూలుఫైనల్ ప్యాసైన వారిని నియమించుటచే వా రాయాతరగతుల కనుగుణ్యమైన విధమున వ్యాకరణాదులతోఁ బాఠమును బోధింపకుండు ననర్థ మొకటి సంభవించుచున్నది. ఇటీవలఁ గొన్నిపాఠశాలలలో బండితుల నేర్పాటుచేసినారు. కాని యీ యేర్పా టన్నిపాఠశాలలందును జరగుటలేదు! తఱచుగ నీయాంధ్రమండలమునఁ దమిళులు ప్రధానోపాధ్యాయులుగ నుండుటచే వారికాంధ్రమనినఁ దలకంటగించి వారెట్లో వ్యవహారమునకై మాటలాడుటకు నేర్చుకొన్న ("రెండు తమ్ముడు; దబ్బున పెండ్లిసేస్తిని" అనునట్లు) తమ యాంధ్రముతోఁ పాటు పాఠశాలలలోని యాంధ్రముకూడ నున్నచోఁ దాముకూడఁ బండితుల మగుదుమని తలఁచి, బాలకులఁ బైతరగతులకుఁ జేర్చుటలోఁ దప్పక పైవిధము ననుసరించుటయుఁ, గ్రిందితరగతులకుఁ బండితుల నియమింపకుండుటయు జరిగించుచున్నారు. ఇట్టిదే కాక యింకను ననేకములు విద్యాశాఖానిర్ణయము (Educational rules) లకు వ్యతిరేకములు జరగించుచున్నను బరిశీలనాధికారులు (Inspectors) వానినెందుచేతనో పాటింపకున్నారు. ఇట్లు జరగుచుండుటచే నాలుగవఫారమువఱకుఁ గూడ నాంధ్రము క్షీణస్థితియందే యున్నది. పునాది కట్టుదిట్టము లేనివిద్యార్థి యాంధ్రసంకలితద్వంద్వ మైచ్ఛికముగఁ దీసికొన్నను, వానికి వినూత్నబోధనాభ్యాసముగల పండితుఁడు—కాదు—శేషఫణీంద్రుఁడైనను నేఁటిమీఁద నెనిమిదినెలలలో నెట్టిసాహిత్యజ్ఞానము కలిగింపఁగలఁడో బుద్ధిమంతు లూహింతురుగాత!

పఁజేయు స్కూలుఫైనల్ పరీక్ష కాంధ్రమునందుఁ బత్రము లెంతేమాత్రము సాహిత్యపరీక్షాసమర్థకములు కాకుండుటయే కాక వానిని దిద్దునప్పు డందలికథావిషయము (Subject matter) న కెక్కువగుణములును, భావగాంభీర్యాదులకును వ్యాకరణవిషయములకును దక్కువగుణములను నిర్ణయించి గణనము (Value) చేయుచుండుటచేతను, స్వభాషయగుటచే సులభము గనుక దానియం దెక్కువగుణములు రావలయు ననునియమ మేర్పఱుచుటకు బదులుగా నూటికి ముప్పదియైదుగుణములు వచ్చిననే చాలు నని పరీక్షాసంఘమువారు నిర్ణయించుటచేతను స్కూలుఫయినల్‌విద్యార్థుల కాంధ్రసాహిత్యజ్ఞాన మధఃపతిత మగుచున్నది. ఈస్కూలుఫయినల్‌విధాన మేర్పడినపిమ్మట నీయాంధ్రమందే కాక యాంగ్లము మొదలగువిషయములలోఁ గూడ యువకులకు సమంజసమైన ప్రావీణ్య మధఃపతిత మగుచున్నదని యెంచియే కదా బోధనాభ్యసనపాఠశాలలలో (Training Schools) నొక్కబోధనావిధానమే కాక మరల నన్నివిషయములు (Subjects) బోధించుచున్నారు.

భాషాంతరీకరణవ్యాసరచనావిధానములందు, వ్యాకరణదోషములు, శబ్దార్థదోషములు, విశేషముగ నుండుచున్న వనియు, వాక్యనిర్మాణశక్తి (Structure of sentence) విషయవిభాగశక్తి (Paragraphing) బొత్తిగ లేదనియు, నెచ్చటను సరియైనభావములు కానరా వనియుఁ, దుదకు వర్ణక్రమముకూడ బాగుగ నుండుటలే దనియు, నైచ్ఛికాంధ్రసాహిత్యమునందును నీపైఁజెప్పిన దోషములుగాక విశేషదోషము లున్న వనియు నీమొదలయిన యంశములు పరీక్షాధికారులు తమస్కూలుఫైనల్ రిపోర్టులోఁ దెలుపుచుందురు. కాని యట్టి దోషసంభవమునకుఁ గారణము లెవ్వియో, వానిని నిర్వర్తించుటకు సమంజసములైన మార్గము లెవ్వియో కనుఁగొనరు. కాని పాఠశాలలలో నాంధ్రభాష హూణభాషాపరిజ్ఞానము లేనట్టియు, వినూత్నబోధనావిధానమార్గములు తెలియనట్టియు, "డిసిప్లిన్" (క్రమశిక్ష) నిలుపలేనట్టియుఁ బండితులచే బోధింపఁబడుచుండుటచేత నీదోషములు కలుగుచున్న వనియు, నాంధ్రమైచ్ఛికముగాఁ దీసికొన్నపట్టపరీక్షాకృతార్థు లాపండితులపైని యాజమాన్యమును వహించినచోఁ దద్దోషములు నివర్తించు ననియుఁ, బండితుఁడు, "డిసిప్లిన్" నిలుపలేఁడను విషయ మొకసహాయపరీక్షాధికారిగా (Assistant Examiner) నున్నపండితుఁడే యంగీకరించె ననియు, నీమొదలగు నిరుపయోగములును, స్వలాభోపయోగములును నగుహేతుసదుపాయములను దెలుపుదురు. అది కేవల మనాలోచితము, అక్రమము నై యున్నది. స్కూలుఫయినల్ పరీక్షకు వచ్చినయాంధ్రసాహిత్య

విద్యార్థికి నాంధ్రమునం దుత్తరము వ్రాయుశక్తియైనను గనిపింపదని తమస్కూలు ఫయినల్ రిపోర్టులోఁ బరీక్షాసంఘమువారు సూచించియుండియు, నీవిధానమున నే పట్టపరీక్షయందుఁ గృతార్థు లైనవారు, పండితులపై యాజమాన్యము వహించినచో లాభ ముండునని స్వవచనవిఘాతముగ నిట్లు చెప్పుట కడుంగడు హాస్యాస్పదము. స్కూలుఫయినల్ ప్యాసైనవిద్యార్థికే కాదు; ఈవిధానమందుఁ బట్టపరీక్షయం దుత్తీర్ణులైనవారికిఁ గూడ నాంధ్రమున నుత్తరము వ్రాయు శక్తియైన లేదని నిరాఘాటముగఁ జెప్పవచ్చును. నేను జెప్పనేల? పెక్కుమంది బి. యే. లు తమంతట తామే యంగీకరించియున్నారు. క్రిందితరగతియం దట్టి స్కూలుఫయినల్ వారు తెలుఁగును బోధించుట మొదలిడినపిమ్మటను సంస్కృతాంధ్రములం దేమాత్రము పాండిత్యము లేనివారు పరీక్షాధికారులుగ నేర్పడినపిమ్మటను నిట్టిభాషాహైన్యము సంభవించినది. వారు తెలిపినట్లు హూణభాషాపాండిత్యము లేకున్నను భాషయందు వినూత్నములైన పోకడలఁ గనిపెట్టి బోధనము లొనర్చియుఁ గ్రొత్తలగు రచనముల నొనర్చియు బాలకుల నానందింపఁజేయుశక్తియుఁ బ్రధానోపాధ్యాయుఁడుగా నున్నతమిళుఁ డాంధ్రపండితుల యందలి యీారసముచే బాలకులఁ బ్రోత్సహించినను 'డిసిప్లిన్' నిలుపుశక్తియుఁ బండితులకు లేకపోలేదు.

హూణభాషలోఁ బట్టపరీక్షయందును దానిపైపరీక్షయందును గృతార్థులైన వారిలో బోధనాభ్యసనమునం దుత్తీర్ణులయ్యు, నాంగ్లసాహిత్య బోధనమునందును, రచనాదివిధానమునందును, నుపన్యాసవిధానమునందును, 'డిసిప్లిన్' నిలుపుటయందును, నసమర్థులై ఛాందసు లనియనిపించుకొనువా రెందఱు లేరు? అట్లే పండితులయందుఁ గూడ ఛాందసు లొకరిద్ద ఱుందురేమో? ఎచ్చటనో యొకరిద్దఱు ఛాందసులును, ధనమున కాసించిపరీక్షాధికారులప్రేరణచే 'డిసిప్లిన్' నిలుపలేమని చెప్పువారును నున్నంతమాత్రమునఁ బండితలోక మంతయు ఛాందసభూయిష్ఠమే యనియు 'డిసిప్లిన్' నిలుపలేని దనియుఁ జెప్పుటకంటె సాహసమొండు లేదు.

పండితులు వినూత్నబోధనాసంపన్నులై హూణభాషామర్యాదల నెఱింగినవారైనను బాలకులకు భాషానైపుణ్యము కలిగించుట వారిచేతులలో లేదు. హూణభాషాపరిజ్ఞాత లాంధ్రమున జ్ఞానము కొంచెము సంపాదించి యాజ్ఞానముచే భాషయందలి పోకడలఁ దెలిసికొనలేక తమకుఁ దెలిసినదానికంటె నధికములైన విషయములు ఛాందసప్రయోగము లనియుఁ, గఠినము లనియు, నట్టివి భాషయందుండఁగూడ దనియు, ముప్పువాటిల్లు ననియు, మొదలగుసంగతు

లుపన్యసించుచు, సారస్వతమంతయుఁ దమకుఁ దెలిసినవిషయములస్థితి (level) లోనేయున్నచోఁ దమరుకూడ నఖండపండితుల మనిపించుకొనఁగల మని యూహించి, పండితులు ఛాందసులనియుఁ, బూర్వకావ్యము లన్నియుఁ గఠిన పదక్లిష్టార్థసహితము లనియుఁ జెప్పుచుఁ బండితులు దరిచేరుటకు వీలులేని యాంగ్లేయవిద్యాశాఖాధికారులయొద్దఁ జేరి వారిని బండితు లందఱు మూఢు లనుకొనునట్లు చేసి, బి. ఏ. యల్. టీ, లుగాని పరీక్షకుఁ బ్రశ్నపత్రముల నిచ్చు టకుఁ బ్రధానపరీక్షాధికారులు (Chief Examiners) గానుండఁ గూడదని వారిచే నుత్తరువులు చేయించి తా మాంధ్రపండితాగ్రేసరులుగా నెంచఁబడి పాఠశాలల యందలి యాంధ్రబోధనావిధాననిర్ణయమునందును, బఠనీయగ్రంథనిర్ణయము నందును, బరీక్షావిధాననిర్ణయమునందును నధికారము వహించి భాషనంతయుఁ బైనిజెప్పినవిధమున నధఃపతితము చేయుచుండఁగాఁ బండితుఁ డేమిచేయఁగలఁడో బుద్ధిమంతు లూహింతురుగాక.

పండితులు పరీక్షాధికారులుగ నుండఁగూడ దనునీమొదలగు నుత్తరువులు కేవలము స్వార్థపరత్వముచేఁ జేయించినను హూణభాషాపరిజ్ఞాత లైనపూర్వు లాయాకార్యములకుఁ దామధికారమును వహించి, తమరు స్వయముగ భాషా సారస్యము నెఱిఁగినవా రగుటచే మంచియాంధ్రపాండిత్యము కలిగినపండితుల తో సంప్రతించుచు, బాలకులకు భాషాపాటవము కలిగెడుగ్రంథముల నుచితరీతి నేర్పఱిచియు, బోధనాపరీక్షావిధానముల నిర్ణయించియు భాషను బోషించెడి వారు. పూర్వపువా రేర్పఱిచిన పఠనీయగ్రంథములు, నిప్పటిపఠనీయగ్రంథ ములు, పూర్వపు ప్రశ్నపత్రములు, నిప్పటిప్రశ్నపత్రములుఁ బరీక్షించినచో దీని సత్యము తేటపడఁగలదు. ఇందుకు నిదర్శనముగా వెనుకటిప్రశ్నపత్రమును, నిప్పటిప్రశ్నపత్రమును (నీదిగువనుదాహరించుచున్నాను) జూడఁదగును.

(1) Matriculation Examination 1904.
(2) S. S. L. C. Public Examination 1917.

మఱియు హూణభాషాప్రశ్నపత్రముల కున్నసాహిత్యపాటవపరీక్షాధి కార మాంధ్రమున కుండఁగూడ దంట! హూణభాషయం దుపాధ్యాయులచే బోధింపఁబడినది గాక యన్యమైన పద్యసమూహ మిచ్చి దానిభావము మొద లగునవి (paraphrasing and parsing) తెలుపు మందురు. ఇట్లు తెలుపుమనుట విద్యార్థికి భాషయం దెంతపాటవ మున్నదో కనుఁగొనుట కేకద! అట్టిదాంధ్ర మున కవసరము లేదంట! ఇంతేకాక హూణభాషయందు నిర్ణీతమయిన పద్య సమూహములోఁ గొన్నిపద్యములు కంఠపాఠము చేయవలెనంట! అట్టివి

యను మాంధ్రమున కవసరము లేదంట! దీనినిబట్టి చూడ నాంధ్రమును గూడ గౌరవించుచున్నట్లు కనుపఱిచి యాంధ్రులకన్నీరు దుడుచుటకై పాఠశాలలలో దానిని బోధించుచున్నారు గాని బాలకులకు సాహిత్య మలవడుటకుఁ గాదని యెంత బుద్ధిహీనునకైనను దెలియకపోదు.

పైనిజెప్పిన వన్నియుఁ గాక యీయాంధ్రమున కొకగొప్పముప్పు, అక్షరాభ్యాసకాలమునందె సంభవించుచున్నది. హూణభాషవలెఁ గాక యాంధ్రమైత్త్వేత్వాదిగుణకములతోఁ గూడియుండును. అట్టిగుణితమే లేకుండఁ జేయుటచే బాలకు లైకారమునకును, తాముడునకును భేదమే యెఱుంగకున్నారు. వారికి విద్యగఱపునుపాధ్యాయులుగూడ నేమూఁడవఫారమువఱకునో పైవిధానముననే విద్యనభ్యసించి (బోధనాభ్యసనకాలముఁలో సాహిత్యసామగ్ర్యమునకై మఱల నన్ని (Subjects) పాఠములు పఠించుచున్నను, అచ్చట వ్యవహారమునకై మాత్రమె కొంచెము తెలుఁగు నేర్చినహూణభాషాభిజ్ఞులే యాంధ్రమును బోధించువారగుటచే) తెలుఁగునందు లేఖనవాచకసామర్థ్యము లేకయుండఁగా నిఁక బాలకులసంగతి వేఱ చెప్పనేల? గుణితము పూర్తిగ రాకపోవుటచే బాలకు లాంధ్రమునందలి వచనభాగమును జదువుటకైనను సమర్థులు కాకున్నారు. అట్టి చదువలేనివారు "సూపర్వైజర్లలోను, సబు అసిస్టెంట్సు"లలోను నేను జాలమందిని జూచియున్నాను. అట్టివారంట, ఉన్నతపాఠశాలలలోని పండితులబోధనావిధానమును గూడఁ బరీక్షింపవలెనంట! చూచితిరా యెంతచిత్రముగ నున్నదో!

ప్రారంభపాఠశాలలలోఁ జెప్పఁబడునదంతయు నాంధ్రమేకద! ఆపాఠశాలలలోని విద్య చక్కగ బోధింపించునధికారి యాంధ్రాక్షరముల ముఖ మెఱుఁగకపోయినను సరేనంట! కాని, బి.యే.యల్ టీ. కావలెనంట! పైనిజెప్పినరీతివారుపాధ్యాయులుగా నుండుటయు నిట్టియధికారులు భాషను బోధింపించువారుగా నుండుటయు గుణితము లేకపోవుటయుఁ గలిగినపాఠశాలలలో నుత్తీర్ణులై బాలకులు మాధ్యమికపాఠశాలలలోఁ బ్రవేశించి పైని జెప్పఁబడినవిధానమునకు లోనై విద్యనభ్యసించుచుండుటచే స్కూలుఫయినల్ క్లాసులోనికి వచ్చినను, లేఖనవాచకకార్యములయందుఁ గూడ నసమర్థులై యుండుచున్నారు. వ్యాసరచనమునం దెందఱో స్కూలుఫయినల్ బాలకులై త్వేత్వము లెఱుఁగక వ్రాసినతప్పులు లెక్కకు మిక్కిలిగాఁ గానుపించుచున్నవి. పట్టపరీక్షవఱకుఁ గూడ నాంధ్ర మిట్టివిధానముననె బోధింపఁబడి పరీక్షింపఁబడు చుండుటచే నందుఁ గృతార్థులైనవారికిఁ గూడ నాంధ్రభాషాజ్ఞానము శూన్య మగుచు

న్నది. పైనిఁ జెప్పినయంశరాయము లొక్కయాంధ్రభాషకే కాక మిగిలిన దేశభాషలకన్నింటికిని గూడ నుండియుండవచ్చును. ఈకేతని విద్యనభ్యసించిన పండితోత్తములా? నవలలు, నాటకములు, శాస్త్రగ్రంథములు మున్నగునవి రచించునది? పాఠశాలలలోఁ బూర్వమున్న విధానమున జరగించిన యాంధ్రాభ్యసనము సంపూర్ణపాండిత్యము గలిగించునది కాకపోయినను బిమ్మట స్వయంకృషిచేనైనను నాంధ్రము నేర్చుకొన నర్హమైన దగుటచే నట్లొనర్చి యప్పటివారు కొందఱు చక్కనిపాండిత్యము సంపాదింపఁ గలిగెడువారు. ఇప్పటి విధానమట్టిదికాక యక్షరాభ్యసనము మొదలుకొని పరుల గురువుల యొద్దనే యభ్యసింపవలసినదైయుండుటచేఁ బూర్వమువలె వీరు స్వయంకృషికైనను నర్హులు కాకున్నారు. ఇప్పుడు పాఠశాలలలో బోధించు శాస్త్రవిషయము లన్నియు స్కూలుఫయినల్ వఱకు దేశభాషలలో బోధించినఁగాని విద్యార్థికి శాస్త్రపరిజ్ఞానము త్వరలో నలవడదు కావున నట్లు బోధింపవలసినదిగా మనవారు విద్యాశాఖాధికారులను బ్రోత్సహించుచున్నారు. మూఁడవఫారమువఱకు గణితము మున్నగునవి చెప్పుటలో నీవిధానమిదివఱకే యవలంబింపఁబడినది గాని; యాచెప్పువారు స్వయంకృషిచేతనైనను నాంధ్రభాషాజ్ఞానము సంపాదింపలేనివా రగుటచేతను, గ్రంథరచయితలుగూడ నట్టివారే యగుటచేతను, బాలకుల కీవిధానము వ్యర్థప్రాయ మగుచున్నది. నేను పైని జెప్పినలోపములను సంస్కరింపించి యాంధ్రము నభివృద్ధికిఁ దెచ్చినఁగాని మనవారు కోరునటులు స్కూలుఫయినలువఱకు శాస్త్రము లాంధ్రముననె బోధించుట యారంభించినచో నష్టయగును గాని లాభ ముండదు.

స్వయంకృషిచేఁ జక్కనిపాండిత్యము సంపాదించినవా రాంధ్రమున కవసరములైన శాస్త్రగ్రంథము లొకటి రెండు రచించినారు. అట్లు తాము రచించియుండుటచే నింకను రచింపవలసిన దనియు, శాస్త్రములు దేశభాషలలో బోధింపవలసిన దనియు, నిట్టివలవారిని, విద్యాశాఖాధికారులను బ్రోత్సహించుచున్నారు; కాని యిప్పటివీరి కట్టిసామర్థ్యము లున్నవా లేవా యనిమాత్ర మాలోచించినట్లగపడదు. అట్లాలోచింపక ప్రోత్సహించినను నేమిలాభము?

తమకువలెఁ బాండిత్యము కలుగుటకుఁ బాఠశాలలలోని విద్యావిధానమును సంస్కరింపించి, యిప్పటివారి కాంధ్రాంగ్లములలోఁ జక్కనిపాండిత్యమలవడునట్లు చేసి యట్టివారు బయల్వెడలినపిమ్మటఁ బ్రోత్సహించినను బాగుగ నుండును. శాస్త్రగ్రంథము లాంధ్రమునఁ గావలయు ననియు, స్కూలుఫయి

నల్వఱకు శాస్త్రములు దేశభాషలలో బోధింపఁబడవలయు ననియుఁ గోరు వారును, ఆంధ్రభాషాభివృద్ధికై పరిషత్తును స్థాపించి పనిచేయుచున్న పరిషన్నాయకులును, నికను నాంధ్రాభివృద్ధి కోరెడు రాజప్రముఖులును, బూనుకొని యీపాఠశాలలలోని యాంధ్రభాషాబోధనాపరీక్షా విధానమును జూచియు, బూర్వీయగ్రంథనిర్ణయమునందును గలుగుచున్న యాపద నైసర్గిక్యములను దొలఁగించి యాంధ్రము నభివృద్ధికిఁ దెచ్చినచోఁ బ్రత్యేకముగా నాంధ్రాంగ్లభాషాకోవిదులు బయలువెడలుదురు. అప్పుడు వారు శాస్త్రగ్రంథములు మనభాషలో రచించి బోధించి జనులకుఁ బ్రవృత్తియుండవలె నూతనవిషయములఁ గనుఁగొనుశక్తి కలిగించినచో వారు సమస్తకార్యములు నెఱవేర్చు నుండుట తటస్థించును. అప్పు డాంధ్రజాతియు దాని ననుసరించి దేశమును సంపూర్ణౌన్నత్యము నొందివిరాజిల్లుచుండును గాని యొకటిరెండు శాస్త్రగ్రంథములు వ్రాసియు నిఘంటుల నిర్మించియు శాస్త్రగ్రంథములు బయలువెడలవలయునని సభావేదికలపై నెక్కి గంభీరోపన్యాసములు చేసియు నెగడినంతమాత్రమున లాభము లేదు. కాఁబట్టి యోపరిషన్నాయకులార! ఓయాంధ్రభౌతికాదిశాస్త్రగ్రంథాభిలాషులార! ఓపండితప్రకాండులార! ఓస్వదేశోద్ధారకులార! శ్రీకృష్ణరాయావలంబనమున వినూత్నశోభావిరాజమానయై, రాజకీయాధికారము వహించి, మహానదీసైకతస్థలముల విహరించి, గోదావర్యాదిమహానదులఁ దీర్థమాడి శ్రీశైలద్రాక్షారామాదిపుణ్యక్షేత్రముల సందర్శించి, యుత్కలమధ్యరాష్ట్రమహారాష్ట్రదేశములు హద్దుగఁ గన్యాకుమారిగ్రపర్యంతము నైరంకుశ్యముగ విహరించియు నిప్పుడు నిరాలంబయగుటచే నాశమాత్రావశిష్టయై యున్నయాంధ్రభాషాయోషామణి నుద్ధరించుటకుఁ దృఢప్రయత్నులరగుఁడు; సంఘములు గట్టుఁడు; కృషిసలుపుఁడు; దేశము నుద్ధరింపుఁడు; కృతార్థులరగుఁడు.

శాస్త్రగ్రంథాదిరచయితలు వృద్ధులగుచుండుటయు, నిప్పుడాంధ్రభాష కేవలము హైన్యమునకుఁ బాల్పడుచుండుటయు, దానిపునరుద్ధరణమునకు సమర్థులైనవారు ప్రయత్నింపకుండుటయుఁ, జూచి సహింపలేక నీపాఠశాలలలోని యిప్పటివిధానమున నాంధ్రమును బోధించుచు నీవిధానతత్త్వము నెఱిఁగియున్నవాఁడ నగుటచే నందుండు లోపముల నాంధ్రభాషాభిమాను లగునాంధ్రులకుఁ దెల్పినచో వారు తత్సంస్కరణమునకుఁ బూనుకొందు రని యెంచి నిష్పాక్షికముగ యాథార్థ్యమును దెల్పితిని. ఇందుకుఁ బరీక్షాధికారులు మొదలగు వారలు నాపైఁ గినియకుందురుగాక!

ఇవటూరి సుందరయ్య.

# "విగుర్వించు" తత్సమమా? ఆచ్ఛికమా?

అనువిషయమును గుఱించి మహారాజశ్రీ కవిరాజ వత్సవాయ వేంకట నీలాద్రిరాజుగారు తణుకులో జరిగిన యాంధ్రసాహిత్యపరిషత్తునందు విగుర్వణ మనుపేర నొకవ్యాసమునుఁ జదువుచు "ఇందలినిజమును సాహిత్యపరిషత్సభ్యులగుబ్రహ్మశ్రీ శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రిగారు నిర్ణయింతురుగాక, అని యొకమాటను" శ్రీయుత తేవప్పెరుమాళ్లమహాశయుని స్థానమునసుండి భాషానిర్ణయము చేయుచున్న బ్రహ్మశ్రీ శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రిగారు కాని, యీమతము నభినందించిన శ్రీయుతనడకుదుటి వీరరాజుపంతులు గారు కాని, నాసందియములు తీర్చివైచి యింతకంటె దగ్గఱసంబంధము కన్నడభాషలో నిదర్శనపూర్వకముగ నిర్వచనము చేయుదురేని, నాయభిప్రాయము మార్చుకొనక పోవునంతటి దురభిమానిని గాను, అని యొకమాటను జదివిరి.

ఆసభలో నేనుగూడ నుండుటంజేసి తత్సభాధ్యక్షులగు మ॥ బ్ర॥ సాంఖ్యాయనశర్మగారు నాయభిప్రాయమును జెప్పుమని సెలవిచ్చుటచేత "విగుర్వించు" అనుపదము సంస్కృత మనుటకంటె, ఆచ్ఛిక మనుటయే యుక్త మని చెప్పియుంటిని.

అది యంతటితోఁ బోయిన దనుకొంటిని. కాని తర్వాత కార్తికమాస సారస్వతసర్వస్వమునఁ బ్రకటిత మగువారివ్యాసము నీనడుమ నొకనాఁడు మ॥ బ్ర॥ వీరరాజుపంతులుగారు నాకుఁ జూపి దీనికి సమాధానము వ్రాతమూలముగాఁ బంపవలసియున్న దని సెలవిచ్చి వా రాపత్త్రము నాకు దయచేసిరి. నేఁడు కొంతయవకాశము కల్పించుకొని వ్యాసము చదివి నాకుఁదోఁచినవిషయములు వ్రాయఁదలఁచితిని. ఈపదమును నేను బనిచేయుచున్న శ్రీసూర్యరాయాంధ్రనిఘంటుకార్యస్థానమున నిఘంటుపద విమర్శనకర్తలింతవఱకు విమర్శించియుండలేదు, గాన, నిది నాయభిప్రాయముగానే గ్రహింపవలయును. వారు ముం దెట్లు నిర్ణయింతురో చెప్పఁజాలను.

దీనిపూర్వోత్తరములు:—నన్నయభట్టారకుఁడు భారతమున, ఆదిపర్వ సప్తమాశ్వాసమునందు

క. గర్వించిపలికెదె యనిన్, గర్వము భుజవీర్యమును బ్రతాపంబుగ నీ
పర్వతనివహము దెచ్చి వి, గుర్వింపుము మాత వినిన గోత్రభిదుండున్."

అని ప్రయోగించినాఁడు. ఈయుదాహరణములతో శబ్దరత్నాకరకారులు "విగుర్వించు దే. స. క్రి. (విఱుచు + విఱుచు) చక్కఁగా విఱుచు" అని వ్రాసిరి. అంతకుమున్నే బ్రౌనునిఘంటువున "విగుర్వించు (Tel.) విఱుచు విఱుచు, చక్కఁగా విఱుచు అని వ్రాయఁబడెను. ఇతరులకిదే మూలాధారము.

ఆంధ్రపదపారిజాతమున "విగుర్వించు=చక్కఁగా విఱుచు" అని యున్నది. నన్నిచోడకుమారసంభవము వెలువడువఱకు భారతప్రయోగ మొండే యుండెె.

"గణముఖ్యులు తలతలమని వెఱలి విగుర్వించి" అనుకుమారసంభవ ద్వితీయాశ్వాసమునందలి (౧౪౯) ప్రయోగము రెండవ దయ్యె. కుమారసంభవముననే ద్వాదశాశ్వాసమున ౧౭౫ పద్యమున "పటుదోర్బలగర్వవిగుర్వణంబులన్" అను ప్రయోగ మొకటి కనఁబడుచున్నది. క్రొత్తగాఁ బ్రకటింపఁబడిన (South Indian Inscriptions Vol. IV) శాసనములలో ౯౭౨-వ శాసనమునందు "కోరిశశాంకమౌళికి విగుర్వనతో గుడి నిల్పె" అని యున్నది. ఇంకముం దేమి లభ్య మగునో తెలియదుగదా!

పైసామగ్రి ననుసరించి కీర్తిశేషు లగు తం॥ వేదపెరుమాళ్లయ్యగారు దీనిని దేశ్యపదముగా గ్రహించి యాంధ్రగ్రంథములలోఁ బ్రయోగబాహుళ్య ములేక, కన్నడగ్రంథములయందుఁ బ్రాయికముగా నుండుటచేత దీనిని కన్నడ పదముగా గ్రహియించి దేశ్యధాతువుపై సంస్కృతధాతువుపైఁ జేర్పఁదగిన ల్యుట్ప్రత్యయము చేర్చి ప్రయోగించుట, అనఁగా విగుర్వణము అని ప్రయోగించుటయు నది సంస్కృతసమాసమున నిముడ్చుటయు న్యాయ్యము కాదని యెంచి కాఁబోలు "దోర్బలగర్వవిగుర్వణంబులన్" అనుకుమారసంభవమందలి ప్రయోగము విచారణీయ మనిరి.

దానిని బ్రమాణముగాఁ గొని మ॥ బ్ర॥ వీరరాజుపంతులుగారు "విగుర్వణ మనునది కర్ణాటభాషాసంబంధిపద" మనిరి. దానిపై బ్ర॥ కట్టి సాంబమూర్తిశాస్త్రిగారు సారస్వత సర్వస్వమున సద్విమర్శనము అనువ్యాసమున "విగుర్వించు" సంస్కృతధాతు వని యేమేమో వ్రాసినారు. అది తర్వాత విమర్శింపఁబడును. దానిపై బయలువెడలినది శ్రీకవిరాజ నీలాద్రిరాజవ్యాసము. ఈపదము విమర్శించిన నలువురును నాకుమిత్రులే! ఎవరిభావమును నిరాక

రించుట నా కిష్టము లేదు. కాని కవిరాజుగా రన్నివిధములఁ గోరినపుడు నిజమని నాకుఁదోఁచినది చెప్పక తప్పినదికాదు.

శ్రీనీలాద్రిరాజుగారు ఇందు "విగుర్వించి" "విగుర్వింపుము" అనుపదములు "విగుర్విసిద" అనుకన్నడక్రియనుండి వచ్చె ననియు దీనికి భయంకరత్వము చూపుట యర్థ మని యు తేనప్పెరుమాళ్లయ్యమహాశయులు వ్రాసిరి. ఈపదములు కన్నడక్రియనుండి వచ్చెననుటలో మూఁడుదోషములు కనఁబడుచున్నవి. వాని నిక్కడఁ జూపుచున్నాను" అని త్రిదోషారోపణము చేయఁదలఁచి శబ్దసంస్కారదోష మనుపేరితో "విగుర్విసిద" అనుధాతువునకు ఇంచుగాగమము చేసిన "విగుర్విసిదించు" అని యుండవలయును - - - - - కృత్ ప్రత్యయముఁ జేర్చిన "విగుర్విసిదనం" అగునే కాని విగుర్వణము కానేరదు. అని వ్రాసిరి.

కీ॥ శే॥ శ్రీ॥ తేనప్పెరుమాళ్లయ్యగా రిచ్చినది "విగుర్విసు" అను ధాతువుపై సిద్ధించిన భూతకాలప్రత్యయసహితరూప మని యు ధాతురూపము విగుర్విసు అనియు శ్రీరాజుగారు గ్రహించియున్నచో శబ్దసంస్కారదోష మెంచియుండరు. ఒకవేళ "విగుర్విసిద" అనునదే ధాతురూప మని వారు గ్రహించినను కన్నడధాతువుపై సంస్కృతకృత్ ప్రత్యయముచేర్చు టెట్లు? కావున తెలుఁగున "విగుర్వించు" అనునట్లు కన్నడమున "విగుర్విసు" అనునది ధాతురూప మని గ్రహింతురుగాక! తర్వాత "కన్నడక్రియ యనుకొందుమేని యర్థము గూడ సరిగా లేదు. (విగుర్విసిద అనుకన్నడక్రియకు భయంకరత్వము చూపుటగదా! యర్థము) పటుదోర్బలగర్వముయొక్క భయంకరత్వము చూపుట యనుదానికంటె దోర్బలగర్వము యొక్క మహోద్యమముచేత ననునర్థము సంగతమై యున్నదిగదా!" అని యాక్షేపించిరి.

రాజుగారు అర్థదోష మని యిటనెంచి కొంచెము వ్రాసి మరల వ్యాసాంతమున "అర్థవిచారణ" అనుపేరితోఁ గొంతచర్చ గావించిరి. నేను నాసందర్భముననే దీనియర్థ మెట్లు సంగత మగునో యచ్చట వ్రాసెదను. ఇంకఁ దృతీయము ప్రయోగదోష మఁట. "మఱియు ప్రయోగదోషము కూడఁ గన్పట్టుచున్నది. పుడమిఱేఁడు, పాల్కడలిశయనుఁడు, ఇట్టిసమాసములు ద్రావిడభాషయం దున్నవి. వానిని గ్రహించునప్పుడు పైరీతిప్రయోగములు గానవచ్చుచున్నవి. కాని కవిరాజశిఖామణి సంస్కృతపదముతర్వాత ద్రావిడభాషాపదమును సమాసమందుఁ బ్రయోగించుట కనము, అని కవిరాజుగారు వ్రాసిరి.

ద్రావిడభాషయం దున్న "పుడమిఱేఁడు, మున్నగుపదము లాంధ్ర గ్రంథములందుఁ బ్రయోగించుట కలదనుట కవిరాజుగారి కంగీకారమే. కాని కవిరాజశిఖామణిగా రట్టివారని గారను గట్టినమ్మికయే వీరి నింత బాధించినది. కుమారసంభవము చిత్తగించినచోఁ గవిరాజశిఖామణిగారు సంస్కృతదేశ్యము లకు సమాసము చేయుట కల దని విశద మగును. స్థాలీపులాకన్యాయముగాఁ గొన్ని చిత్తగింపుఁడు.

౧. పుడమిపుఁడున్ ధనాఢ్యుఁడును ౧౧ ఆ. ౬౧౪.

౨. { అశ్వాశ్వతరశిబికాందోళకరికరిణీకరభారదానీకవాహ। నంబులు ౧౧-౫౯౨.
అనఁగఁగరులు నభమునరదాశ్వభటతతి ౧౧ ఆ. ౬౪౬.
అస్త్రాయుతవాకీనాతి భీమంబరదకమఠము ౧౧ ఆ. ౭౬౩. }

౩. వనలచ్చి (ఆ. ౫-౬౦౨) తంజా॥ భాం- వ్రాఁతప్రతి. వనలక్ష్మియని ముద్రితము.

౪. రాగదీవియులు(ఆ ౮-౯౪) తంజా॥ భాం॥వ్రాఁతప్రతి. వలపుదీవియలు అని ముద్రితపాఠము.

కుమారసంభవము ముద్రించిప్రకటించిన మ॥ రా॥ మా॥ రామకృష్ణకవి గారు పుడమి, అరదము అనునవి సంస్కృతములేమో యని తమటిప్పణిలో సూచించిరి. కాని అవి సంస్కృతపదము లనుట సంప్రదాయవిరుద్ధము. ౪-౫ ఉ॥ లో, కవిగారు దిద్దుట కవిరాజశిఖామణిగారికి నిషిద్ధమిశ్రసమాసరచనాదోష ము తగులకుండుట కని తోఁచెడిని. అట్లు దిద్దుటవలన ౫ ఉ॥ లోఁ గవి యుద్దేశించిన భావమునకు భంగముగూడఁ గలిగినది.ఏది యెట్లున్నను, ఉన్నది యున్నట్లు చూపినఁ గాని యాథార్థ్యమును బాఠకులు గ్రహింపనేరరు గదా?

కవిరాజశిఖామణిగారి ప్రయోగములలో దేశ్యసంస్కృతపదములు సమ సింపఁజేయుట యనుప్రయోగదోషమునుబట్టి దీనిని సంస్కృత మని సాధింప రాదు. కాని దేశ్యక్రియపై ల్యుట్ ప్రత్యయప్రయోగముప్రామాదికమేమో! లేదా పైని నిరూపించిన శాసనము శాలివాహనశకము ౧౦౬౧ సంవత్సరమం దలిది. కావున ఆకాలమున "విగుర్వనతో" అనురూపము వాడుకలో నున్నట్లు తోఁచెడిని. విగుర్వన, అనుదానికి "విగుర్వనము" అనురూపము గూడ నుండెనేమో! ఎట్లైనను "విగుర్వించు" దేశ్యపద మని సంప్రదాయ ముండఁగా నీప్రయోగము నొక్కదానిని బట్టి దానిని మార్చుటకంటె దీనివివ

యమున నే సందేహించుట యుక్తియుక్త మని తోఁచెడిని. కవిరాజుగారు, "ఇది సంస్కృతపద మనుకొన్న నీదోషములు శమింపఁగలవు" అనిరి. కాని యీదోషము లు మిథ్యాదోషములు. సాధనము మిథ్యాసాధనము. శమనమును మిథ్యాశమ నమే. అంతయు భ్రాంతిజాతము.

శ్రీనీలాద్రిరాజుగారు ఉద్యమార్థకమగు "గుర్వీ" యను సంస్కృతధాతు వునకు "వి" అను ఉపసర్గము కూర్చి 'విగుర్వించు, విగుర్వణము' అనురూప ములు సాధింపఁ దలఁచిరి. కాని యప్పుడు విగూర్వించు, విగూర్వణము అని దీర్ఘసహితములుగా నుండవలయు నని సందేహించి హ్రస్వసహితరూపము లే సాధింప నిటఁ బెద్దవ్యాకరణశాస్త్రార్థము పెంచినారు. కొంచె మోపికతోఁ జిత్తగింపుఁడు.

విపూర్వకగుర్వీధాతువుకంటె ల్యుట్టు చేయుఁగా "విగుర్వణ" మనురూపము నిష్పన్న మగుచున్నది. ఇక్కడ విగూర్వణ మనియే కాని విగుర్వణము అనఁ గూడ దని కొందఱభిమతమున వాదమున్నది. - - - - విగుర్వ్, దానిలో ఉకార మునకు దీర్ఘము రాఁగా "విగూర్వణ" మయినది. కుర్దఖుర్దాదిధాతువులకు నీరీతిరూపమే వచ్చును. ఇట్లుండ స్ఫూర్జధాతు వొకటి ధాతుపాఠమున దీర్ఘ యుక్తము పఠింపఁబడుట చూడఁగా నీదీర్ఘవిధానము నిత్యముకాదనియు "సంజ్ఞా పూర్వకోవిధి రనిత్యః" అనుపరిభాషకు జ్ఞాపక మనియు మాధవవృత్తికారులు వ్రాసిరి. కాన విగుర్వణ మనుహ్రస్వరూపము వచ్చుట కభ్యంతరము లేదు." అని రాజుగారు వ్రాసిరి.

మాధవీయధాతువృత్తిలో "టు ఓస్ఫూర్జావజ్రనిర్ఘోషే - - - - అస్య దీర్ఘోపదేశేన ఉపధాయాం చేతి దీర్ఘస్య అనిత్యత్వజ్ఞాపనాత్, ముర్ఛతి, హుర్ఛతి, స్ఫుర్ఛతీ త్యపి భవతీతి కేచిత్. ఇతి మైత్రేయప్రతిపాదితే" అని యున్నది. స్ఫూర్జ అనుచోట దీర్ఘవిధానము వ్యర్థమయి ఉపధాదీర్ఘానిత్యతకే జ్ఞాపక మగు చున్నది; గాన హుర్ఛతి, ముర్ఛతి, స్ఫుర్ఛతి అనియు నగునని కొందఱు అని యున్నది. సంజ్ఞాపూర్వకో విధిరనిత్యః అనుపరిభాష "ఓర్గుణః" అనుసూత్ర మందు "ఓరోత్" అనిన సరిపడుచుండఁగా "గుణః" అనిచెప్పుటవలన జ్ఞాపిత మైనది. కాని దీనివలన జ్ఞాపిత మని లేదు. ఈ శాస్త్రార్థ మిట ననావశ్యకమని విడుచుచున్నాను.

ఆపరిభాషమాట కేమి మాధవీయధాతువృత్తికారులు "ఉపధాదీర్ఘా నిత్యత చెప్పినారు గదా! దాన మాకత్యంతాభీష్టసిద్ధియే యని సంతసించెద రేమో! ఆయుపధాదీర్ఘానిత్యతను గుర్వీధాతువిషయమునఁ బ్రవర్తింపఁజేయుట

శ్రీరాజుగారికిఁ బ్రమాణభూతులైన మాధవీయధాతువృత్తికారులకును ప్రసిద్ధ వ్యాకరణగ్రంథకర్తలకును నిష్టముగునో కాదో విచారింపక సంతసింపరాదుగదా!

మాధవీయధాతువృత్తికారులు "గుర్వీ ఉద్యమే" గూర్వతి, గూర్వ అని వ్రాసిరి. వైయాకరణసిద్ధాంతకౌముదిలోను కౌముదీవ్యాఖ్యానములోను దీర్ఘ యుక్తముగానే కనఁబడుచున్నది. దానిఁబట్టి ఉపధాదీర్ఘానిత్యత గుర్వీధాతు విషయంబునఁ బట్ట దని వైయాకరణుల యభిప్రాయమైనట్లు స్పష్టమగుచున్నది, "విగుర్వణ మను హ్రస్వరూపము వచ్చుట కభ్యంతరము లే"దని శ్రీకవిరాజుగారు వ్రాసిరికాని యవకాశమే లేదు.

తర్వాత "ఇంతియకాక గుర్వీధాతువుయొక్క తిజంతరూపమగు గుర్వతి అనుపదమును" గర్వధాతువుయొక్క తిజంతరూపమగు "గర్వతి" అనుపదమును దగ్గఱగా వ్యాకృతము లగుచున్నవని వ్రాసిరి. "దగ్గఱగా వ్యాకృతము లగుట" యననేమో! దానికేమిగాని యొక్క విశేషము కలదు, దీనికిఁ బోలికగా "కుర్ద నము" అనుదానిని గ్రహించి కొంత ప్రతిపాదించిరి. అమరకోశవ్యాఖ్యలలో నొకటియగు గురుబాలప్రబోధికలోఁ దప్ప మిగినచోట్లను "కూర్దన" మనియే కలదు. భానోజీదీక్షితామరవ్యాఖ్యలోఁ గూడ "కూర్దన" మనియే యున్నది. కొన్నినిఘంటువులలో రెండురూపములును గలవు. దీనివిషయమున మన మాధవీయధాతువృత్తికారులు కుర్దఖుర్దధాతువుల క్రింద "స్ఫూర్జేర్దీర్ఘోపదేశా దుపధాయాంచేతి దీర్ఘ ఏషాం న ఇతి చంద్రః మైత్రేయసంమతాఘోర విస్తారకారాదయస్తు దీర్ఘత్వమిచ్ఛంతి-కూర్దతే-చుకూర్దే-కూర్దితా" అనిచెప్పి యుండిరి. స్ఫూర్జధాతువులోని దీర్ఘోపదేశమువలన వీనికి దీర్ఘము రాదని చాంద్ర మత మనియు మిగిలినవారిమతమున దీర్ఘమే యనియు వ్రాసి తాను దీర్ఘసహిత రూపములను దాహరించినాఁడు. కావున నొకనిమతమునమాత్రము కుర్దన మను రూపము కలదు. ఇతరమతములందు కూర్దన మనియే. గుర్వీధాతువిషయమున నెల్లరమతమునను దీర్ఘసహితరూపమే కనఁబడుచుండఁగా, ఆరెంటికిఁ బోలిక యెట్లు? కుర్దనముఁ బట్టుకొని గుర్వణమునకై గ్రుద్దులాటయెట్లు? గణయతి ప్రాసభంగములు లేవుగదా! "గూర్వించు" అయిన నేమి? "గుర్వించు" అయిన నేమి? ఎందులకీశాస్త్రార్థ మందురా? దీనికి శ్రీమిత్రులయాజ్ఞ నెఱవేర్చుటయే ఫలము. ఇది అచ్ఛికమా? సంస్కృతమా యనువిచారణ మింకను నవశిష్టమే.

వి + గుర్వీధాతువుకంటె తెలుఁగున "ఇంచు" చేర్పఁగా విగుర్వించు అని యు, కన్నడమున ఇసుచేర్ప విగుర్విసు అనియు రూపము లేర్పడవచ్చును. కాని

యిది సంస్కృతాభాసము. దీనిపై వచ్చిన విగుర్వణ అనురూపమును దీనిపోలిక గా "అగుర్వి" (కుమారసంభవము, ప్రథ-౩౮-వ ప), గుర్వ నిర్వచనోత్తరరామాయణము ౩-౭౫ (ఇట అగుర్వ అని వ్రాఁతప్రతియందున్నది) అనురూపములు ఆంధ్రమునను, 'విగుర్వణ' విగుర్వ, విగుర్బణె, విగుర్బ, అనునవియు దీనిపోలికగల 'అగుర్విసు' అగుర్వ, అగుర్బిసు, అగుర్బ, అగుర్వణె, అగుర్బణె, గుర్వ, గుర్బ, మొదలగునవి కన్నడమున పంపరామాయణాదులయందును కనఁబడుచున్నవి. ప్రాచ్యనిఘంటు శబ్దరత్నాకరాంధ్రపదపారిజాతాదులలో వెనుక నే నుదాహరించినట్లు ఆచ్ఛికమనుటయే యాంధ్రసంప్రదాయము.

కన్నడభాషలోఁ గూడ నిది కిట్టెలుపండితుని నిఘంటువున దేశ్యముగానే గ్రహింపఁబడినది. 'విగుర్విసు,' అగుర్విసు, విగుర్వ, గుర్వ అగుర్బణె, విగుర్బణె, మున్నగువానికిఁ బరస్పరసంబంధము కలదని సూచింపఁబడినది. విగుర్వణ, అగుర్వణ, గుర్వ మొదలగువానిని సంస్కృతపదము లని సాధింపశక్యము గాదని తోఁచెడిని. కావున 'విగుర్వించు' సంస్కృతధాతువు గాఁగనఁబడుట ఘుణాక్షరన్యాయసిద్ధ మని నాయభిప్రాయము. ఈసందర్భమున నొకటి తెలుపవలసియున్నది. బ్ర॥ కల్లి సాంబమూర్తిశాస్త్రిగారు రక్తాక్షి భాద్రపదసారస్వతసర్వస్వమున "ఇది (విగుర్వించు అనుపదము) కర్ణాటకపద మని కొందఱందురు. కాని వారికి గన్నడభాషాపరిచయము తక్కువగుటచే నీభ్రమ జనించిన దనవచ్చును. కన్నడనిఘంటువులందు, ధాతుపాఠములందు నీధాతువు సంస్కృతీయముగా నిర్దేశింపఁబడినది. దీనిని బట్టి శ్రీనడకుదుటి వీరరాజుపంతులుగారు శారద I. సంపు ౯ సంచిక ౮౯౧ పుటయందు వ్రాసిన నన్నెచోడకవి 'విశృంఖలముగా సంస్కృతములలో నన్యభాషాపదములం జేర్చి మిశ్రసమాసముగాఁ బ్రయోగించె నను నిందారోపణము కూడ నన్యభాషాపరిజ్ఞానరహిత విమర్శకతావిలాసమే యనవలయును" అని వ్రాసియున్నారు.

సద్విమర్శనమునుపేరితోఁ గొంతఱకు "కన్నడభాషాపరిచయము తక్కువగుటచే జనించిన భ్రమను మ॥ వీరరాజుగారి యన్యభాషాపరిజ్ఞానరహిత విమర్శకతావిలాసము"ను ఉగ్గడించు నామిత్రు లాపద మేపుస్తకమున సంస్కృతీయ మని యున్నదో స్పష్టముగా సూచింపరైరి. కిట్టెలుపండితుని నిఘంటువునను కర్ణాటకకల్పద్రుమమునను నిది దేశ్య మనియే యున్నది. శబ్దమణిదర్పణమందు ధాతుపాఠమున ఆశబ్దమే కనఁబడలేదు. ఇంక వారు చిత్తగించిన గ్రంథము పేరు తెలుపరైరి.

ఇది కన్నడ మనుఁడు తెలుంగనుఁడు. రెండును ననుంచు, దేశ్యమే కావలయును లేదా తద్భవ మనవచ్చును. ఏమైనను ఆచ్ఛికమే కాని సంస్కృతపదము మాత్రము కాదు. ఇంకఁ గవిరాజుగారి 'అర్థవిచారణ'కు వత్తము శ్రీరాజుగారు వ్రాసినట్లు, నన్నయభట్టారకుఁడు --- సంస్కృతమున నున్న పదములకు ధాతువులకు సరియగు పదములు ధాతువులు నిలిపియున్నవారు గారు, కావున సందర్భశుద్ధార్థము గ్రహించుట కవిరాజుగారి కిష్టమే కదా!

అర్థనిర్ణయమందుఁ బ్రకరణశుద్ధార్థము నిర్ణయించి ప్రయోగాంతరముల చేతను భాషాంతర వ్యవహారములచేతను దానిని సమర్థింపయత్నించుట భాషా వేత్తలపద్ధతి గదా! పూర్వనిఘంటుకారులు ప్రమాణముగా గ్రహించిన భారత ప్రయోగమునందు పెక్కు పాఠభేదములు గలవు. మొదటిదగు బ్రౌణ్యనిఘంటువున నుదాహరణ మీకుండుటచేతఁ దాత్కాలికపండితులు, ఏకారణమున "చక్కగా విఱుచు" అని వ్రాసియుందురో చెప్పఁజాలము తరువాతి వారగు శబ్దరత్నాకరకారులు బ్రౌణ్యనిఘంటువునందలి యర్థమును వ్యుత్పత్తిని గ్రహించి పర్వతశిఖరంబెత్తి విగుర్వింపుము, అను పాఠము నుదాహరించిరి. ఆవ్యుత్పత్తియు నర్థమును చింత్యములు.

పెరుమాళ్లయ్యగారి యర్థము "భయంకరత్వము చూపుట" ఇంక మనరాజుగారి యర్థము 'ఉద్యమించుట'. ఉద్యమించుట యనఁ గడఁగుట, యత్నించుట గదా! దేనికై యీయుద్యమము? తెర్చుట కనిగాని గెల్చుట కని గాని దింపుట కనిగాని లేదే! తెర్చి గెల్చి, డ్రెచ్చి, దింపి మున్నగు పాఠభేదము లే యుండుటచేత ఉద్యమించుట యనునర్థము సరిపడదు. కుమారసంభవమందలి 'విగుర్వించు' కూడ నుద్యమార్థక మనుట ప్రకరణోచితము కాదు.

ఇంక వారుచూపిన "దోర్బలగర్వవిగుర్వణంబులన్" అనుచోట "గర్వము యొక్క మహోద్యమ" మననేమి? గర్వమెందులకు మహోద్యమము చేయును? అక్కడను ఉద్యమార్థము కుదురుటలేదు. గర్వాతిశయము గర్వవిజృంభణము అనుట కవిప్రసిద్ధము గావున 'విజృంభణార్థ' మీట సరిపడును. పర్వతవివరముఁ దెర్చి విగుర్వింపుము చూతము అనుచోట నీయౌద్ధత్యము చూపుము, భీకరుఁడ వగుము, విజృంభింపుము, అని యర్థము. పెరుమాళ్లయ్యగారిచ్చిన భయంకరత్వము చూపుట యనునర్థమే కొంతసంగతముగా నున్నది. ఉద్యమార్థమున కుద్యమించుటయే యసంగతము.

దీని పోలికగల "అగుర్వు" కుమారసంభవ ప్రయోగమునకు భయంకర మనునర్థమును "గుర్వు, నిర్వు" ఉ॥ రా॥ ప్రయోగమున విజృంభణార్థము, (అతిశయార్థము) సరిపడును. ఈయర్థము సమర్థించుకొనుటకై కన్నడభాషలోని యర్థములు చూతము.—కిట్టెలుపండితుని నిఘంటువున విగుర్వను, అగుర్వను, విగుర్బిసు, గుర్బిసు మొదలగువానికి భీకరమగు, భీకరత్వముచూపు, అని రెండర్థములు గలవు. పంపరామాయణమునను కన్నడబసవపురాణమునను విజృంభణార్థము తెలుపునట్టి యుదాహరణములు పెక్కులు కలవు. వీనినుండి ఔద్ధత్యము చూపుము, విజృంభింపుము, అనునర్థము సమర్థింపనచ్చును. మొత్తమున అచ్చికమనుటకే ప్రబలప్రమాణములు గనఁబడుచున్నవి. సత్యాసత్యనిర్ణయభారము పాఠకులపైఁ బెట్టి నేను విరమించుచున్నాను.

శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రి.

# [illegible]

శ్లో. వాగర్థావివ సంపృక్తౌ వాగర్థప్రతిపత్తయే।
జగతః పితరౌ వందే పార్వతీపరమేశ్వరౌ॥

ఆంధ్రవాణి కృష్ణదేవరాయలు, రాజరాజనరేంద్రుఁడు మున్నగు భాషాపోషకులవలనఁ గ్రమక్రమాభివృద్ధినొంది, వాగనుశాసనుఁ డగు నన్నయభట్టుచేతను, ఆంధ్రకవితాపితామహుఁ డగు పెద్దనార్యునిచేతను, శ్రీనాథుఁడు, బమ్మెరపోతనామాత్యుఁడు మున్నగు మహాకవులచేతను నవరసరసాలంకారశోభితయై నియమబద్ధురాలై దశదిశలఁ దనయశశ్చంద్రికలు వెదచల్లుచుండెను.

ఇట్లుండఁ దగుపోషకులు లేకను, విశేషసంఖ్యాకు లగువిద్వత్కవు లుత్పన్నము గాకుండుటచేతను మధ్యకాలమున నాంధ్రవాణి కొంచెము తలవాంచియుండెను. కాలక్రమమున పీఠికాపురాధీశ్వరునివంటి యభినవకృష్ణదేవరాయలును, శ్రీతిరుపతివేంకటేశ్వరులవంటి విద్వత్కవీంద్రులును నాంధ్రభూమికిఁ గలుగ మరల నొక్కమారామె పూచినచెంగల్వవలెఁ దనపరిమళమును వెదచల్లుచుఁ దలయెత్తి ప్రకాశించుచుండెను. భారతము, రామాయణము, బ్రహ్మాండపురాణము, దేవీభాగవతము మున్నగు గ్రంథములను పూర్వకవుల కీడగువడువున నాంధ్రీకరించిన కవిశిఖామణులును బ్రత్యక్షముగఁ గానవచ్చిరి. కొన్ని ప్రబంధములు, నాటకములు, నవలలుఁ గూడ వెలువడెను. ఏవంకఁ జూచినను నాంధ్రభాషాభివృద్ధియే కానవచ్చెను. స్వల్పసంఖ్యాకు లగువిమర్శకులును దృక్పథమునఁ బడఁజొచ్చిరి.

ఇట్లాంధ్రవాణి యఖండైశ్వర్యమునఁ దులఁదూఁగుచుండునంత పాశ్చాత్యవిద్యావ్యామోహితు లగుకొందఱు సంస్కృతాంధ్రవిద్వాంసులు 1912-1913-1914 సం॥రములలో గ్రామ్యభాషను గ్రాంథికముగ మార్చి యనక్షరాస్యు లగువారిని పండితులుగను నాంగ్లవిద్యాపారంగతు లగువారిని నాంధ్రభాషాశాసనకర్తలుగను జేయనుంకించి యొక్కపెట్టున నాంధ్రవాణి నటమట పెట్టఁజొచ్చిరి. ఏతత్ప్రయత్నమునకే భాషాసంస్కార మనునుత్కృష్టనామ మిడిరి. అప్పుడామె తగువిద్వాంసుల చెట్టవట్టి యాంధ్రసాహిత్యపరిషదవతారమున విజృంభించి గ్రామ్యభాషపై దిగ్విజయముఁ గాంచి తొంటియ ట్లాంధ్రదేశము నేలుచుండెను. నాఁటికి వార్తాపత్రికలసంఖ్యయు నవలలు, నాటకములు, ప్రహ

సనములు, భాషావిషయిక మగుమాసపత్రికలు భాండాగారములు నిప్పు డున్నవి లేవు? ఈ పైవిషయంబులయందు నాఁటికిని నేఁటికిని దగినయభివృద్ధియున్న ట్లెంచక తప్పదు. కాని యిప్పటి కీవిషయమున నాంధ్రవాణి సంపూర్ణముగ నలరారు చున్నది.

కాని యీమెకుఁ గొన్నియపశకునములు గాన్పించుచున్నవి. మేఘుచ్ఛన్నమే యగునో కళావిహీనమే యగునో యని నామది సంశయించుచున్నది. ఆంధ్రపత్రిక కృష్ణాపత్రికలు చిరకాలమునుండి శక్య మగునంతభాషాసేవ చేయుచున్నవి. శారద, భారతి, సాహితి, ముద్దులమూఁట, ఆంధ్రసర్వస్వము, సారస్వతసర్వస్వము మున్నగుపత్రికాగాజములు బయలువెడలి భాషాసేవ చేయుచున్నవి. కాని యిందు కొన్నిపత్రికలకు మోమోటమి యెక్కువ, నిష్పాక్షికబుద్ధి తక్కువ. పత్రికాగౌరవమును నిలుపుకొనుటయె కొన్నిటికిఁ బరమావధి. అట్లుగాక కొన్ని మొగమోటమిలేక కేవలాంగ్లభాషావేత్తల యభిప్రాయములను మాత్రమే యాదర్శముగఁ గైకొనక శాస్త్రీయ మగుపద్ధతి ననుసరించి నిజముగు భాషాసేవ చేయుచున్నవి. కొన్ని యెట్టివిషయము లెట్టిభాషలోఁ బ్రకటించిన విశేషజనాకర్షకముగ నుండునో యెయ్యది విశేషధనార్జనకు మూల మగుమార్గమో యద్దానినిమాత్ర మనుసరించుచున్నవి.

ఈసందర్భమునఁ బత్రికావిలేఖకులను సంపాదకులను గూర్చి కొంత చెప్పుట యప్రస్తుతము కానేరదు. విలేఖకులసంఖ్యయు మునుపటికంటె నభివృద్ధి యైనది. కాని విలేఖకులలోఁ దాము వ్రాసెడి విషయములు నిజముగ దేశమునకును భాషకు నుపయోగించుచున్నవా యని విమర్శించుకొనువారిసంఖ్యమాత్ర మల్పమే.

ఇందువలననే పత్రికలకు విషయములు తడవుకొన నక్కఱ లేకపోవుచున్నది. ఇఁకఁ బత్రికాధిపతులలోఁ జిరకాలానుభవము గలపెద్దలమాట నేను విశేషించి చెప్పుట యనవసరము. కొందఱు పత్రికాధిపతులు వాదోపవాదములు వచ్చినపుడు తాము పక్షమును వహించియో తాటస్థ్యమును వహించియో విషయమందలి సత్యమును సువ్యక్తముఁ గాకుండునట్లు చేయుచుండుటయుఁ జూతుము. ఈపంథ పత్రికాగౌరవమును గాపాడుకొనుటకై యుండనోపు.

భారతి, సాహితి, యెడనెడ శారద మున్నగుపత్రికలలో నింద్యగ్రామ్యభూయిష్ఠము లగుచక్కనిభావములతో సంతరింపఁబడిన వని చెప్పఁబడు పాటలు పెక్కులు గానవచ్చును ~~ఇట్టి~~పాట లాంధ్రసారస్వతమున కత్యవసరము లనియో

లేక విద్యాధికులు రచించి రనియో పామరరంజకము లనియో యయ్యవి లేకున్నఁ బత్త్రికలయొక్క సర్వతోముఖత్వమునకుఁ గొఱంత వాటిల్లు ననియో వారు ప్రకటించుచుందురు. ఆంధ్రదేశమున నట్టిపాటలు రచించువా రయిదాఱుగురు మాత్రము గలరు. కొందఱు సాధ్య మగునంతవఱకు సుష్ఠుగు పదములనే యుపయోగింతురు. అట్టిపాటలలో శ్రీనండూరి సుబ్బారావు బి. ఎ. గారిపాట లగ్రగణ్యత వహించును. అట్టిపాట లపశబ్దభూయిష్ఠము లగుట నాంధ్రవాఙ్మయమున కనర్థకము లని నే నభిప్రాయపడి భారతి వైశాఖసంచికయందు వారిపాటలను స్థాలీపులాకన్యాయముగ విమర్శించితిని.

నావిమర్శనముపై సాహితి 7, 8 సంచికలయందు 'యెంకిపాటలు' అను శీర్షికతో సంపాదకుని ప్రతివిమర్శకవ్యాసమును 'నాకుతోచినట్లు' అనుశీర్షికతో మఱియొకవ్యాసమును గాన్పించినవి. ఇందు మొదటిదానియందు శ్రీసుబ్బారావుగారు 'మహాకవి' యనియు, ఆయనకవిత్వము నిర్దుష్టమును వర్ణనాతీతము నని శ్లాఘింపఁబడియున్నది. రెండవవిమర్శ శ్రీసుబ్బారావుగారిపాటలను సంపూర్ణముగ గర్హించుచున్నది. సాహితి 9, 10 సంచికలయందు శ్రీ అరికపల్లి లక్ష్మీనరసింహారావు B .A., & B. L., గారు శ్రీసుబ్బారావుగారిపాటలను భాషావిషయమున మిక్కిలి గర్హించిరి. 16-5-24 తేది 'జ్యోతి' పత్త్రికయందు తత్సంపాదకుఁడును భారతి జ్యేష్ఠసంచికయందు సోమంచి సూర్యనారాయణగారును శారద జూలైసంచికయందు శ్రీపంచాగ్నుల ఆదినారాయణశాస్త్రులవారును శ్రీసుబ్బారావుగారిపాటలనుబలపఱుచుచుఁ బ్రతివిమర్శలను బ్రకటించిరి. అందుకు నాప్రత్యుత్తరము ఆగష్టునెల శారదలోఁ బ్రకటింపఁబడి యుండవలసినది. అట్లు గాకుండుటకుఁ గారణము మృగ్యము.

పైవిమర్శనప్రతివిమర్శనముల నుండి భిన్నరుచుల యుదాహరణకొఱకుఁ గొన్నిభాగములను జూపెదను.

(యెంకిపాట)

1. యెనకజల్మములోన—యెవరమోనంటి ।
సిగ్గొచ్చినవ్వింది—సిలకనాయెంకి ॥
2. ముందుమనకేజల్మ—ముందోలెయంటి ।
తెలతెల్లపోయింది—పిల్లనాయెంకి ॥
3. యెన్నాళ్లమనకోలె—యీసుకములంటె ।
కంటనీరెట్టింది—జంటనాయెంకి ॥

పైపాటలవంటిపాటలె ట్లాంధ్రభాష కనర్థకములో యట్టివాని కనర్థక వాఙ్మయ మనువే రెట్లు సార్థక మగునో యనువిషయమునుగూర్చి యిఁక మనవిచేసెదను.

ఆంధ్రభాష ముఖ్యముగ ముత్తెఱఁగులఁ గాన్పించుచున్నది. అందు 1 సాంప్రదాయసిద్ధ మగుసలక్షణభాష 2 మధ్యమతరగతి వ్యావహారికభాష 3 నింద్యగ్రామ్యభాయిష్ఠ మగునధమజాతి యాంధ్రము గ్రంథముల నలంకరించి నదియునై యున్నది. రెండవతరగతి భాష సామాన్యముగ నుత్తమజాతులనఁ బడెడి వారెల్లరు ననుదినమును వ్యవహారమున వాడునదియుఁ బాత్రౌచిత్యముగ నాటకములు, ప్రహసనములు, పాటలు మున్నగువానియందుఁ బ్రయోగింపఁ బడునదియు నైయున్నది.

ఇఁక మూఁడవది యధమజాతు లనుదినమును వాడునట్టిది. పైవిభజనకు భిన్నముగ మనకు దొరకునుదాహరణముల సంఖ్య యత్యల్పము. ఇపుడు నేను జూపిన ప్రకారము "యెఱ్ఱినాయెంకి" పాటయను పాటయందలి భావములు చెవరకుండ నందలిమాటలలోనె మూఁడువిధముల మార్చి చదివెదను.

వెఱ్ఱినా వెంకి.

మొదటితరగతి—

1. వెనుకజన్మములోన। నెవరమోయంటి।
సిగ్గుపడిన వ్వేను। చిలుకనా వెంకి॥
2. ముందుమనకేజన్మ। ముండునోయంటి।
తెల్లతెలఁబోయెను। పిల్లనా వెంకి॥
3. ఎన్నాళ్లుమనకోసి। యీసుకములంటి।
కంటసీర్వెట్టినది। జంటనా వెంకి॥

రెండవతరగతి—

1, వెనుకజన్మములోన। యెవరమోనంటి।
సిగ్గొచ్చినవ్వింది। చిలకనా వెంకి॥
2. ముందుమనకేజన్మ। ముందోసెయంటి।
తెల్లతెలబోయింది। పిల్లనా వెంకి॥
3. ఎన్నాళ్లుమనకోసె। యీసుఖములంటి।
కంటనీరెట్టింది। జంటనా వెంకి॥

మూఁడవతరగతి—

1. యెనకజల్మములోన-యెవరిమోలంటే!
సిగ్గొచ్చినయ్యింది-సిలకనాయెంకి ॥
2. ముందుమనకేజల్మ-ముందోలెయంటే!
తెల్లతెలపోనాది-పిల్లనాయెంకి ॥
3. యెన్నాళ్లమనకీలే-యీసుకాలంటే!
కళ్లనీళ్లెట్టింది-జంటనాయెంకి ॥

ఈపాటయందలి యధికసంఖ్యాకము లగుపదములు మూఁడవతరగతిలోని పదము లని చెప్పవచ్చును.

ఇందుఁ గలిగిన పదప్రయోగనైపుణ్యశూన్యతవలన నీపాట యవినీతికరమనికూడఁ దోఁపకపోదు. భాషాసంస్కారమాత్రమైనను గలవారి కెల్లర కీపాట చూచినతోడనే నాయిక యగు "యెంకి" మూఁడవతరగతి భాష మాటలాడునదని స్పష్టమగును. అట్లైన నాయకుఁడును మూఁడవతరగతి భాష మాటలాడువాఁడై యుండుటయే సహజము, కాని వెట్టికి బదులుగ యెట్టియు, వెనుకను యెనకయు, జన్మమునకు జల్మమును, చిలుకకు సిలకయు, పట్టుగనుచ్చరించిన నాయకుఁడు చట్టున నోరుజాఱి "అంటే"యను శాస్త్రీయ మగుభూతార్థకక్రియ నుచ్చరించెను. ఇది కొంతసంశయమును గలుగఁ జేయకపోదు. నాయకుఁడు క్రియలను జక్కఁగఁ బ్రయోగింప సమర్థుఁ డగు మొదటిజాతి భాష నెఱిఁగిన పండితుఁడో కవియో యనుసందియము వొడమును. నాయకుఁడును మూఁడవతరగతిలోనివాఁడే యైయుండిన నీక్రియఁ బ్రయోగించుట యసంభవము, నాయకుఁడు మొదటితరగతి శ్రోత్రియభాష మాటలాడు నుత్తమకులజుఁడే యైన నాయిక యన్వేష్య గావలయును. నాయికానాయకులొక్కతరగతిలోనివారే యై యుండిన నీకవనంబున కరీతియు విరసతయును సిద్ధించును. అట్టినాయికానాయకుల ప్రణయరసమును జిత్రపటములఁ జిత్రించి యింతచక్కని భాషలోఁ బాటను రచించి భారతిముఖమునఁ గట్టుట యాంధ్రవాణి కవమానకరము.

ఈసందర్భమున శ్రీఆదినారాయణశాస్త్రిగారివంటి విమర్శకులు దీనియందు గొప్పభావము గల దనియుఁ బ్రణయరస ముప్పతిల్లి పోవుచున్న దనియుఁ జెప్పుచున్నారు. ఇఁక భావవిషయమున నేను శ్లాఘించి యుండలే దని కూడ వీరి నిష్ఠురము. భావమే లేదని నేనును నిరాకరింపను. భావము మున్నగునవి యెట్లున్నను నీపాట యందలిభాష హేయమై నింద్యగ్రామ్యభూయిష్ఠమై

యక్షరాస్యు లగునాంధ్రులకు రుచింపరానిదై గ్రంథస్థ మగుటకు ననర్హమై
గ్రంథస్థమైనను భాషకు నిరుపయోగమై యున్నది. పాటలయందలి గ్రామ్యపద
ప్రయోగవిషయములో నాకును బ్రతివిమర్శకులకును విశేషవ్యత్యాసము గలదు.
ఇంత హీనమైన గ్రామ్యమును బట్టుపట్టి సారస్వతమునఁ జొప్పింపఁజేయుట వాఙ్మ
యమున కనర్థకము. ఇట్టిభాష మున్నెన్నఁడును గ్రంథస్థము కాలేదు. పామ
రులనోట నే నాఁటనాఁట వాడఁబడుచుండెడిది గాని యెన్నఁడును గౌరవమును
సభ్యతను బొంది యుండలేదు. పండితులచేతను బత్త్రికలచేతను బరాబరులు
చేయించుకొని యుండలేదు. ఇంతకంటె నాంధ్రభాషకుఁ గలుగవలసినదుః
స్థితి యేమి? ఇ దంతయు నాంధ్రవాఙ్మయముయొక్క సక్రమపరిణామమే కాఁ
బోలు? బొబ్బిలిపాట కామమ్మకథ మున్నగుపాటలయం దిట్టి బూతులకుఁ
జేరువచుట్ట మగుహీనభాష వాడఁబడి యుండలేదు. వానియందలి వీరరసమున
కును పాతివ్రత్యధర్మములకును గొఱంత గలిగెనా? నాఁటికిని నేఁటికిని భాషా
విషయమునం గలనాగరకతాతారతమ్య మిదియా? ఇట్టిది భాషాభివృద్ధి యగు
నా! భాష కనర్థక మగునా!

ప్రస్తుతకాలమున స్వేచ్ఛావ్యాపారు లగువారు కొంద ఱిట్టివానిని
గ్రంథస్థములుగఁ జేయుచుండిరి. వారు భాషకు నియమములు వల దందురు.
కవిత్వమునకు లక్షణము వలదందురు పదములకు సౌష్ఠవము వలదందురు అట్టి
వారికి భాషావిషయమున బాధ్యతమాత్రము గావలయునా! అట్టియుద్యమ
మును శ్రీ ఆదినారాయణశాస్త్రిగారివంటి పెద్దలు కొంద ఱంగీకరించుచున్నారు.
శ్రీప్రభాకరశాస్త్రిగారి వంటివారు తమభాషావిషయికవ్యాసములందు 'కఱ్ఱ
విఱుగకుండఁ బాముచావకుండ' దాఁటిపోవుచున్నారు. కొందఱు పండితులును
విమర్శకులును జోక్యము కలిగించుకొనుట లేదు. భాషాసేవకుఁ గంకణము
కట్టుకొన్న వని ప్రజలలోఁ బ్రతీతి గల భారతి, సాహితి, శారద పత్త్రికలీభాషను
బ్రోత్సహించుచున్నవి సాహితీపత్త్రిక యిట్టిభాషకుఁ బట్టుఁగొమ్మ. సాహితీసమితి
యనుపేరు విన్నచో నాంధ్రసాహిత్యమును వెల్లివిరియఁ జేయుచున్న దేమో
యనిపించును గాని యట్లుకాదు. ఇట్టిభాషను గవిత్వముఁ జెప్పువారు కూడ నం
దుఁ గొంద ఱున్నారు. దీనింబట్టి సాహితీసమితి వాఙ్మయమునకుఁ గొంతవఱ
కుపకారియు, నపకారియు నని యుఁ జెప్పవలసివచ్చుచున్నది ఇట్టిభాషలో నుం
డెడు పాటలకుఁ బేరైనపత్రికలు తావొసంగుట చేతను విద్యార్థులు వ్రాయుట
చేతను గొందఱు పండితులు వెనుకతాళము వేయుటచేతను నితరపండితు

లు సేకరించుటచేతను నిట్టియనర్థకవాఙ్మయము పత్త్రికలలోను గ్రంథములలోను బెచ్చు పెరిఁగి బొమ్మచెముడువలె నలముకొని యాంధ్రవాణి సహజసౌందర్యమునకు భంగము కలిగించుచున్నది. పెద్ద లేదారిని బోయినఁ జిన్న లాదారిని బోవుట సహజ మని యిట్లు గీతలు చెప్పుచున్నవి.

శ్లో. యద్యదాచరతి శ్రేష్ఠ స్తత్తదే వేతరో జనః।
సయ త్ప్రమాణం కురుతే లోక స్తదనువర్తతే॥

ఇట్టిభాష నెంతయుత్కృష్టభావములతో సమ్మిళితముచేసినను నెంతవిద్యాధికులు వ్రాసినను గ్రంథస్థము గావించుటవలన నాంధ్రవాఙ్మయమున కనర్థకము వాటిల్లుట నిశ్చయము. ముందువారు తమపూర్వులభాష యింతమహోన్నత్యస్థితి యం దున్నట్లు నిశ్చయముగఁ దలఁతురు. క్రమముగ గ్రంథములన్నియు 'బూతులబుంగలు' గావచ్చును. ఆంధ్రవాణి యందచందము లడుగంటును. ఇక్కాలంబునఁ బలువురు భావగీతములు ఖండకావ్యములుగను రచించుకవిత హృదయాహ్లాదకర మగుమృదుమధురశైలిని పాటలుగను, గీతములుగను జక్కనిభావములతోఁ జక్కనిభాషలోఁ బెంపొందుచున్నది. అట్టివాంధ్రసారస్వతమున కావశ్యకము లే. వానిని బ్రోత్సహింపవచ్చును. అట్టిది మచ్చున కొకటి చదివెదను

(అనంతపంతుల రామలింగస్వామిగారు-ముద్దులమూట పత్త్రికనుండి.)

1. తమ్మిపూవు సొరుఁజూచి తళుకుచందమామఁ జూచి చెలువా! నీమోముసొగసును దలఁచుచుందునే!

2. కారుమబ్బుతీరుఁ జూచి కటికచీకటులను చూచి చెలువా నీకురులసొగసుఁ దలఁచుచుందునే!

మేఘసందేశము.

ఓవినీలమేఘమా-ఒయ్యారిమేఘమా।
ప్రియురాలికి నావార్తలు-బిరబిరఁ జనిదెల్పుమా॥

1. మందమారుతాంకురములు సుందరముగవీచు నదిగో!
చాతకమృదుమధురగాన సరణిచెవులపండువయె! ఓవినీల॥

2. అలకయామెపట్టణము య్యదియక్షులకావాసం
బాపురోద్యానవనము నందురాజమహాళియుండు! ఓవినీల॥

అంత్తియె గాని భావముపేరుచెప్పి హీనమగు భాషను విద్యాధికులుగ్రంథస్థముగఁ జేయుట కడుంగడు శోచనీయము. పండితు లామోదించుట గాని, యుపేక్షవహించుట గాని యాంధ్రవాఙ్మయమునకు గొడ్డలిపెట్టు. పదములుసొ

ష్ఠవమును బొందినమాత్రమున నశించిపోయెడిభావ మెంతకాలము నిలువఁగలదు "దగ్గిననుండని ముక్కు తుమ్మిన నుండునా."

క. తనువగు శబ్దార్థంబులు, ధ్వనిజీవ మలంక్రియావితానము సొమ్ముల్
తనరు గుణంబులు గుణములు, ఘనవృత్తులు వృత్తులౌర కావ్యేందిరకున్॥

అను నాలంకారికవాక్యమువలన శబ్దార్థసౌష్ఠవము లేనికవిత్వము తనుహీన మని ఘోషించుచున్నది. తను వుండినఁగదా భావము. తనువు లేనిది భావమెట్లు. భాషను ధ్వంసముచేసి యెంతెంత భావముల నందిమిడ్చినను నది సత్కవిత కానేరదు. పై పెచ్చు వాఙ్మయమున కనర్థక మగును. శ్రీ ఆదినారాయణశాస్త్రిగా రాంధ్రశబ్దచింతామణికి బ్ర॥ పారనంది రామశాస్త్రిగారు వ్రాసినవ్యాఖ్యానగ్రంథమునకు బీఠిక వ్రాయుచుఁ దొలుఁదొల్త నుదహరించిన శ్లోకమును జూడుఁడు.

శ్లో. అధికం యది నాధీషే తథాపి పఠ పుత్ర వ్యాకరణం।
సకల శ్శకలో మాభూ త్సలిలం శలిలం సకృత్ శకృత్॥

తా॥ వ్యాకరణము నెఱుఁగనికతన సంభవించెడి యపశబ్దోచ్చారణమును తజ్జనిత మగునపహాస్యమును నీకు రాకుండును గాక సకలము శకలముగాను, సలిలము శలిలముగాను, సకృత్ శకృత్ గాను గాకుండును గాక.

"అనియమా గ్రామ్యంహి, యత్త్వపభ్రంశః"

శాస్త్రనియమము లేనిపద మపభ్రంశగ్రామ్య మని వాగనుశాసనుఁడు ఘోషించుచుండ భాషావేత్త లగు శ్రీ ఆదినారాయణశాస్త్రిగా రిట్టికవితను వెనుకవేసికొని వచ్చుట కాలవైపరీత్యముగాక మఱేమి?

"మహాగజాః పలాయంతే మశకానాంతు కాగతిః" యెంకిపాటలయందలి యసభ్యములును నశ్లీలములును స్థాలీపులాకన్యాయముగఁ జూపి ముగించెదను.

పిల్లపోరుగూ రెల్లి
మల్లి రా లేదాని
వొల్లంతవుడుకెత్తి
వొక్కణ్ణెపడుకుంటె

నాయకుఁ డొంటిగ పరుండి యనుభవించు విరహవేదనావర్ణన కాఁబోలు. ఏమి చక్కనిధ్వని—

తళుకుమని యెంకి నాదరికిరావాలి
నిదుర కాబోసంట నిందలాడాలి

చక్కని నిగూఢత కిదెనిదర్శనము. ఆహా, యేమి విప్రలంభము.

కడుపులో సెయ్యేసి కలిపేసినాది.
నీటిగాలికియెంకి పైకెగురుతాదంట—

ఇవన్నియు బ్రతివిమర్శకులదృష్టిలో సభ్యము లఁట, ఇందలిపదముల కంటె నపభ్రంశములు, నశ్లీలములు నెట దొరుకును. శ్రీ నండూరి సుబ్బారావుగారికి సాహితీపత్రికాధిపతిగారిచేత 'మహాకవి' బిరుద మిప్పించిన దీకవిత్వమే. ఆహా? కాలమహిమ! ఆంధ్రవాణి దురదృష్టము.

ఇట్టి పాట లాంధ్రవాఙ్మయమున నుండరాదు. భాషాభిమాను లిట్టి వ్రాఁతలను మొగమోటమి లేకుండ నిరసించు చుండవలెను. భాషానుభూతిగల యాంధ్రసాహిత్యపరిషత్పత్రిక మున్నగుపత్రిక లనర్థకవాఙ్మయ మనుప్రత్యేకశీర్షిక క్రింద యిట్టిపాటలను బద్యములను బ్రతిమాసమునను దప్పకవిమర్శించి భాషను బునరుద్ధరింపవలెను. గత 10-11 సం॥రములనుండియు నన్నివిధముల వాఙ్మయ మభివృద్ధికి వచ్చుచుండఁ బైనఁజూపిన యొకటిరెండుపట్లు మాత్ర మసంతుష్టిగ నుండునట్లైనను నిలువఁగలిగిన పత్రికారాజములలో నాంధ్రసాహిత్యపరిషత్పత్రిక యగ్రస్థానము నలంకరించియున్నది. అట్లె పండితులును విమర్శకులును భాషాభిమానులును పత్రికాధిపతులు నీవిషయమున శ్రద్ధను దీసికొనఁ బ్రార్థించుచున్నాఁడను.

పెరుఁగుచున్న యాకుమడిలోని కలుపువలె తమ రుపేక్షించినయెడల నీయనర్థకవాఙ్మయము పెచ్చుపెరిఁగి క్రమముగ నాంధ్రవాణి కనర్థకముఁ దెచ్చును. ఎట్టివ్రాఁతలైనను వాఙ్మయాభివృద్ధికిఁ దోడ్పడవని నేను మఱియొకసారి మనవిచేసి యాంధ్రవాణి నీయనర్థకవాఙ్మయముబాఱినుండి కాపాడుటకు తగినన్ని పత్రికలును, తగినంతమంది విద్వాంసులును, విమర్శకులును బద్ధకంకణులు కావలె నని వినయపూర్వకముగ వేఁడికొనుచు వ్యాససందర్భమున నేను నిష్పక్షపాతముగ వచించుటలో మనస్సులు నొచ్చినవారల కంసఱకును అనుల్లంఘనీయముగ వేయవలసి నచ్చినందులకు మిక్కిలి చింతిల్లుచు నన్ను క్షమింపుడని విధేయతతోఁ బ్రార్థించుచు విరమించుచున్నాను.

పోకూరి లక్ష్మీనారాయణ.

---

క. గుడినుండి క్రోయఁ జూచెదు, గుడిత్రాళ్లను మమ్ముఁ గూడుకొని నస్త్రిలి మా
కడఁ జెట్టుగట్టి పొత్తునఁ, గుడిచితి విన్నాళ్లు దుష్టగుణ మిది తగునే. ౧౨౪

క. భల్లూకచర్మ ముదికినఁ, దెల్ల నగునె దుష్టకష్టదితికులజుఁడ వీ
వుల్లంఘించుచు సుమనో, వల్లభభక్తిము నొందఁగలవె వక్రవిచారా. ౧౨౫

వ. అనిన దనుజరాజతనూజుం డొండు వాద సేయక వదనమండలంబు వంచి యున్నక
యుండినం దద్వైలక్ష్యం బుపలక్షించి యతని పితృవ్యుం డగు ఘూమ్రాక్షుండు
సహస్రాక్షుతో ని ట్లనియె. ౧౨౬

{ ప్రహ్లాదుండు నిరుత్తరుం డైన నింద్రునకు ఘూమ్రాక్షుం
డుత్తర మిచ్చుట. }

ఉ. మాటలు నేర్తు నే ననుచు మాటికి మాటికి నుగ్రసంగరా
స్ఫోటితశత్రు వైన దనుపుత్రకుమారకు మీఱి పల్కెదుం
ఘూటము గీటముం దగునె యుద్భటవిక్రమశాలికి న్నిరా
ఘాటభుజాసిపాటనము గల్గినఁ జూపుము శక్ర యిక్కడన్. ౧౨౭

సీ. నాకపట్టన మెల్ల [1]డాకమై భేదించి నందనవనమును నఱకివైచి
సిద్ధరసంబులు చీకాకుపడఁ జేసి తెఱవల నందఱఁ జెఱలువట్టి
హరిదంతిదంతకుంతాగ్రంబు లగలించి గ్రొచ్చి పెన్నిధు లెల్లఁ గొల్లలాడి
పరమేశసఖుని పుష్పకము గైకొని జగద్విదితంబుగా నేకవీరుఁ డైన
యాహిరణ్యకశిపుఁడు మాయామనుష్య, మృగము చే దైవవశమునఁ దెగినకతన
నేఁడు తెక్కలు వచ్చె నే నిర్జరులకు, నీకు నాకేశ యింత [2]యుత్సేక మేల. ౧౨౮

శా. ఆదైత్యేంద్రకుమారుఁ డై వెలయు ప్రహ్లాదుం డమర్యాద బా
హాదర్పంబున నెల్లభూపతులఁ గయ్యాలం దిగంద్రోచి నేఁ
డీదేవావసథంబుఁ గైకొనఁగ ని ట్లేతెంచె నీవిక్రమ
శ్రీదాక్షిణ్యపరాయణుం గెలువ నేర్తే ధూర్తచర్యానిధీ. ౧౨౯

చ సురవర నీపరాక్రమము చొప్పు సమస్తము నీఱు గప్పు సం
గరమున దానవాకలితకర్కశబాణము లోర్వలేక బ
ల్విరు దని విష్ణుఁ జూపి వెఱపించెద విక్కడ మమ్ము నక్కటా
యురుతలపాదఘట్టనల నూఁగునె తూఁగునె సాలసాలముల్. ౧౩౦

క. త్రిజగములుఁ జుట్టి యెవ్వఁడు, భుజబలమున నాక్రమించుఁ బూర్ణోదయుఁ డై
విజయంబుఁ గన్న యవ్విభు, భజియింతురు దేవుఁ డనుచుఁ బ్రజలమరేంద్రా.

---

[1] డాకమై భేదించి. [2] యుద్రేకము.

గీ. మాట లేల శక్ర మగుడుము ప్రాణంబు, గాచుకొనుము గాక కదనవీథి
నిలువఁ గలిగితేని నేఁ డెఱుంగఁగవచ్చు, నిర్జరారిబలము నీబలంబు. ౧౩౨

సీ. అదె చూడు మంభోధు లాపోశనము చేసి త్రావనోపిన కాలసంస్త్రబలుల
నాలోకనము చేయు మఖిలమత్తారిదంతావళహర్యక్షు దండశూకు
వీక్షింపు మంభోరుహాక్షుతోఁ బెనఁగంగఁ జాలిన కపిలాక్షుశంబరులను
దర్శింపు మఖిలదిగ్దంతిదంతము లూఁడఁ దిగిచి పాఱఁగవైచు గగనచరుని
వీరలయు కాదు ప్రస్తోమపీట వీరి, కినుమఱుంగగు దైత్యు లనేకు లున్న
వారు నీపౌరుషం బింక వారిమీఁదఁ, బ్రతిఫలింపదు చనుము నిర్జరవరేణ్య.

చ. అనఁ గనలెత్తి దేవవిభుఁ డాశుగవేగసముజ్జ్వలాశుగం
బున దనుభూపితృవ్యశిరముం గరముద్ధతిఁ దున్మెఁ దున్మఁ ద
ద్ఘనతరరక్తధార దివి గట్టె నభోవలయాతపత్రకీ
లనమునఁ బొల్చు విద్రుమశలాకయుఁ బోలెఁ ద్రిలోకభీసుమై. ౧౩౪

గీ. పొదివి దిక్పాలసంఘంబు పోసరింప, వాసవుం డేసరేఁగి దైవతవిరోధి
వరవరూథినిఁ జెండాడె వనద ముగ్ర, వృష్టిఁ బద్మాటవుల నొంచువిధముగదుర.

చ. తనపినతండ్రిఁ జంపిన సుధాభుగధీశ్వరుమీఁదఁ గల్పవ
హ్నినిభకటాక్షవీక్షణము నించి దితిప్రభవాత్మజుండు ఘో
రనినదచాపవల్లరిఁ గరంబునఁ బావకకీలవోలె శో
భనరుచి యై వెలుంగ లయభానుసమానవిభాభిరాముఁ డై. ౧౩౬

స్రగ్ధర. శరము ల్పుంఖానుపుంఖోచ్ఛలితగతి నభశ్చారి యై తూఱనేయుం
గరిరాజుం గొల్పి దైత్యోత్కరము నుఱిచి రక్తప్రవాహంబు లుర్విం
దొరుఁగంగాఁ జేసి యేసెన్ దురధిగమజయోదాగ్రపద్యావిహార
స్ఫురణన్ దేవేంద్రుఁ డగ్నిస్ఫురదిషువితతు ల్భ్రాతము ల్భీతి నొందన్. ౧౩౭

క. జంభారి వైచె దితిసుత, డింభకుమీఁదన్ శతఘ్ని డెప్పర మగుసం
రంభంబునఁ దక్కులా, సంభారము భువనములకు సాధ్వస మొనఁగన్. ౧౩౮

క. శూలమున నసుర దానిం, దూలిచి లయకాలకుపితధూర్జటివోలెం
గ్రాలఁగఁ గనుఁగొని విశిఖ, జ్వాలల జంభారి దివిజశత్రుం బొదివెన్. ౧౩౯

చ. పొదివినఁ గోపమెత్తి దితిపుత్రతనూభవుఁ డాబిడౌజుహ
స్తిదళన మాచరించి నలుదిక్కుల ఘూర్ణిలుసేన మానసం
పద వదలింప నిర్జరసమాజము లార్వ బలారి కూల్చె నొ
ప్పిద మగుతత్కిరీటముఁ గృపీటభవోపమకాంతికూటమున్. ౧౪౦

క. కరిపతి దూలిన నిర్జర,[1] [1]పరివృఢుఁ డరదంబు నెక్కి భాసిల్లుటయున్
హరి డిగ్గి దానవాధీ, శ్వరుఁడు రథమెక్కి విజయశంఖము లులియన్. ౧౪౧

వ. పావకపాథోధిపతిప్రముఖదిక్పాలపాలితం బగుగరుడగంధర్వకిన్నరకింపురుష సేనాకలాపంబు లాపురందరుం బొదివికొని యుండెఁ, గాలజంఘ కాలదంష్ట్ర కాలకేయ శంబర దీర్ఘజంఘ సూచీముఖ వామనాది పలాదులు, ప్రహ్లాదునకు బాసట లై యాహ్లాదంబు సేయుచుండి రయ్యెడ. ౧౪౨

సీ. జంభశుద్ధాంతరాజనిభాననాఘనస్తనహారహారియై తనరు నెద్ది
పాకశోకస్తనీశోకానలోద్భూతిసామిధేనీస్ఫూర్తి జరగు నెద్ది
బలవధూదరహాసభాసమానమృణాళఖండనహంసమై యుండు నెద్ది
నముచిమానవతీజనప్రేక్షణాంజనతిమిరేందుకాంతియై యమరు నెద్ది [విజుఁ
యట్టివజ్రంబుఁ గేంగేలహరిహాయుండు, పూనుటయుఁ బాశుపతమెత్తెఁబూర్వది
డమ్మహాయోధవీరులయాగ్రహమున, నిగ్రహమునొందెనలభూతనివహమెల్ల.

క. బలరిపువజ్రము దానవ, కులతిలకము పాశుపతము గొదకొని పెనఁగన్
జలజల విలయానలకణ, ములు దొరఁగెన్ జగము లొరగె మురమురవెరఁగెన్.

వ. అయ్యవసరంబున నయ్యాతుధానప్రధానపురుషు లగువామన వ్యాఘ్రగమన శిఖావళప్రముఖు లగునిశాచరవీరులు ఘోరాకారు లై గండశిలలు ఱువ్వియుఁ గొండ లెత్తి వైచియుఁ దరుషండంబుల నొండొండ మోదియు నాదిత్య [2]వరూధినికి నిరోధంబు [3]గావించి రప్పు డప్పూర్వకకుప్పతియను మతి ననలుండు కనలి విశాలజ్వాలాజాలంబు నిగిడించినం జిమిడియుఁ జీకాకుపడియునుం గమరియుం గాలుమట్లం బొయియును నుడికియు నోటఱియుం గలంగియు నలంగియుం గూలియుం దూలియు వావిచ్చియు నొచ్చియుఁ బూర్వవియచ్చరనికరంబు కరంబు సంక్షోభించె నాసంరంభంబు జగత్త్రయసంధినిర్భేదననిష్ఠురం బగుచు నుండె వెండియు. ౧౪౫

గీ. దేవవిభుతోడ దానవాధిపుఁడు పోరెఁ, గడిమిఁ గరితోడఁ బోరుసింగంబుఁబోలె
మదమువిడనాడిసత్త్వసామగ్రివిడిచి, విఱిగెవిబుధేంద్రుఁడసురేంద్రువేగమునకు

క. సురపతి దెగలినఁ దెరలె, న్సురబలములు జలధియుబ్బు సొరిగినతఱిఁ బూఁ
దెరలు గరువంబు సడలిన, వెరవునఁ జింతావివర్ణవిస్మృతముఖము లై. ౧౪౭

గీ. ఆహిరణ్యకశిపునాత్మసంభవుఁ డాప్త, బలముతోడ బాహుబలముతోడ
సురపురంబు సొచ్చి సుఖముండె ననుటయు, శౌనకాదిమునివితాన మపుడు.

[1] పరివృఢుఁడు. [2] వరూధంబునకు నిరోధంబు. [3] గావించ్చె, నప్పుడు.

వ. పరమాశ్చర్యనిర్మగ్నమానసుం డై హర్షోత్కర్షంబున రోమహర్షణుం బలికె
నయ్యా యయ్యాత్మభూసనకుం బురుహూతుండు విఱుగుట నిగమవిరుద్ధం
బిది యేకరణి సిద్ధాంతీకరించి వాక్రుచ్చితి రనవుడు నతం డమ్మునివేతండ
తండంబుతో నిట్లనియె. ౧౪౯

చ. కలఁడు రహస్య మాదివిజకాంతుఁడు మున్నొకనాఁడు కొల్వులో
పల విభవాభిరాముఁ డయి భాసిలుచుండఁగ నట్టిచోటికి
న్విలయకృశానుసన్నిభనవీనరుచిం జనుదెంచె మాను లిం
పలరుచుఁ గొల్వుఁ గోపనమహాముని భీమతరప్రభావుఁ డై. ౧౫౦

క. అరిమర్దనంబు రాజ్య, స్ఫురణంబును గలుగుకతనఁ బొంగారి సురే
శ్వరుఁ డాదుర్వాసోముని, వరుఁ బూజింపక వికారపరుఁ డైయుండన్. ౧౫౧

వ. సమూలఘాతంబుగ నిఖిలసురసంఘాతంబు నున్మూలింపం జాలియు నాకా
లాంతకనిభుండు వేళాగుణంబున శాంతుం డై శచీకాంతు నైశ్వర్యంబు నిశా
చరాయత్తం బగుఁగాక యని తన చిత్తంబు లోనం దలంచి చనియెం గావున
దేవపతికి నియ్యవమానంబు వాటిల్లె నదియునుం గాక. ౧౫౨

క. ఆరీతిపీనుతో సరి, పోరిన దేవేంద్రుమహిమఁ బొగడఁగఁ దగదే
మారుతముమీఁద వేఱొక, మారుతముఁ గ్రమ్మినట్టియుత్త మై తోఁచెన్. ౧౫౩

క. గురువులయెడ విప్రులయెడఁ, బరిభవ మొనరించువాని భాగ్యశ్రీ న
శ్వర యగు గాలి నిడినదీ, పరుచియునుం బోలెఁ దరళభావోదయ యై.

వ. ఇవ్విధంబున విబుధమానమర్దననిర్దయుం డగు పూర్వగీర్వాణశ్రేష్ఠుండు నిష్ఠుర
పరాక్రమక్రీడావశీకృతలోకత్రయుం డై నాకం బేకాతపవారణంబుగ నేలు
చుం బెద్దకాలం బుండె నాఖండలుండును నఖండశోకవ్యాకులహృదయుం
డై నాకౌకోలోకంబుతోడ లోకాలోకగుహాగేహంబుల దేహంబులు చో
నిపి వనరుచు నవజయక్లేశంబున గాసిల్లుచు నుండె నంతనొక్కనాఁడు. ౧౫౪

స్వర్గంబేలు ప్రహ్లాదునికడకు శుక్రాచార్యులు వచ్చుట.

సీ. నెమ్మేని తేజంబు నింగి యంతయు మ్రింగి వేఱొక్కసూర్యునివిధము సేయఁ
గరకల్పశాఖావికస్వరఫలలీల నిద్దంపుతీర్థకుండిక వెలుంగఁ
బరమపావనదృక్ప్రభావిభావంబున నజ్ఞులకును బోధ మావహిల్లఁ
గొలిచివచ్చిన శిష్యకులము బ్రహ్మ భజించు దివ్యమానులలీలఁ దేజరిల్లఁ
జొక్క తెగి పడినట్లులు శుక్రుఁ డాత్మ, భవనవాటిక సొచ్చి రాఁ బ్రథమదివిజ
పుంగవుఁడు నిర్భరానందపులకితాంగుఁ, డగుచుఁ బూజించె నాదేశికాగ్రగణ్యు.

క. పూజించి తెచ్చి నిజస్పృగ, రాజమణీపీఠి నునిచి ప్రాంజలి యగుచుఁ
వేజాడల నుతియించెఁ బ, యోజాసనుఁ బొగడు నిగమ మెూ యితఁ డసఁగన్.

ఉ. ఆదర మొప్ప శుక్రుఁ డమరాహితనందను నిందుకాంతసం
పాదితపీఠిపై నునిచి పల్కె హిరణ్యనిశాటపుత్ర యా
హ్లాద మొనర్చె నీచరిత మంతయు మాకు నశేషశోక వి
చ్ఛేదిని యయ్యె నీభుజవిశేషవిజృంభితశక్తి యుక్తియున్. ౧౫౮

మ. జనకుం జంపిన క్రించు వీఁ డని రమాజాని న్విసర్జించి నీ
యనుఁగుందమ్ములు నెల్లబాంధవులు గాఢానందపాథోధిమ
జ్జనముం జేయ మహేంద్రు గెల్చి త్రిదివేశత్వంబునుం బొంది నం
దనము ల్గొంటివి శత్రుజాలములచేతన్ ధూతధూర్తవ్రజా. ౧౫౯

సీ. నీప్రతాపము నోర్వనేరక రిపులక్ష్మి నీవెల్లగొడుగుక్రొన్నీడ నిలిచె
నీకృపాణీధార నిచ్చెనగా నెక్కె నీవలపటిమూఁపు నేలగోల
నీగుణగంధ మానెడు వేడ్క సుజనషట్పదములు నీదండఁ బాయ వెపుడు
నీవిత్తీర్ణికి నోడి నీరాకరము నీదుదానాంబుధారలఁ దగులుకొనియె
నిన్ను వర్ణింప నెవ్వారు నేర్చువారు, దానవాన్వయసౌధకార్తస్వరఘట
నిన్నుఁ జూచినదివసంబు నిఖిలభోగ, భాగ్యసౌభాగ్యములకుఁ జేపట్టు గాదె.

క. నీరాంజలిఁ దృష్ణాతుర, పూరుషు లాసించులీలఁ బోరుల నిన్నున్
వైరిజనహరణమునకుం, గోరెడుమాకోర్కె నేఁడు కొనసాగెఁ జుమీ. ౧౬౧

క. మాదానవపతి నాతో, నాదగునందనులు వినయనయశాలులు ప్ర
హ్లాదుఁ డనుహ్లాదుఁడు సం, హ్లాదుఁడు హ్లాదుండు ననుట నవి ఫలియించెన్.

క. హరిహయశిఖియమసురరిపు, శరధిసపవమానశంభుసఖశంకరులన్
దురమునఁ గింకరులం బలె, శరతాడనపీడ నొంపఁ జను నీ కనఘా. ౧౬౩

క. వంచినతల యెత్తనిన, క్తంచరులకు నేఁడు గలిగె దానవవర య
భ్యంచితతేజము నీదుభు, జాంచలకరవాలకీల యలరుటకతనన్. ౧౬౪

శా. పాతాళంబును భూతలంబు దివియుం బాలించె మీతండ్రి నీ
వాతీంద్ర న్వెలుఁ గొందియున్కి సుభటాహ్లాదంబు నొందించె నీ
వాతంకంబులు మాన్చి రక్షణముసేయం బాడి యీదానవ
వ్రాతంబుం బరిపంథిమర్దనవిధావైదగ్ధ్యహృద్యంబుగన్. ౧౬౫

క. నావిని ప్రహ్లాదుఁడు ర, క్షోవంశాచార్యుఁ బల్కె సుజనస్తుత నీ
పావనకటాక్షవీక్షా, శ్రీవైభవ మిట్లు నాకు సిరు లొనగూర్చెన్. ౧౬౬

క. నాతరమా పోతరమున, ఘాతుకులై యున్న సురలఁ గసిమసఁగఁగ ను
ద్యోతితభవదనుకంపా, ఖ్యాతియె యనిఁ దనకు వజ్రకవచం బయ్యెన్. ౧౬౭

చ. అనవుఁడు నల్ల నవ్వి దనుజాన్వయదేశికుఁ డమ్మహాత్ము హ
స్తనలినలాలనంబునఁ బ్రసన్నమతి న్నెయి డుల్పి వాలి మూ
ర్కొని పులకించి హర్షరసగుంభితబాష్పకణార్ద్రనేత్రుఁ డై
ఘననిభకంఠనిస్వనముగాఁ బలుకు న్సభికు ల్నుతింపఁగన్. ౧౬౮

శా. అన్నా వెన్నుని నమ్మఁగా వలదు మాయానాట్యకేళీరతుం
డన్నారాయణుఁ డాదితేయులకు రంధ్రాన్వేషసంపాదియై
యున్నీసంపద లన్నియుం [1]గిలిబి తానిచ్చు న్నిజం బీవు సం
పన్నప్రౌఢి వహించి యేమఱకుమీ ప్రత్యర్థికృత్యంబులన్. ౧౬౯

క. అని బుద్ధిచెప్పి ప్రహ్లా, దుని వీడ్కొని శుక్రుఁ డరిగె దుర్దమ తేజో
దినకరబింబము మిన్నున, గనగనయని వెలుఁగ నయనకౌతుకకరుఁడై. ౧౭౦

వ. ప్రహ్లాదుండు ననాదప్రమోదమేదురహృదయుండై దనుజగురువచనరచన వలన జాగరూకుం డై నాగలోక నరావాస నాకపురంబు లేకచ్ఛత్రంబుగా నేలుచు నుండె నిట్లు బహుతిథం బగు కాలం బతీతం బగుటయు నగధరుండు నగవిరోధిప్రముఖబర్హిర్ముఖపరాభవప్రతీకారంబు నిజాంతఃకరణంబునం జింతించి కృతనిశ్చయుండై యుండె నంత నొక్కనాఁడు. ౧౭౧

క. ఊదరదాఁకినకుడ్యవి, భేదకతతివోలెఁ బాకభిన్ముఖదివిజుల్
వేదనలఁ బొరలి రాప్ర, హ్లాదునిచే నిజవిభూతి యపహృత యగుటన్. ౧౭౨

గీ. అఖిలలోకరక్షుఁ డగుపుండరీకాక్షు, శరణుచొరఁ దలంచి సురలు మునులు
సత్యలోకనాథుసమ్ముఖమ్మున కేగి, యతఁడుఁ దారుఁ గూడి యాక్షణంబ. ౧౭౩

వ. వైకుంఠవాసు వాసుదేవు వనధరశ్యాము వనమాలి వందారుమందారంబుం గనుంగొని రెట్లనిన. ౧౭౪

క. శరణాగతపరిరక్షణ, కరణా ఋగ్వేదిజననికాయాభరణా
పరిణాహిశుభవ్యంజన, చరణా రణదళితశత్రుచయసంసరణా. ౧౭౫

ఉ. నీరధిరాడ్గభీర హిమనిర్మలకీర్తివిహార సజ్జనా
ధార సురాద్రిధీర హరిదత్తవిచార కవీంద్రబృందమం
దార విరోధినీరదకదంబసమీర సమస్తపుణ్యవి
స్తార కృపాప్రపూర ఘనధామవిభాకర శోభనాకరా. ౧౭౬

---

[1] గిలిమి.

భుజంగప్రయాతము. మహాదార్ఢ్యశీలా సమాఖ్యాలవాలా
మహోపేతిహోత్రా రమాపక్షిశత్రా
సహాసావలోకా రసాపుణ్యపాకా
గృహీతాశ్రితాళీ నికృత్తాఘపాళీ. ౧౭౭

గద్యము. ఇది శ్రీహనుమత్కటాక్షలబ్ధవరప్రసాదసహజసారస్వతచంద్రనామాంక
భారద్వాజసగోత్రపవిత్ర రామవిద్వన్మణికుమార రాష్ట్రఘంటావధానపరమే
శ్వర హరిభట్టారకప్రణీతం బైన నరసింహపురాణోత్తరం బగు నుత్తరభాగంబు
నందు వర్షాశరద్వర్ణనంబును బ్రహ్మాదుల సంక్రందనుమీఁద దండు వెడలు
టయు నసురవరచకితుండై యాఖండలుండు చిత్రశిఖండిప్రసూతసినీశమార్గం
బడుగుటయును, సురాసురయుద్ధంబును నందుఁ బృథ్వశ్రవుపలాయనంబును
దితిసుతసూతి నాకలోకం బేలుటయు ననుకథలంగల చతుర్థాశ్వాసము.

# నారసింహపురాణము.

## ⇝ ఉత్తరభాగము ⇜

### పంచమాశ్వాసము.



క. శ్రీ శ్రీశసుందిర సంప, ద్దైవశ్రవణ వచోవిశేషవైచిత్రీచ
ణుశ్రవణసద్వృక పురా, ణశ్రుతిపూతాంతరంగ నరసయరంగా. ౧

వ. ఆకర్ణింపు మాశౌనకాదులకు నాదరప్రథితుం డై కథకుం డిట్లనియె నట్లు నవ్యాక్షేపంబునం బుండరీకాక్షు నిరీక్షణంబు సిద్ధించుటకుఁ బ్రహృష్టప్రహృష్టులైన యమరవృషభు లాజగద్విభుం బ్రణామపూర్వకంబుగ నభినుతించిరి. ౨

బ్రహ్మాదులు విష్ణుదేవు స్తుతియించుట.

మ. జయ నక్తంచరగర్వవంచక జగత్సాక్షీ సరోజాక్ష ని
ర్ణయముక్తవ్యసహారఘోరభవదూరా వార్ధిపర్యంక స
ర్వయతివ్రాతమనోగుహావిహారికిశోరా శౌరి శార్ఙ్గీ కృపా
శ్రయ విశ్వంభర చంద్రశేఖరసఖా చక్రాయుధా శాశ్వతా. ౩

క. లోకంబులు సృజియించుచు, లోకాంతర్వర్తనము విలోకించుచు ను
ల్లోకప్రక్రియ మను నిను, మాకు నుతియింపఁ దరమె మధునిర్మథనా. ౪

క. వేదంబు లేమి నేర్చు, న్నీదుమహామహిమఁ దెలియ నిశ్వాసములా
వేదంబు లెల్ల నీకు మ, హోదధిపర్యంక పంకజోదర కృష్ణా. ౫

క. అనుపమ మాద్య మమేయం, బనవధి నీతత్త్వవిభవ మైనంగానీ
జననీజనకులు నీవై, కని పెనుతువు గాదె ముజ్జగములు ముకుందా. ౬

సీ. నీకనుసన్నచే నిర్ణీత మయి కాదె యీయహోరాత్రంబు లేరుపడుట
నీపాదతీర్థంబు నెలకొంటచేఁ గాదె పాపంపు టసలెల్లఁ బలుచ నగుట
నీమాయఁబుట్టిన యీమూఁడుగుణములవలనఁ గాదే సృష్టి మొలచు టెల్ల
నీకృపావిభవ మస్తోకమౌట నె కాదె శిష్టరక్షణలీలఁ దుష్టి గనుట
నిన్ను నిదమిత్థ మగునని యెన్న నరిది, నీవిహారంబు లన్నియు నీకె చెల్లు
జలజదళనేత్ర నీరదశ్యామగాత్ర, సాధుజనమిత్ర మదమత్తశత్రుజైత్ర. ౭

చ. అని కొనియాడుచున్నచతురాననముఖ్యులఁ గాంచి పద్మలో
చనుఁ డను మీముఖాబ్జములచందము జేపటిచంద్రునందమై

పిసుఁగుఁదనంబు సూపె నన బిమ్మిటి యించుక దేఱె పల్కె రా
మునులు నిలింపులుం భవతమోహరు నయ్యహిరాజతల్పునిన్. ౮

క. నీ నంతర్యామివి యీ, జీవుల కందఱికి నీదుచిత్తంబున ల
క్ష్మీనర తోఁపనియది గల, దా వినవలతేని వినుము తత్త్వము మెల్లన్. ౯

చ. అనిమొన నీవు నాఁ డటులు హాటకదైత్యుని గీ టణంచి త
త్తనయుని కైనయాపదలతంపము నొందును జిక్కనీక పోఁ
జొనిపి కృపాకటాక్షములఁ జూచితి వారజనీచరార్భకున్
వనజదళాక్ష వాఁడె పగవాఁ డగుచు న్నము నేఁచె నీచుఁడై. ౧౦

క. ఖలజనబోధంబులు విని, యలుకం బ్రహ్లాదుఁ డిప్పు డమరపథంబున్
బలిమిఁ గొని మమ్ము నిందఱ,నిలయములకుఁ బాపెఁ బాపనిశ్చితుఁ డగుచున్.

సీ. ఇనరశ్ములకు నైన నెడ యించుకయు నీని కాఱడవులలోనఁ దూఱితూఱి
నక్రచక్రోదగ్రవిక్రాంతిఘోరంబు లేఱులఁ జేయీఁత నీఁదియీఁది
పులులు సింగంబు లెల్గులు సహచరులుగాఁ గొండలోయలలోనఁ గుందికుంది
యెట్టిదప్పుడు విన్న నిదె వచ్చె నమరారి పదపదం డని సారెఁ బఱచిపఱచి
కలఁగి తలగంప విరుగడ గాక వలస, చేయుచున్నార మిఁక నేమి చేయఁగలదు
శ్రీవధూనాథ వాని శిక్షించి మమ్ముఁ, గావఁగదయ్య మాకేడుగడయు నీవ.

క. అని విన్నవించువేళ్పుల, ననుకంపాసంపదభిమతాలోకనఖే
లనలాలనములఁ దాపం, బునకుం బాపుచు మురారి ముదమునఁ బలుకున్

చ. వెఱపకుఁ డేల యేఁ గలుగ వేదన మీఁ కసురారులార యే
నెఱుఁగుదు దైత్యనందనునహీనపరాక్రమ మింక వాని నే
నఱగఁగఁ బట్టి మీపదవు లన్నియుఁ గ్రమ్మఱ మీకు నిచ్చెద
న్నఱపుఁడు తొంటిదుఃఖములు [1]మానుపుదు మానసపీడ లన్నియున్. ౧౪

క. ఎల్లింటి నేఁటిలోపల, నుల్లంబుల మీకుఁ గలుగునుడు కార్చెద భీ
తిల్లకుఁ డని వేల్పుల శ్రీ, వల్లభుఁ డత్యాదరప్రవర్ధితమతి యై. ౧౫

క. తగ వీడుకొలుప వారున్, జగదీశ్వరుపలుకులకుఁ బ్రసన్నహృదయులై
మగిడిరి ప్రహ్లాదుని బలు, మగటిమి వారింపఁ దలఁచి మధుమథనుండున్. ౧౬

నారాయణుఁడు వృద్ధబ్రాహ్మణవేషముఁ దాల్చుట.

సీ. తలమోఁచియున్న దుస్తరజరాభర మనఁ బాకపింగళజటాపటలి బిగియ
నొడలుగూనగుచుండ మెడయులోనికిఁబోయిజరఠకచ్ఛపరాజుచాయదోఁప

[1] మానుప.

జే వెలుంగిడి చూడ నేవస్తుతతి యైన నవ్యక్తరూపమై యవధిఁ బోవఁ
జరణవిన్యాససౌష్ఠవ మఖిలంబును నాధారయష్టియం దత్తమిల్ల
వలిపలిత కర్కశాంగంబు వణఁకుగదురఁ, గంఠబిలమున నుక్కిసగడలుకొనఁగ
వృద్ధభూసురవేషాభివృద్ధిఁ దాల్చి, నాకపురి కేగె నిందిరానాయకుండు. ౧౮

క. ఆపురములోనఁ బూర్వపుఁ, గాపరియును బోలె నొక్కకడ జీర్ణకుటీ
రావాదనపరతంత్రుం, డై పరమబ్రహ్మనిష్ఠుఁ డై విహరింపన్. ౧౯

సీ. ఆస్థానరత్నసింహాసనం బేయిందువదనకు నుత్ఫుల్లపనజవాటి
నవనిధానంబు లేనాగేంద్రయానకు లీలాకటాక్షమాలికలసిగ్గు
పుట్టినిల్లే శరత్పుండరీకాక్షికి నమృతాభిరామ మహానంబురాశి
కడుపుచల్లఁగఁ గన్నకొడు కేసఘూటికి జగదేకవీరుండు శంబరారి
సరసమేయింతివిహరించు సౌధవాటి, పుణ్యములయిక్క యేభామభూరిమూర్తి
యమ్మహాలక్ష్మి వృద్ధాంగనాభిరామ, కలితయై కొల్చి యుండె నక్కపటవిప్రు.

క. ముత్తవ్వయుఁ దాతయు నని, తత్తావృక్పౌరజనులు తమ మన్నింపం
బుత్తడిచూపులమగువయుఁ, జిత్తజజనకుండు దివి వసించిరి మఱియున్. ౨౦

వ. ఆశాంబరీభూసురుండు కాలనేమికి ననుకూలుం డయ్యును విప్రచిత్తి చిత్తంబు
వడసియు శూర్పకర్ణునికిఁ జుట్టఱికంబు నెఱపియు వృశ్చికరోమునకు వియ్యం
పువావి చూపియు వ్యాఘ్రదంష్ట్రునకు వశంవదుం డయ్యును గంకటునింట నుం
కున గొనియుఁ గాలకేయునకుం గాలగతులు దెలిపియు వామనునకుఁ
బ్రేమాస్పదుం డయ్యును శంబరుం బాటించియు మఱియుఁ గలుగునిశాట
వీరులతోడఁ బోరామి యొనర్చుచు నుండె. ౨౧

క. తలంపోపలినాలుక పూ, సలగ్రుచ్చినబొందు దుగ్ధసంయుతజలముం
బలెఁ గపటభూసురోత్తమ, కులతిలకము దనుజపతులఁ గొలిచి మెలంగున్.

సీ. కార్తాంతికాకృతి గైకొని యొకచోట జ్యోతిరాగములరీతు లెన్ను
నొకచోట వేఁకి వెచ్చకు నగదంకారుఁ డైమందు లిచ్చుచు నలవు నెఱపుఁ
బరమపాశుపతరూపముఁ దాల్చి యొకచోట శైవతత్త్వార్థవిస్తరము గఱపు
- నొకచోటఁ బౌరాణికకులాగ్రగణ్యుఁ డై యితిహాసములఁ దెల్పు నెన్నియైన
యోగియై యోగశాస్త్రంబు లొక్కచోట, యోగవిదులకు నుపదేశ మొనరఁ జేయుఁ
గపటనటనానటుం డైన కంసవైరి, యాత్మనిశ్చిత మగుకార్య మైనదనుక. ౨౩

క. ఆచతురచరితుఁ డఖిలని, శాచరులకుఁ బూజ్యుఁ డగుచుఁ జరియించుసుధా
వీచివలఘానమృదువా, చాచాతుర్యంబు శ్రవణసౌఖ్యము నొసఁగన్. ౨౪

గీ. పొడగనియెచంతనొకనాఁడు పుణమివేల్పు. నిండుగొలువుననున్న యాఖండలారి
విబుధవైరులు తనసాధువృత్త మెల్లఁ, బేరుకొని పేరుకొని కానిపించుకతన. ౨౫

క. నోరాఁ గన్నులఁ జూచుచు, నారంభోవరకుమారుఁ డవనీసురు బం
గారముగద్దియ యుం దిడి, గారవమునఁ బలుకు వినయగంభీరోక్తిన్ ౨౬

క. ఎందుండి రాక కాఁపుర, మెందులనో మీకుఁ గూర్చిహితు లిల్లాలు
న్నందనులు గలరె సిను నే, మందురు పే రెన్నచోట ననఘవివేకా. ౨౭

క. నీవర్తనంబు నిఖిలముఁ, గైవారము సేయుచుండఁగా వినుచుందున్
ధావతి పడి, (?) యీక్రియ నుప, ధావన సేయంగనేల దనుజకులంబున్. ౨౮

క. సురకార్యార్థము వచ్చిన, పురుషుఁడవో కాక మమ్ముఁ బొడగని యేదే
పురుషార్థము మాచేఁ గని, మరలెదవో యనుడుఁ గపట మహీసురుఁ డనియెన్

సీ. నాయిక్క వైకుంఠనగరంబు ననుఁ దను గాఁ జూచుచుండు శంకరసఖుండు
కులపాలికయుఁ గొడుకులుఁ గల్గి వర్తింతు నారాయణాహ్వయోన్నతుఁడ నేను
బరమర్షిహృదయపద్మంబులఁ గ్రీడింతుఁ బుణ్యతీర్థముల నేప్రొద్దు నిలుతు
శ్రుతులు సూనృతవాక్యరతులు దాతలు లుబ్ధు లావులు నాదురూపాంతరములు
నీవు దేవేంద్రు గెలిచి తన్నిఖిలరాజ్య, వైభవశ్రీలఁ గొనియున్న వార్త లేను
గిన్నరీగీతికల వినుచున్నకతన, నిన్నుఁ జూచెద నని వచ్చి నిలిచి తిచట. ౩౦

చ. అనిమిషమానమర్దనవిహారమున న్నడిసిన్నయట్టి మీ
జనకునిఁ బోలి శత్రుజనసంహరణం బొనరించి వాలుమ
మ్మొన నడిపించి తింటికి సముజ్జ్వలరాజ్యరమావిలాసముల్
దనుజకులేంద్ర యింత వలదా బలదారుణవృత్తి చూపఁగన్. ౩౧

### వృద్ధబ్రాహ్మణుఁడు ప్రహ్లాదుం బొగడుట.

క. అనిమొన నీశరసంహతిఁ, దనువు సిరిగి దేవభర్త తల వీడఁగ బ
ల్గును కెత్తినపుడు మనయీ, దనుజకులము నవ్వకున్నె దనుజాధీశా. ౩౨

క. పావకుఁడు నీకృపాణము, చేవిదళితదేహుఁ డగుచు శిథిలప్రభుఁడై
చేవ చెడి పోవునప్పుడు, భావములో నెన్ను నీప్రభావ మధీశా. ౩౩

క. అంతకుఁడు శాంతుఁడై నీ, దంతిఘటలకాలుమట్లఁ దనసైన్యము లిం
తింతలు శకలములై పడ, నంతఃకరణమున వందఁడా సురవైరీ. ౩౪

గీ. కులమువాఁ డటంచుఁ గోణపుప్రాణాన, కలుగ కీవు బొడుదలయవట్టి
విడిచినట్టి నీదువీరంబు సారంబు, గౌరవంబు నెన్నఁగా వశంబె. ౩౫

క. జలధిపతిబలపరాక్రమ, ములు జలలిపులుగ నొనర్చి ముచ్చోరువుజలం
బులు ద్రావించిన నీయు, జ్జ్వలవిక్రము ముగ్రతరము శత్రుధ్వంసీ. ౩౬

క. గంధవహబాహుబలమా, రంధర్యము బుజలువైచి రక్షస్సేనా
సింధువు నుబ్బించిన నీ, బంధురరణకౌశలంబు ప్రస్తుతిఁ గనదే. ౩౭

క. ధననాథు నతని చెలికా, నినపోలక భైక్షవృత్తి నిలిపితివి జనా
ర్దనుఁ డెన్ను నెపుడుఁ గూరుచు, జనములలో నీప్రభావసంపల్లీలల్. ౩౮

క. దానవకులవర్ధన యీ, శానశిరశ్చంద్రరేఖ సౌధస్థలసం
దానితదీపకళికగా, వేనిలిపితి వొక్క నిబిడవిక్రమగరిమన్. ౩౯

క. సురలోకము నరలోకము, నురగాధిపలోకమును సముజ్ఝితశత్రూ
త్కరముగఁ [1] బాలించెదునీ, విరివికి నొకకొదవ గలదు విను మెట్లనినన్. ౪౦

క. శ్రుతులకుఁ దత్తద్వితరణ, కృతులకు యతులకు నిలింపఖేదహతులకున్
శతపత్త్రలోచనుఁడు మూ, లతలం బగు [2]నారసాతలగభీరముగన్. ౪౧

ఉ. కావున నాదిమూలము నఖండపరాక్రమదాత్రధారచేఁ
దావు తెరల్చి తున్మక యుదగ్రము గాదు భవత్ప్రయత్న మో
దేవవిరోధి నిక్కము మదీయవచోవిభవంబు సత్తెఱం
గీ వొనరించితేని గలఁడే నినుఁ బోలిన వీరుఁ డెయ్యెడన్. ౪౨

క. వామనసూచీముఖముఖు, లై మెలఁగెదు నీప్రధాను లనువాసరముం
దామెన్నఁదు గీవిధము మ, నోమార్గములందు దితితనూభవతనయా. ౪౩

వ. అని యమ్మహోస్థానంబుఁ గలయం గనుంగొనుటయు నెల్లవారలుఁ దద్విప్ర
తల్లజప్రోక్తంబు లుత్తమోత్తమంబు లని దైత్యసత్తమునకు విన్నవించి రావం
చనా[3]చుంచురుండు వెండియు నిట్లనియె. ౪౪

క. బలముగలనాఁడ శత్రులఁ, బొలియింపఁగఁ దగు సమూలముగ వేరున్నం
దల లెత్తు వెండియును హల, హలనిభవీరారికులలయానలకీలల్. ౪౫

సీ. వేదతుల్యములు మద్విపులవాక్యము లిందు సంశయింపకుము రాక్షసకులేంద్ర
హరి సురావళి కెల్ల నాధారమై యుండు నతని గెల్వకయున్న సమరపదము
చేకూడ దెల్ల నస్థిరము గావునఁ బ్రయత్నము సేయు తజ్జయోత్సాహమునకు
నామిత్త్ర మగు నైన నాళీకదళనేత్రు మాయావి గాన సమ్యక చరింతు
ననినఁ బ్రహ్లాదుఁ డిట్లను నవనిదివిజ, వర్య నీపల్కు లెల్ల నవద్యదూర
తరము లెచ్చోట నుండు శ్రీవరుఁడు నాదు, కట్టెదుర నిల్వకున్న నేకరణి గెల్తు. ౪౬

---

[1] పాలింపెదు. [2] సారసాతలగభీ. [3] చుంచురుండు అనియే వేఱొక్కచోటనుంగలదు.

చ. జలముల నుండునో మఱి రసాతలగర్భముఁ దూఱి యుండునో
కలుచన నొంటిగాఁ డగుచుఁ గాననవాటికనుండునో మహీ
వలమయ (?) మైనకంబమునఁ బొయక యుండునొ యెందు నుండు నా
జరధరవర్ణుఁ డీ వెఱుఁగఁ జాలుదు వొక్కొ తదాశ్రితస్థలుల్. ౪౭

క. నావిని మాయాభూసురుఁ, డావిబుధద్రోహిఁ బలుకు నసురాధిప నీ
కావిష్ణు నేనె చూపెదఁ, గావలయున యేని వేగఁ గదలుట యొప్పున్. ౪౮

చ. అని తన కాప్పుఁ డైపలుకు నమ్మతకంపుఁబిసాళిపంకుఁ (?) బా
ఱునకు సురారి యిచ్చె నదరు ల్వేదచల్లు శరీరకాంతులం
దనరువధూజనంబుల మదావళిపంక్తుల మేలితేజులన్
ధనకనకాంబరావళుల దాసజనంబుల సుప్రసన్నుఁ డై. ౪౯

క. అవి యెల్లఁ జూచి యిట్లను, నవనీసురసూతి నగుచు నసురాధిప న
న్నవివేకిఁ గాఁ దలంచితి, వివి నా కేమిటికి నిన్ను నే వేఁడితినే. ౫౦

క. జలములు వల్కలములుఁ బం, డులుఁ గూరలుఁ గాక యతికఠోరనియమశ
ష్కులు లై యుండెడువారికి, వలయునె బహువిధపదార్థ వైభవసుఖముల్.

క. పరపురుషార్థము సేయని, పురుషులజన్మంబుఁ బొల్లుపోయినకొలుచున్
సరిగానఁ బరుల కుపకృతి, పొరయింపఁగవలయు ననుచు బుద్ధిఁ దలంతున్.

క. నీవస్తువు లివి నాయవి, గావా దేవా విధూతకైటభనిభసు
శ్రీవిభవ రిపుల గెలిచిన, యావేళ నొసంగవయ్య యఖిలార్థములున్. ౫౩

క. వైకుంఠనగరవస్తువు, లీకొలఁదులయవియు వాని నే నొసఁగింతు
న్నీకైవసముగ నిప్పుడ, నాకౌకఃప్రత్యనీకనాయక యనుడున్. ౫౪

క. విప్రునిసౌహార్దము నా, విప్రునివైరాగ్యగుణము విప్రుని మృదువా
క్యప్రౌఢియు మది మెచ్చుచు, నాప్రహ్లాదుండు నిశ్చితాశయుఁ డగుచున్.

క. తనతనుసంభవునివిభో, చను బురరక్షకు నొనర్చి సైన్యసహితుఁ డై
దనుజుఁడు వైకుంఠపురం, బునకుం జను భూసురోత్తముఁడు తెరువొసఁగన్.

స్రగ్ధర. హరిమీఁదం దాడి వెట్టన్ హరిహయరిపుఁ డం చద్భుతాక్రాంతులై ని
ర్జరవైరుల్ భూరిభేరీస్వనములు చెలఁగన్ సర్వసైన్యంబుల స్ఫీ
కరలీలం ద్రోయఁ జేయం గలఁగె నభము దిగ్దంతు లూటాడెఁ దారా
పరిపత్తు ల్మొత్తియంబుల్ బలె ధరఁ దొరఁగెం బర్వె దుర్వారరేణుల్.

క. భూమిపయిఁ బర్వతమ్ముల, పై మరుదధ్వంబుపై నపారములై సు
త్రామరిపువాహినులు చను, భీమగమనరేఖ జగము బిమ్మిటి గొలిపెన్.

## ప్రహ్లాదుఁడు వైకుంఠముపై దాడివెడలుట.

సీ. ఆకాశమండలం బనునుప్పుమున్నీటి కౌర్వాగ్నిశిఖ లయ్యె నాయుధములు
ముదురువెన్నెలగాయు ముక్తాతపత్త్రసంతతులు చంద్రాననస్థలు ఘటించె
రవిమీఁద దండెత్తు రాహుగ్రహంబుల కరణిఁ బతాకానికాయ మడరె
భువనంబు లెల్ల నాపోశనంబుగ మ్రింగె జగతీరజఃకుంభజన్మమూర్తి
శబ్దమయములు గావించె సకలదిశల, మురజఢక్కాహుడుక్కాదిశంఖరవము
లనని దైవతదృష్టమార్గానుసరణ, మాచరించి సురారిసైన్యములు దఱుమ.

క. మాయావిప్రాకృతి యగు, నాయఖిలేశ్వరుఁడు నిర్జరాహితబలమున్
వేయాకర్షించె సహా, ప్రాయుతయోజనము లొక్క యరనిమిషమునన్.

ఉ. ఎక్కడఁ జూచిన న్వనము లెక్కడఁ జూచిన వాహినీకులం
బెక్కడఁ జూచిన న్మృగము లెక్కడఁ జూచిన దావపావకం
బెక్కడఁ జూచిన న్విషధరేశ్వరఫూత్కృతులై మనోభయం
బెక్కుఁగఁ జేసె దైత్యులకు నేగెడు మార్గము దుర్గమాకృతిన్. ౬౧

క. అంతర్ధానము నొందె ము, రాంతకుఁ డాఘట్టమున భయాకులమతులై
చింతాజలధి మునింగిరి, దంతావళతుల్యబలులు దైత్యాధీశుల్. ౬౨

క. అపుడొకచీఁకటి దోఁచెం, జపలతరయమస్వస్రప్రసర్పద్వీచీ
విపులం బై సంఛాదిత, విపులం బై గళితవస్తువిస్తృతి యగుచున్. ౬౩

శా. దూరోత్సారితవామనత్వముగ రోధోరంధ్రనీరంధ్రమై
యాహూపంబున నంధకార మధికం బై పర్వఁ దోడ్తోన గం
భీరధ్వానముతోడఁ బెల్లు విసరెం బెన్గాడ్పు భూమీరజో
ధారాసారపరంపరాస్థగితభూతవ్రాతదృక్పాత మై. ౬౪

క. వీచుబలుగాలిఁ దూలుచు, నేచినచీఁకటియుఁ గాఁగ నెదవడి గమన
శ్రీచాతుర్యముడంగి ని, శాచరవీరులు భయప్రసక్తహృదయులై. ౬౫

సీ. అరదంబు లొరఁగిన నట్టిట్టు చనలేక వికలప్రయత్నులై వెకలువారు
దంతిసంతతి పరిభ్రాంతి నిట్టట్టుగా మరలింపనేరక మరలువారు
సైంధవస్కంధంబు జడిసి వికీర్ణమై పోవ నొండనలేక పొగులువారుఁ
బత్తివిపత్తిసంప్రాప్తి చిత్తంబుల నొత్తరించిన నుడుకొందువారు [అచువారు
గొడుగులుఁ బతాకలును గూలఁ గుందువారుఁ, జామరధ్వంసమునకు వాచ
నైరి ఘోరాంధకారవికారకలిత, గాఢవాత్యానిగుంభంబు గసిమసంగ. ౬౬

క. చెల్లాచెదరై దానవ, వల్లభుసైన్యములు విప్వ వాసవరిపుఁ డు
ద్వల్లీల నిలిచె నొక్కెడ, పొల్లెడలిన వెలయు ధాన్యపుంజముపోలెన్. ౬౭

వ. ఆప్రహ్లాదుం డప్రశక్యితవీరరసప్రసారుం డై మసారసారవర్ణంబును మహిత
జనయోగిహృదయాభ్యర్ణంబును మంజులప్రభానుభావవికీర్ణంబు నగుతత్త్వం
బు సాత్త్వికబుద్ధిం దలం చుచుం గలంచునలఘుతమఃపుంజంబు గుఱించి విరించి
బాణప్రయోగంబు సేయుటయు. ౬౯

క. తమ మెల్ల నణంగె వాయు, క్రమవిక్రమణంబు సడలెఁ గాసఁగవచ్చెం
గమలాప్తబింబ ముజ్జ్వల, తమమై దివిఁ దోఁచెఁ జంద్ర తారాచయముల్.

క. ఆపన్నగవజ్రాయుధు, నాపన్నగశాయిఁ దలఁచునంత నసురహృ
త్తాపంబు లణఁగెఁ జాలఁ బ్ర, దీపించెఁ బ్రబోధరవి యుదీర్ణప్రభుఁ డై. ౭౦

గీ. షాదివియున్నబలము లదవద యైపోవ, నుప్పుగల్లువోలె నొకఁడ నిలిచి
శాంతుఁ డగుచు నసుర చింతించుఁ దనలోన, దేవనుతము వాసుదేవమహిమ.

సీ. ఇంతయై యంతయై యేమియు నెఱుఁగని నాపుత్త్రసంబు లున్నతికిఁ దెచ్చెఁ
బ్రాణగోడ్డము లైన బలుసంకటంబులుపాయంగఁ ద్రోచి శోభనమునొసఁగెఁ
బరమతత్త్వ మెఱుంగు బ్రహ్మర్షికులములో నన్నగ్రగణ్యుగా నెన్ని మనిచె
నిబిడతామసగుణాన్విత మైనకులమునఁ బుట్టినాఁ డనక చేపట్టె నన్ను
నట్టిహరికిని భృత్యులౌనమరవరుల, దుష్టజనబోధములువిని తూలఁ జేసి
వాసివహియించియున్ననావరభుజోరు,శక్తియిట్లయ్యె శ్రీలులకు జయముగలదె

సీ. హరిదాసు లగువార లఖిలధర్మజ్ఞులు హరిదాసు లుజ్ఝితదురితభరులు
హరిదాసు లాగమోత్కరశుకపంజరుల్ హరిదాసు లురుకీర్తిహారయుతులు
హరిదాసు లనఘులు హరిదాసు లప్రమేయారంభతత్త్వనిత్యస్థలములు
హరిదాసు లెవ్వనియాలయంబులకైనఁ జనిరి వైకుంఠ మాస్థలము లెల్ల
నట్టిహరికిని దాసులై యతిశయిల్లు, వృత్రశాత్రవముఖులైన విబుధులకును
నెగ్గు సేసితిఁ గావున నిపుడు నాకు, నిట్టి దుర్దశవాటిల్లె నేది గతియొ. ౭౩

క. దుర్బోధకరులు సఖులుగ, మూర్ఖులముల గెలువఁజాలు మత్పరికరముల్
నిర్బంధము నొందిరి భువ, నార్బుదసంక్షోభకృన్మహానిలవిహృతిన్. ౭౪

క. ఘోరవనంబులు నక్ర, క్రూరమహానదులు విపులకూటనగేంద్ర
ద్వారుహములు దక్కఁగ నె, వ్వారుం బొడసూప రెట్టిపడువో యిచటన్.

క. ఏనెంతదవ్వు వచ్చితి, నో నాకము వెడలి మున్ననోగతిఁ దత్సం
ధానము తోఁపదు వికలత, మానసమునఁ బర్వె నెట్టిను తమిామతమో.

ఉ. నేరుపునేరము ల్కలప నేరఁడు సారసపత్త్రలోచనుం
డారజనీచరారిచరణాంబుజము ల్మది నిల్పియున్న నె

వ్యాపికి నైన నన్ను గెలువం దరమా పరమార్థసార్థగా
ధారభటీవిహారు లగు నాదిమునుల్ విపదబ్ధిమగ్నులే. ౭౭

## ప్రహ్లాదుని పశ్చాత్తాపము.

క. కొడుకులు తప్పులు చేసిన, యెడవిడువం దగునె తండ్రి కిటువలెనే పో
బెడదలు గొలిపెడుభక్తుల, యెడవిడువక బుద్ధి యొసఁగు టిభవరదునకున్.

సీ. సర్వాశయస్థాయి సర్వేశ సర్వజ్ఞ సామగానప్రియ సాధువినుత
నిర్మల నిరవద్య నిత్య నిశ్చలరూప నిరతిశయానంద నీరజాక్ష
పరమాత్మ పరమేశ పరతత్త్వపారగ పరమదయాలోల భక్తిగమ్య
కమఠాంగ కమలేశ కమలాసనార్చిత కామాదిశత్రుసంఘాతదమన
దేవ దేవేశ దేవారిదృగ్విదూర, సత్యసత్యామనోనాథ సాత్యకినుత
వసుమతీధర వసుసంఖ్య వాసుదేవ, ప్రోవు మాపన్నిమగ్ను నాబోటివాని. ౭౮

సీ నీమేటి నెమ్మేనిరోమకూపంబుల బ్రహ్మాండకోటు లుద్భవమునందె
నీపదాంబుజముల నేపారు మిన్నేఱు తివిరి కెందమ్ములఁ దేనె వోలె
మఱుఁగైన నీమహామాయాంధకారంబు చింపంగ లేరు నిలింపు లైన
సంవర్తవటపత్రశాయియౌ నీకన్న మాయుట సృష్టియు మోడ్పు లయము
నయ్యె నిన్నెన్నఁగాఁ దరం బౌనె మౌని, మానసాంభోజకర్ణికామధులిహేంద్ర
నన్ను నాపన్నుఁ బ్రోవు సంపన్నకరుణ, నరుణాకరచంద్రనేత్ర సత్యాకళత్ర

క. నాకున్ బుద్ధులు చెప్పిన, యాకోవిదవరుఁడ వీవ యటు గాకున్నన్
వీకున బహుయోజనమిత, మీకడ కెవ్వాఁడు దెచ్చు నీనాసేనన్. ౮౧

శా. ఓనాభీభవపద్మ యోభవహరా యోయోగిమోక్షప్రదా
యోనిత్యోన్నత యోనిశాచరహరా యోదీనకల్పద్రుమా
యోనమ్రప్రియ యోకృపాజలనిధీ యోభక్తిగమ్యోదయా
నీనామంబు నుతించువారలకు నిర్నిద్రత్వ మౌ టబ్రమే. ౮౨

ఉ. ధూసర మెందు వోయితివి ధూమ్రశిరోరుహ నీకుఁ బాడియే
కాసరవాహనాదిసురగర్వ మడంపక పెంపు దింప ను
ల్లాసము నొందు నాతలఁపులన్ ఫలితంబులు సేయ కోనర
గ్రాసకులంబు డంబు చెడఁగా నగునే తగునే తొలంగఁగన్. ౮౩

క. వచ్చితిఁ గడు దూరము నా, కిచ్చట నెవ్వారు గల రహీనకృపాఢ్యుల్
విచ్చలవిడిఁ బ్రేలెదు నా, నెచ్చెలిగమి యింత సేయునే దుర్బుద్ధిన్. ౮౪

→ ప్రహ్లాదునికి విష్ణుమూర్తి ప్రత్యక్షమగుట. ←

గీ. అనుచు దానవకులసింహ మపుడు తొంక
నీరుమోచి గజేంద్రుని గౌరవమున
శార్ఙ్గి గుఱియించి ఘోషించుసముదమున ము
రారి ప్రత్యక్షమయ్యె నయ్యసురసుతికి.　　౬౫

వ. ఇట్లు సాక్షాత్కరించి యప్పుండరీకాక్షుండు పక్షిపరివృఢదృఢస్కంధారూఢుం డై రోహణశిఖరిశిఖరావలంబి నీలాంబుదంబుచందంబున ననల్పసౌందర్య మందిరుం డై యిందిరాదేవి పొలయలుకలకలకలం గలంగి యందంద వం దనం బొదరింపం దదీయసీమంతసిందూరరజోరంజితంబు లనం గెంజాయ రంజిల్లు చరణపల్లవంబులును నడుగునడుగునం బొడమిన మిన్నేటితేటనీటం బర్యటనంబు సేయు పాఠీనంబులపరిపాటిం బొటిల్లు చిందంపుమీలమేని జాలిగల పొలపంబుఁ దెలుపుచు బలభిదాదిదివిజకిరీటకోటిమాణిక్యశా ణోత్తేజనంబున రాజిల్లు చరణనఖరశిఖరంబులును గాంతిలీలాకలాచిక లై జాను చ్ఛాయాద్విగుణితశోభాభిరామంబు లై యిలేందిరాకరారవిందోపలాలన పరిస్పంద[1]మందిరంబు లై సొంపొందుజంఘల యలంఘ్యప్రభావిభవంబును నభిరామనాభీకమలవిమలపరాగపరంపరా [2]పిహితంబు లగు నివి యన ధగ ద్ధగని చిగురుపసిండికాసియ వాసికెక్క చక్కని యూరుప్రదేశంబును గాంభీర్యంబున నంభోజసంభవుం డొక్కచక్కిం జిక్కి చేవమ్రాను దొలఁచు నలికలభంబు సులభగతి నతీతానాగతంబులు చింతింప నత్యంతకాంతి మంతం బగుచు శోభిల్లు నాభిపల్వలంబును ద్రివళీనలయవలయితం బై గుణత్రయవిచిత్రమూర్తి యగు మాయప్రోయాలునుం బోలెం గ్రాలుచు గగనతలవివర్తం బై సూక్ష్మేక్షణలక్షితం బగునవలగ్నంబు [3]సొగుపును నగణిత ముక్తాదామాభిరామం బై ప్రేమాస్పదం బగుచుం గందర్పకరకంబు బిబ్బో కంబు [4]నాగడంబుసేయు కంధరాధౌరంధర్యంబును నాజానులంబితంబు లై తేజరిల్లుచు ననర్ఘ్యమణిమయముద్రికాముద్రితాంగుళీకిసలయంబులుం బస మీఱి శోభిల్లుచు ముల్లోకలావణ్యపణ్యస్థలంబు లగు నతిస్థూలబాహా స్థూణంబులును నపరిక్షీణ జలధరశకలకలిత నభోభాగంబు బాగున నంచిత శ్రీవత్సలాంఛనం బగువక్షప్రదేశంబునుం జంద్రమండలంబు బెండుపఱిచి ముకురంబును వికవిక నగి జిగిదమ్మియెమ్మె లడంచి యుదంచిత విలోచన పుండ

[1] మందిరంబు(లంబు)లై. [2] పిహితంబు(లు). [3] సొగిపుచు. [4] నాగంబు(లు)సేయు.

రీక పలాశ పేశల ప్రభాభిరామం బై యుద్దామనిగమనిశ్వాస వికస్వరనాసా పుటఘటితం బై కుటిలకుసుమశరశరాసనసౌభాగ్య భాసమాన భ్రూలతాలాలితం బై మకరకుండలమండిత గండస్థలం బై యఖండాఖండలకోదండఖండ పరిహాసనపండిత కిరీటమండలం బై పదసుమీఱు వదనవనజంబునుం గలిగి వేదలతావితానంబునకుం బాఁదును నస్తోకశాస్త్రనిస్త్రింశంబునకు నొఱయును బురాణపరిణాహపరిణామంబునకు శరణంబును నితిహాసకిసలయంబులకు రసాలశాఖియు మంత్రంబులకు శుద్ధాంతంబును దంత్రంబులకుం దగిన నెలవును యోగంబునకు భాగధేయంబును విజ్ఞానంబునకు నుపజ్ఞంబును వివేకంబునకు నాకరంబును విభవంబులకుఁ బ్రభవస్థలంబును నైనరూపంబు దీపింపం బురుషోత్తముండు పురాణపురుషుండు భూతభవ్యభవన్నాథుండు భోగిశాయి భూధరధరుండు మాధవుండు మధువైరి మథితకైటభుండు మందాకినీచరణుండు మఖఫలప్రదాత ప్రత్యక్షం బగుటయు నుత్క్షిప్తమానసవికారుండై హిరణ్యకశిపుకుమారుండు మారజనకునకుం బలుమాఱుం బ్రణమిల్లి యి ట్లని నుతించు. ౮౬

దండకము. శ్రీమానినీప్రాణనాథా నమద్భక్తయూథా త్రిలోకైకరక్షాసమాసక్తచిత్తా యియత్తావిదూరప్రచారా మహీమానచోరా మురారాతి నీరీతి యేవంవిధం బంచు నెంచంగరా దచ్యుతా సచ్చిదానందకందా ముకుందా భుజంగేంద్రపర్యంక యీజంగమస్థావరాకారయౌ సృష్టి విస్పష్ట మై పువ్వునం దావియుం బోలె నీమూర్తిలోఁ గానిపించు న్వివేచించి స్తుతా విస్తృతం బైననీమాయ కన్నారయంగా నెవ్వఁడోపు న్విధూతాన్యపాయా జపాయోగవిస్మేర మై మీఱు కాశ్మీరఖండంబునన్ రక్తిమవ్యక్తి జొత్తిల్లులీలన్ గుణశ్రేణి శ్రేష్ఠు న్నినుం గప్పి యుండు న్మణీకుండలస్ఫారగండస్థలా పుండరీకాక్ష యక్షీణజన్మాంతరాభ్యర్జితానేకపాపాటవీవాటికల్ పీటఁబోవు న్భవన్నామవర్ణావళీపావకజ్వాలచే మేలుగాంక్షించు దుశ్శీలుఁ డైన న్నినున్ నెన్నఁగానేకవారంబు హృత్కీలితుం జేయఁగాఁజాలిన న్జాలిఁబోఁద్రోలి యుల్లోకసౌఖ్యోన్నతి న్ముఖ్యవృత్తిం గన న్నేర్చు నన్న న్సదా నిన్ను నర్చించు వర్చోనిధు ల్భాగ్యసంపన్ను లౌ నంచుఁ గీర్తింపఁగా నేల సద్గీతకీర్తీ మరుచ్చక్రవర్తీ భవత్సేన బల్మానవగాదా భవాంభోధి దాఁటింప వేదాఘపాటచ్చరధ్వంసి హింసాదిదుష్కర్మము ల్మాని సంసారి యయ్యు న్నినుం గొల్చియే నిల్చి నిష్ఠాగరిష్ఠుండ నై నిర్గుణత్వంబునన్ ధర్మసంపాది నై యుండి యట్లుం

డంగాలేక పల్లాకినాకాహితానీకము ల్పుష్టి నిర్బంధముం జేసి దుష్బుద్ధి నుద్బుద్ధముం జేయఁ గ్రుద్ధుండ వై మీఱి పృష్ఠశ్రవుర్ బద్ధవైరంబునన్ యుద్ధకేళి న్విభాళించితిం గ్రించ వై పంచనాచుంచురత్వంబున న్నీపదాంభోజముల్పూజ గావింపఁగాలేక చీకాకులం బొందితి న్వందితి న్నేఁడు పెన్నాటకంబైన యామేటి పెంజీఁకటి న్వీఁక దక్కెన్ భయం బుత్కటం బయ్యెఁ జిత్తంబు కృత్తంబు గాఁబోలుఁ దూలెం గరాళంబు లౌచున్ సురాళంబులై వాలు మద్వాహినీజాలముం దూలముం బోలె దిక్కూలముల్ చేరెఁ గారుణ్యముం జేయవే పుణ్యసంపాదకా సంపదేకాశ్రయా యాశ్రమస్థైర్యనిర్వాహకా సర్వసంవేద్యవిద్యానిధీ భూసురేంద్రప్రియా యాసురప్రాణనిర్మోచకా మేచకాకార నాకానిదుర్వృత్తము ల్గత్తిరింపింపవే యుత్తరింతున్ మహూర్మిస్ఫురద్గర్వవార్వల్లభుం బల్లదంబుం గడం ద్రోచి నీముద్రల న్మోచి నీవారికి న్నీకునుం దప్పి యుప్పొంగ నెవ్వేళలన్ భవ్యదివ్యాస్త్రసాహాస్వధారూప తాపత్రయోచ్చాటనావ్యగ్ర ఘోరాగ్రహాగ్రాహమస్తచ్ఛిదాకౌశలోదారఖేదారరచ్ఛిన్నహృత్కుంభిసంభావనాసంభ్రమారూఢగాఢప్రబోధా, సుధాశీతళా దేవదేవా నమస్తేనమస్తే నమః. ౮౭

మ. అని నక్తంచరరాజనందనుఁడు దీనాకారుఁ డై ప్రస్తుతిం
చినఁ బంచాస్త్రగురుండు భూరికరుణాసిక్తేక్షణాంభోజుఁ డై
యనఘాత్మా యిటు రమ్ము రమ్మను మ డాయం బిల్చి తన్మస్తకం
బునఁ గీలించె రమాకుచద్వయకుభృద్భ్భాన్యస్తమున్ హస్తమున్. ౮౮

వ. ఇట్లు హస్తివరదుండు హస్తమస్తకసంయోగంబు సేయుటయు నయ్యమరారి కౌమరారి విమలతరనిజహృదయమణిముకురోదరప్రతిఫలితలలితప్రబోధమాధురీసాధురీతిప్రసారుం డై సంసారపాండిత్యంబున వెండియు నయ్యండజాధిపస్కంధారూఢునకు గాఢభక్తిం బ్రణామంబు లాచరించి వాచాలతాచమత్కారంబులు మెఱయ నప్పరమపురుషుం బురుషత్రయస్వరూపుం బరాపరుం బొగడు నవసరంబున నగణితజలధరజాలవినీలం బగు నంధకారం బున్మూలితం బయ్యె నుత్తాలంబు లై యొత్తరించుసప్తమారుతప్రకాండంబు లొండొండ చండివడి యథాపూర్వప్రధావనంబున బరిమీఱుట మాని మేనులకుం దనువు సొనిపె నుత్పాదితగగనకోటరవిపాటనంబు లగు సికతావర్షంబులు పరిహృతంబు లయ్యె నయ్యెడ. ౮౯

సీ. ఎక్కడఁ జూచిన నిందిరాసుందరీప్రతిమపురంధ్రీ ప్రపంచలక్ష్మి
యెక్కడఁ జూచిన హేలాలసత్కీరపరభృతాకీర్ణకల్పద్రుమంబు
లెక్కడఁ జూచిన నినతాళమున జాలువాఱు సిద్ధరసప్రవాహకోటి
యెక్కడఁ జూచిన నిభతురంగస్యందనామందభటసముద్దామగరిమ
గలయ నెక్కడఁ జూచినఁ గమలగర్భ, శంభుజంభారిముఖ్యనిర్జరకులంబు
గలిగి రెండవవైకుంఠకటకమనఁగ, నాప్రదేశంబు దోఁచె నయ్యసురపతికి.

క. తనమంత్రులఁ దనసేనలఁ, దనమిత్రులఁ గాంచె నచట దనుజేంద్రుఁడు చూ
పనిమిషముగ నిక్కంపిత, తనుఁడై చిత్తరువు కరణిఁ దా వెఱఁగందెన్. ౯౧

క. మును దనుఁ గొనివచ్చిన వి, ప్రునిరూపము గానవచ్చెఁ బురుషోత్తము మే
నున నట్టిచంద మంతయుఁ, గని ప్రహ్లాదుండు మస్తకచలన మమరన్. ౯౨

వ. ఆవిశేషంబు లన్నియు శేషశయనుశాంబరీసమాడంబరంబు లని మనంబు
నం దలంచుచు నంబుజాక్షు గుఱించి మఱియు నిట్లనియె. ౯౩

ఉ. నేరము చేసి యే నిఖిలనిర్జరలోకము శోకమంద దు
ర్వారమదాతిరేకమున వాలుట మాన్పఁ దలంచి నన్ను మా
యారచనాంబురాశికిని నగ్గము చేసితి వాత్మసంభవుల్
నేరకయున్న నేర్పుఁ గరుణించుఁ గదా జనకుండు శ్రీనిధీ. ౯౪

గీ. పన్నగములచేత బహుపాశములచేత, నాయుధములచేత నగ్నిచేత
నన్నుఁ గాచినట్టి నరమృగాధిప నీకు, నెగ్గు చేసినాఁడ హీనబుద్ధి. ౯౫

క. ఖలజనదుర్బోధంబులఁ, గలఁగె మనము బోధమహిమ కనుమూసె మదం
బొలసె మహీసురసురపూ, జలు దినదినమునకు నీరసములై తోఁచెన్. ౯౬

వ. సకలాంతర్యామివి సర్వసాక్షి వణురేణుతృణకాష్ఠంబులయందు దధిష్ఠింతు
వీసృష్టిచేష్టాప్రకారంబు నీకుఁ గటాక్షమాత్రంబు నవధింపుము. ౯౭

సీ. గురునింద గావించుక్రూరాత్ముఁ డేనియు బ్రహ్మఘ్నుఁ డేనియుఁ బతితుఁ డయినఁ
జండాలపాషండసంగతుం డేనియు మద్యపానాసక్తిమత్తుఁ డైనఁ
జెనకరానివధూటిఁ జెనకినవాఁ డైన సజ్జనపీడాప్రసక్తుఁ డైన
విశ్వసించినవారి వెతవెట్టు బలుఁడైన దుర్మదాంధుం డైన ద్రోహి యైన
బహువిధమృషాప్రలాపలంపటుఁడ యైనఁ, బుండరీకాక్షనీపదంబులు దలంచు
వాఁడు నీవాఁడు నీకూర్చువారివాఁడు, వానికైవసములు ముక్తివైభవములు.

క. కుపథంబులఁ జరియింపక, విపరీతమతానుభవము వీక్షింపక మీ
కృప గలిగెనేని మనుజుం, డపవర్గసుఖంబునొందు నఖిలాండపతీ. ౯౯

మ. వికలాంగు ల్విషమప్రచారులు రుజావిద్ధుల్ వినేత్రుల్ జడుల్
వికటాచారులు విత్తవర్జితులు నుద్వేలక్షుధాపీడితుల్
సకలాన్నగ్రసనాభిముఖ్యనిరతుల్ చండాలకల్పుల్ రమా
ముకురాస్యారమణా నిరంగనని దుమ్ముల్ ధర్మసంస్థాపకా. ౧౦౦

సీ. సింహాసనస్థులై సిరుల నించినవారు భోగసంపదలచేఁ బొదలువారు
బహుపుత్రపౌత్రలాభముగల్గి మనువారు విద్యానవద్యులై వెలయువారు
సప్తసంతానప్రశస్తి గల్గినవారు ప్రత్యర్థిసార్థంబుఁ బఱపువారు
తాపత్రయవ్యథోద్ధతి నెఱుంగనివారు నిష్టాన్నదాతలై యెసఁగువారు
భవదుదారాంఘ్రిభక్తిసంపన్నులగుచు, మించి తొలిమేన మిమ్ము సేవించినారు
వామన ముకుంద గోవింద వాసుదేవ, నలినదళనేత్ర పావనోన్నతచరిత్ర.

సీ. నారాయణాయ కిన్నరనరోరగయక్షసేవితాయ మునీంద్రభావితాయ
నారాయణాయ నానాభవక్లేశవిదారణాయ సమస్తకారణాయ
నారాయణాయ పన్నగరాజపర్యంకబంధురాయ విభిన్నసింధురాయ
నారాయణాయ గండస్థలాంచితరత్నకుండలాయ మహాస్త్రమండలాయ
జలధరశ్యామవర్ణాయ శాశ్వతాయ, కంజహస్తాయ శస్త్రాయ గతభవాయ
తేనమో యనిపల్కు సాత్త్వికుల కిహముఁ,బరముఁ గరతలమాణిక్యపరికరంబు

క. దండించు నన్ను నెన్నే, దుంపగములు చేసినాఁడ ధూర్జటిసఖ దో
ర్దండశితచక్రధారా, చండిమచే ననుడు భుజగశయనుఁడు నగుచున్. ౧౦౩

క. ఆలింగనంబు చేసెఁ గృ, పాలింగితహృదయుఁ డగుచు నసురేంద్రసుతున్
లోలవిలోచనపాండుర, నాళీకములందుఁ గరుణ నవకము మీఱన్. ౧౦౪

క. హరిగాత్రస్పర్శంబున, సురవైరిమనంబు బోధశోభిత మయ్యెం
దరుణారుణకిరణకిరణ, పరిణతి వికసనమునొందు పద్మమువోలెన్. ౧౦౫

వ. అప్పుడప్పుండరీకాక్షుండు చతుశ్శ్రవఃపరివృఢసింహాసనాసీనుండై హిరణ్య
కశిపుసూనుం దనకుడితొడమీఁదఁ గూర్చుండ నిడికొని తదీయకపోలస్థలం
బులు పుడుకుచు లజ్జావైవర్ణ్యంబు నుజ్జగింపించి బొజ్జగిలిగింత లిడుచుఁ
గొడుకు ముద్దాడువడు వడరం గొంతసేపు వింతవిలాసంబుల భాసమానుం
డై యయ్యమరాంతకున కిట్లనియె. ౧౦౬

క. ఏమీవు చేయుదువు సు, త్రామాహితదుష్టజనపరంపరకటుల్
నీమది తమోమయంబుగ, నీమాడ్కి నొనర్చె దీని కేటికి వగవన్. ౧౦౭

ఉ. పుట్టిననాఁటనుండి యనుఁ బుణ్యచరిత్రుఁ డనంగ నైనయట్టి నీ
పట్టున నొక్కతప్పు గనుపట్టినఁ గానఁగఁ బాడి గాక యి
ట్టట్టన నేర్తునే తనయునందలి నేరమి తండ్రి సైఁచి చే
పట్టక మానునే విమతభంజన సజ్జనచిత్తరంజనా. ౧౦౮

క. దనుజస్వభావమున నీ, మనమున నొక్కొక్కమాఱు మద ముదయించుం
గనుగలిగి తద్వికారముఁ, బెనుపక కడ కొత్తనయ్య పేర్చిన తెలివిన్. ౧౦౯

క. నామీఁది భక్తి దృఢతం, బై మది నొలయుంగఁ జేయు మంతశ్శత్రు
స్తోమవిదారణకారణ, ధీసుహితు సముద్ధరించి త్రిదశారాతీ. ౧౧౦

గీ సురవిరోధంబుమానుముసురలుధరణి,సురులుధర్మైతిహాసముల్ శ్రుతులునసఁగ
మచ్ఛరీరాంతరము లివి మది నెఱింగి, చాలఁ బాటింపవయ్య విశాలకీర్తి.

వ. అనినం బ్రహ్లాదుం డాహ్లాదమగ్నహృదయుం డగుమధుమథనుతో ని
ట్లనియె. ౧౧౨

క. ధన మొల్ల ధాన్య మొల్లం, దనయుల నే నొల్ల రాజ్యతంత్రము నొల్లన్
వననిధిశయాన నీపద, వనజంబులమీఁదిభక్తి వదలమి యీవే. ౧౧౩

వ. దేవా యేవిధంబున భక్తులకు నీయందలిభక్తి నిబిడసన్నాహంబై యుండు
ననిన నతనికి శతపత్రలోచనుం డి ట్లనియె. ౧౧౪

సీ. సంతతాచారసంసక్తాత్ము లగువారు నుసలక సత్యంబు నొడువువారు
నభ్యాగతార్చనం బాచరించెడువారు నిగమార్థముల యూఁది నిలుచువారు
దుర్జనసంసర్గదోష మొల్లనివారు పరకామినీకాంక్షఁ బాయువారుఁ
గలనైన నాఁకొన్నకడుపుఁ జూడనివారు గురుసపర్యాసక్తిఁ గొఱలువారు
నిత్యనైమిత్తికముల యన్నింటియందుఁ, బట్టువదలక నిష్ఠఁ జూపట్టువారు
నాదుభక్తులు వారలనడక యిట్టి, దద్భుతవివేకకలితతత్త్వావలోక. ౧౧౫

క. మద్భక్తులకును బరమప, దోద్భాసిసుఖంబు నొందు నుత్సవము మదిం
బ్రోద్భవమగు నేనియు నది, సద్భావంబున నొనర్తు జాడ్యవిదూరా. ౧౧౬

వ. మఱియు మన్మంత్రజాపకులును మన్నామస్మరణస్ఫురణాభిరామహృదయులును
మద్వ్రతాచరణపరిణతనియమకృశీభూతశరీరులును మత్పూజాప్రయోజన
విరాజమానులును మత్కథాశ్రవణప్రవణకర్ణకుహరులును, మద్రూపాంత
రంబు లగుమహీసురులు మాననీయు లని మన్నించుమహామహులును మత్ప
దంబుం బ్రాపింతు రాపద్మభవఫాలలోచన బలవిరోధిపవనసఖ భానుమత్సూ
నుపలలాశన పాశధరపరిమళరథ భర్గసఖప్రముఖనిఖిలనిలింపులును యక్ష

పక్షిరక్షోగంధర్వ సిద్ధసాధ్యశేషోరగాది వివిధామరవిశేషంబులును మదాజ్ఞా చక్రంబునం బరిభ్రమించుచుండుదు రేను భానుకోటిప్రభాభాసమానం బును శ్రీసమేతంబును సుధాజలధిమధ్యమణిమంటపవిహారియును మారుత భుగధీశ్వరతలిమతలనలమానంబునైన పురుషాకారంబుతోరంబుగ నుదార భుజావిజృంభిత ప్రహరణోద్భాసినై వర్తింతు నామూర్తి విస్ఫూర్తి నీవంటి పావనహృదయులు దక్కఁ దక్కినవా రెఱుంగరు, నాయందలిభక్తి యస్యాభి చారిణి యగుటకు నుపాయంబులు గొన్నిగల వవి వినిపింతు వినుమని దనుజ మర్దనుం డనిమిషమర్దనునితో ని ట్లనియె. ౧౧౭

క. ధరణి మదర్పితముగ నా, చరితం బగువ్రతము మోక్షసాధక మై సు
స్థిరలక్ష్మీకర మై సం, గరజయదం బగుచు నుండుఁ గల్మషరహితా. ౧౧౮

క. వివిధవ్రతములలోపల, రవి గ్రహములయందు మించురహి నహియించుక్రా
భువనంబుల హరివాసర, మవదాతయశోవిలాసహాసితశశాంకా. ౧౧౯

గీ. బహువిధానేకవిభవసంప్రాప్తికరము, కలుషతిమిరౌఘవిచ్ఛేదకారణంబు
భర్గసంసేవ్య మపవర్గసర్గదాయి, సువ్రతం బగు నేకాదశీవ్రతంబు. ౧౨౦

క. భాసురముక్తిరమామ, త్త్వాసర మై సకలసౌఖ్యకమలశ్రేణీ
కేసర మై చెన్నగుహరి, వాసర మావ్రతము సలుపవలయు మహాత్మా. ౧౨౧

వ. ఏతన్నిమిత్తంబుగ నొక్కయితిహాసంబు గల దాకర్ణింపు మని గోకర్ణశయనుం డాకర్ణకుతూహలపరవశుం డగు దైతేయప్రసూతితో ని ట్లనియె, మున్నఖిల విభవవిభర్త్రితనిర్జరావసథంబగు గూర్జరదేశంబున శరచ్చంద్రం బనునొక్క పురవరంబు వెలయుం దదధీశ్వరుండు. ౧౨౨

శ్రీహరి ప్రహ్లాదునకు హరివాసరమహిమఁ జెప్పుట.

సీ. కడవీను లంటినకన్నుదోయికి దృష్టి సకలశాస్త్రార్థదర్శనము గాఁగఁ
బొంకంబు లై యొప్పు భుజశిఖరముల కాతతభూష వసుమతీభృతియ కాఁగ
మేరుసన్నిభ మైన మెఱుఁగునెమ్మేనికిఁ గవచంబు వినయసంకలన గాఁగ
హస్తిగంభీరమా యానలక్ష్మికి నొప్పు మేరమీఱని నేర్పు మెలఁపు గాఁగ
వెలసెఁ గదనాభిముఖశత్రుకలభనిటల, విఘటనారంభశుంభన్నవీనతరకృ
పాణవల్లీపరిష్కృతపాణితలుఁడు, భోజుఁ డనురాజు ధిషణాసరోజమూతి. ౧౨౩

క. అతనికిఁ బురోహితుం డై, సతతోన్నతి వెలయు విష్ణుశర్ముఁ డనఁగ ను
న్నతివడయు భాసురేంద్రుఁడు, శతమఖునకు గురుఁడు వోలె సాధువినతుఁడై.

ఉ. వేదపురాణశాస్త్రపదవిం దుదివిన్కి యెఱింగి ధర్మసం
పాదితయాగతంత్రుఁ డయి బాంధవపోషణకాంక్షితుం డనై
నాదెసఁ గల్గు భక్తికతన న్వెలసిల్లె నతండు తొల్లి ప్ర
హ్లాద పటుప్రనాదనిఖిలస్తుత భూరిదయామయాశయా. ౧౨౪

వ. ఆకస్మాశ్రర్మ తనధర్మపత్నియందు మందేహుం డనునందనుం గాంచి యావి
ఖ్యాతబుధగ్రహుండగు సుధాకిరణుకరణిం బరిణమించె నావిప్రకుమారుండు

క. కాలోపనీతుఁడై గురు, జాలంబులయొద్దఁ జదివె సకలాగముముల్
నాళీకగర్భసన్నిధిఁ, దాలిమి ముసు భృగుపుచదువు తాత్పర్యమునన్. ౧౨౬

శా. వాచాచాతురి వక్కణించు సభలన్ వైదగ్ధ్యహృద్యంబుగాఁ
దూచాతప్పఁడు వేదవాదములయందు న్నవ్యకావ్యోదయ
శ్రీచాతుర్యము సంఘటించు ద్రుహిణశ్రీమూర్తి విస్ఫూర్తియై
భూచక్రస్తుతుఁ డైనవిప్రతనయుం బోలంగలే రెవ్వరున్. ౧౨౭

వ. అమ్మందేహుండు నవసత్సందేహగోచరానలగ్నయై సుంగ్న యనుపేరి పురం
ధ్రిం బెండ్లియై నిజజ్యేష్ఠభ్రాతలగు విధాతృధాతృ సంయాతి యయాత్యను
యాతి భాతి ప్రభూతివ్యసనులకు నవిధేయుం డై వివిధవిభవానుభవంబుల
నభినవయౌవనసౌభాగ్యంబు సఫలంబుగఁ జేయుచు నుండె. ౧౨౮

సీ. అనుదినాభ్యంగంబు నభినవధౌతవస్త్రావరణంబు ననర్ఘ్యరత్న
భూషణాకలనంబు భూరిసౌరభగంధసాంకస్తూరికాచర్చ వికచ
విచికిలదామసంవేల్లనంబును బరమాన్నభోజనమును నాటపాట
లాసన్నతీర్థయాత్రానుకూల్యంబును దుస్స్యూతకేళియు ధూర్తరతియుఁ
గలిగి దుర్వారసంసారగౌరవంబు, దలఁపఁ డోకనాఁడు వేదశాస్త్రములువిడిచి
వీటఁ గ్రుమ్మరు విటవేష విలసనమున, దేహవన్మన్మథుండు మందేహుఁ డకట.

క. పాదుపుకొని పత్తు రన్నలు, తుదిపుట్టుపుగాన వాని దుశ్చేష్టలు నె
మ్మదిఁ దలపోయక యట్లనె, నదినెలు వాటింతు రాకువాళపుసుఱఁదిన్. ౧౩౧

క. చిల్లరచేఁతల నిల్లుం, బొల్లుం జెల్లుగ వెఱంజి భూసురసూనుం
డుల్లోకవృత్తి రోనెల, పల్లవపాణులకు నొసఁగుఁ బ్రల్లద మొదవన్. ౧౩౨

సీ. పలుదెఱంగుల బుద్ధి దెలిపి రన్నలు సారె రీతి గా దనిరి తండ్రియును దల్లి
ముట్టనాడిరి కూర్చుచుట్టంబు లెల్లరు సరిగృహామేధు లసహ్యపడిరి
గురువులు చెక్కిలిగొట్టి వారించిరి సజ్జను లిది దురాచార మనిరి
పలుచగాఁ జూచిరి ప్రభుపురాణుపవార లోవనివారు బిట్టుబ్బి నగిరి

యెవ్వ రెటువలె బోధించి రేధ నౌను, రేముషీ గౌరవంబునఁ జిక్కఁ బట్టి
యంతకంతకు నతఁడు కామాంధ కారి, కలితలోచనుఁ డగుఁ గాని కాఁడు సుమతి.

క. కుసులకు విటీగిరి దుష్ట, వ్యసనము విడలేక తిరుగువానిపయిన్ భ్రా
తృసమూహంబును బాంధవ, విసరము గురుజనులుఁ గూర్చు వియ్యపుఁ బ్రజలున్

గీ. ఉరగదష్టాంగుళముఁ ద్రుంచి యుఱక పాఱ, వైచు కైవడి నన్నిచుపదలవిడిచి
యింటివారెల్ల సుఖముండి రంటుకొనిన, తెవులు వానినకరణినో ధీరచరిత. ౧౩౫

శా. ఆమందేహుఁడు బంధుముక్తుఁ డయి చింతాక్రాంతసంతాపమూ
ర్ఛామగ్నాశయుఁ డై చరించుటలు కర్ణాకర్ణికన్ భోజధా
త్రీమందార మెఱింగి వానిఁ గరుణాదృష్టి న్నిరీక్షించి శి
క్షామంజూక్తుల బుద్ధి చెప్పి నిజపార్శ్వస్థాయిఁగాఁ జేయుచున్. ౧౩౬

క. రాతిరి పగలును విన యో, పేతుం డై సేవ చేసెఁ బృథివీనాథుం
బోతరముడిగి మహీసుర, సూతి మధుచ్ఛన మైనసురియయుఁ బోలెన్ ౧౩౭

వ. ఇట్లు విష్ణుశర్మమీఁద కూర్మికలిన భోజుండు వావిప్రతనూజుం బాటించుచు నుండి కతిపయసంవత్సరంబు లరిగినం దదనంతరంబ యొక్క కందువయందు. ౧౩౮

క. ఆమందేహునకిచ్చెన్, భూమీవిభుఁ డగ్రహారములకును దేవ
గ్రామంబులకును సమమతి, వై మేరలు నడుపు నునుచు నధికారంబున్. ౧౩౯

గీ. ఇచ్చి ముద్దుటుంగ్ర మిచ్చి వారకి మిచ్చి, యందలంబు వెట్టి యనుచులయును
గుజనుఁ డతఁడు బ్రహ్మకూఁకటిముట్టి భూ, పాలు పేరుకొని యుపార మహిమ. ౧౪౦

మ. కరణంబు ల్పరిహాసకు ల్కవిజను ల్కార్తాంతికు ల్గాయకు
ల్దొరపోతు ల్పరివారము న్సఖులు మంత్రు ల్రక్షకరజ్జులుం
దెరువు ల్వెట్టి పరార్థము ల్దిగుచు యుక్తిప్రౌఢులు న్మున్ను ము
ష్కరు లెల్లం దనవంటివారు గొలువంగా సంభృతోత్సాహుఁడై. ౧౪౧

క. సురభూసురభూముల పై, హరిణాశ్రితవనము సొచ్చు వ్యాఘ్రము వోలెన్
ధరణీసురసూతి క్రుమ్మరి, పరుసఁదనము మీఱఁ బౌరుపత్తెము సేయున్. ౧౪౨

సీ. పూర్వంపు టధికారిపురుషుల మీఁది ముత్తెంప లన్నియును జిత్రముగ నొడిచి
హాచాలు దిగుచుఁ జావడి నిగంకుశవృత్తిఁ దనరు గ్రామములకుఁ జనవు లొసఁగి
సందుగొందులను లంచపు ముఖంబున మాటుపడు నపరాధంపు బెడఁద లరసి
యొక్కని వెఱపించి యొక్కని మన్నించి యొకఁడు గానక యుండ నొకని మనవి
చనవు లేకాంతమున విని సకలజనులఁ, గైవసంబుగఁ జేసె భూదేవదేవ
సీమవారల నాధూర్తశేఖరుండు, రేయుఁ బవలును గనుఁ జెప్పవేయుకిట్లు. ౧౪౩

క. సంతాపము నొందించు మి, థోంతఃకలహమున నగ్రహారద్విజులన్
సంతతవిత్తార్జనబహు, చింతాపరతంత్రుఁ డగుచు క్షితిసురుఁ డెపుడున్. ౧౪౪

క. విందులు వెట్టియు ముడుపులు, సందుల దోఁపియును సేవ సలిపియు ధరణీ
బృందారకు లెల్లప్పుడు, మందేహుని గొలిచి రిండ్లు మఱచి గుణాఢ్యా. ౧౪౫

క. దేవస్థానంబుల ని, చ్చావృత్తిఁ జరించు నతఁడు చంచలతురగ
వ్యావల్గనములు మెఱయఁగఁ, గైవారము సేయ వందిగణ మిరుగడలన్. ౧౪౬

సీ. పునుఁగుఁగస్తురియుఁగప్పురముఁగుంకుమగంధసారఖండములుపన్నీరు మొదలు
సురభివస్తువు లెల్ల శోధించి శోధించి మేలైనయవి తనపాల నిలిపి
రత్నభూషణముల రాయిఱప్పలు మంచియవి యెల్ల గిలుబాడియందుకుఁ బ్రతి
యమరించి జీర్ణంబు లగువానిఁ బెట్టెల నించి నూతనపటీనికర మెల్లఁ
దనదుబొక్కస మింటికిఁ దార్చి పెరుఁగుఁ, బాలు నేతులు బియ్యములప్పుఁగూర
కాయగుడములుఖండశర్కరయుఁ దేనె, లాత్మగృహమున నుండి రాహావణుపఱిచి

క. శ్రీవిష్ణుస్థానములకు, శైవాలయములను శక్తిసదనంబులకున్
లేవడి సేయుచుఁ బాత్రుల, హావళిఁ బెట్టుచు మెలంగు నతఁ డనుదినమున్. ౧౪౮

సీ. మెఱికలు మలిగండ్లు బెరసినక్రొత్తనూకలు పుప్పిగాఱు పెసలును గసరు
నెయ్యియునూనియ [1] నెలనాళ్లనుండియుఁబులిసిబూరటలాడు బూఁజు పెరుఁగు
నూరెల్ల నొల్లని కూరగాయలు త్రప్పలవుమిరియంబులుఁ జవుటియుప్పు
సౌరభం బెడలినసంభారములు నేఱుఁబిడుకలుఁ జవిచెడ్డ గుడము వరటి
చెడినపుళిపండు గాని యాచెడుగు దేవ, తోపహారంబులకు ననర్ఘోజ్జ్వలార్హ
భోజ్యములనంపఁడొకనాఁడుఁబూర్వకాల, కలితమర్యాదలుడిగె వేల్పులకు నెల్ల

క. తొల్లింటి కట్టుమట్లు, మ్రొల్లము లన్నియును నమ్మి ముడుపులు సేయు
న్వల్లడికాఁడై తప్పులుఁ, గల్లలుఁ బ్రజలందుఁ దెలుపుఁగలుగకయున్నన్. ౧౫౦

క. తనకొలువును దనపైఁ బెనఁ, చినపదములపాటలును రచింపఁగదినముల్
చనుఁ గాని మేళమున క, య్యనిమిషసేవకును గలుగ వవకాశంబుల్. ౧౫౧

సీ. ఉప్పినవోయెఁ బయోదధిక్షౌద్రఘృతంబులు దధ్యోదనంబు లుడిగెఁ
బిండివంటలు కథాబీజమాత్రమె చిక్కెఁ జఱపు లన్నియుఁ బనిచెఱపులయ్యెఁ
బర్వోత్సవంబు లంబరపుష్పదశ నొందె గీతవాద్యంబులు కెళవు దొలఁగె
శాసనస్థగ్రామచయసమాగతవస్తువిస్తార మంతయు నస్తమించె

[1] లెన్నాళ్లనుండియు.

ధూపదీపంబు లడఁగె దుత్తూరగోత్రు, రకలితార్క నికుంజపూర్ణంబు లగుచుఁ
[1]బాపరిండ్లయ్యె గుళ్లయభ్యంతరంబు, లాతఁడధికార మొనరించుననసరమున.

క. సురభూసురపీడనమునఁ, బొరసిన విత్తంబు వానిఁ బొందక వెఱకై
సురిగె నొకకొంత వేశ్యా, శరణములకుఁ గొంత చోరజనవశమయ్యెన్. ౧౫౩

గీ. చెట్టుఁ దిన్న పురుగుఁ బట్టి పీడించినఁ, బసరు వెడలుగాక పసిమి గలదె
దూఱు దక్కెఁ గాని దుర్బ్రాహ్మణునకును, నార్జితార్థకోటి యంట దింత. ౧౫౪

క. త్రిచతుర్వర్షములకు వి, ప్రచయము దేవాలయంబు ప్రజలు నొకటి యై
కుచరిత్రుఁ డైనవుం దే, హుచరిత మాభోజపతికి నొగి నెఱిఁగింపన్. ౧౫౫

వ. కాలాకారుండై యభ్భూపాలుండు కోపించి యాకాపురుషు రావించి వాని వలన దేవతాసేవకులును భూదేవనివహంబునుం గలుగరూపించిన యపరాధంబు సైరింప నేరక చక్షుర్దండయోగ్యుండ యేనియు నయ్యయోగ్యు నపవిత్రాంకకళంకాంకితశరీరుం గావించి తనయేలు భూవలయంబునకుం బాపుటయు నాపాపప్రవణుండు. ౧౫౬

క. బహుదేశంబుల వెంటన్, బహిష్కృతుం డగుట మాటుపడిచి చరించున్
మహీసురచండాలుఁడు స, ద్గృహమేధుల యిండ్లఁ దిండి దినుఁ బలుమాఱున్.

గీ. జఘనకీలితసలిలకషాయపటము, నుత్తరీయంబు మెడవంపు నొరగుశిఖయు
నిటలమున గంగమట్టియు నీరపూర్ణ, కుండికయు నైచరించుఁ బాపండుఁడతఁడు.

చ. అతఁ డట నొక్కనాఁడు విపినాంతరమార్గమునందుఁ బోవుచుం
బ్రతిభయభానుదీధితులఁ బర్విన దాహము నోర్వలేక శీ
తతరజలంబు నారయుచుఁ దత్సవిధంబునఁ గాంచె నొక్కహం
సతుములమాంసలంబు జలజాతనివాసముఁ జారుహాసమున్. ౧౫౮

వ. కాంచి యానష్టపూర్వద్విజుండు సంతుష్టహృదయుండై యథేష్టంబుగ నక్కొలన జలజపరాగ పరంపరావాసితంబులు నతిశీతలంబులును మధురసుధారసప్రాయంబు లగుతోయంబు లాని మేనికిం దనుపు వచ్చుటయు నచ్చట వియచ్చరతరునిభం బగు సురపొన్నగున్న మ్రాని నీడం గోడెవయసు విపిన పవనశిశువులు విసర సొగపు నొందుచుఁ గొంతతడవు మార్గశ్రాంతి నపనయించుచు నుండి నప్పుడు. ౧౬౦

సీ. ముదురుచీఁకటి నిగ్గు మ్రుగ్గులన్నియుఁ గూడి నిలిచెఁ బొమ్మననొప్పు వలుదకొప్పు
సైహౌర తనుదానె పాయు వెలుంగొందు ముగ్ధచంద్రుని బోలు మొగము మేలు

---

[1] పాపయిండ్లయ్యె.

మనుమేషపసిఁడికుంభములఁ దప్పాలునట్టు సౌభాగ్యసంధాయి చన్నుదోయి
యినుకదిబ్బలమించు నినుమంతగావించు చక్షుఃప్రియకరంబు జఘనభరము
వలుదతొడలును గలహంసలలితగతియు
మృదుమృణాలాభ బాహుసంపదయు సింహ
సదృశమధ్యంబు గల యొక్క శబరబర్హ
కబర యేతెంచెఁ బుష్కరాకరమునకును. ౧౬౧

క. ఏతెంచి తజ్జలంబుల, నాతరుణీమణి యొనర్చె నవగాహము ని
ర్ధూతరజోవిక్రియయై, ధౌతస్వర్హేతివోలెఁ దను వలరంగన్. ౧౬౨

వ. ఇట్లు రజస్వల యగు నావికస్వరపికస్వర పావనస్నానానంతరంబున నవ్వేశం
తంబు వెడలి యొక్కకడం గదలి వెలువడి నిలిచిన మదిరాదేవియుం బో
లెఁ ద్రిభువనోన్మాదకారిణి యై హరినీలనీలపరంపరాసంపదభిరామం బగు
కుంతలస్తోమంబుం దడి యార్చుచుం బటాంతరస్వీకారంబున రాకాశశాంక
చంద్రికాసాంద్ర యగు శరద్రాత్రిం బురణించుచు విలసిల్లు నవసరంబున.

గీ. తెరువునడచియలసిసురపాన్నద్రొన్నిడఁ, దూఁగుచట్టియున్నతొలుతకులము
నతఁడు కన్ను విచ్చి యయ్యింతి నీక్షించె,నదియుఁ జూచె మోహనాంగు నతని

క. కంతుండు తమ్మిపూబలుఁ, గొంతంబున గంటిచేసెఁ గువలయగంధా
స్వాంతంబు విప్రు డెందముఁ, గాంతార్తైకాంతభూమిఁ గవకవనగుచున్. ౧౬౫

క. అఘటనఘటనాచాతు, ర్యఘనుం డగువిధికతమున బ్రాహ్మణకులుఁడున్
జఘనవినిర్జిత పులినయు, నఘదూరా కూడి మాడి యన్యోన్యంబున్. ౧౬౬

వ. నిధువనక్రీడాలంపటులై తెంపు మెఱసి సహాసన సహభోజన సహవిహరణ
పరాయణులై యొక్కపక్కణంబునం బెక్కేం డ్లధివసించి రిట్లాపాపకా
రులు కాఁపురంబు సేయు కాలంబున. ౧౬౭

క. హరిణములఁ జంపి యమ్మియుఁ, దెరునాటులు గొట్టిదోఁచి తెచ్చియుఁ గనకాం
బరములఁ దనుపుచునుండెం, దరుణిం బతి మదనరాగ తత్పరమతియై. ౧౬౮

క. వాఁడంత వయసుదిరిగినఁ, బోఁడిమిచెడి కాలుఁ గేలుఁ బ్రుంగుడువడి క్రొ
వ్వేఁడిమి దఱిఁగిన నిప్పును, వీఁడనఁగా నుండెఁ జెంచువెలఁదియుమదిసెన్.

క. గరు బేఱి తినుచు బ్రదికిరి, పురుషార్థవిదూరు లయిన పొలఁతియుఁ బతియున్
సరిముదిసి బ్రహ్మలిఖితము, హరునకు నేనియును దాఁట నలవియె తండ్రీ.

సీ. పుట్టఁడా తానేమి భూసురాన్వయమున సాధువంద్యుఁడు విష్ణుశర్మయందుఁ
జదువఁడా తానేమి చతురాగమంబులు నామూలచూడ ముద్వృత్తనీష

వెలయఁడా తానేమి విభవదేవేంద్రుఁడై యభిమతార్థశ్రీలు ననుభవించి
యుండఁడా తానేమి యుర్వీశలాధీశునాస్థానమున సింహ ముద్రఁబోలె
నట్టినుం దేహముఁ జతిదుర్లభాగ్రవర్ణ, కర్ణనిష్కుఁడై చెంచుగబ్బిగుబ్బ
లానికతమునఁ బాతిత్యలీనుఁడయ్యె, నెవ్వఁడెటువంటివాఁడౌనో యెఱుఁగరాదు

వ. అంతనొక్కనాఁడు. ౧౭౨

ఉ. పండితపుండరీకుఁడు తపఃకృశదేహుఁడు తీర్థకుండికా
దండలసత్కరాంబుజుఁడు దాంతియు శాంతియుఁ గల్గినట్టి వి
ప్రుండొకరుండు వచ్చె నృగరు　　　టికానకుఁ
గండకిఁ దీర్థమాడుకుతుకంబు మెయిం బయిత్రోవ గావునన్. ౧౭౩

గీ. వచ్చి మధ్యాహ్నవేళ నవ్వైష్ణవుండు, నచలఝరవారి నవగాహ మాచరించి
యాహ్నికక్రియ　　　　డునొక్క, వటతలంబునఁ గూర్చుండి వాఁడు దేరి.

మ. కలుషధ్వాంతనిదాఘఘస్రరుచి లోకఖ్యాత మంతారిపు
జ్వలనజ్వాలఘనాఘనోదయము మోక్షశ్రీల　　　స్థలీ
తిలకం బాశ్రితరక్షణక్రమకళాదివ్యద్రుమాటంబు నాఁ
గలయేకాదశి నాఁడ యాటకు శిరఃకంపంబు గావించుచున్. ౧౭౪

సీ. శరభశార్దూలకాసరఘోరమైన యీవన మెట్లు దాఁటిపోవచ్చు నొంటి
నటవీగజము చేయు హాపళిచే యథాయథలైరి తనతోడి యనుఁగు లెల్ల
నొక్కపక్కణమైన నిక్కానఁ బొడగాన రాదు నిర్జనమైన బ్రహ్మసృష్టి
గాఁబోలు నిచ్చోటు గాఢసాధ్వసమున జడిసి మిక్కిలిఁ జిక్కువడియె మనసు
శార్ఙ్గికారాధనము సేయుజాడయెట్లు, రాత్రిజాగర మొనరించుక్రమముఁ దెలియ
నిమ్మహాపుణ్యవాసరం బెవ్విధమున, నాకు నొడఁగూడునొక్కొ యిన్నాళ్లవలెనె.

గీ. అనుచుఁ జింతించువాసు దేవాహ్వయంబు, గలుగునవ్విప్రు వీనులనాలసెనొక్క
జనకలకలంబు నీచభాషావిశీర్ణ, వర్ణవైకల్యరూక్షమై వరవిచార. ౧౭౫

క. ఆజాడవట్టుకొని యా, తేజోనిధి యరిగి యుగ్రదిక్కునఁ గాంచెన్
భూజననుత శరహతనా, నాజంతుక్షతజచిక్కణముఁ బక్కణమున్. ౧౭౬

వ. కని యత్యున్నఘమానసుండు హరిణహింసాభూయిష్ఠం బగునానిష్ఠుర ప్రదే
శంబు డాయం జని గాలి యెగువ నిలిచి యందలి పొలసుకంపు నిజనాసా
పుటకుటీరకుటుంబి గాకుండ నొక్కగండశిలామధ్యస్థలం బధిష్ఠించి యా
శబరాలయంబుఁ గాచుప్రధానశబరువలన నిజశరీరరక్ష యొనరింపం గలవాఁ
డై యొక్కింతసేపు కాలూఁదునంత. ౧౭౭

సీ. శణాలతానల్పసంచయసితచ్ఛాయమౌ నరపవెండ్రుకముడిశిరమువాఁడు
పాముమేనును బోలె బర్బరస్పర్శమౌ తో లెముకలనంటి తూలువాఁడు
ముడుసులు గొలుకంగ మొఱపలువోయిన యఱుగుడుఁబండ్లనోరడరువాఁడు
బలితంపు విల్లుఁబద్ద గిలుబాడి చేసిన యష్టిచుట్టిన గాఢముష్టివాఁడు
చెట్టుచేమలఁ దూఱి యిట్టట్టు దిరుగఁ, బగిలి యెఱమన్ను గప్పినపదయుగంబు
వాఁడు మందేహుఁ డావిప్రవరుని డాయ, వచ్చి కరములు మోడ్చి దీవనలు వడసి.
గీ. అతని కనుసన్నఁ గూర్చుండె నంతికమున, నష్టపూర్వద్విజుండు తన్నవ్యదివ్య
గాత్రపవమానసంపర్కగౌరవమునఁ, బాపబంధంబు లొక్కింతపట్లు వీడ. ౧౮౧
సీ. అడిగె మందేహుఁ డాయవనీసురశ్రేష్ఠుఁ డరుదెంచుటకు హేతు వానుపూర్వి
నడిగినఁ దెల్పె నాయయ్య గండకి కేగుపనియు నన్యభసంభవభయంబుఁ
దెలిపిన వాఁడు నా దేవోపముని దెచ్చి విమలగోమయగోముఖములఁ బూత
మగుపర్ణమయగృహాభ్యంతరమున నిల్పె నిల్పిన నందునానిగమవేది
లోహతా మాత్రసంచియు దేహతాప, హారియగు నాతపత్రంబు నంఘ్రిరక్ష
లాది నిజసాధనము లెల్ల నర్హభంగిఁ, దగినచోటుల నునిచి చిత్తంబు దేఱి.
గీ. కొంతవడి విశ్రమించెఁ గుకూలకీలి
కీలనిభతాప మగునెండ వ్రాలు దనుక
బోయయును బోయప్రోయాలుఁ జేయఁదగిన
యూడిగంబులు సేయుచు నుపచరింప. ౧౮౩
వ. మందేహుండు దేహధారిణి యగు ధర్మదేవతయునుంబోని యానిష్ఠాగరిష్ఠు
నకుఁ బచ్చితేనియలు దెచ్చి యిచ్చియును వెదురుబియ్యంబు లుపదచే
సియు వన్యఫలంబు లెన్నియు సమర్పించియు శ్రీఖండలతాఖండంబులు కడ
కునకు నొడఁగూర్చియు వనమహిషవిషాణవిశకలిత శైలశిలాపట్టంబుల నట్టు
కట్టిన గుగ్గులునిర్యాసకల్కంబు లిచ్చియుఁ బ్రక్షాళితకరచరణవదనుండై
కొదమనెత్తావు లొత్తరించు తులసీపలాశపల్లవంబులును వివిధవీరుదుల్లసిత
ప్రసవవిసరంబులును బర్ణపుటికల ఘటియించి యావటించియు దేవా నీ వి
వనచరభయంబు దక్కి సావధానుండ వై మాధవారాధనం బొనరింపు
మని సభార్యుండై తదభిరక్షణదీక్షితుండై యున్నంత గభస్తిమంతుం డస్త
గిరి యవ్వలికిం జను నవసరంబున. ౧౮౪
గీ. శబరపరివృఢనిర్దిష్టసారసాక, రాంబుధారల సాంధ్యకృత్యములు దీర్చి
కమ్మపిచ్చుకవాతినెత్తమ్మివిరులఁ, గలువపువ్వులు శుద్ధోకములఁ దెచ్చి. ౧౮౫

క. తొలుక్రొత్తగారనూనియఁ, దళకొత్తించెం బ్రదీపదామకములు త
న్నిలయాంతరమున జ్వాలా, వలయాహతతరుణతిమిరవై పమ్యముగన్. ౧౮౬

గీ. అటులుమత్స్వాజనోన్ముఖుండగుచు వాసు, దేవుఁడిట్లనుమం దేహుదిక్కుఁ జూచి
యన్న హరివాసరంబు నేఁడవధిఁ బోక, జరగనీకతమున నీకు జయముగలదు.

గీ. నిదురగాచియుండుమనగజంబులోనర్చు, భయముగలదోయె మొపక్కణమున
రేయి నాల్గుజాముఁ జేయంగవలయు జా, గరణమచ్యుతునకుఁ గౌతుకముగ.

వ. అనిన విని వాఁడు వల్లె యని సభల్లంబుగ పిల్లెక్కఁద్రోచి పల్లియలోని నల్లమందిం గొందఱఁ బిలిపించుకొని తదన్వితుండై యతిచండంబు లగు శార్దూల శరభ సింహసింధురాది సత్త్వంబులువచ్చుత్రోవ లరయుచుం గావలి కిం జాలియుండె నాభూసురపుండరీకుండు. ౧౮౯

క. అభిషేకప్రసవార్చా, విభవంబుల ధూపదీపవిలసనముల నా
రభరితఫలపానకములఁ, ద్రిభువననుత నాకు నధికతృప్తి యొనర్చెన్ ౧౯౦

క. కుముదోన్మీలన మాదియుఁ, గమలవికాసంబు తుదియుఁ గా యామవతిన్
మము నర్చించెఁ బ్రజాగర, ణముతో భూసురుఁడు మదిఁ గనక భయలవమున్.

క. బోయయు బోయతయును నా, బోయకుఁ గలసఖులు రేయుఁ బ్రొద్దంతయుఁ గ
న్నాయక యామకలంకుఁడు, చేయు మదర్చనము వినుతి సేయుచు నుండన్.

శా. భానుం డగ్రకుభృన్మణీమకుటమై భాసిల్ల నుత్ఫుల్లప
ద్మానీకం బగునొక్కనిర్ఝరమునం దావిప్రుఁ డర్థిం గృత
స్నానుం డై దవసాననార్హవిధి నిష్ఠాయుక్తుఁ డై చేసి పూ
ర్ణానందంబున నింటికిం జని మదీయస్తోత్రము ల్సల్పుచున్. ౧౯౩

వ. అవసథశుద్ధిగావించి యథాసంభవపదార్థంబుల నన్నసంపాదనం బొనరించి కృతపారణుండై శేచివార్చి వనపవనకిశోరప్రసారశమితశరీరగ్లానియై తులసీపలాశచర్వణం బాచరించుచు నాచెంచునకు భుక్తావశిష్టంబు లగుభోజ్యంబు లొసంగుటయుఁ బొంగి యంగనాసహితుండై యాగవానచరుం డది యెల్ల నుపయోగించి యామహీసురపంచాననుం గొనిచని యాదిమార్గంబుపట్టించి మరలె నాధరణీసురుండును గండకీతటంబునం గొండొకకాలం బధివసించి సాధకులచేత నతిదుస్సాధం బగు లక్ష్మీనారాయణ శ్రీమూర్తి సాలగ్రామశైలగర్భంబునం గొని తెప్పించి కృతకృత్యుండై నిజావాసంబుం బ్రవేశించె నదనంతరంబ యిచ్చట. ౧౯౪

శా. ఆసుం దేహుండు దేహబంధనముఁ బాయం డాయఁగా నచ్చి రు
ద్దామక్రోధకషాయలోచనులు హస్తన్యస్తభీమాయుధ
స్తోముల్ నానుజనీలవర్ణులు మందాంధుల్ బంధురక్రూర దం
ష్ట్రామాస్యస్ఫుటదుగ్రవక్త్రులు వివస్వత్సూను సేనాధిపుల్. ౧౯౫

వ. వచ్చి యుచ్చైస్స్వరంబుల నార్చుచు నాపతితుఁ భూపతితుఁ జేసి పొరలిం చుచు నీ తెంపరి పరత్యక్తకులాచారుం డనియును నీనిష్ఠురుండు తిష్ఠన్మాత్రుం డనియు నీయభాగ్యుండు గురుపరిత్యాగశీలుం డనియును నీపన్న దురా న్నభోజియనియు నీకఱటి పరకామినీపరిచయపరిణతుం డనియును నియ్యధ ముండు మధుమథనమన్మథాంతక ప్రముఖనిఖిలనిర్జరద్రోహియనియును నీపిచ్చ కుక్క ద్వేషించిన నీచుం డనియును ననేకప్రకారంబులఁ గర్ణకఠోరంబు లాడుచు వరుణపాశకీలితుం జేసి యమాపథంబునకుం గొనిపోవుచుండ మార్గంబు నవరోధించి మత్ప్రేరితు లగుపారిషదు లావైవస్వతుసేవకులం బోనం దఱిమి యజామిళుం జేర్చి యుదర్చిరుజ్జ్వలం బగువిమానంబున నాపక్షిశ్రేష్ఠసూను నారోహణంబు చేయించి నాయున్నయెడకుం దెచ్చిన నేనును నానిష్కళంకునకుఁ బుష్కలం బగు శంకుకర్ణాభిధానం బొనరించి వైకుంఠగోపురద్వారపరిరక్షణపట్టభద్రుంగాఁ జేసితి నీవిశేషం బశేషపాపా చరణనిపుణుండ యేనియు నాధరణీసురునకు నమేఘవర్షోదయంబును నప్ర సవతరుఫలంబునుంబోలె నకారణప్రాప్తం బగు నేకాదశీజాగరణపుణ్యం బునం బ్రాపించెంగావున

ప్లోవంబున నుపదేశించి యాకాంచననసనుండు వెండియు

సీ. - - - - - - - - దశితిథిఁ బావనస్నానశోభనశరీరు
డగుచు గీ - - - - - - - - - - - - - -
- - - - - - - - - ముండి బహుప్రకార, పూజలును
జాగరణమున - - - - - - - - - - - - -
- - - - - - - - రణసద్వైష్ణవులును దాను. ౧౯౬

గీ. బాలురును వృద్ధులున - - - - - - - - - - - - -
- - - - - - - - - - ల్లరికర్తనంబు - - - - - ౧౯౭

సీ. ధరణి గంగాదితీర్థజలాంతంబు - - - - - - - - - -
ము బ్రహ్మప్రతిష్ఠాదిబహువిధసప్తసంతానసంజనిత - - - - - -
- - - - - - - - - - - - - - దత్తాన్నదానమునకు
నాటిగాదని శ్రుతికోటి చాటుచుండు - - - - - - - ౧౯౮

గీ. - - - - - - - శయము
విష్ణుదేవుండు దెలుప నవ్విజయశాలి
తద్వ్రతమొనర్చు తలంపుఁ జిత్తమున నిలిపె
హరియు రావించె నింద్రాదిసురకులంబు. ౨౦౦

వ. రావించి యద్దేవవిరోధివలని విరోధం బుడివించి విబుధాధిపతికి నవిహతస్వర్గాధిపత్యం బేకాతపవారణంబుగా నొసంగి యసురవరునకు వసుధాతలయం బొసంగి మున్ను యథాయథలై చనిన దేవతాయూథంబులం బిలిపించి యథాస్థానంబులం బ్రతిష్ఠించి ప్రహ్లాదుం గౌఁగిలించికొని మర్యాదోల్లంఘనంబు చేయక విశృంఖలవృత్తిమత్తిల్లక శాంతస్వభావంబున నశ్రాంతుండవై మహీమండలంబుఁ బాలింపు మని యనిచిన ననిచినవినయంబున ననిమిషు లావనజోదరునాదరంబునడసి తమతమనిలుకడల కరిగి రంత. ౨౦౧

మ. పులుఁగుందత్తడి పుట్టుమచ్చ బలితంపుం గెంపు బల్నెట్టెముం
దెలిదమ్మిం గలలోఁతుపొక్కిలియు నింతిందాల్చు పేరక్కు నా
సలిలారాముని కాశయు (?) న్నొసలివాచౌకట్లు రాకాసిమేఁ
తలచుట్టగ్గలును గల్గు వేల్పు చనియెం దానేలు వెల్దీవికిన్. ౨౦౨

క. హరియాజ్ఞనేలె సుస్థిర, తరముగ ధరణీతలంబు దానవపతి ని
ర్జరవిభుఁ డనువాసరముం, బరమాప్తుం డగుచు నతనిపాలనె నిలిచెన్. ౨౦౩

వ. అని యిట్లమ్మహర్షులకు రోమహర్షణుండు శరభనృసింహ సంవాదంబును బ్రహ్లాదకథాకథనంబును నెఱింగించిన నావిరించినిభు లన్నీవారముష్టింపచు నారాధించి ప్రహృష్టహృదయులై యతనివలన నిహపరసాధనంబు లగుశ్రీమదష్టాక్షరీప్రముఖ వైష్ణవమంత్రరహస్యంబులు దెలిసి విలసిల్లి రాకథకుండును యథేచ్ఛావృత్తిం బృథివీతలంబున మెలంగుచునుండె నని. ౨౦౪

క. ఈ ప్రహ్లాదచరిత్రము, భూప్రజలు పఠించి సకలబుధవర్ణితకీ
ర్తిప్రాప్తియు నిహపరసౌ, ఖ్యప్రీతియుఁ గలిగి సిరులఁ గాంతురువరుసన్.

క. రాజన్యకకరతలవి, భ్రాజితజంబీరగౌరఫలసంకాశా
రాజత్కీర్తివిరాజిత, రాజార్థకిరీటనిర్ఝరధునీకాశా! ౨౦౬

మ. హనుమాం బౌరమణీమణీసుహృదయామ్రారామపుంస్కోకిలా
ఘనధాటీముఖఘోటికాకతినరింఖాసంఘసంభూత పాం
సునికాయాంతరితాంతరిక్ష సుకవిస్తోత్రార్హచారిత్ర దు
గ్ధనశిఖాగుణదక్ష విక్రమకరాంచన్నత్యకంఠీరవా. ౨౦౭

మత్తకోకిల. భూరిసత్యసమేతభాషణ భూజనవ్రజపోషణా

. . . . . . . . ర్జనతరమోహితా

భీరుమానసభీతివారణ భీమదోర్బలవారణా

దారుణారితమోనభోమణి దండనాథశిరోమణీ. ౨౦౮

గద్యము. ఇది శ్రీహనుమత్కటాక్షలబ్ధవరప్రసాదసహజసారస్వతచంద్రనామాంక భారద్వాజసగోత్రపవిత్ర రామవిద్వన్మణికుమారాష్టఘంటావధాన పరమేశ్వర హరిభట్టారకప్రణీతం బైన శ్రీనరసింహపురాణోక్తం బగునుత్తర భాగంబునందు వాసవప్రముఖులైన దివౌకసులు నాళీకనాభుపాలికిం జని ప్రహ్లాదువలనఁ దారు పడినఖేదం బెఱింగించుటయు నయ్యాది దేవుండు దేవతావనలోలసుండై యసురవరుపాలికి వృద్ధవిప్రవేషంబునం జనుదెంచి యతనికి వైకుంఠంబుమీఁదికిఁ గార్యానుబద్ధుం డగుట కుపదేశించియు వైకుంఠంబుపైకి దండు తర్లించుకపోయి మధ్యే మార్గంబున మాయగప్పుటయుఁ బ్రహ్లాదుండు నివ్వెరగంది పూర్వజ్ఞానాయత్తచిత్తుఁడై శ్రీహరిభజన సేయుటయు నంత హరి ప్రత్యక్షంబై ప్రహ్లాదు గారవించి హరిదూషణ నివారణంబగుటకు మోక్షపదంబగు నేకాదశీవ్రతమహత్త్వం బుపదేశించుటయు నింద్రప్రహ్లాదుల కాహ్లాదకరంబు సేయుటయు నన్నకథలంగల పంచమాశ్వాసము సర్వంబును సంపూర్ణము.

---

రాజును వేఁడుట కష్టము కాని భూసురరాజును వేఁడుట కష్టము కాదు, నైచ్యమును గాదు, వేఁడిన నిచ్చునా. కోపము తగ్గి యీయ నున్నాఁడేమో! అడుగకయే యిచ్చునట్టువా రడిగిన మిన్నకుందురా!

(తెరలో)

బ్రహ్మవేత్తలకు నమస్కారము. బ్రాహ్మణోత్తములకు మారాజుగా రెల్లపుడు విధేయులు; వారికి సమయాసమయములు లేవు. ఇందు విచ్చేయుఁడు.

ద్రుప—(విని) ఎవ్వరది! బ్రాహ్మణోత్తములా! ఎఱుఁగనివానికి నాద్వారపాలకుని స్వాగతము చెవులపండువుగా నుండును. (విచారములో నుండును.)

కృప—(ప్రవేశించి) వింతలు వినఁబడినవి. అహంభావము దిగజాఱినపిదప సేవకులకు మాటలు దిద్దినాఁడా: స్తోత్రపాఠములు మార్చినాఁడు. (సమీపించి) ఏదియో-ఏదియో యేమి-విచారించుచున్నాఁడు. అడుగ వచ్చితి ననియో, అడిగిన నేమిచ్చెద ననియో-యేల యిట్లున్నాఁడు. బోధించెదను-రాజా స్వస్తి.

ద్రుప—(కను విచ్చి) ప్రియమిత్రము కృపాచార్యునకు నమస్కారము. ఓరీ! అర్ఘ్యమర్ఘ్యము

కృప—ఆదరణమునకు లోపము లేదు-వలదు శాంతింపుము.

ద్రుప—నేఁటికి నాపై దయకలిగినది.

కృప—మాదయ యెంతపాటిది-మీరు గొప్పవారు.

ద్రుప—మీయొద్దనా మాగొప్పతనము-మీరిచ్చినఁ గలదు.

కృపు—అట్లయిన నిదె యిచ్చుచున్నాఁడను. ఈగొప్పతనముం గొనుము.

ద్రుప—ఆహా! శిరసావహించుచున్నాఁడను.

కృప--గీ. మిత్రమగుటను నాయొద్దమించలేదు, పరులకడనిట్టిగర్వంబు భంగకరము భద్రముగనుంటివేనినుభద్రమబ్బు, ననుచు నిటుచేసినాఁడనంచనియెగురుఁడు.

పిదపఁ బుత్రునకు మీయందఱదయచే సకలవిద్యలు నలవడినవి. అనుభవమునం గాని తృప్తి కాని రాజ్యతంత్రకళ యొక్కింత నేర్పుటకై కొన్నినాళ్లు కొంతభాగము నావశమున నుండనిమ్ము. ఈభాగమ్ము గొమ్మని యిమ్మని నావశము చేసికొనిన నీరాజ్యమునందలి యర్ధరాజ్యమును నామూలమున నీకొసంగుచున్నాఁడు. (అని యొకవ్రాఁతమూఁ మిచ్చుచున్నాఁడు.)

ద్రుప—బ్రాహ్మణప్రసాదముం దలదాల్చుచున్నాఁడను.

కృప—నీకు శుభము, సుఖివై నీవు యౌవరాజ్యపట్టాభిషేకమునకు రమ్ము. నాకు సెల విమ్ము.

గీ. ఉత్సవాహూతులకుఁ దగు నునికిపట్లు, పరిజనంబుల కెల్లను బటకుటీర
ములు గజాశ్వాదులకును శాలలు రచించు, పనివిశేషించి కలదు నన్ను నుపవలయు.

ద్రుప—నన్ను ర మ్మనిన రానా. ఇంతమాత్రకు మీరు రావలయునా. కొన్ని దినములుండి విచ్చేయుఁడు.

కృప—(తన) రాజ్య మొసంగవచ్చుట యీతని కింతమాత్రము పనిగా నగపడు చున్నది. ఇంతలో గర్వమా. నమ్మి యుండరాదు. (ప్రకా) నాభారము తగ్గించుకొంటిని. కార్యగౌరవమున నాఁగఁదీరదు. నాకిందుఁ గ్రొత్తయా!

ద్రుప—మిత్రవాక్యములు విశ్వాసార్హములు.

కృప—మేమునట్లు తలంపవచ్చునా.

ద్రుప—నన్నుమఱవవలదని యాచార్యులకుఁ జెప్పునది.

కృప—ని న్నాయన యేమఱి యుండఁడు. పోయి వచ్చెద.

(నిష్క్రమించును.)

(నటీసూత్రధారుల ప్రవేశము.)

నటి—నాథా! అపుడుగా దిపుడు వచ్చితిని. ఏమంటిరి.

సూత్ర—నీవు చెప్పునవి త్వరగాఁ జెప్పుము. ఇది మహానాటకము కా దంటిని. గొడవ పెంపకుము.

నటి—గీ. ఆదరించెడువారు లేరైరి కవుల, నడిగినను బెట్టువా రొక్కరైన లేరు
సత్కవికిఁ బేరు లేదు నాచార మైన, నిల్పకుండిన గ్రంథము నిల్చు టెట్లు.

సూత్ర—కవి నందఱు నెఱుఁగుదురు. నీకు నాకుఁ గూడఁ దెలిసినవాఁడే.

నటి—అతనికిఁ జెప్పుకొనుట కిష్టము లేదు, గాని పెద్దనాటకము లొక్కగంటలోఁ బ్రదర్శింప ననువుగా వ్రాయుట చెప్పుకొనవలసినదే. ఈతఁ డొక్కఁడే నిట్టిపనికిఁ దెనుఁగులోఁ బ్రథముఁడు.

సూత్ర—దేశమంతటను నేకవీరులే. చారిత్రముల కొక్కఁడు, విమర్శల కొక్కఁడు కవిత్వమున కొక్కఁడు—

నటి—అశ్వత్థామతో బ్రాహ్మణరాజ్యము సరి.

సూత్ర—పెద్దవి విన విసుగని చిన్నవి వ్రాయుచుండ మనసంభాషణ మేల తగ్గింపగాదు.

నటి—మనబహుమానము కూడఁ దగ్గునేమో.

సూత్ర—ఉండు ముండుము. నాయొడల సుగంధము వలచుచున్నది.

నటి—మీకుఁ బూర్వజన్మవాసన యున్నదా.

సూత్ర—నీవు తొలఁగుము. నాబుద్ధి మాఱుచున్నది.

నటి—అయ్యో! అయ్యో! మాయన్నను బిలిచెదను.

సూత్ర—చూడుము. నే నేకచక్రపురము బ్రాహ్మణుఁడనుగా మాఱిపోవుచు న్నాఁడను.

నటి—చూచి, కథాసందర్భమేమి; ఈవేష మెవ్వరిది. ఇక్కడనున్న నేనును మాఱెద నేమో! (అని పరిభ్రమించును.)

బ్రాహ్మ—(పరిక్రమించి) దయ యనువస్తువు-వాత్సల్య మనుసత్పదార్థము-రెంటి కిని దారతమ్యము కనిపెట్టలేరు. మాయువరాజు భీమసేనుఁడుగారు, భావి కాలవేది.

చ. తనబకుఁజంపునాఁడు తలిదండ్రుల నేడ్వకుఁ డేనుబోయి యీ
తునిసినకట్టెతుంటన హతుం బొనరించెద దైత్యునంచు నే
నని కడు దుఃఖభాగులకు నాపదలో వెడనవ్వు పుట్టున
ట్లొనరిచినాఁడనంట యది యొక్కపరాక్రమరేఖ యంటహో!

బాల్యముననే యింతటివాఁ డెదిగి యెంతటివాఁ డైన నగు నని మనసునఁ బెట్టుకొని-

గీ. ద్రుపదుపురంబున నేవుసు, నుపమాతితమగు విక్రమోద్ధతిఁ గళ్యా
ణపరంపరఁ గని ధృతరా, ష్ట్రపట్టనము సేరి యధికసుఖమున నుండన్.

వినోదసమయములో నేను దలంపునఁ బాఱి నాతల్లిదండ్రులయనుమతిని నన్నుఁ బిలిపించినాఁడు.

మ. చదివించెం దరవాయి సాంగముగఁ బజ్జం బీఁటవైపించి పె
ట్టై దయన్ భోజన మన్నిదేశములఁ బుట్టించెం బ్రచారంబు తా
గదఁ బట్టించెను, బ్రాప్తిలే దడవి కేగంబోవుచుం బిల్చి యీ
పదుమూఁడేఁడులు దిద్దుమీవని హిడింబానూతి కర్పించెనన్.

అతఁ డొక్కచోట నుండువాఁడు గాఁడు. వారమున కొక్కసారి వచ్చి మాయా కౌశలములు కొన్ని కఱపుచుండువాఁడు.

క. తన వీఁపున నిడుకొని ని, ర్జనవనముల కేగి పవలు రాతిరి సేయున్
దినముగ రాత్రిని జేయఁగ, ననేకములు నేర్పు మాయ లపుడపు డోర్మిన్.

ఉపపాండవులతోఁ గూడఁ, గుంతీమహాదేవి నాతల్లిదండ్రులపైఁ గలజాలిచే నన్నుఁ బెంచినది. చెప్ప మఱచెదనేమో- భీముఁడు-

గీ. కడఁగి యజ్ఞాతవాసాతికష్టకాల, మునను దమవెంటనున్న విప్రనివహంబుఁ బంపివైచుచు నం దొక్కవానిఁ బిలిచి, వార్తయుం పె నశ్వత్థామ పజ్జ కిట్లు.

చ. తెలివిగలండు నాకుఁ గడుఁ దియ్యము మెండు, స్వశాఖవాఁడు నీ కు, లలితమూర్తి వీనిజనకు ల్గడుఁ బేదలు సాదు లేను జి క్కులఁబడియుండ నెట్లగునొ కోరెద నే నరుదెంచుదాఁక నీ మెలఁపున నుండని మ్మితని మిత్త్రముగా గురుపుత్త్రసత్తమా.

అని చెప్పి యాయువరాజుగారు పంపుటయు నీయువరాజుగారు నన్నుఁ బోషించుటయు నెంతని కొనియాడను! అజ్ఞాతవాసవర్షము ముగిసినది, వారివారికిఁ బొత్తుకలియలేదు, చివరకు యుద్ధమే పొసఁగినది.

చ. కదన మటన్న నేమి చులుకం దలపోయకుఁ డెంతఱున్ననుం గొదవయె దేనికోయొకఁడొ కొం డుపయోగము నన్నుఁ బంపు మం చదనుస ద్రౌణిఁ గోరెఁ బవనాత్మజుఁ డద్దిర కాదు లేదు నే వదలను వీనిచాతురికి బ్రాహ్మణుఁ డావయి మిత్త్రరత్నమా.

అని ప్రత్యాఖ్యానము చేసినాఁడు. నన్ను నిల్పుకొని కాపాడుచున్నాఁడు. కౌరవపక్షమునఁ దండ్రిగా రుండుటచే యుద్ధములో సహాయము చేయ రమ్మని పిలువవచ్చిన భీమునితో

చ. జనకుని జంపఁబుట్టినన్నృశంసుఁడు మీ తెగలోనివాఁడు నా జనకుఁడు ధార్త్రరాష్ట్రులకు శాంతనవుండును బోలె నూఁత యీ ననుఁ బిలువంగఁ బోడియె ఘనంబగురోషము వానిఁ జూచినం తన యుదయించు రామికిఁగతం బిది చెప్పుము ధర్మపుత్త్రుతోఁ

గీ. జనకుఁజంపెనేని జను లనుకొనునట్లు, వానిఁజంప కెట్లు బ్రదుకువాఁడ వాఁడొ నేనొ యింతె వైరితో నేగతి, మసలువాఁడ నేకనుండలమున.

అని సాంత్వనముగఁ బలికి పంపి యుద్ధములో మృతినొందిన తండ్రితల నఱకెనని దుశ్శాసనుని దెగటార్ప నీశేయి శిబిరములకుఁ బోవుచు నన్నుఁ బిలిచి, మిత్త్రమా! తన్నుఁ గట్టిన యర్జునుని పరాక్రమవంతుఁ డని యాతనికిఁ దగిన కూఁతుం గంటినని——

చ. ద్రుపదుఁడు ద్రోణుఁ జంపెను సుతుం డని దీనికె సంతసించునే నెపుడు స్వపౌరుషంబు గ్రహియించిన నాపిత సంతసింపఁడే

ద్రుపదసుతు నవధించును సుతుండు ప్రబోధితుఁజేసియుంచు నా
కృపణత వీడిపోవును సుఖించెద తేపటినుండి హాయిగన్.

కావున, నీవు నిర్భయముగ నిస్సంశయముగ నాయాజ్ఞపై దృష్టద్యుమ్నుని విధవభార్యకు నాయావరాజ్యము నిచ్చివేయుము. చంపుదునా యని నీకు శంకవలదు. నేనే చత్తునా, యప్పుడైనను నీవు వారి కీయవలసినదే. అని తొంటరగా మేనమామతోఁ బోయెను. (చూచి) ఎవ్వరో వచ్చుచున్నారు. దృష్టద్యుమ్నపరిచారకుఁడవా. విశేషము లేమి?

పరి—ఇంక విశేషము లేమిటి?

బ్రా—చంపివైచెనా! మంచిది.

పరి—ఒక్కనినా! అశేషము.

బ్రా—నీ వెట్లు బ్రదికి వచ్చితివి.

పరి—దయదలఁచి కృపాచార్యులు ద్వారములో విడిచెను.

బ్రా—శిబిర మేవైపున నున్నది.

పరి—ఇదె నీయెదుటిదె పాంచాలశిబిరము.

బ్రా—దృష్టద్యుమ్నునిభార్యకుఁ గొన్ని మాట లున్నవి.

పరి—ఏమిమాటలు గర్భములోని పిండమునకై నారాయణాస్త్రము నీచేతఁ బంపినాఁడా.

బ్రా—భయపడకుము. చచ్చినశవములను జంపువారు నీరాజులు.

పరి—మఱియామెతో నీకుఁ బనియేమి?

బ్రా—(తనలో) ఈతనిమాటలవలన దృష్టద్యుమ్మునికిఁ బుత్రలాభము కలుగున ట్లున్నది గర్భములో నున్నశిశువునకా, విధవకా నేను రాజ్యమిచ్చునది. (ప్రకా) చెప్పెదను నన్నక్కడికిఁ గొనిపొమ్ము.

పరి—ఇటురమ్మిటు రమ్ము.

బ్రా—దేవు లేమనుకొనుచున్నారు.

పరి—అశ్వత్థామను బతిభిక్ష యడుగఁ దలఁచుకొనుచున్నారు.

బ్రా—ఈకోపము మీఁద నది సిద్ధింపదు. అతఁడిఁక నెక్కడ దొరకును. మనకు దొరకఁడు. అడుగవలదు.

పరి—ఒక్కమాట - మారాజులను నిందించితివే, యపాండవము చేసెద నని మీరా జేమిచేసినాఁడు.

బ్రా—అది ప్రతిజ్ఞ. మీరాజుం జంపుదుననియే కాని, యిది యెఱుఁగఁడు.

పరి—ఇపు డేమి చేయునని చెప్పినాఁడు.

బ్రా—చూచెదవు గాని నన్నొకడకుఁ గొనిపొమ్ము.

పరి—భయము లే దంటివి కదా రమ్ము.

బ్రా—పిఱికివాఁడా! ధైర్యము తెచ్చుకొమ్ము.

(అని యిరువురును నిష్క్రమించుచున్నారు)

ఇది అర్ధరాజ్యమను షష్ఠరంగము.

క్రొత్తపల్లి సూర్యరావు.

రసములందెల్ల శృంగారరస మెముఖ్య, మగుఁదదాలంబన విభావమతి వలగుట
లక్ష్యములతోడనాయికాలక్షణములు, వరుసవివరించిపలుకంగవలయు మొదట

సీ. చనుస్వీయపరకీయసామాన్యయనఁగనునాయికాత్రితయంబునయమిూఱు
స్వామియందే యనురక్తయైనది స్వీయ యన నందుఁ బరిణీత యన్యపురుషు
నభిలషించిన నతివ్యాప్తియగా నని పల్కవలదు లక్ష్యము పతివ్రతయె గాన
పరునియం దనురక్తి పరయంగఁబరకీయ యగుఁగానియదిస్వీయయనఁగఁదగునె
యలపతివ్రతయే స్వీయ యనఁగఁ జెలఁగు, దానిలక్షణలక్ష్యము ల్దానిచేష్ట
లాలకింపుము రాజగోపాలవిభుని, విజయరఘునాథనృపచంద్ర విభవసాంద్ర.

స్వీయకులక్షణము:—

క. పతిశుశ్రూషయు శీల, వ్రతరక్షయు లజ్జ యార్జనంబును క్షమయుఁ
బ్రతి లేనిస్వీయచేష్టలు, రతిపతిసమరూప విజయరఘుధనృపా.

స్వీయకులక్ష్యము.

సీ. వనజాతములుగదా పదము లట్లగుట నం దేణలోచనచూపు లెలమిఁ బ్రాలు
బింబ మాట సుధాంశుబింబాస్య కెమ్మోవి చిఱునవ్వు వెన్నెల చెలఁగు నందుఁ
పతి చెవ్వి ద్రోణియైపరఁగుట శుకవాణి పలుకు తేనియ లందెచెలువు మెఱయుఁ
జల్లనికరుణారసమున కిల్లగునుల్లమునఁ గోపశిఖి రవైనను జనింప
దదిజనించిన నొకయప్పుడందెయణఁగుఁ, బతియెదైనంబుగానుసంతతమునతని
యందెసతులకు సద్భక్తియలరియుండు, విజయరఘునాథనరపాల విమలశీల.

నాయకలక్షణము.

క. మును విధ్యుక్తకరగ్రహ, మొనరించినఘనుఁడు పతి సమున్నతిగ నతం
డనుకూలుం డన దక్షిణుఁ, డన ధృష్టుండన శఠుండు ననఁగను వెలయుఁ.

పతికిలక్ష్యము.

చ. అమృతమయూఖ నీవు తుహినాంశుచయమ్ముల ముంచనించు మం
దముగ ఫణీంద్ర నీవును ఫణాగ్రములఁ గొడుగుంచు వీచుమా
యమరతరంగిణీ మిగుల నంబుకణంబులఁ జల్లు త్రోవలో
హిమగిరిపుత్రి మెత్తనిమెయిఁ రవికాంతులు గాసి చేసెడిఁ.

ఈపుస్తకముతుదను గొన్ని సంగీతవిషయములు గలవు. రాగముల
పేరులు రాగమాలికయుఁ గలవు.

రాగమాలికలోని కొన్నిపంక్తులు:—

ఒక్కరాగముననుండి యువిద వచ్చినది - - సౌరాష్ట్ర.

ఒక్కరాగము వెలయుఁ జక్కనిప్రతాపసింహేంద్ర- శ్రీరాగము.

ఒక్కరాగజాతికి సమ మొప్పియుండును రూపము - గుజ్జరి.

ఒక్కరాగంబువలె నువిద కౌను - - - - ఆహారి.

మొదలైనవి 18 రాగములు గలవు

కనకాంగిరాగమునకుఁ గలశుద్ధస్వరములను మహత్తుగానుంచి ప్రస్తరించితే మేళాధికారశుద్ధమధ్యమరాగములు ౩౬ భేదములు గల్గును. పై గలుగదు.

సాలగరాగంబునకుం గల శుద్ధస్వరములున్ను ప్రతిమధ్యమమూను మహత్తుగానుంచి ప్రస్తరించితే మేళాధికారప్రతిమధ్యమరాగములు ౩౬ భేదములె బుట్టును. పై గలుగదు.

యిందున వకమేళాధికారమును బెట్టి ప్రస్తరించితే షాడవౌడసంపూర్ణరాగము లెన్నిజనించునో అన్నేశిరాగములే వక్కవక్క మేళాధికారమున్ను బెట్టి ప్రస్తరించితే బుట్టునే వినా అధికమైనా తక్కువైనా బుట్టనేరదు. యిదే సిద్ధాంతము. అయితే యిప్పటివాడికరాగములు గురువులకల్పనలే వినా ప్రస్తారజన్యములుగాదు. సంశయపడవలశినదే లేదు.

ఇట్లేకొన్ని విషయములుగలవు.

24. తత్త్వచంద్రోదయాదులు—గ్రం. సం. 77.

ఈతత్త్వచంద్రోయముతోపా టిందుఁ జాలగ్రంథములు గలవు. ఉన్నవానిలో మొదటిది గనుక ముందు దీనినిగూర్చి వ్రాయుచు దానికి ముందున్నయొక్కపత్రములో శిథిలప్రాయముగా నున్న కొన్నిపద్యములు వ్రాయుచున్నారము.

శ్రీకనకవల్లీసమేత శ్రీతిరువళ్లూరు వీరరాఘవాయనమః, శ్రీయలమేల్మంగాసమేత శ్రీవేంకటాచలపతయేనమః.—భర్తృహరి ప్రథమాశ్వాసము.—

ఉ. శ్రీలలితాద్రిజాఘుసృణచిత్రకరాగముఁ గాంచి తారక
భ్రూలత పల్లవించె ననఁబోఁడి నిజం బని మించుటద్దముం
గేల ధరించి ప్రేమఁ దిలకింపఁగఁ జూచు విలాసశాలికిం
బాలితసర్వభక్తజనపాలికి మ్రొక్కెదఁ జంద్రమౌళికిన్.

ఉ. తోయధిసారమై యితరదుర్లభమై గుణరమ్యమై జగ
ద్గేయమహత్త్వమై భువనదీపకమై కమలాఖ్యమై నిశా

నాయకసోదరంబయి మనఃప్రియమౌ రతనంబు జొమ్మునం
బాయక తాల్చుశౌరి నిరపాయసుఖంబులు మాకు నీవుతన్.
ఉ. ప్రామినుకుల్ ముఖాబ్జముల భారతి నెచ్చెలులై వసింప నె
త్తామరపూవు పీఠముగఁ దాపసముఖ్యులు సర్వనిర్జర
గ్రామణు లాత్మకింకరులుగా జగమేలెడు మేటిభక్తచిం
తామణి మాకు సత్కృపఁ బితామహుఁ డిచ్చుఁ జిరాయురున్నతుల్.
ఉ. శంకరచారుదృక్కుముదచంద్రిక యోగిజనప్రసన్నహృ
త్పంకజరాజహంసి శ్రుతిదర్పణదృశ్యనిజస్వరూప వి
శ్వాంకురజన్మభూమి తుహినాద్రితపఃఫలరాశి చంద్రరే
ఖాంకితరమ్యమౌళి జగదంబ శుభంబులు మాకు నీవుతన్.
చ. మినుకుఁగడాని పైఁడిపసమించిన నెమ్మెయిడాలు జాళువా
ననజడికై వడి న్నగనినల్లని మేనికి వన్నె వెట్టఁగా
గొనబువహించు జవ్వని ముకుందునిపట్టపుదేవి ప్రేమతో
వననిధికన్య మామకనివాసముల న్వసియించుఁగావుతన్.
చ. నెలకొని తియ్యగాఁ బదము నేర్పుము మాకని గేరుభంగి రా
చిలుకయు వీణయందున భజింపఁగ గీతసుధాపయోధిలోఁ
బొలుపుగ నోలలాడు ననఁబోణి నిరంతరసుప్రసన్నయై
పలుకువెలంది నావదనపద్మమున న్విహరించుఁ గావుతన్.
శా. శ్రీవాణీరమణాదు లెవ్వని జయశ్రీకాములై కొల్తు రే
దేవుం బ్రాజ్ఞులుగ్ గజాననునిగాఁ దెల్పున్ జగత్కర్తగా
నావిద్యాగురునిన్ గణేశ్వరుని భక్తాభీష్టసంధాయకున్
సేవింతు న్మదిలో వినాయకుని సుశ్రేమార్థసంసిద్ధికిన్.
ఉ. మూఁడుగుణంబులుం బరమమూర్తులు మూఁడును మూఁడువేదముల్
మూఁడుమహాక్షరంబు లొకమూర్తిగఁ బూనిన మేటి వేలుపుం
బ్రోడల కేలుమోడ్పులు సమున్నతిఁ గైకొను సామి చూడ్కికిన్
వేడుకసేయు దేవునిఁ గవిస్తుత తేజు రవిన్ భజించెదన్.
చ. ఇనజునితోడ మైత్రిఘటియించియు వారిధిదాఁటి జానకిం
గనుఁగొని వచ్చియున్ జవముగైకొని మందులు దెచ్చి లక్ష్మణు
న్ననిచియు దైత్యులం బిలుకుమార్చియు రాఘవుచేత మెప్పులం
దినహానుమంతు శాంతు వినుతింతుఁ దలంతు.... నెంతయున్.

గీ. యుక్తినొక్కొక్కవర్ణ మత్యుగ్రపాప, విదళనము సేయ శతకోటివిస్తరముగ
రామచరిత మొనర్చిన వామలూరు, సంభవునకుఁ బ్రణామముల్ సంఘటింతు

అనునీపద్యములు మాత్రము కలవు. ఏభర్తృహరిసుభాషితములను దెనిఁగించినకవి వీఁకపద్యములలో తెలియదు.

1. ఇఁకఁ దత్త్వచంద్రోదయువిషయము:—ఈ 77-వ సంఖ్యగలది యొక్క కాగితపుపుస్తకము. దీనిలోఁ దత్త్వచంద్రోదయము పదిప్రక్కలలో వ్రాయఁబడినది. వేదాంతవిషయమునుగుద్విపద.ప్రారంభము:—

శ్రీలీల వైభవాంచిత మైనయట్టి, భూలోకమునను జంబూద్వీపమునను
నవఖండములకెల్ల నాయకమైన, కవినుతభారతఖండంబునందుఁ
దెలియ నేఁబదియాఱు దేశంబులందు,
శ్రీధాన్యకటకమై చెలువొందుచున్న, యాధేనుకొండాహ్వయగ్రామవర్తి
కరుణాకరుండైన కరుణాకరుండు, కరుణఁగాంచినయట్టి ఘనకుమారుండు
నాణెమై తగుపాకనాఁటిశేఖరుఁడు, రాణించు శ్రీతిమ్మరాజప్రధాని
తత్త్వకథార్థావతారమై నైజ, తత్త్వంబు మోక్షార్థిదాసకోటులకుఁ
దెల్పుపరానందతీర్థదేశికుని, వేల్పుగాఁగొల్చి సేవించి తావారి
యుపదేశమున రాజయోగియై నన్నుఁ, గృపతోడనటులు రక్షించెఁగావునను
సద్గుణాంభోరాశిచంద్రుఁ డైనట్టి, మద్గురుస్వామిఁ దిమ్మయరాజయోగి
భావించి సేవించి భక్తితో నిష్ట, దేవతాస్తుతిచేసి ద్విపదమార్గమున

అనిప్రారంభించి ద్వారకలో రుక్మిణి శ్రీకృష్ణుని గోరఁగా నామెకు లోకానుగ్రహకాంక్షచే నద్వైతమార్గమును దెల్పినట్లు వ్రాసినాఁడు. మధ్యభాగమున—

ఒకయిచ్ఛయును లేకయుండెడి బయలు, సకలంబు తానైన చక్కనిబయలు
లోకంబు లన్నియుఁ లోఁగొన్నబయలు, రాకపోకలు లేక రంజిల్లుబయలు
మునులకు నల్లారుముద్దైనబయలు, వినవినవీనుల విందైనబయలు
ఎందుఁజూచిన గాని యెడలేని బయలు, సందీక యంతట సాఁగినబయలు.

ఈబయలు దగ్గఱదగ్గఱ నూఱుచరణములలో వివరించినాఁడు. అంతమున:—

అని ధేనుకొండ తిమ్మార్యప్రసాద, మున కొప్పరావూరి ముమ్మిడిరాజు
గంగనామాత్యుండు గన్నపుత్త్రుండు, శృంగారనిధియైన కృష్ణమంత్రికిని
రఘుప తెమ్మకును గారాపుసుతుండు, అఘనాశమైన బ్రహ్మానందపూర్ణ
మఖిలవైభవయోగి మల్లనయోగి, సహజకోదండదీక్షాగురుపేర

బావనాకృతిపేరఁబరమాత్మపేర, జానకీపతిపేరసదయాళుపేర
శ్రీనిధానముపేర శ్రీరాముపేర
ధరనెంచఁగా సంకీర్తనము చేసినట్టి, సరసమా నీతత్త్వచంద్రోదయంబు
ఆచక్రవాళాద్రియంతపర్యంత, మాచంద్రతారార్కమై యొప్పఁగాత.

ఈమల్లనయోగివంశాదికము నతనిశిష్యుఁడు జ్ఞానసూర్యోదయమను ద్విపదలో నీక్రింద వివరించినాఁడు. తనవంశమును దెల్పకున్నాఁడు.

2. జ్ఞానసూర్యోదయము:—దీనికవి వేంకటాఖ్యుఁడు, తనగురువగు మల్లనయోగికే కృతియిచ్చి చెప్పినాఁడు. ఇదియు వేదాంతవిషయమే. ౨౬ ప్రక్కలుగల పెద్దపుస్తకము, నాలుగాశ్వాసములు. ప్రారంభము:—

శ్రీకరు మోక్షలక్ష్మీమనోహరు, ప్రాకటనిజపరబ్రహ్మావతారు
నానాముముక్షుమానసరసోత్తారు, భానుకోటిప్రభాభాసురోత్కారు
గురుమతశాస్త్రానుకూలప్రసారు, వరరాఘవప్తవవాక్ప్రమత్కారు
తత్త్వవాద్యున్మత్తదంతికంఠీరు, తత్త్వమస్యర్థసాధకనిర్వికారు
పరమమంత్రార్థ దర్పణవాక్యసారు, వరసుషుమ్నాంతర ప్రజ్ఞానమీరు
తిమ్మార్యగురుపాదతీర్థకాసారు, సమ్మోదహృదయ నిశ్చలబోధధీరు
సురుచిరాపస్తంబసూత్రప్రచారు, సరసయజుర్వేదసమ్యగాచారు
గురుతరశాండిల్యగోత్రప్రకారు, ధరణీసురాన్వయ ధర్మశృంగారు
తనరుకృష్ణానదీదక్షిణతీరు, తెనుఁగుదేశమునఁ బొందికఁ గొమరారు
కులజనార్జితమైన కొప్పరాపూరు, ఇల రాజధానిగా నేపున మీఱు
సతతముమ్మిడిరాజ సత్కులధీరు, ధృతిని గృష్ణయరఘుప తిమ్మకుమారుఁ
డగుమల్లనాచార్యు నాత్మసుస్థైర్యు, నిగమోక్తి హృద్వీథి నిలిపి సేవించి....
సుకవీంద్రవర్యుల సొరిదిఁ గీర్తించి, సకలశాస్త్రవివేకసారంబు లెంచి
నిరతిశయానందనిపుణతఁగాంచి, యెఱిఁగింతు మద్వంశ మెట్లన్న మఱియు
ఘనడిల్లితిమ్మయ గాయమ్మ సుతుఁడు, వినుతసజ్జనుఁడు గోవిందయనరస
మాంబసుతుండు నాయన్నార్యలక్ష్మ, మాంబసుతుండు నాశ్వలాయననామ
సూత్రఋగ్వేదభాసురుఁడ వసిష్ఠ, గోత్రుండ వేంకటాఖ్యోన్నతయశుఁడ
మునిజనహృదయాబ్జములు వికసింప, నొనరింతు జ్ఞానసూర్యోదయంబనెడు
ఘనకృతి ద్విపదగాఁ గావ్యులు మెచ్చ,

ఈకథకుమూలము శ్రీరాముఁడు సీతాదేవి యడుగఁగా బోధించినట్లు తెల్పుచున్నాఁడు. మచ్చునకుఁ గొన్ని—

విను తత్త్వమస్యాది విమల వాక్యముల, పుట్టినజ్ఞానంబు పొందునఁ దోఁచు,....
భాగంబు లానందపసలక్షణములు, ప్రాగను నొక్కటి ప్రధ్వంస మొకటి
అన్యోన్య మొక్కటి యత్యంత మొకటి,శూన్యముల్నాలుగు సారిదినిత్యమును
వెలయును వీనిని వివరింతు వినుము,కలుగుమృత్తికయందుఘటములు మొదట
పరికింపఁగా నిది ప్రాగభావంబు, పెరవైన ఘటములు వెనక లేదనుట
పటువుగఁబ్రధ్వంసభావశూన్యంబు,ఘటములుపటమందుఁబటములాఘటము
కణఁగి లేదనుట యె కణఁగి యన్యోన్య, మనయభావంబింక నాకాశపుష్ప
మనుట యత్యంతమహా నలయభావంబు, ఘననిత్యపదమిది కంజాక్షి మఱియు.
(ప్రథమాశ్వాసములోనిది.)

కడపటివాక్యములు:——

శ్రీశైలమను నామ శిష్యునిగూడి, వాసనతో బాహ్యవాసనమాని
భాసురస్థితితోడఁ భాసిల్లుచుండె, - - - - - -
ఇదివిన్నఁ జదివినసిష్టార్థసిద్ధి, కొదుకక సిద్ధించు గురుకృపచేత.

3. తత్త్వదీపికాప్రబోధము:——ఇదియును మల్లన యోగిశిష్యులలో నొక డగు:——

అనుచు శ్రీమల్లనాచార్యప్రసాద, ఘనత మారేపల్లి కామార్యసుతుఁడు
సుతుఁడు వేంకటభట్టు సూనృతయశుఁడు, అతనికిల్లాలు నర్సాంబ వారలకు
గారాపుసుతుఁడు వేంకటయోగివరుఁడు, సారత వేంకటాచలపతిపేర
నాయూథు లెంచఁగా నంకింతంబైన, ధీరతనీతత్త్వదీపికాబోధ.

అనుదానిలోనున్న మారేపల్లి వేంకటయోగి వ్రాసినట్లు విదితము. ఇది చిన్న ద్విపద 36 ప్రక్కలుగలది. ఇది శ్రీతిరుపతి వేంకటేశ్వరస్వామి అలుమేల్మంగాంబకుఁ గరుణించిచెప్పిన వేదాంతము. ఈకృతిని:——

సరససత్కవిరాజసంఘుంబు వొగడ, - - - -
ద్విపదగా శ్రీతత్త్వదీపికాబోధ, అపరిమితశుభాంగ యలమేలుమంగ
మదివెలుంగుచున్న బ్రహ్మము పేర, విదితమహాతత్కథావిధ మెట్టులనిన.

అని శ్రీవేంకటేశ్వరులకే యంకితమిచ్చినాఁడు.

ఈకవి కొన్ని వాక్యములు చిత్తగింపుఁడు—

నిదురందుఁ బ్రాజ్ఞుని నిర్వాసనాను, హృదయంబునను జీవుఁడుండును మఱియు
త్రిగుణధామత్రయత్రిపురందు నిగుడి, నిగుడు జీవుండును నీవు నేననుచు
కల్పితరాగాదికర్మంబు లెల్లఁ, గల్పితదేహివిగాఁగ నెఱుంగు

సరి యవస్థాత్రయసాక్షియై యట్టి, యెఱుకస్వరూపంబు నెఱుఁగు మెట్లన్న
దేహేంద్రియప్రాణ ధీమనోచిత్త, మోహాదిగుణధర్మములు నీవుగావు.

౮. వేదాంతసారము:—కొండముదిగోపాలరాయ కవి. నాలుగాశ్వాసముల చిన్నపద్యకావ్యము గద్యము-ఇతిశ్రీభుజంగరాయ గురువరప్రసాదలబ్ధ కవితావిలాసగోపాలరాయప్రణీతంబైన సర్వవేదాంత సారామృతంబునందుఁ బ్రథమాశ్వాసము.

ప్రారంభము:—

క. శ్రీకళ్యాణగుణగణా, దాౄకరభయహరణ నిపుణ యార్యారమణా
రాకేందుమౌళిభూషణ, ప్రాకటభవబంధహరణ పంకజచరణా.

గీ. ఓంనమశ్శివాయ యోంకారరూపాయ, యీశ్వరాయ పార్వతీశ్వరాయ
ఫాలలోచనాయ భవబంధనాశాయ, శాశ్వతాయ శంభు శంకరాయ.

ఉ. కంటిని నీదురూపమును గన్నులునిండను సర్వమందునన్
వింటిని మంత్రగోప్యమును వీనులనిండను నాస్యమందునన్
అంటిని యైదునక్షరము లమృతధారఁగ జిహ్వయందునన్
తింటిని హాయిహాయిగను తృప్తిగ శంకర లోకనాయకా.

క. శివపంచాక్షరిమంత్రము, వివరంబుగ శివునివలన వినుటయు వలనన్
సవిశేషపదము గలిగెను, గవనంబును జయమునకును గారణమయ్యెన్.

క. ఏరామనామమంత్రము, తారకమని సాంబశివుఁడు దాక్షాయణికిన్
గోరఁగ నుపదేశించిన, యారాముఁడె బ్రహ్మమనుచు నభినుతిసేతున్.

గీ. పరమవేదాంతకవులను బ్రస్తుతించి, సకలగ్రంథాదిసారంబు సంగ్రహించి
చెప్పఁబూనితిఁ గృతిగాను జిత్తమలర, ననుభవంబును జెప్పుట యలవియగునె.

కవిస్వవిషయముం జెప్పుకొనుచున్నాఁడు:—

సీ. ఆంధ్రదేశంబున నతిశయంబై కొండవీటిసీమయందు వెలయుకొండ
ముదిపురవాసుండు నదెకొండముదివంశజుండు వెల్నాటిద్విజుండు మఱియు
గోత్రంబు కాశ్యప సూత్రమాపస్తంబ మార్వేలనియోగి యైనఘనుఁడు
పాపయ్యయనుమంత్రి పణఁతి సీతాంబయు నాదంపతులసుతుఁడైన ఘనుఁడు
వేంకటాచలమనఁగను విమలమతుఁడు,యతనిపత్నియు బుచ్చాంబయననుబడి
నావధూవరులకు సుతులేవురైరి, కీర్తిమంతులనఁబడిరి కేవలముగ. [యె

క. గోపన్న వేంకటాద్రియు, నాపయ బుచ్చయ్య మఱియు నప్పయ్యయునున్
బూపులకృష్ణయ యొక్కఁడు, ప్రాపితముగనైదుగురును బ్రజ్ఞాన్వితులై.

క. వ్యవహారయోగ్యులై మఱి, శివకేశవులాలయములు చెఱువులు వనముల్
సవిశేషకార్యకరములు, నవిరళముగఁ జేసినా రిలార్యులు మెచ్చన్.

ఉ. అందున వేంకటాద్రియును నందె నలంకృతకన్యదానమున్
సుందరరామునిన్వలన శోభనలగ్నమునందుఁ బ్రీతిగా - - - - -

ఈవేంకటాద్రిభార్యయాదిలక్ష్మి, యీదంపతులు సంతానములేక పండ్రెండేండ్లు తపస్సుచేయఁగా దపఃఫలముగా నీకవిపుట్టి నాఁడఁట. ఈతనితమ్ముఁడు యోగానందము.

కథాశైలికిఁ గొన్నిపద్యములు:—

క. అలరవిధి కర్మమనఁగన్, విలసితయజనాదికములు విశ్రుతమాయెన్
ఫలమందు స్వర్గభోగము, నలలితముగఁ జెప్పఁబడెను సంగతులరయన్.

సీ. యజనాదికములెల్ల నిజముగాఁ జలుపను గఠినతరంబుగఁ గానఁబడియె
ద్రవ్యంబులేకను సవ్యంబుగాఁబూర్తి గానేరదందునఁ గార్యములును
ద్రవ్యమార్జింపను ధనికులయాచింప నధికదుఃఖముకెల్ల నాలయంబు
విత్తమార్జనచేసి విధిగాను జలిపినఁ గడట ఫలమేమొ గానరాదు
కాయకష్టంబు నధికమై కానఁబడును, వినఁబరోక్షంబునై యుండు వేడుకలర
ఫలముఁ జెందిననల్పమై యలరుఁ దిరిగి,జన్మమానని చెప్పె నాశాస్త్రములును.

గీ. అలర నింద్రాధిపత్యంబు ననుభవింప
భ్రాంతినహుషుఁడు రఘుమహారాజవరుఁడు
మఱి యయాతియు మాంధాత మహిమదెలియ
నేమిపొందిరి స్వర్గులై యింద్రపదము.

క. అదిగాన చలనకారణ, నిదిబాహ్యమునను చు విడిచి యేర్పడమదినిన్
సదమలయంతర్యాగము, విదితంబుగఁ జలుపఁబడితి విరతినిజెందన్.

ఈగోపాలరాయఁడే తనగురుఁడగు భుజంగరాయనిసంబోధించుచుఁ గొన్నికీర్తనలు వేదాంతమార్గమునఁ జెప్పినవి వెనుకటిసంచికలయందుఁ బాఠకులు తెలిసికొనియున్నారు.

పీఁచుకాగితములమీఁద వ్రాయఁబడినది. ఇదియే కవిస్వహస్తలిఖితమగు మొదటిమాతృకయా యని సవరణలు దిద్దుబాటులుఁ జూడ ననుమానము కలుగుచున్నది. అక్షరములు కలిపివ్రాఁత కొన్నితావుల స్ఫుటముగానగపడుటలేదు.

ఇంకఁ బ్రసంగరత్నావళివిషయముం దెల్పుచున్నారము:—

హరిణాక్షి కెమ్మోవి యమృతంపు దీవి, తరుణిపల్కుదురు కుందమ్ముల నెదురు
వామాక్షిముక్కు సంపంగిమొగ్గనిక్క, భామినినేత్రముల్ పద్మపత్రములు
కలికికన్బొమలు నంగజు వింట్ల సొనలు, జలజనేత్రముఖంబు చంద్రసఖంబు
తొయ్యలిముంగురుల్ తుమ్మెదసరులు, నయ్యంగనవిలాస మలవియె పొగడఁ
దామరసేక్షణ తనుకాంతిచేత, హేమసౌందర్యంబు నెపుడు జయించుఁ
గలకంఠి యూరుప్రకాశంబుచేత, లలిత మౌ రంభావిలాసంబు మించుఁ
గరిరాజగామిని కనుఁగవజిగిని, హరిణవికాసంబు హరియింపఁ జూచుఁ
గలికి నెన్నుదుటి చక్కఁదనంబుచేత, నలశశిరేఖ యొయ్యారంబు మించుఁ
దరుణినాసిక తిలోత్తమచుతిఁ గాంచుఁ, గురులచేత సుకేశికొమరు వహించు
నచ్చరపూఁబోణు లందైనయల్ల, మచ్చెకంటికిఁ గాంతిమతి కెన గలదె
సకియ ప్రత్యక్షపాంచాలశయ్యలను, సకలప్రబంధముల్ చదువంగ నేర్చు
సంపూర్ణచంద్రాస్య జంత్రగాత్రముల, నింపొంద వీణ వాయింపఁగా నేర్చు
పదపద్యగద్యముల్ బహువిధోల్లేఖ, లొదవఁగా రచనసేయువిధంబు నేర్చు
వెలఁది నాటకములు వింతవింతలుగ, వెలయించి కేళికల్ వినుపింపనేర్చు
వ్రాలు ముత్తెము లన వ్రాయంగనేర్చు, లీలఁ జిత్తరువులు లిఖియింపనేర్చు
మన్నారుదాస వేమాట లింకేల, నిన్ను మెప్పింప మా నెలఁతయే నేర్చు.

వా. అని మఱియు నే మనుచున్నది.

పదము - మధ్యమావతి - అటతాళము.

ఎన్నరానివలపు యింతికి నీమీఁద, మన్నారుదాసధీర మక్కువ నేలుకోర॥౧॥
తుమ్మెదనారిగల తుంటవిలు పూని, కమ్మవిల్తుండు చాల గాసి సేయంగను॥౨॥
వెలయంగ వెన్నెల వేఁడిమిఁజల్లుచుఁ, గలువల చెలికాఁడుకడుమచ్చరింపఁగను॥౩॥
తమ్మివిరి పుప్పొడితావి పైనింపుచుఁ, దెమ్మెర ద్రిమ్మరి దొమ్మి సేయఁగను॥౪॥

వా. అని మఱియు నే మనుచున్నది.

విలాసవతిచదివే పద్యము.

క. కులమున గుణమున రూపున, నిల నలకాంతిమతివంటి యింతులు గలరే
చెలువకు నీవే తగుదువు, తలఁపఁగ నాయింతి నీకె తగును నరేంద్రా.

వా. అనిన విని యవనిపనేత యతిచమత్కారవచనరచనావిలాసవతి యగువిలాసవతినిం జూచి యే మనుచున్నాఁడు.

నాయకుండు చదివే ద్విపద.

చెలువ మన్నారును జెంగమలమ్మ, పులుఁగుఁదేజీ నెక్కి పొదలుచు రాఁగ
సేవింపుమను వచ్చి చెంతి రాణించు, సౌవర్ణ మగునొక్కసౌధంబునందుఁ

ప్రతిలేని రతనంపుప్రతిమన మించు, సతివ నొక్కతెఁ జూచి యచ్చెరువంది
యే రాజకన్య యోయీరాజవదన, యారాణి యొయ్యారమయ్యారె యనుచుఁ
జాల నామదిలోన సంతసం బంది, బాలికామణిపయి బాళి దలిర్పఁ
బరఁగుగోపాలుని ఫాల్గునోత్సవము, నెఱవేర్చి తగువారి నెమ్మితోఁ బనిచి
యింతినిం బెండ్లాడ నేఁగోరియుంటి, నింతలో వచ్చితి విందీవరాక్షి
యిద్దఱికోరికె లీడేఱె ననుచు, ముద్దియతోఁ దెల్పు మోదంబుమీఱ.

వా. అని యాభూభరణుం డాభరణాదుల బహూకరించి పంచినఁ జంచలాక్షి యే మనుచున్నది.

విలాసవతి చదివేపద్యము.

క. స్వామీ నీతోఁ దెల్పిన, యీమాటలు రాజచంద్రుఁ డెఱుఁగకయుంటే
నీమంత్రుల నట పంపుము, తామసమున కింకఁ జెలియ తాళదుసుమ్మీ.

వా. ఇవ్విధంబున నవ్విలాసవతి యన్నరనాథునితో విన్నవించి మగుడి వచ్చు సమయంబునఁ గాంతలమేలుబంతి యైనకాంతిమతి మకరకేతుకిరాత దురాసదశరాసనటంకార హుంకారంబు సైరింపలేక చంచరీకఝుంకారంబు వారింపలేక కీరంబుల దాగి మీఱలేక తనడెందంబునం గందళించు కుందుఁ దీర్ప నేర్పరి గాక యీచందంబున నిందుకందర్పమందానిలాదుల దర్పంబునఁ గదా యని తన వీఁక విడువలేక కాఁకలఁబెట్టు రాకానిశాకరుని స్వకీయహృదంతరనిరంతరితనిశిత శరనికేతనుని మకరకేతనుని నిందించె నఁట యెట్టులనెను.

కాంభోజి రాగము - అటతాళము.

పదరెదవదేర వెన్నెలరాయ, పదరెద వదేర నీకు నే పగదాన నఁటరా।
బెదరించేవేమిరా విజయరాఘవేంద్రుని, ముదమునఁ దోడ్కొనియిదె చెలివచ్చీని॥
నామాట వినురా కల్వలరాయ, నామాట వినురా మోరనీకు మోమోట లేదా
రామా పాంచాలునిరఘునాథతనయుని, ప్రేమతోఁ దోడ్కొని రామయిదె వచ్చీని॥
చెనకేవదేరా వెన్నెలరాయ చెనకేవదేరా, నీవు నాపైఁ గినుక సేయుదురా
మనసిజాకారుని మన్నారుదాసుని, వనజాక్షి తోడ్కొని వచ్చీని యింతలో॥పద॥

వా. అని మఱియు నేమనుచున్నది.

కవి. చెక్కిలి నొక్కుచుఁ జిన్నిచన్నులు చీరి పుక్కిట విడె మొసంగి బుజ్జగింపుచును
అక్కునఁ గదియించి యంగజకేళిని నన్నుఁ గ్రక్కునఁ బైకొని రాకాఁక దీఱఁగను॥౧॥
ముచ్చట మీఱంగ మోవి యానుచును, దచ్చనవగబాలఁ దమి హెచ్చనిపుడు
అచ్యుతవిజయరాఘవ యాదరింపుచుఁ, బచ్చవిల్తునికేళి బావ నన్నేలరా॥౨॥

వా. అని పలికి కాంతిమతి చెంతనున్న యింతులతో నేమని యాలోచన చేయు చున్నది.

ద. పంతముల్ పల్కెఁ గాఁబలుమఱు మనతోడఁ గాంతుని దెచ్చు నా కాంత యీ వేళ దొరకునో దొరకదో తొయ్యలికిఁ ముఖంబు దొరకిన మనసిచ్చి దొరమాటలాడు నా మచ్చరంబున వద్దనుగున లీమాటలు అచ్యుతవిజయ రాఘవు నాలకింపనిత్తురా॥

వా. అనిన విని వనజముఖితో సఖీమణు లేమనుచున్నారు.

ద. తలిరుఁబోణి యింత తామసించినపుడె, చెలువ నీ తలఁపెల్లఁ జేకూడె నమ్మ॥౧॥
మంచియుపశ్రుతి మగువరో విననయ్యె నెంచిన కార్యంబు నిదిగో ఫలియించు॥౨॥

వా. ఆసమయంబున మన్నారుదాసభూపాలుని రూపరేఖావిశేషంబులు గనుంగొని యనన్యజన్యజన్యానన్యధీనస్వాంతయై కాంతిమతీ కాంతకు సమాగమసంతోషంబు సూచించు ధీచమత్కృతిం గనుపట్టఁ జుట్టుఁగైదువజోదు పట్టంపు రాణిగ్రైన శోణాంభోరుహకీరవాణి మురువు మీఱ నెఱుకతయై వచ్చెనఁట యొటువలెను.

ద. చెలువ మన్నారుదాసుపై వలపు నిలుపలేక, కలవరింపుచునున్న కాంతిమతికిఁ। దలఁచిన తలఁపెల్లఁ దార్కాణగాఁ దెల్ప, నల చెంగమ్మ యెఱుక చెలువయై వచ్చె॥

ద. వచ్చె నెఱుకత హెచ్చుసొమ్ముల వన్నె మిన్నగ మెఱయఁగ,
మెచ్చుగా నల కాంతిమతికిని మేలుగా గుఱి దెల్పుచు ॥౧॥

వా. ఇవ్విధంబున వచ్చిన చెంచుమించుఁబోణినిం జూచి నెచ్చెలి సంతసంబునఁ గాంతిమతికి నేమనుచున్నది.

చెలికత్తె చదివేద్విపద.

విను కాంతిమతి యొకవింత యీ వేళ, మినుకు బంగరుచాయ మెఱయు నెమ్మేను
నుపొణిముత్యాల సొబగు కమ్మలును, గప్పురా జిగిమించు కస్తురిబొట్టుఁ
బలుచని చెక్కులు బటువుపాలిండ్లుఁ, జెలువైన కెంగేలఁ జెలఁగు బెత్తంబు
జాఱుకొప్పున నొప్పు సంపంగిసరులు, సారమౌ వజ్రాలసందిదండలును
బటువుముత్తియముల బన్నసరాలుఁ, గటిని ఘటించిన కనకాంబరంబు
విరులచెండును నెమ్మిపింఛంబు మెఱయ, నురమున బురుకనిహారాయలుగాఁబూని
తలఁపులోనర్థంబు తార్కాణగాఁగఁ, దెలుపు మటంచుఁ బ్రార్థింపఁగా జనులు
ఎఱుకత యొక్కతె యిదె రాజవీథి, నొఱపుగా వచ్చుచు నున్నదో యమ్మ.

వా. అని విన్నవించిన వన్నెలాఁడినిం జూచి కాంతిమతి యే మనుచున్నది.

కాంతమతిమాట—ఓవాలుగంటి యీచెంచుమించుఁబోణి నాపాలవెలయు గోపాలునిపట్టంపురాణియే తప్పదు. ఇప్పుడు గ్రక్కునఁ దోడి తేవే.

వా. అని పలికినఁ గలికిపలుకులు విని యానసజగంధి యెఱుకతసరసకు మరలి మరలి వచ్చి యేమనుచున్నది.

చెలికత్తెమాట—రావే యెఱుకలమచ్చెకంటి మానెచ్చెలి పిలిచీని.

వా. అనిన విని యామెచ్చులాఁడి యచ్చటికి వచ్చి నఁట యెటునలెను.

వా. ఈకరణి వచ్చిన శాకునికకోకిలాలాపను జూచి కాంతిమతి సంతసంబున నేమనుచున్నది.

ద. సంపంగితోఁటలో సొంపొందు దేవతవో, యింపొందు నీపట్న మేలుదేవతవో।
కొమ్మ నినుఁజూడఁ జెంగమ్మ తలంపయ్యె, నమ్మ నీవెవరమ్మ యానతీవమ్మ।
కెంగేల నీవిపుడు గిలించు బెత్తంబు, చెంగోలువలెఁ దోఁచె బంగారుతల్లి॥

వా. అనిన విని యేనాదిమానవతి చెలువుగాఁ దావెలయు నెలవు లేమని తెలుపుచున్నది.

ద. రాకాసిరాయలఁ జీకాకుచేసిన, రాకొమరునియింట రాణించియుంటి ॥౧॥
దుండి యాబండిపాలదిండిఁ జెండాడిన, దుండగీనివీట మెండుగానుంటి ॥౨॥
యెలమిదక్కినదొరంకిరవుమాకిపుడు, వెలయుమన్నరుదాసువీటనిపుడున్నాను॥

వా. అనిన విని యన్నారీమణి మన్నారుదాసనామధేయవర్ణనాకర్ణనంబున నంతరంగంబున సంతసంబంది భ్రూతారాద్యగ్వికారాదులైన చెలంగు నాంగికానుభావంబులును శృంగారసూచకంబులైన వాచికానుభావంబులును దనరఁ దనచెంతనున్న యింతులం జూచి చిఱునవ్వు నవ్వి యగ్గలం బైనసిగ్గునఁ గించిదవనతవదనయైన చంచలాక్షిని జూచి యాచెంచుమించుఁబోణి యేమనుచున్నది.

ఎఱుకతమాట—యెరుఖాడు గెరుఖాడు గెరుఖాడుగే దుండి, నీవు తలంశిన తలంపు నీవు తలంశినతలంపు నిజముగా శెప్పేనే నిజముగా శెప్పేనే, నిక్కముగా శెప్పేనే, తార్కాణగా శెప్పేనే, తార్కాణగా శెప్పేనే, దుండి, అమ్మాయమ్మ అమ్మాయమ్మ యీబురుకనికి యీబురుకనికి బువ్వదేవే బువ్వదేవే, అవ్వగురిసూడ మొరంటెలో ముత్యాలు దేవే ముత్యాలు దేవే, దుండీ.

వా. అనియెఱుకల మెఱుంగుఁబోణి తనశిష్టాభీష్టదేవత నేమనికొనియాడుచున్నది.

ఎఱుకతమాట—శ్రీరాజగోపాల, దోరకానాత, బంగారుమన్న, శంగమరేండా, శండలంకార, వండువరావది, నల్లనిదేవర, గొల్లలసామి, చంపకవనవాస,

సంపంగిరాయ, విజయరాఘవవరద, విజయసహాయ, నీవేనేనయి, నాతలం పున నిలిశి, యీకలికి తలంశినతలంపు, నిజముగా, బలుకవయ్యా, నిక్క ముగా బలుకవయ్యా, తార్కాణగా బలుకవయ్యా.

వా.అని యెఱుకలబుట్ట చేపట్టి రాజచంద్రునిపట్టి చేపట్టి యేమనుచున్నది.

అమ్మాయమ్మ, అమ్మాయమ్మ శెయిసూపు శెయిసూపు శెయిసూపవే దుండి, దనముగల శెయ్యే, దాన్యము గలశెయ్యే, బంగారు శెయ్యే, బాగ్గ ముల శెయ్యే దుండి, అటునిటు సూడక నే శెప్పేగురివూంకొని వినవే వూంకొని వినవే దుండ్డి, కండ్లంటే తోడు, కడుపంటే కొడుకు, కంటెంటే మగండు వొండే రెండే వొండు.

వా అని మఱియు నేమనుచున్నది.

ద. మదిరాక్షి హెచ్చుతలంపుమదినిదలంచితివి,అదినీకుఁదెలిపెదనతినయేమిచ్చేవే॥
అలరువిల్తుండు మించుచెలువుండునినుఁజేరఁ,గలగంటివి రేయి కలకంఠియీవు॥

యెఱుకతమాట—అమ్మాయమ్మ, అతం డేవితమువాం డంటా అడిగేవే, అతం డేవితమువాం డంటా అడిగేవే, అయితే తెలిపే వినవే దుండీ.

ద.జనియించితండ్రికిజయ మొసంగినవాఁడు, అనిపంపులనుబగరనణంచినవాఁడు॥
మదవతి యెదయందు మచ్చగల్గినవాఁడు, పదియారుదానలఁ బరగినవాఁడు॥
కనకగర్భంబునఁ గనకాబ్జదేవికిఁ దనయుండై చనుబాలు ద్రావినవాఁడు॥3॥
ప్రతిదినం బొకకోటిబాపల కన్నంబు, యితవుగాఁబెట్టించియిల యేలువాఁడు।
వేయాఱు వెలఁదుల వెలయించుదక్షిణ,నాయకుండనిమించినలువొందువాఁడు।
అతఁడె నీపతి యగు నందుకుఁ దార్కాణ,యితవైన నెచ్చెలి యిదిగో వచ్చీనే।

వా.అని పలికి యాకలికి చిలుకలకొలికిచేత సకలబహుమతులుఁ జెంది యాయరు ణారవిందేందిర నిజమందిరంబు సేరుసమయంబున యువతిచెంగటికి లసమాన సోల్లాసవతి యగు విలాసవతి వచ్చి యేమనుచున్నది.

కళ్యాణి రాగము - ఆదితాళము.

ఫలియించె నీకోర్కి భామరో నేడు, చెలువమన్నరుదాసుండు చెలియఁ బెండ్లా [డు నే.

వా.అని మఱియు నే మనుచున్నది.

కళ్యాణి రాగము - ఆదితాళము.

వీనులవిం దాయె విజయరాఘవుని మాటలు,
మానవతిగో వినుము మనసు చల్లనయ్యీని॥

చక్కఁదనంబునకు సాటి యెవ్వరు లేరు, ప్రక్కకు వచ్చెను పణఁతి వగనవేలె
చెక్కిలి నొక్కి నేను జేరి చనవునఁ గూడి, అక్కఱతో నిన్నాదరించేద ననెనే
కమ్మని మోవాని కౌఁగిట బిగియించి, కొమ్మవిరుల దువ్వి కొప్పు నవరించి।
ముమ్మడించిన ప్రేమతో ముద్దుఁ బెట్టి, యెమ్మెకాఁడుని న్నెంతైనలాలించేద ననే.

వా. అనిన విని కాంతిమతి యాయింతి నే మని యుపచరించుచున్నది.

కాంతిమతిచదివే ద్విపద.

నీవను తేప యోనెలఁత గల్గఁగను, నీవిరహాంబుధి నేనీఁదఁగంటి
వనిత నీవనెడు సర్వాంజనం బొదవఁ, దనప్రియుం డనెడు నిధానంబుఁ గంటి
లలన నీ వనుకల్పలతిక గల్గఁగను, దలఁప నాదుమనోరథఫలంబు దొరకె
కలికి నీవనియెడి కలశాబ్ధిలహరి, గలుగ వాగమృతంబు గలిగె నాపాల
ఉచితోపకృతికిఁ బ్రత్యుపకృతి యెట్లు, రచియింప నేర్తునే రాజీవనయన
తనవద్దనుండెడు తరుణులలోన, నెనరైన నీవంటి నెచ్చెలి గలదె
ఇంకొకసారి నీ వీపల్కులెల్లఁ, గొంకక తెల్పవే కొమ్మ నాతోను
మన్నారుదాసుండు మన సిచ్చి నీవు, విన్నపించిన దెల్ల వినియెనా నేఁడు.

వా. అని నెచ్చెలితోడ ముచ్చట లాడుచు నచ్యుత విజయరాఘవసార్వభౌముని యాప్తజనాగమనంబుఁ బ్రతీక్షింపుచు వారిజాక్షి యున్నయనంతరకథాసంవిధానం బెటులనెను.

కవివచనము పద్యము.

చ. ఎనయఁగ నవ్విలాసవతి యింపుగఁ బల్కినయట్టి పల్కుల
న్ననుపున మాటిమాటికివి మానిని చెల్వమె ప్రేమనెంచుచుం
గనకవిభాంగి కాంతిమతి కన్నులఁ గట్టిన యట్టు లుండఁగా
మనసిజబాణవర్షములు మన్నరు దాసుఁడు నోర్వ కిట్లనుౕ.

భైరవి రాగము - ఆదితాళము.

చాలా దయవాఁడనె సరగున నన్నేలుకోవే,
యేలనే యీమోడి యెలనాఁగ నీకిపుడు ॥ ౧ ॥
చక్కెరమోవి యొసంగి చవులఁ దేలించితే,
చొక్కమౌ మురువు ముత్యములు సుదతి యిచ్చేనే ॥ ౨ ॥
గారవంబున నన్నుఁ గౌఁగిటఁ జేర్చితే, నీరాజిదుప్పటి నెలఁత యిచ్చేనే॥౩॥
వచ్చవిల్తునికేళి బాగుగఁ గూడితే, పచ్చలపదకంబు భామ యిచ్చేనే ॥ ౪ ॥

వా. అని మఱియు నే మనుచున్నాఁడు.

ముఖారి - అటతాళము.

వన్నెలాఁడి నీమీఁదివలపు నిలుపలేనే, యెన్నరాని దయనేలవే మగువరో।
బొమ్మరమ్ముల నమ్ముఁజిమ్ము చన్నులముద్దు, గుమ్మనాఱొమ్ము గుమ్మవే మగువరో॥
అలరువిల్తుని కేళి వెలయింపవే నన్ను, కలికి విజయరాఘవుండనే ॥

వా.అని మఱియు నే మనుచున్నాఁడు.

పదము - సావేరి రాగము - దరువు.

గద్దఱి చిలుకలు గద్దింపుచు పదరీని వద్దని పలుకవె ముద్దుగుమ్మ। యీ ప్రొద్దు సిద్దుర కంటకిరాదే॥

తుంటవింటి యొంటరి నా వెంట నంటేని। కెమ్మోవిపంటి మొనకు నంటు సేయవే యోవాలుఁగంటి నీజంటఁబాసి యొంటినుండనే ॥

ప్రతిలేనిచిలుకపలుకులు పలుకవె నాతోను, రతిరాజసముండనైనట్టి రఘునాథతనయుండనే॥

కంజాక్షిచూడవె కరుణించి నెనరుతోఁ,దంజపురమేలేటి దానశూరుండనే॥

బంగారు గిన్నెలవంటి బటువైన పాలిండ్లు పొంగుచుఁ బాలింపవే పొలఁతి విజయరాఘవుఁడనే॥

హరువుగ నన్నేలు మలుకలేల సేసేవు మరుని కేళి ననుంగూడవే మగువ నీదాసుండనే॥

వా.అని మఱియు నే మనుచున్నాఁడు.

కవి.చానరో నీదుచక్కఁదనం బెల్ల వీనులవిందుగా వినుచుఁ జొక్కితినే।
తేనెలుగులుకునీ తేటైనకెమ్మోవి, పానకము దయసేయవే బాగు మీఱంగను.

వా.అని మఱియు నే మనుచున్నాఁడు. నాయండు చదివే పద్యం.

సీ. పలుమాఱు పిలిచినా పలుకక యున్నావు పంతమీవేళనా పద్మగంధి
యెంత నేవేఁడినా యెలమితోఁ జూడవు సరస మీవేళనా సన్నుతాంగి
చేరి నే మ్రొక్కినా చేరఁదీయ వదేమి నవ్వు లీవేళనా పువ్వుఁబోఁడి
కదియ నేవచ్చినా కౌఁగిలింప వదేమి యలుక లీవేళనా జలదవేణి
తగుణి నీదాసుఁడనుచును దయను నన్ను, సేవసేయించుకోరాదె చెలియనీవు
మరుఁడు దండెత్తె నామీఁద మగువ నీదు, చరణపద్మంబులకు నిదే శరణుశరణు.

వా.అని మనుజవల్లభుం డుల్లంబునఁ గలంక మల్లడిగొన నల్లతాంతభల్ల నిశితశర పరంపరల సైరింపలేక విరహం బోఁపలేక మెఱుంగుసూరెపుటంపు టోరఁ గుప్పెఁ జేరి దురవగాహమోహపారవశ్యంబున నుండుసమయంబున నాయంబుజాక్షులు తమలోఁ దాము సైఁగల నన్నల నే మనుచున్నారు.

సావేరి రాగము - అట - దరువు.

ఎలనాఁగచూచి తెయీూవిభు మోహంబు, వెలఁదిచూచితి నెంతవింతా యెనమ్మ॥
నలినాక్షి వింటివా నాథునిపలుకులు, అలివేణి వింటినమ్మా అందంబుగానె॥౨॥
అందచందంబుల నాటపాటలచేత, సింధుముఖి మనకన్న హెచ్చటనమ్మ॥ 3 ॥
ఇంతులపొందుదా నెఱుఁగనిచందాన, నెంతయుఁ జిత్తమా కాంతపై నుంచె॥ ४ ॥
వలచేవారు లేరోననితలస్సైని, వెలఁదియిటువంటితమివింటిమా యెంద్రైన ॥ ౫ ॥

వా. ఆసమయంబున మన్నారుదాసధరాపురందరుని చెంగటికిఁ జక్రధరచర్యు లగు శతక్రతుశ్రీనివాసతాతయాచార్యవర్యులు విజయించి రఁట యెటువలెను.

ద. ముదమైనచౌకట్లు ముత్యాలకుళ్లాయి, సరిలేనిరతనాలజంటయుఆచట్ట।
హారువొందు వాజపేయచ్ఛత్రములనీడఁ,దిరుమలశ్రీనివాస దేశికులు వచ్చిరి.

వా. ఈచందంబున వచ్చిన యాచార్యులు తమకు వందనం బొాచరించిన యాచందనగంధులం జూచి యేమని యానతిచ్చేరు.

ఆచార్యులు చదివే పద్యం.

సీ. ఎప్పుడు వచ్చినా యెదురుగాఁగనె వచ్చి పాదముల్ సేవించి భక్తిమీఱఁ
గైదండ యొసఁగుచు గద్దియపై నుంచి మమ్ముఁ బూజించును నెమ్మిమీఱఁ
నేము దగ్గఱ రాఁగ నెంతయుఁ బ్రేమచే నెదురుగా రానట్టి హృదయమేమి
చెంతఁ గూర్చుండిన సంతోష మనురంగఁ బలుకకయున్నట్టి భావమేమి
మన్ననారుకటాక్షంపు మహిమవలన,మనకసాధ్యంబు లెవ్వియునుహిని గలవె
మనసులోపల నున్నట్టిమర్మ మదేమి, తెలియఁగాఁ బల్కరమ్మ యో చెలువలార

వా. అని యానతిచ్చిన శ్రీనివాస తాతయాచార్యులతో నామీచకకచ లేమనుచున్నారు.

ముఖారి - ఆది - దరువు.

ఏ కాంతయో కాని యే కాంత మొకటె, యీూకాంతునకుఁ దెల్పెనిందఱుఁజూడ.

వా. అనిన విని దరహాసవదనుండై గురురాయపట్టభద్రుండు వితతవినయుండగు తనతీనయుని మేను మస్తరింపుచుఁ గుస్తరించిన నాయమశ్లోకప్రభావుం డగు విజయరాఘవసార్వభౌముండు శుభకరం బైనగురుకరవిమర్శనంబునఁ గలంక దీరి తెలివిఁ జెంది మందమందముగ డెందంబున నానందంబు గందళింప నాతిరుమలవంశనందనునికి వందనం బొాచరించి యేమియు నుంగలించ లేక యున్నచందంబుఁ జూచి ధీచాతురి మెఱయ నాచార్యు లేమనుచున్నారు.

వా. ఆచార్యులు చదివే ద్విపద.



శ్రీ

# ఆంధ్రసాహిత్య

# పరిషత్పత్రిక.

## Journal of the Telugu Academy.

౧౩-వ సంపుటము.

రక్తాక్షినామసంవత్సరము.

1924-25.



# ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక.

రక్తాక్షినామసంవత్సర విషయసూచిక.

---



# ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక.

సంపుటము ౧౪. | క్రోధననామసంవత్సరము. చైత్రవైశాఖమాసములు. | సంచిక ౧.


## నన్నిచోడుఁడు.

---

ఉ. దేసితెలుంగుఁ బల్కులను దీరిచి దిద్ది ప్రబంధశయ్యఁ గై
సేసెఁ గుమారసంభవము శ్రీగురునిం గృతినాథుఁ జేసి పే
ర్వాసి నెసంగె నట్టి కవిరాజశిఖామణి నన్నిచోడుఁడే
కైసరుఁ డాంధ్రభూమిఁ గలకాలము సంస్మరణీయుఁడే కదా!

బ్రహ్మశ్రీ నడకుదిటి వీరరాజు పంతులుగారు "నన్నిచోడ కవిరాజశిఖామణి" కాలనిర్ణయవిమర్శము" అనుపేరితో శారదాపత్రికలోఁ ~~గడచిన సంవత్సరమునఁ~~ బ్రకటించిన వ్యాసమును (~~దానిని పుస్తకముగాఁ గూడ వేయించి వీరరాజు పంతులుగారు నాకును బంపిరి~~) ~~దానిపై నిటీవలి~~ సాహిత్యపరిషత్పత్రికలో బ్ర॥ రామయ్య పంతులుగారును వీరరాజు పంతులుగారును వేర్వేరుగా మరల వ్రాసినవ్యాసములును జూచితిని. [నాలుగు వత్సరములనుండి నన్నిచోడకవి కాలమును గూర్చియుఁ గవితను గూర్చియు నాకుఁ దోఁచిన క్రొత్తవిషయములఁ గొన్నింటిఁ బ్రకటింప నేనును గుతూహలపడుచుంటిని. ఈ విషయమును గ్రంథము ప్రకటించిన బ్ర॥ రామకృష్ణకవిగారు గూడ నెఱుఁగుదురు. వీరరాజుపంతులుగారి తొలివ్యాసమును జూచినపిదప నాకుతూహలము హెచ్చయ్యెను. ఇట్లుండఁగా రామయ్యపంతులుగారిప్పుడు నన్నిచోడకవి కాలనిర్ణయమునుగూర్చి యొకశాసనమును పరిషత్పత్రిక వ్యాసమునఁ బ్రకటించినారు. ఆ శాసనమునే ప్రధానముగా నన్నిచోడకవి కాలనిర్ణయమునకై నేను ప్రకటింపఁ జూచుచుంటిని. నేను ప్రకటింప నుద్దేశించి యుండుట రామయ్యగారు గాని వారు ప్రకటింపఁ బూనియుండుట నేను గాని తొలుత నెఱుఁగము. ఆ శాసనమును గూర్చి పలువురవలె శ్రీ రామకృష్ణకవిగారును

నేనును జర్చించుకొని యుంటిమి. కవిగారు కుమారసంభవము ద్వితీయ భాగము పీఠికలో దానిని స్మరించియు నుండిరి. ఈనడుమ రామయ్యపంతులు గారు మద్రాసువచ్చినపు డీశాసనమును దాము ప్రకటించుచున్నట్టు నాతోఁ జెప్పిరి. వారు నిర్ణయించిన కాలమే నే ననుకొన్నది యగుటచే వారి సిద్ధాంత మునకు నాసిద్ధాంతమునకు నంతగా భేద ముండదు. కాని శాసనసమన్వయ మున నేను వారితోఁ గొంత వేర్పడుచున్నాఁడను. ఇఁక వీరరాజుపంతులు గారి వాదమునకు నేను బ్రతికూలుఁడనుగానే యున్నాఁడను. ప్రధానముగా నిందులకే యిప్పుడు నే నీవ్యాసము వ్రాయ నుద్యోగింపవలసెను. వీరరాజు పంతులుగారి వాదము నెడ నాకుఁ గలప్రాతికూల్యమును ముందు దెలిపి పిదప శాసనసమన్వయము నెడ రామయ్య పంతులుగారితో నాకుఁ గలవేర్పాటును వివరింతును.

వీరరాజుపంతులుగారు తమ తొలివ్యాసమున నన్నిచోడఁడు నన్నియకుఁ దర్వాతివాఁ డని వ్రాసినవారి వాదములను గొన్నింటిని జక్కఁగానే ఖండించిరి. కాని యాతఁడు నన్నియకంటెఁ బ్రాచీనుఁ డని సమర్థించుటకుఁ గాఁ దాము ఖండించిన వాదములకంటె దుర్బలము లైన వాదములను గొన్నింటి నందుఁ గొని తెచ్చినారు. వా రిట్లు వ్రాయుచున్నారు:—

"ఒక కవికాలమును నిశ్చయించుటకు నిరాక్షేపము లైన శాసనాది దృష్టాంతము లెవ్వియు లభింపనినాఁడు అతని కవిత్వమునుబట్టి యతనికాల మును నిర్ణయింపవలసి యుండు ననుట చారిత్రవేత్తలకు నూత్నవిషయము గాదు. ఇప్పు డద్దానిఁ బట్టి యాతఁ డెప్పటివాఁ డైయుండునో కనుఁగొందము." అని యాతనికాలము నిర్ణయించుటకుఁ బండ్రెండుసాధనములఁ జూపిరి. అవి యేవో యొక్కటొక్కటిగా ముందుఁ జూపుచు వానిపై నాయాక్షేపము లెత్తిఁగింతును.

1. కవిగారు, వీరభద్రరావుగారు నందలికవిత్వము మిక్కిలి ప్రాచీన మని తోఁచు ననుట—

ప్రాచీనము కాదని యెవ్వరు ననుట లేదు. నన్నియ కింకను బ్రాచీన మనుట కాధారము లేదని పలువుర మనుచున్నారము.

2 కుమారసంభవ గ్రంథారంభమున మూర్తిత్రయము, భాస్కర, గజానన, షణ్ముఖ, మార, గౌరీ, సరస్వతీ స్తోత్రములు వేర్వేరుపద్యములఁ గావింపఁ బడి నవి. ఆంధ్రభారతము మొదట శ్లోకరూపమున నున్న త్రిమూర్తిస్తుతి రాజనరేంద్రున కన్వయించున ట్లొనర్చిన నన్నియభట్టు, చిరకాలమునుండి పరంపరగా

వచ్చుచున్న యీ పూర్వస్తోత్రపద్ధతిని విడిచిపెట్టలేక దానిని సంగ్రహించి యుప తారిక నడుచు—

"హరిహరాజగజాననార్క షడాస్యమార । సరస్వతీ గిరిసుతాదిక దేవతా తతికి న్నమస్కృతిఁ జేసి - - - - "

అని సగము పద్యములో నంద ఱదేవతలను జేర్చి వారి కంద ఱకు నొకటే నమస్కారము గావించినట్లును, పిమ్మట నది క్రమక్రమముగా మాఱిపోయినట్లును గానవచ్చెడి"

ఇది బలాత్కల్పితమయ్యును బొందకున్నది. నన్నిచోడని స్తోత్రరీతిని నన్నియ యనుకరించె ననుటకై నన్నియపద్యమునే వీరరాజుపంతులుగారు మార్పులకు సాహసించినారు. "హరిహరాజగజాననార్క షడాస్యమాతృసరస్వతీ" యని నన్నియరచన ముండఁగా (వీరరాజుపంతులుగారును "మార" అని పాఠము వ్రాఁతప్రతులలోఁ జూడలేదనుచునే యున్నారు. ఇందులకై పనిఁబూని నేనును వెదకితిని. సర్వత్ర "మాతృ" అనియే కలదు. అయినను) "షడాస్య మార సరస్వతీ" యని మార్చిరి. ఇట్లు మార్పు జరిపినను వారి యభీష్టము నెఱవేఱకపోఁగాఁ బ్రతికూలసిద్ధాంతమే పై పెచ్చు వచ్చుచున్నది. ఎట్లనఁగా:—

నన్నియపద్యమున 'మార' పాఠము నంగీకరించినను ఒకరి నింకొక రను కరించి రనుట నంగీకరించినను ప్రాచీనుఁడైన నన్నియ "హరిహరాజగజాననే" త్యాదివిధమున దేవతలనందఱను నొక్కపద్యమున స్తుతింపఁగా దానిఁ జూచి కుమారసంభవకథను బ్రపంచించి ప్రబంధశయ్యతో రచించుచున్న నన్నిచోడఁడు ఒక్కొక్కరి కొక్కొక్కపద్యము చొప్పునఁ బెంచి స్తుతి నెఱపినాఁడనుట సంగతమై యుండును గాని వీరరాజుపంతులుగారు చెప్పినట్లనుట సంగతము గాదు. నాతలఁపేమనఁగా:—'మార' పాఠము సరిగాదు. ఒకరి నింకొక రను కరించిరనికూడ నిర్ణయింపఁగాదు.

3. చోడకవి తనకావ్యము షట్త్రింశదలంకారాలంకృతం బనుట—"పదియవ శతాబ్దివాఁడైన దండినఱకు నీయలంకారముల సంఖ్య నిలిచియుండి తరువాతఁ గ్రమముగాఁ బెరుఁగుచు, పండ్రెండవశతాబ్దివాఁడైన మమ్మటునినాఁటికి ఱువది దాఁక వృద్ధియైనట్లు గానఁబడుచున్నది. కావున నిదియు నాతఁడు పూర్వుఁ డనుటకుఁ గొంత తోడుపడుచున్నది."

దండి పదియవశతాబ్దివాఁడు గాఁడు. పదియవశతాబ్ది కింకను బూర్వమే యలంకారముల షట్త్రింశత్త్వము పెరిఁగినది. నన్నిచోడఁ డొకప్రాచీనాలంకారి

కుని మతముబట్టి యిట్లు చెప్పినాఁ డనఁదగును గాని యలంకారములసంఖ్య షట్త్రింశత్తుగా నుండినకాలముననే యాతఁ డున్నాఁ డని తలంపరాదు. అట్లయిన నాకాల మింకను బూర్వమునకుఁ బోయి నన్నిచోడని గందరగోళమునకుఁ జేర్చును.

4. "అట్లువోలె, పగిదివోలె, కరణివోలె, మాడ్కివోలె, భంగివోలె, ఇత్యాది (పురాతన) ప్రయోగము లిక్కవిగ్రంథమున లెక్కకు మిక్కిలి యున్నవి. నన్నయగ్రంథమున "అట్లపోలె" అనున దొక్కటియు, తిక్కనవానియందు "ఇట్లువోలె" అనునదియుఁ గానఁబడుచున్నవి. నన్నయనాఁటినుండియే వీనికిఁ బ్రచారము విరళమైనట్లు తోఁచెడిని. పాల్కురికి సోమన మాత్రము శివభక్తుఁ డగునీతనియెడలఁ గలభక్తి గౌరవాదులచే "కరణియుఁబోలె" "భంగియుఁ బోలె" నిత్యాదిగ నచ్చటచ్చటఁ బ్రయోగించెను."

ఈవాద మెంతో వింతగా నున్నది. పయిప్రయోగములు నన్నయతిక్కన కృతులలోఁ గూడఁ జూచితి మని వీరరాజుపంతులుగారు వ్రాయుచున్నారు. నే నిటీవల నితరకృతులలోఁగూడఁ జూచితిని. ఇట్లుండఁగా నిది పురాతన మని కుండలీకరించి పంతులుగారు వ్రాయుట వింత. మఱియు వీని ప్రచారము నన్నయ నాఁటినుండియే విరళమైన దనియు వ్రాసిరి!! అంతకుఁ బూర్వము బహుళముగా నుండుటను వీ రెఱిఁగిరా? ఎట్లు? సోమనమాత్రము నన్నిచోడనిమీఁది గౌరవముచే నాప్రయోగములను బాటించె ననుట మఱియు వింత! సోమన నన్నిచోడని కంటె నర్వాచీనుఁడని వీరెట్లు నిరూపింపఁ గల్గిరి? పండ్రెండవశతాబ్దిలోనివాఁడు సోమన బహుళముగా నీప్రయోగమును బాటింపఁగా నిది నన్నయకుఁ బూర్వపు దనియు నన్నయనాఁటి కిది విరళమైన దనియు ననుట సంగతమా? నాతలం పేమనఁగా:—శివకవులు వీనిని బహుళముగాఁ బ్రయోగించిరి. ఇతరుల కృతులలోఁ గ్వాచిత్కముగా నున్నవి.

5. ఇక్కవిగ్రంథమున సంస్కృతాంధ్రకర్ణాటాది వివిధభాషా విమిశ్రములైన సమాసములు గానవచ్చుచున్నవి. ఇవి యాతని ప్రాచీనతను జాటుచున్నవి."

అని కొన్ని ప్రయోగములను వీరరాజుపంతులుగారు చూపిరి. అవి ప్రాచీనతను జాటుచుండె ననుట సంగతమే కాని నన్నయకంటెను బ్రాచీనతను జాటుచున్న వనఁ గాదు. ఉపక్రమమున పంతులుగా రిట్లు సామాన్యముగాఁ బ్రాచీనతను జాటుచున్న వన్నను మీఁద నన్నయకంటెఁ బ్రాచీనతఁ జాటు

చున్నట్లే నిర్వహింపఁ బూనినారు. ఇక్కడ మీరు చూపినపదములలో "విసుర్వణము కర్ణాటభాషాసంబంధి యగుపదము" అని కలదు. దీనిని గూర్చి శ్రీసాంబమూర్తిశాస్త్రులుగారు, కవిరాజు నీలాద్రిరాజుగారు నిదివఱకెఁ గొంత చర్చ సెలిపినారు. వారితోపాటు నేనును దీని సంస్కృతభాషాసంబంధమగు పదమునుగాఁ దలఁచుచున్నాఁడను. పాల్కురికి సోమనాథుని రచనలోను క్రీ. పండ్రెండవ శతాబ్దిలోని దగు గుంటూరిజిల్లాశాసనము సౌత్ ఇండియన్ ఇన్‌స్క్రిప్షన్సు వాల్యుం IV నెం. 672 పు. 205 శక. 1061 లోను గూడ నీపదము కలదు. ~~ఈవిషయము మీరు కొంచెము తెలుపఁగోరుచున్నాను~~* వీ రిప్పుడు చూపిన ప్రయోగముల వంటి ప్రయోగములు పాల్కురికి సోమనాథుని గ్రంథములోఁ గుప్పతెప్పలుగా నున్నవి. ఇట్టివి శివకవులచే బహుళముగాఁ బ్రయోగింపఁ బడుచు వచ్చినవి. ~~ఈ విషయము విపులముగా వేఱొకచోట తెలుప నున్నాఁడను.~~ వీనిఁ బట్టి చోడఁడు నన్నయకంటెఁ బ్రాచీనుఁ డని సాధింపఁ గాదు.

---

* దీనినిగూర్చి శాసనవిశేషములు అనుపుస్తకములో నే నిట్లు వ్రాసితిని.

నెం, 672, పు 205, శక. 1061.

ఉ. హారతుషారశంఖ విమలాభ్ర మహోజ్జ్వలకీర్తిఁ జాలఁ బొ
ల్పారిన యుద్ధమండలిక నగ్రసుతుండగు మన్మముండఁడా
చారపరుండు నాదెండ్లఁ (?) జారుతరం బగు వెండికొండనా
గౌరి శశాంకమౌళికి విసుర్వనతో గుడినిల్పె భక్తునన్."
ఉ. మేరుగుణావతారుఁ డగు మేడనికిం గలుహారగంధి అం
భోరుహనేత్రి అవ్వయ విభూషణి నాఁదగు మేడమాంబకున్
గారవలీలఁబుట్టి గుణగౌరవసంపద విస్తరిల్లి గాం
ధారికి సీతకున్ శచికి ధానధికం బని ప్రస్తుతింపఁగాన్."

ఇందు మొదటి పద్యము నాల్గవచరణమున శాసనాక్షరములఁ జదివినవారు తప్పుగాఁ జదివి యుందు రనుకొనెదను. గౌరి యనుచోట "గౌరి" యుండును. 'విసుర్వనతో' అనుచోట 'విసుర్వణతో' అనియుండెనేమో? 'భక్తునన్' అని యుండునా? 'విసుర్వణ' అనియే యగునేని, నన్నయ, నన్నిచోడఁడు, పాల్కురికి సోమనాథుఁడు ప్రయోగించిన పదమది. రెండవపద్యములో 'కలుహారగంధి' యని కలదు. 'కల్హార' పదము సంస్కృతభాషలోఁ బ్రఖ్యాతముగా నున్నది. 'కహ్లార' మని కొంద అందురు. కలహారమని గాని కలుహారమనిగాని సంస్కృతభాషలోఁ గానరాదు. తెలుఁగునను గానరాదుగాని నన్నిచోడఁ డొక్కఁడు మాత్రము కుమారసంభవమున 'జలజాత కైరవోత్పలకలహారాది గంధంబులోలి సద్గంధములుగ' అని 'కలహార' పదము ప్రయోగించెను. ఇందు కలుహారపదమున్నది. నన్నిచోడఁడుగూడ 'కలుహారగంధి' యనియే వచించియుండవచ్చును. మఱియు 'అంభోరుహనేత్రి' యని కలదు. నేత్రాంతముకంటె జీషును పలువురు తెనుఁగుకవులు పాటించిరి. నన్నిచోడఁడును 'నేత్రి' యనెను.

6 ఉ. వేఁగు వసారసత్త్వగుణ విస్ఫురణం బరమేశ్వరోరుమా
మాంగమునందు మున్నుదయమై నియమస్థితిఁ గొల్చి ....కుమా. ప్ర. 4.

క. వీఁడేమి సేయుఁబంచిన, వాఁడుండఁగ నిక్కమునకు వధ్యుఁడుగా నా
ఖండలుఁడు గాక యేలిన, వాఁడు.........ద్విభా. 5:20

ఈపూర్ణాపూర్ణ బిందుప్రాసము నన్నయాదు లెవ్వరును గూర్చియుండ లేదు. నాచనసోముఁ డిట్టి ప్రాసమునుగూర్చె నని సంపాదకులు వ్రాసి యున్నారు గాని యది చెల్లదు. దీనిం గూర్చి పరిషత్పత్రికలోఁ బ్రకటింపఁ బడు "సోముని హరివంశము" అను శీర్షిక గలవిమర్శ గ్రంథమున విస్తరించి చర్చించి యున్నాను. కావున నిచ్చట మరలఁ జర్చింపక విడిచితిని. రామ కృష్ణకవిగారు భీమకవిప్రయోగమును గూడ నిచ్చిరి. భీమనకాల మిప్పటికిఁ దేలలేదు. అతఁ డెప్పటివాఁ డైనను శివభక్తుఁడే కావున పాల్కురికి సోమ నాథునివలెనే యాతఁడును శైవుఁ డైనచోడకవి వ్రాఁతయందుఁ గలప్రమాణ బుద్ధిచే, నీప్రాసము నంగీకరించి యట్లు వ్రాసియుండును."

దీనింగూర్చి చెప్పవలసినది చాలఁ గలదు. సంక్షిప్తముగా నించుక మాత్రమే యిక్కడ చెప్పుచున్నాఁడను. పాల్కురికి సోమనాథునికృతిలో నిట్టిప్రాసము గల దని "శివకవులు" అనువ్యాసములో నే నిదివఱకుఁ జూపి యున్నాఁడను. శివకవుల సంప్రదాయములో నిట్టివి సాధువు లని నాయుద్దే శము. నన్నియ కిది సమ్మతముగాదు. ఇట్టి పనులచేతనే నన్నియ వాగను శాసనుఁ డై యుండు నని నాతలంపు. నన్నియ భారతమున నీప్రాసములు కానరాకున్నను నాతనిసమకాలముననే రాజరాజు చనిపోయినపిదప రెండు మూఁ డేండ్లకే (శక 9:7) చెక్కింపఁబడిన పద్యశాసనములో నీప్రాసము గాన వచ్చుచున్నది. నన్నియనాఁటి కాసంప్రదాయ ముత్సన్నము గాలేదు. ఇది చూచునది.

"నిజభుజప్రధాని బెజయితదేవని కూఁతుసరియె పోల్పఁ గాంతలెందు"

ఈ ప్రాసము నన్నిచోడని ప్రాసమువంటిదే కదా! నన్నియ త్రోవనం గీకరింపక శివకవులు పూర్ణార్ధానుస్వారప్రాసమును బాటించిరి. దీనిచే నన్ని చోడఁడు నన్నియకంటెఁ బ్రాచీనుఁ డనుట సాధితము గాదు నన్నియకు సమ కాలముననను, దర్వాతికాలముననను గూడఁ బ్రాసమునవచ్చుచున్నది గదా!

7. అథర్వణాచార్యుఁడు నన్నియభట్టునకుఁ బూర్వుఁడని కొందఱును దిక్కనకుఁ గొంచెము పూర్వుఁ డని కొందఱును వ్రాసియున్నారు. ఈతఁడు తన ఛందమున—

క. మగణమ్ము గదియ రగణము, వగనక కృతిమొదట నిలుపు వానికి మరణం
బగునిక్కమండ్రు బుడియండె, యగుననియిడి "తొల్లి" వెంకణాదిత్యుఁడనిన్.

అని వ్రాసినాఁ డని మా. రామకృష్ణకవిగారు కుమారసంభవ గ్రంథ పీఠికయం దుదాహరించినారు. వీరేశలింగము పంతులుగారు సయితము కవి చరిత్రమునఁ బైపద్య మధర్వణుఁడు వ్రాసె నని వ్రాసియున్నారు. పై పద్యమున "తొల్లి" అనుపదము గాన నగుచున్నది. ఇది కొన్ని వందల యేండ్లకు ముం దున్న కాలమును దెలుపు పదముగా మనవారు ప్రయోగింతురు.

క. నరనుతుఁడు తొల్లి నలుఁ డను, ధరణీశుఁడు - నన్నియ. (ఇది యుగములనాఁటి కాలమును దెలుపు పదము).

గీ. తొల్లి నాలాయనియనంగ దొరయు నింద్ర। సేన పాంచాలి—(ఇది యు నించు మించుగ నట్టిదే.)

ఇవ్విధమునఁ బ్రాచీనచారిత్రములఁ దెలుపు నీ తొల్లి అనుపదము ప్రయోగించిన యధర్వణుఁడు తిక్కనకు సమకాలికుఁ డనుకొనకున్నను వెంకణాదిత్య (నన్నిచోడ) కవి యధర్వణునకు నాలు గైదువందల యేండ్లకుఁ బూర్వమున నైన నుండకుండ నాతఁ డాపదమును బ్రయోగింపఁ డనియు, కావుననే చోడ కవి నన్నియకు మిక్కిలియుఁ బూర్వుఁ డై యుండు ననియుఁ దలంపఁదగును."

ఇం దసంబద్ధము లనేకము లున్నవి. భీమకవికాల మెట్లు తేలలేదో యధర్వణునికాలము నట్లే తేలలేదు. అధర్వణకారిక లను త్రిలింగశబ్దానుశాసనమును జూడఁగా నాతఁడు ప్రాచీనుఁడుగాఁ దోఁచకున్నాఁడు. అనిశ్చిత మైన యాతని విషయము నాధారముగాఁ గొనుట యుక్తము గాదు. మఱియు రామకృష్ణకవిగా రుదాహరించిన పైపద్యము నే నెఱిఁగినంతవఱకు లక్షణగ్రంథములలో నెక్కడను గానరాలేదు. నేను దీనిఁ గూర్చి శ్రీకవిగారిని బలుదడవ లడిగితిని. తమదగ్గఱ నధర్వణచ్ఛందస్సు కల దనియు దానినుండి యీపద్యము నుదాహరించితి మనియు వా రనిరి. ఆగ్రంథము వెల్వడిన తర్వాత నాయధర్వణుని గూర్చి విశేషము లెఱుఁగఁగలమేమో కాని యిప్పు డేమియు నిర్ణయింపఁ జాలము. కం వీ. గారు కవిగారిపేరు చెప్పకుండ దాని నుదాహరించిరి, కాని; వారు వేఱొకచోట దానిఁ జూచి యెఱుఁగరు. ఆపద్య మధర్వణుని కృతిలోఁ గానవచ్చినను నందుఁ గల "తొల్లి" యుగములనాఁటి ప్రాచీనకాలమును దెలుపునది గాదు. వీరరాజుపంతులుగా రాపదము యుగములనాఁటి కాలము ను దెలుపునది యని వ్రాసియుఁ దదనుగుణముగాఁ బ్రయోగములఁ జూ

పియు నన్నిచోడనియెడఁ గొన్నివందలయేండ్ల ప్రాచీనతకే తృప్తిచెందినారు. "తొల్లి" పదము భూతకాలసామాన్యమును దెలుపునదే కాని, యుగములనాఁటియో వందలనాఁటియో భూతకాలమును మాత్రమే తెలుపునది గాదు. "వెండియుఁ, దొల్లిటి, యిప్పటి" ఇత్యాదులు పెక్కులు ప్రయోగములు 'తొల్లిటి' భూతకాలసామాన్య వాచిత్వమును దెలుపునవి కలవు. నన్నియనాఁటి శాసనపద్య మిది చదువఁదగును.

సీ. శ్రీవిష్ణువర్ధన భూవిభుదయిఁ భూమిదేవిబోల్ రేవలదేవి కనిన
సోమలదేవి గుణారామ జగదేకసున్దరి మత్తేభమందగమన
దొల్లి భీమేశ్వరవల్లభునకు సితమణి [బన్ధమి]చ్చె నన్మణియుతముగ
నురువిచ్చె గంగనాం బరువడి వినివారిం బుకుడిం[చున]ట్లు[యా]సరసిజాస్య
గనకరచితరుచిర కల్పావనీరుహ, కుసుమ మిచ్చెఁ దనకు ననము వెరుగ
వెణ్డిగుణ్డాకొసఖణ్డిత ద్యుతిదీప, మమరనిచ్చె విపులకమలనేత్రి.

ఇందు తొల్లి యుగములనాఁటియొండె వందలనాఁటియొండెఁ బ్రాచీన కాలమును దెలుపునది గాదు. పూర్వకాలమును మాత్రమే (ఈపూర్వత ఎంత యెక్కువైనను నలుపది యేఁబది యేండ్లకంటె మించదు. కొన్ని మాసములయి నను గావచ్చును.) దెలుపుచున్నది. ఏవిధమునను బయిపద్యము వీరరాజుపంతులుగారి వాదమునకుఁ దోడ్పడఁ జాలకున్నది.

8. "నిబుబుతి వారిమాయల కనిం బ్రతిమాయ లొనర్చి" ఇందు నిర్బుతి అనుపదము నాలుగు లఘువర్ణములుగాఁ గవి ప్రయోగించినాఁడు. ఇది వేదోచ్చారణము ననుసరించి కాళిదాసుఁడు త్రియమ్బకం అని ప్రయోగించినట్లే మనకవీంద్రుఁడును బ్రయోగించె నని తోఁచుచున్నది. "ఇది యీతని పురాతనత్వమును ఘోషించుచున్నది."

అని పంతులుగారు వ్రాసిరి. కాని యందే మరల వారు వ్రాఁతప్రతి యందు నిర్బృతి అని యున్నది. ఇట్లున్నను నిబురుతి యను నుచ్చారణమునే కవి గ్రహించియుండు నని తోఁచెడి. నిర్బృతియు అని యుండఁ గూడదా యని కొంద ఱందురు. కాని నన్నియ నన్నిచోడుల "యు" వర్ణప్రయోగములు సామాన్యములు గావు అని వ్రాసిరి. నన్నిచోడుఁడు నిబురుతి అని ప్రయో గించినను నది నన్నయకంటె నాతఁడు ప్రాచీనుఁ డని తెలుపఁజాలదు. అది యాతఁడు వైదికోచ్చారణమును గ్రహించె నని మాత్ర మెఱిఁగించును. ఇంతకును మనకుఁ బ్రమాణమైన వ్రాఁతప్రతిలోఁ నిర్బృతి అనియే యుండఁగా వీరరాజు

పంతులుగారు 'నిబుగుతి' అనుకల్పిత పాఠమును గైకొనుటయు నదియే కవి ప్రయుక్తమై యుండు ననుటయు సంగతముగా నాకుఁ దోఁపకున్నది. నిరృతియు అనుటయే సముచితము. పూర్వపద్యము చూడఁ దగును.

క. అయిరువురు బహురాక్షస, మాయావిదులగు డెఱింగి మార్గ్యానుమనిర
మ్మాయనుచుఁ బంచె నిఱ (ఋ?) తిను, పాయజ్ఞనేకసమరపరిణతునజితున్.

చ. నిరృతి (యు?) వారి మాయల కనిం బ్రతిమాయ లొనర్చి - - - -

వ. అంత నారణి దుర్వారులు నిఱ (ఋ) తితో - - - - - -

ఇక్కడ ముందువెనుకల నిరృతిపదమే ప్రయుక్తమైనది. నడుమనున్నది గూడ నట్టిదే యగుననుట సమంజసము. నిరృతియు, అనుట యర్థానుగుణము తత్కాల రచనానుగుణమును. 'నిరృతివారి మాయల' యని వ్రాఁతలో నుండఁగా నక్షరలోపము (యు?) అని యొకయక్షరము చేర్చినంతనే చక్కఁగా సరిపడుచుండఁగా దానిని విడిచి 'నిరృతి'ని 'నిబుగుతి' యని యెక్కువమార్పు చేయుట యుక్తము గాదు. ఆ పదము జతకూర్చినను నది భాషలో నప్రతీతమైనది. ఇట్టివానిచే నన్నిచోడుఁడు నన్నయకంటెఁ బ్రాచీనుఁడని సాధించుట సాహసము.

9. నన్నిచోడఁ డొద్దియే నొకవిషయమును వర్ణించి వర్ణించి "అని యనేక ప్రకారంబుల వర్ణింపఁ దగిన వర్ణనల కెక్కి" అని యనేక ప్రకారంబుల.——— నమరి" ఇత్యాదిగ వ్రాయుచుండును. ఇవ్వచనముల శక్తిఁ జూడ, పురాతన యక్షగానాదులయందుఁబోలె వీనియందును బ్రాచీనత గోచరించుచున్నది."

ఇట్టిరచన పాల్కురికి సోమనాథుని కృతులలోఁ బెక్కుచోట్ల నున్నది. నన్నయకును బురాతనములైన యక్షగానములు గానవచ్చినవా? మున్నూఱేండ్లకుఁ బూర్వమునఁ దెనుఁగున యక్షగానము లేవిగలవో నేనెఱుంగఁ జాలకున్నాను!

10 సంఖ్యగలది బహుకవిసాధారణ మగుటచే దానిఁగూర్చి చర్చ యనావశ్యకము.

11. సీ. కాలంబుగూడజగంబు లేర్చుట యెంత యల పనిహాయలోచనాగ్ని 'నుఱుచు'
వనరాశిఁ దగు మొత్తఁదన మొర్గి యేచుడే బలమునీ బాడబానలముఁ 'ద్రెగడు'
మార్వెట్టనోపని మ్రాఁకు లేర్చుట యెంత వా లగునని వనహిమ్న "నవ్వుఁ"
గలితనం బెఱుఁగని కులగిరు లేర్చుడే వాఁడిమి యని పవి పలనిఁ "బలుకు"
నెలమిఁగోమలమగుతోవ లేర్చుటెంత, తనదుతీవ్రత్వ మునితీవ్రధాముఁ నెత్తుఁ
దనకుఁ బ్రతి లేకదిక్కులు దాఁకి వెలుఁగుఁ, దారకాసురుఘోరప్రతాపవహ్ని.

ఇందు మొదటి పాదములోని 'ఉఱుకు' అనునది తక్కిన పాదములలోని తెగడు, సవ్వు మొదలగు వానివలెఁ గేవలధాతురూపము. పద్యమునఁ గర్త ప్రతాపవహ్ని. నన్నియభట్టు "ఉఱఁకు (డు?) సురేంద్రసైన బలియుండు హిడింబుఁడు వాని ఘాతికిన్, వెఱవని వారలుం గలరె—" అని ప్రయోగించి నాఁడు. కాని యతఁడే నన్నిచోడని యితరము లగు 'ఉఱరు' ఉఱక ఇత్యాది రూపములం బట్టి దీనిని సయితము 'ఉఱు' ధాతువ్యతిరేకార్థముగా గ్రహించెనో లేక ప్రత్యేకధాతువుగానే ప్రయోగించెనో, నిర్ణయింపరాని సందిగ్ధస్థలమున దీనిని బెట్టినాఁడు. ఎట్లయిన నేమి? తరువాతికవులు దీనిని 'ఉఱుకు' అని కేవల ధాతువుగాఁ బ్రయోగింపమి నీధాతువు మన నన్నిచోడునివనుండి నన్నియకడకు సందిగ్ధరూపముతో వచ్చి పిమ్మట ముచ్చుముడిగె ననితోఁచుచున్నది.

పై ఉఱుకు శబ్దము వలెనే నన్నిచోడని వలననుండి నన్నియచే వేఱువిధముగ గ్రహింపఁ బడినట్లు దోఁచు విచిత్రప్రయోగము నింకొకదానిని మాత్ర మిచ్చట నిచ్చెదను.

కాంచు డరుదయ్యెన్=కాంచుట + అరుదయ్యెన్; ఇచ్చుడాజి=ఇచ్చుట + ఆజి; ఒదవుడిదేమి=ఒదవుట + ఇదేమి."

ఉఱుకును గూర్చి పంతులుగారు వ్రాసినది సంగతము గాదు. నన్నియ నన్నిచోడనిఁ జూచి సందిగ్ధముగాఁ బ్రయోగించె ననుపంతులుగారి మాటలు దలక్రిందుచేసి నన్నిచోడఁడే నన్నియనుజూచి ప్రయోగించె నని యింకొకఁడు ననవచ్చును. అట్లుగా ననుట కేమియాధారము వారు చూపఁగలరు? ఆపద మప్పటి వాఙ్మయమున సాధారణముగా నుండుటచే నాయాకవు లట్లట్లు ప్రయోగించి రనుటబాగు. నన్నిచోడనినాఁట స్పష్టముగా నున్నపదము నన్నియ నాఁటికి సందిగ్ధరూపముతో వచ్చిన దనుట సాహసము. అది ఉఱుధాతువే యని నన్నియ నన్నిచోడాదుల ప్రయోగములు, ఉఱఁకు, ఉఱకు, ఉఱక, ఇత్యాదు లెఱిఁగించుచున్నవి. పంతులుగా రుదాహరించిన పద్యమున 'ఉఱ(ఁ?)కు కూడ వ్యతిరేకధాతు రూపముయియుండు నని నాతలంపు. "ఉఱుకు" అని కేవలధాతురూప ముండె ననుటకు దానిమీఁద నితరరూపము లెక్కడను గానరాకున్నవి. ఉఱకక, ఉఱకిన, ఇత్యాదులు గానరావుగదా! కుమారసంభవముద్రితప్రతిలో 'లోచనాగ్ని నుఱఁకు' అని సార్థానుస్వారముగానే యున్నది. పంతులుగారు నిరనుస్వారముగా నుదాహరించినారు.

ఇఁక – కాంచు దగునదెయ్యి – నిత్యాదిరూపములఁ గూర్చి పంతులుగారు సాహసపు సిద్ధాంతములు నెలకొల్పఁబూనినారు. భావార్థకపు టకు బదులు డు పెక్కుచోట్లఁ గానవచ్చుచున్నది. పెక్కు లిప్పటికి నున్నవి. దూఁకుడు, అద్దుడు, ఇత్యాదులు నేఁటి వ్యవహారమునఁ గూడఁ గాననగును. డము రూపము గూడ క్వాచిత్కముగ నిట్లేకలదు. ఒత్తడము, అద్దడము మొదలగునవి. ప్రాచీనకవులలో డము అసాధారణముగాను టము సాధారణముగాను గానవచ్చుచున్నవి. సందర్భానుగుణముగా నన్నయ నన్నిచోడుఁడుంచనకే తిక్కనాదు లా యారూపములను ప్రయోగించిరి. "నన్నిచోడని గ్రంథమున భావార్థకటకారము తనకుఁ బరమైన యచ్చుతో సంబంధింపఁబడినపుడే యిట్టి డత్వముఁ జెందుచున్నట్లు గాన్పించుచున్నది. (గ్రంథసూచియుఁ జూడుఁడు) అని పంతులుగారు వ్రాసిరి కాని గ్రంథమంతయుఁ జూడఁగాఁ బంతులుగారి వ్రాఁతకుఁ బ్రతికూలము లగుప్రయోగములు పెక్కులు గానవచ్చుచున్నవి. ఈ క్రిందివానిని జూడుఁడు:—

పావకో, త్కరశిఖులం బురాంగభవ కాలహరంబు కుటుమి పెద్ద.

కుమా. ప్ర. భా. 862 పద్యము.

మఱచితో కాలకాలు నజమస్తక సంహారునిట్లు పల్కుటే, ప్ర 171. పద్యము

నిగ్రహంబు వడుటేమి పనియని - ప్ర. 214 వచనము.

నీ, వప్పరమేశు సేయుటనయంబు - ప్ర. ౯5౹. పద్యము.

రజ్జునె, ప్పుడునది. ద్వి - 516.

అచ్చులో నిట్లున్నవి వ్రాఁతప్రతిలో నిట్లు లేవని పంతులుగారు నిరూపింపఁగలరేమో! వ్రాఁతప్రతిలో వేఱువిధముగా నుండుటను వారు చూచి యున్నచో నది తెలిపియుండవలయునుగదా!

కాలంబుగూడ ఇత్యాదిపద్యములో, అచ్చులో, "యేమ టేబలమని–కులగిరు లేర్చుటేవాఁడిమి" అని యుండఁగాఁ బంతులుగారు "యేమ డేబలమని', కులగిరు లేర్చుడేవాఁడిమి, యని మార్చి యుదాహరించినారు. మఱియు 'రజ్జు చెప్పుటునది', యుండఁగా, రజ్జుచెప్పుడదియు నని యుదాహరించిరి. వ్రాఁతప్రతిని బట్టియే వా రట్లు మార్చిరేమోకదా! తెలుపరయిరి!

నన్నిచోడుఁడొకవేళ హల్లుపరమైనపుడు చేయుడు ఇత్యాదివిధముల డుతో భావార్థకములఁ బ్రయోగింపకున్నను (పంతులుగారన్నట్లే లేఖక మహా

శ నములు పూర్చి వేయుటచేఁ గానరాకుండెనేమో) నది యాతని కసమ్మత మనుట హాస్యముగాదు. అట్లయినను నాతఁడు నన్నయప్రయోగరీతిని గుర్తింపఁజాలక దానిని విడిచిపెట్టె నని పంతులుగారివలెనే యింకొకరు ననవచ్చును. అట్లు కాదనుట కాధార మేమి? నన్నయకంటె నన్నిచోడఁడు ప్రాచీనుఁ డని నిరూపించుట కిట్టివి తోడ్పడునా? ఇట్టిప్రయోగములు తిక్కన కూడఁ బ్రయోగించె నని పంతులుగారు చూపుటచే నది యాతిక్కననాఁటికిఁ గూడ సాధారణమై యున్న దని యేర్పడుచుండెఁ గదా! దీని నాధారముగాఁ గొని నన్నిచోడఁడు నన్నయకంటెఁ బూర్వుఁడని సాధించుట యెట్లో! నన్నిచోడఁడు సాధుప్రయోగకర్త యని తద్రహస్యము గుర్తింప నేర్చినవాఁడు తిక్కన యని వారి నిర్వచను సంభావించి యారహస్య మెఱుఁగఁ జాలమిపోలె నన్నియకుఁ జెప్పి యాతనిఁ జిన్న పుచ్చుచు నిక్కడ పంతులుగారు వ్రాసినవ్రాఁత హాస్యముగా నాకుఁ దోఁచుచున్నది.

మఱియుఁ బంతులుగారు "నన్నయభట్టారకుని సంస్కారమునకుఁ దర్వాతఁ బైకవిత్వమునంటి కవిత్వమును జెప్పిన యాంధ్రకవి యొక్కఁడును గానరాఁడు. కావున నితఁడు నన్నియకుఁ దరువాతివాఁడై యుండఁడు" అని వ్రాసిరి. నన్నియకుఁ బూర్వ మిట్టికవితఁ జెప్పినవారు పెక్కురు గానవచ్చిరా? ఇదవింత గదా? పాల్కురికి సోమనాథుఁ డెప్పటివాఁడు?

12. వక్రము—"ఇది నన్నియకుఁ బూర్వము వ్యవహారములో నున్న శబ్ద మనియు, తత్పూర్వశాసనములందు మాత్రమే కానవచ్చుచున్న దనియు, శాసనపరిశోధకుల యభిప్రాయమై యున్నది. ఇప్పదము మనప్రాచీన కవిరాజు గ్రంథమునఁ గానవచ్చుచున్నది. శుక్రుండు "వక్రంబై" ఇప్పద మీ యర్థమున నన్నియాదులగ్రంథమునఁ గానరాక మనరాజకవి, నన్నియభట్టారకునకు మిక్కిలిఁ బూర్వుఁడై యుండెనని వేనోళ్లఁ జాటి చెప్పుచున్నది."

పంతులుగారిక్రిందిప్రయోగమును స్మరింపఁ గోరుచున్నాను. 'ఆకార్యము నిర్వక్రముగా నెఱవేఱెను.' అతఁ డవక్రవిక్రముఁడు — ఇత్యాది విధముల నేఁటి రచనలలోఁ గూడ వక్రపదము నన్నిచోడఁ డేయర్థమునఁ బ్రయోగించెనో యాయర్థముననే ప్రయుక్త మగుచున్నది. వక్రంబు వచ్చువారు,' వక్రంబువచ్చిన అను పలుకుబడి నేఁడు గానరాదు గాని వక్రమనుపదము నేఁడు నున్నది. శాసనములలోని 'వక్రంబువచ్చు' మిక్కిలి ప్రాచీన మైనదే. దానిని నన్నిచోడఁడు ప్రయోగింపలేదు. ఈపదము నన్నియకంటె నన్నిచోడఁడు

మిక్కిలి ప్రాచీనుఁ డని వేయినోళ్లఁ జాటుచున్న దనుట యాశ్చర్యము గొల్పు చున్నది.

శ్రీ వసుకుదుటి వీరరాజు పంతులుగారు నన్నిచోడుఁడు నన్నయకంటెఁ బ్రాచీనుఁ డనుటకు వెలయించిన సాధనముల దౌర్బల్యమును లఘుతరముగా నిక్కడ వివరించితిని. శ్రీ రామయ్య పంతులుగా రిప్పుడు ప్రకటించిన శాసన విషయము నెత్తుకొనకయే యున్నను గూడ నే నిప్పుడు వివర్శించినవిధముగ వీరరాజు పంతులుగారు చూపిన యాధారములు నన్నిచోడని నన్నయకంటెఁ బ్రాచీనునిగా నిరూపింపనేరని వగుచున్నవని నానమ్మకము. ఇఁక నవ్వారి యులు ప్రమాణము.

ఇట్లయి యున్నను వీరరాజు పంతులుగారు (రక్తాక్షి శ్రావణ-కార్తిక మాసముల పరిషత్పత్రికలో) ప్రకటించిన వ్యాసమున నిట్లు వ్రాసినారు.

"భట్టారకమహాశయునకుఁ బూర్వము తెనుఁగునఁ గవిత్వమే లేదని విశ్వసించియున్న యాంధ్రులహృదయక్షేత్రములయందు 'అతనికి మున్ను తెనుఁగు కవిత గలదు' అనువాక్యబీజముల నావాపించుటయే మొదట దుర్ఘటమయ్యెను. ఎట్టకేలకుఁ బరిశోధనములు వెల్లివిరిసినకాలఁది నవి నాటుకొన 'అతనికిఁ బూర్వ మున్గ్రంథములు లేవు గాని స్వల్పముగఁ బాటలు పద్యములు నుండినవి' అను భావాంకురములు క్రమముగాఁ దలసూపెను. ఇట్టిచో 'నన్నయకు మున్ను ప్రబంధము లుండెడివి' అను పలుకుఁదీవలు రేకెత్తుటకుఁ గాలచక్ర మింకను దొరలవలయునేమో—నేఁటివఱకును నన్నిచోడకవి కాలమునుగూర్చి కావింపఁబడిన విమర్శనములయం దొక్కటియు నిర్బాధకమగు నొక్కయాధారముతో నైనఁ గూడినదిగా నుండలే దనియు నాతఁడు నన్నయకుఁ బూర్వుఁ డయియే యుండుననియు నిరూపించుచు నేనొక విమర్శమును వ్రాసితిని."

ఇక్కడ నన్నయభట్టారకునకుఁ బూర్వ మాంధ్రకవిత్వము లేదనుకొను చున్న సామాన్యలోకమును వీరరాజుపంతులుగారు గేలి గొనుచున్నారు. వాస్తవమున కిక్కడ నమాయిక మగులోకముగా దధిక్షేపింపఁ దగినది! నన్నయకుఁ బూర్వ మాంధ్రకవిత యున్నదనుట కాధారము లేమియు గోచరింపకున్నపుడు లోకమంతకుముం దాంధ్రకవిత లేదేమో యనుకొనెను. యుద్ధమల్లుని శాసనము దొరకొన్న పిదపఁ బద్యరచనము కల దనుకొనెను. మఱికొన్ని యాధారములచేఁ బాటలు పదములు మొదలయిన రచన లుండె ననుకొనెను. స్పష్టముగాఁ బ్రాచీనగ్రంథములు దొరకెనేని యవియుఁ గల వనుకొనును. ఇది

యుక్తమే కాదా! కాలచక్ర మింకను దొరలంగాఁ బంతులుగారు మొదలగువారిప్పు డాంధ్రులహృదయక్షేత్రములందు శేకెట్టింపఁ జూచుచున్న "నన్నియకు ముందు ప్రబంధము లుండెడివి" అనుపలుకుఁ దీనలు నైంద్రజాలిక విభ్రమములై యంతరింపఁ గలవేమో యని నే ననుమానపడుచున్నాను. ఐంద్రజాలికు లంగణమునందు బొటలో మామిడిపిక్క నాటఁగలరు. మొలక లెత్తింపఁగలరు. చిగు రెత్తింపఁగలరు. పూవులఁ బిందెలను బుట్టింపఁగలరు. కాని మాయికమైన యామామిడిపండొక యెండాఁక నిలువఁ గల్గదు. చిక్కించి నలుపుఁ జూడఁబోయిన రిక్తమగును గాదా!

క. మును మార్గకవిత లోకం, బున వెలయఁగ దేశికవితఁ బుట్టించి తెనుం
గున నిలిపి రంధ్రవిషయమునఁ, జనసత్యాశ్రయుని దొట్టి చాళుక్యనృపుల్.

అను పద్యమును నింద్రజాలపుఁ గుంచె విసరుతో మొలకెత్తిన "నన్నియకుఁ బూర్వ మంధ్రప్రబంధము లున్నవి" అనుభావాంకుర మాడించె కూలిపోయిన పిదప మాలిపోయినట్లే యయ్యెను ఇట్టిచో—

క. మును మార్గకవిత లోకం, బున వెలయఁగ దేశికవితఁ బుట్టించి తెనుం
గును నిలిపి రంధ్రవిషయం, బునఁ జనఁ జాళుక్యరాజు మొదలుగఁ బలువుర్.

అని బయల్పడిన యమాయికపద్యమునకు సముచితముగాఁ జెప్పఁదగిన యర్థమును పంతులుగారు సన్నగా జాఱవిడిచినారు. నన్నియభట్టున కాశ్రయమైన రాజరాజు మొదలగువారి నీపద్యము చెప్పుచున్నదని నేను భావించితిని. (రాజనరేంద్ర నవమశతాబ్దసంచిక చూడనగు) రామలింగారెడ్డిగారు నట్లే భావించిరి. పంతులుగారు దానిని పరిభావింపకున్నారు. మఱి వారు చెప్పు నర్థమేమో!

ఈపద్యము నన్నియ కాశ్రయమైన రాజరాజు మొదలగువారినే పేర్కొనుచున్న దని యిప్పుడు రామయ్య పంతులుగారు ప్రకటించిన శాసనమువలన మఱింత సుస్పష్టముగాఁ జెప్ప నొప్పుచున్నది. ఏలయనఁగా నాశాసనమును బట్టి నన్నిచోడఁడు రాజరాజునకు నూఱేండ్లకుఁ దర్వాతికాలమున వెలసిన వాఁడుగాఁ దెలియవచ్చుచున్నాఁడు. ఆ నూఱేండ్లకాలమున నంధ్రమున 'పలువుర్' కవులు తెలియవచ్చుచున్నారు.

వీరరాజు పంతులుగారు ద్వితీయవ్యాసమున నన్నిచోడని శబ్దపరికరసంపత్తినిగూర్చి వ్రాసినగ్రంథమునకు నేను మిక్కిలియుఁ బరితోషము చెందుచున్నాను. అది వారి భాషాపరిశ్రమను వేనోళ్లఁ జాటుచున్నది. అందుఁ

గొన్నింట నేను భిన్నాభిప్రాయము గలవాఁడను. కొన్నింట వారి యభిప్రాయమును బలపఱుచువాఁడను. మఱియొకప్పుడు నేనును నన్నిచోడని కావ్య విశేషములఁ గూర్చి కొంత వ్రాయ నుద్యోగించి యున్నాఁడను గాన యాయా విషయము లందుఁ జెప్పకుందును.

ఇఁక రామయ్య పంతులుగారు ప్రకటించిన శాసనమును గూర్చి నేను జెప్పఁ దలఁచినది సంగ్రహముగాఁ జెప్పుచున్నాఁడను:— రామయ్య పంతులు గారు శాసనము వంశవృక్షము నించుక తప్పుగాఁ జెప్పి రని నేననుకొనుచున్నాఁడను. వారిట్లు వంశవృక్షముం జూపిరి.




శాసనశ్లోకములఁ గూడఁ జూపుచున్నాఁడను.

తత్రసూర్యాన్మను - స్తస్మా దిక్ష్వాకు - స్తత్కులే నృపః
అదేవీ త్కరికాలాఖ్య చోడ - స్తస్యాన్వయే జని
చోడబల్లినృప - స్తస్మా న్నన్నిచోడ - స్తదాత్మజః
సూరభూప - స్సుతస్తస్య రాజరాజమహీపతేః .
తస్యానుజో ఘటంకారనృపో హంకారశంకరః -
తస్యచోడమహాదేవీప్రియా - తత్తనయోనయా
మల్లిదేవనృపో యత్రక్షాత్రధర్మా (ర్మో?) స్థలీమతే -
తస్యకాంతా మహాదేవీ - నన్నిచోడస్తయో స్సుతః
న్యగ్రహీదుగ్రవీరారి న్య (న?) గ్రహీద్విజయ శ్రియమ్ .
గంగాదేవి ప్రియాతస్య యాదేశ మతిచక్రమే -
తాభ్యాం భూచక్రశక్రో భూ న్మల్లిదేవ మహీశ్వరః -

పై శ్లోకములందు నేను జేసిన యన్వయమున కనుగుణముగాఁ దిర్యగ్రేఖ లుంచితిని. ఈవిధముగాఁ జూడఁగా వంశవృక్ష మీక్రిందివిధమున నేర్పడు చున్నది.




రామయ్యపంతులుగారు చూపిన వంశవృక్షమున రాజరాజు లేఁడు. శ్లోకములఁ జూడఁగా నేను జూపిన వంశవృక్షమే సరియైనదని యేర్పడఁగలదు. దీనిఁబట్టి వంశవృక్షమున నొకతర మెక్కువ యగుచున్నది.

రామయ్యపంతులుగారు, వంశమునఁ గడపటివాఁడును, శాసనము నెల కొల్పినవాఁడును, నగుమల్లిదేవుఁడు (శాసనమునఁ గాలనిర్దేశము లేకున్నను) శ. 1140 సంవత్సర ప్రాంతమువాఁ డగునని వ్రాసిరి. కాకతీయగణపతిదేవు నకుఁ బుణ్యముగా నాశాసనము నెలకొల్పఁబడినది కావునను గణపతిదేవుఁడు శక. 1140 సంవత్సర ప్రాంతకాలమున వెలనాఁడు జయించి శక. 1182 సం॥ దాఁక రాజ్య మేలినాఁడు గావునను, ప్రస్తుతశాసనకాలమును గణపతి వెల నాఁడు జయించినప్పటి కాలముగానె (శక. 1140) సామాన్యదృష్టిని రామయ్య పంతులుగా రట్లు వ్రాసిరి. ఈశాసనము గణపతి వెలనాఁడు జయించినకాలముననే వెలయింపఁబడిన దగునేని దయ్యాలరేవూరిశాసనమువలె నిదిగూడ గణపతిపేరనే యుండఁదగియుండును. కావున నిది యంతకుఁ గొంత తర్వాతి కాలమున వెలయింపఁబడినదయియుండు ననవచ్చును. ఆతర్వాతికాలము గణ పతియవసానకాలమగు శక. 1182-కు లోఁగా నెప్పుడేని కావచ్చుఁగదా!

పెదచెఱుకూరులోనే దొరకిన శాసనాంతరమును బట్టి యీకాలము శక 1170-1180 సం॥ దగ్గఱిదిగానే నిర్ణయింపఁదగిన దగుచున్నది.

ఇది చదువుఁడు:—ఓరియంటల్ లైబ్రరీలోని శాసనముల వాల్యూం నెం. 1, 792 పేజీ పెదచెఱుకూరికరణం నోరికృష్ణయ్యగారి యింట్లో ఉన్న తామ్రశాసనము. ప్రసక్తమైన భాగమే ఉదాహరించుచున్నాఁడను.

జాతశ్శ్రీకరికాల పార్థివకులే రత్నాకరే చంద్రవత్
శ్రీమద్రాజమహారాజ భూషణమణిః శ్రీమల్లిదేవాహ్వయః
నిస్త్రింశత్రుటితారిఘోటకభట స్తంబేరమగ్రామణీ
గ్రస్తిప్యాసి పిశాచభూతనికరశ్లాఘ్యప్రతాపోదయః
న్యగ్రహీదరిచతుర్విధసైన్యా
న్యగ్రహీదఖిల దిగ్జయలక్ష్మీన్
మల్లిదేవ జగతీపతిశక్ర
శ్చక్రనూనురివ చక్రిసహాయః.

తారారాట్కరవహ్నిభూమితమితే (1231) శాకాబ్దజాలేగతే, సాధారణేశ్వర వత్సరే శుభకరే మాఘాఖ్యమాసేసితే। షష్ఠేపర్వణి సోమవారసహితే సోమగ్రహోపక్రమే। కృత్వాస్నాన మనూన మంత్రవిధినా పాథోనిధే స్సన్నిధౌ। - - - పంచోత్తరశతఖారీపరిమేయ మహీం మగస్త్యనాథాయ। శ్రీమల్లిదేవనృపతిః ప్రాదాదిహానం(పం)డికుంట నామగ్రామే - - - -

రామయ్యపంతులుగారు ప్రకటించిన శాసనము నెలకొల్పిన మల్లిదేవుఁడే యీశాసనము నెలకొల్పిన మల్లిదేవుఁ డగును.

"న్యగ్రహీదగ్రవీరారీన్ అగ్రహీద్విజయశ్రియమ్। - - - తాభ్యాం భూచక్రశక్రోభూ న్మల్లిదేవమహీశ్వరః। (రామయ్యపంతులుగారు ప్రకటించిన శాసనము.)

"న్యగ్రహీ దరిచతుర్విధసైన్యాన్యగ్రహీ - దిత్యాదికముగు నీరెండవశాసనము శ్లోకమును జూడఁదగును. మఱియు రెండు శాసనములు నొక్కచోటివే. గణపతి చనిపోయిన తర్వాతిది గాన యీ రెండవశాసనమున గణపతి దేవునికిఁ బుణ్యము గానని లేదు. గణపతి చనిపోయిన తర్వాత నామల్లిదేవుఁడు తల యెత్తి స్వతంత్రుఁడై యుండును. ఈశాసనమునఁ దలిదండ్రుల పేర్లు లేవు గావున నీవిధమున నీమల్లిదేవుఁడే యామల్లిదేవుఁ డగుట గుర్తింపవలసెను.

శక 1221 సంవత్సరమున శాసనము నెలకొల్పిన యీమల్లిదేవుఁడు గణపతిదేవుని జీవితకాలమున నెలకొల్పిన శాసనాంతరము (మనప్రస్తుతశాసనము) శక 1170-1180 సంవత్సరముల సమీపకాలపు దగుననుట యసంగతము కానేరదుగదా! దీనిచే రామయ్యపంతులుగారు చెప్పినకాలముకంటె మన ప్రస్తుత శాసనము మఱి ముప్పదియేండ్లతర్వాతి దగుచున్నది. ఇట్లు ముప్పది యేండ్ల తర్వాతికి వచ్చినను, వారు వంశవృక్షమున నొకపురుషుని విడుచుటచేత నా ముప్పదియేండ్లు నాతనితరము కాలముక్రిందఁ గొట్టివేయఁగా రామయ్యపంతులుగారన్నట్టే ఘట్టకుటికాప్రభాతన్యాయమున మొదటి నన్నిచోడని కాలము శక 1040 ప్రాంతపుదే యగుచున్నది.

రామయ్యపంతులుగారు ప్రకటించిన శాసనములోని మొదటి నన్నిచోడఁడే కుమారసంభవకర్త యని నేనును నమ్ముచున్నాను. ఇందులకై యింకను శ్రీసోమశేఖరశర్మగారితోడ్పాటుతోఁ దెలుఁగుచోడుల శాసనము లెన్నికలవో వానిలో నెందఱు నన్నిచోడులు గలరో యెందఱు చోడబల్లులు గలరో యెందఱు మల్లిదేవులు గలరో వారి నందఱును, ఆశాసనములను శోధించి శోధించి చర్చించి చర్చించి చివర కిదమిత్థమని యిట్లు నిర్ణయించుకొన్నాను. ఇంతవఱకుఁ జేకూరిన శాసనములలో వీరుగాక వేఱొకరు మనకు సరివచ్చువారు కానరాలేదు. ఇంక నొక్కవిశేషము.

మన నన్నిచోడఁడు కుమారసంభవమును దనగురుఁడగు మల్లికార్జునకు సమర్పించెను. ఆమల్లికార్జునుఁడు శైవులలో నొకతెగయగు కాలాముఖులలోఁ జేరినవాఁడని శ్రీ రామకృష్ణకవిగారు నిరూపించిరి. ఆతఁడు బసవ మల్లికార్జున పండితారాధ్యులవంటి వీరశైవుఁడు గాఁడని కుమారసంభవముఁ జదివినవారెల్లరు నంగీకరింతురు. అందు శక్తిపూజ, మంజలార్చన, మొదలగు నాచారములు వీరశైవగర్హితములు కాలాముఖసమ్మతములు గానవచ్చుచున్నవి. కావునఁ గవిగారు నిరూపించినట్లు లామల్లికార్జునుఁడు గాలాముఖుఁడని నిశ్చయింపవచ్చును. ఇప్పు డిందు ముందు నిరూపించిన నన్నిచోడనికాలముననే (శక 1040 చేరువ) పెద్దచెఱుకూరికిఁ జేరికం గలగ్రామముననే (కొప్పరమున) ఒక మల్లికార్జునయోగి కాలాముఖుఁడు గలఁడు. అతనిని వీరేశలింగము పంతులుగారించుక స్మరించినారు. కాని వారు చెప్పిన చొప్పున నన్నిచోడనివిషయ మక్కడఁ జక్కఁబడకుండుటచే నది యాదృతము గాదయ్యెను. ఆమల్లికార్జునుఁడు తెలుఁగుచోడులచే నారాధితుఁ డయినాఁడు.

ఇది చదువుఁడు—కొప్పరుపుశాసనము. 195 సం॥ గవర్నమెంటు శాసనసంచయమున నున్నది.

"స్వస్తిశ్రీ....కావేరీతీర కరికాలకులరత్నప్రదీపాహితకుమారాంకుశ శ్రీమన్మహామండలేశ్వర కన్నరదేవచోడ మహీపాల స్సకలభూపాలతిలకః.

శ్లో. శ్రీకామచోడక్షితిపాలపుత్రః, ప్రత్యర్థికాంతాగళసూత్రదాత్రః।
రామాంబరీషాది లసచ్చరిత్రః, సూర్యాన్వయాంభోరుహషండమిత్రః॥
ఆసీత్తస్య కులప్రధానపదవీవిభ్రాజితశ్రీర్నిధి
ర్భాండాగార మహాధికారమహితః ప్రత్యక్షధర్మాత్మజః।
ధీమానీశ్వరనాయకస్య తనయో మారాభిధానః కృతీ
నిత్యం ధర్మనిబద్ధబుద్ధి రసకృత్పుణ్యక్రియావర్ధనః॥
శ్రీశైలప్రాగ్భాగే కస్మిక్షితిమహితే కొప్పరగ్రామే
ద్వాఖానితౌ తటాకౌ తేన స్వేతూపమాన ఘనసేతూ।
గిరిరామఖేందు గణితే శకభూపాబ్దే జయాబ్దకే చైత్రే
సూర్యగ్రహణనిమిత్తే కృతవాన్ తాన్ మహాధర్మాన్॥

అథనిజప్రధానినః పౌరుషమాదృత్య రాజకన్నరదేవ స్సమాగత్య అస్మిన్ పుణ్యతీర్థే సుప్రతిష్ఠితం సోమేశ్వరం నత్వా భక్తిప్రేరితమనా దేవాయైనం కొప్పరగ్రామం దత్తవాన్ - తదైవ తదనుజన్మా చోడబల్లిదేవః పూర్వదిశి క్రోశమాత్రే చీదెపల్లి నామగ్రామం ప్రాదాత్ ........

దాపయిత్వా తటాకౌ ద్వౌ దేవాయ తిదనంతరం
పాలూర్పురసముత్పన్నం ధృతకాలాముఖవ్రతమ్।
మల్లికార్జున మభ్యర్థ్య తస్మై తత్త్వార్థభావినే
సోమేశ్వరవరం స్థానం ప్రాదాదాచంద్రతారకమ్.

శక 1037 సంవత్సరమునఁ గామదేవచోడభూపాలుని కొడుకు లగు కన్నరదేవచోడ, చోడబల్లిదేవులు చేసిన ధర్మముల నీశాసనము చెప్పుచున్నది. కన్నరదేవుని భాండాగారికుఁడు కొప్పరగ్రామమున రెండుచెఱువులఁ ద్రవ్వించె నట! కన్నరదేవుఁ డందుల కానందించి యక్కడఁ బ్రతిష్ఠితుఁ డగు సోమేశ్వర దేవునకుఁ గొప్పరగ్రామము నొసఁగె నట. అతని యనుజన్ముఁ డగు చోడబల్లి దేవుఁడు చీదెపల్లి గ్రామము నొసఁగె నట. మఱియు నాతఁ డక్కడఁ ద్రవ్వించిన రెండుతటాకములను దేవున కిప్పించి యటు పయి పాలూరుపురమందు జన్మిం

చిన వాఁడను కాలాముఖప్రశేఖరుఁడు బూనినవాఁడును నగు మల్లికార్జునుని బ్రా ర్థించి తత్త్వార్థభావియగు నాయుసకో అకుం సోమేశ్వరునకు పనసు స్థానము నాచం ద్రార్కముగా నొసఁగెనట.

పెదచెఱుకూరిశాసనమున లెక్కింపఁబడిన విధమునఁ జోడబల్లికొడుకగు నన్నిచోడని (మననన్నిచోడకవి) కాలమున కీ శాసనకాలము సరిపచ్చుచున్నది. నన్నిచోడకవి గురువగు మల్లికార్జునుఁ డీతఁడు కావచ్చు ననుట మిక్కిలి సంగ తముగానుండును మఱియు నీశాసనములో కాలాముఖమల్లికార్జునునకు సోమే శ్వరవరము నిప్పించిన చోడబల్లియు, పెదచెఱుకూరి శాసనములో మొదటి వాఁడుగఁ జెప్పఁబడిన చోడబల్లియును (నన్నిచోడకవితండ్రి) నొక్కఁడయినను గావచ్చును. పెదచెఱుకూరిశాసనమునఁ జోడబల్లి తండ్రిపేరు గానరాదు. ఈ కొప్పరశాసనమునఁ జోడబల్లి సంతానము తెలియరాదు. చోడబల్లి, కామదేవ చోడ, కన్నరదేవచోడ, నన్నిచోడాదులు, వేర్వేరుగాఁ బెక్కుశాసనములలోఁ గానవత్తురు గాని యీ కొప్పరపుశాసనములోని వారితో వారెవ్వరు నేకీభవింప కున్నారు. సౌత్ ఇండియన్ ఇన్స్క్రిప్షన్స్ 4 వాల్యూం 467 పేజీలో నొక చోడశాసనము కలదు. అదియొక్కటి మాత్ర మీకొప్పరశాసనమునఁ గల కన్నరదేవచోడ, చోడబల్లిదేవులదే. దానికాలముకూడ శక 1043 అగును.

కొప్పరపుశాసనమునఁ గానవచ్చు చోడబల్లి నన్నిచోడకవితండ్రి గాక పోవచ్చును. వారిద్దఱు వేఱుపురుషులు గాకపోవుటవలన వచ్చువిశేష మంతగా లేదు. పెదచెఱుకూరిశాసనమున, పాకనాఁడిరువదియొక్క వేయిటికధీశుఁడు చోడ బల్లి కుమారుఁడు నగు నన్నిచోడుఁడు దొరకినాఁడు. కొప్పరపుశాసనమునఁ దెలుఁగుచోడులచే నారాధితుఁడు, కాలాముఖ దీక్షగొన్నవాఁడు నగు మల్లి కార్జునగురువు దొరకినాఁడు. ఈనన్నిచోడ మల్లికార్జునగురువు లేకకాలమువా రగుట స్పష్టమయినది. కుమారసంభవమున నన్నిచోడనిఁగూర్చి తెలియవచ్చు చున్నవిషయము లంతకంటె నెక్కువలేవు. అందు నన్నిచోడని తల్లిపేరు శ్రీసతి యని యున్నది. పైశాసనమునం దది కానరాలేదుగాన నాతఁడేయాతఁ డనరాదని యాక్షేపింపరాదు. ఇట్లాక్షేపింపఁ బూనినచోఁ గల్గెడు ననర్థములకు మితిలేదు.

నన్నియకంటె నన్నిచోడుఁడు, నూఱేండ్ల తర్వాతికాలమువాఁ డని పయి చర్చవలన సిద్ధాంతిత మగుచున్నది. ~~నన్నిచోడని కవితాదక్షతను గూర్చి నేనొక~~ ~~ప్పుడు విస్తరించి వ్రాయుచున్నాఁడను. ఇక్కడ నొక్కపదమునుగూర్చి యించుక~~

[illegible]

యుగ్గడించుచున్నారు. రామయ్యపంతులుగారు కుమారసంభవము ముద్రిత ప్రతిలోని దోషముల నెత్తిచూపుటకై తాళపత్ర ప్రతిలోని పద్యములఁ గొన్నింటిని జూపినారు. అందొకపద్యము:—

క. పలిమొగ్గల విరిపువ్వుల, నలినీలమయి చూడ నొప్పెఁ జనుపక (చంపక) మొప్పన్
జ్వలితపచ్చి రేపగలాంక, వెలిగెడు సద్దీపదీపవృక్షము పోలెన్.

తంజావూరు ప్రతిపాఠము.

ఇందు 'చనుపక' మని యుండఁగా నది తప్పని తలఁచి రామయ్యపంతులుగారు (చంపక) అని కుండలీకరించి సంస్కారము చూపినారు. అట్టిసంస్కార మనావశ్యకము. చనుపక మనుపదము కలదు.

చనుపకములఁ గొనఁ జనునే మాటికి, ననవిల్తునిమన్నన గల చేటికి.

యయాతిచరిత్రము.

శబ్దరత్నాకరమున నీప్రయోగము చూపఁబడినది. దీనిచే నాపదము వైకృతమని యెఱుఁగఁదగును. ఇదికూడఁ జదువఁదగినది.

సీ. ధూర్జటి కోపాగ్ని ధూళిగాఁ గ్రాఁగిన నాఁడేల నీయమ్ము వాఁడిలేదు
వాఁడికోఱల రాహువడిఁదోలి కఱచిననాఁడేల నీదీప్తి వేఁడిలేదు
శాపంబు శ్రీరామభూపాలుఁ డిచ్చిననాఁడేలకూయవో ఘోఁడిగాను
చనుపకములకల్గి కనుకనిడుల్లిననాఁడేల మ్రోయవో నేఁడుమీరు [నగునె
మగువఁ బాయు పెఱఁగి మగఁటిమి వాటించి, యేయఁగాయఁగూయ మ్రోయ
మదన! చంద్ర! పికమ! మోదమత్తమ్మెదలార! నాఁడునాఁడునాఁడు నాఁడు లేరె.

భావనపెమ్మన యనిరుద్ధచరిత్ర - ప్రబంధరత్నావళిలోఁ జూచునది.

వేటూరి ప్రభాకరశాస్త్రి.

# మహాభారతరచనావిధానము.

వేదములోని ఛందోనియమములను లౌకికమునకుఁ దెచ్చినవాఁడు "వాల్మీకి". సంస్కృతవాఙ్మయమున నాతనిరామాయణమునకుంగల "కవితావైశద్యము" మహాభారతమునకు లేదు. కాళిదాస మహాకవి సర్గవిధముల వాల్మీకిననుసరించి యే కవిత్వముఁ జెప్పినటులఁ గవితావిమర్శకులు తలఁతురు. రామాయణము లోని యుత్తరకాండకాక తక్కిన కాండల నొక్కఁడే రచియించియుండెనని కవితా పద్ధతి వెల్లడిచేయుచున్నది. భారతమటులు లేదు. కర్ణపర్వములోని కర్ణవధఘట్ట ము కాక, మిగిలినమహాభారతమంతయుఁ గవిత్వపు విశేషములను స్ఫురింపఁ జేయదు. లక్షశ్లోకపరిమితిగల మహాభారతమంతయు "శతసహస్ర్యాంసైయా సిక్యాం" అనుటచే దానికి వ్యాసుఁడే కర్తయని స్థూలదృష్టిని గాన్పించునుగాని సూక్ష్మదృష్టితో నాలోచించినచో వ్యాస, వైశంపాయన, సౌతి, యనువారలు జయ, భారత, మహాభారతములను గ్రంథములఁ జేసిరనియు వ్యాసుని "జయ" మును వైశంపాయనుఁడు, వ్యాసవైశంపాయనుల గ్రంథములను సౌతియుఁ, దమ గ్రంథములలోఁ గలిపివేసి యేదివ్యాసకృతమో యేదివైశంపాయనకృతమో యేదిసౌతికృతమో తెలియకుండఁ జేసిరనియు, విశదము కాఁగలదు. ఇందులకు మహాభారతముననే నిదర్శనములుకలవు. మనకుఁగాన్పించు మహాభారతముగాక వ్యాసునిశిష్యులగు "సుమంతుఁడు, జైమిని, పైలుఁడు, శుకుఁడు, వైశంపాయ నుఁడు" కూడ మహాభారత సంహితలఁ జేసి రని యీక్రిందిశ్లోకార్థములు చెప్పు చున్నవి.

(౧) వ్యాసుఁడు వేదములను, భారతమును "సుమంతుఁడు, జైమిని, పైలుఁడు, శుకుఁడు, వైశంపాయనుఁడు" నను నైదుగురుశిష్యులచేఁ జదివించెను. వారైదు గురు నైదుభారతసంహితలఁ బ్రకాశింపఁ జేసిరి.

మఱియు క్రీ॥ పూ॥ నాలవశతాబ్దప్రాంతమున నుండెనని తలఁపఁబడు "ఆశ్వలాయనుఁడు" తనగృహ్యసూత్రములలో భారత మహాభారతగ్రంథములు

(౧) వేదానధ్యాపయామాస మహాభారతపంచమాన్ । సుమంతుం జైమినిం పైలం శుకం చైవ స్వమాత్మకం । ప్రభుర్వరిష్ఠో వరదో వైశంపాయనమేవచ । సంహితాస్తైః పృథక్త్వేన భారతస్య ప్రకాశితాః ॥ ఆదిపర్వము. ౬౩-౭౦.

వేఱుగానుండెననియు "సుమంత్వా"దివ్యాసశిష్యులు భారతగ్రంథకర్తలనియుఁ జెప్పుచున్నాఁడు. చూడుఁడు.

౨. సుమంతుఁడు జైమిని వైశంపాయనుఁడు పైలుఁడు సూత్రభాష్య భారత మహాభారత ధర్మాచార్యులు.

"జయ" మనునది వ్యాసకృతమనుట కారంభశ్లోకమె. (౧) సాక్ష్యము. ఈ జయశబ్ద మచటనచటఁ సూచించియున్నాఁడు. (౨) సుమంతుపైలాదుల భారతములిపు డంతరిక్ష మైనవి. జైమినిభారతములోని యశ్వమేధపర్వమే నిలిచియున్నది. "వైశంపాయనకృత" మను భారతమే నేఁడు మనచేఁ బఠింపఁబడుచున్నదఁట. నేఁడు కాన్పించు మహాభారతములోనే "వ్యాసవైశంపాయన సౌతి" కృత భాగములున్నవని వ్రాసియుంటిని. కవిత్రయకృత సంస్కృతమహాభారతము నాంధ్రీకరించుటలోఁ గూడ కవిత్రయసంబంధము కలుగుట యాశ్చర్యకరము. ఆంధ్రీకృత మహాభారతములోని కవిత్రయభాగముల విభజించునటుల సంస్కృతమహాభారతములోని వ్యాస వైశంపాయనాదుల భాగములను విభజింపలేము. కారణ మేమనఁగా వ్యాసునిజయమును వైశంపాయనుఁడు తానురచించుభారతమున కనునగునటుల మధ్యమధ్యను సరఁదుకొనినాఁడు. అటులనే సౌతి వ్యాసునిజయముతో మిశ్రమమైన వైశంపాయన భారతమును తనమహాభారతములో సరుదుకొనినాఁడు. అందువలన వ్యాస వైశంపాయనుల "జయ భారతముల"ను విభజింప శక్యముకాకున్నది. కాని సౌతి శౌనకాదులకును వైశంపాయన జనమేజయులకును నైన ప్రశ్నోత్తరములు మాత్రము వ్యాసుని జయములోనివి కావని సూక్ష్మముగాఁ జెప్పవచ్చును. ఆశ్వలాయనుని కాలమునకు (క్రీ. పూ. 4-వ శతాబ్దప్రాంతము) వ్యాసునిజయము కాకుండినను భారత మహాభారతములు మాత్రము వెవ్వేఱుగ నుండినటుల నాతనిగృహ్యసూత్రమె సాక్ష్య మిచ్చుచున్నది. క్రీ. త. నాలవశతాబ్దమునకు జయ భారత మహాభారతము లిప్పటివలెఁ గలిసి యెకరూపముగా లక్షశ్లోకపరిమితి కలవిగా నున్నవని, క్రీ. త. (౩౬౭) సంవత్సరపు "గుప్త" శాసనముచే నూహింపఁబడుచున్నది. ఆ "శిలాశాసనము" యొక్క సంపూర్ణప్రతిబింబమును దొరతనపుశాసనశోధకులు ప్రకటించియున్నారు. మఱియు "భాసమహాకవి" నాఁటికి నేఁటిభారతరూప మేర్పడియెయుండెనని యాతనినాటకములె సాక్ష్య

(౨) సుమంతు జైమిని వైశంపాయన పైల సూత్ర భాష్య భారత మహాభారత ధర్మాచార్యాః.
ఆ. గృ. 3.4-4.

మిచ్చుచున్నవి. ఆ మహాకవి భారతములోని వనపర్వమునుండి శల్యపర్వాంతమువఱకు నుండినగాథ "నాఱు" నాటకములనుగా రచించియున్నాఁడు (1) మధ్యమవ్యాయోగము. ఇది పాండవు లరణ్యమున నుండఁగ భీమఘటోత్కచులకుఁ జరిగిన గాథ. మఱియు నాదిపర్వములోని ఘటోత్కచజన్మాదికమును సభాపర్వములోని ద్యూతవిజితులగు పాండవులు వనవాసమున కేఁగుటయును సూచించుచున్నది. (2) పంచరాత్రము. ఇది పాండవు లజ్ఞాతవాసమున నుండునపుడైన కీచకవధ, గోగ్రహణము అభిమన్యువివాహాదికము మొదలగువానిని సూచించుచున్నది. (3) దూతవాక్యము. ఇది శ్రీకృష్ణరాయబారముఁ జెప్పుచున్నది. (4) దూతఘటోత్కచము. ఇది భీష్మపర్వాంతగాథను సూచించుచున్నది. (5) కర్ణభారము. ఇది యరణ్యపర్వాంత గాథను కర్ణపర్వగాథతోఁ గలిపి చెప్పుచున్నది. (6) ఊరుభంగము, ఇది శల్యపర్వాంతగాథనుఁ జెప్పుచున్నది. మఱియు "బాలచరితము" అను నింకొక నాటకమును భాసమహాకవి రచించియుండెను. ఈనాటకగాథ హరివంశములోని గోపికలకుఁ బాలకృష్ణునకు నైన కథలఁగూడఁ జెప్పుచున్నది గాన హరివంశముకూడ భాసునినాఁటికిఁ గలిగి యున్నదని స్పష్ట మగుచున్నది. అయితే భాసుఁ డెప్పటివాఁడు? కాళిదాసుకూడ మాళవికాగ్నిమిత్త్రమునందు భాసునిఁ దలఁచుటచే నంతకుఁ బూర్వుఁడు. స్వప్నవాసవదత్త నాటకపుఁబీఠికలో, త. గణపతిశాస్త్రులవారు, భాసుఁడు చాణక్యునికంటెఁగూడ ప్రాచీనుఁడని వ్రాసియున్నారు. కారణమేమనఁగా భాసునినాటకములోని శ్లోక మొకటి "కౌటిల్యుని (చాణక్యుని) యర్థశాస్త్రమున" నుల్లేఖింపఁబడియున్నదఁట. కౌటిల్యుఁ డచట నిది యన్యునిశ్లోకముని సూచించియున్నాఁడఁట. కాన కౌటిల్యుఁడు భాసునినాటకములోని శ్లోకమునే యుదాహరించియుండునని గణపతిశాస్త్రులవారి యభిప్రాయమైయున్నది. మఱియు భాసునిప్రయోగములలోఁ గొన్ని "పాణినీయ" విరుద్ధములుగా నున్నవిగాన, భాసుఁడు పాణినికంటెఁగూడ పూర్వుఁడని కొంద అందురుగాని క్రీ. పూ. 7. శతాబ్దప్రాంతమునుండిన "ఉదయనుని" గాథను భాసుఁడు నాటకముగా రచించియుండుటచేఁ "బాణిని" కంటె భాసుఁడు పూర్వుఁడనుటకు వీలులేదుకాని చాణక్యునికంటెఁ బూర్వుఁడై, క్రీ. పూ. 5 శతాబ్దప్రాంతమున నుండిన నుండవచ్చును. నాఁటికి భారతి మహా

---

(౧) నారాయణం నమస్కృత్య నరంచైవ నరోత్తమం । దేవీం సరస్వతీం వ్యాసం తతో జయ ముదీరయేత్.

(౨) "జయోనామేతిహాసోఽయం" – స్వర్గారోహణపర్వము.

భారతగాథలు వెవ్వేఱుగనుండిన నుండవచ్చును. భారతము సౌప్తికపర్వాంతము వఱకేయని ముందు వ్రాయఁబోవు నాపద్ధతిలోనిగాధనుగూడ నాటకమునుగా రచించియుంటి ననుటకుఁగాను తదంతర్గత మని యెన్నఁబడు హరివంశగాథను "బాలచరితము" నుగా రచించియుండును. లోకమాన్యతిలకు, భాసుఁడు కాళిదాసునికంటెఁ బూర్వుఁడైనను క్రీ. శ. 1, 2 శతాబ్దములనాఁటివాఁడై యుగునని తలఁతు ననినాఁడు. గణపతిశాస్త్రులవారి శ్లోకదృష్టాంతపూర్వకమగు నిదర్శనము లోకమాన్యునితలఁపుకంటెఁ బ్రమాణము. క్రీ. శ. నాలవశతాబ్దములోని గుప్తరాజులనాఁటికి, లక్షశ్లోక పరిమితిగల భారతముండుటయు, అశ్వలాయన భాష మహాకవులనాఁటికి, భారత మహాభారత గ్రంథములు వేఱుగనుండుటయు నిశ్చయమని నాతలఁపు. వ్యాసాదు లెప్పుడు జయాదులను రచించిరి? వారిగ్రంథముల కాద్యంతము లెచట నెచటనై యుండును? అనుదానిగుఱించి విమర్శింతము.

వ్యాసుఁడు భారతయుద్ధ మింకనగుననఁగా, ధృతరాష్ట్రునికడకువచ్చి మహోత్పాతములవర్ణించి యుద్ధము ఘోరముగ తప్పకయగుననియు, అందు కౌరవులు, నశింతురనియు వారికీర్తిని గ్రంథరూపముతో లోకమున వ్యాపింపఁ జేతుననియుఁ జెప్పి యుద్ధవృత్తాంతములఁ జెప్పుటకు సంజయుని నియోగించి హిమాలయారణ్యమున కేగెను. అతఁడచట మూఁడేండ్లు భారతమును రచించెననియు అవి (౮౮౦౦) యెనిమిదివేల యెనిమిదివందల శ్లోకము లుండు ననియు భేదింప శక్యము కాకుండు ననియు నీక్రిందిశ్లోకార్థములు చెప్పుచున్నవి.

(౧) కృష్ణద్వైపాయనుఁడు మూఁడేండ్లు దీక్షకలవాఁడై యీమహాభారతమనునద్భుత మగునాఖ్యానమునుఁ జేసియున్నాఁడు. (ఇది వైశంపాయన వాక్యము)

(౨) వ్యాసుఁడు నాఁడు గూఢమగు గ్రంథగ్రంథినిఁ గుతూహలముతో జేసెనని ప్రతిజ్ఞచేసెనో దానిని జేసెను.

---

(౧) త్రిభిర్వర్షైః సదోత్థాయీ కృష్ణద్వైపాయనో మునిః। మహాభారతమాఖ్యానం కృతవానిదముత్తమం - ఆదిపర్వము 62-52.

(౨) గ్రంథగ్రంథిం తదాచక్రే ముని ర్గూఢం కుతూహలాత్। యస్మిన్ ప్రతిజ్ఞయా ప్రాహ ముని ర్ద్వైపాయనస్త్విదం। అష్టౌ శ్లోకసహస్రాణి అష్టౌ శ్లోకశతానిచ। అహం వేద్మి శుకోవేత్తి సంజయోవేత్తివా నవా। తచ్ఛ్లోకకూట మద్యాపి గ్రథితం సుదృఢంమునే। భేత్తుం నశక్యతేఽర్థస్య గూఢత్వాత్ ప్రశ్రితస్యచ॥ ఆదిపర్వము॥ అనుక్రమణికాధ్యాయము.

(ఆ గ్రంథము) ఎనిమిదివేల యెనిమిదివందల శ్లోకములుకలది. దీనిని నే నెఱుఁగుదును. శుకుఁడెఱుగును. సంజయుఁడెఱుఁగునో యెఱుఁగఁడో. ఆశ్లోక కూట మిప్పుడును సుదృఢముగా గ్రథితమై యున్నది సుమా. శౌనకా! అది గూఢమగుటచేతను ప్రశ్రిత మగుటచేతను అర్థమునకు భేదింపశక్యము కాకున్నది. (ఇది సౌతి శౌనకునితోఁ జెప్పినవాక్యము.) ఎనిమిదివేల యెనిమిది వందల శ్లోకములు వ్యాసకృత మగుట సత్యము. వానిని నేఁటి యాంధ్ర దేశపుఁ బండితులు వ్యాసఘట్టము లనియు గూఢార్థయుక్తము లనియుఁ బలుఁకుదురు. సౌతికాలమున కవి, వైశంపాయనభారతమునం దిమిడి యున్నవి. వాని నాతఁ డెఱుఁగును. శుకుఁ డెఱుఁగునఁట సంజయుఁ డెఱుఁగునో యెఱుఁగఁడో యని సౌతి చెప్పుచున్నాఁడు. సౌతి యీమహాభారత ముపాఖ్యానములతో లక్షశ్లోక పరిమితి కలదనియు, నుపాఖ్యానములు లేని దిరువదినాలుగువేల శ్లోకపరిమితి కలదానిని (వ్యాసుఁడు) చేసియున్నాఁ డనియు ఉపాఖ్యానరహితమైనది భారత మని యు పిమ్మట నధికమగు నర్ధశతశ్లోకములతోఁ దాఁ జేసినగ్రంథమున కను క్రమణికఁ జేసియున్నాఁ డనియు నీక్రింది శ్లోకతాత్పర్యములచేఁ దెలియ నగును.

(౧) ఈపుణ్యమైన నూఱువేలశ్లోకములు గలభారత ముపాఖ్యానముల తోఁ గూడినదని తెలిసికొనవలయును. ఉపాఖ్యానరహితమగు నిరువదినాలుగు వేల భారతసంహితనుఁ జేసియుండెను. (వైశంపాయనుఁడు కావచ్చును) అది భారత మని చెప్పఁబడుచున్నది. తరువాతను—వ్యాసుఁ డేఁబదిశ్లోకము లధిక ముగ సంక్షేపముగ (అనుక్రమణికను) చేసెను.

ఇపుడు మనకుఁ గాన్పించు ముద్రితభారతప్రతులు నాకుఁ దెలిసినంతవఱకు నాలుగున్నవి. నేను జూచుచున్నప్రతులలో నె యన్యోన్యవిరుద్ధపాఠము లుం డుట యాశ్చర్యకరముగ నున్నది. కొన్నిప్రతులలో గాథలే మాఱియుండుట మఱియు నాశ్చర్యకరముగా నున్నది. ఒకప్రతిలో ద్రౌపదీస్వయంవర మై వివాహమైన పిమ్మటఁ గర్ణాదులు హాస్తినాపురమునుండి పాంచాలపురముపైకి (భీష్మాదులకుఁ దెలియకుండఁగ) యుద్ధమునకు రాఁగా భీమార్జునులు విజృంభిం

(౧) ఇదం శతసహస్రాఖ్యం శ్లోకానాం పుణ్యకర్మణాం। ఉపాఖ్యానైస్సహ జ్ఞేయం శ్రావ్యం భారతముత్తమం। చతుర్వింశతిసాహస్రీం చక్రే భారతసంహితాం। ఉపాఖ్యానైర్వినా తావద్భారతం ప్రోచ్యతే బుధైః॥ తతో ధ్యర్ధశతంభూయః సంక్షేపం కృతవా నృషిః॥ అనుక్రమణికాధ్యాయః.

చుటయు నర్జునునకు కర్ణునికుమారు నొకని సైంధవపుత్రు నొక్కనిఁ జంపఁ దక్కిన వారు పరుగిడి హస్తిపురికిఁ జేరుటయు, వర్ణింపఁబడియున్నది. ఇది యాంధ్రీకృత మహాభారతమునఁ గాని తెనుఁగున ముద్రింపఁబడిన సంస్కృతమహాభారతమునఁ గాని కాన్పింపదు. కుంభకోణమునందు, టి. ఆర్. కృష్ణమాచార్యునిచే ముద్రిం పఁబడిన సంస్కృతమహాభారతము, ఆదిపర్వము 218 అధ్యాయముఁ జూచిన నీ వింత విశదముకాఁగలదు —

నేఁటి కాలమున జర్మనీ దేశీయులు నానా దేశసంస్కృతభారతప్రతులను శోధించి "యాదిసభా"పర్వములను నవీనముగ ముద్రించిరఁట. పూనాలోని "రామకృష్ణభాండర్కారు"గారి యాధిపత్యమున, భరతఖండపు నానాభాగకోశ ములును శోధింపఁబడి "విరాటపర్వము" ముద్రింపఁబడిన దఁట. రవీంద్రనాథ ఠాకూరుగారి "విశ్వభారతి" విశ్వవిద్యాలయమున, నానా దేశకోశములను సేకరించి "డాక్టర్ వింటర్నిట్జు" గారి యాధిపత్యమున మహాభారతము శోధింపఁ బడుచున్నది. విజయనగరమున నవీనముగ నుద్భవించిన "భారతీతీర్థ" పరిషత్తు వారును మహాభారతశోధనకుఁ గడంగు సూచనలు కాన్పించుచున్నవి. నేఁడు ముద్రింపఁబడిన మహాభారతప్రతులలో "టి. ఆర్ కృష్ణమాచారిగారి" కుంభ కోణపుప్రతియు, కలకత్తాలో ముద్రింపఁబడిన "ప్రతాపచంద్రరాయి" గారి ప్రతియు, ఆంధ్రాక్షరములతో నేఁటి కేఁబదినాలుగేండ్లకుఁ బూర్వము "నే. వేం కటసుబ్బాశాస్త్రులవారిచే" ముద్రింపఁబడిన ప్రతియుఁ జూడఁగ నొకదానితో నొకటి సమానము గాకున్నవి.

పర్వసంగ్రహాధ్యాయమునం దేపర్వమున నెన్నియధ్యాయము లుండు నో చెప్పఁబడియున్నది. ఆప్రకార మాదిపర్వమునందు రెండువందలయిరు వదియే డధ్యాయము లుండవలసియుండఁగా, కుంభకోణపుఁబ్రతిలోని యాది పర్వము 260 అధ్యాయములును, కలకత్తాప్రతిలోని యాదిపర్వము 236 అధ్యా యములును, ఆంధ్రాక్షరపుఁబ్రతిలోని యాదిపర్వము 234 అధ్యాయములును, కలిగియుండుట యాశ్చర్యముఁ బుట్టించుచున్నది. నేను జూచినవ్రాఁతప్రతు లాంధ్రాక్షరపుఁ బ్రతులతో సరిపోవుచున్నవి. ఆంధ్రాక్షరముద్రితప్రతియందు నాలాయణ్యుపాఖ్యానము రెండధ్యాయములును, సుభద్రాపరిణయగాథ నాలు గధ్యాయములును పర్వాంతమందు, ప్రక్షిప్త మనికూర్పఁబడినది. నీలకంఠా చార్యు లీయాఱధ్యాయములును "జైమినిభారతము"లోని వని వ్యాఖ్యానముఁ జేయ లేదఁట. ఏపర్వ మెన్నియధ్యాయములు కలిగియుండెనో, ఈభారత

రచనాచరిత్ర వ్రాసినపట్టికఁ జూచిన విశేషము కాఁగలదు. ఇటులనే వేదాశ కాళిదాసునికాలమునకే భారతము చెందకయుండెనని చెప్పఁదగును. దాని నాటేడు దివ్యఁ బ్రయత్నించె ననియు సేయినేము విష్ణుపురాణమునకెగ ననియు నొకకథ కలదు. అకోబీఁ తేఁ మీక్సుటన్కై, జకోబీ, హాప్కిన్సు, నంగ సేరీయులు ప్రయత్నించు చున్నారు. "భారతీకథ" లోనిదియనుచున్నారనుచున్నారు. కాని భవిష్యత్తున కార్య క్రమమునకుం బాకార్యమునకుఁ బెట్టించిన సూచన కాన్పించుచున్నది. జర్మనీదేశీయులు కాకుండినను, భారతీయు లందఱైన నొకటిగ మహాభారతజిజ్ఞాసువులై పనిఁ జేసిన బాగుండును.

నేఁటి మహాభారతములో నేది వ్యాసకృతమో? యేదివైశంపాయనకృతమో? యేదిసౌతికృతమో చెప్పలేము కాని, యీక్రిందిశ్లోకము భారతాదిని గుఱించి సూచించుచున్నది.

(౧) కొందఱు "మను" అనుచోటునుండి భారతప్రారంభ మనిరి. మఱి కొందఱు "ఆస్తీకాది" భారతారంభ మనిరి. అట్లే మఱికొందఱు "ఉపరిచరవసువు" మొదలనిరి.

పైని చెప్పఁబడిన యర్థముగల శ్లోకము కొన్నివ్రాఁతప్రతులలోఁ గాన్పింపకున్నది. ఇది సంస్కృతకవిత్రయకృతములోనిదై యుండదు.

కారణ మేమనఁగా, భారతకవులలోఁ గడపటివాఁ డగు "సౌతికి" భారతారంభ మెచటినుండి యైనదో తెలియకపోదు. అట్టిసౌతిచేసిన శ్లోకమే యిది యైనచో "కేచిచ్ఛబ్దము" నుపయోగింపఁడు. అయినను, జయ, భారత, మహాభారతములను గ్రంథములు మూఁడు కల వనియు, మూఁడుగ్రంథములకు మూఁడారంభములు కలవనియుఁ దెలిసికొనుట కీశ్లోక ముపయోగపడుచున్నది. దీని ననుసరించి యారంభముఁ గనుఁగొందము. "మను" అనుశబ్దముతోఁ గాని, మన్వాదిప్రారంభముతోఁ గాని యాదిపర్వమునం దేయధ్యాయమును బ్రారంభింపఁబడ లేదు. టి. ఆర్. కృష్ణమాచార్యులుగారి ప్రతిలో వారీశ్లోకమునకు వ్యాఖ్యానముఁ జేయుచు "మను" శబ్దమునకు మంత్రమర్థమనియు "నారాయణ" శబ్దము, అష్టాక్షరీమంత్రద్యోతకముగాన "నారాయణం నమస్కృత్య" యను ప్రారంభశ్లోకమునుండియే భారతసంజ్ఞ కలదనియు వ్రాసియున్నారు. ఇది యుక్తియుక్తముగ నున్నది. ఆదిపర్వము 75-వ అధ్యాయారంభమునందు "ప్రజా

(౧) మన్వాదిభారతం కేచి దాస్తీకాది తథాపరే
తథోపరిచరా దన్యే విప్రాస్సమ్యగధీయిరే. (ఆదిపర్వ 1-66.)

నత్రేస్తు మనుష్యే మహో త్రైస్త్రీంశస్త్వచ" అనికలదు. కాని శతప్రజాపతి సంహా రంభము "మన్వాది" వృత్తాంత మన వీలు లేదు, కాన, 'నారాయణ' శబ్దముతోఁ బ్రారంభింపఁబడిన దానికే "మన్వాది" భారత మనుట యుక్తము. ఇది సౌతి భారతమున కగును. ఆస్తీ కాదిగాఁ గలయధ్యాయము లేదు కాని "ఆస్తీక" పర్వమనునది యాదిపర్వాంతర్గతమై, పదుమూఁడవ యధ్యాయమునఁ బ్రారంభింపఁబడుచున్నది. ఇది "వైశంపాయన" భారతమున కారంభ మగుచు. కారణ మేమనఁగా వైశంపాయనుఁడు జనమేజయునకు భారతముఁ జెప్పుటకుఁ గల్గిన కథా బీజమిా "యాస్తీకపర్వమునందే కలిగియున్నది. ఇది యిరువదినాలుగు వేల శ్లోకములు మితికలదై యుండు నని యిదివఱకే వ్రాసియున్నాను, కొన్ని ప్రతులలో ననుక్రమణికాధ్యాయమునం దీక్రింది యర్థముగల శ్లోకము కలదు. సౌతికృత భారతము లక్షశ్లోకముల మితికలదనియు మనుష్యలోకమున వైశంపాయనుఁడే భారతముఁ జెప్పియుండెననియు నాశ్లోకము సూచించుచున్నది. (౧) వైశంపాయనభారతములో "నితిహాస"ము లుండవు. "ఉపరిచర"నుండి ప్రారంభింపఁబడినది. వ్యాసభారతమును దానికే "జయ"మని పేరు. ఇది యాదిపర్వమునం "దఱువదిమూఁడవ" యధ్యాయమునుండి యారంభమగుచున్నది.

వ్యాసుఁడు గ్రంథరచనకు ముందు తనవృత్తాంతముఁ జెప్పుకొనుట యుక్తమై యున్నదిగాన వ్యాసుఁడు తనమాతామహుఁ డగు "నుపరిచర" వసువు గాథనే యారంభించి చెప్పియున్నాఁడు. వ్యాసగ్రంథము కేవలకౌరవపాండవ చరిత్ర మాత్రమె యై యెనిమిదివేల యెనిమిదివందల శ్లోకములు కలదిగా నుండెను. వ్యాసభారతము "కార్ష్ణి" వేదము స్వరయుక్తము సంహితాస్వరూపము. గద్య పద్యాత్మకమై కృష్ణయజుర్వేదమువలె నుండక శ్లోకసంఖ్యాయుత మగుటచే వేదమునందుండు "ననుష్టుప్" ఛందోరూపముగా నుండును. వేదమున కుండు నటుల ననుక్రమణికాయుక్తముగా నుండును. అనుక్రమణికం దెలిసికొంటి మేని వ్యాసకృతభారతాంశములు లభింపఁగలవు. అనుక్రమణికాధ్యాయమునం దుండు "తతో ధ్యర్ధశతం భూయః." అను శ్లోకములోని "అధ్యర్ధశతం" అను పదమునకు నూటయేఁబది శ్లోకము లని పెక్కండ్రర్థము చేయుచున్నారు. కాని యనుక్రమణికాధ్యాయము రెండువందల యేనుబదిశ్లోకములు కలిగియున్నది. వివిధశ్లోకనిబద్ధమై యున్నది. అనుక్రమణిక లటులనుండవు. అనుక్రమణికా

(౧) అస్మింస్తు మానుషేలోకే వైశంపాయన ఉక్తవాన్
ఏకం శతసహస్రంతు మయోక్తం వైనిబోధత — అనుక్రమణికాధ్యాయము.

ధ్యాయమునం దాదిని "శుకశౌనకా"దులకును సౌతికి జరిగినయుత్తర ప్రత్యుత్తరములతోఁ దొంబదినాలుగు శ్లోకములును శేషించిన నూటముప్పది శ్లోకములలోను నూటయెనుబది శ్లోకములు ధృతరాష్ట్రపరిదేవనము, సంజయుని యోదార్పు నను గాథగాను పోఁగా డెబ్బదియెనిమిది శ్లోకములే మిగిలియున్నవి. కడను ముప్పదినాలుగు శ్లోకములలో సౌతి భారతపఠన శ్రవణములచే నగుఫలముఁ జెప్పియుండుటచే నలువదినాలుగు శ్లోకములే యనుక్రమణిక కావలసియుండును. కాని, వ్యాఖ్యాత, అనుక్రమణికాధ్యాయములోని 79 మొదలు 89 వఱకుఁ గలశ్లోకములు కొన్ని ప్రతులలో లేవనుచున్నాఁడు. నాకును గొన్ని వ్రాఁతప్రతులలో నాశ్లోకములు కాన్పింపలేదు. పైకారణము లన్నిటి పరిశోధించినచో వ్యాసకృతానుక్రమణికాధ్యాయము "ఆదిపర్వములోని ప్రథమాధ్యాయము కా దనియు నది సౌతిమహాభారతమునకు ననుక్రమణికాధ్యాయమనియు విశదమగును. మఱియు "అధ్యర్ధశత" శబ్దమునకు నూటయేఁబది యనునర్థము కంటె నిదివఱకుఁ జెప్పినగ్రంథమున కధికముగా నర్ధశతము (50) అనునర్థము పొసఁగియున్నది. కాన నేఁబదిశ్లోకములచేతనే "యనుక్రమణికను" వ్యాసుఁడు రచించె ననుట యుక్తమగును. అట్టియధ్యాయ మెచటనైనఁ గలదా? కలదు. ఆదిపర్వములోని యఱువదియొకటవ యధ్యాయ మట్టిదియే. ఆ యధ్యాయమునకుఁ గథాసంక్షేపాధ్యాయ మనిపేరు. దానియం దేఁబదియాఱుశ్లోకము లున్నవి. మొదటి యైదుశ్లోకములు వైశంపాయనుఁడు జనమేజయునకుఁ జెప్పినవాక్యములు. కడపటిశ్లోకము కూడ వైశంపాయనునిదేను. నడుమ నుండిన యేఁబదిశ్లోకములలో భారతేతిహాసము నిరూపింపఁబడినది. కడపటి శ్లోకమునం దీయనుక్రమణికాధ్యాయములోని గాథకు "జయ" మనుపేరు గలదని చెప్పఁబడినది. (౧) ఆయధ్యాయమే "యనుక్రమణికాధ్యాయ" మనికూడ నఱువదిరెండవ యధ్యాయము పదిరెండవ శ్లోకమునందు చెప్పఁబడియున్నది. (౨) ఆ యఱువదియొకటవ యధ్యాయమునఁ గలకథను మూలరహితముగ వ్రాసెదను.

పాండవు లరణ్యమునం దండ్రి మృతినొందిన పిమ్మటను హస్తిపురికి వచ్చి స్వల్పకాలములోనె వేదమునందును ధనుర్వేదమునందును విద్వాంసులైరి, వీర్య

(౧) ఏవమేత త్పురావృత్తం తేషా మక్లిష్టకర్మణాం।
భేదో రాజ్యవినాశాయ జయశ్చ జయతాంవర ॥ ఆది 61–56.

(౨) తుణం కురుమహారాజ విపులోయ మనుక్రమః
పుణ్యాఖ్యానస్య వక్తవ్యః కృష్ణద్వైపాయనేరితః ॥ అ 62–12

సంపన్నులును “పౌర” సమ్మతులు నగుపాండవులఁ జూచి కౌరవులు సహింప రైరి. పిమ్మటను దుర్యోధనుఁడు కర్ణశకునిసహితుఁడై పాండవుల కనేకాపకార ములఁ జేయఁ బ్రారంభించెను. దుర్యోధనుఁడు “కుళింగుని” మతము ననుస రించి రాజ్యమునకుఁ గాను పాండవులఁ బీడించెను. భీమున కన్నమున విష ముఁ బెట్టించెను; విషము భీముని బాధింపలేదు. నిద్రపోవుచున్న భీముని పాములచేఁ గఱపించెను. కాని విషమెక్కలేదు. దుర్యోధనాదులు పాండ వులకుఁ జేయునపకారము లన్నిటియందును బుద్ధిమంతుఁ డగువిదురుఁడు పాండ వులకుఁ దోడ్పడుచు నాయపకారములు వారికి రాకుండఁగఁ బ్రతిక్రియలఁ జేయుచుండెను. స్వర్గమునొందిన వారి కెటులు దేవేంద్రుఁడు సుఖము గలు గఁ జేయునో, విదురుఁ డటులు నిత్యము బహిరంగముగాను రహస్యముగాను పాండవుల కగునపకారములనుండి రక్షించుచుండెను.

పిమ్మట దుర్యోధనుఁడు ధృతరాష్ట్రు ననుజ్ఞఁగొని వారణావతమున లక్క యింటిఁ గట్టించెను. ధృతరాష్ట్రుఁడు సుతహితముఁగోరి, పాండవులను వారణా వతమున కంపెను. పాండవులు హస్తిపురమునుండి వారణావతమునకు వచ్చిరి. అప్పుడును విదురుఁడు పాండవులకు నుపదేశములఁ జేయుచునే యుండెను. పాం డవులు ధృతరాష్ట్రాజ్ఞ ననుసరించి, వారణావతమున లక్కయింటను, “పురోచ నుని”చే రక్షింపఁబడుచు నొకసంవత్సర ముండిరి. ఆకాలముననే విదురోప దేశముచే లక్కయింటి నడుమనుండి వెలుపలకు “సొరంగము” త్రవ్వకొని లక్కయింటి కగ్గిపెట్టి పురోచను నందు దహించి, భయముచే నరణ్యమున కుఁ బఱిగిరి. ధార్తరాష్ట్రులచే భయపడి వనమునఁ బఱిగెడు పాండవులు హిడింబవనముఁ జొచ్చిరి. అట భీముఁడు హిడింబుం జంపి వానిచెలియలు హిడింబను బెండ్లియాడెను. ఆమెయందు ఘటోత్కచుఁడు పుట్టెను. పిమ్మట బ్రాహ్మణవేషధారులై వేదము చదువుకొనుచుఁ దల్లితోఁగూడ “నేకచక్రపుర మునఁ గొంతకాల ముండిరి. అచట మనుష్యభక్షకుఁ డగు “బకాసురుని” భీముఁడు చంపి యేకచక్రపురవాసుల నోదార్చెను. అచటనే ద్రౌపదీస్వయం వరవృత్తాంతమును విని పాంచాలనగరమున కేఁగి ద్రౌపది నొంది, సంవత్సర మునకుఁ బైఁగా ద్రుపదపురమున నుండిరి. అపుడు హస్తిపురి కీవృత్తాంతము తెలియఁజేయఁబడి పాండవులు తిరిగి హస్తిపురికి వచ్చిరి. అప్పుడు భీష్మధృతరా ష్ట్రులు సోదరులతో విరోధము మీకుండరాదని పాండవులకుఁ జెప్పి, మీరు సుఖ ముగ రాజ్యముఁ జేయుటకు “ఖాండవప్రస్థరాజ్యము” తగిన దని యాలోచిం

చితిమి గాన మీరచటికిఁ బోయి రాజ్యముఁ జేయుఁ డనఁగా వారచటికిఁ దమ సుహృజ్జనులతో నేఁగిరి. ఆపట్టణమునం దనేకవత్సరములు రాజ్యముఁ జేసిరి. శత్రురాజుల నోడించుచు మిత్రులను సంతోషపెట్టుచు ధర్మముగ పాండవులు రాజ్యముఁ జేసిరి. ఆకాలమున భీముఁడు తూర్పుదిక్కును జయించెను. ఉత్తరపు దిక్కు నర్జునుఁడును, పడమటిదిక్కును నకులుఁడును, దక్షిణమును సహదేవుఁడును జయించిరి. పిమ్మట నొకకారణముచే ధర్మరాజు సంవత్సరముపై నొక మాస మర్జును నరణ్యమున నుండఁబంపెను.

(ఇట నాంధ్రీకృతభారత మొకయేఁ డని చెప్పుచుండఁగా సంస్కృతభారతము పదుమూఁడుమాసము లని యొకచోటను, పండ్రెండేం డ్లని రెండుచోటులను నర్జునతీర్థయాత్రాకాలముఁ జెప్పుట చర్చనీయాంశము.) అపు డర్జునుఁడు ద్వారవతి కేఁగి శ్రీకృష్ణుని చెలియలు సుభద్రనుఁ బెండ్లియాడెను. పిమ్మట నర్జునుఁడు శ్రీకృష్ణునిఁ గూడి ఖాండవవనము నగ్నికర్పించెను. అగ్ని యర్జునునకు గాండీవ మనుధనుస్సును, అక్షయతూణీరములను కపిధ్వజయుక్త మగుదివ్యరథమును నిచ్చెను. ఆయగ్నిపాలు గాకుండఁగ "మయుఁ" డనురాక్షసుని రక్షించుటచే నాతఁడు, రత్నమయమగు సభను జేసి పాండవుల కర్పించెను. ఆ సభనుఁ జూచి దుర్మార్గుఁ డగుదుర్యోధనుఁడు లోభబుద్ధి కలవాఁడై శకునితో ధర్మరాజు జూదమాడునటులఁ జేసి పాచికలచేతనే ధర్మరాజును వంచించి పాండవులు పదిరెండేండ్లు వనమునందును నొకయేఁ డజ్ఞాతముగ నుండునటులఁ జేసెను. పాండవు లటులఁ జేసి, పదునాలవయేఁటఁ దమభాగముఁ గోరి దుర్యోధనునుండి భాగమునొంద లేక పోవుటచే యుద్ధమైనది. అందు శత్రువులను దుర్యోధనుని పాండవులు చంపి రాజ్యము నొందిరి. (౧) పిమ్మట వారు హయమేధాది క్రతువులను జేసిరి. తరువాతను ధృతరాష్ట్రుఁడు విదురుఁడు, మృతినొందిరి పిమ్మట (పాండవులు) యుద్ధమృతుల భార్యలను స్వర్గము నొందించిరి. పిమ్మటఁ గృష్ణుఁడు వైకుంఠమున కేఁగఁగా నతనిభార్యలఁ గోలుపోయి పాండవులు మహాప్రస్థానికముఁ జేసి స్వర్గమునొందిరి. ఇదియే రాజ్యనాశనమునకైన భేదము—"జయ" మనునదియు—వైయాసుని మూలగాథానుక్రమణికలో మహాభారతగాథాంశరము లున్నవి. కాని మహాభారతయుద్ధ మైనముప్పదియాఱేండ్ల కైన కృష్ణ

(౧) నేఁటికి డెబ్బదిసం॥ములకంటెఁ బూర్వము కర్ణాటకపటాలపు సుబేదారు పట్టాభి[illegible] కాశిలో నియుక్తపండితులచేఁ బ్రాచీనపు కాగితములపై వ్రాయించిన భారతపుప్రతిలో పాండవులు రాజ్యము నొందువఱకే యాఖ్యాయమున్నది. నన్నయ తెలిఁగింపుకూడ నింతవఱకేను.

నిర్యాణమహాప్రస్థానికగాథయుఁ బదునేను లేక పదునెనిమిది సంవత్సరములకైన యుద్ధమృతుల భార్యలు స్వర్గగతులగుట ధృతరాష్ట్రాదుల నిర్యాణము మొదలగునవి యుద్ధానంతరము మూఁడేండ్లకు రచింపఁబడిన వ్యాసునిగ్రంథమున నెటులు వ్రాయఁబడెను? కాని "సౌతి"యొక్క యనుక్రమణికాధ్యాయమునందు వ్యాసుఁడు "జయ"మును రచించి యెటు లీగ్రంథమును లోకమునఁ బ్రకాశింపఁ జేయుదు నని యాలోచించుచుండఁగా బ్రహ్మ ప్రత్యక్షమై గణేశునిచే నీగ్రంథము వ్రాయించి లోకమునఁ బ్రకాశింపఁజేయు మనుటయు వ్యాసుఁడటులఁ జేసి శుకాదులచేఁ జదివించిన పిమ్మటను వైశంపాయనుఁడు భూమిపై వ్యాపింపఁజేయుటయు ననువృత్తాంతము కాన్పించుచున్నది. పైకారణముచే నొకవేళ వ్యాసుఁడు జయమును యుద్ధానంతరము మూఁడేండ్లకు రచించినను శిష్యులకుఁ జెప్పునాఁటికి పాండవులు గతించుటచేఁ బాండవనిర్యాణగాథనుఁ గూడ జయముయొక్క చివరను జేర్చియుండును. కొందఱు పాశ్చాత్యవిమర్శకులు "ధృతరాష్ట్రాదులు" వనమున కేఁగునాఁటికి పరీక్షిత్తు పెల్లికడనుండిన బాలుఁడగుటచే యుద్ధానంతరము మూఁడేండ్లకే ధృతరాష్ట్రాదులు గతించియుండురనియుఁ, బిమ్మట స్వల్పకాలముననే యాదవపాండవులు స్వర్గమున కేఁగి యుండురనియు వ్రాసియున్నారు. ఆప్రకారముచే నైనను వ్యాసుఁడు పాండవనిర్యాణమును జయములో వ్రాసియుండుట విరుద్ధము కాదు. ఆదిపర్వపు మొదటి యధ్యాయమునఁ గూడ "సౌతి" ధృతరాష్ట్రాదులు మృతినొందిన తరువాతనే వ్యాసుఁడు భారతమును లోకములోఁ బ్రకటించినటులు చెప్పు నీక్రిందిశ్లోకార్థము గమనింపఁదగియున్నది. (౧)

వ్యాసుఁడు పూర్వకాలమునందు, తల్లియొక్కయు భీష్మునియొక్కయు ననుమతి నొంది విచిత్రవీర్యుని భార్యలయందు త్రేతాగ్నులఁబోలు ధృతరాష్ట్రాదుల మువ్వురఁ గని పిమ్మటను దపస్సుకొఱకు స్వాశ్రమమున కేఁగెను. ఆధృతరాష్ట్రాదులు పుట్టి పెరిఁగి పెద్దవారై మృతినొందిన పిమ్మటను భారతము

---

(౧) మాతుర్నియోగా ద్ధర్మాత్మా గాంగేయస్య చ ధీమతః । క్షేత్రే విచిత్రవీర్యస్య కృష్ణద్వైపాయనః పురా ॥ త్రీనగ్నీనివ కౌరవ్యాన్ జనయామాస వీర్యవాన్ । ఉత్పాద్య ధృతరాష్ట్రంచ పాండుం విదురమేవచ । జగామ తపసే ధీమాన్ పునరే వాశ్రమం ప్రతి ॥ తేషుజాతేషు వృద్ధేషు గతేషు పరమాంగతిం । అబ్రవీద్భారతం లోకే మానుషే ఽస్మి న్మహానృషిః । ... విస్తరం కురువంశస్య గాంధార్యా ధర్మశీలతాం । క్షత్తుః ప్రజ్ఞాం ధృతిం కుంత్యాః సమ్యగ్ద్వైపాయనో బ్రవీత్ । వాసుదేవస్య మాహాత్మ్యం పాండవానాంచ సత్యతాం । దుర్వృత్తం ధార్తరాష్ట్రాణా ముక్తవాన్ భగవానృషిః ॥ ఆదిపర్వము ౧ అధ్యాయము.

ను జేసి మనుష్యలోకమునఁ బ్రకటించెను....కురువంశముయొక్క విస్తరమును, గాంధారియొక్క ధర్మశీలతయు, విదురుని ప్రజ్ఞయు, కుంతియొక్క ధైర్యము, బాగుగఁ జెప్పెను. వాసుదేవుని మాహాత్మ్యము, పాండవుల సత్యత్వము, ధార్త రాష్ట్రుల దుర్వృత్తమును వ్యాసుఁడు చెప్పెను." (వాసుదేవమాహాత్మ్యము హరి వంశములోనిది) పైశ్లోకార్థములచే ధృతరాష్ట్రాదులు మృతినొందినపిమ్మట నే వ్యాసుఁడు "జయము" ను బ్రకటించి యుండును గాన యుద్ధానంతరగాథలు కూడ జయములో నిమిడియుండుట యాశ్చర్యకరము కాదు. కాని పాండవులకుఁ బితామహుఁడగు వ్యాసుఁడు పాండవుల మరణానంతరమునఁ గూడ నుండునా యను సందియ మొకటి చాలనుండి బాధించుచు. నాఁడే కాక నేఁడును, మున్నూరుగులు పెద్దగుచు జీవించినవారును మనుజులు బిడ్డలఁ గని యేఁబ దేండ్లు వచ్చి ప్రసిద్ధులైన పిమ్మట జీవించు తాతలను, అట్టివారిని గూర్చిఁ జూచు చుంటిమి గాన, దీర్ఘాయుర్దాయమునకుఁ బుట్టినిల్లగు భరతఖండమునందు, యోగశక్తిచేతను నింద్రియజయముచేతను వ్యాసుఁ డంతదీర్ఘకాలము జీవించి యుండె ననుటలో నతిశయోక్తి లేదు. స్వర్గారోహణపర్వమునందును వ్యాస విరచిత భాగముండుటచేతనే దానియందును (౧) "ఇది జయమను నితిహాసము" అనునర్థముగల శ్లోకమున్నది. పైని వ్రాసిన "వ్యాసగ్రంథానుక్రమణిక" యందు కొన్ని విచిత్రములు కాన్పించును చూడుఁడు—బక హిడింబవధలవంటి చిన్న యుద్ధములను గుఱించి వ్రాసియు, కిమ్మీర, కీచక, జటాసురవధలు, అంగారపర్ణు నర్జునుఁ డోడించుట, నివాతకవచ, కాలకేయాదియుద్ధములు, దక్షిణోత్తరగో గ్రహణములు వర్ణింపలేదు. భీమాదులు నాలుగుదిక్కుల జయించిన పిమ్మ టనే ఖాండవవనదహనము చెప్పఁబడినది. రాజసూయయాగముయొక్క పేరైనను లేదు. భీముఁడు తూర్పుదిక్కును జయించె ననుటలో "జరా సంధ" వధయు పాండవు లజ్ఞాతవాసానంతరము తమరాజ్యము నడిగి రను టలో, సంజయకృష్ణరాయబారములు నిమిడి యున్నవి. ద్రౌపదీవస్త్రాపహ రణాదికము కించిత్తైనను సూచింపలేదు. యుద్ధమున దుర్యోధనాదులు మృతి నొందిరనియే కాని మహాయుద్ధవివర మెంతమాత్రము చెప్పలేదు. యుద్ధమృ తుల భార్యలు స్వర్గమునొందిరను స్వల్పాంశముఁ జెప్పి వ్యాసుఁడు ముఖ్యము లగు ద్రౌపదీపరిభవమును గాని యుత్తరదక్షిణగోగ్రహణములు గాని చెప్పక పోవు టకుఁ గారణమేమై యుండును? వ్యాసకృత జయమునఁ గీగాథలు వ్రాయఁబడి(౨)

(౧) "జయో నామేతిహాసోయం." (౨) తిరువాయి చూ. పు. ౩౨, ౯౯పట,

ఇది ౩౬-వ పుటలోని * చిహ్నము కడనుండవలసినది.

| పర్వములు. | అనుక్రమణికలో జెప్పఁబడిన యధ్యాయములు. | వ్రాఁతప్రతి ననుసరించి యధ్యాయ సంఖ్య. | చెన్నపురి ప్రతి. | బొంబాయి ప్రతి. | కలకత్తా ప్రతి. |
|---|---|---|---|---|---|
| ఆదిపర్వం .. | 227 | 236 | 240 | 260 | 236 |
| సభాపర్వం .. | 70 | 80 | 80 | 103 | 80 |
| వనపర్వం .. | 269 | 312 | 314 | 315 | 314 |
| విరాటపర్వం .. | 67 | 70 | 72 | 76 | 72 |
| ఉద్యోగపర్వం .. | 186 | 199 | 197 | 196 | 197 |
| భీష్మపర్వం .. | 117 | 120 | 124 | 122 | 114 |
| ద్రోణపర్వం .. | 170 | 203 | 203 | 203 | 204 |
| కర్ణపర్వం .. | 69 | 96 | 97 | 101 | 96 |
| శల్యపర్వం .. | 69 | 73 | 66 | 66 | 65 |
| సౌప్తికపర్వం .. | 18 | 19 | 18 | 18 | 18 |
| స్త్రీపర్వం .. | 27 | 19 | 27 | 27 | 27 |
| శాంతిపర్వం .. | 369 | 366 | 366 | 375 | 365 |
| అనుశాసనికపర్వం | 146 | 168 | 168 | 274 | 92 |
| అశ్వమేధపర్వం .. | 103 | 62 | 92 | 118 | 168 |
| ఆశ్రమవాసపర్వం | 42 | 39 | 39 | 41 | 39 |
| మౌసలపర్వం .. | 8 | 8 | 8 | 9 | 8 |
| మహాప్రస్థానికపర్వం .. | 3 | 3 | 3 | 3 | 3 |
| స్వర్గారోహణపర్వ | 5 | 6 | 6 | 6 | 6 |
| మొత్తం .. | 1935 | 2079 | 2120 | 2313 | 2104 |

పైపట్టికలో నన్నిటికన్న బొంబాయిప్రతిలో ననుక్రమణికాధ్యాయమునఁ జెప్పఁబడినదానికంటె మూఁడువందల డెబ్బదియెనిమిది యధ్యాయములు హెచ్చుగ నున్నవి. వ్రాఁతప్రతియందు నూటనలువదినాలు గధ్యాయములు మాత్రమే హెచ్చుగ నున్నవి.

వ్రాఁతప్రతి డెబ్బదిసం॥రములకు ముందు కాశిలో వ్రాయించినది. ఇది "దొడ్డంపేట"లోని భాగవతి లక్ష్మీపతి సోమయాజులుగారు నాకెరవిచ్చిరి. చెన్నపురిప్రతి తెనుఁగున ముద్రింపఁబడిన ప్రతి. బొంబాయిప్రతి T. R. కృష్ణమాచార్యులువారిది. కలకత్తాప్రతి ప్రతాపచంద్రరాయిగారిది.

యుంత లేదేమో? ప్రతిపర్వమునందలి యధ్యాయములసంఖ్యమాత్రమె కాక శ్లోకసంఖ్య కూడ "పర్వానుక్రమణికాధ్యాయము" నం జెప్పినటుల కాన్పింపదు. అన్నిపర్వముల శ్లోకసంఖ్యను బరిశీలించిన తిలకుమహాశయునకుఁ గలకత్తాప్రతి ననుసరించి 99 వేల శ్లోకములు కాన్పించినవి. నూఱువేలలో నొకవేయి మాత్రము కొదవ. మఱికొందఱు పాశ్చాత్త్యులు నూటయేఁడువేల శ్లోకము లనిరి. కుంభకోణపుఁ బ్రతిని గాని ఆంధ్రలిపితోఁ గూడినభారతమునుఁ గాని లెక్కించి నచో నూఱువేలకుమించి యుండును, చిన్నపర్వ మగుసభాపర్వములోని శ్లోకములను లెక్కింపఁగా పర్వానుక్రమణిక ననుసరించి 2511 శ్లోకములకు మాఱుగ 2709 శ్లోకము లాంధ్రదేశపు ప్రతిలో నాకుఁ గాన్పించినవి. పెక్కుకారణములచే నాలోచింపఁగా "వ్యాస, వైశంపాయన, సౌతి" యనువారలేగాక తదితరులును గొన్నిశ్లోకములనే గాక కథలను అధ్యాయములఁ గూడ దృశ్యమానమహాభారతమున నిమిడ్చి యున్నారని యనుభవముచే వ్రాయసాహసించుచున్నాను. వెవ్వేఱు దేశపుఁ బ్రతుల ననుసరించిన యధ్యాయసంఖ్యాపట్టికను జూడుఁడు. * (చూ. పుట. 3౫.)

అనుక్రమణికాధ్యాయములోని యానుశాసనికపర్వాధ్యాయములు నూటనలువదియాఱై యుండఁగా బొంబాయిప్రతిలో రెండునందలడెబ్బదినాలుగై యున్నవి. నూటయిరువదియెనిమిది హెచ్చైయున్నవి. అనేకచిన్నచిన్నగాథలు కూడ నాంధ్రీకృతభారతములోను, ఆంధ్రలిపిగల సంస్కృతభారతములోను లేనివి బొంబాయిప్రతిలోఁ గాన్పించుచున్నవి. గ్రంథవిస్తరభీతిచే వాని నిట వివరింప లేదు. వ్యాసుఁడు మొదటవ్రాసిన జయము వ్రాఁతప్రతిలో నుండినటులు యుద్ధాంతమువఱకే, యై యుండుననుట కింకొకనిదర్శనము కాన్పించుచున్నది. భాగవతముకూడ వ్యాసకృతమను నైతిహ్యము కలదు. అదినేఁడు కాన్పించు భాగవతము కాకున్న మానె, భక్తిబీజ మగునదియై స్వల్పపరివ్యాప్తి గ్రంథమై యుండు నని తలఁపవలసి యున్నది. భారతమువలెఁ గాలాంతరమున నాగ్రంథమును "శుకా" దులచే వ్యాప్తినొందింపఁబడినట్టున్నది. ఆభాగవతములో నారదోపదేశముచే భాగవతముఁ జేయఁదలఁచుకొని వ్యాసుఁడు సౌప్తికపర్వమునందలి యశ్వత్థామార్జునయుద్ధాంతగాథనే ప్రారంభించి యుండుటచేతను వ్యాసకృతజయము మొదట నంతవఱకె రచింపఁబడి లోకమునందు వ్యాప్తినొందించునాఁటికి స్వర్గారోహణపర్వాంతగాథలఁ గూడ మొదటి "జయ" మునకు ననుబంధముగాఁ జేసియున్నాఁ డని స్పష్ట మగుచున్నది. వైశంపాయ

నుఁడు జనమేజయునకుఁ జెప్పినగ్రంథము వాల్మీకిరామాయణమువలె నిరువది నాలుగు వేల శ్లోకములు కలదై యితిహాసరహితమై కేవలము కురుపాండవచరితము మాత్రమే యై యున్నది. అదియే భారతము. ఆభారతము పాండవులు స్వర్గస్థులగునాఁటికి ముప్పదియాఱు (36) సంవత్సరములు యీడుకలవాఁడై పట్టాభిషేకము నొంది యఱువది సంవత్సరములు రాజ్యముఁ జేసి తక్షకవిషముచేఁ జచ్చిన పరీక్షిత్తునకుఁ గుమారుఁడగు జనమేజయుఁడు "శంకుకర్ణ, శతానీకుల"ను కుమారుల ను, "అశ్వమేధదత్తు" అనుమనుమనిఁ గనిన పిమ్మట సర్పయాగముఁ జేయఁగాఁ గారణాంతరముచే నది విఘ్నమైనపుడు "వైశంపాయనుని"చే జనమేజయునకుఁ జెప్పఁబడినది. పరీక్షిత్తు భారతయుద్ధానంతరము తొంబదియాఱు (96) సంవత్సరములకు మృతినొందెను. అప్పటికి జనమేజయుఁడు తండ్రి మృతినిఁ గుఱుతెఱుఁగని బాలుఁడు. అతఁడు మనుమల నెత్తునాఁటికి, అఱువది (60) సంవత్సరములైన నుండును. అప్పుడే వైశంపాయనుఁడు భారతముఁ జెప్పియుండుటచే యుద్ధానంతరము లేక వ్యాసుఁడు భారతమును రచించిన పిమ్మటను నూటయేఁబది (150) సంవత్సరములకు వైశంపాయనభారతము చెప్పఁబడియున్న దని దృఢముగఁ జెప్పవచ్చును. అపుడు "సౌతి" ఆభారతమును విని యున్నాఁడు. తానచటినుండి తీర్థయాత్రలఁ గావించుకొని శౌనకాదుల సత్రయాగమునకువచ్చి మహాభారతమునంతయుఁ జెప్పియున్నాఁడఁట. సౌతి వైశంపాయనుఁ డొకసారి జనమేజయునకు భారతమును వినిపించినంత మాత్రమునను యిరువదినాలుగు వేల (24000) గ్రంథమును గంఠపాఠముఁ జేయలేఁడుగాన దాని నింకొక పదియేండ్లలో నేరిచి శౌనకాదులకుఁ జెప్పియుండె ననవచ్చును. అందువలన సౌతియొక్క మహాభారతము వ్యాసుఁడు "జయముఁ" జేసినతరువాతను రమారమి నూటడెబ్బది (170) సంవత్సరములకు రచియింపఁబడియుండును.

ఇదివఱలోఁ జెప్పఁబడినరీతిని వ్యాసునిజయము ఆదిపర్వములోని యఱువదిరెండవ యధ్యాయము మొదలయి యుండినను తదనంతరాధ్యాయములన్నియు వ్యాసకృతము లని తలఁపరాదు. జయమును వైశంపాయనుఁడు జనమేజయునకు వినిపించుచుండఁగా జయములోని సూక్ష్మగాథను జనమేజయుఁ డడి

(౧) కాశీవ్రాఁతప్రతియు నన్నయాంధ్రీకరణమున కుపయుక్తమగు నాఁటి వ్రాఁతప్రతియు నేనూహించిన యనుక్రమణికాధ్యాయములోనిగాథ సౌప్తికవధాంతమె యుండెను. సౌప్తికవధాంత

గినప్రశ్నలపై పెంచి వైశంపాయనుఁడు చెప్పవలసి వచ్చుచుండెడిది. వ్యాసుని రచనాపద్ధతిని సూక్ష్మముగాఁ బరిశీలించినచో వంశావతారణ పర్వములోని యఱువదిమూఁడవ యధ్యాయమునకుఁ బిమ్మట నేయిరువది ముప్పది శ్లోకముల లోనో ధృతరాష్ట్రాద్యుత్పత్తిగాథనుఁ జెప్పి సంభవపర్వములోని నూటయిరువదియాఱవ యధ్యాయము చెప్పవలసి యున్నది. కాని, జనమేజయుని కాలంకప్రశ్నలచే నఱువదియధ్యాయములకుఁ బైఁబడిన గాథ పెఱిగినది. ఆ యఱువదికిఁ బైఁబడిన యధ్యాయగాథలోను సౌతికృతకల్పనలే కాక సౌతికిఁ బిమ్మటనగు గాథలుకూడఁ గూర్పఁబడెనని నూటయిరువది రెండవ యధ్యాయ గాథచే నూహించుచున్నాను. ఆగాథయిది—

ఉద్దాలకుని కుమారుఁడగు శ్వేతకేతువు తనతల్లి నొక బ్రాహ్మణుఁడు పుత్రార్థియై కామింపఁ దానినిజూచి సహింపక వివాహ నిబంధన నేర్పఱిచె ననునది. ఇది పాండురాజు కుంతితోఁ జెప్పినటుల నున్నది. నిజమునకీగాథ సౌతికిఁ బిమ్మటనై యున్నది. కారణ మేమనఁగా శ్వేతకేతువు, ఉద్దాలకుని కుమారుఁడు. ఉద్దాలకుఁడు నళియను పేరుగలిగి మిథిలరాజ్యము నేలుచున్న జనకుని సభలో యాజ్ఞవల్క్యునితో వేదాంతచర్చఁ జేసి యోడినఋషి. యాజ్ఞవల్క్యుఁడు జనమేజయునకు భారతము వినిపించిన వైశంపాయనుని శిష్యుఁడు. యాజ్ఞవల్క్యునకు నుద్దాలకునితో వాదము జరుగునాఁటికి జనమేజయుఁడుకూడ స్వర్గస్థుఁడై యుండెనని యుద్దాలకుఁడు యాజ్ఞవల్క్యు నడిగినపుడే లాహ్యాయని భుజ్యుఁడు యాజ్ఞవల్క్యు నడిగిన ప్రశ్నలచేఁ దెలియుచున్నది. (చూడుఁడు. బృహదారణ్యకోపనిషత్తును) అట్టియుద్దాలకుని పుత్రుగాథను అనఁగా పాండురాజు గతించినపిమ్మటను సుమారు రెండువందలయేఁబది యేండ్లకైన గాథను పాండురాజు కుంతితోఁ జెప్పినటుల సంభవపర్వములోని నూట యిరువది రెండవ యధ్యాయమున నుండుట యసంభవముగా నున్నది. ఈశ్వేతకేతుని గాథ జనమేజయుని మరణానంతరముకూడ నైయుండును. అందువలన వ్యాస వైశంపాయనుల జయ భారతములలోనిది మాత్రమే కాక సౌతియొక్క మహాభారతములోనిది కూడ కాదని తలఁతును. ఇంతమాత్రమె కాదు శ్వేతకేతువు కుమారునిగాథ కూడ శాంతిపర్వములోనుండుటచే జనమేజయుఁడు గతించినపిమ్మటను నూఱేండ్లకైన గాథలుకూడ మహాభారతమునఁ గూర్పఁబడిన వని వ్రాయ సాహసించుచున్నాను. డాక్టరు “బూలరు” గారు ఆపస్తంబధర్మసూత్రముల కింగ్లీషుభాషాంతరీకరణముఁ జేసియున్నారు. వా రాపస్తంబ హారీత శ్వేతకేతులు సమకాలీనులని

యు ఆపస్తంబుఁడు క్రీ॥ పూ॥ నాలవశతాబ్దపు వాఁడనియు వ్రాసియున్నారు కాని శాకటాయనునిచేతను పాణినిచేతను దమవ్యాకరణములలో నుచ్చరింపఁబడిన యాపస్తంబుఁడును ఉపనిషత్తులలోఁ జెప్పఁబడిన శ్వేతకేతు హారీతులును క్రీస్తు పూ॥ నాలవశతాబ్దపువారని చెప్పుటకు వీలు లేదు కాని జనమేజయునకుఁ బిమ్మటి వారు. అట్టివారిలోని శ్వేతకేతువుయొక్క గాథను పాండురాజు కుంతికిఁ జెప్పుటయు శ్వేతకేతుపుత్త్రుని గాథను భీష్ముఁడు ధర్మరాజునకుఁ జెప్పుటయు వ్యాస వైశంపాయన సౌతికృత జయ భారత మహాభారతములకంటెఁ గూడఁ గొన్ని గాథ లిప్పటి మహాభారతమున నిమిడియున్న వని స్పష్టముగఁ జెప్పవచ్చును. ప్రస్తుతపు మహాభారతము సంపూర్ణశుద్ధి లేకుండఁగూడఁ గొన్నిచోటులఁ గూర్పఁబడినదని వ్రాసినందులకుఁ బెద్దలు నన్ను క్షమింతురు గాక.

ఇందుకు రెండుమూఁడు నిదర్శనములను మాత్రము వ్రాయుచున్నాను.

పాండురాజు శతశృంగపర్వతమున మృతినొందఁగా మాద్రి పాండురాజుతోఁ జితాగ్నినొంది మృతినొందినదని ఆదిపర్వముయొక్క ౧౨౫ అధ్యాయమున వర్ణింపఁబడినది కాని ౧౨౬ అధ్యాయమున మాద్రీపాండుల శరీరములు హస్తినా పురికిఁ గొనిరాఁబడి విదురాధిపత్యమున నచట దహింపఁబడినటుల వర్ణింపఁబడి యున్నది. నన్నయభట్టారకుఁ డీయసంబద్ధము దగ్గఱ నేయుండుటఁ జూచి కాఁబోలు మాద్రిపాండుల యంగములు గొనిరాఁబడి హస్తిపురిలో విదురాధిపత్యమున సంస్కరింపఁబడినవని వ్రాసియున్నాఁడు. ఇంకొకటి, ఆదిపర్వమునఁ గర్ణుఁడు సద్యోగర్భజనితుఁడుగా వర్ణింపఁబడినాఁడు. ఆగాథ యచట నిష్ప్రశ్నముగాఁ జెప్పఁబడియున్నది. అరణ్యపర్వాంతమున జనమేజయప్రశ్నకు వైశంపాయనుఁడు కర్ణవృత్తాంతముఁ జెప్పుచు గర్ణునిఁ గుంతి పదిమాసములు గూఢముగా మోసి కనినది యని చెప్పియున్నాఁడు. అరణ్యపర్వమున రామాయణగాథ కలదు. అందుఁ గుంభకర్ణుని లక్ష్మణస్వామి వధించినటులఁ గలదు. ఇది సంస్కృతము ననుసరించియే యాంధ్రీకరింపఁబడియున్నది. లక్ష్మణస్వామి కుంభకర్ణునిఁ జంపుట రామాయణగాథా ప్రతిపాదితము లగు గ్రంథములలో నెచ్చటను గానము. ఇట్టి యసంబద్ధములు మహాభారతమునఁ బెక్కులు గలవు కాని గ్రంథ విస్తరభీతిచే వ్రాయ లేదు. ఇంకొకటి, వ్యాసుని యనుక్రమణికాపద్ధతిఁ జూడఁగా నాతని జయమున సభాపర్వాంతమువఱకుగల గాథలు విపులముగా వ్రాయఁబడి తక్కినగాథలు క్లుప్తముగా వ్రాయఁబడెనని తలఁపఁబడుచున్నది. యుద్ధపంచకపుగాథలు చాలఁ గ్లుప్తముగా వ్రాసినటులఁ గలదు. భీష్మపర్వపుగాథ యీపర్వ

ము నఁ బదుమూఁడవయధ్యాయమునఁ బదుమూఁడు శ్లోకములచేఁ జెప్పఁబడి నది కాని ధృతరాష్ట్ర సంజయులకును జనమేజయ వైశంపాయనులకును నగు నుత్తర ప్రత్యుత్తరములచేఁ దక్కిన గ్రంథమంతయుఁ బెఱిగినది. ద్రోణపర్వపు గాథ మాత్రము చిన్నచిన్నవియగు నెనిమిదియధ్యాయములలోఁ జెప్పఁబడినది. తక్కి నది జనమేజయాదుల ప్రశ్నోత్తరముల చేతనే వృద్ధినొందినది. అట్లనే కర్ణపర్వ గాథ యిఱువది శ్లోకములుగల కర్ణపర్వపు మొదటి యధ్యాయము చేతను శల్య సౌప్తికపర్వముల గాథ ముప్పదియెనిమిది శ్లోకములు మాత్రమెగల శల్యపర్వపు మొదటియధ్యాయము చేతను జెప్పఁబడి తక్కిన గ్రంథమంతయు జనమేజయాదుల ప్రశ్నోత్తరములచేఁ బెంపఁబడినది. భారతయుద్ధగాథ నంతయును సూక్ష్మ దృష్టితోఁ జదివినయెడల ద్రోణపర్వముననే మహాయుద్ధములు కలవు. వీరాధి వీరులు ద్రోణపర్వముననే వధింపఁబడినటుల వర్ణింపఁబడియున్నది. వ్యాసకృత భారతముగాఁ దలఁపఁబడు భాగములలో భీష్ముఁడు పదిదినములు సేనాధిపత్య ముఁ జేసినట్లుఁ గలదు కాని యాతఁడు విశేషయుద్ధముఁ జేసినట్లుఁ గాన్పిం పదు. వ్యూహములనుఁ బన్నుకొనుటతో సరిపోయియుండును. నాఁటియుద్ధ ధర్మములుకూడ నేఁటివలె "నవనవద్యుద్ధములు" (ఎదుటఁబడి పోరాడుట, గోతులు వనములు మొదలగువానిలోఁ బొంచియుండి శత్రువులను వధించుట) కలవని శాంతిపర్వము మనుస్మృతి కౌటిలీయార్థశాస్త్రము కామందకము శుక్రనీతి యను గ్రంథములలోఁ జెప్పఁబడినదానిచే నూహింపఁబడుచున్నది. భీష్ముఁడును నటులు వ్యూహములఁ బన్నుచు పదియవనాఁ డెపుడో యర్జునశిఖండుల బాఱిఁబడి మడిసియుండును. భీష్ముఁడు శతవృద్ధుఁడగుటచే నాతఁడు పొరపాటున శత్రువువ శగ్గమై చనిపోవునని దుర్యోధనుఁడు తలఁచియే యాతనిఁ గాచుచుండవలెనని పెక్కునారులు చెప్పినటులఁ బెంపఁబడిన భీష్మపర్వమునఁ గలదు. భీష్ముని మర ణముతోఁ గౌరవులు భయకంపితులై పెద్దప్రయత్నముతో ద్రోణునకు సైన్యాధి పత్యమిచ్చిరి. ద్రోణుఁడు పెక్కువ్యూహములఁ బన్నినట్లు మహాభారతము నఁ గాన్పించుచున్నది కాని ద్రోణుని సైన్యాధిపత్యకాలమున నాతఁడు శకటవ్యూ హమును బన్నఁగాఁ బాండవులు క్రౌంచవ్యూహమును బన్నినటుల వ్యాసుని జయమని తలఁపఁబడు మూలభారతమునఁ గలదు. ఒక్క శకటవ్యూహము చేత నే యాతనియుద్ధము పూర్తియైనది. మఱియొకటి, మూలభారతము సౌత్యాదుల చేఁ బెంపఁబడినటులనే వ్యాసుఁడు రచించిన కృష్ణకథగల హరివంశము నశించి యున్నది. అది యాదిపర్వముయొక్క రెండవయధ్యాయము రచియింపఁబడునాఁ

టికే శిథిలమైనట్లు సందు సర్దింపఁబడినది. నేఁడు కాన్పించు హరివంశము గాథోపగాథలతో నిటీవలఁ బెంపఁబడినది. నేఁడు కాన్పించు మహాభారతములోని కొన్ని భాగములు బౌద్ధమత విజృంభణానంతరమును అలగ్జాండరు దండయాత్ర చేసినపిమ్మటను రచింపఁబడియున్నవని కొందఱు పాశ్చాత్యవిమర్శకులు వ్రాసియున్నారు. విశేషపాఠభేదములు కాళిదాసునాఁటికే కలిగియుండునుగాని యంతమాత్రముచే మహాభారతభాగములు గ్రీసుదేశీయుల దండయాత్రానంతరము పాశ్చాత్యవిమర్శకులు వ్రాసిన భ్రాంతలకారణములచేఁ గూర్పఁబడెనని తలంప మనసుకొప్పుటలేదు. కారణమేమనఁగా (౧) "ఏడూక" శబ్దము మహాభారతమున నుండుటచేతను అది బౌద్ధమతస్థుల యస్థికలఁ బూడ్చి దానిపైఁ గట్టిన స్తూపమగుటచేతను (డాగోబా యనిపాలీభాషలోనిపేరు) అట్టి దేవాలయములు విస్తారమీభరతఖండమునఁ గలవని మహాభారతమున రచియింపఁబడుటచేతను బౌద్ధమతవిజృంభణానంతరముననే మహాభారత భాగములు కొన్ని విరచింపఁబడెనని కొందఱితలంపై యున్నది. బౌద్ధమతధర్మములు భారతీయ సాంప్రదాయయుక్తములగుటచేతను బౌద్ధమతమునకుఁ బూర్వముననే యే వేని యొకవిధమగు "నేడూక" చిహ్నములుండియుండును. సూత్రకాలమున గృహనిర్మాణము గుంజలపై బొంగు వెదుళ్లను వేసి యిండ్లనుఁ గట్టుచుండిరి. (౨) మయునిచే ధర్మరాజునకుఁ గట్టఁబడిన సభానిర్మాణమె గోడలఁ బెట్టి గృహములఁ గట్టుట యారవ్యలలో మొదలు. మహాభారతములో మయసభావర్ణనముఁ జూచినచో గోడలు వర్ణింపఁబడినయంశములు కాన్పించును. ద్యూతమునకుఁ గృత్రిమాలోచనముఁ జేసిన పిమ్మటను ధృతరాష్ట్రుఁడొకసభాశాలను నిర్మింపఁజేసియున్నాఁడు, అందు స్తంభములేకాని గోడలు లేవు. ఆకాలమున నిర్మింపఁబడిన గృహకుడ్యములైనను స్తంభములను నడుమనుంచి కట్టఁబడినగోడలైయున్నవి. అందువలననే మయుఁడు

(౧) ఏడూకా న్పూజయిష్యంతి వర్జయిష్యంతి దేవతాః
ఏడూకచిహ్నపృథివీ నదేవగృహభూషితా
భవిష్యతి యుగేక్షీణే తద్యుగాంతస్య లక్షణం ॥ వనపర్వం 190 అ ॥

(౨) ఇహైవ తిష్ఠ నిమితా తిల్వలా స్యాదిరావతీ మధ్యే తాల్పశస్య తిష్ఠాన్త్వా ప్రాపన్నమాయవః ॥ ఋతేవ స్థూణా వధిరోహవంశో గ్రోవిరాజ న్నపసేధ శత్రూన్-ఏకాగ్ని మంత్రప్రశ్నం అ. 2 - 5.

తాత్పర్యం॥ ఓగుంజా వడ్రంగిచేసిన నగిషీకలదానవై యీద్వారదేశమునఁ బాతఁబడినదానవై యుండుమా. గృహమధ్యముననుండిన నిన్ను దోషములు పొందకపోఁగాక! ఓవెదురా గుంజపైనుండి ప్రకాశించుచు శత్రువులను వెళ్లఁగొట్టుము.

"ఏడూక మంతర్న్యస్తకీకసం" అనినాఁడు. అనఁగా లోపలను గొయ్యిఁ బెట్టి కట్టిన గోడకు ఏడూక మని పేరు. కీకసశబ్దమునకుఁ గొయ్యి యెముక కూడ నర్థమగును. మహాభారత రచనాకాలమునకు ధర్మజానిసభానమోనాలచే దేశమంతయుఁ గొయ్యిలను నడుమనుంచిన గోడలచే రాజమందిరములు ధనికమందిరములు కట్టఁబడుచుండుటఁ జూచి యాకవి దేవగృహములఁ బూజింపక యేడూకములనే గౌరవించుచున్నా రని వ్రాసియున్నాఁడు. ఇప్పటి కాలమున పాశ్చాత్యవాస్తుశాస్త్రవిధానముచేఁ గట్టఁబడినమండువా లేనిగృహములు (బంగాళాలు) ఎట్లు భారతీయ వాస్తుశాస్త్రవిరుద్ధములో నాఁటి "నంతర్న్యస్తకీకసములు" గల గృహములార్యవాస్తుశాస్త్ర గర్హితములు. అందువలననే యాకవి వానిని గర్హించియున్నాఁడు. నేఁడు కొందఱుపూర్వాచారపరులు బంగాళాలగు నిండ్లను నిందించుచుండుటఁ జూచుచున్నాము. అట్లనే నాఁటివా రేడూకములను నిందించుచుండిరి. అంతర్న్యస్తకీకసభిత్తులపైఁ గట్టినగృహములు దత్తమండలాంధ్రులకును నైజామురాజ్య వాసులకునుఁ గ్రొత్తకావు. బౌద్ధమత విజృంభణకాలమునం దెముకలపైఁ గట్టిన గోడలకు గౌరవము హెచ్చియుండెనే కాని యేడూకము మయునిచేనారంభింపఁబడినదే మొదలనిమాత్రము నిశ్చయముగాఁ జెప్పవచ్చును.

యవనశబ్దము పలుచోట్ల మహాభారతమున వాడఁబడుటచేఁ బాశ్చాత్య విమర్శకులు కొందఱు మహాభారతములోని కొన్నిభాగములు అలగ్జాండరు దండయాత్రనుఁ జేసినపిమ్మటనే కూర్పఁబడియుండునని వ్రాసియున్నారు. కారణమేమనఁగా గ్రీకులను యవనులని భారతీయులు పిలుచుటచేతను—గ్రీకులను యవనులని భారతీయులు పిలుచుటయు గ్రీసుదేశమునకు భారతదేశమునకు నన్యోన్య సంబంధము కలుగుటయు నలగ్జాండరు దండయాత్రతోడనె రాలేదు. అంతకుముందు పెక్కు శతాబ్దములక్రితమె సంబంధము కలిగియున్నది. పాణిన్యాచార్యులు క్రీ. పూ. ౭-౮ శతాబ్దముల ప్రాంతమువాఁడని కొందఱును ౧౨ శతాబ్దప్రాంతమువాఁడని మఱికొందఱును పూర్వపాశ్చాత్యపండితులు వ్రాసియున్నారు. పాణినికంటె శాకటాయనుఁడు ప్రాచీనుఁ డనుటకుఁ బాణిని శాకటాయను ననేకసారులు తన వ్యాకరణమునఁ బేర్కొనుటయే నిదర్శనము. అట్టి శాకటాయనుఁడు పాణినికూడ తమ వ్యాకరణములోఁ బెక్కుసారులు యవనశబ్దము నుచ్చరించియున్నారు. పాణిని శాకటాయనులచేఁ బేర్కొనఁబడిన యవనులనే మహాభారతగ్రంథకర్తయుఁ దనగ్రంథమునఁ బేర్కొనెను. పాణిని

శాకటాయన మహాభారత గ్రంథములలోఁ జెప్పఁబడిన యవనులు గ్రీసుదేశీయులా? వారిలిపి దుష్టలిపి (౧) వారు ముండనము భారతీయాచారవిరుద్ధముగాఁ జేయించుకొనుచున్నారు. (౨) శాకటాయనుఁడు లిపినిమాత్రమె చెప్పినాఁడు. పాణిని లిపిని స్మృతిని ఆచారమునుఁగూడ చెప్పినాఁడు. మహాభారతమునఁ బెక్కుచోటుల యోధులనుఁగాఁ జెప్పఁబడిరి. పైకారణములచే శాకటాయనాదుల కాలముననే భారతదేశీయులకుఁ బాశ్చాత్యదేశ సంబంధము కలిగియున్నదనియుఁ బ్రాచీనులు తమగ్రంథములలో నరేబియా దేశీయులనో గ్రీసుదేశీయులనో చెప్పియున్నారనియుఁ దలంపవలసియున్నది. పాణిని శాకటాయనులు చెప్పినలిపి దుష్టలిపియగుటచే నాలిపి "ఫొనిషియా" లిపియో "కీల" లిపియోయై యాయవను "లరబ్బులై" యుందురని తలంచుచున్నాను. అరబ్బుల ముండనముకూడ భారతీయాచార విరుద్ధమేను. భారతదేశ మరబ్బులదేశమునకు సమీపము కూడనై యున్నది. అందువలన నరబ్బులనే యవనులని భారతీయులు వ్రాసియుందు రేమో? గ్రీకులఁగూడ నిటీవల యవనులని పాశ్చాత్యశచే వ్రాయుట విరుద్ధముకాదు. పైకారణములచే "నలగ్జాండరు" వచ్చినతరువాతను భారతభాగములలోఁ గొన్ని రచింపఁబడినవని చెప్పుటకు వీలులేదు.

మఱియు మహాభారతమునఁ జెప్పఁబడిన విష్ణునియవతారములలో "బుద్ధావతారము" చెప్పఁబడలేదు (౩) అందు కృష్ణావతారమునకుఁ బిమ్మటను కల్క్యవతారమె చెప్పఁబడియున్నది. శాంతిపర్వములోని భాగములించుమించన్నియు "సౌతి" కృతభాగములోనివె యని తలఁపఁబడుచున్నవి. ఆశాంతిపర్వమున దశావతారములలో బుద్ధావతారము పేరులేకుండుటచే బుద్ధునకుఁ బూర్వమె మహాభారతము పూర్తిచేయఁబడియున్న దని నానిశ్చయాభిప్రాయము. అయినను బుద్ధప్రతిబుద్ధశబ్దములచటనచట మహాభారతమునఁ గలవు.

---

(౧) యవనయువా ల్లిపిదుష్టే ॥ ౧-౩-౫౩ ॥ శాకటాయనవ్యాకరణం

"ఇంద్ర వరుణ భవ శర్వ రుద్ర మృడ హిమా రణ్య యవ యవన మాతులా చార్యాణా మానుక్ ॥ ౪.౧-౪ పాణిన్యష్టాధ్యాయి.

(౨) ౨-౧-౭౨ అష్టాధ్యాయియొక్క "మయూరవ్యంసకగణముఁ" జూడుఁడు.

(౩) హంసః కూర్మశ్చ మత్స్యశ్చ ప్రాదుర్భావా ద్విజోత్తమ

వారాహో నరసింహశ్చ వామనో రామఏవచ ॥

రామో దాశరథిశ్చైవ సాత్వతః కల్కిరేవచ. ౩౪౦ అధ్యా ॥ శాంతిపర్వం.

(౧) కాని యని సాంఖ్యమతోదిత పారిభాషికపదములై "జ్ఞాని" యను నర్థమును మాత్ర మిచ్చుపదము లైయున్నవి. బుద్ధునకుఁ బూర్వమె మహాభారతము రచింపఁబడియుండును, కాని, షడ్దర్శనములలోని యోగసాంఖ్యదర్శనములు నిరుక్తము అథర్వవేదము మఱికొన్ని నిఘంటువులు మాత్రము నాఁటికి రచింపఁ బడి యుండెనని మాత్రము శాంతిపర్వములోని 30-వ యధ్యాయముచేఁ దెలియవచ్చుచున్నది.

మహాభారతములోని "యానుశాసనిక" పర్వము "ప్రక్షిప్త"మని యిటీవలఁ గూర్పఁబడె నని ప్రొఫెసర్ "వింటర్నిట్జు" గారు వ్రాయుచున్నారు. ఎందువలన నటులఁ దలఁచిరో తెలియదు. ఆలోచింపఁగా ననుక్రమణికాధ్యాయములో భారతవృక్షవర్ణనయం దానుశాసనికపర్వముపేరు లేకుండుటచేతను వివిధదేశకోశములలో నధ్యాయభేదము విశేషవ్యత్యాసముతోఁ గూడియుండుట చేతను పర్వాంతకర్తవ్యవిధులలో నానుశాసనికపర్వమునకుఁ బ్రత్యేకవిధి గ్రంథాంతమునఁ జెప్పఁబడక పోవుటచేతను దాని నిటీవలఁ జేర్పఁబడినదానినిగాఁ దలఁచి యుందురు. నిజమునకు భీష్మస్వర్గారోహణగాథ తప్ప వేఱు భారతేతిహాసముతో సంబంధించిన గాథ లందుఁ గాన్పింపవు. కాని లక్షశ్లోకపరిమితిగల మహాభారతమున నెనిమిదివేల శ్లోకములు గల భాగమంతయుఁ బ్రక్షిప్తమనుటకు మనసు గొలుపకున్నది. మఱియు వింటర్నిట్జుగారు వీరచరిత్రమై యితిహాస మగు మహాభారతమును బ్రాహ్మణులు స్వార్థపరులై స్వోపకాంక వాక్యములను స్వోపకారకగాథలను మహాభారతమునఁ జొనిపి స్మృతిగాఁ జేసి రనునపవాదసూచక మగు "నాప్త్రియన్ హావిజరుగన్" ప్రాచీనభారతీయ బ్రాహ్మణులపైఁ బ్రయోగించి యున్నారు. వింటర్నిట్జుగారిచే మహాభారతగ్రంథకర్తలుగాఁ దలఁపఁబడిన వ్యాసవైశంపాయనసౌతు లైనను గానముచేయు కురుపాండవ సంస్థానములలోని సూతులైనను బ్రాహ్మణులు కారు. వ్యాసుఁడు నిషాదుఁడు తచ్ఛిష్యుఁ డగు వైశంపాయనుఁడు శాపతప్తుఁడగు భ్రష్టబ్రాహ్మణుఁడు (యాజ్ఞ

(౧) బుద్ధ మప్రతిబుద్ధత్వా ద్బుధ్యమానంచ తత్త్వతః ।
బుధ్యమానంచ బుద్ధంచ ప్రాహు ర్యోగనిదర్శనం - 30వ అధ్యా. శాంతిపర్వం.
ప్రాదుర్భావాశ్చ కథితా భవిష్యా ఇహయే యథా
తత్రయే పురుషాశ్శ్వేతాః పంచేంద్రియవివర్జితాః
ప్రతిబుద్ధాశ్చ తేసర్వే భక్తాశ్చ పురుషోత్తమం
తేర్చయంతి సదాదేవం తైస్సార్థం రమతే చసః ॥ 3౪౪ అధ్యా ॥ శాంతిపర్వం.

వల్క్యచరితమున వైశంపాయనుని గాథ కలదు) సౌతి కాని కురుపాండవసంస్థానములలోని గాయకులగు సూతులు గాని బ్రాహ్మణులు కారు. భ్రష్టబ్రాహ్మణుఁడగు వైశంపాయనుఁ డైనను భారతము నితిహాససంహితముగ రచించెనే కాని బ్రాహ్మణ ధర్మప్రతిపాదకేతిహాసములతోఁ గూర్చియుండలేదు. సౌతికాలమునకే లక్షశ్లోకమితి మహాభారతమునకుఁ గలదు. ఇట్టిస్థితిలో బ్రాహ్మణులు ప్రక్షిప్తగ్రంథముఁ జొనుపుటకుఁ దావెటులు గలుగును? నాతలఁపున సౌతికిఁ బిమ్మటఁ గూడఁ గొన్నిభాగము లందుఁ జేరియున్నవి కాని యవి బ్రాహ్మణధర్మప్రతిపాదకములై యుండవు. వింటర్నిట్జుగారికి జమదగ్నిచెప్పులజోడుగాథ మొదలగునవి బ్రాహ్మణకల్పితములుగాఁ గాన్పించినవి. కాని కౌశికుఁడు ధర్మవ్యాధుఁ డనుకటికవానికడ జ్ఞానోపదేశము నొందుటయు నాళీకజంఘునిగాథలోని దుష్టబ్రాహ్మణుని యయోగ్యత మొదలగు బ్రాహ్మణ్యనీచతను సూచించు గాథలు కూడ మహాభారతమున నున్నవి. అవివారికిఁ గాన్పింపకపోవుట విచారకరము. ఇంకొకటి-వింటర్నిట్జుగారు యుద్ధపంచకము కౌరవపక్షపాతి (సంజయుఁడు కావచ్చును) చెప్పుటచేత నాభాగము కౌరవపక్షముగా వ్రాయఁబడె ననియుఁ దక్కినభాగము పాండవపక్షముగాఁ జెప్పఁబడె ననియు వ్రాసియున్నారు. అది కూడ పొరపాటని చెప్పవలసియున్నది. కారణ మేమనఁగా యుద్ధపంచక మంతయుఁ గౌరవపక్షముగా వ్రాయఁబడినచోఁ గౌరవసైన్యాధిపతి యగుభీష్ముఁడు తానుపడిపోవు నుపాయముఁ బాండవులకుఁ జెప్పుటయు దుర్యోధనుఁడు ద్రోణునిసైన్యాభిషేకసమయమున ధర్మజుని బట్టినఁ దిరిగి జూదమాడించి యరణ్యమున కంపెదనను కృత్రిమాలోచనముఁ జేయుటయు ద్రోణుఁడు సైంధవవధనాఁడు సైంధవుని మోసపుచ్చి యర్జునసాత్యకులను వ్యూహమునఁ జొరనిచ్చుటయుఁ గర్ణభీష్ములు కృత్రిములై మంతనమాడుటయుఁ బెక్కుసారులు సంజయుఁడు ధృతరాష్ట్రుని జీవాట్లు వేయుటయుఁ గౌరవపక్షముగానే యాభాగములు వ్రాసినచో వర్ణింపఁబడకపోవును. ఇతరభాగమంతయుఁ బాండవపక్షముగా వ్రాయఁబడెననికూడ తలఁప వీలులేదు. అటులు తలఁచినచో ధర్మజుఁడు శల్యుని భేదోపాయముచేఁ గృత్రిమపక్షమిచ్చి కర్ణునిసారథ్యమున మోసముఁ జేయ నియోగించుటయు ఆశ్రమవాసపర్వమున ధృతరాష్ట్రుఁడు తనకుమారుల శ్రాద్ధమునకు ధనము నడుగ భీముఁడు శ్రాద్ధమునకు ధనము నీయరాదనుటయు వర్ణింపఁబడకపోవును. కాన వింటర్నిట్జుగారి తలఁపు సరికాదని చెప్పవలసియున్నది.

ఇంకొకటి మాత్రము నిశ్చయము. వ్యాసుఁడు వ్రాసినజయము రణరంగమునకు సైన్యమునడచువఱకు మాత్రమె విపులముగాఁ జెప్పఁబడి యుద్ధవృత్తాంత మేసంజయునివలననో వినియా వ్యాసుఁడు యుద్ధవృత్తాంతమును ముక్తసరుగాఁ జెప్పియుండును. కాని వైశంపాయనుఁడు జనమేజయునకుఁ జెప్పుటలో ననత్యగాథలు పెక్కు లందు గల్పింపఁబడియుండును. ఆయసత్యములు దుర్యోధనాదుల దుర్మార్గాతిశయ నిరూపకములు, పాండవుల సత్యతాతిశయకములునై యుండును. అయినను జయములోని గాథలుమాత్రము మారకుండఁగ నున్నవని సూక్ష్మదృష్టితో మహాభారతముఁ జదివినఁ దెలియనగును. వైశంపాయనుఁడటు లసత్యకల్పనలఁ జేయుటకుఁ దగిన హేతు వున్నది. కారణ మేమనఁగా- జనమేజయుఁడు పాండవప్రపౌత్త్రుఁడు. అందుచేఁ బాండవులయందు గౌరవాతిశయము గలవాఁడు. అతఁడు ప్రశ్నించునపుడే "దుర్మార్గులగు దుర్యోధనాదులు మహాత్ములగు ధర్మరాజాదులను మహాపతివ్రత యగు ద్రౌపదినిఁ గష్టపఱిచిన వృత్తాంతమును సావకాశముగా విరళముగాఁ జెప్పుమా" యనియే ప్రశ్నించుటచే (౧) నామహారాజున కిష్టమగునటులే వైశంపాయనుఁడు పాండవపక్షముగాఁ జెప్పవలసి వచ్చుచుండెడిది. అందువలన నిజముగా దుర్యోధనుపక్షమునఁ గొంతన్యాయము ముండినను, అది వైశంపాయన భారతమున నణఁగిపోయినది. మఱియు నాంధ్రీకృతమహాభారతమున విశేషించి నన్నయభారతభాగమున నింకను దుర్యోధనపక్షపున్యాయము నామమాత్రావశిష్టమై పాండవుల న్యాయమతిశయోక్తులతోను నుత్ప్రేక్షలతోను నింపఁబడినది. కారణ మేమనఁగా నన్నయభట్టును సంబోధించునపుడే రాజరాజనరేంద్రుఁ డేమనెనో చూడుఁడు.

చ. హిమకరుఁదొట్టి పూరుభర - తేశకురుప్రభుపాండుభూపతుల్
క్రమమునవంశకర్తలనఁ - గా మహినొప్పిన యస్మదీయవం
శమునఁ బ్రసిద్ధులై విమల - సద్గుణశోభితులైన పాండవో
త్తములచరిత్ర, నాకు - సతతంబు వినంగ నభీష్టమెంతయున్.

మావంశపుమూలపురుషులలోఁ బ్రసిద్ధినొంది సద్గుణశోభితు లగుపాండవోత్తముల చరిత్ర నాకు వినఁగోరికయున్న దని ప్రభు వనుచుండఁగా నన్నయభట్టుఁ డా పాండవులచరిత్రను మిక్కిలి యోగ్యమైనదానిగా రచింపఁడా? అట్లే రచించినాఁడు. ఒకటిరెండుదాహరణములఁ జూడుఁడు. అనుక్రమణి

(౧) చూడుఁడు ఆదిపర్వము 62 అధ్యాయము.

కాధ్యాయములో మూలభారతమునఁ బాండవులను కుంతి వనమునుండి తీసి కొనివచ్చినప్పుడు పౌరులలోఁ గొందఱనుమానించిరని యుండుటచే నాభాగమును దెనిఁగింపలేదు. లాక్షాగృహదహనానంతరము పాండవులు భీతులై పలాయితులైరని సంస్కృతభారతమున నుండఁగా దాని నాంధ్రీకరణమున సూచింపనే లేదు. సుభద్రాపరిణయగాథ సంస్కృతమునఁ గ్లుప్తముగా నుండఁగ దానిని విపులము చేసియున్నాఁడు.

తిక్కనసోమయాజి స్వతంత్రముగా భారతము నాంధ్రీకరించుటచే గాథలను యథామాతృకగా నాంధ్రీకరించ నవసరము గాని నన్నయ పోయినపోకడల నతిక్రమింప నిష్టము లేకయో లోకప్రఖ్యాతినొందిన గాథలను మార్పనిష్టము లేకయో సంస్కృతమునందున్న దుర్యోధనపతనము సరిగా నాంధ్రమున సూచింపలేదు. ఇవి యింతట వ్రాయ నావశ్యకత లేకుండుట విరమించితిని.

మెండ్యాల వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రి.

# కవిజనాశ్రయము.

చిలుకూరి నారాయణరావుగారు, ఎం. ఏ., యల్., టి.

(భారతీపత్రికనుండి)

కవిజనాశ్రయ మనుఛందశ్శాస్త్రమును ఆంధ్రసాహిత్యపరిషత్తువారు 1917-వ సంవత్సరమున ముద్రించి ప్రకటించి యుండిరి. అది మ॥ రా॥ రా॥ జయంతి రామయ్యపంతులుగారిచే "శోధింపఁబడి" ఇంగ్లీషులోను, తెనుగులోను పీఠికలతో ఒప్పుచున్నది. ఇంగ్లీషులో చెప్పినమాటలనే వారు తెనుగులో విపులముగా వివరించియుండిరి. ఈగ్రంథము నిదివఱకెవ్వరును సూక్ష్మముగ విమర్శించి యుండలేదు అట్టి విమర్శన ముఖ్యమని తలఁచి యీవిమర్శనమునకు పూనుకొనుచున్నాము.

1. శ్రీరామయ్యపంతులవారి శోధన పూర్వపండితులమార్గమున బడి మాతృకను స్వతంత్రించి సవరించుటకు కొంతవఱకు వినియోగపడినది. ఏ మాతృకలోను లేనిపాఠమును వీరనేకస్థలములందు 'దూర్చి'* యున్నారు. ఇట్లు వారు తమ అభిప్రాయముల ననుసరించియే చేసినారని గోచరింపకపోదు.

(1) అవతారిక, 3-వ పద్యము మాతృక—వేమనవాడ; దిద్దుబాటు—వేములవాడ; 'వేములవాడ లేములవాడ యని వ్యావహారిక నామములు' అని అడుగున సూచన. గ్రామనామములోకూడ మాతృకలో మార్చుటకు వీరికీస్వాతంత్ర్యమేమో? వేమనవాడ యను గ్రామ మాకాలమున నుండియుండ కూడదో! వేములవాడ భీమకవి ఈగ్రంథమును రచియించియుండునని వీరికి గట్టినమ్మక ముండుటచేత ఈదిద్దుబాటు జరిగినది.

(2) అవ. 6-వ పద్యము. మాతృక—సంతోషిల్లగ. సవరణ—సంతోషింపఁగ; నన్నయభట్టులోనే 'సంతోసిల్లు' అని ప్రయోగములు గలవు — చూడుఁడు:—

ఆది. viii 197 నిజారంభంబు సఫలం బగుటకు సంతోసిల్లి.
అర. 4. 87 వాసవుండును సంతోసిల్లి నాకిట్లనియె.
అర. 4. 91 ధర్మరాజును - - - - సంతోసిల్లి.
అర. 4. 133 ధర్మతనయుండు సంతోసిల్లి.

తర్వాతికవులలో యీప్రయోజనము బహుళముగా నున్నది.

* దూర్చుట వీరి మాటయే. చూ. పీఠిక—17 పుట, 11 పంక్తి.

(3) అ. 1. 6 పద్యము 'పఘంటనము సుకవులు ద్రవి, కేఘంటము తెలుగు బాని నేరదిలుంటుఁగా'-సవరణ-"పఘంటనము సుకవులు ద్రవిడకేఘంటనము . ." 'ద్రవిడకే' అనేరూపము గ్రాంథికము కాదనన్నీ, చ, ఘలకు ప్రాసకూడదనన్నీ పెరసుకొనటముచేత కలిగిన దీనిష్టు బాటు. 'ద్రవిడకే' వంటి రూపములు కప్పలు తిప్పలుగా ఉన్నవి గ్రంథాలలో, 'సుకవుల' గ్రంథాలలో, వర్గప్రథమ ద్వితీయాక్షరాలకును, తృతీయచతుర్థాక్షరాలకును, ప్రాస గ్రంథాలలో కనబడక పోలేదు.

క. షాఘా బాఘా మాలను, పాఘాత్మసంజ్ఞచేత బద్యము మొదలన్
సూచించి నిచెపి చెప్పిన, గావస్థలములు మూలమంత్రము కవీంద్రుల్.

కవిజనాశ్రయము. పుట. 15.

స్వవర్గజప్రాస మని పేరుపెట్టి అప్పకవి 'ఛ, ఢ' లకు ప్రాసము నొప్పుకొన్నాడు. అట్లే 'చ, ఘ' లకును ఒప్పుకున్నాడు. తొమ్మిది ఉదాహరణము లిచ్చినాడు. ఇట్లే రంగరాట్ఛందస్సులోకూడా వర్గప్రాస కుదాహరణము లున్నవి. కాని, రామయ్యపంతులుగారు 'చ, ఘ' లకు ప్రాసముకూడదనుకొని కవిజనాశ్రయము లోని పద్యమును దిద్దినారు. పద్యాని కర్థములేకుండా చేసినారు.

(4) పాఠాంతరములను చెప్పేటప్పుడు సాధారణముగా 'క, చ, ట,' మొదలగు ప్రతుల నుదాహరించి, ఒకొక్కచోట 'కొన్నిప్రతులలో' అని చెప్పి విడిచెదరు. ఏప్రతులలోనో చెప్పిన బాగుండేది. చూ. పుటలు. 1, 3.

(5) పుట-8-'విష్ణుప్రతిపాదకము' లగు-రెండుపద్యములు మాతృకలో కనిపించుట చూచి కవి జైనుడు కాబట్టి నాతడు వట్టిపద్యములను వ్రాసియుండడని ఊహించి పంతులవారు వానిని గ్రంథమునుండి తొలగించిరి. ఇది సాహసము. ఇంతకును కవి 'శ్రీనాథా' 'ముకుందా' 'మాధవా' 'వరదా' 'శ్రీకృష్ణ' 'మురారి' 'శ్రీపతి' 'నృహరి' అనుపదములను ఆయాగణముల కుదాహరణములుగా చూపియున్నాఁడేగాని తనమతమును ప్రతిపాదించలేదే. పోనీ; తాను జైనుడనను అభిమానము కవికుండెనేమో అనిన తనవిషయమై- 'వాక్శ్రీపత్నీవల్లభ (పుట 36), శ్రీసంసేవ్యపదా (పుట 36), వాగ్వధూవల్లభా (పు 39), శ్రీనివాసా (పు 42), శ్రీరమణీప్రియ (పు 47), శ్రీతపస్వీ ప్రముదితచిత్త (పు 56), శ్రీకాంతాసఖ్యుడు (పు 59), శ్రీపాదపంకజావాస మధుకరుండు (పు 66), శ్రీనారీప్రియకరుఁడు (పు 76), శ్రీశ్రితవత్సలుఁడు (పు 79), అను మొదలైన విశేషములను చెప్పికొనియే ఉన్నాడు. కవి జైను జైనంతమాత్రమున విష్ణుప్రశంసకూడ తలప

కూడనంత పట్టుదల ఉండక పోవచ్చును. కవిజనాశ్రయకర్త కాలమునాటికి (నన్నయనాటికే) జైనమతము బ్రాహ్మణమతములోనికి సంక్రమించి పోవుచుండెను. కాని, శ్రీరామయ్యపంతులుగారి ప్రకార మట్లు సంక్రమించుట తప్పు గనుక వైపద్యము లేకాక, "రగడలు, మంజరి, ఉదాహరణము, గీతము వీనికి లక్షణములు, లక్ష్యములు" ఇవన్నియు గ్రంథములోనుండి స్వరూపము లేకుండా ఎగిరిపోయినవి. (చూ. పుట. 74) అందుచేతనే 'జితేంద్రపదభక్తిమెయిన్' అనుటకు బదులు "జినేంద్రపదభక్తి మెయిన్" అని ఉండవలె నని సూచించినారు. (చూ. పుట. 1.) శ్రీపాదపంకజావాస మధుకరుండు, అనుదానికి 'జినపాద' అని దిద్దినారని మాకు సందేహము. (పుట. 66.)

(6) పుట-2 లో ప్లుతయతి కుదాహరణముగా భాస్కరరామాయణము లోని 'ఏజనకాత్మజన్' అనుపద్యమును కవి లక్ష్యముగా నిచ్చిన ట్లాకప్రతిలో నుండఁగా పంతులవారు దానిని తొలగించినారు. పుట 26 లోని వచనమును పద్యములును "కావ్యాలంకారచూడామణియందుఁగూడ గన్పట్టుచున్నవి. కావున నిందుఁ బ్రక్షిప్తము లైనవేమో యని సంశయింపఁ దగి యున్నది". అని వ్రాసియు గ్రంథమునుండి తొలగించక విడిచినారు. వీరిట్లు చేయుటకు కవిజనాశ్రయకర్త భాస్కరునికిని, విన్నకోట పెద్దన్నకును తరువాతివా డైపోవునేమో అను భయముతప్ప మరియొక కారణము కానరాదు.

(7) పుట-84 లో 'వెలయఁగఁ (జెఱకు) విలుగొని' అను కందపద్య పాదమును చూడుడు. మూలములో 'చిగురాకు' విలు అని ఉన్నదట. అది పొరపాటట. ఎందుచేతనో, తెనుగుకవులు మన్మథుని 'చిగురాకు విలుకాఁడు, చిగురు విలుకాఁడు, చిగురు విలుతుఁడు' అని వర్ణించియే ఉన్నారే! 'చిగురాకు విలుకాని చేతిచక్రమురీతి' అని శశాంకవిజయము 3 ఆశ్వాసము. ఇట్లే ఎన్నైన ఉదాహరణము లీయవచ్చును. పోనీ, వీరు చేసిన సవరణ అయినా బాగున్నదా? 'చెఱాకు' అని ఎవరైన అందురా? 'చెఱకు' అని వ్యవహారము, ప్రయోగములు. 'వెలయంగఁ జెఱకు విలుగొని' అని సవరణచేసిన ఒకరీతిగా ఉండియుండును.

(8) మూలములో నున్నపద్యములను కొన్నిటిని కారణము తెలుపకుండ తీసివేసినారు; (చూ. 52 పుట.) "చ. ఒగిపదుమూఁడు - - - - -"

ఈరీతిగా శోధనయందు చాలలోపము లున్నను, పూర్వపుపండితులవలె పంతులుగారు పాఠములను రూపుమాపలేదు. గ్రంథములో,తమ అభిప్రాయాను

పాఠములైన పాఠముల నచ్చటచ్చట 'మూర్చి' నను, మాతృకలోని పాఠములను మాత్రము వారు సూచించి మహోపకారమును చేసినారనియే చెప్పవచ్చును. వ్రాతప్రతులను సంప్రతించి సరియగు పాఠమును నిర్ణయించుపద్ధతి యింకను మన తెనుగుదేశమువారికి తెలియదు. ఆవిధానము చాలకష్టమైనది. దాని నింకను మనము పాశ్చాత్యులనుండి నేర్చికొనవలసి యున్నది.

ఇక శ్రీరామయ్యపంతులుగారు వ్రాసిన తెనుగుపీఠికను కొంత విమర్శింతము. మొదటిది గ్రంథకర్తృ నిర్ణయము. "లోకమందెల్ల నీగ్రంథము వేములవాడ భీమకవికృత మనియే ప్రతీతికలదు. అప్పకవ్యాదిలాక్షణికులమతము కూడ నిదియే. అనేకములగు వ్రాతపుస్తకముల యట్టలమీఁద భీమనఛందస్సు, అని వ్రాయఁబడియున్నది." ఇది అంతయు సత్యమే, కాని వ్రాతపుస్తకములో రామయ్యపంతులుగారు చూచినంతమట్టుకును, మేము చూచినంత మట్టుకును 'జ' లోని అవతారిక మరియెచ్చటను కానరాదు. పోనీ, ఆఅవతారిక ప్రక్షిప్తము కాదనియే అనుకొందము. అవతారికలో 'వేమనవాడను వెలసిన, భీమేశ్వరు కరుణగల్గు భీమసుకవి' దీనిని రేచనమీఁద చెప్పినట్లున్నది, సరియే; కాని, 'అనవద్యకావ్యలక్షణ' (పుట. 2) అనుపద్యమునకు పూర్వము 'పరఁగిన విమలయశోభా, సురనిరతుఁడు భీమనాగ్రసుతుఁడు' ఈకృతికి రేచనకు సహాయుడైనట్లు 'బ' ప్రతిలో నున్నది గదా. భీమనయును భీమనాగ్రతనూజుడును ఒక్కరగుదురా? ఇట్లే 25-వ పుటలో "జననుత భీమతనూజా" అని యొక సంబోధన కలదు. ఇది యెవరికి చెందును? రేచనభీమతనూజు డనుకొనవలెను. లేదా, భీమతనూజుడే యీగ్రంథమును వ్రాసె ననుకొనవలెను. అన్నిచోట్లను రేచన యీగ్రంథమును రచించినట్లు స్ఫురింపజేసి ఈచోటను పైని చెప్పిన పద్యములోను భీమతనూజుండు భీమనాగ్రసుతుడు దీనిని రచించినట్లు చెప్పుట సరిపడదు. "పరఁగిన విమలయశోభా, సురనిరతుఁడు భీమనాగ్రసుతుఁడఖిలకళా" అనుటకు మారుగా "పరఁగిన విమలయశోభా, సురనిరతుఁడు భీమనాగ్రజుడు నఖిలకళా" అని యొకపాఠమున్నది. ఇట్టి పాఠమును చూచియే కాబోలు మ. రా. రా. చిలుకూరి వీరభద్రరావుగారు "కాకతీయప్రతాపరుద్రుని కాలమున వర్ధమానపురము నేలిన' భీమరాజుతమ్ముఁడైన గోకర్ణుఁ డీగ్రంథమును రచించి కళ్యాణపురాధీశ్వరుఁడైన జగదేకమల్లుని సేనాపతి యగు రేచభూపాలుని కంకితముచేసె" నని వ్రాసియుందురు. భీమనాగ్రజు డనిన అన్న యగునుగాని తమ్ము డెట్లగునని ఆక్షేపణరావచ్చును. భీమన సోదరుడని సాధా

రణముగా అర్థము చెప్పికొనిన ఈఆక్షేపణ తప్పుచుగాని ఉదకొంచెము క్లిష్టమే. రేచన కోమటియై యుండఁగా 'భూపాల' శబ్ద మాతనివిషయమున ప్రయోగించుటయు ఒక ఆక్షేపణయే, కాని, అతనిపదవినిబట్టి ఆ 'భూపాల' బిరుద మున్నదనుకొనుట తప్పు కానేరదు. వైశ్యులకుకూడ రాజుశబ్ద మనుప్రయుక్తమై యుండుట సర్వసాధారణమే. "భీమనాగ్రజుఁడు" అనుపాఠమే సరియైన దైన యెడల వీరభద్రరావుగారి వాదమునకు "ప్రమాణము" ను, 'అధారమును' ఏర్పడు నని చెప్పక తప్పదు. ఇందువలన శ్రీరామయ్యపంతులవారి వాదమునకు కూడ భంగము కలుగదు. కవిజనాశ్రయకర్త గోదావరీమండలమునుండి బైలుదేరి నైజాము రాష్ట్రములోనే వాసము చేయును, కాని, గ్రంథకర్త మాత్రము భీమన కాకపోవును. ఇది లోకప్రతీతికి విరుద్ధ మగును. గోదావరీమండలము వాడును కాకపోవును. ఇది కూడ అనాదిగా వచ్చుచున్న సామాన్యలోకప్రతీతికే కాక విద్వల్లోకప్రతీతికి కూడ విరోధ మగును. భీమన నైజామురాష్ట్రము వాఁ డను ప్రతీతి శ్రీరామయ్యపంతులుగా రాప్రాంతములవారి యొద్దనుండి ఉత్తరములను బయలుదేర తీసినతరువాత వచ్చినది గాని, అంతకుపూర్వము లేదు. ఇట్టి 'ఉత్తరములను' పుట్టించిరయే పంతులుగారు ఓరుగల్లువాదములో కొంతవరకును కృతకృత్యులైరి, వారి ఓరుగల్లువాదము సరియైనదని కాని కాదని కాని యిచట చెప్పుట మాఉద్దేశముకాదు. ఆవిషయమై మరియొకసారి ముచ్చటింతుము. పూర్వకాలపు నిదర్శనములను చూపక వాదములో కష్టపడి సహింపఁగలవారి 'ఉత్తరములను' పుట్టించుట మాత్రము సరికా దని మనవి చేయుచున్నాము.

పైని వ్రాసినదానిని బట్టి భీమన యెవ్వరో తెలియదు గాని, రేచడు మాత్రము కవిజనాశ్రయకర్తృత్వముతో సంబంధము గలిగి యుండె నని మాత్రము మిగిలినది. ఈ రేచడు, కమలాధీశుఁడు, కవిజనాశ్రయుఁడు, కవీంద్రాభరణాయమానుఁడు, జినమతహితుఁడు, వాగ్వధూవల్లభుఁడు, వారశ్రీవల్లభుఁడు, శ్రావకాభరణాంకుఁడు, శ్రావకాభరణుఁడు, శ్రీదేవీప్రియుఁడు, శ్రీనివాసుఁడు' అనితప్ప అతని గురించి మరి యెట్టిసంగతియు తెలియదు. ఏకాలము వాడో కూడ తెలియదు. పోనీ, భీమనయే ఈగ్రంథమును రచించె నను వాదము నంగీకరించి గ్రంథకర్త దేశకాలములను నిర్ణయింపఁజూతము.

భీమకవిదేశము:—గోదావరీమండలమున కాకినాడకు సమీపములో వేములవాడ అనుగ్రామ మున్నది. వేములవాడ కామడదూరములో దాక్షా

రామగ్రామ మున్నది. అందులోని భీమేశ్వరుని అనుగ్రహమున భీమన పుట్టె నని యీప్రాంతములందు ప్రసిద్ధి. 'అప్పాలు తప్పలగుట' ఆ ప్రాంతపు ప్రతీతి యే. శ్రీ రామయ్యపంతులుగారు ప్రారంభించి చెప్పించిన 'ఉత్తరము' లో (పప్పుల) వారిపై దుదాహరించబడినది. వారింటిపేరు అప్పలవారట. గోదా వరి ప్రాంతములో కూడ అప్పలవారు లేకపోలేరు. ఆయింటిపేరుగల నాలు గైదు కుటుంబములవారితో మాకు పరిచయ మున్నది. వారు మాబంధువులైతే, వారిపేర మేము ఉత్తరము వ్రాసి భీమకవి కథలను వినిపించి వారికి సంబంధ మున్నదా అని అడిగినయెడల తప్పక ఉన్నదని చెప్పుదురనియే మా నమ్మకము. అందుచేత అట్టి ఉత్తరము వారికి వ్రాయుట బాగుగా లేదు. కరీంనగరంజిల్లా లోని గ్రామము వేములవాడ కాదేమో, లేములవాడ లేక లేమలవాడ యేమో అని మా సందేహము. దాని వ్యవహారనామము లేముల (లేమల) వాడయని రామయ్యపంతులుగారు వ్రాసిరి. వేములవాడ కూడ కావచ్చును. పూర్వవ్యవహారముకూడ లేములవాడ, లేమ్బలవాడ, అనియే. లేములవాడ వేమలవాడగా ఏశబ్దశాస్త్రము ప్రకారమైనదో తెలియ రాకున్నది. అంతస్థ మగు "ల" కారము దంతోష్ఠ్యమగు 'వ' కారముగా సాధారణముగా తెనుఁగు లో మారుట అరుదు; మారదనియే చెప్పవచ్చును. కవిజనాశ్రయము అన తారికలో నున్నది వేమనవాడ. 'న' కారము 'ల' కారముగాను, 'ల' కారము 'న' కారముగాను మారుట కలదు. అందుచేత వేమనవాడ వేమలవాడ, వేములవాడ, కావచ్చును. ఒకవేళ లేములవాడ యే వేములవాడ అయి యుండవచ్చుననియు, 'లేమలు' భోగస్త్రీలు నివసించుటచే నాగ్రామమున కా పేరు వచ్చియుండు ననియు అనుకొన్నను, దాక్షారామప్రాంతములందు మాత్ర మట్టిభోగస్త్రీలు లేరని యెవ్వరు చెప్పగలరు? శ్రీనాథుడు భీమఖండములో దాక్షారామమున నీభోగస్త్రీలను గురించి విస్తరించి వ్రాసియున్నాడు.* దాక్షా రామములోని 'సానికూఁతులు, సానికూఁతు' లని పలవరించినాఁడు. ఇఁక జైన కోమట్లు హైదరాబాదు ప్రాంతములో ఇప్పు డుండుట బట్టి అప్పుడును ఉండిరని ఊహించుట కవకాశము లేదు. ఆకాలములో అచ్చట వారుండిరని ప్రత్యేకప్రమాణములను చూపించవలసి యున్నది. గోదావరీప్రాంతమందలి జైనులు బ్రాహ్మణులబాధ పడలేక కాలక్రమమున పరదేశములకు పోయియుండ

---

* భీమఖండము i. 87 – 94, 106, 111, 112, 115, 117; iii. 63, 92, 93, 125; v. 110; vi. 77 – 9.

కూడదా? వేంగిదేశములో మాత్రము చాలకాలము వరకును జైనమతము వ్యాపించి యుండె ననుటకు ప్రబలనిదర్శనము లున్నవి. ఏమతమైనను దేశములో ఒక్కసారిగా అంతరించి పోదు. భీమకవికాలమునాటికి జైనులు గోదావరీప్రాంతములం దుండిరనుట అసంభవము కాదు. ఇప్పటికిని రామతీర్థములో రెండు జైనకుటుంబము లున్నవి.

ఇప్పటికి తేలిన అంశము లివి. గోదావరిజిల్లాలో వేములవాడ ఉన్నది. కరీంనగరము జిల్లాలో వేములవాడ ఉన్నది. ఇచ్చట దాక్షారామ మున్నది. అచ్చటను దాక్షారామ మను వాడుక పురాణములలో నున్నది. ఇక్కడ భోగస్త్రీ లున్నారు; అచ్చటను ఉన్నారు; ఇచ్చట జైను లుండేవారు; అచ్చటను ఉండేవారేమో? ఇక్కడ అప్పలవా రున్నారు; అక్కడ అప్పలవా రున్నారు. ఇక్కడ భీమేశ్వరాలయ మున్నది; అక్కడను భీమేశ్వరాలయ మున్నది. భీమకవి యిక్కడివాడని యిక్కడిప్రతీతి అనాది; అక్కడివా డని ప్రతీతి యిప్పుడైనా బయలుదేరినది. రాజరాజనేవా డక్కడ నుండేనాడని చరిత్రాధారము లేని యొకకథ అక్కడనున్నది. సారంగధరకథ అక్కడిదే అని అక్కడి ప్రతీతి అట. ఇచ్చటిదే అనుప్రతీతి ఎప్పటినుండి వచ్చుచున్నదో తెలియదు. ఈసారంగధరకథ ఏప్రాంతమున కాప్రాంతములోనే తయారగుచున్నది. ఇక నేమి గతి? భీమకవి యెక్కడివాడు.

ఈరీతిగా భీమకవి ఎక్కడివాడో ఏకాలపువాడో చెప్పుటకు గూడ చరిత్రాధారము లేవియు లేవని స్పష్టము. ఇక చాటుపద్యములు మాత్ర మున్నవి. చాటుపద్యములలో మనయిష్టము వచ్చినవానిని ప్రమాణములుగను, మన మేర్పరుచుకొనిన సిద్ధాంతమునకు విరుద్ధము లైనవానిని అప్రమాణములుగను ఎంచుకోగూడదు. సాధ్య మైనంతమట్టుకు వాటికి సమన్వయము చేసికోవలెను. భీమకవి ప్రతాపరుద్రునికాలములో నున్నవా డని చెప్పుటకు గలకారణములు కొన్ని మంచివి లేకపోలేదు.

1. "చక్కదనంబు దీవియగు సాహిణిమారుఁడు" అనుపద్యమును రామయ్యపంతులుగారు తగిన కారణము చూపక, అప్పకవిని ధిక్కరించి విడిచిపెట్టినారు. ఇది మాకు సమంజసముగా కాన్పించలేదు. అప్పకవి యొకసందర్భమున ప్రామాణికుడును మఱియొక సందర్భమున అప్రామాణికుడును నగుచుండవలయునా? అదియు మన సిద్ధాంతమును బాధించువట్లనేనా? 'ద్వీపమునకు నాకమునకు' అను ఆదేశవళిలక్ష్యమును దానికి లక్ష్యముగా నిచ్చిన పద్యము

లును ప్రశస్తములే యను కొందము.* ప్రాసయతి కుదాహరణముగా "వెజన కాత్మజ" అనుభాస్కరరామాయణములోనుండి ఉదాహరించినపద్యము నేల తీసివేయవలయును? తమసిద్ధాంతమునకు విరుద్ధమనియే కదా. "పరంగిన విమల యశోభా, సురనిరతుండు భీమనాగ్రజుండు నఖిలకళా, పరిణతుం డయ్యెను భూసుర, వరుండు ప్రసాదోదితప్రభావ శ్రీయుతుండై" అనుపాఠము సరియైన దైన యెడల వీరభద్రరావుగారివ్రాత కాధారము కలిగి కవిజనాశ్రయకర్త ప్రతాపరుద్రునికాలమువా డగునుగదా!

ఇక "ఘనుండగ వేములవాడ వంశజుండ - - - వెలుంగాధీశ (తెలుంగాధీశ, కళింగాధీశ) అనుపద్యముపై రామయ్యపంతులుగారు చేసిన చర్చను కొంత విచారింతము. వారు 'వెలుంగాధీశ, తెలుంగాధీశ' అనునవి వ్యాకరణదుష్టము లని త్రోసివేసిరి. వెలుంగు + అధీశ, తెలుంగు + అధీశ, అని వారిపదచ్ఛేదము. వెలుంగ + అధీశ, తెలుంగ + అధీశ, అని మాపదచ్ఛేదము. ఇచట వెలుంగ తెలుంగ అనునవి సంబోధనాంతములు గావు. అవి దేశనామస్వరూపములే అని మామతము. త్రిలింగ శబ్దభవము తెలంగ, తెలుంగ అని యగును. బర్మా దేశములో 'తెలంగ' 'తెలైంగ' అని తెలుగువారికి పేరు. గౌడభాషలో తెలుగు వారికి తెలంగ అనియే నామము 'తెలగా' లనువర్ణమువారు ఆంధ్రదేశీయులే, వారు తెలుగువారే. 'తెలుంగ' అనునది దేశనామమైనప్పుడు 'తెలుంగాధీశ' అను సమాసము నిర్దుష్టమగును. అట్లే 'వెలుంగ' కూడను; దానికి 'వెలంగ' అని రూపాంతరము. వెలంగవాడ, వెలుంగవాడ, అనుపదములే వెలుంగోడ, వెలంగోడ అని యగును. ఆవాడవారే వెలుగోటివారు, ఇచట 'వెలంగ' అనగా వెలగచెట్టు అని యర్థము కాదని మాయభిప్రాయము. 'వెలంగ' అను జను లుండు'పూడియే' వెలంగపూడి, వెలగలపూడి,అని యైనది. 'తెలుంగాధీశ' అను పాఠము సరియైనప్పుడు, 14-వ శతాబ్దములోని తెలుంగురాయడే ఈ తెలుం

---

* ఇందుకును అంత ప్రబలకారములు కాన్పించవు. అనేకప్రతులలో పదివళ్లే కాక ఇతర యతులును కాన్పించుచున్న వని రామయ్యపంతులుగారే వ్రాసిరి. కవిజీవితములో భీమనచాటువని పదివళ్లను పేర్కొనిన సీసపద్యములో కూడ ప్రాసయతి యెక్కువగా నున్నది. అభేదయతి, వృద్ధియతి, ఆదేశయతి, నిత్యసమాసయతి, కాకుస్వరయతి, హాళవర్ణయతి, మొదలగునవి మొదటి పదివళ్లలోను అంతర్భాగములే. అను ఉద్దేశముతో యతులసంఖ్య పదియే అని కవిజనాశ్రయములో చెప్పబడి యుండవచ్చును. సులక్షణసారము, రంగరాట్ఛందస్సు, మొదలగు లక్షణగ్రంథములలో యతులసంఖ్యను తొలుత నిర్ణయించియు, ఎక్కువ యతులకు లక్ష్యలక్షణములను పేర్కొనుట ఆచారమే.

గాధీశుఁడైనప్పటికి, భీమకవికూడా 14-వ శతాబ్దమువాఁడే అగుచుఁగదా, అట్లే 'వెలుంగాధీశ' అనుపాఠము సరియైనప్పటికి కాలనిర్ణయము చేయుట కష్టమే యగుచున్నది, 14-వ శతాబ్దమునాటి యొక వెలుంగాధీశుని శాసన మేల చెంద కూడదో చెప్ప వీలులేదు.

ఇంక, 'కళింగాధీశ' యనుపాఠము మిగిలినది. 'కళింగగంగు' ఎవ్వరో కూడ నిర్ణయింపవలసి యున్నది. త్రికళింగాధిపతి యగు అనంతవర్మయే ఈకళింగగంగని రామయ్య పంతులుగారి సిద్ధాంతము. వేంగీరాజగు రాజరాజ చోడగంగును కూడ వీ రుదాహరించిరి; కాని, అతఁడు కళింగరాజు కాడని కాబోలు అతనిపేరును విడిచిపెట్టి, అతనికి సమకాలికుఁడైన అనంతవర్మపేరునే ఎత్తుకొనిరి. అనంతవర్మకు అనంతవర్మచోడగంగదేవు డనుపేరు శాసనములందు కనఁబడుచున్నది గాని, చోడకళింగగంగదేవు డనిపేరు లేదు. కళింగగంగను పేరువచ్చుటకై అనంతవర్మ నామములో రామయ్యపంతులుగారు 'కళింగ' అను మాటను చేర్చి యుండిరి. కళింగగంగని అనంతవర్మకు ఎచ్చటను పేరు లేదు. అయినను అనంతవర్మను కళింగగంగని పిల్చుటకు మాకభ్యంతరము లేదు. కాని కళింగదేశములో చోడగంగనామము గలవారందరిని కళింగగంగని పిలుచుటకు వారి కభ్యంతరము యుండకూడదుగదా.

ఎలమంచి పురాధీశ్వరుఁడగు చోడగంగను రాజు శాకాబ్దములు 1413 ప్రాంతములో నున్నట్లు శాసనములు తెలుపుచున్నవి. ఇతనికి సర్వజ్ఞ కాత్రేయ విష్ణువర్ధనమహారాజని బిరుదున్నది. ఎలమంచి కళింగములోనిదే. భీమకవి చూచిన కళింగములోనిదే. భీమకవి చూచిన కళింగగంగితఁడేల కాకూడదు?

మరి 'కళింగాధీశ' అనుమాటను గూర్చి విచారింతము. కళింగాధిపతి యనుసంజ్ఞతో తూర్పుగంగవంశపురాజు లిద్దరున్నారు. కొల్లేరు తామ్రశాసనములోని విజయసంవత్సర మొకఁడు, అతనికొడుకు కోమర్తి తామ్రశాసనములోని చంద్రవర్మ రెండవవాఁడు. భీమకవి వీరికాలములోనివాఁడైనయెడల నన్నయకు చాల పూర్వుఁ డగును. కవిజనాశ్రయము భాషనుబట్టి యింతటి దంతపూర్వకాలమువాఁడని చెప్పవీలుపడదు. త్రికళింగాధిపతి యనుబిరుదము గలతూర్పుగంగరాజులు చాలామంది యున్నారు. వజ్రహస్తుఁడు, రాజరాజు మొదలగువారు త్రికళింగాధిపతులే కాని కళింగరాయ అనిగాని కళింగగంగ యనిగాని పేళ్లు లేవు.

కాళింగరాయ డనుపేరు దక్షిణదేశపుశాసనములందు తరుచుగ కాన్పించుచున్నది. ఈశాసనములన్నియు పదునాలుగో శతాబ్దము లోనివి. తిరు

వాడిలోని దేవాలయమున కొకకళింగరాయడు భూదానము చేసినట్లున్నది.[1] మారవర్మ త్రిభువనచక్రవర్తికులశేఖరదేవుడు (1) (1268-1308) కళింగరాజు ఆజ్ఞను స్థిరపరచినట్లు మరియొకశాసన మున్నది.[2] రెండవరాజేంద్రచోళునికి మొదటికుళోత్తుంగునికిని మంత్రియగు సభానర్తకుడను వాడు సిద్ధలింగమఠములో సిద్ధలింగేశ్వరాలయమును కట్టించినట్లు మరియొకశాసన మున్నది.[3] ఈసభానర్తకునికి 'కాళింగరాజ' 'మానాభరణ' అను బిరుదము లున్నవి. చెంగల్పట్టు జిల్లాలోని సోమంగలములో చక్రవర్తి కాళింగరాయనికొడుకు వరాహపిళ్లె యను వాడు సం॥ 1267 నకు మేనెల తే 24 దిని ఒకదానము చేసిన ట్లొకశాసనము కలదు.[4] మరియొకశాసనములో కాళింగరాయ డొకస్త్రీకి జరిమానా విధించి నట్లును, ఆమె దానిని చెల్లింపకపోగా ఆమె భూములను ఏలము వేయించిన ట్లును, ఎవ్వరును ఏలముపాట పాడనట్లును, అందుచేత దేవాలయమువారే ఆభూమిని కొనినట్లును ఉన్నది.[5] కాళింగరాయడును మరి యిద్దరును జనులను బాధించి తాము చేయవలసినపనిని సరిగా చేయనందున ఆనాటిరాజు వారిని శిక్షించినట్లు క్రీ. శ. 1557 లోని యొకశాసనములో నున్నది.[6] రాయకళింగ గంగు రాజ్యభ్రష్టు డయ్యె ననుకథ కిదియే మూల మగునేమో! మధురజిల్లా లోని కుమవిత్తురై గ్రామములోని యొకశాసనమునందు కాళింగరాయడు శ్రీ వైష్ణవులకు చేసినయొకదానమును స్థిరపరిచిన ట్లున్నది.[7] నెల్లూరులోని రంగ నాయకాలయమునకు[8] కాళింగరాయడు 'సిఫారసు' చేయగా సుందరపాండ్య డనురాజు ఒకగ్రామము నిచ్చివేసె నట. కాళింగరాయనికోరికపైని త్రిభువన చక్రవర్తి శ్రీవల్లభదేవు డనునామాంతరము గల పాండ్యరాజగు జటావర్మ రామ నాడుజిల్లా తిరుపత్తూరులోని యొక ఆలయమునకు రెండుగ్రామముల నిచ్చె నని ఒకశాసన మున్నది[9] త్రిభువనచక్రవర్తి కోనేరిన్ మేల్కొండా ననురాజు సేలముజిల్లాలోని యొక ఆలయమునకు ఒకగ్రామము నిచ్చెను. ఆశాసనమున కళింగరాయడు సాక్షిగా నిరూపింపబడెను.[10] తంజావూరు జిల్లాలోని కోవిలూర నున్న దేవాలయమునకు కాళింగరాయడు కొన్నిదానములు చేసెను. ఇట్లే తిరునల్వేలిజిల్లా శేర్మాదేవియందును, ఆళ్వారుతిరునగరియందును, తిరుచునా పల్లి జిల్లాలోని సెన్నివనము, శ్రీరంగములోను కాళింగరాయని శాసనములు

---

[1] No. 40 of 1903. [2] No. 566 of 1913. [3] No. 367 of 1909. [4] No. 271 of 1912. [5] No. 277 of 1910. [6] No. 240 of 1912. [7] No. 319, 320, 326 of 1908. [8] No. 196 of 1894. [9] No. 3 of 1908- [10] No. 4240 of 1913.

గలవు. ఈకాళింగరాయుడు చాలప్రసిద్ధుడై పదునాల్గవశతాబ్దమునం దుండెను. మనభీమకవి ఈకళింగరాయని వద్దకే పోయెనేమో!

కవిజనాశ్రయములో పదియతులును, కావ్యాలంకారచూడామణియందు పంద్రెండునల్లును, అనంతు డిరువదినాలుగు విశ్రమములును, అమీద కొందరు కవిగ్రామణు లిరువదియేడును విశ్రమములు చెప్పిన ట్లప్పకవి చెప్పి తాను నలభై యొక్క యతులను వివరించినాడు. కవిజనాశ్రయములోని యతులసంఖ్య అన్నిటిలోను తక్కువది కాబట్టి భీమకవి అందరికంటె ప్రాచీనుడు. అని రామయ్య పంతులుగారి వాదము. ఈవాదమును చాలమంది అంగీకరించినారు. కాని, చిన్నమనవి—సులక్షణసారకర్త—

"కృతుల ముప్పదియొక్కటి - యతులు దనరు, సత్కవులసమ్మతంబున - (జలధిశయన)" అని చెప్పినాడు. అందుచేత నాతడు అప్పకవికి పూర్వు డని చెప్పవగునా? రంగరాట్ఛందస్సులో ఇరవై యెనిమిది యతులు చెప్పబడినవి. అందుచేత కస్తూరి రంగకవి కూడ అప్పకవికి పూర్వు డగునా? కనుక ఈవాదములో కూడ అంతబల మున్నట్లు కనఁబడదు.

రామయ్యపంతులుగారి ప్రకారము మధ్యాక్కరలో నాలుగవగణము మొదట యతి ఉండుట ఆధునికమతము. నన్నయభట్టులో అయిదవ గణము మొదట నున్నది. ఎఱ్ఱాప్రెగడలో నాలుగవగణము మొదట నున్నది. భీమకవి గ్రంథములో మధ్యాక్కర నాలుగవగణము మొదట యతి ఉండుటచేత, భీమకవి నన్నయ ఎఱ్ఱాప్రెగడల మధ్య నుండవలయునట. ఎఱ్ఱాప్రెగడ తరువాత నేల ఉండకూడదో తెలియరాకున్నది.

ఈరీతిగా రామయ్యపంతులుగారి కవిజనాశ్రయశోధనను, వారుదానికి వ్రాసినపీఠికను సూక్ష్మముగా విమర్శించితిమి. ఇందువలన వారు చేసిన కృషిని కొంచెపరుచుట మా ఉద్దేశము కాదు. వారు తమబుద్ధికి గోచరించినట్లు విమర్శించి చాల శ్రమపడి, మంచి పీఠికతో కవిజనాశ్రయమును లోకమున కప్పగించినారు. కాని, వారు భీమకవి దేశకాలములను గూర్చి చేసిన చర్చలో లోపము లున్న వని మాత్రము చెప్పక తప్పదు. గ్రంథశోధనయందును సంప్రతీకరణము నందును మాకు తోచిన కొన్నిలోపములను చూపించి యున్నాము. భీమకవిదేశము గూర్చిగాని, కాలముగూర్చిగాని యింకను ఇదమిత్థమని తేల లేదని మనవి చేయుచున్నాము.

---

# కవిజనాశ్రయవిమర్శనఖండనము.

జయంతి రామయ్యగారు, బి. ఏ., బి. యల్.

(భారతీపత్రికనుండి.)

1917-వ సంవత్సరమునం దాంధ్రసాహిత్యపరిషత్తువారు వేములవాడ భీమకవి కృతమని ప్రసిద్ధిగన్న కవిజనాశ్రయమను ఛందోగ్రంథమును బ్రకటించిరి. నేనాగ్రంథమునకు "సంపాదకత్వము" వహించి మూలపాఠముల నిర్ణయించుటయే కాక పీఠిక నొకదానినిగూడఁ జేర్చినాఁడను. నేను చేసిన గ్రంథపరిష్కారమందును, రచించిన పీఠికయందును దోషములున్నవనియు వాని "నిదివరకెవ్వరును సూక్ష్మముగ విమర్శించి యుండలేదు" గనుక యాపని నెరవేర్చు భారము తమమీఁదఁ బడిన దనియుఁ దలంచి చిలుకూరి నారాయణరావుగారొకవిమర్శనము రచించి రక్తాక్షిసంవత్సర ఫాల్గునమాస భారతిపత్రికలోఁ బ్రకటించినారు. నే నావిమర్శనము బయలుదేరిన వెంటనే చూచుట తటస్థించినది. విమర్శనము కేవల మసంబద్ధము, నిరాధారము, నిస్సారమునై యున్నది. ఇట్టిదాని నొకపెద్దచేసి ఖండించుటకంటె నూరకుంటయే యుచితమని మొదటఁ దోఁచినది, గాని, తిరిగి యాలోచింపఁగా నీయపూర్వవిమర్శనపద్ధతి స్వరూపము లోకమునకుఁ గొంచెము తెలుపుట మంచి దని యూహించి ప్రత్యుత్తరమిచ్చుచున్నాను.

నారాయణరావుగారు చేసిన యాక్షేపములు (1) పాఠనిర్ణయమును గుఱించినవి కొన్ని (2) పీఠికను గుఱించినవి కొన్ని-యీప్రకారము రెండువిధములుగా నున్నవి. పుస్తకాపేక్ష లేకుండ వాదప్రతివాదములు సులభముగా గ్రహించుటకు వీలగునట్లు తొలుతఁ గవిజనాశ్రయములోని మూలభాగమును, పిదప దానిపై నారాయణరావుగారి యాక్షేపమును, తరువాత దానిఖండనమును జూపెదను.

నారాయణరావుగారి మొదటి యాక్షేపము అవతారికలోని మూఁడవ పద్యమును గుఱించినది. ఆపద్యము

1. మూలము:—

వేములవాడను వెలసిన, భీమేశ్వరు కరుణగల్గుఁ భీమనుకవి నేఁ
గోమటి రేచన మీఁదను, నీమహిఁ గవు లెన్న ఛంద మెలమి రచింతున్.

అని యున్నది. ఈపద్యము క్రింద నీవిధముగా వ్రాయఁగా "వేమన వాడ యని మాతృక-వేములవాడ, లేములవాడ యని వ్యావహారికనామములు - ఈ గ్రామము హైదరాబాదు రాజ్యములో ...... నున్నది. అందు సుప్రసిద్ధమయిన భీమేశ్వరాలయము కలదు." అని టిప్పణము గలదు.

ఆక్షేపము:—

"మాతృక వేమనవాడ: దిద్దుపాటు వేములవాడ, వేములవాడ, లేముల వాడ యని వ్యావహారిక నామములు అని అడుగున సూచన—గ్రామనామ ములోఁకూడ మాతృకలో మార్చుటకు వీరి కీ స్వాతంత్ర్యమేమో? వేమనవాడ యను గ్రామ మాకాలమున నుండి యుండఁకూడదా? వేములవాడ భీమకవి ఈగ్రంథమును రచియించి యుండునని వీరికి గట్టినమ్మక ముండుటచేత ఈదిద్దు బాటు జరిగినది" అని,

ఖండనము;—

అవును. గ్రంథము భీమకవికృత మనునమ్మకము నాకుఁగలదు—నా నమ్మక మెట్లున్నను, అవతారికాపద్యముల యుద్దేశ మదియే కదా! లేచన రచించి నట్లుగా భీమకవి యీగ్రంథమును రచించె నని చెప్పుటయే యీపద్యముల ప్రయోజనము. భీమకవి యింటిపేరు వేములవాడవారనియు నతఁడు వేముల వాడ గ్రామనివాసి యనియు నన్నిసుకవులవారి యభిప్రాయము. వేముల వాడ గోదావరీమండలములోని దని కొందఱును కరీంనగరము మండలములోని దని కొందఱు చెప్పుచున్నారు; గాని, గ్రామనామము వేములవాడ యనుటలో నభిప్రాయభేదము లేదు. వేమనవాడ యను వాద మింతవఱకుఁ బుట్టలేదు. వేములవాడలు రెండును తెలుఁగుదేశములో నున్నవి. భీమకవియుఁ దెలుఁగు దేశమువాఁడే. అవతారికాపద్యము లొక్కప్రతిలో మాత్రమేయున్నవి. అది యైనను అరవదేశమందు దొరకినది. దానిలో వేమనవాడయను పాఠముగలదు. ఆపాఠము వ్రాయసకాని ప్రమాదమువలనఁ బుట్టిన దని చెప్పక తప్పదు. అరవ దేశమం దీప్రతివ్రాసినవానికి గ్రామనామము వేములవాడయో వేమనవాడ యో తెలియకుండుట యసంభవము కాదు. భీమకవియే యీపద్యముల రచించినయెడల వేమనవాడయని ప్రయోగింపఁడు కదా! కవిప్రయుక్తపాఠ మేదియో కనిపెట్టి, యది తప్పైనను ఒప్పైనను సరె, దానిని గ్రహించుట గ్రంథసంస్కర్త ధర్మము. కావున నిచ్చట వేమనవాడను వేములవాడగా దిద్దుట న్యాయమే - వేమనవాడ పాఠమే మంచిదను బుద్ధిమంతులు బయలుదేరినయెడల వారి యుపయోగార్థ మాపాఠముగూడ సూచింపఁబడినది.

నారాయణరావుగారి రెండవ యాక్షేపమునకు మూలాంశమగు క్రింది యవతారికాపద్యము:—

2. మూలము:—

రేచన సంతోషింపఁగ, భూచక్రములోన శ్రీ[illegible] కృపచే
నేఛందము సుకవుల ("లు" తప్పు) బ్రదు, కేఛందము తెనుఁగు వానినే రచియింతున్.

అనియున్నది.

"సంతోషింపఁగ" నన్నచో మాతృకలో "సంతోషిల్లఁగ," యనియున్నట్లు టిప్పణములోఁ జూపఁబడినది.

ఆక్షేపము:—

"నన్నయభట్టులోనే "సంతోసిల్లు" అని ప్రయోగములు గలవు. తర్వాతి కవులలో యీప్రయోజనము (?) బహుళముగా నున్నది." అని యాక్షేపము:—

ఖండనము:—

కవి "సంతోషింపఁగ" యని ప్రయోగించి యుండుననను నూహతోనే యీసవరణ చేయఁబడినది. ఇది స్వల్పవిషయము. గనుక విస్తరించి చర్చించుట యనవసరము.

3. మూలము:—

పై పద్యమందే "సుకవుల బ్రదుకే ఛందము" అన్నచోట మాతృకలో "సుకవులు బ్రదికేఛందము" అని యున్నదని టిప్పణమునఁ గలదు.

ఆక్షేపము:—

దానిపై నారాయణరావుగారి యాక్షేపమును చూడుఁడు:—

"బ్రదికే" అనేరూపము గ్రాంథికము కాదనిన్నీ, "చ ఛ" లకు ప్రాస కూడదనిన్నీ వీ రనుకొనడముచేత కలిగిన దీ దిద్దుబాటు." ఇందు రెండాక్షేపములున్నవి.

మొదటిది "బ్రదికే" యను రూపము సాధువయినను, సాధువుకాదని నేను దిద్దినానని. ఇది ముందు విచారింతము:—

ఖండనము:—

"బ్రదికే" వంటి రూపములు కుప్పలు తిప్పలుగా సుకవుల గ్రంథాలలో నున్నవని నారాయణ రావుగారు వ్రాసినారు. ఉదాహరణము లేవియు నిచ్చియుండలేదు. ఆరూపము సాధువనియు, కడపటి ఎత్వమునకు విడిగా స్వరయతి

కలదనియు నారాయణరావుగారు ఋజువు పఱిచినప్పు డొప్పుకొనవలసినదే కాని, యీదిద్దుబాటున కిది యొక్కటియె కారణము కాదు. మాతృక పాఠమునుబట్టి 'తెరువు' అను శబ్దమున కన్వయము కుదురలేదు. 'చందము తెరువు' అని సమాసము సత్కవి చేయఁడు. తెరువునకు పిడిగా నన్వయము లేదు. దిద్దిన పాఠములో సయితము అన్వయక్లిష్టత కొంచెము లేకపోలేదు. కాని మాతృకలోని పాఠమునకంటె మేలు. దిద్ది పద్యమున కర్థము లేకుండఁ జేసినానఁట. పండితుల కర్థము తెలియకపో దని నానమ్మకము.

4. "చ, ఛ" లకు ప్రాసము కూడదనుకొని యీసవరణ చేసినానని యింకొక యుపపత్తి కల్పించి, వర్గప్రథమ ద్వితీయాక్షరాలకును, తృతీయ చతుర్థాక్షరాలకును ప్రాసమైత్రికల దనిచూపుట కేమేమో వ్రాసి "రామయ్య పంతులుగారు "చ, ఛ" లకు ప్రాసము కూడదనుకొని కవిజనాశ్రయములోని పద్యమును దిద్దినారు" అని ముగించినారు. ఈ వ్రాఁత నారాయణరావుగారు మేల్కని వ్రాసినారో లేక నిద్రలో వ్రాసినారో తెలియదు. దిద్దిన పద్యములో మొదటి రెండుపాదములలోను ప్రాసస్థానమందు "చ" కారమున్నది. మూఁడునాలుగు పాదములలో "ఛ" కారమున్నది. ఇదిఁ "చ" "ఛ" లకు ప్రాసయయినది కాదా!

5. మూలము:—

7, 8 పుటలయడుగున నీ టిప్పణ మున్నది,—"ఈ (22-వ) పద్యమునకు ముందు చ, జలలో నీ క్రిందిపద్యములు రెండును గలవు.

1. చను మగణము శ్రీనాథా, యనిన ముకుందా యనంగ యగణము రగణం
 బననొప్పు మాధవాయన, జనునోవరదా యనంగ సగణం బగుచున్.
2. తగణము శ్రీకృష్ణయనఁగ, నగు జగణంబును మురారి యనఁగా జగతిన్
 భగణము శ్రీపతియనఁగా, నగణంబగు నృహరియనఁగ నలినదళాక్షా!

ఇందు మొదటిపద్యము అనంతుని ఛందమునందును గలదు. జైనుఁడగు కవి విష్ణుప్రతిపాదకములగు పద్యముల రచించుట యసంభవము. కనుక యీ పద్యములు ప్రక్షిప్తములని యూహింపఁదగును." అని.

ఆక్షేపము:—

"ఇంతకును కవి శ్రీనాథా - - - - - - అనుపదములను ఆయా గణముల కుదాహరణములుగా చూపియున్నాడే కాని తన మతమును ప్రతిపాదించలేదే. పోనీ; తాను జైనుడనను అభిమానము కవి కుండెనేమో అనిన తనవిషయమై "వాక్ఛ్రీవల్లభ - - - - - - అను (?) మొదలైన విశేషములను

చెప్పుకొనియే యున్నారు. [illegible] విష్ణువునిందకాని తెలపగూడ నంతకష్టము లుండవు [illegible] - - - - [illegible]

ఖండనము:—

పూర్వోదాహృతపద్యములు రెండును విష్ణుపరములని నారాయణరావు గారొప్పుకొన్నారు. కావున నావిషయము చర్చింపనక్కఱలేదు. ఆరెంటిలో మొదటిపద్యము అనంతునిఛందమునం దున్నది. కవిజనాశ్రయకర్త ముందు వాఁడా, అనంతుఁడు ముందువాఁడా యను వాదము ప్రస్తుతము విడిచిపెట్టి విచారింపఁగా కవిజనాశ్రయమునకు ముందటి యనంతుఁడైనను, అనంతుని ఛందోదర్పణమునుండి కవిజనాశ్రయకర్త యైనను ఆపద్యమును సంగ్రహించి యుండవలెను. కవులిద్దఱు నాపద్యమునే యొకరికిఁ దెలియకుండ నింకొకరు రచించుట యసంభవము. అట్టికవు లాపద్యమువంటి పద్యమును జెప్పలేక యొకరిపద్య మింకొకర పహరించి రనుట యతిసాహసము. ఆపద్యము ఛందోదర్పణమునం దుండుట మిక్కిలి యుచితము. కవిజనాశ్రయమునం దుండుట యుచితముగాదు. కాఁబట్టి యీపద్యము ఛందోదర్పణములోనిదనియు, లేఖకు లెవ్వరో ప్రమాదమున కవిజనాశ్రయమందుఁ గలిపిరనియు నూహింపక తప్పదు. రెండవపద్యముకూడ విష్ణుపరమే కదా! అందు సంబోధనముకూడ విష్ణునకేకదా; కవిజనాశ్రయములోని సంబోధనము లన్నియు రేచనకే గాని దేవతలకు లేవు. ఆ పద్యము కవిజనాశ్రయములోని దనిచెప్పుటెట్లు? జైనుఁ డగు రేచనకు వైష్ణవమతమందు ద్వేషము లేకపోవచ్చును గాని యన్యదేవతాపరముగాఁ బద్యములు చెప్పుట యసంభవము.

6. ఆక్షేపము:—

"వాక్ప్రియపత్నీవల్లభా, శ్రీసంసేవ్యపదా" ఇత్యాది సంబోధనలు గ్రంథమం దచ్చటచ్చటఁ గలవు. అవి దేవతాప్రతిపాదకములు కావా? యని యింకొక యాక్షేపము.

ఖండనము:—

నారాయణరావుగా రుదాహరించిన సంబోధనలలో నొకటి రెంటికిఁ దప్పఁ దక్కిన వానికి మనుష్యపరముగా నర్థము చెప్పవచ్చును. అట్లు చెప్పుటే యుచితము. అట్లుచెప్పక "వాగ్వధూవల్లభా" యనఁగా బ్రహ్మయనియు, "శ్రీనివాసా" యనఁగా విష్ణువనియు నర్థముచెప్పినయెడల కృతిపతి యొకప్పుడు

బ్రహ్మాదులు నొకప్పుడు విష్ణువువలె గావలసి వచ్చునుగదా! అయినను, నేను కని పెట్టినవి గాక మఱికొన్ని ప్రక్షిప్తములు గ్రంథమం దుండవచ్చును.

7. ఆక్షేపము:—

పూర్వోదాహృతాక్షేపమును విస్తరించి వ్రాసి చివర "శ్రీపాదపంకజా వాసమధుకరుండు" అనుదానికి "జినపాద" అని దిద్దినారని మాకు సందేహము. (పుట 66)" అను వాక్యముతో ముగించినారు. 66 పొరటలలో ఎత్తుగీతి.

"శ్రీసమేతుఁడైన జినపాదపంకజా, వాసమధుకరుండు వాసవప్ర
హాసభాసిరేచఁ డనవద్యుఁ డక్కిలి, ప్రాసనీసమనుచుఁ బరఁగఁ జెప్పె."

అని యున్నది.

ద ప్రతిలో మొదటిపంక్తిలో శ్రీపాద యను పాఠమున్నదని యడుగున టిప్పణ మున్నది.

శ్రీపాదయను పాఠమును తీసివైచి మాతృకలలో నెచ్చటను లేని జిన పాదయను పాఠము నేను కల్పించినానని నారాయణరావుగారి వాదము.

ఖండనము:—

"శ్రీపాద" యనుపాఠము ద ప్రతిలోమాత్రమే యున్న దని వ్రాసితిని గదా. తక్కిన ప్రతులలో "జినపాద" యను పాఠ మున్నదనియే కదా దీని కర్థము. ఆ ప్రతులు నారాయణరావుగారు చూచినారా? వానిలో నీపాఠ మున్నదా లేదా? లేనిచో "సందేహ" మేల స్పష్టముగానే చెప్పవచ్చునే. ఉన్నచో నాపాఠము నేను కల్పించినా నన్నమాట యసత్యమే కదా! అను మానము కలిగినప్పుడు తన్నివృత్తిచేసికొనుట కుపాయము లుండఁగా వాని నిరాకరించి "ఇది కల్పితము, అది యబద్ధము" అను మాటల నేమిగా భావింప వలయునో వివేకులు నిర్ణయింతురుగాక.

8. ఆక్షేపము:—

"పుట. 21 లో ప్లుతయతి కుదాహరణముగా భాస్కరరామాయణము లోని "ఏజనకాత్మజన్" అనుపద్యమును కవి లక్ష్యముగా నిచ్చినట్లొక ప్రతిలో నుండగా పంతులవారు దానిని తొలఁగించినారు. పుట. 26 లోని వచనమును పద్యములును "కావ్యాలంకారచూడామణియందుఁ గూడ గన్పట్టుచున్నవి, కావున నిందుఁ బ్రక్షిప్తములైనవేమో యని సంశయింపఁ దగియున్నది." అని వ్రాసియు గ్రంథమునుండి తొలఁగించక విడిచినారు. వీరిట్లు చేయుటకు కవి

జనాశ్రయకర్త భాస్కరునకిని, విన్నకోట పెద్దన్నకును తరువాతివాఁడై పోవునేమో అనుభయముతప్ప మఱియొక కారణము కానరాదు." అని

ఖండనము:—

ఆపద్యములు ప్రక్షిప్తములనుటకు ముఖ్యకారణము పీఠిక 17 పొరటలో నిట్లు చెప్పియున్నాను. "కవి లక్ష్య లక్షణములు రెంటిని తానే చెప్పెనుగాని యితరులు రచించిన పద్యములు లక్ష్యములుగాఁ దెచ్చికొనియుండలేదు. వికటకవులు కొన్నివింతలు కల్పించి కవిజనాశ్రయమునఁ గలిపినారని యప్పకవి వ్రాసినది యథార్థము" అని కవిజనాశ్రయమందు, ప్రక్షిప్తము లున్నవన్నవాఁ డప్పకవి యొక్కఁడేకాదు. అతనికిఁ బూర్వుఁడయిన వెల్లంకితాతంభట్టు కవిచింతామణిలో నిట్లు చెప్పెను.

"భీమన యఖండంబు మొదలైన కొన్నివళులకు లక్షణలక్ష్యంబులు చెప్పఁడు. వానికిఁ గొందఱు ప్రజ్ఞాలవదుర్విదగ్ధు లసంగతంబుగాఁ బెనిచి తగిలించినా రందున నతని యంకితంబులులేవు గావున వానిని బ్రమాణీకరింపవలవదు."

మూలము:—

54-వ పొరటలో కాకుదోషమున కుదాహరణమగు

వెలయఁగఁ* జెఱకువిలుగొని, యలరమ్ములుచేతఁబట్టి యంగజుఁడు విరాహులనేయు నేర్పుకడిమిన్, దొలమెలయఁగ ననినఁగాకు దోషంబయ్యెన్.

అనుపద్యమునిచ్చి పొరటయడుగున 7-వ టిప్పణమున "మూలములో జిగురాకనియున్నదిగాని యది పొరపాటు" అని వ్రాసినాను.

ఆక్షేపము:—

దీనిపై యాక్షేప మిట్లున్నది.

"పుట. 84 లో 'వెలయఁగఁ (జెఱకు) విలుగొని' అను కందపద్యపాదమును జూడుఁడు. మూలములో 'చిగురాకు' విలు అని ఉన్నదట. అది పొరపాటట. ఎందుచేతనో? తెనుగు కవులు మన్మథుని 'చిగురాకువిలుకాఁడు చిగురువిలుకాఁడు, చిగురు విలుతుఁడు,' అని వర్ణించియే ఉన్నారే! 'చిగురాకు విలుకానిచేతి చక్రమురీతి' అని శశాంకవిజయము 3-వ ఆశ్వాసము. ఇట్లే ఎన్నైన ఉదాహరణము లీయవచ్చును. పోనీ, వీరుచేసిన సవరణ అయినా బాగున్నదా?

*చెఱకు అనుపాఠము నేను కల్పించినదిగాదు ఇతర పాఠాంతరములతోఁ గలిసి కొన్ని ప్రతులయందున్నది. (చూ. 6-వ టిప్పణము.)

'చెఱకు' అని వ్యవహారము, ప్రయోగములు. 'వెలయుంగఁ జెఱకువిలుగొని' అని సవరణచేసిన ఒకరీతిగా ఉండియుండును." అని

ఖండనము:—

చిగురాకుశబ్ద మపశబ్దమనియు, చెఱాకుశబ్దము సుశబ్దమనియుఁ బొరఁబడి నేను పాఠము దిద్దినానని నారాయణరావుగారి నిశ్చయము. నారాయణరావు గారికి ఈ పద్యము దోషమున కుదాహరణ మని తెలియలేదో, దోషస్వరూప మే తెలియలేదో తెలియదు. దోషమున కుదాహరణముగా దుష్టరూపమేకదా యియ్యవలసినది. అసందర్భమున తప్పే యొప్పు. ఈదోషమునకే యనంతుఁడు చెప్పినపద్యము చూడుఁడు.

క. పొలుపుగఁ బోగాడదండలు, లలన ముడిచినన్ మకారలాంఛనుఁ డొందెన్
జలమునఁ జెఱాకువిల్లన, వలనిడుదలఁ గాకువోషమం ద్రమసందా.

9. ఆక్షేపము:—

ఆ భీమకవి గోదావరీమండలమువాఁడా, లేక నైజాముదేశమువాఁడా యనువిషయము నెత్తుకొని "భీమన నైజామురాష్ట్రమువాఁడనుప్రతీతి శ్రీరామయ్య పంతులు గారా ప్రాంతములవారియొద్దనుండి ఉత్తరములను బయలుదేరతీసినతరు వాత వచ్చినదిగాని అంతకుపూర్వము లేదు. ఇట్టి 'ఉత్తరములను' పుట్టించి యే పంతులుగారు ఓరుగల్లువాదములో కొంతవరకును గృతకృత్యులైరి. వారి ఓరు గల్లువాదము సరియైనదని కాని, కాదని కాని, యిచ్చట చెప్పుట మా ఉద్దేశము కాదు. ఆవిషయమై మఱియొకసారి ముచ్చటింతుము. పూర్వకాలపు నిదర్శన ములను చూపక వాదములో కక్షవహింపగలవారి 'ఉత్తరములను' పుట్టించుట మాత్రము సరికాదని మనవిచేయుచున్నాము." అని నారాయణరావుగారు వ్రాసిరి.

ఖండనము:—

ఈ యాక్షేపములో రెండపవాదములు గర్భితము లయియున్నవి. ఈ యుత్తరములలోని విషయము లసత్యములనియు, వేములవాడవారలు కల్పించి రనియు నొకటి, ఆ కల్పనకు నేను కారకుఁడనని యొకటి. ఈ యుత్తరముల యుత్పత్తినిగూర్చి పీఠిక 10.వ పొరటయందుగున నేనిట్లు వ్రాసినాను. "భీమకవి వెలిగందలప్రాంతమువాఁడై నట్లుగ నచ్చటఁ బ్రమాణము లేమైన నున్న వేమో తెలిసికొనిరావలయునని పరిషత్పక్షమున 1915-వ సం॥ జూలైనెలలో దూపాటి తిరుమల వేంకటరమణాచార్యులుగారిని బంపఁగా నాయన వేములవాడ గ్రామ

నివాసములోఁ గొంతవఱకే నొకపత్త్రము వ్రాయించి తెచ్చెను. ఆపత్త్రములోని భాగములే పైనుదహరింపఁబడినవి." అని

వెలిగందల వేములవాడ ప్రాంతమందు భీమకవి యాదేశమువాఁడని ప్రతీతియున్నప్పుడు దాని కక్కడివారు వ్రాసినయుత్తరములే ప్రమాణము కాక పోయినచో నట్టిప్రతీతి యున్నదని నేను చెప్పినమాట ప్రమాణముగునా, నారాయణ రావుగారికి? ఈయుత్తరముల నెందుకుఁ బ్రమాణములుగా గ్రహించి నాఁడనో చూడుఁడు—"మీరు వ్రాసినదంతయు విశ్వాసపాత్రమని చెప్పుట కవకాశములేదు గాని, భీమకవి యాప్రాంతము వాఁడను ప్రతీతి యచట నిప్పటికి నున్నదనుట కిది ప్రబల ప్రమాణము కాకపోదు' అని వ్రాసినాను—దీనికిఁ బండితులేమందురో యందఱకును విదితమే.

10. ఆక్షేపము:—

భీమకవి గోదావరి మండలమువాఁడా, కరీం నగరము మండలమువాఁడా యనువిషయమును గొంతచర్చించి నారాయణరావుగారు చివరకిట్లు తేల్చినారు:

"ఇప్పటికి తేలిన అంశములివి: గోదావరిజిల్లాలో వేములవాడ ఉన్నది. కరీం నగరము జిల్లాలో వేములవాడ ఉన్నది. ఇచ్చట ద్రాక్షారామమున్నది; అచ్చటను దాక్షారామమును వాడుక పురాణములో నున్నది. ఇక్కడ భోగస్త్రీలున్నారు; అచ్చటను ఉన్నారు. ఇచ్చట జైనులుండేవారు; అచ్చటను ఉండేవారేమో? ఇక్కడ అప్పలవారున్నారు. అక్కడ అప్పలవారున్నారు. ఇక్కడ భీమేశ్వరాలయమున్నది. అక్కడను భీమేశ్వరాలయమున్నది. భీమకవి యిక్కడివాఁడని యిక్కడి ప్రతీతి అనాది. అక్కడివాఁడని ప్రతీతి యిప్పుడైనా బయలుదేరినది. రాజరాజనే వాఁ డక్కడనుండే వాఁడని చరిత్రాధారములేని యొక కథ అక్కడనున్నది. సారంగధరకథ అక్కడిదే అని అక్కడి ప్రతీతి అట-ఇచ్చటిదే అను ప్రతీతి ఎప్పటినుండి వచ్చుచున్నదో తెలియదు. ఈసారంగధరకథ ఏప్రాంతమున కాప్రాంతములోనే తయారగుచున్నది. ఇక నేమిగతి? భీమకవి యెక్కడివాఁడు?" అని

దీనిలో నపసిద్ధాంతములు నప్రమాణవాక్యములు నెన్ని యున్నవో చూడుఁడు: "ఇచ్చట జైనులుండేవారు; వారు అచ్చటను ఉండేవారేమో?" అఁట, ఈ వాక్యమందు ఇచ్చటకు 'అచ్చట' యనియు, 'అచ్చట' కు 'ఇచ్చట' యనియు మార్చినచోఁ గొంతవఱకు సత్యమునకు సరిపోవును. గోదావరీ మండలమందు జైనులుండెడి వారనుట కనుమానప్రమాణమే ప్రమాణము, కరీం

నగరము మండలమం దిప్పటికిని జైనకోమట్లు గలరు. ఈవిషయమును నారాయణరావుగారు తాఱుమాఱు చేసినారు.

ఆక్షేపము:—

భీమకవి యిక్కడివాఁడని యిక్కడి ప్రతీతి; అక్కడివాఁడని ప్రతీతి యిప్పుడైనా బయలుదేరినది.

ఖండనము;—

అక్కడవాఁడను ప్రతీతి యిప్పుడు బయలుదేరిన దెచ్చట? ఇక్కడ అనఁగా గోదావరీ మండలమందు. కరింనగరము ప్రాంతమం దది యనాదియే, ఏ దేశమం దా దేశమువాఁడను ప్రతీతి యనాదిగానే యున్నది.

ఆక్షేపము:—

"రాజరాజనే వాఁ డక్కడనుండే వాఁడని చరిత్రాధారములేని యొకకథ అక్కడనున్నది.

ఖండనము:—

చరిత్రాధారము నారాయణరావుగారికిఁ దెలియదుగాని లేకపోలేదు. రాజరాజునాఁడు పుట్టిన శాసనముల ప్రతిబింబములు నాయొద్దనున్నవి. కావలసినచో నారాయణరావుగారికిఁ జూపెదను. ఆరాజరాజుచేఁ బ్రతిష్ఠింపఁబడినది యాగ్రామమందలి రాజరాజేశ్వర లింగము.

ఆక్షేపము:—

"సారంగధరకథ ఇచ్చటిదే అను ప్రతీతి ఎప్పటినుండి వచ్చుచున్నదో తెలియదు."

ఖండనము:—

దానికిఁ జరిత్రాధారములు నారాయణరావుగారికిఁ గనుపడినవా? వేఁగీ దేశపు రాజగు రాజరాజునకు సారంగధరుఁడను కొడుకుగాని చిత్రాంగియను భార్యగాని యున్నట్లు శాసనములం దెచ్చటను లేదు. ఈకథ చరిత్రమునకు విరుద్ధమే.

11. ఆక్షేపము;—

"భీమకవి ప్రతాపరుద్రునికాలములో నున్నవాఁడనిచెప్పుటకుఁగల కారణములు కొన్ని మంచివి లేక పో లేదనివ్రాసి నారాయణరావుగారు దానినిట్లు వివరించినారు. "చక్కదనంబు దీవియగు సాహిణిమారుఁడు" అను పద్యమును

రామయ్యపంతులుగారు తగిన కారణము చూపక, అప్పకవిని ధిక్కరించి విడిచి పెట్టినారు. ఇది మాకు సమంజసముగా కాన్పించ లేదు.

అప్పకవి యొకసందర్భమున ప్రామాణికుఁడును మఱియొక సందర్భమున అప్రామాణికుఁడును నగుచుండవలయునా? అదియు మనసిద్ధాంతమును బాధించుపట్లనేనా?,

ఖండనము:—

"చక్కదనంబుదీవి" యను పద్యమును నేను తగినకారణముచూపకయే అప్పకవిని ధిక్కరించి విడిచి పెట్టినానఁట. నేనాపద్యమును విడిచి పెట్టలేదు. అది భీమకవి చెప్పియుండఁడని సిద్ధాంతము చేసినాను. దీనికి నేను జూపిన హేతువులు చూడుఁడు.

ఉ. చక్కఁదనంబుదీవియగు సాహిణిమారుఁడు మారుకైవడిం
బొక్కిపడంగలండు చలమున్ బలమున్ గలయాచళుక్యపుం
జొక్కనృపాలుఁ డుగ్రుఁడయి చూడ్కులమంటలురాలఁజూచినన్
మిక్కిలిరాజశేఖరుని మీఁదికివచ్చిన రిత్తవోవునే.

అనిచాటువు భీమకవిచెప్పినట్లూహించి సాహిణిమారుఁడు ప్రతాపరుద్రుని కాలములోనుండినట్లు సోమదేవరాజీయమునఁ జెప్పఁబడియున్నదనియు నందువలననాతఁడును భీమకవియుఁ గూడఁ బదునాల్గవ శతాబ్దాదియందుండిన వారని నిశ్చయింప వలసియున్నదనియు (వీరేశలింగముగారు) వ్రాసినారు. ఈ పద్యము భీమకవిచెప్పినదనుట కప్పకవి సాక్ష్యముతప్ప వేఱొకసాక్ష్యము లేదు. అప్పకవి భీమనకాలమువాఁడు గాఁడు. సాహిణిమారుని కాలమువాఁడును గాఁడు. వారిరువురకు నెంతో తరువాతివాఁడు. నన్నయభట్టాంధ్రశబ్దచింతామణి కలియుగమున కాదిని రచియించె ననివ్రాసిన యాతఁ డితఁడే. ఈతఁ డన్నమాత్రాన నాపద్యము భీమన రచియించినదే యని యెట్లువిశ్వసింపవలెనో తెలియదు. ఈయప్పకవియేకదా భీమకవియు నన్నయభట్టును సమకాలికులని వ్రాసెను. దానికిని దీనికిని నెట్లు సమన్వయము చేయవచ్చును. ఇట్టి సాక్ష్యమును బట్టి తీర్మానములు చేసినయెడల సత్యము తేలదు. ఈ కారణములు నారాయణరావుగారి దృష్టిచేత "తగిన" కారణములు కావఁట. దానికి నేనేమిచేయఁగలను.

12. ఆక్షేపము:—

"ఇక ఘనుఁడన్ వేములవాడ వంశజుఁడ....వెలుంగాధీశ (తెలుంగాధీశ, కళింగాధీశ) యను పద్యముపై రామయ్య పంతులుగారు చేసిన చర్చను

కొంత విచారింతము" అను వాక్యముతో నారాయణరావుగారింకొక యాక్షేప మారంభించినారు. ఈ విషయమై నేను వ్రాసినదానిని నిందు సమగ్రముగా నెత్తి వ్రాయుచున్నాను.

"ఇంక భీమకవికాలమును నిర్ణయింప వలయును. పూర్వోదాహృతమగు—

మ. ఘనుఁడన్ వేములవాడ వంశజుఁడ దాక్షారామ భీమేశ నం
దనుఁడన్ దివ్యవిషామృతప్రకట నానా కావ్య ధుర్యుండ భీ
మన నాపేరు వినంగఁ జెప్పితిఁ గళింగాధీశ కస్తూరికా
ఘనసారాది సుగంధ వస్తువులు వేగందెచ్చి లాలింపురా.

అను పద్యము మూఁడవ పాదములోఁ గొంచెము పాఠభేదముఁ గల్పించి యదియే ముఖ్యాధారముగా భీమకవి నన్నయభట్టుకంటెఁ బూర్వుఁడని గురుజాడ శ్రీరామమూర్తిగారును, ఈపద్యమును మఱికొన్ని పద్యములను నాధారముచేసికొని భీమన పదునాల్గవ శతాబ్దమువాఁడని కందుకూరి వీరేశలింగము పంతులుగారును వ్రాసినారు. ఈ రెండు మతములు గూడ నసమ్మతములే. శ్రీరామమూర్తిగారి పాఠము ప్రకారము పైపద్యములో "భీమన నాపేరు వినంగఁ జెప్పితి వెలుంగాధీశ" యని యుండవలయును. "వెలుంగాధీశ" యనఁగా "విమలాధీశ" యని యర్థమఁట. విమలాధీశుఁ డనఁగా రాజనరేంద్రుని తండ్రియఁట. ఈహేతువుచే భీమన నన్నయభట్టుకంటెఁ బ్రాచీనుఁడఁట. ఈవాదమం దెన్నిదోషము లున్నవో చూడుఁడు. రాజనరేంద్రుని తండ్రి విమలాదిత్యుఁడుగాని విమలాధీశుఁడు గాఁడు. విమలాధీశుఁడన విమలాదిత్యుఁ డెట్లగునో తెలియకున్నది. విమలాధీశుఁడన నర్థమేమి? ఇదియొకదోషము. విమలాధీశునకు వెలుంగాధీశుఁడను పేరెట్లు కలిగినదో తెలియదు. తెలుంగు రాయఁడనినట్లు వెలుంగు రాయఁడని కాని వెలుంగు రాజనికాని రూఢనామ మున్నదా? లేదు. విమలశబ్దము విశేషణము. వెలుఁగు శబ్దము విశేష్యము. ఈ రెంటికి నర్థములో భేదమున్నది. భీమనవంటి మహాకవి విమలాదిత్యుని సంబోధించు నవసరమున నతనికి సరియైన పేరు పెట్టియే పిలుచును గాని యిట్లవకతవకగా నేల మార్చును. ఇది రెండవదోషము—

వెలుంగాధీశ యనునప్పుడు సంధి యెట్లు కుదిరినది? వెలుంగు + అధీశ, యనిగదా పదచ్ఛేదము. సంస్కృతసమాసముచేసినచో "వెలుంగ్వధీశ" యని కావలయును. తెలుఁగు సమాసముచేసినయెడల "వెలుంగధీశ" యగును. వెలుంగ + అధీశ" యని రెండుపదములు సంబోధనాంతములే యన్నపక్షమున వెలుంగయధీశ" యని యుండవలెను. "వెలుంగాయధీశ" యని యుండిన నుండ

పఠించుట. పరిభ్రమముగాఁ జూచినను "వెలుంగాధీశ" యని కానేరదు. ఇది ముద్రణదోషము. శ్రీ కోపనహితమైన ఈ వాదము శ్రీరామమూర్తిగారి మనస్సున కెట్లు వచ్చెనో తెలియకున్నది.

ఈ పద్యములో "వెలుంగాధీశ" యనుటకు బదులుగా "వెలంగాధీశ" యను పాఠమును జెప్పి, తెలుంగురాయఁడు 14-వ శతాబ్దమునాఁడు గావున ఛందస్సు నయు నా కాలమునాఁటిదే యని వీరేశలింగముగారు నిర్ణయించిరి. ఈ పాఠమునకు శ్రీరామమూర్తిగారిపాఠమునకుఁ బట్టిన మొదటి రెండుదోషములును బట్టవు. కాని ముద్రణ దోషము తప్పక పట్టును. మరియి యట్టిప్రయోగము చేయుదురు. చేయునని యూహించుట యసంగతము"— అని.

12. ఆక్షేపము:—

దీనిపై నారాయణరావుగారి యాక్షేప మిదిగో—"వారు వెలుంగాధీశ తెలుంగాధీశ" అనునవి వ్యాకరణ దుష్టములని త్రోసివేసిరి. వెలుంగు+అధీశ, తెలుంగు+అధీశ - అనివారిపదచ్ఛేదము—వెలుంగ+అధీశ, తెలుంగ+అధీశ" అని మా పదచ్ఛేదము. ఇచట వెలుంగ, తెలుంగ అనునవి సంబోధనాంతములు కావు. అవి దేశనామ స్వరూపములే అని మా మతము. త్రిలింగశబ్దభవము 'తెలంగ' తెలుంగ అని యగును. బర్మాదేశములో తెలంగ, తెలైంగ అని తెలుఁగువారికి పేరు. గౌడభాషలలో తెలుఁగువారికి 'తెలంగ' అనియే నామము. 'తెలగా'లను వర్ణమువారు ఆంధ్రదేశీయులే. వారు తెలుఁగువారే. 'తెలుంగ' అనునది దేశనామమైనప్పుడు 'తెలుంగాధీశ' అను సమాసమువిద్దుష్టమగును. అట్లే 'వెలుంగ' కూడను. దానికి 'వెలంగ' అను రూపాంతరము. వెలంగవాడ, వెలుంగవాడ అనుపదములే వెలుఁగోడ, వెలంగోడ అని యగును. ఆవాడ వారే వెలుగోటివారు. ఇచట 'వెలంగ' అనఁగా వెలగచెట్టు అని యర్థము కాదని మా అభిప్రాయము. 'వెలంగ' అను జనులుండు "పూడి" యే "వెలంగ పూడి, వెలగలపూడి" అనియైనది."

ఖండనము:—

నేను ఖండించినది శ్రీరామమూర్తిగారి వాదమును వీరేశలింగముగారి వాదమును. వారి వాదముల ప్రకారము "వెలుంగు, తెలుంగు," శబ్దములు ఉకారాంతములే కాని అకారాంతములు గావు. అకారాంతవాద మిప్పుడు భగవత్కృపవలన నారాయణరావుగారికి స్ఫురించినదికాని నేఁటివఱకు మఱి యెవరికిని బొడకట్టలేదు. ఉకారాంతవాదములను ఖండించిన నావాదమును నా

రాయణరావుగారి యకారాంత వాదమెట్లు బాధించునో తెలియదు. దానిని స్పృశింపనే స్పృశింపదు.

అకారాంత వాదమువలన సిద్ధించినదేమిటి? వెలుంగాధీశుఁడనఁగా వెలుంగదేశరాజనియు, తెలుంగాధీశుఁ డనఁగా తెలుంగదేశ రాజనియునుకదా యర్థము. ఆరాజులెవ్వరు? ఏకాలమువారు? అది తేల్చుట కాధారములున్నవా? లేనిచో, గ్రుడ్డెద్దు చేనఁబడిన ట్లీయార్భాటమెందుకు?

14. ఆక్షేపము:—

"తెలుంగాధీశ, అనుపాఠము సరియైనప్పుడు 14-వ శతాబ్దములోని తెలుంగురాయఁడే ఈ తెలుంగాధీశుఁడైనప్పుడు, భీమకవికూడా 14-వ శతాబ్దమువాఁడే అగునుగదా! అట్లే 'వెలుంగాధీశ' అనుపాఠమును సరియైనప్పుడు కాల నిర్ణయముచేయుట కష్టమే యగునుగాని, 14-వ శతాబ్దమునాఁటి ఒక వెలుంగాధీశుని కా పదమేల చెందకూడదో చెప్ప వీలులేదు." అని

ఖండనము:—

ఔను, మేనత్తకు పుంస్త్వము వచ్చినప్పుడు పినతండ్రియగును. అంతవఱకును మేనత్తయేకదా!

15. ఆక్షేపము:—

"ఎలమచ్చి పురాధీశ్వరుఁ డగు చోడగంగనురాజు శాకాబ్దములు 1413 ప్రాంతములో నున్నట్లు శాసనములు తెలుపుచున్నవి. ఇతనికి సర్వలోకాశ్రయ విష్ణువర్ధనమహారాజని బిరుదున్నది. ఎలమచ్చి కళింగములోనిదే భీమకవిచూచిన కళింగములోనిదే. 'భీమకవి చూచిన కళింగగంగ యితఁడేల కాకూడదు'' అని యొక యాక్షేపము.

ఖండనము:—

తా ముదాహరించిన శాసన మెచ్చటనున్నదో చెప్పినప్పుడు దానిజూచి విమర్శించినపిదప నారాయణరావుగారి శంకకు సమాధానము చెప్పఁదగియుండును. కాని, శాసనమెక్కడనున్నదియుఁ జెప్పక, యందులోని విషయమును జెప్పక గేదెను నీళ్లలోనుంచి కొమ్ములుచూపి బేరముచెప్పినట్లు వాదించినఁ బ్రత్యుత్తరమిచ్చుట కష్టము.

16. ఆక్షేపము:—

కళింగరాయఁడు, కాళింగరాయఁడు అను పేళ్లుగలవారు కొంద ఱరవ దేశములో క్రీ. శ. 14-వ శతాబ్దమునందున్నట్లు కొన్ని శాసనములవలనఁ గను

పడుచున్నదని వ్రాసి, చిట్టచివరకు “మన భీమకవి యీ కళింగరాజునిర్దేశకే పోయెనేమో!” యని నారాయణరావుగారు మఱియొక శంకను బుట్టించు కొన్నారు.

ఖండనము —

భీమకవి నాదరించినవాఁడు కళింగగంగుగాని కేవల కళింగరాయఁడు కాఁడు. కళింగగంగనఁగా గంగ వంశజుఁడైన కళింగదేశపురాజు. అరవ దేశమందలి కళింగరాయఁడు గంగవంశజుఁడు కాఁడు. కళింగదేశపు రాజునుగాఁడు, అరవవాఁడు. సామంతరాజో లేక మంత్రియో. అసలు కళింగరాయ నామము నేతిబీరకాయ వంటిదే.

భీమకవిప్రభు కళింగుఁడని నారాయణరావుగారు నిర్దేశించినయెడల నా నిర్దేశమును జర్చింపవచ్చును. అట్లు నిర్దేశింపక కళింగశబ్దముతో సంబంధమే మాత్ర మున్నను సరే వాఁడు కాఁగూడదా! వీఁడు కాఁగూడదా! యని సంశయించి పరిభ్రమించు వారికి సమాధానముచెప్పు టెట్లు?

17. ఆక్షేపము:—

“కవిజనాశ్రయములో పది యతులును, కావ్యాలంకారచూడామణి యందు పంధ్రెండువళ్లును, అనంతుఁ డిరువదినాలుగు విశ్రమములును, ఆమీఁద కొందఱు కవిగ్రామణు లిరువదియేడును విశ్రమములు చెప్పినట్లు అప్పకవిచెప్పి తాను నలభైయొక్క యతులను వివరించినాఁడు. కవిజనాశ్రయములోని యతుల సంఖ్య అన్నిటిలోను తక్కువది కాబట్టి భీమకవి అందరికంటె ప్రాచీనుఁడు— అని రామయ్యపంతులుగారి వాదము. ఈ వాదమును చాలమంది అంగీకరించి నారు” అని వ్రాసి, “కాని చిన్నమనవి – సులక్షణసారకర్త-

“కృతుల ముప్పదియొక్కటి యతులు దనరు సత్కవుల సమ్మతంబున (జలధిశయన)” అని చెప్పినాఁడు. అందుచేత నాతఁడు అప్పకవికి పూర్వుఁడని చెప్పనగునా?” యని నారాయణరావుగా రొక చిన్నిశంక నంటించినారు.

ఖండనము:—

పాపము! ఈవ్రాఁత వ్రాసినప్పు డీయన అప్పకవీయము తిన్నఁగాఁ జూడలేదు. అప్పకవీయములో సులక్షణసారము పేర్కొనఁబడినది, కాఁబట్టి అప్పకవీయముకంటె సులక్షణసారము ముందు దయినట్లా వెనుకదయినట్లా! ఎవరి నడిగినను సమాధానమువచ్చును.

18. ఆక్షేపము:—

దానికి సంబంధించినదే యింకొక శంక.

"రంగరాట్ఛందస్సులో ఇరువైయెనిమిది యతులు చెప్పఁబడినవి. అందు చేత కస్తూరిరంగకవికూడ అప్పకవికి బూర్వుఁడగునా?"

ఖండనము:—

ఈశంకగూడ దోషగర్భితమే?

రంగరాట్ఛందస్సులో 28 యతులు చెప్పఁబడినవఁట! ఇది నారాయణ రావుగారు పుస్తకము చూచి వ్రాసినట్లు తోఁచదు. అచ్చుపడిన పుస్తకములో 35 యతు లున్నవి. ఆంధ్రసాహిత్య పరిషత్పుస్తకభాండాగారమందలి యొక వ్రాఁత ప్రతిలో 36 యతులున్నవి. కస్తూరి రంగకవి 28 యతులు చెప్పలేదు. కాని, నారాయణరావుగా రట్లు వ్రాయుటకుఁ గారణము లేకపోలేదు. కస్తూరి రంగకవి పూర్వకవులుచెప్పిన యతుల వివరించుచు "నన్నయభట్టు "లక్షణ సారంబు"నుండి యొకపద్య ముదాహరించి" అని "27 విధములుగా చెప్పి వున్నవి." అని వ్రాసి, యా పూర్వమతము లన్నింటిని బూర్వపక్షముచేసి తన మతమును ప్రతిపాదించెను. నారాయణరావుగారు ఆ పూర్వపక్షము, సిద్ధాంత మని భ్రమపడి దానికొకటిచేర్చి 28 యతులుచేసినారు. ఇది యెట్లున్నను, రంగకవి చెప్పినయతులు అప్పకవి యతులకంటెఁ గొంచెమే. రంగకవియు అప్ప కవి తరువాతివాఁడే. అయినను అప్పకవిని గూర్చికాని అప్పకవీయమును గూర్చి గాని రంగకవి కేమియుఁ దెలియుదు. తెలిసియున్నచో, అప్పకవిమతము నుదా హరించుటయో ఆమతము నవలంబించుటయో లేక ఖండించుటయో జరిగి యుండును. రంగరాట్ఛందస్సునం దప్పకవిమాటయే లేదు. కాఁబట్టి యప్ప కవిమతము రంగకవికిఁ దెలియదని నిశ్చయింపవలసి యున్నది. అప్పకవిని విడిచి పెట్టినచోఁ బూర్వకవు లందఱికంటె రంగకవియే యెక్కువయతులు చెప్పినాఁడు. కావున, యతుల సంఖ్య కాలక్రమమున హెచ్చినదను నావాదమును రంగరా ట్ఛందస్సు బలపఱుచుచున్నది గాని ఖండించుట లేదు.

19. ఆక్షేపము:—ఇదిగో నారాయణరావుగారి చరమాస్త్రము. ఇది నారా యణాస్త్రమే.

"రామయ్య పంతులుగారి ప్రకారము మధ్యాక్కరలో నాలుగవ గణము మొదట యతి ఉండుట ఆధునిక మతము. నన్నయభట్టులో అయిదవ గణము మొదట నున్నది ఎఱ్ఱాప్రెగడలో నాలుగవ గణము మొదట నున్నది. భీమకవి

గ్రంథములో మధ్యాక్కర నాలుగవగణము మొదట యతి ఉంచుటచేత, భీమకవి, నన్నయ, ఎఱ్ఱాప్రెగడల మధ్య నుండవలయునఁట. ఎఱ్ఱాప్రెగడ తరువాత నేల ఉండకూడదో తెలియరాకున్నది" అని.

ఖండనము:—

కవిజనాశ్రయములో మధ్యాక్కర నాలుగవగణము మొదట యతి విధింపఁబడుటచేత భీమకవి, నన్నయ ఎఱ్ఱాప్రెగడలకు నడుమ నుండవలయునని నేను చెప్పియుండలేదు. కవిజనాశ్రయములోఁ జెప్పఁబడిన యతులసంఖ్యయు, మధ్యాక్కరలోని యతిస్థానమును, తద్గ్రంథకాలము నిర్ణయించుటకుఁ గొంతవఱ కనుకూలపడునని చెప్పి, యావిషయము కొంతచర్చించి చివరకు "ఈ రెండు హేతువులంబట్టి, భీమన నన్నయభట్టు తరువాతివాఁడును విన్నకోట పెద్దనకుఁ బూర్వుఁడును నైనట్లు తేలుచున్నది" అని యుపసంహరించినాను.

కవిజనాశ్రయకర్త మధ్యాక్కరలో నాలుగవ పాదము మొదట యతిచెప్పుటచేత నన్నయభట్టునకుఁ దరువాతివాఁడనియు, పదియతులు మాత్రమే చెప్పుటచేత విన్నకోట పెద్దనకుఁ బూర్వుఁడనియు దీనిభావము. ఇందెఱ్ఱాప్రెగడ ప్రసంగమే లేదే. నారాయణరావుగారి యాక్షేపమునకు మూలమేది?

నారాయణరావుగారి యాక్షేపములన్నియుఁ బ్రక్షిప్తములయినవి.

తాను ఖండింపఁబూనినది చక్కఁగా జదువకయు, చదివినదాని కర్థముచేసికొనకయు, అర్థమయినదానినైన సరిగా ననువదింపకయు, పూర్వాపర సంబంధములు పాటింపకయు, తప్పునదియేదియో, తగునదియేదియో యెఱుంగకయు, నారాయణరావుగా రీవిమర్శనమును రచియించినారు.

---

(పరిషత్పుస్తకభాండాగారము.)

౨. ప్రసంగరత్నావళి:—

ఇందు 316 సంస్కృతశ్లోకము లనేకకవులు రచించినవి వ్రాయఁబడినవి.

కొన్నిశ్లోకములు.

౧. త్రపాశ్యామా జంబూ హృదయవిదురం దాడిమఫలం
సశూలం సంధత్తే హృదయమభిమానేన పనసా
భయాదంతస్తోయం తరుశిఖరిజం లాంగలిఫలం
సముద్భూతే (చూతే) జగతి ఫలరాజే ప్రసరతి.

౨. బాలే తవాధరసుధారసపానకాలే
చేతో మదీయమపి వాంఛతి శేషభావః
ఆలింగనేష్వపి విరోచనపౌత్రభావ
మాఖండలత్వ మఖిలాంగనిరీక్షణేషు.

౭౨. దగ్ధం ఖాండవ మర్జునేనచవృథా దివ్యద్రుమైర్భూషితం
దగ్ధా వాయుసుతేన హేమరచితా లంకావృథాస్వర్గభూః
దగ్ధస్సర్వసుఖాస్పదోపి మదనః కింశంభునా హావృథా
దారిద్ర్యం జనదాహకం ప్రతిదినం కేనాపి నోదహ్యతే.

౮౦. శృణ్వన్ జనార్దనకథాగుణకీర్తనాని
దేహేన యస్యపులకోద్గమరోమరాజి
నోత్పద్యతే నయనయో ర్విమలాంబుమాలా
ధిక్తస్యజీవన మహో పురుషాధమస్య.

౮౪. మేరు ర్దూరగతో హిమాలయగిరి ప్రాలేయరూపో భవ
చ్చంద్రశ్రీసహజాపి యాచకభయాత్ క్షీణత్వమాలంబతే
ఈశానోపి దిగంబరత్వ మగమ ద్విష్ణుర్జలాంతర్గతః
క్షారత్వం ధృతవాన్ తథాపిజలధిః కోనామ దాతుం క్షమః.

౧౭౦. నోఘూర్జరీస్తనఇ వాతితరాం నిగూఢో
నాంధ్రీపయోధరఇ వాతితరాం ప్రకాశః
అర్థోగిరా మపిహితః పిహితః క్వచిద్వా
సౌభాగ్య మేతి మరహట్టవధూస్తనాభః.

౧౭౭. కులానుసారిణీ లజ్జా కీర్తిః త్యాగానుసారిణీ
అభ్యాససారిణీ విద్యాబుద్ధిః కర్మానుసారిణీ.

౨౮౮. ఋతుకాలాభిగామీ యో షట్కర్మనిరతశ్చ యః
ఆహితాగ్నిః గృహస్థశ్చ ద్విజబ్రాహ్మణ ఉచ్యతే
సదాచారం పరిత్యజ్య నిత్య మాయుధజీవితః
హింసాపరోయః క్రూరాత్మా రాజబ్రాహ్మణ ఉచ్యతే
మహార్ఘ్యం ధనమాదాయ సమర్ఘ్యం యః ప్రయచ్ఛతి
రసతామ్రస్యవిక్రేతా వైశ్యబ్రాహ్మణ ఉచ్యతే
నిత్యం కృషిక్రియాసక్తః స్నానానుష్ఠాన వర్జితః
ఆసీయమాశసీచైవ శూద్రబ్రాహ్మణ ఉచ్యతే
యశ్శాంతిపౌష్టికాన్నస్య పాథేయస్య ప్రతిగ్రహః
పరాన్ననిరతః పాపీ బిడాలద్విజ ఉచ్యతే
ధర్మాధర్మ విచారాణి నజానాతి కదాచన
పశువద్వర్తతే నిత్యం పశుబ్రాహ్మణ ఉచ్యతే.

౩౧౬. తాంబూలంచ గురౌదద్యాత్ ద్వాత్రింశత్పర్ణసంఖ్యయా
నృపాణాం వింశతిశ్చైవ, జామాతౄణాం దశాష్టకమ్
స్త్రీణాంచై వాష్టపర్ణాని షట్పర్ణానిచ వైరిణాం
త్రిచతుః పంచపర్ణాని నదేయాని కదాచన.

ఇందు హితోపదేశాదులలోని సాధారణశ్లోకములు సదావాడుకలో నున్నవి చాలఁగలవు.

౬. పద్యావళీగ్రంథము:—

ఇందు ౩౦౦ శ్లోకములు వివిధపండితులు రచించినవి గలవు ఇందా యా శ్లోకములు రచించిన కవులపేరులును దెల్పఁబడియున్నవి. ప్రసంగరత్నావళిలోని శ్లోకములకంటెఁ బ్రౌఢముగా నున్నవి.

ప్రారంభమున:—

౧. పద్యావళీ విరచితా రసికైర్ముకుంద, సంబంధబంధుర పథాప్రమదోర్మిసింధుః
రమ్యాసమస్తతమసాందమునిక్రమేణ, సంగృహ్యతే కృతికదంబకకౌతుకాయ ॥

ప్రారంభేమంగళాచరణమ్.
నమోనలిననేత్రాయ వేణువాద్యవినోదినే
రాధాధరసుధాపాన శాలినే వనమాలినే—కస్యచిత్

సారాగస్య, శుభాంగస్య, దాక్షిణాత్యస్య, విష్ణుపురిశ్రీపాదానాం, (రెండు మూఁడుశ్లోకము లొక్కరివే యున్నపుడు) తేషామేవ, సర్వజ్ఞస్య, శ్రీరామా

నందరాయస్య, శ్రీధరస్వామినోక్తం, శ్రీమద్విశ్వపురీశ్రీపాదానాం, ఆనందాచార్యస్య, శ్రీభగవతః, కేషాంచిత్, శ్రీవేదవ్యాసపాదానాం, లక్ష్మీధరస్య, గోపాలభట్టానాం, కవిరత్నస్య, శ్రీశంకరస్య, పురుషోత్తమదేవ, ఔత్కళ, సర్వానంద, శ్రీమాధవసరస్వతీ, శ్రీపాద, ఈశ్వరపురశ్రీపాద, ధనంజయ, జగన్నాథ, తిరోహిత, యాదవేంద్రపురిశ్రీపాద, రఘూపాధ్యాయ, సురోత్తమాచార్య, శ్రీకవిరాజమిత్ర, గోవింద, భవానంద, సార్వభౌమభట్టాచార్య, హరిదాస, సర్వవిద్యావినోద, జీవహాళి, భువన, దీప, దివాకర, మయూర, ఉమాపతిధర, అభినంద, యోగీశ్వర, కేశవ, గజపతిపురుషోత్తమదేవ, చిరంజీవ, కవిచంద్ర, సంజయకవిశేఖర, పుష్కరాక్ష, వత్స, గోవర్ధనాచార్య, దైత్యారిపండిత, కవిరాజమిశ్ర, రూపదేవ, లక్షణసేననృప, హర, సూరాదిత్య, అమరు, అంగ, శరణ్య, రుద్ర, శ్రీకృష్ణచంద్ర, వాసవ, సుబంధు, మాధవచక్రవర్తుల శ్లోకములు గలవు. కస్యచిత్, తిరోహితస్య, సమాహర్తుః, అని పెక్కుచోటులఁగలవు.

మఱియు నీ శ్లోకములకు: భజనమాహాత్మ్యం, శ్రీకృష్ణనామసంకీర్తనం, శ్రీకృష్ణధ్యానం, భక్తానాం మహత్త్వం, భక్తోత్కంఠ, కృష్ణస్యశైశవం, శయనాదుద్ధాయకృష్ణస్యచేష్టా, మథురామహిమా చతురసీవితర్కాః, ఇట్లు విషయవిభాగము చేయఁబడినది. కొన్ని శ్లోకములు.

దాక్షిణాత్యస్య ద్రౌపదీత్రాణేవాక్యమ్.

తమసి రవిరి వోద్యన్మజ్జతా మప్లవానాం
ప్లవఇవ తృషితానాం స్వాదువర్షీవ మేఘః
నిధిరివ దీనానాం తీవ్రదుఃఖామయానాం
భిషగివ కుశలమ్మే దాతు మాయాతుశౌరీ.

ధీరా ధరిత్రి భవభారను తేహి శాంతం । నన్వేషకంసహతకం వినిపాతయామి
ఇత్యద్భుతస్థిమితగోపవధూశ్రుతాని । స్వప్నాయితాని వసుదేవశిశోర్జయంతి॥

(మయూరస్య.)

చిరంజీవస్య. శ్రీకృష్ణస్య ప్రథమదివసే రాధాప్రశ్నః.

భ్రూవల్లితాం తవకళామధురాననశ్రీ, కంకేళికోరకకరంబితకర్ణపూరః
కోయం నవీననికషోపల తుల్యవేషా, నంశీరవేణసఖి మామవశీకరోతి

సర్వవిద్యావినోదానాం.

ద్రవిణం భవనమపత్యం తావన్మిత్రం తథాభిజాత్యంచ
ఉపయమునం వనమాలీ యావన్నేత్రేన నర్తయతి॥

తేషామేవ:—

దుష్యంతు మే ఛిద్రసువాప్య క్త్రేనః కరోతి మేః శాన్తి భరంగ్ని హేశ్వరః
మణిస్తు వక్షోరుహామధ్యభూషణం మమాస్తు బృందావనకృష్ణచంద్రమాః

౭. తుమ్మురూ నులక్షణము:—బల్లిపతనము ఫలము తంతుకీటకపతనము (సాలెపురుగు) మొదలగు కొన్నికలవు గాని పూర్ణముగాఁ గాని స్పష్టముగాఁ గాని లేవు.

గీ. తొండప్రాఁకె నేని దొరకు లాభంబు, తొండమీఁదఁబడఁ దొలఁగు సిరులు
అయితే నాతొండ నమురంగ తాఁబడ్డ, అగృహానికెల్ల హానివచ్చు.

తంతుకీటపతనము:—

శిరో మూర్ధ్నా ఛత్రలాభం, ఫాలపట్టం శుభంభవేత్
తంతుకీటకమ్మే దక్షిణబాహు మీఁదఁబడిన నారోగ్యము.

రాజయోగపద్యములుగలవు.

సీ. ఈరాజయోగంబు నిరువదినాలుగు సంవత్సరంబులు సలుపనందుఁ
జెప్పినరీతిని దప్పు లేకుండను నభ్యసింపంగను లభ్యమౌను
నిర్విఘ్నమునుగాను నెఱవేఱఁగఠినంబు నెఱవేఱకుండినఁ జెఱుపు లేదు
యోగసిద్ధియునైతె భోగంబులైనట్టి యణిమాదిసిద్ధులు నందఁబడును
సిద్ధిగాక శరీరంబు చెడిననైన, నశ్వమేధాదిక్రతువుల నమరుఫలము
లందిశ్రీమంతుఁడై పుట్టియాత్మవిద్య,యభ్యసించియు మోక్షంబునను భవించు

(౨౯) అంగపాతాళ సంఖ్యపద్యములు గ్రం. సం. ౯౭.

శ్రీరామజ్ఞాన దశాంగములకు పాతాళసంఖ్య.

ఇది యొక్క భరతశాస్త్రవిషయము. పదియంగములకు మొదటియంగము లేదు. పదియంగములకు మొత్తము ౧౭౫ పద్యము లున్నవి. పిమ్మట తాళప్రస్తారపద్యము లున్నవి. పీచుకాగితములమీఁద వ్రాయఁబడినవి.

౧. పాతాళసంఖ్యలోని కొన్నిపద్యము.

సీ. కోవిదులందఱుఁ గొనియాడఁగాను ద్వియంగపాతాళసంఖ్య యుఁ దెలుపుదు
లఘువున కొక్కటి లలిగురువున కిరు లఘుగురువుకు మూఁడు లలితముగను
ఎనయ గురుద్వయంబున నైదు శరగురుద్వయమున కెనిమిదిరయము నమరు
పొలుచు గురుత్రయంబునకుఁ బదమూఁడును దనరును లఘుగురుత్రయమున కిరు
వైయ్యొక్కటిగా చెలువారుభరతశాస్త్ర,నిపుణులారసిచూడఁగవిపులలోన
సమరరిపుభీమ దేవతాసార్వభౌమ, జలధరశ్యామ సుగుణ కౌసల్యరామ.

క. అనుగురహిం గంకణచుసు, ద్రుతమునకు ముప్పది కును నాల్గు ధ్రువతాళలోనకా
సునుతులు నాంసినూతంగా, గ్రసుంగ సుగుణాభిరామ రవికులరామా.

క. తనరారు లఘుచతుష్టయ, మున కనిశము నేలకైన సుర్వీస్థలిలో
వినుతామరేంద్ర సురవర, దనుజకులాభీలనామ దశరథరామా - - - -

సీ. భళిభళి యనిమెచ్చు భరతశాస్త్రజ్ఞులు లీలఁ ద్రియంగపాతాళసంఖ్య
విస్తారముగ నేను వివరింతు ద్రుతవిరామంబున కొక్కటి యుహితముగను
లఘుశేఖరమునకు రహి రెండు ద్రుతవిరామలఘుశేఖరమున కలదు మూఁడు
ప్లుతమునకును నాలు పొంకమౌ ద్రుతవిరామప్లుతంబునకు పది మునల కనుదు
పొల్పు లఘుశేఖరప్లుతంబునకుఁ బదియు, వెన్క నెనిమిది పరఁగను వేక్క మీఆ
కరము ద్రుతవిరామలఘుశేఖరప్లుతమున, కొప్పు ముప్పదియొక్కటి యుర్వి రామ

ఈరీతిని బదిపాతాళసంఖ్యలు చెప్పఁబడినవి. కొన్ని తావుల నక్షరములు మాసిపోయినవి.

౨. తాళప్రస్తారములోని పద్యములు ఇందు, చతురశ్రజాతి, త్రిశ్రజాతి, మిశ్రజాతి, ఖండజాతి, సంకీర్ణజాతి ప్రస్తారసంఖ్యలకుఁ బద్యములు చెప్పఁబడినవి.

చతురశ్రజాతిలో నష్టము—

సీ. చతురశ్రజాతినష్టము చెప్పు మనినను కాల్మాత్రయాదిగాఁ గలిగియుండు
నిన్నియక్షరముల కింతసంఖ్య యటంచు నెఱిఁగి యేసంఖ్యలో నెవ్వరైన
నిన్నగు భేదము లెటువలె నుండును జెప్పుమీ నాతోడఁ దప్పకుండ
నని యడిగిన సంఖ్య లన్నియు వ్రాసుక యష్టయును ద్రుతములయుండ ద్రుతము
చతుర్థమున లఘువు చెలఁగ నష్టమగు గురువు ద్వాదశప్లుతము తోడ రాయుఁగూడ
తను నడిగిన సంఖ్య గొనియు నాయింటను - - - - - - - - - - -

క. ధరఁ ద్రిశ్రజాతి యరచందురు నిసిరొక్కటియు మఱియు ద్రుతమున రెండుఁ గా
శిరమునను బుట్టునాలుగు, స్థిరముగ మముఁ బ్రోవవే సీతారామా.

క. ఒకటిం గాలుకు నాలు, న్నొకటియు ద్రుతలఘున నీను నొకపదుమూఁడుఁ గా
ఇఁక రెంట నిరుపదైదగు, శుకసన్నుత దివ్యనామ సుమిత్రాప్రమూ.

ఈపుస్తకముకడపట నిట్లున్నది.

«శుభమస్తు»

శ్రీరంగరతిజయ శ్రీరంగమకరంద కందర్పదర్పణకంతుకాది
రతిలీల వనమాలి రాజచూడామణి ప్రత్యంగరూపకపంచఘాత
రాజమార్తాండైకరాజనందన కోకిలప్రియోద్వీక్షణ లలితబసవ

# ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక




సంపుటము ౧౮. | క్రోధననామసంవత్సరము. జ్యేష్ఠాషాఢమాసములు. | సంచిక ౨.

## పెదచెఱుకూరిశాసనము—నన్నిచోడకవికాలము.

ఉపక్రమణిక.

"ఆంధ్రకుమారసంభవమహాకావ్యకర్త యగునన్నిచోడమహారాజు నన్నియభట్టునకుఁ బూర్వుఁడా? తరువాతివాఁడా?" అనువిషయము మొన్న మొన్నటి వఱకు వివాదమునఁ బడి యుండినది. మొన్నటియాంధ్రసాహిత్యపరిషత్పత్రిక (౧౩ సంపు. ౩, ౪ సంఖ్యలుగలసంచిక) యందు ప్రకటింపఁబడిన పెదచెఱుకూరిశాసనమువలన నది చల్లఁగాఁ దేలిపోయినది.

ఏతద్విషయమునుగూర్చినవివాద మావిర్భవించుటకు మొట్టమొదట బీజమును నాటినవారు బ్ర॥ శ్రీ॥ మానవల్లి రామకృష్ణకవి (ఎం. ఏ.,) గారు. అది తుట్టతుదకుఁ బరిష్కారమును జెందుసాధనమును జూపినవారు బ్ర॥ శ్రీ॥ జయంతి రామయ్యపంతులు (బి. ఏ, బి. ఎల్.,) గారు.

రామకృష్ణకవిగారు, కుమారసంభవపీఠికయం దెవ్వియో కొన్నికారణములను జెప్పి, "నన్నిచోడకవి నన్నియభట్టునకు నూఱేండ్లు ముందుగ నున్నవాఁ"డని వ్రాసిరి. రామయ్యపంతులుగారు, మొన్నటిపరిషత్పత్రికయందు పెద్దచెఱుకూరిశాసనమును బ్రకటించి, "నన్నిచోడకవి నన్నియభట్టునకు నూఱేండ్లిటీవల నున్నవాఁ డగు"నని సిద్ధాంతీకరించి, కవిగారు నిర్ణయించినకాలమును దలక్రిందు చేసిరి.

పెదచెఱుకూరిశాసనము రామకృష్ణకవిగారు చిరకాలముక్రిందటనే యెఱిఁగి యున్నట్లు కుమారసంభవద్వితీయభాగపీఠిక (2 పుట) వలనఁ దెలియుచున్నది. కాని, యేకారణముచేతనో, వా రాశాసనమునఁ జెప్పఁబడిన (చోడబల్లి

సమానుఁడు) నన్నిచోడరాజును మనకవిచంద్రునిఁగా గ్రహింపకయు, ఆశాసనమును బ్రకటింపకయుఁ, దత్కాలమునుగూర్చి చర్చింపకయు విడిచి పెట్టినారు. బహుశః — అందు చెప్పఁబడిన నన్నిచోడఁడు మనకవినన్నిచోడఁడై యుండఁడనియు, అతఁడే గాంతుఁడై యున్నచో, పరమమాహేశ్వరభక్తిచేతను, పరిశుద్ధచారిత్రముచేతను పితృమాతృ (చోడవైహయ) వంశములను బవిత్రము చేయుటయే కాక, వసుమతీరాజ్యముతోఁ బాటు కవితాసామ్రాజ్యమును సయితము పరిపాలించి, రాజలోకమునందును, కవిరాజలోకమునందును సముచితయశస్సును సంపాదించియున్న మహామహోరాజకవిరాజును, ఆశాసనమునం దొకించుకయైన వర్ణింపక, (నట్టి) నన్నిచోడఁడను సామాన్యనామము నే తద్వంశస్థులే యుపయోగించి యుండరా యనియు, పదాఱుతరములలోనే యీతఁ డంత మఱపునకు వచ్చియుండునా యనియు, రాజరాజనరేంద్రునకుఁ దరువాత రెండువందల యేండ్లకుఁ బుట్టినకర్ణనాథ దేవాలయశాసనమునందు తద్వంశస్థుఁ డగువిజయాదిత్యునిచే రాజరాజును, భాగేరదనయుఁ బ్రశంసింపఁబడియుండఁగా, మనకవిరాజశిఖామణి నన్నిచోడదేవుఁడు మాత్రము చెఱకూరిశాసనమును వ్రాయించినచోడరాజులచే నేమాత్రమైన స్తుతియింపఁబడి యుండఁడా యనియు, మఱియుఁ దాతపేరును, మంత్రిపేరును, కవిపేరును సమానములుగఁగలవారు, ఒక్క వంశమునందే పలువు రుండుట మనదేశమున వింత గాదనియుఁ, గావున నాశాసనమునఁ జెప్పఁబడిననన్నిచోడఁడు వేఱొకఁడై యుండు ననియు వారు భావించి యుండిరేమో యని తోఁచుచున్నది.

రామయ్యపంతులుగారును, ప్రస్తావమున నున్నచెఱకూరిశాసనమును 1910 సంవత్సరమునాఁటికే యెఱిఁగియున్నట్లు పై పరిషత్పత్రికవలనఁ దెలియుచున్నది. కాని, యేహేతువుననో, యీపదునైదేండ్లకాలములోను, ఆశాసనమును గాని, తచ్ఛాసనవిషయములతోఁ గూడిన కవికాలనిర్ణయమును గాని వీరును బ్రకటించినారు గారు! అట్లు ప్రకటించి యుండరయేని, నన్నిచోడకవికాలమునుగూర్చి యిన్నినాళ్లును వాదములు జరిగి యుండుటయు, అందు సుప్రసిద్ధవిమర్శకులు, ఎవ్వరెయో యితరశాసనములను బట్టుకొని తప్పుత్రోవలఁబడి పోవుటయు, వా రాధారపఱుచుకొన్న యాశాసనములు చోడకవిని సంబంధించునవి గా*వని వీ రెఱిఁగియుండియు నేల యూరక చూచుచుండిరని పాఠకులు దలంచుటయు సంభవించి యుండక పోవును. బహుశః—1911-వ

* చూడుఁడు పై పరిషత్పత్రిక ౧౮౫ పుట, ౨౦ పంక్తి.

సంవత్సరము మొదలుకొని యెవరో యొకరు ఏదోవిధముగ నన్నిచోడకవి నన్నియభట్టారకునకుఁ దరువాతివాఁడైనట్లు వ్రాయుచునే యున్నారు గదా యని భావించి, యీశాసనమును బ్రకటింపవలసినంతటియక్కఱ యిపుడు గలిగియుండలేదని తోఁచెడిని.

ఆశాసన మీరీతిఁ బ్రచ్ఛన్నగతి నుండఁగా, కడచినసంవత్సరము నేను నన్నిచోడకవిరాజుకాలమునుగూర్చి యిదివఱకుఁ జర్చించినవిమర్శకులు సూపిన శాసనాద్యాధారములు సరిగాఁ బట్టలేదని నిరూపించుచు, నాతనికవిత్వప్రాచీనత నాధారముగఁ జేసికొని, ఆతఁడు నన్నియభట్టునకంటెఁ బూర్వుఁడై యుండు ననియు, నాతనికిఁ దరువాతివాఁడై యుండఁడనియు నాకుఁ గానవచ్చినహేతువులను గొన్నిటిని జూపుచు నొకవిమర్శమును వ్రాసి, దానిని సప్తమాంధ్రసారస్వతమహాసభయందు చదివితిని. అది శారద (రక్తాక్షిఆషాఢ—1924 జూలై సంచిక) యందు ప్రకటింపఁబడినది.

ఆనావిమర్శమువలన నన్నియభట్టారకునకుఁ బూర్వము తెలుఁగుకవులనేకు లుండినట్లును, చోడకవిరాజు వారిలో నొక్కఁడైనట్లును నేర్పడియెను. మఱియు నింతకుమున్ను నన్నియభట్టారకునకు మనవారు గౌరవపూర్వముగా నొసగియున్న 'ప్రథమాంధ్రగ్రంథనిర్మాతృబిరుదపట్టిక' గలకిరీటరాజ మాతని శీర్షమునుండి తొలఁగి పోయి, (ప్రస్తుతము) నన్నిచోడమహారాజుమూర్ధము నలంకరింపవలసిన దయ్యెను. దానం జేసి శ్రీజయంతి రామయ్యగారు, పైపరిషత్పత్రికయందు, "ఇందును గుఱించి నాయభిప్రాయమును బ్రకటింపవలయు నని కొందఱు భాషాభిమానులు కోరుటచేతను, నే నీవిషయమై కొంతపరిశోధన చేసి యుండుటంబట్టియు, నింతవఱకు జరిగినవాదప్రతివాదములఁ బరిశీలించి నానిశ్చితాభిప్రాయమును దెలుపఁబూనినాఁడను." అని వ్రాయుచు, దానికి సాధనముగా, ప్రస్తావమున నున్నపెదచెఱుకూరిశాసనమును బ్రకటనమునకుఁ దెచ్చి, దానినిబట్టి "నన్నిచోడకవి నన్నియభట్టునకునుమారు నూఱేండ్లిటీవల నున్నవాఁ" డని నిర్ణయించుకొనిరి.

మొట్టమొదట రామకృష్ణకవిగారు నిర్ణయించినకవికాలమునుగూర్చి చర్చించియున్నపూర్వవిమర్శకుల కెవ్వరికిని జెఱుకూరిశాసనము లభించియుండక పోవుటచేతను, నేఁటికిఁ గాని రామయ్యపంతులుగారు దీనిని ప్రకటించి యుండక పోవుటచేతను నావెనుకటివిమర్శమున నీశాసనమును జర్చించి కవికాల

మును సిద్ధాంతీకరించుటకవకాశము నాకు సిద్ధించి యుండలేదు. *ఇప్పు డీశాసనము, పూర్వవిమర్శకులు చూపిన శాసనములకంటె ('ఒరయూరిపురవరాధీశ్వర' అనుటకు 'కందుకూరిపురవరేశ్వర' అని యున్నను †తండ్రిపే రైనను గలియుటచే) నించుకంత మేలైనదిగాఁ గానవచ్చుచున్నది గావున, నింతకంటె మంచియాధారము లభించునఱకు, నిదియే గతిగా నెంచి రామయ్యపంతులుగారు చేసికొన్నసిద్ధాంతమును విమర్శించుచున్నాను. ఈవిమర్శమునకు మున్ను దెలుపవలసినవిషయ మొకటి గలదు:—

రామయ్యపంతులుగారు, 1910-వ సం॥ చెన్నపురియందు జరిగిన యొకానొకసభలో "నన్నియభట్టునకుఁ బూర్వము తెలుఁగుకవు లుండిరా?" అను విషయము చర్చకు రాఁగా, ఆసభ కగ్రాసనాధిపత్యమును వహించినతాము, నన్నిచోడకవి నన్నియభట్టునకుఁ దరువాతివాఁడు గాని పూర్వుఁడుగాఁ డని చెప్పియుంటి మనియు, ఈచెఱకూరిశాసనము నాధారము చేసికొనియే 'నన్నిచోడకవి నన్నియభట్టునకు నుమారు నూఱేండ్లిటీవలివాఁ డైనట్లు స్పష్టపడుచున్నదని (యూనాఁడే) యభిప్రాయపడి యుంటి మనియు, మఱియు నీపత్త్రికావాదములు పుట్టక పూర్వమే తమకీయభిప్రాయము పొడమినది గావున రామకృష్ణకవిగారిమతమును ఖండించినవారిలోఁ బ్రథములము దామే యనియుఁ బైపరిషత్పత్త్రికయందు వ్రాసికొని యున్నారు. (చూ. ౧౪౦, ౧౫౨ పు)

ఈపై సంగతులనుబట్టి, రామయ్యపంతులుగారిమనమునఁ జిరకాలము నుండియు మొన్నటివఱకును నన్నిచోడకవి నన్నియభట్టున కిటీవలివాఁ డను నభిప్రాయము గాఢముగ నాటికొని యున్న దనుట విస్పష్టము. అయిన నేమి? "పట్టుదలను మాని యిటీవల జరిగినవాదప్రతివాదములను సాధ్యమైనంతవఱకు మధ్యస్థభావముతో విమర్శించి సత్యమును నిర్ణయించుటకే యత్నించెదను." అనివ్రాసియే వారు కవికాలనిర్ణయమునకుఁ గడంగినారు. వీరి యీప్రయత్న మెంతవఱకు సఫలమైనదో విచారింతము.

---

* రామయ్యపంతులుగారు చెఱకూరిశాసనమును నేను జూచితి నని వారివ్యాసమున వ్రాసినారు ఆవావిమర్శము ప్రకటింపఁబడిన 7, 8 మాసముల తరువాత నేను దానిని వారియొద్ద నుండఁగాఁ జూచితిని.

† శాసనకాలమునాఁటికి రెండవమల్లిదేవుఁడు కందుకూరు రాజధానిగాఁ బాకనాఁటి రాజ్యము నేలుచుండ నోపు.

